శ్రీరస్తు.

# విశ్వగుణాదర్శము

సటిప్పణాంధ్రపద్య టీకాతాత్పర్యేతిహాససహితము.



సన్నిధి, పంచాంగం - దేవరాజపెరుమాళ్లయ్యావారిచే

విరచితము.



మద్రాస్

ఆర్ - వేంకటేశ్వర్ అన్డ్ కంపెనివారిచే

ప్రకటితము.

ఆనందముద్రణాలయముద్రితము.

1914.

# విషయసూచిక.

---

# ఇతిహాస విషయసూచిక.

---



శ్రీరస్తు.

# విశ్వగుణాదర్శము.

## ఆంధ్రటీకా తాత్పర్యేతిహాససహితము.

—•✧•—

ఇదియ

## సటిప్పణాంధ్ర విశ్వగుణాదర్శ నిదర్శచంపూసమేతము.

### మంగళాచరణము.

(ఇట వేంకటాధ్వరి యనుకవి విశ్వగుణాదర్శ మనుకావ్యమును జేయునతఁడై తాఁ జేయఁగోరినగ్రంథమునకు నిర్విఘ్నపరిసమాప్తినిమిత్తమై మొదటఁ బ్రబంధముఖలక్షణమయిన త్రివిధమంగళములలో నొకటియగు నాశీర్వాదరూప మంగళమును జేయుచున్నవాఁడాయెను.)

స్ర. శ్రీరాజీవాక్ష వక్షఃస్థల నిలయరమాహస్తవాస్తవ్య లోల
లీలాబ్జాన్నిష్పతన్తీ మధురమధుఝరీ నాభిపద్మే మురారేః।
అస్తోకంలోకమాత్రాద్వ్యాయుగముఖశిశోరాననేష్వర్ప్యమాణం
శఙ్ఖప్రాప్తేనదివ్యం పయఇతివిబుధైశ్శ్లాఘ్యమానాపునాతు॥ 1

అర్థము. శ్రీరాజీవ...లీలాబ్జాత్ — శ్రీరాజీవాక్ష = పుండరీకాక్షుఁడయిన శ్రీ మహావిష్ణువుయొక్క, వక్షస్థల = వక్షస్థలమే, నిలయ = స్థానముగాఁగల, రమా = శ్రీమహాలక్ష్మియొక్క, హస్త = హస్తమునందు, వాస్తవ్య = వసించుటవలన, లోలత్ = వేడుకగాచలించుచున్న, లీలా = విలాసార్థమయిన, అబ్జాత్ = తామర

నుండి, మురారేః=ఆమహావిష్ణువుయొక్క, నాభి పద్మే=బొడ్డుఅనెడు తామర యందు, నిష్పతంతీ=జాఱిపడుచున్నదై, లోకమాత్రా=ఆలక్ష్మీదేవిచేత, ద్వియుగముఖశిశోః = చతుర్ముఖుఁడయిన బ్రహ్మయనెడుబిడ్డయొక్క, ఆననేషు=నోరులయందు, అర్ప్యమాణం=పోయఁబడఁదగినదై, అస్తోకం=అధికమై, దివ్యం=అసాధారణమయిన, పయః=పాలు, ఇతి=అని, విబుధైః = దేవతలచేత, శంక్యమానా=ఊహింపఁబడుచున్నదయిన, మధురమధుఝరీ— మధుర=తీయనయిన, మధు=మకరందముయొక్క, ఝరీ=ప్రవహించుధార, పునాతు=పవిత్రపఱచుచునుగాక?.—స్రగ్ధరావృత్తము.

తాత్పర్యము. శ్రీ మహావిష్ణువక్షస్థలవాసిని యయిన యామహాలక్ష్మి తనహస్తమున విలాసార్థముగా, తాల్చియుండు తామరపుష్పములోనుండి జాఱుచుండు తేనెధారను ఆలక్ష్మీదేవి తనపతియయినవిష్ణుదేవునినాభికమలమునఁ దన బిడ్డయైయుండు బ్రహ్మనోట సంకుతోడఁబోయుపాలు అని దేవతలు తలఁచుకొనునట్టి యామకరందధారయే ఈకావ్యమును, దీనిఁజదువు చదువరులనుం బవిత్రపఱచునుగాక.(అని యీగ్రంథకర్త మంగళము నాశీర్వదించుచున్నాఁడు.)

శ్రీరాజీనాథుఁడు=శ్రీమహావిష్ణువు- ఈయన శ్రీమన్నారాయణనామముతో సత్వగుణప్రధానుఁడై స్థితికారణమైన జగద్రక్షణమున దుష్టనిగ్రహ శిష్టపరిపాలనములు చేయుచు, దశావతారములతో అనంతావతారము లెత్తుచు, శ్రీమహాలక్ష్మిపతియై ఆమెను శ్రీవత్సకౌస్తుభవనమాలికలతో తనవక్షస్థలమున నుంచుకొనుచు, పరమకరుణాపరిపూర్ణుఁడై సుదర్శనాది పంచాయుధములతో చతుర్భుజములును సూర్యచంద్రులతో నేత్రములును గరుత్మంతునితో ధ్వజవాహనములును పీతాంబరముతో నితంబతటంబును గలిగి, బ్రహ్మాండభాండంబులు గర్భంబునం దుంచుకొంచు, నాభిపద్మంబున బ్రహ్మను వక్త్రపద్మంబున శంభునిఁ గలిగించి, వారివలన ప్రపంచంబులకు సృష్టిసంహారంబులు చేయించుకొంచు, పరత్వాది వ్యూహపంచకముతో భక్తాగ్రేసరులకు సేవకృప సేయుచు నుండునతండు.

లోకమాత=శ్రీమహాలక్ష్మి—ఈమె క్షీరసాగరపుత్రియై శ్రీదేవియను నామముతో విష్ణుపత్నియై అతని వక్షస్థలముననె వాసము చేయుచు, తాను కల్పాం

(ఇట సన్నిధి, పంచాంగం-దేవరాజ పెరుమాళ వెంకటకవి యై విశ్వగుణాదర్శమను సంస్కృతకావ్యమునె యీ విశ్వగుణాదర్శనిదర్శమను పేరితో నాంధ్రకావ్యముగ రచించునతఁడై యటులనే మొదట నిట నాశీర్వాదరూపమంగళమును జేయుచున్నతఁడాయెను)

ఉ. శ్రీకమలాక్షునక్షమునఁ జెల్వగు చెల్వకరాంబుజంబునన్
జోక మరందపూర మొగిఁ జొబ్బిల నాతని బొడ్డు తమ్మికిన్
సాకత మార నోర నిడు సంకున బిడ్డకు బ్రహ్మ కుగ్గు నా
శ్రీకమలాక్షి నా, నమర చింతతమా; నదె పావనం బగున్.

టిప్పణము. చెల్వగు=సౌందర్యవతియయిన, చెల్వ=ఆలక్ష్మీకాంతయొక్క, జోకన్=నిరాటంకముగ, జొబ్బిలన్=స్రవించుచుండఁగా, సాకతము=ప్రేమ, ఆరన్ = పూర్ణమగునట్లుగ, చింతితము = తలంపఁబడినది, అదె=ఆమకరంద ధారయె.

(ఇట, కమలాక్షబ్రహ్మలకును, వారిబొడ్డునోరులకును, చేదామరసంకువులకును ఉపమానోపమేయభావము నుత్ప్రేక్షించుటచే ఉత్ప్రేక్ష అను నర్థాలంకారమును; వాక్షపక్ష స్థలనిలయా, హ స్తవా స్తవ్య, లోలల్లీలా, మధురమఘ అనియు; చెల్వగు చెల్వ, అంబుజంబు, ఆరనోర అనియు రెండురెండుమార్లు అజ్ఝల్లులకు అవ్యవహితముగ ఆవృత్తిరూపమున అనుప్రాసము చెప్పుటచే ఛేకానుప్రాసము అను శబ్దాలంకారమునుం జెప్పఁబడియె.)

---

తరములం దనంతావతారములతోను మన్మథబ్రహ్మలకు మాతయై భగవత్కరుణా స్వరూపిణియై భక్తులను స్వమాతవలె సంరక్షించుచు నుండునామె.

ద్వియుగముఖుఁడు=చతుర్ముఖుఁడు—ఇతఁడు విష్ణునాభిపద్మమందు పుట్టి సరస్వతీభర్తయై జగత్సృష్టియే ప్రధానకార్యముగా జరుపుచు, తనమానసపుత్రులైన మరీచ్యాది నవబ్రహ్మలచేతను ప్రజాసృష్టి చేయించుచు, పరమజ్ఞానులై ఊర్ధ్వరేతస్కులైన సనకసనందన నారదాదులను తనకు మానసపుత్రులనుగా పుట్టించుకొని, మఱియు తన అంగుష్ఠాద్యవయవములవలన దక్షాదిప్రజాపతులనుఁ పుట్టించుకొని యున్నబ్రహ్మ.

(ఇక్కడ—ఈ సంస్కృతకవి తన అభిజనవిద్యావృత్తములు తెలిపెను.)

శా. కాఞ్చీమణ్డలమణ్డనస్య మఖినః కర్ణాటభూభృద్గురో
స్తాతార్యస్య దిగన్తకాన్తయశసో యం భాగినేయం విదుః।
అస్తోకాధ్వరకర్తురప్పయగురో రస్యైవ విద్వన్మణేః
పుత్ర శ్శ్రీరఘునాథ దీక్షితకవిః పూర్ణో గుణై రేధతే॥ 2

అ. కాంచీమండలమండనస్య=కాంచీదేశమునకు ఆభరణప్రాయమై, మఖినః=యజ్ఞకర్తయై, కర్ణాటభూభృద్గురోః=కర్ణాటరాజయిన కృష్ణదేవరాయనికి పంచసంస్కారగురువై, దిగంతకాంతయశసః=దిశాంతములందు ప్రకాశించుకీర్తి కలయతఁడైన, తాతార్యస్య=తాతాచార్యులకు, యం=ఎతనిని, భాగినేయం=అల్లునిఁగా, విదుః=తెలిసికొందురో, అస్య=అట్టియీ, అస్తోకాధ్వరకర్తుః=విశేషయాగములు చేయునట్టి, విద్వన్మణేః=పండితరత్నమయిన, అప్పయగురోః ఏవ=అప్పయ అను గురువునకె, పుత్రః=కుమారుఁడైన, శ్రీరఘునాథ దీక్షితకవిః=శ్రీరఘునాథయజ్వ అనుకవి, గుణైః=సద్గుణముల చేత, పూర్ణః=నిండినవాఁడై, ఏధతే=వర్ధిల్లుచున్నాఁడు.

తా. కాంచీమండలమున భూషణమువలె ప్రకాశించుచు,కర్ణాటరాజయిన కృష్ణరాయనికి పంచసంస్కారగురువై యాగములుచేయుచు, కీర్తికెక్కిన తాతాచార్యుల కల్లుఁడై తానును అనేకయాగములుచేయుచు, విద్వాంసులలో శ్రేష్ఠుఁడైన అప్పయగురువునకు పుత్రుఁడయిన రఘునాథదీక్షితుఁడనుకవి సకలసద్గుణములు కలవాఁడై, వర్ధిల్లుచుండెను.

శా. కాంచింబుట్టువు కాంచి,కాంచిగురుతంఁగర్ణాటభూభర్తకుఁ
బ్రాంచత్కీర్తియుఁగాంచె,నల్లునిఁగఁ దాఁతాతార్యుండె యెవ్వా
నిఁ జేకొంచుం; దద్విధమొప్ప నప్పయయుఁగైకొంచుఁ సుతుంగాఁగఁబ్రేమించెం; దద్రఘునాథదీక్షితుఁ డొాగిఁగన్నించెం
గుణశ్రీ మన్మహిన్॥

టి. గురుతఁ కాంచి=ఆచార్యత్వమునుపొంది, గుణశ్రీ = సద్గుణసంప

_త్తిచేత, మించెన్ = అతిశయించుచుండెను, తాతార్యుండు = కోటికన్యాదాన తాతాచార్యులు.

శ్లో॥ తత్సుత స్తర్కవేదాన్త తన్త్రవ్యాకృతిచిన్తకః ।
వ్యక్తం విశ్వగుణాదర్శం విధత్తే వేఙ్కటాధ్వరీ॥ 3

అ. తత్సుతః = అతనికొమారుఁడును, తర్క ... చింతకః — తర్క = న్యాయశాస్త్రమును, వేదాంత = వేదాంతమును, తంత్ర = బ్రహ్మమీమాంసను, వ్యాకృతి = వ్యాకరణశాస్త్రమునున్, చింతకః = పఠనమున చింతించువాఁడునయిన, వేంకటాధ్వరీ = వేంకటయజ్వయనుకవి, విశ్వగుణాదర్శం = విశ్వగుణాదర్శమనెడి యీగ్రంథమును, వ్యక్తం = విశదముగా, విధత్తే = చేయుచున్నాఁడు. (అనుష్టుప్ శ్లోకము)

తా. అరఘునాథదీక్షితునికొమారుఁడు వేంకటాధ్వరి తాను తర్కవ్యాకరణమీమాంసాది శాస్త్రిజ్ఞుఁడై కవియగుటచే ఈ విశ్వగుణాదర్శ మనుకావ్యమును జేసెను.

తే. అతనిసుతుఁ డర్థశబ్దవేదాంతతంత్ర
చణుఁడు కవివేంకటాధ్వరి యనెడుసుకృతి
ఘనుఁడు విశ్వగుణాదర్శ మనెడుసుకృతి
నొనరిచెను సంస్కృతం బందు నొనరుపడఁగ.

టి. అర్థ = తర్కశాస్త్రమున, శబ్ద = వ్యాకరణశాస్త్రమున, వేదాంత = వేదాంతమున, తంత్ర = మీమాంసాశాస్త్రమున, చణుఁడు = సమర్థుఁడు, సుకృతిఘనుఁడు = సుకృతాత్ములలో ఘనుఁడు, ఒనరుపడఁగన్ = అందపడునట్లు, విశ్వగుణాదర్శము = ప్రపంచమందలిసకలసద్గుణములకును అద్దమువంటిది.

ఆంధ్రకవి అభిజనవిద్యాదులు.

శ్లో॥ ఆదా విశ్వగుణాదర్శ మకరో ద్వేంకటాధ్వరీ ।
అత్రాంధ్రేచ నిదర్శేన దేవరాట్పండితో౽కరోత్ ॥ 4

తే. ఆదివిశ్వగుణాదర్శ మాదిభాషఁ
దీక్షిచెను వేంకటాధ్వరిసద్ద్విజహితుఁడు

అదె నిదర్శము తుదఁగూర్చి యాంధ్రభాషఁ
దేటిచెను దేవరాజపండితుఁడు హితుఁడు.

సీ. శ్రీతిరుక్కోవలూర్ శ్రీలక్ష్మణాచార్య
యోగిపదాబ్జసంయోగిసన్ని
ధానాన్వయాంబుని ధానశశాంకులు,
పంచాంగసంజ్ఞను దంచితాభి
జనమున మును ప్రశస్తయశస్కులా కుల
శేఖరాళ్వారాదిశిష్టులందు
నెంబెరుమానార్సుధీంద్రావరకుమార
మణవాళమామునిమహితగర్భ

తే. శుక్తిముక్తామణు లనఁగు సుతులుమగురు
నరవిఁ దిరువేంగడత్తాను చక్రపాణి
దేవరాజ పండిత రాజదీప్రశుభ్ర
కీర్తు లందుత్తముఁడై యాకృతికిఁ గర్త.

గ్రంథవిమర్శనము.

శా. పద్యంయద్యపివిద్యతే బహుసతాం హృద్యంవిగద్యంనతత్
గద్యంచప్రతిపద్యతే నవిజహత్పద్యం బుధాస్వాద్యతామ్।
అధత్తేహి తయోః ప్రయోగఉభయోరామోదభూమోదయం
సంగః కస్య హి నస్వదేత మనసో మాధ్వీకమృద్వీకయోః॥ 5

ఆ. పద్యం=పద్యకావ్యము, బహు=విస్తారముగా, విద్యతేయద్యపి=ఉండి నప్పటికిని, విగద్యం=గద్యములేనిది, తత్=ఆపద్యకావ్యము, సతాం=సత్కవులకు, హృద్యం=మనోజ్ఞమయినది, న=కాదు. గద్యంచ=గద్యకావ్యమును, విజహత్పద్యం = విడుచుచున్న పద్యములుకలది, బుధాస్వాద్యతాం = పండితులకు రుచింపఁదగినదియునగు, న ప్రతిపద్యతే=[illegible] ఉభయోః=

రెంటియొక్కయు, ప్రయోగః = ప్రయోగము, ఆమోదభూమ+ఉదయం=సంతోషాతిశయముయొక్క+ఉత్పత్తిని, అధత్తేహి=చేయుచున్నదికదా! మాధ్వీకమృద్వీకయోః=తేనెయొక్కయు ద్రాక్షయొక్కయు, సంగః = కూడిక, కస్య=ఎవనికి, మనసః=మనస్సునకు, నస్వదేత=రుచించదు!

తా. పద్యకావ్యమేయయినను, ఒకానొకచోనయిన, గద్యములేనిది సత్పురుషుల కింపిదముకాదు. అట్లే పద్యములేనిగద్యకావ్యము నింపిదముకాదు. తేనెతోఁగూడిన ద్రాక్షారసమువలె గద్యపద్యాత్మకమయినకావ్యమే అందఱకును ఆమోదకరమగును.

ఉ. పద్యములెన్నియున్న, శ్రుతిపర్వత పర్వదు గద్యహీనముల్;
గద్యము లట్లె పద్యములు గల్గమిఁ, గావున గద్యపద్యముల్
హృద్యము లొండొకండుకల దేనియుఁ దేనియతోడఁగూడనా
స్వాద్యముగాక దాక విరసం బగునే! యెద కేని కేనియున్.

టి. శ్రుతిపర్వత=చెవులపండువగుట, పర్వదు=వ్యాపింపదు, ఆస్వాద్యముకాక=రుచింపఁగూడనదిగాక, దాక=ద్రాక్ష, ఏనికేనియున్=ఎవనికిఁగాని

(ఇట భిన్నభిన్నవాక్యములందు బింబప్రతిబింబభావము చెప్పుటచే దృష్టాంతము అను నర్థాలంకారమును, అక్షరములు జంటజంటగ చెప్పుటచే ఛేకానుప్రాసముఅను శబ్దాలంకారమును చెప్పఁబడియె.)

## గ్రంథకారణము.

ఉ. విశ్వావలోకస్పృహయాకదాచిత్
విమాన మారుహ్య సమానవేషమ్।
కృశాను విశ్వావసు నామధేయం
గన్ధర్వ యుగ్మం గగనే చచార॥ 6

అ. కృశానువిశ్వావసునామధేయం-కృశానువు విశ్వావసువు అను పేరులుగల, గంధర్వయుగ్మం = గంధర్వులజంట—ఇద్దఱుగంధర్వులు, విశ్వ+అవలోక+స్పృహయా=ప్రపంచమును+చూచుటయందలి+కోరికచే, కదాచిత్=ఒ

కానొకప్పుడు, సమానవేషం=సమమయినవేషముకలదైన, విమానం=దేవయానమును, ఆరుహ్య=ఎక్కి, గగనే=ఆకాశమందు, చచార=తిరిగెను. (ఉపజాతివృత్తము)

తా. కృశానువిశ్వావసులు అను నిద్దఱుగంధర్వులు ఈ సకలచరాచరరూపలోకమును జూచెడుతలంపుతో ఒకానొకప్పుడు విమానారూఢులై యాకాశమునఁ దిరుగుచుండిరి.

తే. విశ్వమెల్ల విలోకించు వేడ్క వొదలఁ
జదల గంధర్వు లిర్వురు సంచరించు
చుండి రవిశేషవేషులై యుండి యరద
మునను విశ్వావసు కృశాను లన నొకప్డు.

టి. విశ్వము=ప్రపంచము, పొదలన్=పుట్టుచుండఁగా, చదలన్=ఆకాశమున, అవిశేషవేషులై=భేదములేని వేషముకలవారై, అరదము=రథము.

తత్ర=వారిలో-ఆ ఇద్దఱు గంధర్వులందు.

శ్లో॥ కృశాను రకృశాసూయః పురోభాగిపదం గతః ।
విశ్వావసు రభూ ద్విశ్వగుణగ్రహణకౌతుకీ॥ 7

అ. కృశానుః=కృశాను వను గంధర్వుఁడు, అకృశ+అసూయః = విశేషమయిన అసూయకలవాఁడై, పురోభాగిపదం=ముందటిభాగపుచోటిని—దోషములనె కనిపెట్టువాఁడు అనుపదమును, గతః=పొందినవాఁడు; విశ్వావసుః=విశ్వావసు వను గంధర్వుఁడు, విశ్వ+గుణ+గ్రహణ+కౌతుకీ=సకలమైన+గుణములను+గ్రహించుటయందు+కుతూహలముకలవాఁడు, అభూత్=అయెను.

తా. కృశానువనువాఁడు దోషములనె కనిపెట్టుకొనువాఁడుగాను, విశ్వావసువనువాఁడు సకలసద్గుణములనే గ్రహించువాఁడుగాను నుండెననుట.

క. గుణములయెడ దోషారో
పణముల మున్పడు నసూయపడుచుఁ గృశానుం
డణు వయినన్ విశ్వములో
గుణియె విశ్వావసుండు గుణమె గ్రహించున్.

టి. దోషారోపణములన్ =తప్పులు పెట్టుటలయందే, అణువైనన్ =అణుమాత్రమె యయినను.

# గ్రంథోపక్రమణము.

## సూర్యవర్ణనము.



(ఇది పరంజ్యోతియై పరబ్రహ్మమైన శ్రీమన్నారాయణమూర్తిస్వరూపమునసె సర్వదా జ్యోతిర్మయస్వరూపుఁడును, ధాత్రాదిద్వాదశాత్మ స్వరూపుఁడును, త్రికాలములందును త్రిగుణములతో త్రిమూర్తి స్వరూపుఁడునై తేజరిల్లుచుండెడి శ్రీసూర్యనారాయణునిఁ గవి వర్ణించుచున్నవాఁడు)

౧. అథ పురతస్సమాపతన్త మరవిన్దబాన్ధవ మవలోకయ న్నవన్ద తాగమసాగరపారదృశ్వా విశ్వావసుః॥ 8

అ. అథ=ఆ వెనుక, పురతః=ఎదురుగ, సమాపతంతం=పయికివచ్చుచున్న, అరవిందబాంధవం=సూర్యుని, అవలోకయన్ =చూచుచు, ఆగమ+సాగర+పార+దృశ్వా=వేదములనెడి+సముద్రముయొక్క+గట్టును+కనిపెట్టినవాఁడైన, విశ్వావసుః=విశ్వావసువు అనుగంధర్వుఁడు, అవందత=నమస్కారముచేసెను.

వ. తరువాత నిఖిలనిగమాంతపారావారపారంగతుండగు విశ్వావసుండు (విహాయసంబునందు నట్టు సంచరించుచు) నెట్టయెదురనభ్యుదయంబై పై నరుదెంచు నరవిందబంధువు నవలోకించుచుం దానభివందనంబు కావించె.

టి. ఇట విశ్వావసుండను గంధర్వుఁడు తాను వేదాంతవేత్త యవుటచే వేదాంతవిహితమయిన యరుణోదయ సూర్యనమస్కారము చేయుచున్నవాఁడు.

## సూర్యనమస్కారప్రకారము.

విశ్వావసుః—

శ్లో॥ బ్రహ్మచర్యవ్రతోత్సర్గ గురవే కోకసన్తతేః।
ఛాయాబిబ్బోకలీలాయ ఛాందసజ్యోతిషే నమః॥ 9

అ. కోకసంతతేః=చక్రవాకపక్షిసమూహమునకు, బ్రహ్మచర్య + వ్రత + ఉత్స ర్గ + గురవే = బ్రహ్మచారిధర్మమనెడి + వ్రతమును + విడిపించుటయందు + ఆచార్యుఁడును; ఛాయా + బిబ్బోక + లీలాయ = ఛాయాదేవి యొక్క + విలాసమందు + అపేక్షకలవాఁడును; ఛాందస + జ్యోతిషే = వేదస్వరూపమయిన + తేజస్సుగలవాఁడునైన సూర్యనారాయణునకు; నమః=నమస్కారము.

తా. పగటనే సంచరించు జక్కవపక్షు లొకటితో నొకటి యాడుకొనునట్లు తనతేజస్సులను గనుపఱచుచు, తనభార్య యయిన ఛాయాదేవితో విలాసపడుచు, వేదస్వరూపములయిన తనతేజస్సులతో ప్రకాశించుచుండు శ్రీ సూర్యనారాయణుని నమస్కరించె.

విశ్వావసువు—

ఆ. చక్రచక్రమునకు నసక్రమంబుగ బ్రహ్మ
చర్య మెపుడు నుడుపుచతురగురుఁడు
చాయవిలసనములసఖుఁడు వేదాత్ముఁడు
నైనజ్యోతి! నీకిదే నమస్సు.

టి. చక్రచక్రమునకు=చక్రవాకపక్షిసమూహమునకు, బ్రహ్మచర్యము=వేదోక్తాచారముల నాచరించు బ్రహ్మచారి ధర్మము ఛాయాదేవి=సూర్యుని ప్రథమ భార్యయైన సంజ్ఞాదేవి-ఆపె ఆసూర్యతాపమును తాళఁజాలక. యాతనికి మఱియొకభార్యగా నియమింపఁబడినది. ఈపెకు ప్రభావతి అని మఱియొకపేరు.

కృశానుః—

గ. అరే! సకలభువనసంశోషణకారిణం తపనమపి కిం నమన
స్కరోషి!

అ. అరే=ఒరే! సకల+భువన+సంశోషణకారిణం=సమస్తలోకములను+సమస్తజలములనుర్+శోషింపఁజేయువాఁడైన; తపనమపి=సూర్యునిర్, కిం=ఏల, నమనకర్మీకరోషి = నమస్కారక్రియకు కర్మభూతునిఁగాఁ జేయుచున్నావు?.

కృశానుఁడు:—

వ. ఆహా! సఖా? సకలభువనములనుం దపియింపఁ జేయుకతననే తపననామధేయుండైన యీకర్మసాక్షినిం గూడ నీవు నీనమస్క్రియకు కర్మభూతునిం గావించుకొనుచున్నావేమిరా

టి. భువనములు=లోకములు, నా=జలనులు; తపనుఁడు=తపింపఁజేయువాఁడు, కర్మసాక్షి=లోకములందలి సకలక్రియలకును సాక్షీభూతుఁడుగా నుండువాఁడు, నమనక్రియను కర్మభూతునిగా=నమస్కరించుట అనుక్రియను కర్మకారకముగా—విషయముగా.

పశ్య!—

మం. పాన్థార్ దీనా నహహా! వసుమా నాతపాన్ధా న్విధత్తే,
శుష్కాం పృథ్వీం రచయతితరాం, శోషయత్యోషధీశ్చ।
కాసారాణాం హరతి విభవం క్లాంతిశాంతిప్రదానాం,
క్రూరస్యైవం గుణలవకథా కా!స్వతో భాస్వతోఽస్య॥ 11

అ. వసుమాన్ = సూర్యుఁడు, దీనార్ = దరిద్రులైన, పాన్థార్ = బాటసారులను, ఆతప+అంధార్ = ఎండచేత + కన్నెఱుఁగనివారినిగా, విధత్తే=చేయుచున్నాఁడు. పృథ్వీం=భూమిని, శుష్కాం=ఎండినదానిఁగా, రచయతితరాం=బహుగాచేయుచున్నాఁడు. ఓషధీశ్చ=మూలికలనుగూడ, శోషయతి=వాడఁజేయుచున్నాఁడు. క్లాంతి+శాంతి+ప్రదానాం=ఎండవలని బడలికకు+శాంతిని+ఇచ్చునవియైన, కాసారాణాం=తటాకములయొక్క, విభవం=వైభవమును, హరతి=అపహరించుచున్నాఁడు. అహహా=అయ్యయో! ఏవం=ఇట్లు, స్వతః=స్వభావముగ, క్రూరస్య=క్రౌర్యగుణముగల, అస్య=ఈ, భాస్వతః=

సూర్యునియొక్క,గుణ+లవ+కథా=ఒకగుణములో+లేశమైన+చెప్పుట,కా =ఎట్టిది ! (మందాక్రాంతావృత్తము)

తా. సూర్యుఁడు (శాను, వసుమాక్ = ధనవంతుఁడైనను) గొడుగైనలేని పేదలైన బాటసార్లనుగూడఁ జూడలేనివారినిఁగాఁ జేయుచు, పైరుపచ్చలేక నేలవంతయు నెండిపోవునట్లుగాఁ జేయుచు, మందుమాఁకులకైన లేకి మూలిక లనుగూడ నెండఁగొట్టుచు, ఎండబడలికలనుగూడఁ బోఁగొట్టునట్టి తటాకముల వేడుకలనుం బోఁగొట్టుచు, మహాక్రూరుఁడైన యీసూర్యునియం దొకసుగుణ మైనఁ జెప్పటకే మున్నది చెప్పుము?

చూడు!—

చ. తెరువరులెల్లఁ దల్లడిల డిల్లవడ న్నిఖిలమిట్లఁగన్నులుక్
స్థిరగరమెండి బెండువడ శీఘ్రము చేడ్పడ శోషనోషధుల్
సరసులు వట్టి నెట్టవడఁ జయ్యన నియ్యినుఁ డెండ మెండునన్
ఖరతరుఁడయ్యె నయ్యదియొక్రౌర్యగుణంబని చెప్పనొప్పదే?

టి. తెరువరులు=బాటసారులు, స్థిర=భూమి, సరసులు = తటాకములు- రసికులు, ఇనుఁడు=సూర్యుఁడు-ప్రభువు, ఖరతరుఁడు = మిక్కిలి తీక్షణుఁ డు—క్రూరుఁడు, (సరసులు, ఇనుఁడు అనుచో భిన్నార్థములందు శ్లేషాలం కారము.)

విశ్వావసుః—

గ. కిమరే? భగవన్త మరవిన్దబాన్ధవమపి వినిన్దసి. త్వమను పురో భాగిన్? 12

అ. భగవంతం=షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన, అరవిందబాంధవం అపి= సూర్యనారాయణునిగూడ, వినిందసి = నిందించుచున్నావు. పురోభాగిన్= దుర్గుణములకుఁగూడ ముందుపడువాఁడా? త్వమను=నిను?

విశ్వావసువు—

వ. ఏమోరే? భగవంతుఁడయిన జగద్బంధువుంగూడ నిందిం చుచున్నాఁడవు? వినుకావువరోభాగీ?

టి. భగవంతుఁడు = షడ్గుణైశ్వర్యములుగలవాఁడు. (షడ్గుణములు=జ్ఞానశక్తి, బ, లైశ్వర్య, తేజో, వీర్యములు.) పురోభాగి=దోషములకే ముందుపడువాఁడు.

శా. వృష్టిం ఘృష్టిభి రారచయ్య జగత స్తుష్టిం సరీసర్ష్టి యః,
పుష్టిం ద్రాగ్విశినష్టి దృష్టిషు నృణాం, ధ్వాన్తం పినష్టి స్థిరమ్ ।
ప్రాజ్ఞానా మపవర్గమార్గద మముం పద్మాగృహోల్లాసినమ్
కోనస్తౌతి? సమస్తలోకసుహృదం ద్యోభూషణం పూషణమ్॥

అ. యః=ఏసూర్యుఁడు, ఘృష్టిభిః=కిరణములచేత, వృష్టిం=వర్షమును, ఆరచయ్య=కలుగఁజేసి, జగతః=లోకమునకు, తుష్టిం=సంతోషమును, సరీసర్ష్టి=సృజించుచున్నాఁడో? నృణాం=మనుష్యులకు, దృష్టిషు=కనులయందు, పుష్టిం=దర్శనసమృద్ధిని, విశినష్టి=విశేషపఱచుచున్నాఁడో? స్థిరం=నిలకడయైన? ధ్వాంతం=చీఁకటిని, పినష్టి=నశింపఁజేయుచున్నాఁడో? ప్రాజ్ఞానాం=జ్ఞానులకు, అపవర్గమార్గదం=మోక్షమార్గము నిచ్చుచున్నాఁడో? పద్మాగృహా+ఉల్లాసినం, =లక్ష్మీస్థానమైన కమలములను వికసింపఁజేయువాఁడో! అముం=అట్టియీ, సమస్తలోకసుహృదం = సకలలోకములకును స్నేహితునివంటివాఁడై, ద్యోభూషణం=ఆకాశమునకు అలంకారరూపమైన, పూషణం=సూర్యుని, కః=ఎవఁడు, నస్తౌతి=స్తోత్రము చేయఁడు!

తా. వర్షకారణములయిన తనకిరణములతో వర్షమును వర్షింపుచు, లోకములను సంతోషింపఁజేయువాఁడై, కటికచీఁకటిని దొలఁగించుచు, లోకులకనులకు చూపుదార్ఢ్యమును కలుగఁజేయువాఁడై, ఇట్లు సకలలోకులనుఁ సంతోషపఱచుచు, జ్ఞానభక్తివైరాగ్యములుగల ముముక్షువులకె మోక్షప్రదాయకుఁడై, ఆకాశమునంతటిని రత్నమువలె అలంకరింపఁజేయుటయెకాక, తామరలకుఁగూడ వికాసకుఁడై ప్రకాశించుచుండు నీసూర్యునిస్తోత్రము చేయనివాఁడెవఁడు?

సీ. తనకరనికరము ౯ తన్మూలముగఁజేసి
తఱితప్పకెప్పుడుఁ ౯ దఱిసి మెఱసి

వర్షంబు గలయంగ ◊ వర్షింపఁ జేసి, లో
కములకు హర్షప్రకర్ష మొసఁగి
తిరమవు గాఢాంధ ◊ తిమిరము నెక్కడ
నక్కడ నడఁగంగ ◊ నెక్కి త్రొక్కి,
జంతుజాలములకు ◊ నెంతయుఁ గనులను
దర్శనసామర్థ్య ◊ దర్ప మొసఁగి,
ఆ. కమలనిలయములను ◊ గర ముల్లసిలఁ జేసి,
ప్రాజ్ఞతతికి మోక్ష ◊ పదవి యొసఁగి,
జగములకును నేత్ర ◊ మగు మిత్రమగు నెవ్వఁ
డట్టిమిత్రుఁ బొగడ ◊ నట్టిఁ డెవఁడు?

టి. తనకర+నికరము=తనకిరణ+సమూహమును; తన్మూలముగన్=ఆవర్ష మునకు కారణముగ, దర్శన+సామర్థ్య దర్పము=చూచుటయందలి+సమర్థతవలని+గర్వమును; కమలనిలయములను=లక్ష్మీస్థానములైన తామరలను-తామరసస్థానములైన తటాకములను, మిత్రుఁడు=మిత్రము—స్నేహితుఁడు, అట్టిమిత్రున్=అట్టిసూర్యుని, (సూర్యకిరణములు వర్షకారణములనియు; యోగులును ముక్తులును సూర్యమండలమును భేదించుకొనిపోయి, పరమపదవి నొందుదురనియు ప్రమాణము.)

సం. యదా నపశ్యన్తి తమోవిమర్దినమ్
రవిం జనాస్తత్కథయన్తి దుర్దినమ్
ధినోతి చామ్భోజతతిం సరోగతామ్
ధునోత్యసా దేహభృతాం సరోగతామ్॥ 14

అ. యదా=ఎప్పుడు, తమః+విమర్దినం=అంధకారమును+పడఁగొట్టువాఁడయిన, రవిం=సూర్యుని, జనాః=జనులు, నపశ్యంతి=చూడరో? తత్=ఆదినమును, దుర్దినం=దుర్దినముఅని, కథయంతి=చెప్పుచున్నారు; అసౌ=అట్టి యీ సూర్యుఁడు, సరోగతాం=సరస్సులందుఁడునట్టి, అంభోజతతిం=తామరసమూ

హమును, ధినోతి=సంతోషపఱచుచున్నాఁడు. దేహభృతాం = మనుష్యులకు, సరోగతాంచ=రోగసహితత్వమును గూడ, ధునోతి = పోఁగొట్టుచున్నాఁడు. (వంశస్థవృత్తము)

తా. సూర్యుఁడు తాను దినపతి అని చెప్పఁబడుచుండియు సూర్యరశ్మియే లేనిదినము దుర్దినము—చెడుదినము అని(-దానికేల యీపేరు కలుగవలె అని)తా మరలకు సరోవాసస్థితి కలిగించుటవలెనే ప్రాణులకు రోగసహితస్థితి తొలఁగించుటనుఁ (-ఆరోగ్యమునుగూడఁ) జేయుచున్నాఁడనుట.

తే. తగసరోగతపద్మసంకేతతికిఁ గూర్చు
తగసరోగతప్రాణిసంకేతతికిఁ దీర్చు
దినము, దుర్దిన మందు రెకవ్వనినిగనని
దినము నతఁడు తమోవినుకర్దనము చేసి.

టి. సరోగత=సరః+గ+త—సరస్సును జేరియుండుట, స+రోగ+త-రోగసహితమైయుండుట; దుర్దినము=మబ్బుకప్పినదినము; (ఆరోగ్యము ఆసూర్యునివలననె ఇచ్ఛయింపవలయునని ప్రమాణము.)

స్ర. ఆశాపాలేషుపాశాయుధయమబలభిన్మారుతేశాదికేషు ప్రాయోభూయస్సుజాగ్రత్స్వపిచశుచితయాభాసురాభూసురాద్యాః యస్మైకాలత్రయేఽపిప్రతిదివస మమీకుర్వతేఽర్ఘ్యప్రదానం సైషాత్రయ్యేవవిద్యాత్రపతిరవిమయీసర్వలోకార్కఫునానా.

అ. శుచితయా=మనశ్శుద్ధితో, భాసురాః=ప్రకాశించువారైన, అమీ=ఈ, భూసురాద్యాః=బ్రాహ్మణులుమొదలైనవారు, పాశాయుధ... ఈశాదికేషు=వరుణుఁడు, యముఁడు, ఇంద్రుఁడు, వాయువు, ఈశానుఁడు, మొదలైన; ఆశాపాలేషు=దిక్పాలకులు, భూయస్సు=అనేకులు, ప్రాయః=బహుగా, జాగ్రత్సుఅపి = జాగరూకులై యుండియు, కాలత్రయేఽపి= త్రికాలములందును, యస్మై=ఏసూర్యునికి, ప్రతిదివసం=దినదినము, అర్ఘ్యప్రదానం = అర్ఘ్యదానమును, కుర్వతే=చేయుచున్నారో, సా+ఏషా=అట్టియీ, రవిమయీ=సూర్యస్వరూపమై, త్రయీ=వేదత్రయమేయమయిన, విద్యా+ఏవ=విద్యయే, సర్వ

లోకాన్ = సకలలోకములను, పునానా = పావనము చేయుచుండినదై, తపతి = ప్రతాపపడుచున్నది. (స్రగ్ధరావృత్తము.)

తా. బ్రహ్మక్షత్ర వైశ్యులు తాము ఇంద్రాద్యష్టదిక్పాలురుండియు, మనః పరిశుద్ధిగ ప్రతిదినమును త్రికాలములలో బ్రహ్మవిద్యావంతులై ఏసూర్యుని కర్ఘ్యమిచ్చి పూజించుచుందురో! అట్టి యీసూర్యస్వరూపమైన బ్రహ్మవిద్యయే సర్వలోకములను బవిత్రపఱుచుచుండును గాక.

తే. లోకపాలురు కడు జాగరూకు లగుచుఁ
గలుగఁ ద్రైవర్ణ్యమెత్తఁడు త్రైకాలికార్ఘ్య
మర్థిఁ గొనసీడు, నట్టి త్రయ్యాఖ్యవిద్య
మిత్రమయి పవిత్ర మగు జగత్త్రయికిని.

టి. లోకపాలురు = స్వర్గాదిలోకపాలురు - ఇంద్రాదిదిక్పాలురు, త్రైవర్ణ్యము = త్రివర్ణస్థులు, త్రైకాలిక = త్రికాలసంబంధియైన, అర్ఘ్యము = పూజాద్రవ్యము, అర్థిన్ = కోరికతో, త్రయ్యాఖ్యవిద్య = ఋగ్యజుస్సామములు అను వేదత్రయీవిద్య, మిత్రమయి = సూర్యస్వరూపిణియైన విద్య, జగత్త్రయికి = త్రిలోకములకు.

జనానుద్దిశ్య—

పృ. కృతత్రిదశపోషణం కృశరథాఙ్గసంతోషణమ్
పిశాచకులభీషణం పృథుతమశ్ఛటాపేషణమ్।
వినమ్రగదశోషణం విహితవారిజోన్మేషణమ్
నమస్కురుత పూషణం ననునభస్థలీభూషణమ్॥ 16

అ. కృత + త్రిదశ + పోషణం = చేయఁబడిన + దేవతలను + పోషించుటకలవాఁడును, కృశ + రథాంగ + సంతోషణం = చిక్కిపోయిన + చక్రవాకములను + సంతోషింపఁజేయుట కలవాఁడును; పిశాచ + కుల + భీషణం = భూతముల + సమూహమునకు + భయంకరుఁడును; పృథు + తమః + ఛటా + పేషణం = విస్తారమైన + అంధకారముయొక్క + సమూహమును + నశింపఁజేయువాఁడును; వినమ్ర + గద + శోషణం = వినతులయొక్క + వ్యాధులను + శోషింపజేయువాఁడును;

విహిత + వారిజ + ఉన్మేషణం = చేయఁబడిన, తామరలను, వికసింపఁజేయుట కలవాఁడును; నభస్థలీ + భూషణం = ఆకాశప్రదేశమునకు, ఆభరణమువంటి వాఁడునైన; పూషణం = సూర్యుని, నమస్కురుత = నమస్కారము చేయుండి! (పృథ్వీవృత్తము.) (అంత్యానుప్రాసాలంకారము.)

తా. వసంతాది యజ్ఞకాలములందు దేవతలను పోషించుచు, జక్కవల ను సంతోషపఱచుచు, పగలుతిరుగుటకై రాక్షసులను భయపఱచుచు, అంధ కారమును పోఁగొట్టుచు, ఆశ్రితులరోగములను మాన్పుచు, తామరలను విక సింపఁజేయుచు, ఆకాశప్రదేశమును అలంకరించుచు నుండెడి సూర్యుని నమ స్కరించుండి! అనియెను.

జనుల నుద్దేశించి.—

ఉ. పూషకుఁ గేల్మొగుడ్పుఁడొగిఁ, గా బోషకుఁడై సురపాళికిం, దమో
దూషకుఁడై, రథాంగపరి తోషకుఁడై, నతపాళి కామయ
ద్వేషకుఁడై, పిశాచకుల భీషకుఁడై, సరసీజపాళి కు
న్మేషకుఁడై, నభస్థలికి నిత్యవిభూషకుఁ డైనవానికిన్.

టి. పూషకున్ = సూర్యునికి, ఒగిన్ = వరుసగా, కేల్మొగుడ్పుఁడు = అంజలిచే యుండి! (అంత్యానుప్రాసాలంకారము)

గ. ఇత్థం విశ్వావసు ర్విభావసు మభిష్టువన్ ప్రాఞ్జలిః కృశాను
నాసహా ద్వాదశాత్మానంసమయా గమయామాసవిమానమ్.
ఆనమచ్చ తద్బింబమధ్యధామాన మతిమాన మహిమానం
పరమాత్మానమ్. 17

అ. ఇత్థం = ఇట్లు, విశ్వావసుః = విశ్వావసువను గంధర్వుఁడు, విభావసుం = సూర్యుని, అభిష్టువన్ = స్తోత్రముచేయుచు, ప్రాంజలిః = చేమోడ్పుగలవాఁడై, కృశానునాసహా = కృశానుఁడను తనతోడిగంధర్వునితోడ, ద్వాదశాత్మానం సమయా = సూర్యునిదగ్గఱ, విమానం = తనవిమానమును, గమయామాస = నడపెను. తద్బింబమధ్యధామానం = ఆసూర్యబింబమధ్యమే స్థానముగాఁ గలవాఁడై, అతి

మానమహిమానం=మితిమీఱిన మహత్త్వము కలవాఁడై, పరమాత్మానం=సర్వో త్కృష్ట స్వరూపుఁడైన శ్రీమన్నారాయణుని, అనమచ్ఛ=నమస్కరించినవాఁ డునయ్యెను.

వ. ఇట్లు విశ్వావసువు విభావసుం బొగడుచు, మొగిడిచిన కేల్గవతోఁ గృశానువుతోడం గూడఁ దనదునరదంబు నతనియంతికంబు నకుం బోవిడిచి, తన్మార్తాండమండల మధ్యస్థుండై యఖండమ హిముండును, బరమాత్ముండునయిన శ్రీమన్నారాయణు న్నమస్కరించెను.

టి. విభావసువు=కాంతులే ధనముగాఁగలవాఁడు-సూర్యుఁడు, పరమాత్ముఁడు=పరమాత్మ-సర్వజీవాత్మలలోను, సర్వజడములలోను ఆత్మగానుండువాఁడు, జీవాత్ముఁడు=జీవాత్మ-సమస్తజీవులలోను ఆత్మగానుండువాఁడు. ఈయాత్మలేనివి=నిర్జీవములు-జడములు; (ఈత్రిపదార్థములే=ఈశ్వరుఁడు, చిత్తు, అచిత్తు అనఁబడును).

సూర్యమండల మధ్యవర్తి శ్రీమన్నారాయణుని
నమస్కారముతోడి స్తోత్రము.

---

పృ. ప్రశస్తగుణసిన్ధవే ప్రపదనస్పృశాం బన్ధవే
స్వతోఽపహతపాప్మనే సకలదేహినా మాత్మనే।
నమః కమలవాసినీ నయనసౌఖ్యసన్ధాయినే
తమశ్శమవిధాయినే తరణిమణ్డలస్థాయినే॥ 18

అ. ప్రశస్త+గుణ+సింధవే+=ప్రసిద్ధములైన, గుణములకు, సముద్రమువంటివాఁడును; ప్రపదన+స్పృశాం=ప్రపత్తిని, సంబంధించువారికి, బన్ధవే=బంధువువంటివాఁడును; స్వతః=తానుగానె, అపహత+పాప్మనే=పోఁగొట్టఁబడిన, సకలపాపములుకలవాఁడును; సకల+దేహినాం=సమస్తప్రాణులకును, ఆత్మనే=పరమాత్మస్వరూపమయినవాఁడును; కమలవాసినీ+నయన+సౌఖ్య+సంధాయినే=లక్ష్మీదేవియొక్క, కన్నులకు, సౌఖ్యమును, చేయువాఁడును; తమః+శమ+వి

ధాయినే=అంధకారమువంటి తామసగుణమునకు, శాంతిని,కలుగఁజేయువాఁడు ను;తరణిమండల+స్థాయినే = సూర్యమండలమందు, నుండువాఁడునైన శ్రీమన్నారాయణునికి, నమః=నమస్కారము. (పృథ్వీవృత్తము.)

తా. సకలకల్యాణగుణములు కలిగి, ప్రపన్నులను పాలించుచు; సకలదోషములనుఁ దొలఁగించి, సకలాత్మలకును పరమాత్మయై, అంధకారమునవలె తమోగుణమును శమింపఁజేసి, సూర్యమండల మధ్యవర్తియై, సేవించునపుడెల్ల లక్ష్మీదేవి నేత్రముల కింపిదము నిచ్చుచుండు శ్రీమన్నారాయణునికి నమస్కారము చేసెను.

సీ. శ్రీమతే శ్రితహిత శ్రీమతే శుభకృపా
శ్రీమతేఽస్మచ్ఛ్రేయసే నమోఽస్తు
శేషిణే సుశయన శేషిణే త్రిదశవ
శేషిణే దశవేషిణే నమోఽస్తు
జిష్ణవే సహభవజిష్ణవే శ్రీమహా
విష్ణవే ప్రభవిష్ణవే నమోఽస్తు
మాయినే ఫణిఫణాశాయినే శ్రుతిశిరః
స్థాయినే పురుషార్థదాయినేఽస్తు
తే. విహితబంధవే గుణసింధవే నమోఽస్తు
నిహతపాప్మనే నిఖిలాత్మనే నమోఽస్తు
తపనమండలస్థాయిన స్తన నమోఽస్తు
క్షే తమః క్షేప! లక్ష్మీపతే! నమోఽస్తు.

టి. శ్రీమతే=శ్రీమంతుఁడును-లక్ష్మీదేవియే (వక్షస్థలమున) కలవాఁడును, శ్రిత+హిత+శ్రీమతే=ఆశ్రితుల+హితములకై+శ్రీమంతుఁడును, శుభ+కృపా + శ్రీమతే = కల్యాణకరమయిన + కరుణకై + శ్రీమంతుఁడును, అస్మత్+శ్రేయసే—మాకు + శ్రేయోరూపుఁడునైనవానికి, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక. శేషిణే=(శేషభూతమయిన ప్రపంచమునకంతయు)

శేషి ర్యైనవాఁడును,సుశయన + శేషి ణే=మంచి శయనమయిన ఆది శేషుఁడుకల వాఁడును; త్రిదశ + వశ + ఈషి ణే=దేవతలకు, వశమైన, అభిలాషకలవాఁడును; దశ వేషి ణే=దశావతారములు కలవాఁడును, జిష్ణవే = జయశాలియైనవాఁడును; సహభవ+ జిష్ణవే = తోఁబుట్టువైన, ఇంద్రుఁడుకలవాఁడును; ప్రభవిష్ణవే=మిక్కిలి అతిశయించినవాఁడునయిన, శ్రీమహావిష్ణవే=సర్వైశ్వర్యములతోడి మహావిష్ణువునకు, నమః=నమస్కారము, అస్తు=అగుగాక. మాయి నే = అజ్ఞానులకు అగమ్యమైన మాయాచరిత్రముకలవాఁడును; ఫణిఫణాశాయి నే=ఆది శేషుని పడిగెలమీఁద శయనించువాఁడునునైన, పురుషార్థదాయి నే= ధర్మార్థ కామమోక్షములు అను పురుషార్థములిచ్చువానికి, నమః అస్తు = నమస్కారముఅగుగాక; విహితబంధ వే=విధియుక్తముగ ప్రవర్తించువారికి బంధువునైన, గుణసింధ వే= సకల సద్గుణములకును సముద్రమువంటివానికి, నమోస్తు=నమస్కారమగుఁగాక; నిహతపాప్మ నే=పరిహరింపఁబడిన సకలపాపములుకలవాఁడైన, నిఖిలాత్మ నే= సకలప్రపంచములకును పరమాత్మయైనవానికి, నమోస్తు=నమస్కారమగుఁగాక; తపనమండలస్థాయినః = సూర్యమండలమందుండు శ్రీమన్నారాయణుండవైన, తవ, నమోఽస్తు=నీకు నమస్కారమగుఁగాక;తమః + క్షేప=అజ్ఞానాంధకారమును, పోఁగొట్టువాఁడవైన, లక్ష్మీపతే=ఓ శ్రియఃపతీ ! తే=నీకు, నమః = నమస్కారము, అస్తు = అగుఁగాక. (ఇట్లు నమస్కారస్తోత్ర ప్రార్థనాదులందు తెలుఁగుకావ్యములందుఁగూడ శుద్ధసంస్కృతవాక్యములు అనుకరణములేకయు ప్రయోగించుట పూర్వకవిప్రయోగదృష్టయై యున్నయది.) (అంత్యానుప్రాసాలంకారము.)

పునః సభక్తుగ్రన్మేషం,—

ర. భానుభానుదల దబ్జలోచనమ్
భక్తలోకభవ పాశమోచనమ్ ।
ధామ తామరసవాసినీ సఖమ్
హేమవర్ణ మిహపాతి మే సుఖమ్ ॥ 19

అ. భాను+భాను+దలత్+అబ్జ+లోచనం = సూర్యునియొక్క+కిరణములచేత+వికసించుచున్న+తామరలవంటి+కన్నులుకలదియు; భక్త+లోక+భవ+పాశ+మోచనం=భక్తుల+సమూహముయొక్క+సంసారబంధములను+విడిపించునదియు; హేమపర్ణం=బంగారువర్ణమునైన, తామరసవాసినీ+సఖం=లక్ష్మీదేవియే+సహాయముగాఁగల; ధామ=(విష్ణువనెడి) తేజస్సు, మే=నాకు, సుఖం=ఆనందమును, సౌతి = పుట్టించుచున్నది. (అంత్యానుప్రాసము, రథోద్ధతావృత్తము.)

తా. అప్పుడు పూచుతామరలవలె కన్నులును, ఎప్పుడును బంగారువలె మేనివన్నెయును గలిగి, భక్తులభవబంధములను విడిపించుటకై యామహాలక్ష్మియే సహాయమయిన శ్రీమహావిష్ణువుతేజమే నా కానందము నిచ్చుచున్నది.

మఱల భక్తిప్రకర్షంబుతో.—

పం. రవిస్ఫురచ్ఛరత్సరోజ కీ రమ్యపత్ర నేత్ర మై
ప్రవర్యపర్యటద్భవప్ర కీ పాశనాశనాగ్ని యై
సువర్ణవర్ణమై ప్రసిద్ధ కీ శుద్ధసత్త్వ మైనశ్రీ
నివాసతేజ మిచ్చుఁగా వి కీ నిఘ్నసౌఖ్య మిచ్చెడున్.

టి. ప్రవర్య+పర్యటత్+భవ+ప్రపాశ+నాశన+అగ్ని = భక్తాగ్రేసరులయొక్క+(చక్రమువలె)తిరుగుడుపడుచుండు+సంసారము(పాపములు) అనెడు మహాపాశములను+నశింపఁజేయుటకు+అగ్నివంటిదియు, శుద్ధ+సత్త్వము=పరిశుద్ధమై+బ్రహ్మస్వరూపమైన,శ్రీనివాసతేజము=లక్ష్మీదేవికి వాసస్థానమైన తేజస్సు,వినిఘ్న=అత్యంతమైన. (పంచచామరము) (ఛేకానుప్రాసాలంకారము)

కృశానుః.—

గ. కిమరే కేవలం నిర్ఘృణోఽపి నారాయణోభవతా వివేక
లాభవతాఽపి స్తవనభాజనీక్రియతే. 20

అ. కిం అరే=ఏమిరా! కేవలం=బొత్తిగా, నిర్ఘృణోఽపి = దయయే లేనివాఁడయ్యును, నారాయణః=ఆనారాయణుఁడు, వివేకలాభవతాఽపి=

(నీవు) వివేకమను లాభముకలవాఁడవయ్యెను, భవతా=నీచేత, స్తవన+భాజనీక్రియతే=స్తోత్రమునకు+పాత్రముగా చేయఁబడుచున్నాఁడు.

కృశానుఁడు.—

వ. ఏమిరా! నీవు వివేకమే కోరియు, కేవలము నిష్కారుణుఁడే యయిన నారాయణునిఁగూడ నీస్తోత్రమునకుఁ బాత్రమునుగఁ జేయుచున్నాఁడవు.

తథాహి.—

శా. స్వేనాదా నిఖిలం జగద్విరచితం స్వేనైవ సంరక్షితమ్
భిన్దన్హన్త! ముకున్ద ఏష విధృతానన్దోహి నిన్దోచితః।
ఉత్పాద్యస్వయముత్తమాన్ ఫలతరూనుల్లాస్య చారూదకైః
ఉన్మత్తోఽపికిముచ్ఛినత్తి జగతిచ్ఛిత్వాఽపి కిం నన్దతి॥ 21

అ. ఏషః=ఇట్టి, ముకుందః=నారాయణుఁడు, ఆదౌ=మొదట, స్వేన=తనచేత, నిఖిలం=సకలమైన, జగత్=లోకము, విరచితం = సృష్టింపఁబడినది; స్వేనైవ=తనచేతనే, సంరక్షితం=రక్షింపఁబడినది. హన్త=అయ్యో! భిన్దన్=(జగత్తునంతయు)భేదించుచు, విధృత+ఆనన్దఃహి=కైకొనఁబడిన, ఆనందము కలవాఁడేకదా! నిన్దా+ఉచితః = నిందకు+తగినవాఁడు (అయ్యెను.) స్వయం=తాను, ఉత్తమాన్=మేలైన, ఫలతరూన్=పండ్లచెట్లను, ఉత్పాద్య=పుట్టించి, చారూదకైః=మంచినీళ్లచేత, ఉల్లాస్య = ఉల్లసింపఁజేసి, జగతి=లోకములో, ఉన్మత్తోఽపి=ఒడలెఱుఁగనివాఁడైనను,ఉచ్ఛినత్తికిం=నఱుకుచున్నాఁడా! ఛిత్వాఽపి=నఱికియు, నందతికిం = సంతోషపడుచున్నాఁడా!

తా. త్రిమూర్తిస్వరూపుఁడైన శ్రీమన్నారాయణుఁడు రజస్సత్వగుణములచేత జగత్తులకు సృష్టిస్థితులను జేయువాఁడైనను, తమోగుణముచేత సంహారము చేయుటవలన, తాను నిత్యానందుఁడే యయినను, నిందార్హుఁడు కావలయునా? లోకములో ఎవఁడుగాని, పండ్లకై చెట్లుపెట్టి నీళ్లుపోసిపెంచి,

తోడనే నటికి వేయునా! నటికియు, సంతోషపడునా! ఏమి? (ఇట—ప్రతి వస్తూపమాలంకారము.)

అల్లేకి దా..—

ఉ. ఈజగమెల్లఁ దానె సృజియించుచుఁ బెంచుచుఁ గూడఁ, దోడనీ
యోజ వినాశకుండగు, టకయో? ముదమందదె! నిందపాలు గా
కే! జగదీశుఁ డిట్టిఁడగు నే! యెవఁడేని ఫలప్రధాన పృ
థ్వీజము పెట్టి పెంచుచు, భుజింపఁబడఁ ద్రోచునె! త్రోచి యేచునే!

టి. ఈ+ఓజన్=ఈరీతున, ఇట్టిఁడు=ఇట్టివాఁడు, ఏచునే=విజృంభించునా? (ఇట విరుద్ధధర్మముతోడి ప్రతివస్తూపమ.)

కించ.—

శా. స్వానుజ్ఞా మనవాప్య దర్ప భరతః స్వాజ్ఞాంవిలఙ్ఘేత య
స్తస్మై స్యేవేహ తనోతి లౌకికనృప శ్చణ్డోఽపి దణ్డం రుషా।
అన్తర్యా మ్యపథే ప్రవర్త్య భవినో హంత స్వయం నారకే
యస్తాన్ పాతయతి క్రుధా సతు న కిం నారాయణో నిర్ఘృణః॥

అ. యః=ఎవఁడు, దర్పభరతః=గర్వాతిశయముచేత, స్వ+అనుజ్ఞాం=తన+ఉత్తరువును; అనవాప్య+అపి=పొందకున్నను, స్వ+ఆజ్ఞాం=తనఉత్తరవును, విలంఘేత=అతిక్రమించునో, తస+ఏవ=వానికే, ఇహ=ఈలోకములో, లౌకిక నృపః=లోకానుసారియైన రాజు, చండోఽపి=తాను తీక్ష్ణుఁడైనను, రుషా=కోపముతో, దండం=దండనమును, తనోతి=చేయుచున్నాఁడు; యః=ఎవఁడు, అంతర్యామీ+అపి=సకలమనోనియామకుఁడైనను, భవినః=సంసారులను, అపథే =దుర్మార్గమందు, ప్రవర్త్య=ప్రవర్తింపఁజేసి, హంత=అయ్యో! స్వయం=తానే, క్రుధా=కోపములో, తాన్=వారిని, నారకే=నరకానుభవములో, పాతయతి =పడవేయుచున్నాఁడో; సః=అట్టి, నారాయణః+తు = నారాయణుఁడు ఐతేనో; న+నిర్ఘృణః+కిం=నిర్దయుఁడు+కాఁడా+ఏమి?

తా. లోకములో ప్రభువుగా నుండువాఁడు తనయాజ్ఞను గర్వముతో అను సరింపక అతిక్రమించునట్టి మూఢునే దండించుచున్నాఁడుగాని, ఇట్లు సర్వాంతర్యామియై సర్వనియామకుఁడై యుండు నారాయణుఁడు తానే సంసారులను అక్రమములందు ప్రవర్తింపఁజేసి, కోపపడుచు ; నరకములో పడవేయుచున్నాఁడే! అతఁడు నిర్దయుఁడా ఏమి ! అనియె.

మఱియు.—

మ. తనయాజ్ఞన్ గొనక వ్వఁడివ్వసుధపై దర్పంబునన్ మించు చే
కనిపించున్, క్షితిజానివానిఁగినుకన్ ఖండించుదండించుఁబో?
అనయంబందుఁజరింపఁజేసి, నిరయంబందుం బడంజేయుచో
ననయంబందుముకుందుఁడీతఁడదయుండంచుం బ్రపంచంబులోన్

టి. అనయంబందున్=అనీతియందు, అనయంబు+అందున్=ఎల్లప్పుడును (శ్లేష అని అనుదును.(ఇట విభావనా, కావ్యలింగము అలంకారములు.)

విశ్వావసు:—ఆకర్ణయేదమ్.

గ. అహో! తవమతిరతిస్థూలా యతః పరమకారుణికం భగవంతం పఙ్కజవాసినీప్రాణనాథమపి స్పృశతి తవోపాలమ్భః 23

అ. అహో=అయ్యో, తవమతిః=నీబుద్ధి, అతిస్థూలా=మిగుల మూఢమైనది, యతః=ఎందువలన, పరమకారుణికం=పరమదయాళునై, పంకజవాసినీప్రాణనాథం = లక్ష్మీదేవి ప్రాణప్రియుఁడైన, భగవంతం-అపి = భగవానునిగూడ, తవ ఉపాలంభః=నీ నిందావచనము, స్పృశతి=అంటుచున్నది ?

విశ్వావసువు.—వినుము యిది.

వ. అయ్యో! భగవంతుఁడగు పద్మాసఖుఁడు పరమకారుణికుఁడా? అతనినిగూడ నీనిందించువచనము స్పృశించునదియా? స్పృశియించుచున్నది కనుకనే, నీమది యిది యతిమూఢమయిన యది.

వం. చిరాయ సంసృత్యుదధౌ సమజ్జనం
నమజ్జనం మజ్జన ఇత్యధోక్షజః।
దయాపయోధిః పరిగృహ్య దుర్లభం
నిజంపదం ప్రాపయతి స్వయంప్రభుః॥ 24

అ. చిరాయ=బహుకాలముగా, సంసృతి + ఉదధౌ=సంసారమను + సముద్రమందు, సమజ్జనం + అపి=మునుఁగులాటలోఁ గూడినవాఁడైనను, నమత్ + జనం =నమస్కరించు జనుని, మత్ + జనఇతి= నావాఁడుఅని ; దయాపయోధిః=దయాసముద్రుఁడై, ప్రభుః=సర్వసమర్థుఁడైన, అధోక్షజః = నారాయణుఁడు, స్వయం=తానే, పరిగృహ్య = అంగీకరించి, దుర్లభం=దొరకరాని, నిజం=స్వకీయమైన, పదం=పరమపదమును, ప్రాపయతి=పొందించుచున్నాఁడు. (వృత్త్యనుప్రాసాలంకారము వంశస్థవృత్తము.)

తా. సంసార సముద్రమం దెంతకాలము మునుఁగుచుండినను, ఒకసారి నైన, తన్ను నమస్కరించువానిని అంగీకరించి సర్వవిధ సమర్థుఁడైన యానారాయణమూర్తి అసాధారణమైన తనపరమపదమును కృపచేయుచున్నాఁడు.

ఉ. సారెకు నుంప సొంపెడలి కే చాఁగిలునాత్మల నుద్ధరించి సం
సారమహాబ్ధినుండి, హరి కే సంతతి మెంత దయాపయోధి ! యె
వ్వారికి దుర్లభంబు నభ కే వంబునునౌస్వపదంబుప్రాభవం
బారఁగనిచ్చుచుండుఁదన కేయంతనయెంత యుస్వీయబుద్ధిచేన్.

టి. ముంపక =(సంసారసముద్రము తనయందు) మునిఁగింపఁగా, చాఁగిలు= సాష్టాంగముగ నమస్కరించునట్టి, అభవంబు = పునర్జన్మరహితమైన, స్వీయ బుద్ధిచేక =తనవారు అను తలంపుచేత.

కించ.—

శా. లీలాలోలత మాంరమామగణయ, న్నీలామనాలోకయక్
ముఖ్యుక్కించమహీమహీశ్వరమయంపుణ్యంమహాద్యణ్యయన్।

ఆకర్షన్ ద్విజరాజమప్యతిజవా ద్ధావిహ న్త? లోకా న్తరాత్
గోప్తుం శౌరిరుదిత్వరత్వరఉపై ద్గ్రాహగ్రహార్తం గజమ్! 25

అ. శౌరిః=ఆమహావిష్ణువు, లీలా + లోలతమాం=విలాసములతో + మిగులఅనక్తురాలైన, రమాం=లక్ష్మిని, అగణయన్=ఎంచనివాఁడై, నీలాం=నీలాదేవిని, అనాలోకయన్=చూడనివాఁడై; కించ=మఱియు, మహీం=భూదేవిని, ముంచన్=విడుచువాఁడై; అహీశ్వరమయం=ఆదిశేషస్వరూపమైన, మంచం=శయ్యను, హఠాత్=తటాలున, వంచయన్=విడుచువాఁడై; లోకాంతరాత్=అన్నిలోకములకంటె మించియుండు (వైకుంఠ) లోకములోనుండి, హా హంత=అహాహా? అతిజవాత్=అతివేగముతో, ద్విజరాజం+అపి=గరుత్మంతునిఁగూడ, ఆకర్షన్=లాఁగుకొనువాఁడై; ఉదిత్వర+త్వరః=అతిశయించుచుండు+వేగముగలవాఁడై; గ్రాహ+గ్రహ+ఆర్తం=మకరము+గ్రహించుటచేత+పీడింపఁబడుచున్న, గజం=అగజేంద్రుని, గోప్తుం=కాపాడుటకై, ఉపైత్=వచ్చెను. (ఛేకానుప్రాసాలంకారము.)

తా. మొసలిచేఁజిక్కుకొని తత్తరపడుచుండు గజేంద్రుని సంరక్షించుటకై ఆభక్తవత్సలుఁడైన శ్రీమన్నారాయణుఁడు తనసౌఖ్యమునుంజూడక, తనప్రక్కనున్న శ్రీభూనీళాదేవులను నెన్నక, తనసుఖశయ్యయైన యాదిశేషునిన్ విడిచి, పరిగిడివచ్చి తనపాదమునుబట్టుకొన్న గరుడునిన్ లాగుకొనుచు, ఆసకలలోకాతీతమైన వైకుంఠలోకములోనుండి యీలోకమునకుఁ దటాలునవచ్చెను.

శార్దూలయుగ్మము.

లీలన్ లోలతమన్ రమన్ దలఁప, కాకలీలన్ క్షమందల్పకే
నీలన్ శీలగుణన్ గణింపక యొకింతేనిన్, ఫణిగ్రామణిన్
గేళీశయ్యను మోసఁజేసి, యతివేగిన్ వే ఖగగ్రామణిన్
బాళిన్లాఁగుచు,శౌరి భూరిదయ మాహా! నైకలోకాంతరం
బోలిన్ దాఁటిధరన్ద్వరన్ డిగుచు,నహోయ్యో! నక్రసంకాంతదం
తీలేంద్రున్ బరిరక్షసేయుటకు నహోయ్యో, చక్రవిక్రాంతుఁడై

తార్క్ష్యుఁ జాలఁ దటంచు పంచెదనచేఁ గేదద్విక్రమప్రక్రమం
బాలోకించుచురుత్వరన్ శిరముఁ ద్రెంచెన్ నక్రముం జక్రమున్.

టి. లోలతమన్ =మిక్కిలి ఆసక్తికలదియయిన, రమన్ =లక్ష్మీదేవిని, క్షమన్ =భూదేవిని, నీలన్ =నీళాదేవిని, శీలగుణన్ =సత్స్వభావగుణములుగల, కేళీశయ్యను=కేళికాశయనమందు, నక్ర + సంక్రాంత + దంతి ఇలా ఇంద్రున్ =మొసలిచేత + ఆక్రమింపఁబడిన + దంతిభూపతిని-గజరాజును, తత్ + విక్రమ ప్రక్రమంబు=ఆచక్రాయుధముయొక్క + పరాక్రమప్రకారమును, ఉరుత్వరన్ = అతివేగములో.

పాఠాంతరము.

సీ. లీలమై హృదయవి ◌ లోలమై తనరు శ్రీ
దేవినినైన, భూ ◌ దేవినైన
ఆదివ్యశీల నీ ◌ లాదేవినైనను
దల్పక భోగీంద్రు ◌ తల్పమైన
నతితూర్ణునైనను ◌ నా సుపర్ణుని హరి
వెనుక నాకర్షించు ◌ కొని యనేక
లోకము ల్కడచి వి ◌ లోకించు చెక్కడ
నెక్కడ ననియిలఁ ◌ జక్క డిగియె

తే. ఆమహామహుఁ డెంతటి ◌ యతిశయదయ
కలుగువాఁడో యంతటి త్వర ◌ కలుగువాఁడై
యగుచు గజరాజరక్షార్థ ◌ మంతకు మును
దునుమ నక్రంబుఁ జక్రంబు ◌ దుముకఁబనిచె.

టి. లీలమై=విలాసముకలిగి, హృదయవిలోల=తనవక్షస్థలమున విలసించునది, అతితూర్ణునైనను=అతివేగము కలవానినైనను, ఆసుపర్ణుని=ఆగరుత్మంతుని, మహామహుఁడు=అమితతేజోమయుఁడైన యావిష్ణువు.

గజేంద్రుఁడు.—ఇద్దఱు దాయాదులు గంధర్వులు తమదాయభాగములకై కలహించుకొని యొకరొకరు ఏనుఁగుగాను, మొసలిగాను శపించుకొని, యొకప్పుడొక కొలనిలోదిగి, అందు కనిపెట్టుకొనియున్న యామొసలిచే ఆగజము పట్టుకొనఁబడి, చాలాసంవత్సరాలు లాగిలాగి బాధింపఁబడుచు, ఆహారనిద్రాదులును లేక, కేవలము ప్రాణమాత్రముతోనుండికూడ ఆగజ మెందఱినో ప్రార్థించుచు, తనబాధ నోర్వఁజాలక తాను తుదకు ముక్తినే చెందవలెనని ప్రార్థింపఁగా, ఆవచ్చినవా రెల్లవారును మావలన నగుపనికా దిది యావైకుంఠాధిపతిపనియే అని నిశ్చయింపఁగా, ఈగజేంద్ర మప్పుడామహావిష్ణువును ప్రార్థింప యత్నింపఁగానె, తోడనె యామహావిష్ణువు తనదేవులతోనైనఁ దెలుపకయే పరిగిడివచ్చుచున్న యావిష్ణుపాదములను ఆగరుత్మంతుఁడు పాఱివచ్చి పట్టుకొన్నను, ఆగరుత్మంతునిగూడ నీడుచుకొనిపోయి, తనకును ముందుగాబోయి ఆమకరిశిరమును ఖండించుటకై తనచక్రమునుపంపి, యామహాకృపాళువైన యీ యార్తరక్షాపరాయణుఁడు శ్రీమన్నారాయణుఁడు తనహస్తస్పర్శచేతనే సంరక్షించి మోక్షప్రదాయకుఁడైన యాతనిచేతనే మోక్షమందింపఁబడిన గంధర్వుఁడు.

శా. వైకుణ్ఠో మహతా హతాఖిలమహారమ్భం మదేనోచ్చకై
శ్చణ్డం ఖణ్డయితుం హిరణ్యకశిపుం వేదణ్డముత్కణ్ఠయా।
సైంహం వేష మశేషభీషణమహో! గృహ్ణా త్వరాగౌరవాత్
ప్రహ్లాదవ్యసనాసహిష్ణు రుదగా దాకణ్ఠ కణ్ఠీరవః. 26

అ. వైకుంఠః=విష్ణువు, మహతా=మహత్తైన, మదేన=మత్తుచేత, హత+అఖిల+మహత్+ఆరంభం=హతముచేయఁబడిన, సకలమైన, గొప్ప, కార్యప్రయత్నములుగలదై, ఉచ్చకైః=ఎక్కువగ, చండం=తీక్ష్ణమైన, హిరణ్యకశిపుం=హిరణ్యకశిపుఁడనెడు, వేదండం=ఏనుఁగును, ఖండయితుం=ఖండించుటకై, ఉత్కంఠయా=స్వేచ్ఛతో, అశేషభీషణం=అందఱకును భయంకరమై, సైంహం=సింహస్వరూపమైన, వేషం=రూపమును, గృహ్ణా=గ్రహించుచు, అహో=ఆహా! త్వరాగౌరవాత్=వేగాతిశయమువలన, ప్రహ్లాద+వ్యసన+అసహిష్ణుః=ప్ర

హ్లాదునియొక్క + వ్యసనమును + సహించనివాఁడై, ఆకంఠ + కంఠీరవః = కంఠము పర్యంతము + సింహముగా, ఉదగాత్ = ఆవిర్భవించెను.

తా. ఆమహావిష్ణువు మత్తుచేత సకలప్రయత్నములును చెఱుచుచు, మహాతీక్ష్ణముగనుండెడి యేనుఁగును సింహమువలె ఆహిరణ్యకశిపుని సంహరించుటకై తానును కంఠముదనుక సింహస్వరూపుఁడై ఆప్రహ్లాదునివ్యసనము నోర్వఁజాలక, అతివేగముగ ఆవిర్భవించెను.

శా. కంఠంబుం దనుకన్ భయంకరమహాకంఠీరవంబై, రవా
కుంఠంబై, పడ స్తంభ, ముద్భవిలి, వైకుంఠుం డఖండత్వరో
త్కంఠం బైఁబడి యాహిరణ్యకశిపుంగంధద్విపుంద్రుంచు రే
వన్ శీవింబడిద్రుంచిప్రోచెఁ బ్రణతుంబ్రహ్లాదుఁ బ్రాహ్లాదుఁగాన్.

టి. రవ + ఆకుంఠంబై = వేగముతో పూర్ణమై; అఖండ + త్వరా + ఉత్కంఠన్ = అత్యంతమైన + వేగమందు + అపేక్షతో; గంధద్విపున్ = గజశ్రేష్ఠమును, రేవన్ = రీతిగా, ప్రణతున్ = తనకు ప్రణామముచేయువాఁడైన, ప్రాహ్లాదుఁగాన్ = అత్యాహ్లాదము గలవాఁడగునట్లుగా, ప్రోచెన్ = రక్షించెను. (ఉపమా)

ప్రహ్లాదుఁడు.—లీలావతీ హిరణ్యకశిపులకొమారుఁడు. ఇతఁడు విష్ణుద్వేషియైన తనతండ్రితో సర్వదా వివాదపడుచు, తన్నును తనతండ్రి యనేకబాధలు పెట్టుచు, విష్ణుస్మరణయే కూడదని నిరోధించి నిరోధించి తుద కాకొడుకును వధింపరాఁగా, ఈవిష్ణుభక్తుఁడైనప్రహ్లాదుఁడాబాధలు పడఁజాలక పెద్దమొఱపెట్టి స్వామిని ప్రార్థింపఁగానె, భక్తపరాయణుఁడైన యానారాయణుఁడు ఆమొఱ విన్నతోడనె తటాలున అక్కడి స్తంభమం దుద్భవించి, నరసింహరూపముతోఁ గనఁబడి యాహిరణ్యకశిపుని సంహరించినయాతని చేతనే సంరక్షింపఁబడినవాఁడు.

హిరణ్యకశిపుఁడు.—దితి కశ్యపప్రజాపతులపుత్రుఁడు, హిరణ్యాక్షునియన్న; వీరిరువురును సనకసనందనాదుల శాపముచేత రాక్షసులై విష్ణువుయొక్క నరసింహరూపముచేత నితఁడును, వరాహరూపముచేత నితనితమ్ముఁడు హిరణ్యా

క్షుఁడును సంహరింపఁబడిన జయవిజయు లనెడి వైకుంఠద్వారపాలకులు. ఈ నృసింహ వరాహావతారములు, ఆ దశావతారములలో మూఁడవ నాల్గవ యవతారములు.

అన్యచ్చ.—

శి. అవేమవ్యాపారాకలన మతురీస్పర్శమచిరాత్
అనున్మీల త్తంతు ప్రకరఘటనాయాస మసకృత్ ।
విషీదత్పాంచాలీ విపదపనయైక ప్రణయినః
పటానాం నిర్మాణం పతగపతికేతో౽రవతునః ॥ 27

అ. అసకృత్ = పలుమాఱును, విషీదత్ + పాంచాలీ + విపత్ + అపనయ + ఏక + ప్రణయినః= దుఃఖించుచున్న + ద్రౌపదియొక్క + ఆపత్తును + పోఁ గొట్టుటయందు + ముఖ్యమైన + ప్రేమకలవాఁడైన, పతగపతికేతోః = గరుడధ్వజుఁడగు విష్ణువుయొక్క, అవేమ + వ్యాపార + ఆకలనం=దోనెయొక్క + పనితోడి + కూడికయేలేనిదియు, అ + తురీ + స్పర్శం=నాడెనంటుటయే + లేనిదియు, అ+ఉన్మీలత్ + తంతు + ప్రకర + ఘటనా + ఆయాసం=పైకెగిరెడి + నూలి + సమూహములోడి + కూర్పునందు + శ్రమ మే లేనిదియునైన, అచిరాత్ =త్వరతో, పటానాంనిర్మాణం = వస్త్రముల నిర్మాణము, నః=మమ్ములను, అవతు=రక్షించుఁగాక.

తా. నూలు, కండె, నాడె, దోనె, మొదలైన నేఁతసాధనములు లేకయే, దుశ్శాసనునివలన దుఃఖించుచుండెడి ద్రౌపదియాపత్తులను బోఁగొట్టుటకై నిఖిలాపన్నివారకుఁడై భక్తవత్సలుఁడై యా నారాయణమూర్తియైన శ్రీకృష్ణమూర్తి అతిత్వరగా నేయు నేఁత మమ్ములను గాపాడుగాక. (శిఖరిణీ వృత్తము)

మఱియొకటియు.—

ఉ. నూలునునాడెకండెయును నూలుకొనంగొనుపల్లపన్నెయుఁ
మేలగు లేకయుఁ బడుగు మేలిమిలేకయుఁ జల్వవల్వపాం

చాలికి నేసి యిచ్చు హరిచాతురి యేతఱినైనఁగాని మ
మ్మాలినిగాచుఁగాఁతెఁ జెలి నుమ్మలిక మ్మఱఁ గాచురీతిగాన్.

టి. నూలుకొనన్ = ప్రయత్నింపఁగా, చాతురి = అఘటితఘటనానిపుణత, ఉమ్మలికమ్ము + అఱన్ = దుఃఖము + నశించునట్లు. (ఉత్ప్రేక్షాలంకారము.)

పాంచాలి = ద్రౌపది.—పాంచాలదేశపురాజయిన ద్రుపదరాజుకూఁతురు, పాండవులపెండ్లము. ఈ పెఃపూర్వజన్మమున ఇంద్రసేన అనుపేరితో మౌద్గల్య మహామునికి భార్యయైయుండెను. ఆమౌద్గల్యుఁడు తనకర్మాధీనమున కుష్ఠరోగి యైయుండియు, తనకు బహుకాలముగ పతిభక్తికలిగి పరిచర్యచేయుచున్న దీపతివ్రత అని సంతోషించి, ఆమెను వరము వేఁడు మిచ్చెదనని యడుగఁగా, ఆమె నాకుపతియైన మీయందె యపేక్షయెకాక వేఱేయపేక్షయు లేదనియు, మఱుచటిజన్మమున కాశిరాజుకూఁతురై కన్యాత్వమలోనె శివునిగూర్చి బహు కాలము తపస్సుచేసి యతఁడు ప్రత్యక్షమైనపుడు తనకు పూర్వజన్మమునుండి కలిగియుండిన పతిభక్తిపాతివ్రత్యధర్మములనుబట్టి పతిపతియని యైదుపర్యాయ ములు వరమడుగఁగా, అట్లేయని వరమీయఁబడి, ఆతర్వాతిజన్మములో కృష్ణ అనిపేరితోపుట్టి యాద్రౌపది పంచపాండవులకు భార్యయై ధర్మభీమార్జుననకుల సహదేవులకు వరుసగ ప్రతివంద్య శ్రుతసోమ శ్రుతకీర్తి శతానీక శ్రుతసేనులు అను ఉపపాండవులను కనుకొనినయామె.

అపరంచ.—

మ. కాకశ్శోకం వ్యజహాదమితం, వృద్ధగృధ్రోఽప్యనేకాన్
లోకాన్ లేభే,కుశల మగమన్నిర్విషాదం నిషాదః ।
రాజ్యం ప్రాప్తా కపినిశిచరా రాఘవత్వే మురారేః
పారేవాచాం జయతికరుణా పశ్య? పద్మాసఖస్య॥ 28

టి. మురారేః = విష్ణువుయొక్క, రాఘవత్వే = శ్రీరామావతారమందు, కాకః = కాకి, అమితం = అధికమైన, శోకం = దుఃఖమును, వ్యజహాత్ = విడిచిపెట్టె ను. వృద్ధగృధ్రః + అపి - ముసలిగ్రద్దయు,అనేకాన్,లోకాన్ = నానాలోక

ములను, లేభే=పొందెను. నిషాదః=బోయఁడు, నిర్విషాదం=నిర్దుఃఖమయిన, కుశలం=క్షేమమును, అగమత్=పొందెను. కపి, నిశిచరౌ=కోఁతి, దయ్యములు రెండును, రాజ్యం=రాజటీకమును, ప్రాప్తౌ=పొందెను. పద్మాసఖస్య=లక్ష్మీప్రియుఁడైన యావిష్ణువుయొక్క, కరుణా=కృప, వాచాంపారే=వాచాతీతవిషయమందు, జయతి=సర్వోత్కృష్టముగానున్నది. పశ్య=చూడు? (మందాక్రాంతావృత్తము.)

తా. ఆమహావిష్ణువు శ్రీరామావతారమున కాకాసురుఁడు తనచేతనె బ్రహ్మాస్త్రహతుఁడై నిత్యసుఖ మనుభవించునట్లును, జటాయువు రావణబాణహతుఁడై తనచేతనె సంస్కరింపఁబడి నిత్యానందమనుభవించునట్లును, గుహుఁడు తనయందలి భక్తిపారవశ్యముచేత నిత్యవిభూత్యానంద మనుభవించునట్లును, సుగ్రీవ విభీషణులును తనయందలి భక్తిపారవశ్యముననే పట్టాభిషిక్తులై సకలానందము లనుభవించునట్లును జేసినయతని దయాళుత్వ మిట్టిదని యెవరికిఁగాని వాక్రువ్వవలను గాదుగదా!

మఱియునొకటి.—

ఉ. కాకము శోకముంగడవఁ, గద్దయ? యిద్దయ, చీఁకుగద్దయీ
లోకములన్నియుంగడవ, గలోఁదమఖేదమమాని, మానితం
బౌ కుశలంబుబోయఁగన, గనద్దిర? తద్ధరి కోఁతిభూతముల్
సేకొనెఁ బ్రాజ్యరాజ్య, మెటు సేసెనొ చూ? మ్మభిరామరాముఁడై.

టి. కద్దయ=కద్దు అయ్యా? ఇద్దయ=ఇట్టిదయ, తమఖేదమ=(కాకగృధ్రకిరాతులు) తమదుఃఖమే, అద్దిర=ఆహా! తద్ధరి=ఆహరి, కాకము=కాకాసురుఁడు-ఇంద్రపుత్రుఁడయిన జయంతుఁడు, గద్ద=జటాయువు-అనూరుపుత్రుఁడయిన పక్షిరాజు, బోయ=గుహుఁడు—శృంగిబేరమున కిరాతరాజు, కోఁతి=సుగ్రీవుఁడు కిష్కింధయందు వాలి సోదరుఁడైన వానరరాజు, భూతము=విభీషణుఁడు—లంకయందు రావణసహోదరుఁడయిన రాక్షసరాజు.

కాకాసురుడు.—వీఁడు గర్వముతో బుద్ధిహీనుఁడై సీతోరస్థలమును పొడిచి, ఒంటికంటిచూపుతో పడి పాఱిపోయినవాఁడు. వీఁడె దేవేంద్రునకు జ్యేష్ఠపుత్రుఁడై సకలాభరణములవలెె సుందరుఁడని పేరందిన జయంతుఁడనువాఁడు.

జటాయువు=గృధ్రరాజు —ఇతఁడు కశ్యపునిపౌత్రుఁడు,అనూరునిపుత్రుఁడు, పంచవటియందు రావణుఁడు సీతనెత్తుకొని పోవునపుడు అడ్డగించి వానిచే వధింపఁబడి శ్రీరాములచేతులారనె పంచసంస్కారములు చేయఁబడినవాఁడు.

కిరాతుఁడు.— గంగాతీరమున శృంగిబేరమను పురమునకు రాజు, ఇతఁడు గంగను పడవతో దాఁటించి శ్రీరామానుగ్రహమునకు పాత్రుఁడై పరమభక్తుఁడైన కిరాతరాజు.

సుగ్రీవుఁడు.— ఇతఁడు వానరరాజు, ఋక్షరజునికొమారుఁడు, ఈఋక్షరజుఁడు పార్వతీశాపముచేత పురుషులు స్త్రీలౌనట్టి కొలనిలో స్నానముచేసి స్త్రీయై సూర్యునివలన రేతస్సు గ్రీవమునపడి సుగ్రీవుఁడనుపేరితో పుట్టినవాఁడు.

విభీషణుఁడు.—రావణుని రెండవతమ్ముఁడు, ఇతఁడు సీతను శ్రీరామున కొప్పగించి శ్రేయోవంతుఁడవు కమ్మని బహువిధములఁ జెప్పియు, ఆరావణుఁడు వినక తన్నవమానించినందున; తా నాశ్రీరామునె శరణాగతిచేసి, ఆతని యభయప్రదానమునుగొని,రావణానంతరము లంకారాజ్యమునకు పట్టాభిషిక్తుఁడై సప్తచిరంజీవులలో నొకఁడుగా నుండువాఁడు. (చిరంజీవులు—అశ్వత్థామా, బలీ, వ్యాసో, హనుమాంశ్చ, విభీషణః, కృపః, పరశురామశ్చ సప్తైతే చిరజీవినః.)

౯. తదేవందేవపరిబృఢేదయాపయోనిధావపి ఉపన్యస్తంనైర్ఘృణ్యంతవతావదనై పుణ్యమపుణ్యఫలంబుద్ధేః పిశునయతి. 29

అ. తత్=కనుక, ఏవం=ఇట్లు,దయాపయోనిధౌ=దయాసముద్రుఁడయిన, దేవపరిబృఢే=సకలదేవప్రభువునందు, ఉపన్యస్తం = ఆరోపింపఁబడిన, నైర్ఘృణ్యం=నిర్దయత్వము, తవ=నీయొక్క, బుద్ధేః=బుద్ధికి, అపుణ్యఫలం= పుణ్యమునకు ఫలముకాని, అనైపుణ్యం=నిపుణత్వములేమిని, పిశునయతి = సూచించుచున్నది.

తా. పరమదయాళువైన పరమపురుషునియందును దయాహీనతను చెప్పుట నీనేర్పులేనితనమునె తెలుపుచున్నది.

వ. కాఁబట్టి యిట్టి వాచామగోచరంబయిన దయను గడలి కరణింగలిగి వేలుపుల ప్రభువగు పరమపురుషుని విషయమున

సయితము నీనిర్ధరించు నిర్దయతావచన, మభాగ్యమునకు ఫలమయిన నీబుద్ధి సామర్థ్యము లేమికే సూచన మగుచున్నయది.

శృణుతావత్.—

శా. జీవానాం దృషదాదిమత్వ మయతాం స్వర్గాపవర్గాస్పదమ్
దేహం దత్తవతి శ్రియఃప్రియతమే నైవోపకారస్మృతిః।
దుఃఖే జాతుచి దాగతే స్వకలితా ద్దుష్కర్మణః పక్త్రిమా
న్నాథే హంత? నిరాగసి వ్యసనిభి ర్నైర్ఘృణ్యమారోప్యతే॥

అ. దృషత్+ఆదిమత్వం=ఱాయి+మొదలగునవి యగుటను, అయతాం=పొందుచున్న, జీవానాం=ఆత్మలకు, స్వర్గ+అపవర్గ + ఆస్పదం=స్వర్గమునకును + మోక్షమునకును + ఆధారమైన, దేహం=శరీరమును, దత్తవతి=ఇచ్చుచున్న, శ్రియఃప్రియతమే=లక్ష్మీపతియందు, ఉపకారస్మృతిః=ఉపకారముతలంచుట, నఏవ=లేనేలేదు. స్వ+కలితాత్=తనచేత+చేయఁబడిన, పక్త్రిమాత్=ఫలకారియగు, దుష్కర్మణః=దుష్కృత్యమువలన, దుఃఖే=దుఃఖము, జాతుచిత్=ఒకానొకప్పుడు, ఆగతేసతి=వచ్చినట్టులయిన, వ్యసనిభిః=ఆదుఃఖముగలవారిచేత, నిరాగసి=నిరపరాధుఁడైన, నాథే = ఆజగన్నాథునియందు, నైర్ఘృణ్యం=నిర్దయత, ఆరోప్యతే=ఆరోపింపఁబడుచున్నది. హంత=అయ్యో?

తా. పాషాణపశ్వాది దేహధారులకుఁగూడ కర్మజ్ఞానములవలన స్వర్గమోక్షములిచ్చు నాజగదీశ్వరునియం దుపకారము తలంచకున్నను, తాము పడెడు దుఃఖకర్మలలో నాతనియందే లేనినిర్దయను తెచ్చిపెట్టుచున్నారే. అయ్యో?.

వినుమంతయును.—

ఉ. ఱాలుగ నప్పగాఁ బొడమి కాఱట్టొడిగట్టిడి ప్రాణికోటికిన్
వాలుగ సర్వదేహ మపవర్గము స్వర్గము నిచ్చునచ్యుతుం
బోలఁగ నెన్నకున్నఁ దమకేపొందెడిదుఃఖముపట్ల నిట్లమే
జోలియులేనివానిపయిఁజోప్పడఁ దప్పిదుమందురక్కటా?

టి. ఱాలుఱప్పగాన్=అహల్యాది శిలారూపముగ, వాలుగన్=అతిశయముగ, పోలఁగన్=చక్కఁగ, చొప్పడన్=స్పష్టముగ.

గ. హంత? జంతవః పామరాః స్వాపరాధం పరమకారుణికే పర
స్మిన్ బ్రహ్మణ్యధ్యస్యంతి. 31

అ. హంత=అయ్యో? పామరాః=నీచులైన, జంతవః=జంతువులు, స్వాపరాధం=తమయపరాధమును, పరమకారుణికే=అతిదయాళువైన, పరస్మిన్ బ్రహ్మణి=పరబ్రహ్మయందు, అధ్యస్యంతి=ఆరోపించుచున్నారు.

వ. అయ్యో? అట్లుపామరులు పరమకారుణికుఁడయిన పరబ్రహ్మ
మందుఁ దమతమయపరాధము లధ్యవసించుచున్నారలు.

తథాహి.—

శా. క్లేశత్యాగకృతేఽర్పితేన కరణవ్యూహేన దేహేనచ
స్వానర్థం బత? జంతురార్జయతిచేన్మంతుర్నియంతుః కుతః।
శస్త్రే శత్రుజయాయ నైజ గురుణాదత్తేఽథ తేనైవచేత్
పుత్త్రోఽహంతి నిజంవపుః కథయరే తత్రాపరాధీతుకః? 32

అ. క్లేశ+త్యాగకృతే=కష్టములను+విడుచుటకొఱకై, అర్పితేన=ఇయ్యఁబడిన, కరణ+వ్యూహేన=(చక్షురాది) సాధనములయొక్క+సమూహముచేతను, దేహేనచ=దేహముచేతను, జంతుః=జీవుఁడు, బత=అయ్యో! స్వ+అనర్థం=తనకే+చెఱుపును, ఆర్జయతిచేత్=సంపాదించుకొనుచున్నాఁడేని, నియంతుః=నియామకుఁడైన ఆసర్వేశ్వరునికి, మంతుః=అపరాధము, కుతః=ఎందువలన కలుగుచున్నది? శస్త్రే=ఆయుధము, శత్రు+జయాయ=శత్రువులను+జయించుకొఱకై, నైజగురుణా=తనతండ్రిచేత, దత్తేసతి=ఈయఁబడినదైనయెడల, అథ=ఆవెన్క, తేన+ఏవ=ఆయాయుధముచేతనే, పుత్రః=కుమారుఁడు, నిజం+వపుః=తనదైన+దేహమును, హంతిచేత్=కొట్టుచున్నాఁడేని, రే=అరే? తత్ర=వారిలో, అపరాధీతు=అపరాధముకలవాఁడో, కః=ఎవఁడు? కథయ=చెప్పుము?

తా. శత్రువులను జయించుటకై తండ్రియిచ్చిన యాయుధముతో కొడుకు తానే తనదేహమునే కొట్టుకొనునట్లు; సర్వకష్టములను తొలఁగించుకొనుటకై సర్వేంద్రియములతో నీదేహము నాసర్వేశ్వరుఁడీజంతుజాలమున కీయఁగా, అదియది దానిదానిచేత తనతనకే యనర్థమునుకూడ తెచ్చుకొనుచున్నదే? అది దానిదానితప్పా? ఆయిచ్చిన సర్వేశ్వరునితప్పా?

అట్లేకద?.—

చ. కరణకళేబరంబు లిటు కై కష్టము నష్టము కాఁగనీఁగఁ, దాఁ
గరమవె కొంచుఁ గ్రించుకడ కై కష్టమునిష్టముగాఁగ రేఁగ, నీ
శ్వరునిదెతప్పు? తండ్రియరి కై వైవనపుత్రునకియ్యనయ్యసిఁ
శిరమునెదూసి వేసికొనఁ కై జెప్పుమి? యొప్పమి యేనిదానురా?

టి. కరము=మిక్కిలి, అవె=ఆకరణకళేబరములనె, క్రించు = నీచుఁడు, అరిఁ=శత్రువును, వైవఁ అ=వేయుటకే, అయ్యసిఁ=ఆఖడ్గముచేత, ఒప్పమి=అనిష్టము-దోషము. (దృష్టాంతాలంకారము.)

కిం బహునా.—

శా. శాస్త్రంభూరి నిజస్వరూపమతయే స్వారాధనార్థం వపుః
స్వధ్యానాయ మనశ్చ బుద్ధి మనఘాం లబ్ధుంచ తీర్థాదికమ్।
తత్త్వాన్యప్యుపదేష్టు ముత్తమగురూన్ దత్వాఽనుగృహ్ణాతినః
సంసారే తదపి భ్రమేమ యది కిం కుర్వీత సర్వేశ్వరః॥ 33

అ. సర్వేశ్వరః = జగదీశ్వరుఁడు, నిజ+స్వరూప+మతయే=తన+స్వరూపమందు+జ్ఞానమునకై, భూరి=విశేషమైన, శాస్త్రిం=శారీరసూత్రాదిశాస్త్రిమునుఁ; స్వ+ఆరాధనార్థం=తన్ను+ఆరాధించుటకై, వపుః=శరీరమునుఁ; స్వ+ధ్యానాయ=తన్ను+ధ్యానించుటకై, మనఃచ = మనస్సునుఁ, తీర్థాదికంచ=తీర్థాదులనుఁ, లబ్ధుం=లభించుటకై, అనఘాం=నిర్దోషమైన, శుద్ధిం=పరిశుద్ధినిఁ; తత్త్వాని+అపి = ఉపనిషదాది తత్వములనుకూడ, ఉపదేష్టుం=ఉపదేశించుటకై, ఉత్తమగురూన్=గురుశ్రేష్ఠులను; దత్వా=ఇ

చ్చి, నః=మనలను, అనుగృహ్ణాతి = అనుగ్రహించుచున్నాఁడు. తత్ అపి=అద ట్లుండియు, సంసారే=సంసారములో, భ్రమామయది=తిరుగులాడుచుంటి మేని, సర్వేశ్వరః=ఆసర్వేశ్వరుఁడు, కింకుర్వీత=ఏమిచేయును?

తా. సర్వేశ్వరుఁడు మనకు స్వస్వరూప పరస్వరూపములను తెలిసికొనుట కై శారీరశాస్త్రాదులను, తన్నారాధించుకొనుచు పరిచర్యాపరుఁడై యుండు టకై యీపాంచభౌతికశరీరమును, తన్ను ధ్యానించి యానందించుకొనుటకై అంతరింద్రియమును, సకలతీర్థాదులు లభించుటకై తాత్కాలిక సాత్త్విక శు ద్ధివిశేషమును, సకలోపనిషదాగి తత్త్వవిశేషముల నుపదేశించుటకై యాచార్యు లనుఁ అనుగ్రహించి యుండఁగా;మన మాపూర్వకృతకర్మానుసారముగా నిట్లు సంసారసముద్రములోపడి చెడుచుంటి మేని; అజగదీశ్వరుఁ డేమిచేయఁగలఁడు. విశేషము (చెప్ప)నేల?

మ. తనరూపుఁ దెలియఁ దనుఁ గొలువఁ, దఁ దధ్యానింపఁ,దీర్థా
దులిం । పున సేవింపఁ, బరత్వతత్వములపొల్పుఁ దెల్పఁ; నా
శాస్త్రముఁ । దనువుఁ, జిత్తము, సత్వశుద్ధియు, గురుఁ,దా
మోదరుం డిచ్చియుఁ । దనుఁగా సంసృతిఁ జిక్కి స్రుక్కి
సుడియఁ దా నేమిచేయుఁ జనున్.

టి. తీర్థాదులు=దివ్యతీర్థ దివ్యదేశాదులను, పరత్వతత్వముల పొల్పుఁ = భగ వత్పరత్వతత్వములవై భవమును,సంసృతిఁ =సంసారములో,(క్రమాలంకారము.)

భూలోకవర్ణనము.

(ఇది-పదునాలుగులోకములం దూర్ధ్వలోకము లేడింటిలో మొదటిదియు, అధోలోకము లేడింటికి పైదియు, సప్తసముద్రములకు నడిమిదియు, సకలవిధ లోహరత్న నదీనదపర్వతాదుల కాస్థానమును, సకల భగవదవతార భగవద్వి గ్రహాదుల కాస్థానమునైన మానవలోకము.)

గ. (ఇతి పరిక్రామఁ కించిదుత్తర ముపసృత్యాభస్తా దవలోక్య
చ) సఖే? సకలపురుషార్థ సాధనానుష్ఠాన సాధనభూతం తా
వదవలోకయ భూలోకమ్. 34

అ. (ఇతి=ఇట్లని, పరిక్రామన్=(విమానమును) నడుపుచు, కించిత్ + ఉత్తరం= కొంచెము+ఉత్తరముగ, ఉపసృత్య=జరిగి, అధస్తాత్ చ = క్రిందుగాను, అవలోక్య=చూచి,) సఖే= ఓస్నేహితుడా! సకలపురుషార్థ+సాధన +అనుష్ఠాన+స్థానభూతం=సమస్తపురుషార్థములకును+సాధనములైన క్రియలయొక్క+అనుష్ఠించుటలకు+ఆధారభూతమైన, భూలోకంతావత్ = భూలోకమును, అవలోకయ=చూడుము ?

వ. (జగత్సంహృతిప్రభృతియగు సర్వమున్ గర్మాధీనముగాని, భగవానునికార్యముకాదు. కావున,నతనికి లేశమైనను గరుణాహీనత గలుగదని వాక్రుచ్చి)(విమానంబు వోనిచ్చుచుంగొంచె ముదీచికిం జనుదెంచి, దిగువ నవలోకించి), సఖా? సకల పురుషార్థసాధనంబైన యీభూలోకంబు నాలోకింపుమని

టి. పురుషార్థములు—ధర్మ, అర్థ, కామ, మోక్షచతుష్టయము.

భువమవలోక్య.

శా. స్వర్గౌకోభిరధోనివాసిపురుషారబ్ధాతిశుద్ధాధ్వర
స్వాహాకారవషట్క్రియోత్థ మమృతం స్వాదీయ ఆదీయతే।
ఆమ్నాయప్రవణై రలంకృతిజుషేఽముష్మై ర్మనుష్యైశ్శుభై
ర్దివ్యక్షేత్రసరిత్పవిత్రవపుషే దేవ్యై పృథివ్యై నమః॥ 35

అ. స్వర్గ+ఓకోభిః = స్వర్గమే+వాసస్థానముగాఁగల దేవతలచేత, అధోనివాసి+పురుష+ఆరబ్ధ+అతిశుద్ధ+అధ్వర+స్వాహాకార వషట్క్రియా+ఉత్థం=ఈభూలోకవాసులైన+పురుషులచేత+ప్రారంభింపఁబడినవై+ అతిపరిశుద్ధములైన+యజ్ఞములయందలి + స్వాహాకారవషట్కారములతో+ఎత్తినటువంటిదైన, స్వాదీయః=రుచ్యమైన, అమృతం = హవ్యము, ఆదీయతే=తీసికోఁబడుచున్నదో, ఆమ్నాయ+ప్రవణైః = వేదములందు+ప్రావణ్యముగలవారై, శుభైః=పవిత్రులైన, మనుష్యైః=మనుష్యులచేత, అలంకృతిజుషే=అలంకారమును బొందునదియు, దివ్యక్షేత్ర+సరిత్+పవిత్ర+వపుషే=దివ్యక్షేత్ర

ములచేతను + దివ్యనదులచేతను+పరిశుద్ధమైన + శరీరముగలదియునైన, అము ష్మై=అట్టి ఈ, పృథివ్యై దేవ్యై=భూదేవికొఱకు, నమః=నమస్కారము.

తా. దేవతలకు హవ్యములు నివేదించుటకై యజమానాపచారములేక స్వాహాకారవషట్కారములతోడి యాగములుచేయుచు, వేదవిహితములైన సదాచారము లాచరించుచుండు యాజ్ఞికాదులును, బదరికాశ్రమ నైమిశారణ్యాది దివ్యక్షేత్రములును, భాగీరథీ సరస్వత్యాది దివ్యతీర్థములును తనకు శరీరాలంకారములుగాఁ గలిగి ప్రకాశించుచుండు నీభూదేవికి నమస్కారము.

భూమినిగని:— శార్దూలయుగ్మకము.

శా. ద్యోలోకం బనునూర్ధ్వలోకమున వి శ్వ ద్యోతస్థితు ల్దేవతల్
భూలోకం బనునీదులోకమునను శ్వద్భ్యాతు ల్నరు ల్యాగముల్
వాలాయంబుగఁ జేయ, నాయమృతముల్ శ్వ స్వాహావషట్కా
రముల్,సాలావీనులవిందు సేయఁగొనుటల్ శ్వసద్వేదవిద్యాళు,ల
ట్లోలిన్ వేదవిదాళులున్,మఱియ నేశ్వకోద్యన్మహాక్షేత్రముల్
కూలోన్మాలములోనదుల్మఱియుఁ బేశ్వర్కోఁ జాలుపుణ్యాటవుల్
హాళిన్ గ్రాలుట చేతఁ బూతయగు దాశ్వహా!భూతధాత్రీ!జోహా
రే! లీలాశుభగాత్రి! ధాత్రి ! యిదెనీ శ్వ కీనీకు సాష్టెవ్వారే?

టి. ద్యోలోకము=స్వర్గలోకము, వాలాయము = మిక్కిలి, అమృతము= హవిర్భాగము, ఓలిన్ =వరుసగా, వేదవిత్ +ఆళులు = వేదవేత్తల+సమూహములు, ఉద్యత్ = అతిశయించునట్టి, కూల+ఉన్మాలములు=గట్టను+మీఱిపాఱునట్టివి, హాళిన్ =సంతోషముతో, పూత=పవిత్రమైనది, భూతధాత్రీ=సకలభూతములను ధరించుదానా ? స్వాహాకారవషట్కారములు = దేవహవిర్దాన అగ్నిహవిర్దానములు.

కృశాను:—

గ. ననుసఖే ! నాకగతోఽపిభవాన్ నమధ్యమలోకం నమస్కారుమ ర తి.

అ. నను=మంచిది; సఖే=సఖుఁడా! భవాన్ = నీవు, నాకగః + అపి= స్వర్గలోకమందుండువాఁడవు + అయ్యును, మధ్యమలోకం = త్రిలోకములలో మధ్యలోకమైన భూలోకమును, నమస్కర్తుం = నమస్కరించుటకు, న + అర్హతి = తగవు

కృశానుఁడు.—

వ. సురేసఖా ! నీ వూర్ధ్వలోకమునందుండి యీ నసిలోకమును నమస్కరింపఁ దగియుండినాఁడవు కావు.

తథాహి.—

హ. జననమరణక్వాధివ్యాధిప్రభేదశుభేతరా
కలనమలినాలోకా శ్శోకాతురాశ్చ భువంగతాః।
తదిహమదిభిః క్షుద్రైశ్ఛిద్రైకమార్గణతత్పరైః
ప్రభుభిరుదితక్షైత్యక్షైత్యై బుధస్స్పృహయేతకః॥ 37

అ. లోకాః=జనులు, భువం=ఈభూమిని, గతాః= పొందియుండువారై, జనన + మరణ + క్వాధి + వ్యాధిప్రభేద + శుభేతర + ఆకలన + మలినాః= జన్మముతోను + మరణముతోను + సంతాపములయు + రోగభేదములయు + అశుభములయు + సంబంధముచేత + అపరిశుద్ధులై, శోక + ఆతురాః + చ=దుఃఖముచేత + పీడితులును (అగుచున్నారు). తత్ = కనుక, ఇహ = ఇక్కడ, బుధః= జ్ఞానియైనవాఁడు, కః=ఎవఁడు, ఛిద్ర + ఏక + మార్గణ + తత్పరైః=దోషములను + ముఖ్యముగా + వెదుకుటయందు + ఆసక్తులును, క్షుద్రైః = నీచులును, మదిభిః=అహంకారులునైన, ప్రభుభిః=ప్రభువులచేత, ఉదిత + క్షైత్యై=పుట్టిన హానికలదియైన, క్షైత్యై=ఈభూమికొఱకు, స్పృహయేత = కోరును ? (హరిణీవృత్తము. ఛేకానుప్రాసము.)

తా. జను లీభూలోకమునఁ బుట్టియుఁ జచ్చువా రగుటయే కాక, వ్యాధి మొదలైనవానివలని దుఃఖముచే పీడింపఁబడుచుండియు; పరులదోషములనే వెదుకుచు, అహంకారపడుచు, క్రొవ్వుపట్టియుండు నిట్టినీచప్రభువులవలన హాని

పొందుచుండునట్టి యీభూమికిఁగాను, మనస్వర్గలోకములో జ్ఞానము కల వాఁ డేవాఁడు తలంచుచున్నాఁడు ?

అటులేకదా?

మ. జననంబుల్ మరణాంబు తాపమురుజల్ శోచక్రంబునంబోలెఁద్రి
ప్పను ద్రిప్పన్ భువిఁద్రిప్పంగన్ బడిజడుల్ శ్రాపింతు రెంతేవగల్
కని, యే ప్రాజ్ఞుఁడు క్షోణిదీనిమదిలోఁ గాంక్షించుఁ ?ప్రత్యక్షులై
చెనఁటుల్ మత్తులుహీనచిత్తులు ప్రభుల్ క్షీణింపఁ జేయన్ క్షితిన్.

టి. రుజలు=రోగములు, జడులు=అజ్ఞులు, వగలు=దుఃఖములు, ప్రాపింతురు=పొందుదురు, ప్రాజ్ఞుఁడు=ప్రజ్ఞావంతుఁడు, క్షోణిన్=భూమిని, కాంక్షించున్=కోరును, క్షితిన్=భూమిని.

కించ.—

మం. బాలత్వేవా తరుణిమనివా ప్రాయశో వార్ధకేవా
మృత్వామర్త్యాబత? యమభటైర్మథ్యమానావ్యథంతే।
శ్రేయస్తేషా మమితవిపదాం జీవతాం వా కిమాస్తే?
కస్మిన్ గ్రామే పున రనడుహాం కర్షణక్లేశహానిః॥ 38

అ. ప్రాయశః=బహుగా, బాలత్వే,వా = పసితనమునఁగాని, తరుణిమనివా=యౌవనమునఁగాని, వార్ధకేవా=ముసలితనమునఁగాని, మర్త్యాః=మనుష్యులు, మృత్వా=చచ్చి, బత=అయ్యో? యమభటైః=యమదూతలచేత, మథ్యమానాః=బాధింపఁబడుచుండువారై, వ్యథంతే=దుఃఖపడుచున్నారు. తేషాం=అట్టి, అమిత+విపదాం=అధికమైన+ఆపత్తులుగలవారై, జీవతాంవా=జీవించువారికైన, శ్రేయః=శ్రేయస్సు, అస్తే+కిం=ఉన్నదా? అనడుహాం=ఎద్దులకు, పునః=మఱలమఱల, కర్షణ+క్లేశ+హానిః=దున్నుటయందలి+కష్టముయొక్క+విడుపల, కస్మిన్ గ్రామే=ఏగ్రామమందు, అస్తి=ఉన్నది? (మందాక్రాంతావృత్తము.)

తా. ఎద్దులకు ఎప్పుడు దున్నెడుకష్టము కలిగియుంకినను, ఒకప్పుడైన వానికాకష్టము విడుదలయే లేకుండునట్లు, ఎప్పుడో ఒకవేళ చచ్చి, యమదూతల

చేత బాధపడువారికి వారిజీవితకాలములో వా రాపద లనుభవించునపుడైన, కొంచెము క్షేమమైనఁ గలుగుటలేకుండెనే? (అలం-దృష్టాంతము.)

మఱియు.—

తే. బాల్యమందైన నెందైనఁ బ్రజలుఁ జచ్చి
జమునిబారిఁ బ్రబతికి విప త్సమితిబారిఁ
బడియెదరుగాని, శ్రేయంబుఁ బడయుటరిది;
దుక్కి టెద్దులకష్టంబుఁ దొలఁగుటరిదె.

టి. విపత్+సమితి+బారిఁ=ఆపత్తుల+సమూహముయొక్క+ఉపద్రవములో.

విశ్వావసుః.—

గ. సత్యమేవ తథాపి సఖే? మహాశ్రయం మానుషజన్మమాదుదుషః॥ 39

అ. సత్యం+ఏవ=యథార్థమే, తథా+అపి=అట్లైనను, సఖే=ఓస్నేహితుఁడా! మహీ+ఆశ్రయం=భూమియే+స్థానము గాఁగల, మానుష+జన్మ=మనుష్యుల+జన్మమును,మా+దుదుషః=దూషింపకుము.

విశ్వావసువు.—

వ. నిజమేయైన, ఓయిసఖా! ఈయవనియే స్థానమైన యీమానుషజన్మమును దూషింపకుము?

స్ర. రామఃక్షేమస్యదాతాభువి నను మనుజో రావణస్య ప్రహర్తా
తత్త్రాతః కిం నమర్త్యస్త్రిదశకులపతే ర్దైత్యయుద్ధే సహాయః।
కృష్ణోవృష్ణోమదం యోఽహరతనరతయానశ్రుతః కిం త్వయాఽసౌ। కేవా దేవాః ప్రభావా త్స్వమమతిశయితామానవా ద్దానవావా॥ 40

అ. భువి=ఈభూమియందు, రావణస్య=రావణాసురునకు, ప్రహర్తా=సంహారకుఁడైన, రామః=శ్రీరాముఁడు, క్షేమస్య=క్షేమమునకు, దాతా=సంధాయ

డైన, మనుజః + సను=మనుష్యుఁడు కాదా ? తత్ + తాతః=ఆరామునిం తండ్రి, త్రిదశ + కుం + పతేః = దేవతల + సమూహమునకు + ప్రభువయిన యింద్రునకు, దైత్య + యుద్ధే= రాక్షసులతోడి + యుద్ధమందు, సహాయః=సహాయుఁడు, న + కిం = కాఁడా? యః=ఎవఁడు, నరతయా=మనుష్యత్వముతో, వృష్ణః=దేవేంద్రునియొక్క, మదం=గర్వమును,అహరత=హరించెనో? అసౌ= అట్టియీ, కృష్ణః=శ్రీకృష్ణుఁడు, త్వయా=నీచేత, శ్రుతః=వినఁబడినవాఁడు, న + కిం=కాఁడా? దేవాః + వా= దేవతలుగాని,దానవాఃవా= దానవులుగాని, స్వయం= తామే, ప్రభావాత్ = ప్రభావమువలన, మానవాత్ =మానవునికంటె, అతిశయితాః=అతిశయించినవారు, కే=ఎవరు? (స్రగ్ధరావృత్తము.)

తా. లోకకంటకుఁడైన రావణాసురునిసంహరించి సర్వత్ర క్షేమము నిచ్చుచుండిన యా శ్రీరాముఁడుగాని, అతనితండ్రియై రాక్షసులయుద్ధమం దింద్రాదులకు సహాయుఁడై యుండిన దశరథుఁడుగాని, గోవర్ధనోద్ధరణాదులచేత ఆ యింద్రునే గర్వమణఁచిన యా శ్రీకృష్ణుఁడుగాని మనుష్యులుకారా? ఈమనుష్యులకంటె ఆదేవతలుగాని, ఆదానవులుగాని తాముగానే ప్రభావాతిశయులు ఎవరు? (ఆరామకృష్ణాదులు భగవదవతారు లగుటచేత అట్టివారైనను, తక్కినవా రట్టివారున్నారా? అనుకొందురని తోఁచి యిట్లు చెప్పెను.)

కించ.—

శా. మాన్ధాతాచ భగీరథశ్చ సగరోమాన్యః కకుత్స్థో రఘుః
పూరుస్సోఽపిపురూరవా స్సచశిబిః పుణ్యశ్చ రుక్మాఙ్గదః।
వైదేహో నహుషశ్చ హైహయపతి ర్వీరోయయాతి ర్నలః
పార్థ శ్చేతి నృపాః ప్రశ స్తయశసః ప్రాదుర్బభూవుర్నకిమ్॥ 41

అ. మాంధాతాచ=మాన్ధాతృచక్రవర్తియు, భగీరథఃచ=భగీరథ మహారాజును,సగరః=సగరచక్రవర్తియు,మాన్యః=పూజ్యుఁడైన, కకుత్స్థః=కకుత్స్థమహారాజును, రఘుః=రఘుమహారాజును, పూరుః=పూరుఁడనురాజును, సః + అపి+ పురూరవాః=ఆపురూరవశ్చక్రవర్తియు, సచశిబిః=ఆశిబిచక్రవర్తియును,పుణ్యశ్చరుక్మాంగదః=పవిత్రుఁడైన రుక్మాంగద మహారాజును, వైదేహః=విదేహదేశపు

రాశైన జనకమహారాజును, నహుషశ్చ=నహుషమహారాజును, హైహయప తిః=హైహయమహారాజును, వీరః=వీరుఁడైన, యయాతిః=యయాతిమహారా జును, నలః=నలమహారాజును, పార్థశ్చ=పృథాపుత్రుఁడైన ధర్మరాజును, ఇతి= అని, నృపాః=రాజులు, ప్రశస్తయశసః=ప్రసిద్ధమైన కీర్తిగలవారుగా, ప్రాదు ర్బభూవుః=ప్రాదుర్భవించిరి, న+కిం=కారా?

మఱియు.—

సీ. రాముఁడు శ్రేయోభి ♦ రాముఁడు భువినిరా
వణవిరాముఁడు కాఁడొ ♦ మనుజుఁ డిట్లు
అతనితండ్రి దశర ♦ థాధిపుఁ డింద్రుని,
కని సహాయుఁడు కాఁడొ ♦ మనుజుఁ డిట్లు
ఆయింద్రు మదమణ ♦ నాయద్రియెత్తిన
చినికృష్ణుఁడును గాఁడొ ♦ మనుజుఁ డిట్లు,
దేవతలా పూర్వ ♦ దేవత లీమాన,
వులకంటె మహిమోద్భ ♦ వులె తనుంత?
తే. రఘు సగర పూరు శిబి పురూ ♦ రవసులు మఱి
జనక కన కాంగద భగీర ♦ థ నహుష నల
ధర్మరాజులు రాజు లీ ♦ ధరను మనుజు
లుజ్జ్వలత్కీర్తి విస్ఫూర్తి ♦ నుండ లేదె.

టి. ఇంద్రునికని సహాయుఁడు—ఇంద్రునికిన్ + అనిన్+సహాయుఁడు = దేవేంద్రునికి యుద్ధములో సహాయుఁడు, మహిమ+ఉద్భవులు=ప్రభావముతోడి +జన్మముకలవారు, ఉజ్వలత్+కీర్తి+విస్ఫూర్తిన్ = ప్రకాశించు+కీర్తి యొక్క+ప్రకాశముతో.

శ్రీరాముఁడు—ఈయన సూర్యవంశమున దశరథునిపుత్రుఁడు, అరణ్యము నకుపొమ్మన్న తండ్రివాక్యపరిపాలనమే కారణముగాఁజేసికొని రావణాది దుష్టులను శిక్షించి విభీషణాదిశిష్టులను రక్షించిన మహావిష్ణువు.

దశరథుఁడు—అజమహారాజుపుత్రుఁడు, శ్రీరాములతండ్రి, ఇతఁడు ఇంద్రునకు! సహాయముగ పోయి శంబరాదులను జయించినమహారాజు.

శ్రీకృష్ణుఁడు—ఈయన యదువంశమున వసుదేవునిపుత్రుఁడు, పాండవకౌరవులను సంధి చేయునపుడు విశ్వరూపమును జూపి అర్జునునకు పరమయోగశాస్త్రము నుపదేశించిన నారాయణుఁడు.

మాంధాత—ఇతఁడు ఇక్ష్వాకుమహారాజువంశస్థులలో మహాకీర్తిఁ జెందిన చక్రవర్తి, యవనాశ్వునికొడుకు, బిందుమతి పెనిమిటి, అంబరీష పురుకుత్స ముచికుందులతండ్రి.

భగీరథుఁడు—సూర్యవంశమున నే దిలీపునిపుత్రుఁడు, దేవగంగను భూలోకముగుండ పాతాళలోకమునకు గొనిపోయి తనపితామహులైన సగరపుత్రులను పవిత్రపఱచిన చక్రవర్తి.

సగరుఁడు—సూర్యవంశమున నే బాహుకునికుమారుఁడు, షట్చక్రవర్తులలో నొకచక్రవర్తి.

కకుత్స్థుఁడు—(కకుత్ + స్థుఁడు=మూఁపురముమీఁద + ఉండువాఁడు)సూర్యవంశమున నే ఇక్ష్వాకుమహారాజుపౌత్రుఁడు, వికుక్షిరాజుపుత్రుఁడు, ఇతఁడు విష్ణువనుమతింబున వృషభరూపుఁడైన దేవేంద్రునిమూఁపురము నెక్కికొని రాక్షసులతో యుద్ధముచేసి యీపేరుగలవాఁడయ్యెను.

రఘువు—సూర్యవంశమున నే దీర్ఘబాహునికొడుకు, అజమహారాజుతండ్రి.

పూరువు—యయాతి శర్మిష్ఠలపుత్రుఁడు, అన్నలు శాపముచేత రాజ్యార్హులు కాకుండ తానే రాజ్యార్హుఁడై యుండినరాజు.

పురూరవుఁడు—బుధునిపుత్రుఁడు, ఇతఁడు ప్రతిష్ఠానపురమున చక్రవర్తిగా రాజ్యపరిపాలనచేయుచు తనచేయుయజ్ఞమందు మంత్రమూలముగ ఆహవనీయాది రూపమున పుట్టిన జాతవేదాగ్ని చేత తాను పుణ్యలోకప్రాప్తుఁడయినవాఁడు.

శిబి—ఉశీనరునిపుత్రుఁడు, ఇతఁడు పావురముగా పాఱివచ్చినయగ్నిని డేగగా నెగిరివచ్చి [illegible] తనతొడమాంసమునే కోసియిచ్చినచక్రవర్తి.

రుక్మాంగదుఁడు— విదిశాపట్టణమునకు మహారాజు, సంధ్యావళి పెనిమిటి, ధర్మాంగదునితండ్రి; ఇతఁడు ఉత్తమమయిన యేకాదశీవ్రతము నాచరించిన పరమభాగవతోత్తముఁడు.

జనకుఁడు—విదేహదేశమున మిథిలాపట్టణపుచక్రవర్తి, సీతాదేవితండ్రి, ఇతఁడు సంసారమును వదలకయే ముక్తి చెందిన మహాజ్ఞాని.

నహుషుఁడు—పురూరవునిపౌత్రుఁడు, ఆయువుపుత్రుఁడు; ఇతఁడు ఇంద్రునికి సహాయముగా కొంతకాలము స్వర్గలోకమున రాజ్యపరిపాలన చేయుచుండినవాఁడు.

హైహయుఁడు—నర్మదాతీరమున కార్తవీర్యార్జునుఁ డేలుచుండిన హైహయము అనుదేశము నేలుచుండినవాఁడు.

యయాతి—నహుషునకును ప్రియంవదకును పుత్రుఁడు, దేవయానవలన యదువు తుర్వసువునుఁ; శర్మిష్ఠవలన అనువును, పూరువును ద్రుహ్యునిం గన్నతండ్రి; ఇతఁడు మహాప్రఖ్యాతితో రాజ్యము చేయుచుండినవాఁడు.

నలుఁడు—నిషధదేశపుచక్రవర్తి, వీరసేనునికొడుకు, దమయంతి పెనిమిటి, ఇంద్రసేనునితండ్రి ఇతఁడు తానుచేయుయజ్ఞములందు ఇంద్రుఁడితరు లక్కఱలేక తానేహవిర్భాగములుకొనునట్లును, అగ్నికట్టెలులేకయే గడ్డిపఱక లొక్కసారి విసరినంతనే జ్వలించునట్లును, యముఁడు తద్ధర్మములందె బుద్ధినిలుపునట్లును, వరుణుఁడు కొంతజలమే వాడనువాడను ఎంతోయుబికివచ్చునట్లును, కుబేరుఁడు కొంచెపుధనమునైనను మించ సెలవు చేయను జేయను మిగుల మించిపోవునట్లును వరములు పొంది సత్యము తప్పక నడుచుకొనుచుండినరాజు.

ధర్మరాజు—పాండురాజుపుత్రుఁడు, పంచపాండవులలో మొదటివాఁడు, తల్లి కుంతి, ఈమెకు పృథ అనియు పేరు, కనుకనే యాపృథకు పుట్టినవారు పార్థులనియుఁ చెప్పఁబడుదురు. అయినను అర్జునునకుమాత్రము పార్థుఁడని రూఢనామమయ్యె. ఇతఁడు సభలో సతినైనను శత్రువుల కొప్పగించి నియమముతప్పక సత్యసంధుఁడనియుఁ, ఎవరినిఁగాని యెదిరింపక అజాతశత్రువనియు పేరొకొన్నవాఁడు.

కృశానుః-స్వార్థాంగీకారమ్.—

ఉ. కామం జనాః కేఽపి గుణాభిరామాః
క్షమాతలే సంతు యుగాన్తరేషు ।
కలౌయుగేఽస్మిన్ గుణలేశవన్ధ్యాః
సర్వేఽపి ఖర్వేతరదోషభాజః॥ 42

అ. కామం=తలుచగా, గుణ+అభిరామాః= సుగుణములచేత+మనోహరులైన,జనాః=జనులు,క్షమాతలే=భూమియందు,యుగ+అంతరేషు=వేఱువేఱు యుగములందు, కేఅపి=కొందఱును, సంతు = ఉందురుగాక. అస్మిన్=ఈ, కలౌయుగే=కలియుగమందు, సర్వేఅపి=అందఱును, గుణలేశ+వంధ్యాః = లేశగుణముమాత్రముతోఁగూడ+గొడ్డుపడినవారును, ఖర్వేతర+దోష+భాజః =విశేషములైన + దోషములనే + పొందియుండువారును(అగుచున్నారు).

తా. ఈలోకములో అట్టిమాంధాతాదులు ఆయుగములలో అట్టి సుగుణములు కలవారుగా నుండినను; ఈకలియుగములో అందఱును లేశమైనను సుగుణములేక, సకలదోషములే కలవారై యుండువారు. (ఉపజాతివృత్తము).

కృశానుఁ డర్థాంగీకారముతో.—

క. గుణముల నభిరాములు నిల
గణుతింపఁగఁ బెక్కురుంద్రు కాలాంతరమం
దణువుం గుణముండని జన
గణమే దోషముననుండుఁ గలికాలమునన్.

టి. అభిరాములు=మనోహరులు, ఇలన్=భూమిలో, కాలాంతరమందు=వేఱుకాలములో-పూర్వకాలములో.

కించ.—

వ. మందేతరస్మరమలీమసమానసానామ్
మన్యుస్పృహాదంభమానసమబద్వసానామ్।

కాలేకలౌ కలుషతః కలితోదయానామ్
దోషాయ దృష్టిరపి హంత? దురీశ్వరాణామ్॥ 43

అ. మందేతర + స్మర + మలీమస + మానసానాం=అమందముగా + మన్మథ
నిచేత + మలినమైన + మనస్సుకలవారును, మన్యు + స్పృహా + దురభిమాన +
మద + ఆస్పదానాం=కోపము + లోభము + మోహము + గర్వమును + ఆధారము
లుగాఁగలవారును, కలౌ కాలే=కలికాలమందు, కలుషతః=పాపముతో, కలిత +
ఉదయానాం=కూడుకొన్న + జన్మముకలవారునైన, దురీశ్వరాణాం=దుష్టరా
జులయొక్క, దృష్టిఃఅపి=దర్శనముకూడ, దోషాయ=దోషముకొఱకే, హంత=
అయ్యో? (వసంతతిలకావృత్తము).

తా. ఈకలియుగములో అత్యంతములయిన కామక్రోధలోభమోహమద
మాత్సర్యములు అనుదుర్గుణములు కలిగి, పాపిష్ఠజన్మములు గల యిక్కడిరాజు
లను చూచుటసహితము పాపమే.

మఱియు.—

తే. కామమున లోభమునఁ గ్రోధ కకలన మించు
మోహమున మదమాత్సర్య ములను ముంచు
కలుషముల దూషితులు తులు వలగు నలఘు
నృపులఁ గనుటయె కలి, దోష మెపుడుఁ గనుట.

టి. ఈదుర్గుణము లాఱును శత్రువులవలె వెనుకటికి చెఱుపుచేయును గను
క వీనికి అరిషడ్వర్గము అనిపేరు.

విశ్వావసుః.—

గ. తథాఽపిసర్వథా కలికాలికాఅపి మానుషా నదూషణీయాః
యతస్సర్వకాలేఽపి కేచన సన్త్యేవసాధవః॥ 44

అ. తథాఅపి=అట్లయినను, సర్వథా=అనేకవిధములుగా, కలికాలికాఅపి=
కలికాలమందలివారయినను, మానుషాః=మనుష్యులు, నదూషణీయాః=దూ

హింపఁదగినవారు కారు. యతః=ఎందువలన, (అనఁగా) సర్వకాలే౽పి=ఎల్ల కాలమునను, కేచన=కొందఱు, సాధవః=సత్పురుషులు, సన్త్యేవ=ఉన్నవారే.

విశ్వావసువు.—

వ. అయినను, సర్వకాలములందును గొందఱు సాధువులు కలరు కనుక, కలికాలమందును నేవిధముననైనను మనుష్యులు దూష్యులగువారుకారు.

పర్శ్య.—

హ. దురిత భరిత క్షీబ క్ష్మాప ప్రసాదనిరాదరాః
కమలనయనస్వైరక్రీడా గృహాయితహృద్గుహాః ।
నిగమపదవీ నిర్వాహాయ క్షితావుదితాస్స్వయమ్
కతి న కృతిన స్సందృశ్యంతే కలావపి నిర్మలాః॥ 45

అ. దురిత+భరిత + క్షీబ+క్ష్మాప+ప్రసాద+నిరాదరాః = పాపములచేత + నిండినవారై+మత్తులైన+రాజులయొక్క + అనుగ్రహమందు+ఆదరములేనివారును, కమలనయన+స్వైర + క్రీడా+గృహాయిత+హృత్ +గుహాః = పుండరీకాక్షునియొక్క+స్వేచ్ఛారూపమైన + ఆటలకు+ ఇల్లుగానున్న+హృదయములనెడి+దొనలుగలవారును, నిగమపదవీ+నిర్వాహాయ = వేదమార్గములను+నిర్వహించుటకై, క్షితౌ=భూమియందు, స్వయం = తాముగా, ఉదితాః=పుట్టినవారును, నిర్మలాః=పరిశుద్ధులైనవారునైన, కృతినః=పుణ్యాత్ములు, కలౌఅపి=ఈకలియుగములోఁగూడ, కతి=కొందఱు,నసందృశ్యంతే=కనఁబడుచున్నారు కారు? (ఛేకానుప్రాసము.) (హరిణీవృత్తము.)

తా. దోషచిత్తులై మత్తిలు రాజులయనుగ్రహ మపేక్షింపకయే, తమహృదయములందు ఆకమలాక్షుని క్రీడింపఁజేసికొనుచు, వేదము లధ్యయనము చేయుచు, తద్విహిత జ్ఞానభక్తివైరాగ్యధర్మము లనుష్ఠించుచు, ఈభూలోకమందు పరిశుద్ధులై పుట్టియుండు సుకృతాత్ము లెందఱో కనఁబడుచున్నారా? లేదా?

చూడు.——

ఉ. మేదురపాపభూపతతిమీఁద నిరాదరపుందలంపు, దా
మోదరుమీఁదఁ బాదుకొను మోదపరాదరపుందలంపుఁ, దా
వేదనికామసీమపదవిన్ నహియించుఁదలంపుఁ గల్గి, యీ
మేదిని సాధుసార్థ మెలమిం జెలిమిం గలినిం గనంబడెన్.

టి. మేదుర+పాప+భూపతతిమీఁదన్ = విస్తారమైన+పాపములుగల + రాజులసమూహముమీఁద, మోద+పరి+ఆదరపు = సంతోషమందు+ఆసక్తమై + ప్రేమసంబంధమైన, వేద+నికామ+సీమ+పదవిన్ = వేదముల+విస్తారము యొక్క+అంతిమమైన+మార్గమును, మేదినిన్ =భూమియందు, సాధుసార్థము =సత్పురుషసమూహము, ఎలమిన్ =సంతోషముతోడను, చెలిమిన్ = స్నేహముతోడను, కలినిన్ =కలికాలమందుఁగూడ.

గ. అథవా యది మదీయేవచసి నవిస్రమ్భ స్తర్హి తత్రతత్రసఞ్చారమారచయ్య తత్తద్గుణదర్శనం కరవావః । (ఇతి విమానమగ్రతః ప్రస్థాపయన్నఙ్గుల్యానిర్దిశ్య). 46

అ. అథవా=ఒకవేళ, మదీయే వచసి= నామాటయందు, విస్రంభః=నమ్మకము, నయది=లేదేని, తర్హి=అయితే, తత్రతత్ర=అక్కడక్కడ, సంచారం+ఆరచయ్య = సంచారము+చేసి, తత్ తత్ +గుణ+దర్శనం = ఆయా+గుణముల ను+కనిపెట్టుట, కరవావః=చేయుదము. (ఇతి=అని, విమానం=దేవయానమును, అగ్రతః=ముందఱ, ప్రస్థాపయన్ =జఱుపుచు, అంగుల్యా=వ్రేలితో, నిర్దిశ్య= నిర్దేశించి.)

వ. ఏమి? నావచనమ్మున నీకు నమ్మకమ్ము కలుగదేని దా నిక్కడక్కడ సంచారముచేసి దానిదానిగుణగణమును గనిపెట్టుదము.(అని యట్టు విమాన మెదురఁ గదురఁ జేసికొనుచుం దాన తనకరాంగుళితో నిర్దేశించి).

## బదరికాశ్రమ వర్ణనము.

బదరికాశ్రమ దివ్యక్షేత్రము.—ఇది హిమవత్పర్వతసమీపమున సరస్వతీ నదీతీరమున నరనారాయణులుగా అవతరించి, అందు తమతో తపస్సు చేయుచుండు ననేకమహర్షులచేత పూజింపఁబడుచుండెడు శ్రీమన్నారాయణమూర్తి సేవ సాయించెడి బదరీవనముతోడి యాశ్రమము.

విశ్వావసుః.—

పృ. ఇదం బదరికాశ్రమస్థల మిహైష నారాయణ
స్తపస్యతి నమస్యతాం స్థిరతమం తమ శ్శోషయన్ ।
వికాసి ధిషణోన్మిష ద్విషయవర్జనా స్సజ్జనా
జనార్దన మహర్దివం భుజగమంచ మర్చన్త్యమీ॥ 47

అ. ఇదం=ఇది, బదరికాశ్రమస్థలం=బదరికాశ్రమ దివ్యక్షేత్రము, ఇహ=ఇక్కడ, ఏషః=ఈ, నారాయణః=శ్రీమన్నారాయణుఁడు, నమస్యతాం=తన్ను నమస్కరించువారికి, స్థిరతమం=మిక్కిలిస్థిరమైన, తమః=అజ్ఞానాంధకారమును, శోషయన్=నశింపఁజేయుచు, తపస్యతి=తపస్సు చేయుచున్నవాఁడు, వికాసి+ధిషణా+ఉన్మిషత్+విషయ+వర్జనాః=ప్రకాశించుచుండు+బుద్ధివిశేషముచేత+విజృంభించుచుండు+విషయాంతరములను+విసర్జించుట గలవారైన, అమీ=ఈ, సజ్జనాః=సత్పురుషులు, భుజగ+మంచం=ఆదిశేషుఁడే+శయ్యగాఁగల, జనార్దనం=ఆనారాయణుని, అహర్దివం=ప్రతిదినమును, అర్చంతి=పూజించుచున్నారు. (పృథ్వీవృత్తము.)

తా. ఇది బదరికాశ్రమము, ఇందు శ్రీమన్నారాయణుఁడే తన్ను సేవించఁగోరువారి యజ్ఞానాంధకారమును విసర్జింపఁజేయుటకై తపస్సు చేయుచున్నవాఁడు. ఇదో? ఈసత్పురుషులు తత్త్వజ్ఞానముతో ప్రకాశించు బుద్ధివిశేషముచేత తమతమశబ్దాదివిషయాంతరములు విడిచి, శేషశాయియైన యీనారాయణు నర్చించుచున్నవారు.

విశ్వావసువు.—

పృ. ఇదో బదరికాశ్రమం బితఁడె యిందు నారాయణుం
డిదో తపసొనర్చువీ రెపుడు సంశ్రితుల్ వారలే
విదారితతమోగతుల్ విషయవీథికానిర్గతుల్
సదాహరి సమర్చనల్ సరవి సల్పుదు ర్సజ్జనుల్.

టి. ఒనర్చెదుర్ = చేయుచున్నారు. ప్రణతులు = ప్రణామము చేసినవారు, విదారిత + తమః + గతులు = కొట్టివేయఁబడిన + అజ్ఞానాంధకారముల + మార్గములు కలవారు, విషయ + వీధికా + నిర్గతులు = శబ్దాది విషయాంతరముల + బాటలలోనుండి + వెలువడినవారు, సరవిన్ = సక్రమముగ. (పృథ్వీవృత్తము.)

కృశానుః.—

గ. సఖే! తవాత్ర గుణవత్తా సమర్థనం నరోచతే మహ్యామ్॥ 48

అ. సఖే = ఓసఖుఁడా! తవ = నీయొక్క, అత్ర = ఇక్కడ, గుణవత్తా + సమర్థనం = గుణవంతునితనమును + సమర్థించుట, మహ్యం = నాకు, నరోచతే = రుచింపదు.

కృశానుఁడు.—

వ. సఖా! ఇట నీసద్గుణ సద్భావ సమర్థనమె యైనను, నాకు రుచియించుచున్నయదియు కాదు.

వం. య దత్ర జాగర్తి శిలాసమం హిమం
సుశీతలా గన్ధవహాశ్చ దుస్సహాః।
జలావగాహా చ్చకితో జన స్తతః
కుత స్త్వనుష్ఠాస్యతి కర్మ నిర్మలమ్॥ 49

అ. యత్ = ఎందువలన (అనఁగా), అత్ర = ఇక్కడ, శిలాసమం = రాతితో సమమైన, హిమం = మంచు, జాగర్తి = మేలుకొనుచున్నది. గంధవహాః చ = గాడ్పులును, సుశీతలాః = మిక్కిలిజిల్లనివై, దుస్సహాః = ఓర్వఁగూడనివి. తతః = అందువలన, జల + అవగాహాత్ = జలములో + స్నానమువలన, చకితః = భయపడినట్టి,

జనః=జనుఁడు, నిర్మలం=పరిశుద్ధమైన, కర్మతు=కర్మనో, కుతః=ఎట్లు, అనుష్ఠా స్యతి=అనుష్ఠించును. (వంశస్థవృత్తము.)

తా. ఈ యాశ్రమములో మంచు తాయివలె గడ్డకట్టి పేరుచున్నది. గాలియో ఆమంచువల్ల మిగులజిల్లని యోర్వఁగూడక విసరుచున్నదే. ఇట్లు జిల్లని చల్లపడియుండుట ప్రథమకర్మయైన స్నానముచేయుటకె భయపడి యేక ర్మయైన నెవ రెట్లుచేయుదురు?

ఆ. మంచుగడ్డకట్టు, గాలిమించు నీఁదరగొట్టుఁ
గాన మానవులు జడిలాన స్నాన
మునకు వెనుకఁదీయఁగాగను, ననుష్ఠేయపుఁ
గర్మనిర్మల మిటఁగలుగు టెటులు?

టి. అనుష్ఠేయపుఁగర్మ=ఆచరింపఁదగిన యాచారకర్మ, నిర్మలము=పరిశుద్ధమైన.

విశ్వావసుః.—

గ. అస్మన్మతానుకూలమేవైతద్భవతి భవదుక్తమ్॥ 50

అ. ఏతత్ = ఈ, భవత్+ఉక్తం=నీచే+చెప్పఁబడినది, అస్మత్+మత+అనుకూలంఏవ = మాయొక్క+అభిప్రాయమునకు+అనుకూలముగానే, భవతి=అగుచున్నది.

విశ్వావసువు.—

వ. నీవీయన్నది (ఈయాశ్రమ మహిమమున) నామతమున కనుమతమైయే యున్నయది.

టి. మామతమునకు=మాయభిప్రాయమునకు, అనుమతము=సమ్మతము.

యతః.—

మా. పరమహిమయుతత్వాత్ప్రాప్తవైకుణ్ఠసామ్యం
పదమిదముపయాన్తః పణ్డితాశ్శాన్తిమన్తః।

ముహు రిహ సమయేషు స్నానహేతో స్సరోగా
స్తదపి భృశ మరోగా స్తార్క్ష్యకేతోః ప్రసాదాత్ ॥ 50

అ. పరమ+హిమ-పర + మహిమ+యుతత్వాత్ = అధిక మైన+మంచు తో-అధికమైన + మహత్త్వముతో + కూడుకొన్నది యగుటవలన, ప్రాప్త+వైకుంఠ+సామ్యం=పొందఁబడిన+పరమపదముతో +సాటిగలదియైన, ఇదం+పదం=ఈ బదరికాశ్రమమను+స్థలమును, ఉపయాంతః=పొందినవారై, శాంతిమంతః=శాంతిసంపన్నులగు, పండితాః=జ్ఞానులు, ఇహ= ఈయాశ్రమములో, సమయేషు=కర్మానుష్ఠానాదికాలములలో, ముహుః=మాటిమాటికి, స్నానహేతోః=స్నానకారణముచేత, స+రోగాః-సరః+గాః = శీతరోగముగలవారు-సరస్సులం దవగాహముగలవారు, తత్ అపి=అట్లయినను, తార్క్ష్యకేతోః=గరుడధ్వజుఁడైన యావిష్ణువుయొక్క, ప్రసాదాత్ =అనుగ్రహమువలన, భృశం=మిక్కిలి, అరోగాః=రోగరహితులే. (మాలినీవృత్తము.) (శ్లేషాలంకారము.)

తా. ఈయాశ్రమము అత్యంతమైన హిమముకలిగియు, ఉత్కృష్టమైన మహిమము కలదియగుటచేత పరమపదముతో సాటియైన యీచోట పరమశాంతిసంపన్నులై వచ్చినజ్ఞానులు ఆయాయనుష్ఠానకాలములలో సరస్సులలో స్నానము చేసి, యానారాయణుని యనుగ్రహమువలన శీతరోగాదిరహితులై యారోగ్యముతో నున్నవారు.

ఏలనంటేని?——

ఆ. పరమహిమము గలుగఁ § బరమపదం బిది
గనుకఁ గనకవసను § కరుణకలిగి
యిట సరోగు లగుచు, § నట యరోగు లగుదు
రగుటనే యిటీవు § నంటి వంటి.

టి. పరమహిమము=పరమమైన హిమము-పరమైనమహిమము, కనకవసను=పీతాంబరుఁడైన విష్ణువుయొక్క, సరోగులు=రోగసహితులు - సరోవగాహితులు, అరోగులు=క్షుత్పిపాసా జరామరణాది రోగరహితులు-నిత్యసూరులు,

అట=అటు+అ—అట్లే, అంటె=అంటిని. (ఇటను శ్లేషము.)

గ. ఇతి విమాన మన్యతః ప్రస్థాప్య సాఞ్జలిబన్ధమ్॥

వ. అని విమాన మన్యత్ర పోవిడిచి చేయిమొగిడిచి. 52

## అయోధ్యావర్ణనము.

(అయోధ్య.—మోక్షప్రదానమున సమర్థములైనసప్తపట్టణములలో ప్రధాన మైనది. ఇది యుత్తరకోసలదేశమందు సరయూనదీతీరమున ఇక్ష్వాకువంశపురాజుల రాజతికమున రాజిలుచుండినరాజధాని.) మోక్షప్రదాయక సప్తపట్టణములు.—"అయోధ్యా, మధురా, మాయా, కాశీ, కాంచీ, అవంతికా,పురీ ద్వారవతీచైవ, సప్తైతా మోక్షదాయికాః" అనునవి.

శా. సాకేతాయ నమః పురాయ భవతు స్తోకేతరశ్రీపుషే
నానాదోషముషే తదన్తికజుషే దేవ్యై సరయ్వై నమః।
యేఽమీ తత్తటభూమిషు ప్రవిలసద్రూపాశ్చయూపాస్థితా
స్తేభ్యో భానుకులీనకీర్తిలతికోపఘ్నాయితేభ్యో నమః॥ 53

అ. స్తోకేతర + శ్రీ + పుషే = అత్యధికమైన + ఐశ్వర్యమును+పోషించునదియైన, సాకేతాయ = అయోధ్యయనెడి, పురాయ=పట్టణమునకు, నమః=నమస్కారము, భవతు = అగుఁగాక - నానా + దోష+ముషే = సకలమైన+దోషములను + హరించినదియై, తత్ + అంతిక+జుషే = ఆపట్టణమునకు+సమీపమును+పొందినదియైన, దేవ్యై= దేవీస్వరూపమైన, సరయ్వై = సరయూనదికి, నమః=నమస్కారము. యే=ఏ, అమీ=ఈ, యూపాః+చ=యజ్ఞస్తంభములును, తత్+తట + భూమిషు = ఆనదియొక్క + గట్టులతోడి+భూములలో, ప్రవిలసత్ + రూపాః = ప్రకాశించెడు + రూపభేదములు కలవియో, భానుకులీన + కీర్తి + లతికా + ఉపఘ్నాయితేభ్యః = సూర్యవంశపు వారియొక్క+కీర్తియనెడు+తీఁగకు+సమీప స్తంభమునంటివైన, తేభ్యః=ఆయూపస్తంభములకు, నమః=నమస్కారము.

తా. సప్తైతా... [CC-0 watermark overlaps] ...సమీపమున

సకలదోషనివారకమైన సరయూనదికిని, దానితీరభూములందు సూర్యవంశపు రాజులకీర్తిలతిక లల్లుకొనుటకై యల్లుడు కొమ్మలవలె స్థాపించి యున్న యూప స్తంభములకును నమస్కారమగునుగాక.

ఉ. ఓపిక ద్రొక్కి సొక్కెద నయోధ్యనసాధ్యను గల్మిబల్మినే,
నోపిక నీవు ద్రొక్కు? మఱి యుర్వి సరయ్వు సరదోద్ధ్రుతైన, న
య్యూపతతిక్షితిక్రవికులోత్తమకీర్తికుపఘ్నమూర్తి య
జ్ఞోపకృతిక్ నమస్కృతి సమున్నతి సత్కృతి సేయుదుర్ దుదన్.

టి. సరయ + ఉద్ధృత+ఏనర్ = వేగముతో కూడునట్లుగ + ఎగురఁగొట్టఁబడిన+సకలదోషములు కలదైన, యజ్ఞ+ఉపకృతిక్ = యజ్ఞముల+ఉపకారమునందు, యూపతతిక్ =యజ్ఞస్తంభసమూహమును, ఉపఘ్నమూర్తిక్ =తీఁగలల్లుకొనుటకై నాటినకంబము రూపముగలదైన, నమస్కృతిక్ = నమస్కారముతో, సమున్నతిసత్కృతి = అత్యతిశయముతోడి సత్కారమును. (అలంకారములు అభేదతాద్రూప్యరూపకములు).

గ. పునఃపున ర్నిరీక్ష్య సభక్త్యన్మేషమ్॥ 54

అ. పునఃపునః+నిరీక్ష్య = మఱలమఱలఁ+జూచి, స+భక్తి+ఉన్మేషం = భక్తియొక్క+అతిశయముతోకూడ.

వ. మఱలమఱల నాపురి న్నిరీక్షించి సభక్తి సమగ్రంబుగ.

ఔ. భవసాగరశోషణేన పశ్య
చ్చరణాన్తగిపురజీవనౌషధేన।
రజసా రఘునాథపాదభాజా
రచితాంహః ప్రశమా మిమాం నమామి॥ 55

అ. భవ+సాగర+శోషణేన = పాపములు (లేక, సంసారము అను) సముద్రమును+శోషింపఁజేయునదియు, పశ్యచ్చరణ+అంతఃపుర+జీవన+ఔషధేన=గౌతమమునియొక్క+అంతఃపురవాసినియైన యహల్యయొక్క+జీవనమునకు
× ఔషధరూపమైనదియు, రఘునాథ+పాద+భాజా=శ్రీరాములయొక్క+

పాదములను + పొందియుండునదియునైన, రజసా=ధూళిచేత, రచిత+అంహః
+ప్రశమాం = చేయఁబడిన+పాపములకు+ప్రశాంతికలదైన, ఇమాం=ఈఅయో
ధ్యను, నమామి=నమస్కరించుచున్నాను. (ఔపచ్ఛందసికవృత్తము.)

తా. పెనిమిటియైనగౌతమర్షి చేత ఱాయిగా శపింపఁబడినయహల్య మఱల యథారూపముగ జీవింపఁజేయుట కౌషధమువంటిదై, సకలదోషములనుఁ బోఁగొట్టునట్టి యాశ్రీరాములపాదధూళి వ్యాపించి నిర్దోషమైయుండు నీయయోధ్యకు నమస్కరించుచున్నాను.

తే. భవసముద్రంబు శోషిల్లఁ, బశ్యదంఘ్రి
పక్ష్మలాక్షియు రంజిల్లఁ బరిఢవిల్లు
రఘువరాంఘ్రిరజం బంటి యఘము లెల్ల
నతి శమిల్లు పురం బిది యతిశయిల్లు.

టి. పశ్యత్ అంఘ్రి+పక్ష్మలాక్షీ = కాలికంటివాఁడైన గౌతమఋషియొక్క+స్త్రీయైనఅహల్య, నతిఁ = నమస్కారములోనే, శమిల్లు = ప్రశమించుచున్నట్టి.

పశ్యచ్చరణుఁడు=గౌతముఁడు.—ఇతఁడు అందఱవలె కన్నులుకలిగియుండియు, కాలనుగూడ కన్నుకలిగి చూచుచుండును. ఈతఁడు శతానందునికి తండ్రియు, కృపాచార్యునికి తాతయు నయినయతఁడు.

పశ్యచ్చరణాంతఃపురము =అహల్య.—జనకరాజుచేపాలింపఁబడు మిథిలకును, నిమిచే నిర్మింపఁబడిన జయంతపురమునకును నడుమనుండు గౌతమాశ్రమమున ఆగౌతమునిభార్య అహల్య. ఇంద్రునితో జారత్వము చేసినకోపమువలన నాభర్తచేత ఱాయిగా శపింపఁబడి ఱాయియై కొంతకాలమునకు శ్రీరాములు సీతాకల్యాణమై మిథిలలో నుండి అయోధ్యకు పోవునపుడు ఆ శ్రీరాముల పాదధూళి సోఁకి యథాప్రకారముగ స్త్రీయయ్యెను.

గ. పునస్స్మానుస్మరణరోమాఞ్చామ్॥ 56

అ. పునః=మఱల, స+అనుస్మరణ+రోమాంచం=అనుస్మరణముతోడి పులకాంకురముతో.

వ. (అని నమస్కరించి) మఱల ననుస్మరించి, తనమెయియుం బులకరించి.

## శ్రీరామువర్ణనము.

స్ర. కల్యాణోల్లాససీమా కలయతు కుశలం కాలమేఘాభిరామా
కాచిత్సాకేతధామా భవగహనగతిక్లాన్తిహారిప్రణామా ।
సౌన్దర్యహ్రీణకామా ధృతజనకసుతాసాదరాపాఙ్గదామా
దిక్షుప్రఖ్యాతభూమా దివిషదభినుతా దేవతారామనామా॥

అ. కల్యాణ+ఉల్లాస+సీమా = కల్యాణముల+విలాసమునకు+హద్దైనదియు, కాలమేఘ+అభిరామా=కాళ్మేఘమువలె+మనోహరమైనదియు, భవ+గహన+గతి+క్లాంతి+హారి+ప్రణామా = సంసారమనెడి+మహారణ్యమందు+తిరుగుటవలని + కష్టమును + హరించునట్టి + నమస్కారముకలదియు, సౌందర్య+హ్రీణ+కామా=అందముచేత+సిగ్గుపడెడు+మన్మథుఁడుకలదియు, ధృత+జనకసుతా+సాదర+అపాంగదామా = ధరింపఁబడిన+జానకీదేవియందు+ఆదర సహితమైన+దండలవంటికడగంటిచూపులు కలదియు, దిక్షు = సకలదిక్కులలోను, ప్రఖ్యాత+భూమా = ప్రసిద్ధమైన+కాంత్యతిశయముకలదియు, దివిషత్+అభినుతా = దేవతలచేత+స్తోత్రముచేయఁబడినదియు, సాకేత+ధామా = అయోధ్యాపట్టణమే+స్థానముగాఁగలదియు, రామ+నామా=శ్రీరాములు అను+నామముకలదియునైన, కాచిత్=ఒకానొక, దేవతా=దైవము, కుశలం=క్షేమమును, కలయతు=ఘటింపఁ జేయుచుండునుగాక. (స్రగ్ధరావృత్తము)

తా. సంసారపాపముల కష్టములను తొలఁగించుచు, సకలకల్యాణములను గలిగించుచు, కాళ్మేఘమువలె నందగించుచు, మన్మథునిగూడ తనయందముచేత సిగ్గుపొందఁజేయుచు, సీతాదేవిని తనకడగంటిచూపులతో ఆనందింపఁజేయుచు, సకలదేవతలచేత పొగడఁబడుచు, సకలదిక్కులలో ప్రసిద్ధికెక్కి, యయో

ధ్యలోనుండు నా శ్రీరాములు మనకు సర్వవిధముల సర్వక్షేమములను నిచ్చుచుండునుగాక.

సీ. కల్యాణములకెల్లఁ * గడసీమ యగువాఁడు
మేఘాభిరామ మహా * మేనివాఁడు
భవగహనంబునఁ * బడలిక పోఁబెట్టి
భక్తి ప్రణామంబుఁ * బట్టువాఁడు
పంచబాణుఁడు సిగ్గు * పడెడు నందనువాఁడు
దశదిశలందెసఁ * యశమువాఁడు
జనకసుతాపాంగ * కనకదామమువాఁడు
విబుధులయభినుతు * ల్విసనెడివాఁడు
తే. దేవదేవుఁడు దివ్యాను * భావుఁ డతఁడు
రామనాముఁడు సాకేత * ధాముఁ డెపుడు
ననమకరుణారసతరంగి * తాంతరంగుఁ
డిచ్చుఁ గుశలముఁ గలుషము * లెడలఁ బుచ్చు.

టి. భవ+గహనంబునన్ = సంసారమను+మహారణ్యమందు, జనకసుతా+అపాంగ + కనకదామమువాఁడు = సీతాదేవియొక్క+కడగంటి చూపులనెడి+బంగారుసరిపెణలుకలవాఁడు, అసమ+కరుణారస + తరంగిత+అంతరంగుఁడు= సాటిలేని+దయారసముచేత + అలలుకలదిగాఁ జేయఁబడిన+అంతరంగము గలవాఁడు, ఎడలఁబుచ్చున్ =వెడలఁగొట్టును.

శ్రీరాములు.—ఈయన సూర్యవంశమున కకుత్‍స్థాన్వయస్థుఁడైన రఘుమహారాజుకులమున అజమహారాజును పౌత్రుఁడును, కౌసల్యాదశరథులకు పుత్రుఁడునై; భరతలక్ష్మణశత్రుఘ్నులకు అగ్రజుఁడును, సీతాదేవికి భర్తయునై; తండ్రియాజ్ఞచేత అరణ్యమునకుపోయి,వాలిసంహారమునకు వెనుక,సుగ్రీవహనూమత్సహాయుఁడై; విభీషణునియందు వాత్సల్యముకలిగి, రావణకుంభకర్ణాదిరాక్షసులను సంహారము చేయుటకై దశావతారములలో ఏడవయవతారమైన మహావిష్ణువు.

జనకసుత=జానకి.—ఈమె పూర్వజన్మమున వేదవతియై వెనుకటిజన్మమున తామరపుష్పములో పుట్టి, అణుమాత్రరూపమున రావణుఁడు తీసికొనిపోవఁగా వారువారు చూచి ఈశిశువు నీకు నీవారికందఱికిని అనర్థకారిణియగును, విడిచి పెట్టుమనఁగా; వాఁ డొక పెట్టెలో పెట్టి సముద్రములో విడిచిపెట్టఁగా, ఆపెట్టె గట్టుతట్టి, ఇసుకదిబ్బలో కప్పఁబడి, కొన్నాళ్లకు వెనుక దున్నెడి నేలలో నాఁగేటికి తగిలి, పెట్టెలోనిశిశువు మిథిలాపట్టణరాజైన జనకమహారాజుకు దొరికి, అతనికి సీత అనుపేరితో పెంపుడుకూఁతురై శ్రీరాములకు భార్యయై కుశలవులను కనుగొన్న మహాలక్ష్మి.

కాముఁడు=మన్మథుఁడు.—ఇతఁడు విష్ణుమానసపుత్రుఁడు, బ్రహ్మతన్జుఁడు, రతీదేవిపెనిమిటి, అతిసుందరుఁడు, పంచబాణుఁడు, మకరధ్వజుఁడు, మీనకేతనుఁడు, శృంగారపురుషుఁడు నైనవాఁడు.

కించ.—

పృ. దశానన కుశాసనత్రసదశేషలోకవ్యథా
విలోపకరకోపకో వసుమతీసుతావల్లభః।
కృపారస మపారసంసృతిపయోనిధే స్తారకమ్
కృషీష్ట స ఋషీష్టకృ త్కృపణతైకతానే మయి॥ 58

అ. దశానన + కుశాసన + త్రసత్ + అశేష + లోక + వ్యథా + విలోప + కర + కోపకః = దశముఖుఁడైన రావణాసురునియొక్క + దుష్పరిపాలనచేత + బెదరుచున్న + సకలమైన + లోకులయొక్క + దుఃఖమునకు + నాశమును + చేయునట్టి + కోపముకలవాఁడును, ఋషి + ఇష్ట + కృత్ = మహర్షులకు + అభీష్టములను + చేయువాఁడునైన, వసుమతీసుతా + వల్లభః = భూపుత్రికయైన సీతాదేవికి + భర్తయగు, సః = ఆ శ్రీరాముఁడు, అపార + సంసృతి + పయోనిధేః + తారకం = తుదిముట్టని + సంసారమనెడి + సముద్రమునకు + దాఁటించు తెప్పయైన, కృపారసం = దయారసమును, కృపణతా + ఏకతానే = దీనత్వమునకు + ముఖ్యాశ్రయమైన, మయి = నాయందు, కృషీష్ట = చేయునుగాక. (పృథ్వీవృత్తము.)

తా. రావణాసురునివలన భయపడుచుండువారి వ్యసనములను దీర్చుచు, మహర్షులకోరికలను నెఱవేర్చుచు నుండు నా శ్రీరాముఁడు సంసారసముద్రమును తెప్పవలె దాఁటించునట్టి తనకృపను కేవలము దీనుఁడనైన నాయందు కలుగఁజేయునుగాక.

మఱియు.—

తే. రావణాసురశాసన శ్రీ త్రస్తలోక
శోకనాశన కోపనుఁ శ్రీ డౌ కృతర్షి
హర్షుఁ డల రాముఁ డిలఁ గృపో శ్రీ త్కర్షముననను
సంసరణ సంతరణ మెంతో శ్రీ సఁగును మనను.

టి. మనను=మనుటకై-(ఆత్మలు)ఉజ్జీవించుటకై, సంసరణసంతరణము=సంసారమునుదాఁటుటను, ఎంత+ఒసఁగును=ఎంతో+ఇచ్చుచుండునుగాక.

దశాననుఁడు=రావణుఁడు.—వీడు రాక్షసరాజు, పులస్త్యునిపుత్రుఁడైన విశ్రవసువలన కైకసికిపుట్టినవాఁడు, విభీషణకుంభకర్ణులకు అన్న, మండోదరికి పెనిమిటి, ఇంద్రజిత్తుమొదలైనవారు వీనికొడుకులు, లంకాపట్టణమునకు రాజు, శ్రీరాములచేత సంహరింపఁబడినవాఁడు. (జయవిజయులు సనకసనందనాదులచేత రాక్షసులుగా శపింపఁబడి మొదటిజన్మమున హిరణ్యాక్ష హిరణ్యకశిపులై నృసింహావతారముచేతను, వెనుక రావణకుంభకర్ణులై శ్రీరాములచేతను, మఱియొక యుగమున శిశుపాలదంతవక్త్రులై శ్రీకృష్ణునిచేతను సంహరింపఁబడినవారు.)

అపిచ.—

ఆ. సజయతి చిత్రచరిత్రో
యస్య హి వరచరణ పుష్కరక రేణుః ।
మహిషీ మృషిసింహాస్య
ప్రాజీజనదపి నృపోదయే హేతుః॥ 59

అ. యస్య=ఏవానియొక్క, వర+చరణ+పుష్కర+క రేణుః- మేలైన+

కాల్లును+తొండమునుగల+ఏనుఁగు, (పద+చరణపుష్కరక+రేణుః = శ్రేష్ఠములైన+పద్మములవంటిపాదముల+దూళి) వృష+ఉదయే – ఎద్దుయొక్క+(ధర్మముయొక్క) పుట్టుకయందు, హేతుః అపి= కారణమయ్యును, ఋషి+సింహస్య= తెలివిగల+సింహమునకు (శ్రేష్ఠుఁడైన+గౌతమఋషికి), మహిషీం= పెంటియెనుమును (పత్నిని), ప్రాజీజనత్ = పుట్టించెనో, సః .. అట్టి, చిత్ర+చరిత్రః=విచిత్రమైన+చరిత్రముకలవాఁడైన శ్రీరాముఁడు, జయతి+హి=సర్వోత్కృష్టుఁ డగుచున్నాఁడు గదా?

తా. మఁ యేనుఁగు మగయెద్దును గనఁగోరి, సింహమునకు పెంటియెనుమును భార్యనుగాఁ బ్రసవించుకొనెను. (అనువిరుద్ధార్థమును వేడుకకై చూపి,)ధర్మసంస్థాపనమునకై యవతరించుటచేత గౌతమునిశాపముచేత తాయిరాయి పడియున్న యహల్యను తనపాదపద్మపరాగముచేత యథాప్రకారము స్త్రీగాఁ జేసి యతనికి భార్యగాఁజేసిన యావిచిత్రచరిత్రుఁడైన శ్రీరాముఁడు సర్వోత్కృష్టుఁడుగా నుండుఁగాకని యాశీర్వదించెను. (అని వాస్తవార్థమును దెలిపెను.)

మఱియు.—

ఉ. ఆతతచిత్రవర్తనమె యాతని, దాతటి భూమినేమి యు
త్పాతమొకాని? యేని పద పద్మక రేణువు రాణమీఱి, సా
కూతమహర్షిసింహమునకున్ మహిషిన్ గలిగించె,మించఖ
ద్యోతకులంబుసంబరముతోడ,వృషోదయమున్ దలంచుచున్.

టీ. ఏని+పద+పద్మక+రేణువు = ఎవనియొక్క+పాదములందు+తెల్లనిమచ్చలుగల+ఏనుఁగు (పద+పద్మక+రేణువు = పద్మములవంటి+పాదములయందలి+ధూళి), స+ఆకూత + మహత్ +ఋషి+సింహమునకు = మంచి+అభిప్రాయముతోడి+గొప్పతెలివిగల+సింహమునకు, (మహర్షిసింహమునకున్ = మహర్షిశ్రేష్ఠుఁడైన గౌతమునికి.) ఖద్యోతకులంబు = మిడుఁగురుపురుగుల సమూహము (సూర్యవంశమువారు).

౩౦. శ్రేయాంసి భూయాంసి మహోవదాన్యః
శ్రేయాన్ స దేయాజ్జనకాత్మజాయాః ।

కాకాయ కంకాయచ యోఽదితేష్టం
దాశాయ కీశాయచ రాక్షసాయ॥ 60

అ. యః=ఎవఁడు, కాకాయ=కాకికిని (జయంతునకిని), కంకాయ=గద్దకును (జటాయువునకును), దాశాయ=బోయకును (గుహునికిని), కీశాయ=కోఁతికిని (సుగ్రీవునికిని), రాక్షసాయ=రాక్షసున్నకును (విభీషణునకును), ఇష్టం=అభీష్టమును, అదిత=ఇచ్చెనో, సః=అట్టి, మహోదాన్యః = మహాదాతయై, జనకాత్మజాయాః = సీతాదేవికి, ప్రేయాన్ = ప్రియుఁడైనశ్రీరాముఁడు, భూయాంసి=విశేషములైన, శ్రేయాంసి = క్షేమములను, దేయాత్=ఇచ్చును గాక.

(ఇంద్రవజ్రావృత్తము.)

తా. సీతాపతియైన యాశ్రీరాముఁడు తాను మహాదాతయని పేరొ్కనఁబడియు, కాకి, గద్ద, కోఁతి, బోయ, రక్కసి మొదలైనవానికేమో! యిష్టదాత అయినాఁడట? (అని విరుద్ధార్థము.) జయంతుఁడు, జటాయువు, గుహుఁడు, విభీషణుఁడు మొదలైనవారికి(అని ఉద్దిష్టార్థము.) ఇష్టదాతఅయినాఁడట? అట్టి యతఁడు మనకును సకలశ్రేయస్సుల నిచ్చునుగాక.

తే. కాక కంకములకు సదె ♦ కాక, కపికి
రాతరాక్షసుల కభీష్ట ♦ రాశిఁ జేసి
నాఁడు నాఁడనఁ బేర్వాడు ♦ వాఁడు మనకు
శ్రేయములదాత యగుఁగాత ♦ సీత నేత.

టి. నాఁడు=ఆనాఁడు, దాత=ఇచ్చువాఁడు, సీత నేత = సీతాపతి.

కాకము=కాకి-జయంతుఁడు.—వీఁడు ఇంద్రునికొడుకు, నలకూబరమన్మథులవలె అతిసుందరుఁడు, వీఁడు సీతాదేవి అరణ్యయాత్రలోనున్నపుడు కాకాసురుఁడై పొడువవచ్చి శ్రీరాముల బాణముచేత హతుఁడైనవాఁడు.

కంకము=గద్ద - జటాయువు.—ఇతఁడు వినతాకశ్యపులమనుమఁడు, శ్యేని అనూరులకొడుకు, సంపాతితమ్ముఁడు, ఈతఁడు పంచవటియందు శ్రీరాముల ఆశ్రమమునుండి సీతను గొనిపోవునపుడు తానుగద్దగావచ్చి రావణాసురునితో యుద్ధము చేసి

దాసుఁడు=బోయ—గుహుఁడు.—ఇతఁడు శృంగిబేర పురమునకు ప్రభువుగానుండి శ్రీరాముల అరణ్యావాసములో పడవవిడిచి పంపాసరస్సును దాఁటించిన కిరాతరాజు.

కీశము=వానరుఁడు—సుగ్రీవుఁడు.— (వాలిసుగ్రీవులు.—వానరరాజులు, అన్నదమ్ములు) వీరు-బ్రహ్మవలనం బుట్టినఋక్షవిరజుఁడు అను వానరుఁడు పార్వతీశాపమున పురుషులు స్త్రీలైపోవు తటాకమున స్నానముచేసి తాను స్త్రీయై తనసౌందర్యమునకు ఆనందమందిన ఇంద్రునివలన వాలమందు వాలిగాను, సూర్యునివలన గ్రీవమందు సుగ్రీవుఁడుగాను పుట్టినవారు. అందు వాలి శ్రీరాములచేతనె చంపఁడినవాఁడు, సుగ్రీవుఁడు ఆశ్రీరాములచేత నే సంరక్షింపఁబడినవాఁడు.

రాక్షసుఁడు=విభీషణుఁడు—ఇతఁడు కైకసీ విశ్రవసుల కొమారుఁడు, రావణ కుంభకర్ణులతమ్ముఁడు, తనహితవచనములు వినని రావణుని విడిచి శ్రీరాములనే శరణుసొచ్చి సంరక్షింపఁబడినవాఁడు.

అన్యచ్చ.—

పృ. అభీష్టఘటకః క్షితా వతులదీప్తికోదండభాక్
ఇతి క్షమ మిదం పునః పరమ మద్భుతం బ్రూమహే।
విఘాతపరమూర్తికో విఘటితారిచక్రస్స్వయం
స కుంభజనకం ప్రభుశ్శకలయాంబభూవ క్రుధా॥ 61

అ. క్షితౌ=భూమిలో, అభీష్ట+ఘటకః = అపేక్షింపఁబడిన+కుండలుగలవాఁడు, అతుల+దీప్తికః = సాటిలేని+మంటిముద్దగలవాఁడై, దండభాక్=త్రిప్పుడుకఱ్ఱకలవాఁడు, (అయ్యెను.) ఇదం=ఇది, క్షమం=చాలినది. ఇతి=అని, పునః=మఱల,పరమం=అధికమైన,అద్భుతం=ఆశ్చర్యమును, బ్రూమహే=చెప్పుచున్నాము, సః=ఆకుండలుకోరిన, ప్రభుః=మేటియైనవాఁడు. విఘాత+పర+మూర్తికః = తొలఁగఁద్రోయఁబడిన+శ్రేష్ఠమైన + మృత్తికకలవాఁడై, విఘటిత+అరి+ చక్రః = కొట్టివేయఁబడిన + నడిమికఱ్ఱలతోడి + చక్రముకల

వాఁడై, స్వయం=తానే, కుంభ+జనకం=కుండలకు+కారణమైనదానినే, క్రుధా=కోపములో, శకలయాంబభూవ=చుక్కలుచుక్కలుగాచేసివేసెను. అనివిరుద్ధార్థము. క్షితౌ = భూమిలో, సః = ఆ, ప్రభుః = శ్రీరాముఁడు, అభీష్టఘటకః=భక్తాభీష్టములు ఘటింపఁజేయువాఁడును, అతులదీప్తికోదండభాక్ = సాటిలేని కాంతిగల శార్ఙ్గధనుస్సుగలవాఁడును, ఇదం=ఇది, క్షమం=చాలినది, ఇతి=అని, పునః=మఱల, పరమం=శ్రేష్ఠమైన, అద్భుతం=వింతను, బ్రూమహే=చెప్పుచున్నాము. విధూత+పరమ+ఆర్తికః= ఎగురఁగొట్టఁబడిన+విశేషములైన+భక్తబాధలుకలవాఁడును, వికటితారిచక్రః = కొట్టివేయఁబడినశత్రుసమూహముకలవాఁడునై, స్వయం = తానె, కుంభ+జనకం= కుంభుని+తండ్రియైన కుంభకర్ణుని (లేక) రావణుని, క్రుధా=కోపములో, శకలయాంబభూవ=చుక్కలుచుక్కలుగజేసెను. అనివాస్తవార్థము. రావణకుంభకర్ణులకు కుంభుఁడనుపేరి కుమారులుండిరని యితిహాసము.

తా. కుండలుకోరిన కుమ్మరవాఁడు చక్రమున పెట్టఁదగినట్టి మట్టిముద్దయు, ఆచక్రము త్రిప్పెడికఱ్ఱయు, మంచిదిగాఁ గలుగఁజేసికొని, మఱల నాకుండలకు సాధనములైన యామట్టిని చక్రమునఁ దునుకలు తునుకలుగా నెగురఁగొట్టివేసెను. (అనివిరుద్ధార్థమును వేడుకఁగాఁజెప్పి) ఈలోకములో ఆశ్రీరాముఁడు భక్తాభీష్టములను గలుగఁజేయుటకై శార్ఙ్గకోదండముకలవాఁడై ఖరదూషణాది రావణకుంభకర్ణాంతము రాక్షససంహారముచేసి, ఆశ్రితులకందఱకును గష్టములు తీర్చెను. (అని వాస్తవార్థమును జెప్పెను.) (పృథ్వీవృత్తము.)

మఱియు.—

తే. తాను ఘటకుండు కానొకో దండకుండు
విఘటితారికుండు నకట వికటముగను
నగుచు నగుచుండ జగమంత జగతియందు
నగువెవి ? హాతకుంభజనకుండు నగుట యకట ?

టి. ఘటకుండు = కుండలుకలవాఁడు (ఆశ్రితాభీష్టములను ఘటింపఁజేయువాఁడు), కానోకో = అగుటకేమో, దండకుండు (కానో, కోదండకుండు), విఘటితారికుండు=పడఁగొట్టఁబడిన చక్రముకలవాఁడు(పడఁగొట్టఁబడిన శత్రువులుకలవాఁడు), నగుచుండక = నవ్వుచుండునట్లుగ, హతకుంభజనకుండు=పడఁగొట్టఁబడినకుంభకారణములుకలవాఁడు (పడఁగొట్టఁబడిన రావణకుంభకర్ణులు కలవాఁడు), అకట=(ఇప్వు డట్టిసమర్థుఁడు మనప్రత్యక్షమున లేఁడే)అయ్యో? (ఇటను విరోధానుప్రాణితశ్లేషాలంకారము.)

ఇ. కుంభజనకుఁడు=కుంభనికుంభులతండ్రి-కుంభకర్ణుఁడు.—వీఁడు తపసుచేసి బ్రహ్మను వరమడుగునపుడు దేవతలప్రార్థనచే సరస్వతి వాక్కున ప్రవేశించి నిద్ర అనిఅడిగి వరముతీసికొని ఎల్లప్పుడును నిద్రలోనేయుండి శ్రీరాములతో యుద్ధముచేయునపుడు రావణుఁడు ఆనిద్రాభంగము చేసినందున తానును ఆ శ్రీరాములచేతనే చంపఁబడినవాఁడు.

కృశానుః.—

గ. కథంనామరామ భద్ర మనుచిత కర్మాణమప్యేవ మీడిడిషే॥

అ. కథంనామ = ఏలాగున, రామభద్రం= శ్రీరాముని, అనుచిత+కర్మాణం+అపి=అయుక్తములైన+కార్యములు కలవాఁడయ్యును, ఏవం=ఈలాగు, ఈడిడిషే = స్తోత్రముచేయున్నావు ?

కృశానుఁడు.—

వ. ఎట్లు రామచంద్రు ననుచితకర్మతంత్రు నయినను, ఇట్లు నుతింపఁ దలంపుఁగొనుచున్నాఁడవు?

టి. అనుచిత+కర్మ+తంత్రుక = అయుక్తములైన+క్రియలందు+మైమఱపుగలవానిని.

శా. వర్షీయానపి జానకీసహచరో మాతు స్సపత్న్యా మదే
సమ్పన్నం రథహస్తిపత్తితురగై స్స్వస్త్యజ్య రాజ్యం నిజమ్।

విన్దన్ హన్త? ఘనంవనం కథ మసౌ నస్యా దయుక్తక్రియో
గవ్యం దుగ్ధ మపాస్య పాస్యతి జనః కోవా యవాగూరసమ్॥

అ. జానకీసహచరః=జానకీప్రియుఁడు, వర్షీయాన్+అపి=జ్యేష్ఠుఁడైనను, మాతుః=తల్లియొక్క, సపత్న్యాః=సవతికి, ముదే=సంతోషమునిమిత్తమై, రథ+హస్తి+పత్తి+తురగైః=రథ+గజ+పదాతి + తురంగములతో, సంపన్నం = కూడుకొన్న, నిజం=తనదైన, రాజ్యం = రాజ్యతికమును, సంత్యజ్య=విడిచి, ఘనం = గొప్పదైన, వనం = అడవిని, విందన్=పొందుచు, హంత=అయ్యో? కథం=ఎట్లు, అసౌ=ఇతఁడు, అయుక్త+క్రియః = అనుచితములైన+కార్యములుకలవాఁడు, నస్యాత్=కాఁడు? కః వా జనః = ఏమనుష్యుఁడు, గవ్యం=ఆవుసంబంధియైన, దుగ్ధం=పాలును, అపాస్య = వదిలి, యవాగూరసం=గంజినీటిని, పాస్యతి=త్రాగఁగలఁడు? (శార్దూలవృత్తము.)ళ

తా. శ్రీరాముఁడు పెద్దకొడుకయ్యును, తనతల్లికిఁగాక, తనసవతితల్లికిఁగాను తన కులక్రమముగావచ్చిన చతురంగములతోడిరాజ్యతికమును విడిచి యడవికి పోయినాఁడు. ఇతఁడిట్లు చేయుట తగినకార్యమా? అయ్యో? ఎవఁడుగాని యావుపాలు విడిచి, గంజినీళ్లు త్రాగునా?

ఉ. అగ్రజుఁడై రథాదిచతురంగసమగ్రము ప్రాజ్యరాజ్య మ
వ్యగ్రత మాని జానకిని వ్యర్థుఁడుతోడ్కొని మాఱుతల్లికై
యుగ్రవనంబునం దిరిగె నుద్ధృతధర్ముఁడ యుక్తకర్ముఁడ
య్యగ్ర్యముక్షీరపూర మెవఁడైనను ద్రావక,గంజిత్రావునే?

టి. అవ్యగ్రతన్=అజాగ్రత్తతో, ఉద్ధృత+ధర్ముఁడు = ఎగురవేయఁబడిన+సకలధర్మములుకలవాఁడు, అగ్ర్యము = శ్రేష్ఠమైన, పూరము=ప్రవాహము. (దృష్టాంతాలంకారము.)

కించ.——

శా. ధిక్కృత్యైవ దశాస్యదర్పదమనం ధీశాలినం వాలినం
సోఽయం రాక్షసవర్గనిగ్రహకృతే సుగ్రీవ మన్వగ్రహీత్।

తుఙ్గప్రస్తరభఙ్గలిప్సు రిహ నిశ్శఙ్కం తు టఙ్కం త్యజన్
సఙ్కల్పం కలయేత పఙ్కజదలాదానప్రసఙ్గాయ కః॥ 64

అ. సః+అయం=ఆ+ఈశ్రీరాముఁడు, దశాస్య+దర్ప+దమనం=రావణాసురుని+గర్వమును+పడఁగొట్టినవాఁడును, ధీశాలినం = బుద్ధిశాలియునైన, వాలినం=వాలిని, ధిక్కృత్యఏవ = ధిక్కరించియే, రాక్షస+వర్గ + నిగ్రహాకృతే = రాక్షసుల+సమూహమును+నిగ్రహించుటకొఱకు, సుగ్రీవం = సుగ్రీవుని, అన్వగ్రహీత్ = అనుగ్రహించెను. కః=ఎవఁడు, తుంగ+ప్రస్తర+భంగ+లిప్సుః = పొడవైన+ఱాతిని+ భేదించుటకు+కోరినవాఁడై, ఇహ=ఇక్కడ, నిశ్శంకం= శంకలేక, టంకంతు=ఉలినైతేనో, త్యజన్=విడిచిపెట్టుచు, పంకజదల+ఆదానప్రసంగాయ = తామరఱేకును తెచ్చుకొనుసంగతికై, సంకల్పం=తలంపును, కుర్యాత్=చేయును? (దృష్టాంతాలంకారము.)

తా. ఆయీశ్రీరాముఁడు రాక్షసులను నిగ్రహించుటకై రావణాసురుని గర్వముకూడఁ బడఁగొట్టినవాలినే అనాదరించి, సుగ్రీవు ననుగ్రహించెను. ఇదెట్లున్నదంటే? కఠినములైన ఱాలను చీలఁగొట్టఁగోరినవాఁడు టంకమును విడిచివేసి, తామరఱేకును దెచ్చుకోఁగోరినాఁడువలె నున్నది.

మఱియు.—

శా. వాలిన్ వాలనిబద్ధరావణునిఁ దాఁ జేవారించె నీరాముఁ, డా
నీలి న్నాలిని రావణున్ గెలువనే స్నేహించె సుగ్రీవు నా
లీలన్, బోలునె శైలఖండనకుఁ జాఁ జాలింపఁ గరాటంకమే
కేళిన్ దాళని తమ్మిఱేకును విలోకింపన్ నిరాటంకమై.

టి. నీలిన్ నాలిని=కపటియు మందబుద్ధియునైన, కరా+టంకము=చులుకైన+ఉలిని, విలోకింపన్+పోలునె = (ఆయుధముఁగోరి) చూడఁ+దగునా?

ఇ. వాలిసుగ్రీవులు.—వానరరాజులు, అన్నదమ్ములు; వీరు బ్రహ్మవలనఁ బుట్టిన ఋక్షవిరజుఁడు అను వానరుఁడు పార్వతీశాపమున పురుషులు స్త్రీలైపోవు తటాకమున స్నానముచేసి తానును స్త్రీయై తనసౌందర్యమునకు ఆనందమందిన ఇం

ద్రునివలన వాలమందు వాలిగాను, సూర్యునివలన గ్రీవమందు సుగ్రీవుఁడుగాను పుట్టినవారు. అందు వాలి శ్రీరాములచేతనె చంపఁబడినవాఁడు, సుగ్రీవుఁడు ఆశ్రీరాములచేతనే సంరక్షింపఁబడినవాఁడు.

అపిచ.—

మ. కృత్వా సేతుం కిల జలనిధౌ ఖణ్డయిత్వా దురధ్వాన్
లబ్ధ్వా దేవీం స్ఫుటవిదితసంశుద్ధి మగ్నిప్రవేశాత్ ।
భూయోఽప్యేనాం భువనజననీం భూమికన్యా మనన్యా
మ న్తర్వత్నీ మనయత వనం హ న్త? పౌల స్త్యహన్తా॥ 65

అ. పౌలస్త్యహంతా=రావణసంహారకుఁడైన శ్రీరాముఁడు, జలనిధౌ=సముద్రమందు, సేతుం=వారధిని, కృత్వా=చేసి, దురధ్వాన్=దుర్మార్గులను,ఖండయిత్వా=ఖండించి, అగ్ని+ప్రవేశాత్=అగ్నియందు+ప్రవేశించుటవలన,స్ఫుట+విదిత+సంశుద్ధిం=స్పష్టముగ+తెలిసికోఁబడిన+పారిశుద్ధ్యముకల, దేవీం=సీతాదేవిని, లబ్ధ్వా=లభించి, భూయః అపి=మఱలను,అనన్యాం=అసామాన్యయై, భూమికన్యాం=భూపుత్రికయై, భువనజననీం=లోకమాతయైన, ఏనాం=ఈ, అంతర్వత్నీం=గర్భిణియైనసీతను, వనం=అడవిని, అనయత=పొందించెను. హంత=అయ్యో?

తా. ఆ శ్రీరాముఁడు సముద్రమున సేతువుబంధించి, దుర్మార్గులైన రాక్షసులనుఖండించి, అగ్నిప్రవేశముచేత ఆసీతాదేవియందలి పాతివ్రత్యపారిశుద్ధ్యమును దెలిసికొనియు, మఱల యోగ్యతచేత అసాధారణయు, సకలలోకములకును తల్లియు, అయోనిజయునై, గర్భవతియైన యాసీతను అడవిపాలుచేయవచ్చునా? అయ్యో? ఏమియన్యాయ్యము?

మఱియును.—

ఉ. వారిధి కట్టి, కట్టి వెస కై వారవధీ, దశకంఠుఁ గొట్టియుఁ
ధారుణిపట్టిఁ బట్టి, జ్వలకై నంబున మెట్టియు, నట్టనన్యసా
ధారణయైన జానకినె కైతట్టున గర్భిణినైనఁ గాన కీ
ధీరహితుం డొకం డనిచె కై దిట్టఁడె? కట్టిఁడికాక యీకడన్.

టి. ధీ+రహితుండు=యోచనలేనివాఁడు (ధీర+హితుండు=జ్ఞానవంతులకు ప్రియుఁడు-శ్రీరాముఁడు), కట్టిఁడి=కఠినుఁడు, దిట్టఁడు=దిట్టఁదనము కలవాఁడు. (వృత్త్యనుప్రాసాలంకారము.)

ఇ. సేతువు.—శ్రీరాములు రావణసంహారమునకై లంకకుఁబోవునపుడు వానరులచేత సముద్రమునకట్టించిన వారిధి, ఇందు స్నానముచేయువారికి సకలదోష నివారణమై సర్వదా పరిశుద్ధులై యుందురని పురాణము.

విశ్వావసుః.—

౫. సఖే? గుణిషు దోషావిష్కారం కథంకార మారచయసి॥ 66

అ. గుణిషు=గుణవంతులయందు, దోష+అవిష్కారం=దోషములను+ఆరోపించుటను, కథంకారం=ఎట్లు, ఆరచయసి=చేయుచున్నాము.

విశ్వావసువు.—

వ. సఖా? గుణులయందును దోషముల నెటులు నీవు నావిష్కరించుచున్నాఁడవు.

ఉ. గురా వసత్యోక్తినిరాసహేతోః
స్వరాజ్య మగ్ర్యోఽపి సరామచన్ద్రః।
తృణాయ మేనే నిపుణాయతే న
ఫణాభృదీశోఽపి ఫణాయితుం తమ్॥ 67

అ. అగ్ర్యః+అపి=పెద్దవాఁడయ్యును, సః+రామచంద్రః=ఆ+శ్రీరాముఁడు, గురౌ=తండ్రియందు, అసత్య+ఉక్తి+నిరాస+హేతోః=అబద్ధమైన+మాటను+నివారించుటఅను+కారణమునకుఁగాను, స్వ+రాజ్యం=తన+రాజటికమును, తృణాయ=తృణముగా, మేనే=తలఁచెను. ఫణాభృత్+ఈశః అపి=సర్పములరాజైన+ఆదిశేషుఁడుకూడ, తం=ఆశ్రీరాముని, ఫణాయితుం=పొగడుటకు, ననిపుణాయతే=సమర్థుఁడు కాకయున్నాఁడు?

తా. శ్రీరాముఁడు తాను అన్నదమ్ములలో పెద్దవాఁడయ్యును, కైకేయికి తనతండ్రియిచ్చి[illegible]అబద్ధమువాక్యము కాకుండుటకై వంశపారంపరాగత

మైనరాజ్యమునుగూడ గడ్డిపోచగాఁ దలంచెను. అట్టియారాముని ఆవేయినోళ్ల ఆదిశేషుఁడుకూడ పొగడఁజాలనివాఁడై యున్నవాఁడు.

తే. గురుని వితథోక్తి నిరసింప, కే గురునిరాజ్య
మును దృణమునుగఁ గన,రామ కే మూర్తికీర్తి
ముఖసహస్రంబుగల శేష కే మూర్తిపూర్తి
గను గనుంగొని కొనియాడఁ కే గనుగలండె?

టి. గురుని+వితథ+ఉక్తిఁ=తండ్రియొక్క+అబద్ధపు+మాటను—పరద్వయము నీయఁడను అపవాదమును,నిరసింపన్ =పోఁగొట్టుటకై,కనన్ =చూడఁగా, పూర్తిగను=సంపూర్ణముగ.

ఇ. ఫణాభృదీశుఁడు=ఆదిశేషుఁడు.—ఇతఁడు కద్రూకశ్యపప్రజాపతుల ప్రథమపుత్రుఁడు, ఇతఁడెప్పుడును భూభారమును వహించుచు భూదేవిభర్తయైన యా మహావిష్ణువునకు నివాసశయన వాహనాది శరీరభేదములతో ఉపచరించు గరుత్మంతునితో పరమమైత్రి సలుపుచుండు నతఁడు.

కించ.—

ఆ. వాలిని బలోర్మిమాలిని
జాగ్రతి సుగ్రీవ మగ్రహీద్య దయమ్ ।
అస్య శ్రుతిశత విదితం
సువ్యక్తం తేన దీనబన్ధుత్వమ్॥ 68

అ. అయం=ఇతఁడు, వాలిని=వాలి, బల+ఊర్మిమాలిని = బలిమికి+సముద్రుఁడై, జాగ్రతి+సతి=జాగరూకుఁడైయుండఁగా, సుగ్రీవం=సుగ్రీవుని, అగ్రహీత్ =పరిగ్రహించెను. (అనుట) యత్ =ఏదియో, తేన=దానిచేత, అస్య=ఇతనికి, శ్రుతిశత+విదితం = నూఱువేదాలచేత+తెలియఁబడుచున్న, దీన+బంధుత్వం=దీనులయందలి+బంధుత్వమనెడిగుణము, సువ్యక్తం=స్పష్టముఅయినది. (ఆర్యాగీతి.)

తా. బలవంతుఁడయిన వాలియుండఁగా, సుగ్రీవుని పరిగ్రహించుటవలన

అశ్రీరాములయందలి వేదాంతవేద్యమయిన దీనబంధుత్వగుణము తెలియఁబడు చున్నదని (ముందు కృశానుఁ డాక్షేపించిన "ధిక్కృత్య" అనుదానికి సమాధానము తెలిపెను).

మఱియు —

తే. వాలి యండన యిల బల శాలియుండ
నగ్రజుని నిగ్రహించి య నుగ్రహించె
ననుజు సుగ్రీవు న్యగ్గ్రీవు నన ఁగ మఱఁగ
దీన దీనబంధుఁడు రాముఁ డౌ ననంగ.

టి. అండన్ అ = సమీపమునందు, న్యక్ + గ్రీవున్ = (వినయముచే) వంగిన + మెడగలవాఁడయిన, దీనన్ = ఇందువలన,

కించ. —

శా. లక్ష్మీం వక్షసి బిభ్రద ప్యవిరతం రామాకృతి శ్శ్రీపతిః
వృత్తిం కామపి మానుషీ మభినయ న్వీరాగ్రయాయాం ప్రియామ్।
కల్యాణీంతు వనీమనీనయ దహో కస్యాప్యమృష్య న్వచో
మేదిన్యా మవలోకితః కి మపరో మానీ పుమా నీదృశః॥ 69

అ. రామ + ఆకృతిః = శ్రీరాముని + రూపముగల, శ్రీపతిః = విష్ణువు, అవిరతం = ఎల్లప్పుడును, వక్షసి = వక్షస్థలమున, లక్ష్మీం = లక్ష్మీదేవిని, బిభ్రత్ అపి = భరించుచుండినను, వీర + అగ్రయాయీ = శూరులలో + అగ్రేసరుఁడై, కాంఅపి = ఒకానొక, మానుషీం = మనుష్యసంబంధియైన, వృత్తిం = రీతిని, అభినయన్ = అభినయించుచు, ప్రియాం = తనప్రియురాలిని, కల్యాణీంతు = కల్యాణగుణములు కలదైనను, కస్యఅపి = ఎవనియొక్కయు, వచః = మాటను, అమృష్యన్ = సహింపనివాఁడై, వనీం = అరణ్యమును, అనీనయత్ = పొందించెను. అహో = ఆశ్చర్యము? ఈదృశః = ఇటువంటి, మానీ = మానవంతుఁడైన, పుమాన్ = పురుషుఁడు, అపరః = మఱియొకఁడు, మేదిన్యాం = భూమియందు, అవలోకితః కిం = చూడఁబడినాఁడా?

తా. లక్ష్మీవక్షస్థలుఁడైన యాలక్ష్మీపతియే శ్రీరామావతారుఁడై మనుష్యధర్మము నవలంబించి, యెవఁడు మాటనోఁతాళఁజాలక, తనప్రియురాలిని పాతివ్రత్యాపారిశుద్ధ్యాది సకలకల్యాణగుణములు కలదిగానైనను, అడవిపాలుచేసెను. ఇట్టి మానవంతుఁడైన పురుషుఁడు మఱియొకఁడు ఈభూలోకమందు కనఁబడియేయుండఁడు. ("కృత్వాసేతుం" అని కృశానుఁ డాక్షేపించినదానికి సమాధానము చెప్పెను.)

మఱియు.—

ఉ. శ్రీ నురమందు నందినను, శ్రీపతి భూపతి రాముఁడై రమా
మానినియైన, జానకిని మానుషవృత్తిని బూను తా నర
ణ్యానికి నంపెఁ దెంపెసఁగి,యప్పుడయెవ్వఁడ దేమిసెప్పినాఁ
డో? నిజమైనమానియెవఁడో? యితఁడొక్కఁడె కాక యేకడన్.

టి. రమామానిని=ఆలక్ష్మీకాంత, అరణ్యానికి = అరణ్యసమూహమునకు, తెంపు+ఎసఁగి=సాహసము+అతిశయించి,| మాని=మానవంతుఁడు.

ఇ. లక్ష్మీదేవి.—2-వ పేజి చూడుము.

వస్తుతస్తు—

ఉ. గాతుం క ఈష్టే. శ్రితరామభద్రాన్
గణాన్ గుణానాం గణనాదరిద్రాన్ ।
ప్రాచేతసాద్యాః కవయోఽనవద్యాః
యదేకదేశాకలనేఽపి నేశాః॥ 70

అ. శ్రిత+రామభద్రాన్ = శ్రీరామచంద్రుని+ఆశ్రయించినవియు, గణనా+దరిద్రాన్ = లెక్కయొ+లేనిదియునైన, గుణానాం+గణాన్ =గుణముల+సమూహములను, గాతుం= గానముచేయుటకు, కః=ఎవఁడు, ఈష్టే=శక్తి కలవాఁడగును. ప్రాచేతస+ఆద్యాః=వాల్మీకి+మొదలైన, అనవద్యాః=నిర్దోషులగు, కవయః=కవులు, యత్+ఏకదేశ+ఆకలనే+అపి = ఏగుణములలో+ఒక కొంచెమైనను+వర్ణించుటయందుకూడ, న ఈశాః=సమర్థులు కారు. (ఉపజాతి వృత్తము, వ్యాక్యార్థహేతుక కావ్యలింగాలంకారము.)

తా. ఆ శ్రీరాముని యసంఖ్యాతములైన కల్యాణగుణములు గణించుట కెవఁడు శక్తికలవాఁడగును. వాల్మీకిమొదలైన మహర్షులుకూడ ఆగుణముల లో ఒకలేశమైనను గణియించుటకు చాలినవారు కారు.

ఇ. ప్రాచేతసుఁడు=వాల్మీకి.-ఈయన బ్రహ్మాజ్ఞచే నారదోపదేశముతో బహు కాల తపస్సమాధినుండి తనపై పుట్టపెట్టఁగా,ఆవెనుకను చాలా కాలమునకు వెను క, ఆపుట్టనుండి=వల్మీకమునుండి వెడలివచ్చి, వాల్మీకి అనుపేరితో శ్రీమద్రామా యణమును సంస్కృతమున ఛందోబద్ధముగ కవనము సృష్టించినమహాఋషి.

వాస్తవముగ.—

క. తగు రఘురాముని కల్యా
ణ గుణగణైకానుగుణగ ణనమును గావిం
పఁగ నగు నెవనికి? వాల్మీ
కి గ నిఁగ నే కవిగ నున్నఁ గ గించి త్తయినన్.

టి. కల్యాణ+గుణ+గణ+ఏక+అనుగుణ+గణనమును=కల్యాణకరములైన +గుణములయొక్క+సమూహమునందు+ఒక్కటికైన+తగిన+లెక్కను (కా వ్యలింగాలంకారము).

గ. తథాఽపి తదీయగుణార్ణవకణైకదేశకోటితమాంశకలామా
త్ర మిద మత్రభవతా శ్రోతవ్యమ్॥ 71

అ. తథాఅపి=అట్లయినను, తదీయ+గుణ+అర్ణవ+కణ+ఏకదేశ+కోటి తమఅంశ+కలామాత్రం = ఆ శ్రీరాములవిర్యైన+సముద్రమువంటి+కల్యాణగు ణములయొక్క+లేశములో + ఒకకొంచెముయొక్క + కోటిభాగములలో+ పదాఱవపాలైన, ఇదం=ఇది, అత్ర=పూజ్యుఁడవైన, భవతా=నీచేత, శ్రోత వ్యం=వినఁదగినది.

వ. అయిన నతనిగుణములనెడి కడలికణములం దేకదేశలేశమం దును గోటితమమయిన యంశమున షోడశకళామాత్రము నీ కిది వినవలయునది.

శ్లో॥ కకుత్‌స్థకులపర్యాయ కలశార్ణవకౌస్తుభః।
కౌసల్యాసుకృతవ్రాత కల్పకప్రసవోదయః॥ 72
ప్రాఞ్చత్పఙ్క్తిరథాగార పరిష్కారహరిన్మణిః।
జానకీలోచనద్వన్ద్వ చకోరానన్దచంద్రమాః॥ 73
సంసారమార్గసఞ్చార శ్రాన్తచ్ఛాయామహీరుహః।
సర్వరాక్షసబేతాళ సముచ్చాటనమాన్త్రికః॥ 74
కరుణారసకల్లోల కదంబవరుణాలయః।
తపోధనజనాకాంక్షా తటాకనవతోయదః॥ 75
విద్యావిహరణోద్యానం వినయాస్థానమణ్డపః।
సౌలభ్యప్రాభవోత్కర్ష సమావేశనివేశనమ్॥ 76
సౌజన్యవాదాన్యకయో స్సామానాధికరణ్యభూః।
సౌముఖ్యముఖ్యభవనం సౌహార్దైకవితర్దికా॥ 77
ప్రసాదలక్ష్మ్యాః ప్రాసాదః ప్రతాపస్య పరాగతిః।
ప్రాణప్రతిష్ఠా క్లిష్టానాం ప్రపన్నానాం పరాయణమ్॥ 78
అనపాయసమృద్ధీనా మువగాహనదీర్ఘికా।
జమ్భశాసనజీవాతు ర్జన్మగేహం జయశ్రియః॥ 79
దుర్వాదఘోరదారిద్ర్య దర్వీకరఖగేశ్వరః।
తాదృక్తత్తాటకాదేహ ధ్వాన్తరాజీవబాన్ధవః॥ 80
సుబాహుమత్తమాతఙ్గ సంహారవరకేసరీ।
భార్గవాగ్రహదావాగ్ని పరిమార్జననిర్ఝరః॥ 81
విరాధాఖ్యదురాతఙ్క విద్రావణమహౌషధమ్।
ఖరదూషణకింపాక ఖణ్డనైకపరశ్వధః॥ 82
దుర్మో[illegible] మారీచ [illegible] ప్రబలానలః।

గృధ్రరాజస్య నాకాదిలోకాక్రమణవర్తనీ॥ 83
కబన్ధమయకాసార కబలీకరణాతపః ।
శబరీచిత్తకుముద శారదజ్యోత్స్నికోదయః॥ 84
పావమానియశః కాశప్రకాశశరదాగమః ।
ప్రగల్భవాలిజీమూత ప్రోత్సారణసమీరణః॥ 85
సుగ్రీవరాజ్యసామగ్రీ సుదినంకాననౌకసామ్ ।
దుర్నిరోధధునీనాథ జాడ్యరోగచికిత్సకః॥ 86
దుష్టనక్తంచరస్తోమ ధూమకేతువిజృమ్భణమ్ ।
కుమ్భకర్ణమదామ్భోధి స్తమ్భనే కుమ్భసమ్భవః॥ 87
బలీయో రావణప్రాణ పాషాణదలనాపవిః।
విభీషణస్య సామ్రాజ్య విశ్రాణనసురద్రుమః॥ 88
అయోధ్యాపురనారీణాం నుత్ణ్ణోరత్యద్భుతోత్సవః ।
రమతే మమ తేజస్వీ రామః కామసమో హృది॥ 89

గ. అత్రికిలపవిత్రచరిత్రః కశ్చిద్ద్విపశ్చిదజస్రమిత్థ మనుసన్ధత్తే॥90

అ. (72) కకుత్స్థ+కుల+పర్యాయ+కలశార్ణవ+కౌస్తుభః=కకుత్స్థరాజుయొక్క+వంశమనెడి+మఱియొక+పాలసముద్రమందు+కౌస్తుభమనెడు రత్నమును, కౌసల్యా+సుకృత+వ్రాత+కల్పక+ప్రసవ+ఉదయః = కౌసల్యాదేవియొక్క+పుణ్యముల+సమూహమనెడు+కల్పవృక్షమునకు పుష్పముల+పూతయును, (73) ప్రాంచత్+పంక్తిరథ+అగార+పరిష్కార+హరిత్ మణిః=ఒప్పుచున్న+దశరథరాజుయొక్క+ఇంటికిని+అందగింపఁజేయుటకు+పచ్చరత్నమును, జానకీ+లోచన+ద్వంద్వ + చకోర+ఆనంద+చంద్రమాః=సీతాదేవియొక్క-కనుల + జంటయనెడు + వెన్నెలపులుఁగులయొక్క + ఆనందమునకై + చంద్రుఁడును, (74) సంసార+మార్గ+సంచార+శ్రాంత+ఛాయా+మహీరుహః=సంసారములనెడు+త్రోవలలో+తిరుగుటలచేత +బడలినవారికి+నీడకై+వృక్షమును, సర్వ+రాక్షస+బేతాళ+సముచ్చాటన+మాంత్రికః= ఎల్లరాక్షసులను+

పిశాచములనుక్ + తరుమఁగొట్టుటకై + భూతవైద్యుఁడును, (75) కరుణారస + కల్లోల + కదంబ + వరుణాలయః = కృపారసమనెడు + గొప్పయలల + సమూహమునకు + సముద్రుఁడును, తపోధనజన + ఆకాంక్షా + తటాక + నవతోయదః = మహర్షులయొక్క + కోరికలనెడు + కొలఁకులకు + క్రొమ్మేఘమును, (76) విద్యా + విహరణ + ఉద్యానం = సకలవిద్యలతో + విహరించుటకై + క్రీడావనమును, వినయ + ఆస్థాన + మండపః = అణఁకువయను + ఆస్థానమునకు + మంటపమును, సౌలభ్య + ప్రాభవ + ఉత్కర్ష + సమావేశ + నివేశనం = భక్తసులభతయొక్కయు + ప్రభుతయొక్కయు, అతిశయములకు + కూడికకై + గృహమును (77) సౌజన్య + వాదాన్యకయోః + సామానాధికరణ్య + భూః = సుజనత్వమునకును, దాతృత్వమునకును + సమానస్థానముతోడి + భూమియు, సౌముఖ్య + ముఖ్యభవనం = సుముఖత్వమునకు + ముఖ్యస్థానమును, సౌహార్ద + ఏక + వితర్దికా = సుహృత్త్వమునకు + ముఖ్యమైన + తిన్నెయు, (78) ప్రసాద + లక్ష్మ్యాః + ప్రాసాదః = అనుగ్రహమనెడి + లక్ష్మికి + మేడయును, ప్రతాపస్య + పరా + గతిః = ప్రతాపమునకు + శ్రేష్ఠమైన + మార్గమును, క్లిష్టానాం + ప్రాణప్రతిష్ఠా = మరణమున వలె క్లేశపడువారికి + ప్రాణప్రతిష్ఠయైనవాఁడును, ప్రపన్నానాం + పర + అయనం = ప్రపత్తినిష్ఠులకు + శ్రేష్ఠమైన + స్థానమును, (79) అనపాయ + సమృద్ధీనాం + అవగాహన + దీర్ఘికా = అపాయరహితుల + సమృద్ధులకు + స్నానమునకై + దొరువును, జంభశాసన + జీవాతుః = ఇంద్రునకు + జీవనౌషధమును, జయశ్రియః + జన్మగేహం = జయలక్ష్మికి + జన్మగృహమును, (80) దుర్వార + ఘోర + దారిద్ర్య + దర్వీకర + ఖగేశ్వరః = వారింపశక్యముకాని + భయంకరమైన + లేమిడియను + పాములకు + గరుత్మంతుఁడును, తాదృక్ + తత్ + తాటకా + దేహ + ధ్వాంత + రాజీవబాంధవః = అట్టి + ఆ + తాటకయొక్క + దేహమనెడు + చీకటికి + సూర్యుఁడును, (81) సుబాహు + మత్తమాతంగ + సంహార + వరకేసరీ = సుబాహుఁడనెడి + మదపుటేనుఁగును + సంహరించుటకు + మేటిసింహమును, భార్గవ + ఆగ్రహ + దావాగ్ని + పరిమార్జన + నిర్ఝరః = పరశురామునిని + ఆగ్రహమనెడి + దావాగ్నిని + త్రోసివేయుటకు + ప్రవాహమును, (82) విరాధాఖ్య + దురాతంక + విద్రావణ + మహౌషధం =

విరాధుఁ డను పేరుగల+దుర్వ్యాధిని+పోఁగొట్టుటకై + గొప్పయౌషధమును, ఖర+దూషణ+కింపాక+ఖండన+ఏక+పరశ్వథః=ఖరుఁడు+ దూషణుఁడు అనెడు+విషవృక్షములను+ఖండించుటకు+ముఖ్యమైన+గొడ్డలియు,(83) దుర్లోచ నీచ+మారీచ+కీచక+ప్రబల+అనిలః=విడువరాని+నీచుఁడైన+మారీచుఁడనెడు+వెదురువృక్షమునకు+గొప్ప+గాలియు, గృధ్రరాజస్య+నాకాది+లోక+ఆక్రమణ+వర్తనీ= జటాయువునకు+స్వర్గాది+లోకములను + ఆక్రమించుకొనుటకై+మార్గమును,(84) కబన్ధమయ+కాసార+కబలీకరణ+ఆతపః=కబంధుఁడనెడు+సరస్సును+మ్రింగుటకై +తీక్ష్ణ్యమైనయెండయు, శబరీ+చిత్త+కుముద+శారద+జ్యోత్స్నా+ఉదయః = శబరియొక్క+మనస్సనెడు+కలువకు+శరత్కాలమందలి+వెన్నెలయొక్క+వెలుఁగును,(85) పావమాని+యశః+కాశ+ప్రకాశ+శరత్ ఆగమః=ఆంజనేయునియొక్క + కీర్తియనెడు+ రెల్లుపూలు+వికసించుటకై + శరత్కాలపురాకయు, ప్రగల్భ+వాలి+జీమూత+ప్రోత్సారణ+సమీరణః = సమర్థుఁడైన+వాలియనెడు+ మేఘమును+జిమ్మివేయుటకై+వాయువును,(86) సుగ్రీవ+రాజ్య+సామగ్రీ=సుగ్రీవుని+రాజ్యమునకు+సాధనసంపత్తియు + కాననౌకసాం+సుదినం+వానరులకు+మంచిదినమును,దుర్నిరోధ+ధునీనాథ+జాడ్యరోగ+చికిత్సకః = అడ్డగింపఁగూడని+సముద్రముయొక్క+జడత్వవ్యాధికి+వైద్యుఁడును,(87) దుష్ట+నక్తంచర+స్తోమ + ధూమకేతు + విజృంభణం=దుష్టులైన+రాక్షసుల+సమూహమునకు+(అనిష్టసూచకమై)విజృంభించు+ధూమకేతునక్షత్రమును, కుంభకర్ణ+మద+అంభోధి+ స్తంభనే+కుంభసంభవః=కుంభకర్ణుని+గర్వమనెడి+సముద్రమును+ స్తంభింపఁజేయుటకై +అగస్త్యమహామునియు, (88) బలీయః+రావణ+ప్రాణ+పాషాణ+దళనా+పవిః=బలిష్ఠుఁడైన+రావణుని+ప్రాణములనెడి+రాలను+పగలఁగొట్టుటకై+వజ్రాయుధమును, విభీషణస్య+సామ్రాజ్య+విశ్రాణన+సురద్రుమః= విభీషణునియొక్క+చక్రవర్తిత్వమును +ఇచ్చుటకై +కల్పవృక్షమును,(89) అయోధ్యాపుర+నారీణాం=అక్ష్ణోః+అత్యద్భుత + ఉత్సవః=అయోధ్యాపట్టణపు + స్త్రీలయొక్క+కన్నులకు + అత్యాశ్చర్యకరమైన + వేడుకయు, కామసమః = మన్మథుని

తోసమానుఁడునైన, తేజస్వీ=ప్రతాపప్రభావములచేత తేజరిల్లునట్టి, రామః=శ్రీరాముఁడు, మమ హృది = నామనస్సునందు, రమతే = క్రీడించుచున్నాఁడు.

అ. అత్ర = ఇక్కడ, పవిత్రచరిత్రః = పవిత్రమైన చరిత్రముకల, కః చిత్ =ఒకానొక, విపశ్చిత్ = విద్వాంసుఁడైన యీకావ్యకర్త, ఇత్థం=ఇట్లు, అనుసంధత్తేకిల=అనుసంధించుచున్నాఁడుకదా?

సీసమాలిక.

కాకుత్థ్సకులనిధి కౌస్తుభరత్నంబు,
    కౌసల్యకృతి కల్పకమున సుమము,
దశరథుగృహమునఁ దగు హరిద్రత్నంబు,
    జనకాత్మజాత లోచనచకోర
చంద్రుఁడు, సంసృతి శ్రాంతసచ్ఛాయద్రు,
    వసురసముచ్చాట నైకమంత్ర,
మురుకరుణారసోచ్చరదూర్మికలవార్ధి,
    మునిమనోరథతటాకనవఘనము,
విద్యావిహృతికృతి కుద్యానవనమును,
    మఱి వినీతికి మహామంటపంబు,
ప్రాభవసౌలభ్య వైభవభవనంబు,
    సుజనతాదాత్మ్యతా నిజగృహంబు,
సౌముఖ్యమునకు నెసఁగు ముఖ్యసదనంబు,
    సౌహార్దమునకు నసమవితర్ది,
సుప్రసాదమునకు సుఖదప్రాసాదము,
    తీవ్రప్రతాపాత్య తిశయగతియ,
క్లిష్టులప్రాణప్రతిష్ఠాపటిష్ఠుఁడు,
    సుప్రపన్నపరాయ ణప్రభావుఁ,

డనపాయసంశుద్ధి కనగాహాదీర్ఘిక,
యింద్రజీవాతు, వ తంద్రవిజయ
హేతువు, దీనతా హీశఖగేశుఁడు,
తాటకాతనుతను స్ఫోటతరణి,
తత్సుబాహుద్వీప దారుణసింహంబు,
జమదగ్నిజక్రుధా జ్వలనఝరము,
వీరవిరాధగ దోరుతరౌషధి,
ఖరదూషణవిషద్రు ఖండపరశు,
వతినీచమారీచ నతకీచకదవాగ్ని,
పటుజటాయువు చెందు పదము పదవి,
క్రూరకబంధకా సాగోరుబడబాగ్ని,
శబరిహృత్కుముదైక శరదరాక,
సామీరి సద్యశ శ్శరశరదాగమ,
ముద్ధతవాలిఘ నోత్థఝంఝ,
సుగ్రీవరాజ్యసా మగ్రియు, వరవాన
రావళీసుముహూర్త మాదినంబు,
జడనిధిజాడ్యంబు నెడపెడువైద్యుఁడు,
దుష్టరాక్షసకోటి ధూమకేతు
వును, గుంభకర్ణమ దనిధికగస్త్యుఁడు,
రావణజీవన గ్రావపతియుఁ,
దద్విభీషణరాజ్య దానామరద్రు, వ
యోధ్యాసతీలోచ నోత్సవంబు,
తే. నైన జానకీజాని స మానుఁ డతను
తోడఁ దేజముతోడను గ్రీడసలుపు ;

నెడఁద నను చనుసంధించుఁ గీ బుడమి నిటుల
నిరతమిా భ క్తుఁ డతిభక్తి కీ భరితముగను.

టి. కృతికల్పకమున=సత్కృతియను కల్పవృక్షమున, సచ్ఛాయ=ఛాయా సహితమైన, ఉచ్చరత్=పైకిలేచుచున్న, నవఘనము=క్రొమ్మేఘము,విహృతికృతికి=పిహారక్రియకు,అసమవిశొర్ది=సాటిలేనితిన్నె, అవగాహదీర్ఘిక=స్నానమునకు డిగ్గియ,ఇంద్రజీవాతువు=దేవేంద్రునకుజీవనౌషధి,తనుతమస్ఫోటతరణి=శరీరమనెడి అంధకారవిజృంభణమునకు సూర్యుఁడు, గద ఉరుతర ఔషధి=రోగములకు గొప్పమూలిక, శరదరాక=శరత్కాలమందలిపూర్ణిమ—(శరద=ఆబంతమున తత్సమము.) శరశరదాగమము=తెల్లుపూలకు శరదృతువురాక, ఘనోద్ఘఝంఝ=మేఘమునకు విజృంభించెడు ఝంఝామారుతము.

ఇతిహాసములు.

కకుత్స్థుఁడు.—45-వ పేజి చూడుము.

కౌసల్య—కోసలదేశ రాజుకూఁతురు, దశరథుని పెద్దభార్య, శ్రీరాములతల్లి.

పం క్తిరథుఁడు=దశరథుఁడు.—45-వ పేజి చూడుము.

జానకి.—50-వ పేజి చూడుము.

జంభశాసనుఁడు =(జంభారి) ఇంద్రుఁడు.—అదితికశ్యపప్రజాపతులపుత్రుఁడు, శచీదేవిపతి, జయంతునితండ్రి; ఇతఁడు పూర్వదిక్పాలుఁడై, వజ్రాయుధము, ఐరావతగజము, ఉచ్చైశ్శ్రవోశ్వము, సుధర్మాస్థానము, మాతలిసారథి, నందనోద్యానము. అమరావతీరాజధానియుకలిగి, స్వర్గలోక మేలువాఁడు.

ఖగేశ్వరుఁడు=గరుత్మంతుఁడు—ఇతఁడు వినతాకశ్యపప్రజాపతుల పుత్రుఁడుగా వేదస్వరూపుఁడైపుట్టి సూర్యసారథియైన అనూరునితమ్ముఁడైనవాఁడు, ఇతఁడు దేవేంద్రుని జయించి అమృతమునుదెచ్చి కద్రూపుత్రులకిచ్చి తల్లి దాస్యవృత్తిని పోఁగొట్టెను; మఱి ప్రజల కపకారులైన పులిందులను గజకచ్ఛపములుగా ఒకరికొకరు శపించుకొన్న విభావసు సుప్రతీకులనుఁ భక్షించి బలిష్ఠుఁడై సర్వదా శ్రీమహావిష్ణువాహనమై యున్నవాఁడు.

తాటక.—సుకేతుకూఁతురు, సుందునిపెండ్లము, సుబాహుమారీచులతల్లి, అగస్త్యమహాముని శాపముచేత తాను తనకొడుకులును రాక్షసు లౌనట్లు శపింపఁబడినయక్షస్త్రీ.

సుబాహుమారీచులు.—అన్నదమ్ములు, వీరువిశ్వామిత్రయాగమున శ్రీరాములచే సంహరింపఁబడినవారు.

విరాధుఁడు.—వీఁడు కుబేరుశాపముచేత రాక్షసుఁడై శ్రీరామునిచేత దండకారణ్యమున చంపఁబడిన తుంబురుఁడను గంధర్వుఁడు.

ఖరుఁడు.—విశ్రవసునికొడుకు, దూషణత్రిశిరస్కులయన్న, జనస్థానసేనాధిపతి, శ్రీరామునిచేత హతుఁడైనవాఁడు.

భార్గవుఁడు.—భృగువంశమున రేణుకా జమదగ్నులపుత్త్రుఁడు, ఇతఁడు దశావతారములలో పరశురామావతారుఁడై కార్తవీర్యార్జునుఁడు మొదలుగా దుష్టరాజులను సంహరించి, మహాధనుష్కుఁడైన తనచేతిధనుర్ముఖముగానె శ్రీరాములచేత నిష్ప్రభుఁడైనవాఁడు

గృధ్రరాజు=జటాయువు.—63.వ పేజి చూడుము.

కబంధుఁడు.—వీఁడు పంచవటియందు స్థూలకేశునిశాపముచేత రాక్షసుఁడై, ఇంద్రుని వజ్రాయుధముచేత శిరసు కంఠము కాళ్లును కడుపులోపల అణఁగిపోయియు, బాహువులుమాత్రము దీర్ఘములై రామలక్ష్మణులచేత తెగనఱకఁబడి, శాపవిమోచనమైన గంధర్వుఁడు.

శబరి.—ఈపె పంపాతీరమున మతంగాశ్రమమున మతంగమహామునిశిష్యురాలై శ్రీరాములయనుగ్రహమువలన మోక్షముచెందిన బోయత.

పావమాని=పవమానపుత్త్రుఁడు- ఆంజనేయుఁడు.—ఇతఁడు వాయువు ననుగ్రహమువలన అంజనాకేసరులపుత్త్రుఁడై, సుగ్రీవునకు మంత్రియై, శ్రీరాముల కంతరంగభక్తుఁడై, సీతాదేవిని కనిపెట్టఁబోయి, లంకాదహనముచేసివచ్చి, శ్రీరాములకు సీతాక్షేమమునుదెలిపి చిరంజీవులలో నొకఁడైన వానరశ్రేష్ఠుఁడు.

వాలిసుగ్రీవులు.—68-వ పేజి చూడుము.

కుంభకర్ణుఁడు = రావణునితమ్ముఁడు.—వీఁడు మహాక్రూరుఁడైయుండియు, తపస్సుచేసి వరము లడుగఁగా, దేవతల ప్రార్థనచేత సరస్వతి వాని వాక్కున నుండి వాఁడు నిద్ర కావలయునని యడుగునట్లుచేసెను. అందువలన నెప్పుడును నిద్రపోవుచు, రామరావణయుద్ధములో నిద్రలేపఁబడి, ఆశ్రీరాముల చేతనె యుద్ధమున చంపఁబడెను.

రావణుఁడు.—61-వ పేజి చూడుము.

విభీషణుఁడు.—61-వ పేజి చూడుము.

శ్రీరాముఁడు.—59-వ పేజి చూడుము.

కుంభసంభవుఁడు = అగస్త్యుఁడు—ఇతఁడు ఊర్వశినిజూచిన మిత్రావరుణులవీర్యము స్ఖలించి కుంభమునఁజేరి, వసిష్ఠునితోఁగూడ పుట్టినట్టి మహర్షి. ఈయన మాంసరూపులై ఆతిథ్యభ్యాగతులకు ఆతిథ్యము పెట్టి చంపుచుండు వాతాపీల్వలులు అనురాక్షసులను భస్మము చేసిన యతఁడు; మఱిసముద్రములో మఱఁగియుండి దేవతలను బాధించుచుండిన కాలకేయులను వెడలగొట్టుటకై ఆసముద్రజలమునంతయును ఆపోశనముచేసి అసముద్రమును నిర్జలము చేసినయతఁడు; మఱియు తమలోతాము ఒకటొకటి వివాదపడుకొని విజృంభించుకొనుచున్న మేరువింధ్యపర్వతములలో మేరుపర్వతము ఈలోకమునకు వెలుగురె కలుగక పోవునట్లు సూర్యచంద్రులకడ్డముగ పెరిగియున్నఁజూచి దేవర్షులతోందర చేత లోకముపడు నలజడినిజూచి సంకటపడుచు నీయగస్త్యుని ప్రార్థించుకొనఁగా, ఆతఁడుబోయి తనకు శిష్యుఁడుగానున్న యా మేరువు తన్నుఁజూచి వంగి దండప్రణామము చేయఁగా, నేను మలయపర్వతమునకు ఇదోపోయివచ్చెద; నేను వచ్చుదాఁక నీ విట్లేయుండుమని చెప్పిపోయి ఆ మేరువు ఇదివఱకు నట్లేయుండునట్లు చేసినయతఁడు.

౧. అత్రకిలపవిత్రచరిత్రః కశ్చిద్విపశ్చిదజస్రమిత్థమనుసన్ధత్తే. 91

అ. అత్ర=ఇక్కడ, పవిత్రచరిత్రః = పవిత్రమైనచరిత్రముకల, కః+చిత్ = ఒకానొక, విపశ్చిత్ = విద్వాంసుఁడైన యీకావ్యకర్త, ఇత్థం=ఇట్లు, అనుసంధత్తే కిల—అనుసంధించుచున్నాఁడుకదా?

వ. ఇట్టి నిటుల నొకసుచరితుఁడగు సుధీమణి యనుసంధించుచు న్నవాఁడు.

వ. ధ్యాయామిరామ మభిరామగిరా మరన్ద
ధారామదఘ్న మితరామ మరేర్విరామమ్ ।
ఆరామ మద్భుతతరామలసద్గుణానాం
ఘోరామయఘ్న మసురామరవన్దితాంఘ్రిమ్॥ 92

అ. అభిరామ+గిరా=మనోహరమైన+ వాక్కు చేత, మరందధారా+మద ఘ్నం = తేనెధారలయొక్క+క్రొవ్వునణఁగఁగొట్టునట్టియు; ఇత+రామం= పొందఁబడిన+సీతా కాంతకలిగినట్టియు, అరేః+విరామం = శత్రువునకు+వినా శకుఁడగునట్టియు, అద్భుతతర+అమల+సద్గుణానాం = అత్యాశ్చర్యకరమై+ సాటిలేని+సుగుణములకు, ఆరామం = విహారవనమైనట్టియు, ఘోర+ఆమయ+ ఘ్నం=భయంకరమైన + సంసారవ్యాధులను+ పడఁగొట్టునట్టియు, అసుర + అమర+వందిత+అంఘ్రిం = రాక్షసులచేతను+ దేవతలచేతను+నమస్కరింపఁ బడుచున్న+పాదములు కలిగినట్టియునైన, రామం = శ్రీరామమూర్తిని, ధ్యా యామి = ధ్యానముచేయుచున్నాను.

తా. తేనెధారలకంటె మించి తీయనైనవాక్కులును, మిక్కిలి వింతలైన సద్గుణములునుగలిగి, సురలు నసురులును తనపాదములను నమస్కరించుచుండఁ గా సకలరోగములను సకలశత్రువులను బడఁగొట్టుచు, సీతాసమేతుఁడైన శ్రీరాముని నేను ధ్యానము చేయుచున్నాను. (వసంతతిలకవృత్తము.)

శా. రాముఁ డ్ శ్యామలదేహు బాహుబలు జాగ్రత్క్షేమధాముఁ డ్
సుధా,సామగ్రీమధుమాధురీమహితవాక్సారస్యనిస్సీము సం
గ్రామస్తోమవిభీము భూమమహిముఁ డ్ బ్రాంచద్గుణభ్రాజదా
రాముఁ డ్ వేమఱు ధ్యేయుఁ జేయుదుని దేవ్రామాభిరామున్మనున్.

టి. జాగ్రత్+క్షేమ+ధాముఁ డ్ = మేలుకొనుచున్న+క్షేమములకు+స్థాన మైనవాఁడును, సుధాసామగ్రీ + మధుమాధురీ + మహిత+వాక్సారస్య+నిస్సీ

ముర్ = అమృతసమృద్ధిచేతను+మకరందమాధుర్యముచేతను + పూజితమైన+ వాక్సారస్యమునకు+పొలిమేరయైనవాఁడును, ప్రాంచత్+గుణ+భ్రాజత్+ ఆరామర్ = మిక్కిలియొప్పుచుండెడు+గుణములకు+ప్రకాశించెడు+ఉద్యానవన మైనవాఁడును, రామా+ అభిరామర్ = సకల స్త్రీలకును+ మనోహరుఁడును, ధ్యేయర్ = ధ్యానముచేయఁదగినవానిఁగా. (వృత్త్యనుప్రాస)

దయాసనుదయాలయే ముదధికానసే కాననే
పలాశనపలాయనప్రణయికార్ముకే ధార్మికే।
సమీరజసమీడితే ప్రవిశ చిత్త? మే సత్తమే
బలీకృతవలీముఖే మనుజధర్మిణి బ్రహ్మణి॥ 93

అ. దయాసనుదయ+ఆలయే = కృపాసమూమునకు+ స్థానమైనవాఁడును, కాననే = అడవియందుఁగూడ, ముత్+అధిక+ఆనసే=సంతోషము+అధికము గాఁగల+మొగముగలవాఁడును, పలాశన+పలాయన + ప్రణయి+కార్ముకే= రాక్షసులను+తఱుమఁగొట్టుటయందు +వంగిన+విల్లుకలవాఁడును, ధార్మికే = ధర్మాత్ముఁడును, సమీరజ+సమీడితే = హనుమంతునిచేత+ పొగడఁబడినవాఁడును, బలీకృత+వలీముఖే=బలవంతులుగాఁ జేయఁబడిన+వానరులు కలవాఁడును,మనుజ+ధర్మిణి=మనుష్యుని+ధర్మప్రవర్తనముకలవాఁడును,సత్తమే=సర్వశ్రేష్ఠుఁడునైన, బ్రహ్మణి=పరబ్రహ్మస్వరూపుఁడగు శ్రీరామునియందు, మే=నాయొక్క, చిత్త=ఓచిత్తమా ! ప్రవిశ = ప్రవేశించుమా ? (ఆద్యంత్యానుప్రాసము.)

తా. అడవిలోఁగూడ దయతో సంతోషసూచకమైన ముఖముతోను, రాక్షసులను తఱుముటకై వంచుచుండువింటితోను,హనుమంతుఁడు చేయుస్తోత్రముతోను, బలవంతులనుగాను జేయఁబడినవానరులతోను, సర్వోత్తముఁడై మనుష్య ధర్మముతోనె ధార్మికుఁడైయుండు పరబ్రహ్మమైన యాశ్రీరామునియందు ఓమనస్సా! నీవు ప్రవేశించుమా ?

పం. దయాపయోధియైనవాని, కె దానఁ గాన మోముననా
వయో... [illegible]

ప్రయోగమైన యాతుధాన ప్రాణహానిధర్మ మం
దయోగమైన మర్త్యధర్మమందువాని వానరో
పయోగమైన సేనచెంది బల్మినూను చేయుస్తో
త్రయోగ మొందు బ్రహ్మముం దలంప! వేదలంపవే?

టీ. దానన్ = దానివలన, కానన్ = అడవిలో, వయః+అనురోధి = వయస్సును+అనుసరించునది, ధర్మము = విల్లు, అందున్ = ఆధనుర్ధరణసామర్థ్యమందు, అయోగమైనన్ = సంబంధములేనిదైనను, అందువానిన్ = పొందువాండైన, తలంప = ఓమనస్సా! వేన్ = వేగన్. (ఛేకానుప్రాసము. పంచచామరము)

శా. అస్త్రీమాసతృణం ప్రియాద్రుహి తృణామాసస్మరారేర్ధనుర్
దారామాస మునేశ్శిలాపి నృపరామాసస్వయంపాదుకా।
కుల్యామాసమహార్ణవోఽపికపయో యోధాంబభూవుస్తథా
పౌలస్త్యో మశకాంబభూవ భగవన్? త్వంమానుషామాసిథాః.

అ. హేభగవన్ = ఓభగవానుండా! తృణం = తృణము, ప్రియా+ద్రుహి = నీప్రియురాలికి+ద్రోహియైన కాకాసురునివిషయమై, అస్త్రీమాస = అస్త్రమయ్యెను; స్మరారేః+ధనుః = శివునియొక్క+విల్లు; తృణామాస = తృణమయ్యెను; శిలా+అపి = ఱాయికూడ, మునేః = గౌతమమునికి, దారామాస = భార్యఅయ్యెను; పాదుకా = పావకోలు, స్వయం = తానుగానె, నృపరామాస = రాజయ్యెను; మహాన్ అర్ణవః+అపి = మహాసముద్రముకూడ, కుల్యామాస = కాలువఅయ్యెను; కపయః = కోంతులు, యోధాంబభూవుః = యుద్ధవీరులైరి; పౌలస్త్యః = రావణుండు, మశకాంబభూవ = దోమఅయ్యెను; తథా = అలాగె, త్వం = నీవు, మానుషామాసిథాః = మనుష్యుండవైతివి.

తా. నీవు భగవంతుండవగుటచేత నీకు కాకాసురునివిషయమై తృణమె అస్త్రముగాను, నీతవిషయమై శివునివిల్లె తృణముగాను, గౌతమునివిషయమై ఱాయె భార్యగాను, భరతునివిషయమై పావకోలె రాజుగాను, వారధివిషయమై సముద్రమె కాలువగాను, యుద్ధాజివిషయమె కోంతులె మహావీరులుగాను, నీ

సామర్థ్యవిషయమై ఆరావణుఁడె దోమగాను, నీవొ సర్వధర్మసంస్థాపనవిష యమై మనుష్యుఁడవుగాను అయితివి ఆశ్చర్యము?

ఇ. పౌలస్త్యుఁడు=రావణుఁడు.—61-వ పేజి చూడుము.

తే. అస్త్రమయ్యెఁ దృణము, తృణకమయ్యె ధనువు,
నయ్యెఁగట్టు సుతనువు, మెకట్టయ్యె నృపతి,
కపులు భటులైరి, కాల్వయ్యెఁ గడలి, యయ్యె
రావణుఁడు దోమ నరుఁడై తెక రామ? నీవు.

టి. సుతనువు=సొగసైన మేనుగలది—స్త్రీ, మెట్టు = ఎక్కుటకు సాధనము—పావకోడు.

శ్లో॥ అశిలాప్రాణదపదై రచరాచరముక్తిదైః ।
అసర్వభూతాభయదై రశర్వధనురర్దనైః॥ 95
అబ్రహ్మాస్త్రీకృతతృణై రతృణీకృతరావణైః ।
అలం కాతరదేవైస్తై రలంకాపురసాధకైః॥ 96

అ. అశిలా+ప్రాణద+పదైః = రాతికి+ప్రాణమునిచ్చు+పాదములుకలవారు కానివారును, అచర+అచర+ముక్తిదైః = జంగమ+స్థావరములకు+మోక్షము నిచ్చువారుకానివారును, అసర్వ+భూత+అభయదైః = సర్వభూతములకు+ అభయము నిచ్చువారుకానివారును, అశర్వధనుః+అర్దనైః=శివునిధనుస్సును+ ఖండించువారుకానివారును, అబ్రహ్మాస్త్రీకృత+తృణైః=బ్రహ్మాస్త్రముగా చేయఁ బడిన+తృణముకలవారు కానివారును, అతృణీకృత+రావణైః=తృణముగా చే యఁబడిన+రావణుఁడు కలవారు కానివారును, అలంకాపుర+సాధకైః=లంకా పట్టణమును+సాధించువారు కానివారునైన, తైః= ఆ, కాతర+దేవైః=పిరుకు లైన+దేవతలతో, అలం=చాలును. (ఈరెండును అనుష్టుప్ శ్లోకములు.)

తా. రాతిని బ్రతికించుటయును, జడాజడములకును ముక్తి నిచ్చుటయును, సకలభూతముల కభయమిచ్చుటయును, ఆశివునివిల్లు విఱుచుటయును, తృణ మును బ్రహ్మాస్త్రముగ జేయుటయును, ఆరావణుని తృణముగనే చేయు

టయును, లంకను సాధించుటయును లేక భయపడుచు నేయుండు దేవతల తో పనేమి ?

మ. శిలకుఁ బాదము ప్రాణమిచ్చుట,ప్రశస్తిఁ జంగమస్థావరం
బులకుఁ ముక్తినిరక్తినిచ్చు, టభయంబుఁ సర్వభూతాళికిం
వెలయంగూర్మినిబేర్మినిచ్చుట, యమోఘేశాను బాణాసనం
బెలమిఁ వంగితునుంగనిచ్చుట,తృణంబేబ్రాహ్మమస్త్రంబుగా
బలిమిజ్జేయుట,రావణుఁదృణముగాఁబ్రఖ్యాతితోఁజేయుటం
దులలంకఁ జెడఁజేయు,టిందులనొకండుఁ లేఁవేల్పేలకో?

టి. ప్రశస్తిఁ =ప్రసిద్ధితో, రక్తిఁ = ప్రేమతో, అమోఘ+ఈశానుబాణాసనంబు=తప్పపోని+శివునిధనుస్సను, బ్రాహ్మమస్త్రంబుగా=బ్రహ్మాస్త్రముగా, బలిమిఁ = బలముతో.

## గంగావర్ణనము.

ఇ. (గంగ.—ఇది శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారమున బ్రహ్మాండములు భేదించు విశ్వరూపములో నూర్ధ్వలోకమును వ్యాపింపఁజేసిన పాదమును బ్రహ్మలోకమున బ్రహ్మ తనకమండలజలముతో శ్రీపాదతీర్థ మపేక్షించి ప్రక్షాళించినజలము ప్రవాహమై యాకాశమంతయు వ్యాపించి, భగీరథుని ప్రపితామహుల సద్గతికై ప్రార్థించి వచ్చుదాని వేగాతిశయమునను సహింపక యీశ్వరుఁడు తనజటాజూటమున ధరించి, మఱి ప్రార్థించిన, నతఁ డొకజడనుండి విడిచినదికూడ హిమవంతమునుుండి వెడలి, యధికప్రవాహమై జహ్నుని యాశ్రమము ముంచుకోఁగా, నాతఁడు నంతయుఁ బానముచేసి, మఱలఁ బ్రార్థింపఁగా, అతఁడును తనచెవినుండి విడువ, వచ్చి కాశ్యాదిక్షేత్రములను పవిత్రపఱచి, ప్రఖ్యాతమైన నదీశ్రేష్ఠము.)

గ. ఇతివిమానందక్షిణతః ప్రస్థాప్య కృశానుముద్దిశ్య॥ 97

వ. అని విమానమును దక్షిణపుఁదిక్కునకుం బోవిడిచి కృశాను నింగుఱించి.

మా. శిథిలితభవఖేదా శ్లిష్టవైకుణ్ఠపాదా
కృతవిపదపనోదా క్లిష్టచిత్తప్రసాదా ।
విమలతరతరఙ్గా విశ్రుతామ్భోధిసఙ్గా
విహితదురితభఙ్గా వీక్ష్యతా మత్రగఙ్గా॥ 98

అ. శిథిలిత+భవ+ఖేదా = ఛిన్నభిన్నముగాఁ జేయఁబడిన+సంసారపాపములవలని+దుఃఖములుకలదియు, శ్లిష్ట+వైకుంఠ+పాదా= ఆశ్రయింపఁబడిన+విష్ణువుయొక్క+పాదములుకలదియు, కృత+విపత్+అపనోదా = చేయఁబడిన+ఆపత్తులకు+నివారించుటకలదియు, క్లిష్ట+చిత్త+ప్రసాదా=కష్టపడువారియొక్క+మనస్సుకు + నిర్మలత్వమును కలుగఁజేయునదియు, విమలతర+తరంగా = మిక్కిలి పరిశుద్ధములైన+అలలుకలదియు, విశ్రుత+అంభోధి+సంగా= ప్రసిద్ధమైన+సముద్రముతోడి+సాంగత్యముకలదియు, విహిత+దురిత+భంగా= విధింపఁబడిన+పాపములకు+భంగము కలుగఁజేయునదియునైన, గంగా = గంగానది, అత్ర=ఇక్కడ, వీక్ష్యతాం=చూడఁబడుఁగాక. (అంత్యానుప్రాసాలం. మాలినీవృత్తము.)

తా. విష్ణుపాదోద్భవమై, సంసారదుఃఖములును సకలాపత్తులును సర్వదోషములును తొలఁగించుచు, నిర్మలములైన యలలతో దుష్కృతులకు చిత్తశుద్ధిని గలిగించుచు, సముద్రభార్యయైన యీగంగాదేవిని జూడుమా

తే. తలఁగి భవఖేద, మభవపాదమునఁ జెలఁగి,
తఱఁగి యాపద, సత్ప్రసాదమున మఱఁగి,
బహుళభంగయుఁ దానఘభంగమైన
గంగఁ గనుఁగొను మిదె నిధిసంగ నిలను.

టి. అభవపాదమునన్ = అపునర్భవుఁడును సనాతనుఁడునైన విష్ణువుయొక్క పాదమునందు, బహుళ+భంగ=చాలా+అలలుకలది, నిధి+సంగన్=సముద్రముతో+సంగమముకలదైన.

కృశానుః.—

గ. ఉపేక్షణీయాని భాగీరథీయాని పానీయాని కిమితి వీక్షణీయాని.

వ. ఉపేక్షింపఁదగు నీభాగీరథీనీర మేమని వీక్షింపఁదగు.

యతః.—

వ. యేషాం జని శ్చరణత స్తు హిరణ్యహ ర్తు
ర్దోషాక రేణ గురుదారవి టేన మాలా ।
బ్రహ్మోత్తమాఙ్గభిదఏవ సహస్థితిశ్చ
ఖ్యాతో లయో జడనిధౌ కిల గాఙ్గవారామ్॥ 100

అ. యతః=ఏలనంటే? యేషాం = ఏగంగాజలములకు, హిరణ్యహ ర్తుః= బంగారుదొంగయొక్క, చరణతః = ఆచరణమువలన -క్రియవలన, జనిఃతు=జన్మమో; బ్రహ్మ+ఉ త్తమాంగ+భిదః = బ్రాహ్మణుని+శిరస్సును+భేదించువాని యొక్క, మాలా+ఏవ = తలలోనే, గురుదార+వి టేన=గురుభార్యకు+విటుఁడైన, దోషాక రేణ=దోషములకు స్థానమైనవానితో, సహస్థితిః+చ = సహవాసమో; జడ+నిధౌ = పానాదులవలని జడులయొక్క+ద్రవ్యనిధియందు, లయః = కూడికయు, గాంగ+వారాం = అట్టి గంగాసంబంధియైన+జలములకు, (అదియది) ఖ్యాతః+కిల= ప్రఖ్యాతముకదా? (అని విరుద్ధార్థము.) యేషాం= ఏగంగాజలములకు, హిరణ్యహా ర్తుః = హిరణ్యకశిపు సంహారకుఁడైన విష్ణువు యొక్క, చరణతః = పాదమువలన, జనిః = జన్మమును, బ్రహ్మోత్తమాంగభిదఏవ=బ్రహ్మకపాలమును భేదించిన శివునకే, మాలా=తలలో, గురుదారవిటేన= బృహస్పతిపత్నీవిటుఁడైన, దోషాక రేణ=చంద్రునితో, సహస్థితిశ్చ=సహవాసమును, జలనిధౌ=సముద్రమందు, లయః= కలియూటయును, గాంగవారాం= ఆగంగాజలములకు, ఖ్యాతఃకిల = ప్రసిద్ధమేకదా?(అనివా స్తవార్థము.) (శ్లేషాలంకార, వసంతతిలకవృత్తములు).

తా. వేడుకకై చెప్పెడి స్వర్ణస్తేయము, గురుదారగమనము, బ్రహ్మహత్య, సురాపానము అనెడి పాతకములతో సహవాసము గలవి యనెడి విరుద్ధార్థములో,

వాస్తవముగ విష్ణుపాదమునఁబుట్టి, శివునిశిరస్సునఁ జంద్రునితోఁగూడి, సముద్రసంగమముతోడి జలములుగలది యనెడి ప్రస్తుతార్థములోను గంగాజలము ప్రశస్తమని చెప్పఁబడియె.

ఏలనంటే ? 97

తే. కనకహరణునాచరణానఁ ౯ గలిగి బ్రహ్మ
శిరము దఱిగినవానిదా ౯ శిరమునుండి
యాగురుకళత్రవిటుఁడు దో ౯ షాకరుండె
తోడుగానిది జడనిధిఁ ౯ గూడుగంగ.

టి. కనకహరణునాచరణాన౯ గలిగి = బంగారు దొంగలించినవాని దొంగతనమునఁబుట్టి—హిరణ్యకశిపు సంహారకుఁడైన విష్ణువు నూర్ధ్వలోకమున వ్యాపింపఁజేసిన యాపాదమునఁబుట్టి ; గురుకళత్రవిటుఁడు=గురుదారజారుఁడు—బృహస్పతిపత్నీజారుఁడు, దోషాకరుండు=దోషములకు గనియైనవాఁడు—శశాకరుఁడు, జడనిధి=జలనిధిఅనుచో "లడయోరభేదః "అని వైయాకరణమతము.

ఇ. హిరణ్యహార్త=హిరణ్యకశిపుసంహార్త.—29-వ పేజి చూడుము.

ఇ. దోషాకరుఁడు=చంద్రుఁడు. ఇతఁడు అత్రి అనసూయలపుత్రుఁడు, నక్షత్రరాజు, దక్షపుత్త్రికలైన అశ్విన్యాదులకు అధిపతి, బుధుఁడు కుమారుఁడు, మఱి యితఁడు కుందేలును లేడియును ఒడిలోకలవాఁడు అగుటచేత శశాంకుఁడు మృగాంకుఁడు అను పేళ్లతోఁగూడ కనఁబడువాఁడు.

ఇ. చంద్రగురువు=బృహస్పతి.—ఇతఁడు బ్రహ్మమానసపుత్రుఁడగు అంగిరసుని కుమారుఁడు, తారాపతి, దేవతలకందఱకును ఆచార్యుఁడు.

ఇ. దోషాకరమౌళి=చంద్రశేఖరుఁడు.—శివుఁడు, ఇతఁడు త్రిమూర్తులలో ఒకఁడు, పార్వతీదేవికి పెనిమిటి, సుబ్రహ్మణ్య విఘ్నేశ్వరులతండ్రి, నంది వాహనముగాను, చంద్రుఁడు శేఖరముగాను కలిగి, త్రిపురాసురులను సంహరించినవాఁడు, హాలసంద్రమున విషము పానముచేసినవాఁడు, భగీరథునివలన గంగను తలను ధరించినవాఁడు, మరుని యొక్క బ్రహ్మశిరమును ఖండించినవాఁడునతఁడు.

విశ్వావసుః.—

గ. మందమతే! కిముకుందపాదారవింద మరందధారాధునీమపి నిందసి? 101

వ. ఓరిమందమతీ! ముకుందపాదారవిందమందలి మకరందధారా రూపిణియగు నీగంగాధునీమణింగూడ నిందించుచున్నాఁడ వేమి?

పశ్య.—

వ. గాఙ్గాని వారి గరుడధ్వజపాదపద్మాత్
ఆవిర్బభూవు రపునర్ పునరిన్దుమౌళిమ్ ।
నిన్యు ర్విచిత్ర మమృతం సగరాన్వయంచ
నాతోధికం భువి పవిత్రతమం సమంవా॥ 102

అ. గాంగాని+వారి = ఈగంగాసంబంధియైన+జలములు, గరుడధ్వజపాదపద్మాత్ = విష్ణుపాదపద్మమునుండి, ఆవిర్బభూవుః= ఆవిర్భవించినవి. పునః= మఱల, ఇందుమౌళిం = శివుని, అపునర్ = పావనపఱచెను. సగర+అన్వయం చ=సగరునివంశమునుకూడ, విచిత్రం=ఆశ్చర్యకరమైన, అమృతం = మరణము లేనిస్వర్గమును, నిన్యుః = పొందించెను. అతః=దీనికంటె, అధికం = మించినదియు, పవిత్రతమం = మిగులపావనమైనదియు, సమంవా = సమానమైనదియు, న=లేదు. (వసంతతిలకవృత్తము.)

తా. ఈగంగాజలము విష్ణుపాదమునఁబుట్టి, శివునిశిరమును పవిత్రపఱిచి, సగరచక్రవర్తులనుర్ స్వర్గమును పొందించినది కనుక, దీనికంటె పావనమును, సమానము నీలోకమునఁగలదా?

తే. మురహరాంఘ్రిని జనియించి, ◌ పురహరోత్త
మాంగమును బావనముచేసి, ◌ యాసగరుని
పుత్రశతకము దివిఁ జేర్చె ◌ భువినిమండి,
కనుక దీనికి సరిహెచ్చు ◌ గలదె? జగతి.

టి. మురహరాంఘ్రిని= విష్ణుపాదమునందు, పురహరోత్తమాంగమును = శివునిశిరస్సును.

ఇ. సగరుఁడు ఒకచక్రవర్తి.-ఇతఁడు షట్చక్రవర్తులలోనొకఁడు, ఇతఁడు చేయు నశ్వమేధయాగమున అశ్వమును ఇంద్రుఁడు అపహరించికొనిపోయి దాఁచెను. అది తెలియక ఇతనివంశస్థులు ఆయశ్వమును వెదుకుచు నెక్కడను గానక పాతాళమునను వెదుకఁబోయి భూమిచుట్టు త్రవ్వుకొనిపోయినందున ఆ నేలయే ఇదివఱకు సముద్రమై అది సాగరమని పేరుపొందియున్నది.

కించ.—

వ. సా సర్వతోముఖవతీ తటినీ సరాగాం
మూర్తిర్విధేరివ బిభర్తి సరస్వతీంచ ।
భేదస్త్వియాన్ బలిజితశ్చరణారవిన్దాత్
ఆద్యా బభూవ చరమా కిల నాభిపద్మాత్ ॥ 103

అ. సా=ఆ, తటినీ=నది, సర్వతోముఖవతీ=మంచినీరుకలదియు, (నలుప్రక్కల ముఖములుకలదియునై,) విధేః+మూర్తిః + ఇవ=బ్రహ్మయొక్క+శరీరము+వలె, సరాగాం=ఎఱుపుతో (ప్రేమతో) సహితమైన, సరస్వతీం+చ=సరస్వతీనదిని (సరస్వతీదేవిని), బిభర్తి=ధరించుచున్నది. బలిజితః=విష్ణువుయొక్క, చరణారవిందాత్ =పాదపద్మమునుండి, ఆద్యా=మొదటిదిగాను; నాభిపద్మాత్ =బొడ్డుదామరనుండి, చరమా=వెనుకటిదిగాను, బభూవ = ఆయెను. భేదః తు=భేదమో, ఇయాన్+కిల=ఇంతేకదా? (ఉపమాశ్లేషాలంకారములు, వసంతతిలకవృత్తము.)

తా. ఈనది యావిష్ణుపాదమునఁబుట్టి జలసమృద్ధిలోనుండియు, సరస్వతీనదితోఁగూడి; ఆ విష్ణునాభినిఁబుట్టి నలుముఖములతోనుండి సరస్వతీదేవితోఁగూడియుండు బ్రహ్మమూర్తివలె నున్నది.

మఱియు.—

తే. వినుము! సర్వతోముఖముల * విష్ణుపదియ
విష్ణునాభిజమూర్తియై * వెలసి, కలిసె
రాగసహితయె యైన స * రస్వతి, దితి
జారియంఘ్రినాభిజలె తా * మైనకతన.

టి. విష్ణుపదిఅ=గంగయే, విష్ణునాభిజమూర్తియై=బ్రహ్మమూర్తియై, దితిజా
రి+అంఘ్రి+నాభిజలె=విష్ణువుయొక్క + పాదమందును, + బొడ్డునందును పు
ట్టినవియె, తాము=ఆగంగాసరస్వతులు.

అపిచ.—

ఉ. భాగీరథీం ప్రాప్య బుధాః పితృభ్యో
జలాఞ్జలిం సాదర మర్పయన్తి।
పాపాని సర్వాణి తతః పితౄణాం
భవ న్త్యహో? ద త్తజలాఞ్జలీని॥ 104

అ. బుధాః=జ్ఞానవంతులు, భాగీరథీం=గంగానదిని, ప్రాప్య=చేరి, పితృ
భ్యః=పితృదేవతలకు, జలాంజలిం=తర్పణముకు, సాదరం=ఆదరముతో, అర్ప
యంతి=ఇచ్చుచున్నారు. తతః=అందువలన, సర్వాణి=సకలమైన, పాపాని=
పాపములు, పితౄణాం=పెతరులకు, దత్త+జలాంజలీని=ఇయ్యఁబడిన + తర్ప
ణములుకలవి, భవంతి=అవుచున్నవి. అహో=ఆశ్చర్యము ?

తా. వివేకశాలులు ఈగంగాజలముతో పితృతర్పణము చేసిరేని, ఆపితరులు
సకలపాపములనుగా తర్పణమిచ్చి తొలఁగింతురు. అదే ఆశ్చర్యము. (ఉపజా
తివృత్తము.)

మఱియు.—

తే. జనులు పెతరుల కిల జలాం * జలి యొసర్తు
రాదరాన భాగీరథి * యందు, నందు
వలనఁ బెతరులుఁ దమపాప * ములకు నిలక
వెలిఁ బటాపంచలుగ జలాం * జలి యొసర్తు.

అన్యచ్చ.—

ఉ. భాగీరథీం యః పటుధీ రుపాస్తే
యథా(క్రతున్యాయత ఏషధన్యః ।
దేవత్వ మేత్య (త్రిదివే సురాణాం
భాగీరథీతి వ్యపదేశ మేతి॥ 105

అ. యః=ఏ, పటుధీః=సమర్థమైన బుద్ధికలవాఁడు, భాగీరథీం=గంగను, ఉపాస్తే=ఉపాసించుచున్నాఁడో, ఏషః=అయీ, ధన్యః=ధన్యుఁడు, యథా(క్రతున్యాయతః=యజ్ఞరీతిప్రకారము, దేవత్వం=దేవత్వమును, ఏత్య=పొంది, (త్రిదివే=స్వర్గమందు, సురాణాం = దేవతలలో, భాగీరథీ+ఇతి = భాగీరథీ+అని (భాగీ = అమృతాదిభాగములు కలవాఁడు, రథీ = విమానముకలవాఁడు అని), వ్యపదేశం=వ్యవహారమును, ఏతి=పొందుచున్నాఁడు.

తా. ఈభాగీరథిని యజ్ఞకర్మలలో ఉపాసించువాఁడు భాగీ, రథీ అని పేరు పొందును.

మఱియును.—

తే. ఎవఁడు భాగీరథిని నుపాశ్రీ సించు నతని
నిదియె భాగీరథీ యని శ్రీ పించు దివిని
నెట్టిదేవత నెవఁ డుపాశ్రీ సించువాఁడొ
యట్టిదేవత యగు నను శ్రీ న్యాయమునను.

టి. భాగీరథి=భగీరథునివలనవచ్చిన నది, భాగి = అమృతమున భాగముకలవాఁడు, రథి=దేవయానముకలవాఁడు.

కించ.—

శి. సరస్వత్యాశ్లిష్టా సవితృతనయాఽఽలిఙ్గితఝరా
స్ఫురద్గుచ్ఛస్వచ్ఛా (ప్రకృతి రివ భాతి (త్రిగుణభాక్ ।
తథా ప్యేషా దోషాపనయనపటు స్స్వాకలనయా
(ప్రగల్భం సంసారం (ప్రశమయతి కంసారిపదభూః॥ 106

అ. సరస్వతీ+ఆశ్లిష్టా=సరస్వతీనదితో+కూడినదియు, సవితృతనయా+ఆలింగిత+ఝరా = యమునానదితో + కౌఁగిలింపఁబడిన+ప్రవాహముకలదియు, స్ఫురత్+గుచ్ఛ + స్వచ్ఛా=ప్రకాశించెడు + పూలగుత్తివలె + తెల్లనిదియు నైన, ఏషా=ఇది, త్రిగుణ+భాక్ = శుక్ల, పీత, నీలవర్ణములను (సత్వ, రజ, స్తమోగుణములను) పొందినదై, ప్రకృతిః+ఇవ = మాయ+వలె, భాతి=ప్రకాశించుచున్నది. తథా అపి=అట్లైనను; దోష+అపనయన+పటుః = సకలదోషములను + పోఁగొట్టుటయందు + సమర్థమైన, కంసారిపదభూః=విష్ణుపాదోద్భవయైన గంగ, స్వ+ఆకలనయా=తన్ను + కూడుటచేత, ప్రగల్భం=సమర్థమైన, సంసారం = సంసారబంధమును, ప్రశమయతి = శమింపఁజేయుచున్నది. (శిఖరిణీవృత్తము.)

తా. ఈగంగ తాను తెల్లనయ్యు, యమునా సరస్వతులతోఁగూడి నలుపు పసుపునై సత్వరజస్తమోగుణములుగల ప్రకృతివలెనుండియు, సంసారబంధాది సర్వదోషములను హరించు దీని నంటినంతమాత్రముననే యీసంసారబంధము వదలిపోవును.

మఱియు.—

శా. స్వాంశుశ్వేతిమముల్ సరస్వతి హరిద్రాభల్ కళిందాత్మజా
స్వాంశుశ్యామలిమల్ గొనన్ద్రిగుణమై స్వచ్ఛాంగయీగంగ తా
సంసారాతియునయ్యెనోయ్యఁ బ్రకృతిన్ సాదృశ్యమై దృశ్యమై
కంసారాతి పదాత్మజాతియగుటన్ ఖండించి పాపచ్ఛటన్.

టి. స్వ+అంశు+శ్వేతిమముల్ = తనకాంతుల తెల్లఁదనములు, హారిద్రాభల్=పసపుఁగాంతులు, కళిందాత్మజా+స్వ+అంశు + శ్యామలిమల్ = కాళిందియనెడి యమునానదికాంతులయందలి నలుపులు, ప్రకృతిన్=మాయతో, సాదృశ్యమై=సాటికలిగి.

ఇ. సవితృతనయ=సూర్యపుత్రియమున.—ఇది సూర్యునివలన కళింపపర్వతమునఁబుట్టి సూర్యతనయఅనియు కాళింది అనియుం పేరుచెంది బృందావనముమార్గముగా ప్రవహించుచు శ్రీకృష్ణక్రీడావిశేషములకు స్థానమైయుండు యమునానది.

సరస్వతి=ఇదియు నొకనది.-బ్రహ్మావర్తమునకు ఎల్లగానుండునట్టిది.

శా. గామ్భీర్యేణగదాధరస్య హృదయం మాధుర్యత స్తద్గిరం
శ్వైత్యేనాచయశ స్తదీయ మనఘం శైత్యత స్తత్కృపామ్।
నైర్మల్యాతిశయేన తస్యధిషణాం నిత్యప్రసాదేన త
ద్వక్త్రంచానుసర న్తి తత్పదభువో వారాశిదారాఇమే॥ 107

అ. గదాధరస్య = విష్ణువుయొక్క, హృదయం = హృదయమును, తత్ + పద + భువః = ఆవిష్ణువుయొక్క + పాదమునుండి + పుట్టినట్టి, ఇమే = ఈ, వారాశిదారాః = సముద్రభార్యయైనగంగ, గాంభీర్యేణ = తనగంభీరగుణముచేతను, తత్ + గిరం = అతనివాక్కును, మాధుర్యతః = తన మధురగుణముచేతను, తదీయం = అతనిదై, అనఘం=నిర్దోషమైన, యశః=కీర్తిని, శ్వైత్యేనాచ=తన శ్వేతగుణముచేతను, తత్ +కృపాం=అతనికృపను, శైత్యతః=తనశీతలగుణముచేతను, తస్య+ధిషణాం=అతని+బుద్ధిని, నైర్మల్య+అతిశయేన=తననిర్మలత్వముతోడి+గుణాతిశయముచేతను, తత్ +వక్త్రంచ=అతని+ముఖమునున్, నిత్య+ప్రసాదేన=సర్వదాప్రసన్నగుణముచేతను, అనుసరంతి=అనుసరించుచున్నది.

తా. ఈగంగ విష్ణుపాదోద్భవ యవుటచేత ఆవిష్ణువుయొక్క హృదయ, వా, కీర్తి, కృపా, బుద్ధి, ముఖములను, తనయొక్కగాంభీర్య, మాధుర్య, ధావళ్య, శైత్య, నైర్మల్య, సౌమ్యగుణములతో అనుసరించుచున్నది.

మఱియు.—

ఉ. ధైర్యవిహారిశౌరిహృదిఁ కే దత్పది స్వర్ణది పోలికాలె గాం
భీర్యమునన్,యశంబుశుచి కే పేర్మిని,నిర్మలతన్ మనీష, మా
ధుర్యమునన్ వచోరచనఁ. కే దోయుదవర్ణుని పూర్ణసత్కృపా
ధుర్యత జైత్యతత్వమున, కే స్తుత్యముఖేందుని సుప్రసన్నతన్.

టి. ధైర్య+విహారి+శౌరి+హృదిన్ = ధైర్యముతో+విహరించు + విష్ణువుయొక్క+హృదయమును, తత్ + పది = ఆవిష్ణుపదియైన, స్వర్ణది=గంగ, శుచిపేర్మిని =  ... శైత్యత్వ ... శైత్యస్వరూపము

తో, స్తుత్య+ముఖేందుని=పొగడఁదగిన+ముఖచంద్రుని. (ఉల్లేఖాలంకారము.)

## కాశీవర్ణనము.

(కాశి—మోక్షప్రదాయకములయిన సప్తపుణ్యపట్టణములలో నొకటి. ఇది శివసాన్నిధ్యమువలన విశేషమహిమకలిగి, ఇందు మృతించువారికి ముక్తినిచ్చుచు; వరుణ, ఆసి అనురెండునదులతోఁ గూడి, వరుణాసి, వారుణాసి అనిపేరు పొందె. గంగయొడ్డున నుండునట్టిది.)

గ. ఇతి బద్ధాఞ్జలి రగ్రతోఽవలోక్య సానన్దమ్. 108

వ. అని సాంజలియై యెదుగఁజూచి, సానందముగ.

ఇం. కాశీ సకాశీభవ దింద్రగేహ
సౌధాగ్రభాగా బహుసప్తినాదా।
ఇన్దే మయూఖై రియ మన్ధకార
వ్యుత్పత్తిశూన్యా శివశేఖరేన్దోః ॥ 109

అ. సకాశీభవత్+ఇంద్రగేహ+సౌధ+అగ్రభాగా=సమీపమగుచున్న+స్వర్గలోకముగల+మేడలయొక్క+పైభాగములు కలదియు, బహు+సప్తి+నాదా=విస్తారమైన+గుఱ్ఱముల+హేషాధ్వనులు కలదియు, శివ+శేఖర+ఇందోః= శివునికి+శిరోభూషణమైన+చంద్రునియొక్క, మయూఖైః=కిరణముల చేత, అంధకార+వ్యుత్పత్తి+శూన్యా=కటిక చీఁకటియొక్క+పుట్టువే+హీనమైన, ఇయం=ఈ, కాశీ=కాశీపట్టణము, ఇంధే=ప్రకాశించుచున్నది.
(ఇంద్రవజ్రావృత్తము.)

తా. ఈకాశీపట్టణము మేడల మీఁదిభాగములతో స్వర్గలోకమంటుచు, అందలి దేవస్థానమందు విశ్వనాథుని శిరశ్చంద్రకిరణములచే రాత్రిలోను చీఁకటియె కనఁబడకయున్నది.

శ్లో. అమర ధమరలోక శ్లాఘనలోకభవ్యు పేయు

మీఁదిమి దెటిండ కీ మీఁది ప్రజలు

శివునిశిరము శశియకె చిమ్మచీకటిచిమ్మఁ
గా, నమాసనిసిఁ బ్రకాశి కాశి.

టి. అమరక్=తగునట్లుగ, శశి+అ=చంద్రుఁడే, అమాసనిసిక్ = అమావాస్యరాత్రిలోఁగూడ, ప్రకాశి=ప్రకాశించునది.

కృశానుః.—

గ. కిమరే? వయస్య! ఏషాపి తవ స్తవ్యపదమ్. 110

అ. అరే=ఓరీ, వయస్య=స్నేహితుఁడా! ఏషా+అపి= ఈకాశికూడ, తవ= నీకు, స్తవ్య+పదం+కిం=స్తోత్రముచేయఁదగిన+స్థానమా?

కృశానుఁడు.—

వ. ఏమిరా! చెలికాఁడ! నీకిదికూడఁ గొనియాడఁదగినచోటా?

పశ్య.—

శా. యేమృష్టాన్నభుజోగజోత్తమహయారోహాఃస్వగేహాన్తరే
మత్తాభిర్మహిళాభిరత్ర విహరంత్యాముక్తముక్తాస్రజః।
తేఘోరాస్థిధరా విరాజదనడుద్వాహా విషాహారిణో
నర్తిష్యంత్యవశాఃస్మశాననిలయా నీచైఃపిశాచైస్సమమ్॥

అ. అత్ర=ఇక్కడ, యే=ఎవరు, మృష్ట+అన్న+భుజః=పరిశుద్ధములైన+అన్నములను + భుజించువారును, గజ+ఉత్తమహయ+ఆరోహాః = ఏనుఁగులను+మంచిగుఱ్ఱములనుక్ +ఎక్కువారును, ఆముక్త+ముక్తాస్రజః= తొడ్గఁబడిన +ముత్యాల+దండలు గలవారునై, స్వ+గేహ+అంతరే=తమతమ+ఇండ్ల+లోపల, మత్తాభిః=గర్వించియుండు, మహిలాభిః=పట్టపుదేవులతో, విహరంతి=విహరించుచుందురో, తే=వారు, ఘోర+అస్థి+ధరాః=భయంకరములైన+ఎముకలను+ధరించువారును, విరాజత్+అనడుత్+వాహాః=ప్రకాశించెడు+ఎద్దు + వాహనముగాఁ గలవారును, విష+ఆహారిణః = విషము+ఆహారముగాఁ గలవారును, స్మశాన+నిలయాః=స్మశానమే+స్థానముగాఁ గలవారును, అవశాః=స్వ

వశము కానివారలై, నీచైః=నీచములైన, పిశాచైః+సమం = పిశాచములతోఁ గూడ, నర్తిష్యంతి=నటించుచున్నారు.

తా. ఇక్కడ శైవులంపటు షడ్రసోపేతమైనయన్నమును విడిచి విషమును తినుచు, గజాశ్వములనువిడిచి యెద్దునెక్కుచు, ముత్యాలహారములువిడిచి యెముకచండలు వేసికొనుచు, పట్టుపుదేవులనువిడిచి పిశాచములతోఁగూడుకొని యాడుకొనుచుందురు. (ఇక్కడ శివసారూప్యమును పొందుదురని ధ్వన్యర్థము.) 111

చూడుఁ?.—

సీ. ఎవ్వాఁడు షడ్రసో పేతము తినువాఁడు
వాఁ డవ్విసము తిను వాఁడె యగును,
ఎవ్వాఁడు గజవాజు లెక్కుడుగలవాఁడు
వాఁ డెద్దునెక్కెడు వాఁడె యగును,
ఎవ్వాఁడు మేడల యెడ వసించెడువాఁడు
వాఁ డెప్డు నుడిగాటి వాఁడె యగును,
ఎవ్వాఁడు పేరుల నెదయందు నిడువాఁడు
వాఁ డెమ్ములెద నిడు వాఁడె యగును,
తే. అన్నియటులుండ నిటనిండు నందకత్తె
లైన చానలతో నాడు నట్టి ధన్యుఁ
డట్టి నీచపిశాచుల యాటలోనఁ
దా నొకండుగ నాఁడు నెం దాఁకనైన.

టీ. ఇందెంత యెక్కువస్థితికలవాఁడైనను, ఇట్లు తక్కువస్థితికలవాఁడగునని తోఁచు నర్థమునకు ఎట్టివాఁడైన నిట్టి శివరూప్యమును పొందువాఁడె యాననుట.

అన్యచ్చ.—

శా. దత్తంసాధుషు దే యదేకమపి తత్క్షేత్రప్రభావాద్భవేత్
కా[illegible]స్థయా ।

వాసంప్రాప్యముహుర్బహూనిదదతో వాసాంసిజన్మాంతరే
లోకాహంత భజంతిదిగ్వసనతాం హేకాశి! తుభ్యంనమః॥

అ. హేకాశి=ఓకాశీ! యత్=ఏది, ఏకం+అపి=ఒకటియైనను, సాధు+ముదే=సత్పురుషుల+సంతోషముకొఱకు, దత్తం = ఇయ్యఁబడినదో, తత్ = అది, క్షేత్ర+ప్రభావాత్ = క్షేత్రముల+ప్రభావమువలన, కామం=బహుగా, కోటిగుణం=కోటియంత, భవ+అంతరే=వేఱుజన్మమందు, భవేత్=అగును. ఇతి=అని, త్వయి+తు=నీయందో, ఆస్థయా = పట్టుతో, ఖ్యాతం = ప్రశస్తమైన, వాసం=స్థానమును, ప్రాప్య = పొంది, లోకాః = జనులు, ముహుః = పలుమాఱు, బహూని=బహుగా, వాసాంసి = వస్త్రములను, దదతః=ఇచ్చువారై, జన్మ+అంతరే=వేఱుజన్మములో, హంత = అయ్యో? దిగ్వసనతాం = దిగంబరత్వమును, భజంతి=పొందుచున్నారో? తుభ్యం=అట్టినీకు, నమః = నమస్కారము.

తా. ఆయాక్షేత్రములప్రభావముచేత అక్కడక్కడ సత్పురుషుల కేదైన నొకటి దానముచేసినయెడ మఱుచటిజన్మములో అది కోటింతలుగా అవును. అని లోకప్రసిద్ధవిధియుండఁగా, ఇక్కడ ఎన్నెన్నివస్త్రము లెవరెవరికిదానము చేసినను, అది మఱుచటిజన్మములో వానిని దిగంబరిఁగాఁజేయును (శివసారూప్యమిచ్చుననుట.) 112

మఱొకటి —

తే. ఇట నొకటియిచ్చినను క్షేత్ర ♦ పటిమనదియె
కోటియగునన నంబర ♦ కోటియొసఁగు
వాఁడు నటుదిగంబరుఁడగు ♦ వరుస నెసఁగు
కాశి! సేయుదునిదె నమ ♦ స్కారమీకు.

టి. దిగంబరుఁడు = శివుఁడు-వస్త్రహీనుఁడు, ఎసఁగుకాశి=ప్రకాశించునట్టి ఓకాశీ! (ఇటను పయిపద్యమువలెనే ప్రతీతార్థమునకు ధ్వన్యర్థము).

వ. వారాణసి! త్వయి సదైవ సరోగభూమా
వారోగ్యభూమిరితి కామ మలీకవాదః ।
సన్తస్థుషాం భవతి యత్రవపు స్సశూలం
జన్మాన్తరేఽపి జలభారవ దుత్తమాఙ్గమ్॥ 113

అ. వారాణసి=ఓకాశీ! యత్ర=ఎక్కడ, సంతస్థుషాం=వాసముచేయువారికి, జన్మాంతరేఽపి=మఱియొకజన్మములోఁగూడ, వపుః =శరీరము, సశూలం=శూలరోగముతోడిదిగాను (శూలాయుధముతోడిదిగాను), ఉత్తమాంగం=శిరస్సు, జలభారవత్=శైత్యభారముకలదిగాను(జలాతిశయముకలదిగాను),భవతి=అగుచున్నదో, తత్ర=అట్టి, స+రోగ+భూమా = రోగసహితమైన భూమిగల (సరః+గ+భూమా = గంగాప్రవాహముతోఁగూడిన భూమిగల), త్వయి=నీయందు, ఆరోగ్య+భూమిః+ఇతి=ఆరోగ్యముతోడి+భూమియని(అ+ర+ఉ+గ=బిందుమాధవుఁడను విష్ణువుతోను+నేత్రాగ్నితోఁగూడిన+విశ్వనాథుఁడను శివునితోను గూడియుండుటకు+స్థానమని), సదా+ఏవ=ఎప్పుడునే, కామం=బహుగా, అలీక+వాదః = అబద్ధమైన + ప్రవాదము. (వసంతతిలకవృత్తము).

తా. ఓ కాశీ! ఇక్కడ వాసముచేయువారికి విరుద్ధార్థమున శూలరోగ శైత్యరోగములు కలిగించియు, ఆరోగ్యము కలుగఁజేయుచున్నావనియు; వాస్తవార్థమున శూలిత్వ గంగాధరత్వములు కలిగించియు, శివసారూప్యము కలుగఁజేయుచున్నావనియు లోకవదంతి. (వ్యాజస్తుత్యలంకారము).

క. కాశీ! నిన్ను సరోగను
వాసిగ సారోగ్యయనెడు కీవాదమగునె? సా
వాసికి నిటనిచ్చలునగు
నాశూలము, జలభరంబు కీనగు మైఁదలపైఁ.

టి. స+రోగ = రోగసహిత (సరః+గ = జలప్రవాహగత) స+ఆరోగ్య = ఆరోగ్యసహిత(మైఁ ఆశూలముఁ, తలపైఁ జలభరంబునగుఁ. (ఇటను పైయట్టుల ధ్వన్యర్థము).

విశ్వావసుః.—

గ. అనిపుణధిషణ ! గుణోదయానపికిమితి దోషీకరోషి యదే
తన్నాగరవాసినాభోగినాఽపి యోగినాం ప్రాప్యం శివసా
రూప్యమాప్యతే. 114

అ. అనిపుణ+ధిషణ = నేర్పులేనిబుద్ధిగలవాఁడా! యత్=ఏది, ఏతత్+
నగర+నివాసినా=ఈ పట్టణమున+వాసముచేయునట్టి, భోగినాఽఅపి = సకల
విషయాంతరము లనుభవించువానిచేతఁగూడ, యోగినాం =హఠాదియోగము
లుకలవారికి, ప్రాప్యం = పొందఁదగిన, శివసారూప్యం = శివునివలనిముక్తి,
ఆప్యతే=పొందఁబడుచున్నదో, (అట్టి) గుణ+ఉదయాం అపి=గుణాతిశయ
ముల+ఉత్పత్తిగలదైనను (దీనిని), కిం+ఇతి=ఏమని, దోషీకరోషి= దోషము
లుగలదిగాఁ జేయుచున్నావు.

తా. ఈ కాశిలో ఎట్టివిషయాంతరాసక్తికలవాఁడయ్యును, వానికి మ
హాయోగులు పొందఁదగినట్టి శివసారూప్యముక్తికలుగుచుండఁగా, నీవుబుద్ధిలేక
దీనికి దోషమును కలిగించుచున్నావేమి?

విశ్వావసువు.—

క. సగుణమునయినను దీనిని
మిగులఁగ నతిదోషిఁజేసి కిమించెదవే, మీ
నగరమునను గను భోగి యె
సఁగఁదగు యోగియెగను శివకిసారూప్యంబుల్.

టి. దీనిని=ఈకాశిని, ఎసఁగన్=అతిశయించుటకు, భోగి+కనున్= సం
సారానుభవముకలవాఁడు+పొందును.

అత్ర దేహ మపవిత్రమపాస్య
న్నచ్ఛమృచ్ఛతివపుః కిలయస్య।
లోచనేశుచిరవాప్త నిటాలే
మస్తకే శశికళా ...

అ. అత్ర=ఈకాశియందు, అపవిత్రం = అపరిశుద్ధమైన, దేహం=శరీరమును, అపాస్యన్=విడుచుచు, యస్య=ఏశరీరమునకు, అవాప్త+నిటాలే= పొందఁబడిన+ఫాలప్రదేశముగల, లోచనే=కంటియందు, శుచిః=అగ్నియు, జటాలే=జడలుగల, మస్తకే = తలయందు, హరపద+అంబు = విష్ణుపాదతీర్థమైన గంగయు, (కలదో) తత్ = అట్టి, అచ్ఛం=నిర్మలమైన, వపుః = శరీరమును, బుచ్ఛతికిల = పొందుచున్నాఁడుగదా?

తా. ఈకాశిలో నెవనికిఁ గాని తన మలమూత్రవిశిష్టమైన శరీరము వదిలినయెడల, వానికి నొసట అగ్నినేత్రమును, జడలతోడి తలయందు గంగయును గల శివసారూప్యము కలుగునసుట.

క. వపు వపవిత్రము తత్ర
త్యపురుషుఁ డందే విరక్తిఁ దా ద్యజియించుడుఁ గాం
చుఁ బవిత్రపు వపువున మూ
ర్థపుఁదటిఁ దటినిన్, దృశాగ్నిఁ దా దననిటలతటిన్.

టి. వపువు=శరీరమును, తత్రత్యపురుషుఁడు = అక్కడిమనుష్యుఁడు, త్యజియించుడున్=విడిచినతోడనే, మూర్థపుఁదటిన్ = శిరఃప్రదేశములో, తటినిన్=నదిని, తననిటలతటిన్=తననొసటిప్రదేశములో, దృశాగ్నిన్=నేత్రాగ్నిని, కాంచును.

గ. అదఃపురవాసినా మన్యాప్యేషా ధన్యతా. 116

అ. అదఃపుర+వాసినాం= ఈపట్టణమున+వాసముచేయువారికి, ఏషా + అపి=ఇదియు, అన్యా=మఱియొక, ధన్యతా=కృతార్థత.

వ. ఈపురినుండువారి కిదియు మఱొకండు కృతార్థతము.

ఉ. ప్రదోషవత్యాప్తి ఇహప్రదోష
సటోఽన్ధకారివ్యపదేశనుంతే।
ప్రకాశయత్యేషహి తారకోద్య
న్న్యూనంహి కణ్ణాస్య ప్రదేశే॥ 117

అ. అంధకారి+వ్యపదేశం=అంధకాసురుని శత్రువనియు (అంధకార ముగలవాఁడనియు) పేరిని, ప్రాప్తః=పొందినవాఁడైన, ప్రదోష+నటః=సాయం కాలమందు+నటించునట్టి, ఏషఃహి=ఈశివుఁడు కదా? ప్రదోషవత్=సాయం కాలమువలెనే, ఇహ=ఈకాశిలో, నృణాం=మనుష్యులయొక్క, అంతే=అం త్యకాలమందు (దినాంతములో), కర్ణనభఃప్రదేశే= చెవిలోని ఆకాశప్రదేశ మందు (సర్వవ్యాపియైన ఆకాశప్రదేశమందు), తారకోద్యద్వర్ణాన్ = తారక మంత్రమందు స్పష్టమైన అకారాది అక్షరములను (నక్షత్రములమండి కలుగు చున్న కాంతులను), ప్రకాశయతి = ప్రచురపఱచుచున్నాఁడు. (ఉపజాతి)

తా. అంధకారముతోఁ గూడెడు ప్రదోషకాలము,(సాయంకాలము)సర్వ వ్యాపియైన ఆకాశమందు, నక్షత్రములకాంతులను ప్రకాశింపఁజేయునట్లు;అం ధకాసురుని శత్రువై సాయంసమయమున నటించునట్టి శివుఁడు ఈకాశిలోని మనుష్యదేహాంత్యకాలమందు చెవిరంధ్రములో తారకమనెడు ప్రణవములోని అకార ఇకార ఉకారములను ఉపదేశము చేయుచున్నాఁడు.

తే. దుష్ప్రదోషనటన నప్ప్రదోషనటుఁడు,
కాశిపురమంద కర మంధకారియునయి
తారకాంతరవర్ణముల్ తారసిలెడు
ప్రజలకర్ణాంబరంబులఁ బ్రబలపఱుచు.

టి. దుష్ప్రదోషనటనన్=కాంతితగ్గిపోయెడు సాయంకాలపు నడకలో, కరము=మిక్కిలి, తారకాంతరవర్ణముల్=తారకమంత్ర మధ్యాక్షరములను, తారసిలెడు=చేరెడు,కర్ణ+అంబరంబులన్=(సర్వవ్యాపియైనఆకాశమునందు.)

గీ. ఇతి గఙ్గాతీరజనపదం కృత్స్నమవేక్ష్య సాంజలిబంధం. 118

అ. ఇతి=ఇట్లని, గంగాతీరజనపదం=గంగాతీరదేశమును, కృత్స్నం=సర్వ మును, అవేక్ష్య=చూచి, సాంజలిబంధం=అంజలిబంధముతో.

వ. అని గంగాతీరప్రదేశము సమస్తమును సమవలోకించి యంజలియొనర్చి.

ఉ. ప్రాతఃప్రాత ర్జాహ్నవీవారి భక్త్యా
గ్రాహంగ్రాహం క్లృప్తనిత్యక్రియేభ్యః।
పుష్పైరాద్యం పూరుషం పూజయద్భ్యః
పూతాత్మభ్యో భూసురేభ్యో నమోఽస్తు॥ 119

అ. ప్రాతఃప్రాతః=ప్రతిప్రాతఃకాలములో, భక్త్యా=భక్తితో, జాహ్నవీవారి=గంగాజలమును, గ్రాహంగ్రాహం=పలుమాఱు స్నానమున గ్రహించి, క్లృప్త నిత్యక్రియేభ్యః=అనుష్ఠింపఁబడిన సంధ్యాది నిత్యక్రియలు గలవారును, ఆద్యం+పూరుషం=పురాణ+పురుషుఁడైన హరిని హరునిన్, పుష్పైః=పువ్వులతో, పూజయద్భ్యః=పూజించువారును, పూత, ఆత్మభ్యః=పవిత్రమైన మనస్సుగలవారునైన, భూసురేభ్యః=బ్రాహ్మణులకును, నమః = నమస్కారము, అస్తు=అగునుగాక?

తా. ఇట ప్రతిదినము ఉదయాన గంగాస్నానముచేసి పురాణపురుషుఁడైన హరినిగాని, హరునిగాని పుష్పములతో పూజించు పవిత్రాత్ములైన బ్రాహ్మణులకు నమస్కారము.

తే. వేఁకువను వేఁకువను జాహ్నవీ జలాన
స్నానమును జేసిచేసి యాచారవిధులఁ
బూరుషునినాద్యుఁ బూవులఁ బూజసేయు
పావనుల బ్రాహ్మణులఁగూర్తుఁ బ్రణతిచేసి.

టి. వేఁకువను వేఁకువను=ప్రతి వేఁకువజాములో, ప్రణతి = నమస్కారమును, కూర్తున్=ప్రేమింతును.

కృశానుః.—

గ. కిమేత ద్దేశవాసినోఽపి బ్రాహ్మణాః కేవలం కలిమాహాత్మ్యాకలితశాస్త్రీయచర్యావిపర్యయాః భవతా నమస్క్రియంతే? పశ్య తావత్ ? ప్రాయేణాస్య కాశీదేశజనస్య సుచర్యావిపర్యాసమ్. 120

అ. కిం=ఏమి? ఏతత్ దేశ+వాసినోపి = ఈదేశమున+వాసముచేయువారైనను, బ్రాహ్మణాః=బ్రాహ్మణులు, కేవలం=బహుగా, కలి...విపర్యయా - కలి=కలిపురుషునియొక్క, మాహాత్మ్య=మహిమతో, ఆకలిత = కూడుకొన్న, శాస్త్రీయ=శాస్త్రవిహితమైన, చర్యా+నడవడికయొక్క, విపర్యయాః=విపరీతత్వముగలవారై, భవతా=నీచేత, నమస్క్రియంతే=నమస్కరింపఁబడుచున్నారు? ప్రాయేణ=బహుగా, అస్య=ఈ, కాశీదేశజనస్య=కాశీదేశము జనముయొక్క, సుచర్యా+విపర్యాసం=నడతవ్యత్యాసమును,పశ్యతావత్ =చూడు?

తా. ఈదేశపు బ్రాహ్మణులు బహుగా కలిమహత్త్వముచేత శాస్త్రాచారములు లేనివారైనను, నీచే నమస్కరింపఁబడుచున్నారె యేల? బహుగా ఈ దేశపు జనులయొక్క విపరీతాచారముచూడు?

వ. కేవలము కలిమహిమచే విధివిహితమునువిడిచి, విపరీతాచారప్రకారము గల యీ దేశపుబ్రాహ్మణులును నీచేనమస్కారము చేయఁబడువారా? అదెచూడు? తెలుచుగా నీకాశీదేశీయుని యాచారవికారమును?

టి. విధివిహితమును+శాస్త్రనియమితమును, దేశీయుని=దేశస్థునియొక్క.

శా. శస్త్రైర్జీవతి శాస్త్రముజ్ఝతి పరం శూద్రాహృతైరమ్బుభిః
స్నాత్వాచామతి దేవతాస్స్నపయతి స్వైరం పచత్యోదనమ్।
ఉచ్ఛిష్టాన్నబిభేతి యాతి యవనైరుచ్చావచైస్సంగతిం
మాతఙ్గాన్నికటాగతానగణయన్ మార్గే ముహుర్గాహతే॥

అ. (సద్వంశ్యుఁడు) శస్త్రైః=ఆయుధములతో, జీవతి=జీవించుచున్నాఁడు; శాస్త్రం=శాస్త్రమును, పరం=బహుగా, ఉజ్ఝతి=విడుచుచున్నాఁడు; శూద్ర+ఆహృతైః=శూద్రులచే+తేఁబడిన, అంబుభిః=నీళ్ల చేత, స్నాతి = స్నానముచేయుచున్నాఁడు; ఆచామతి=ఆచమించుచున్నాఁడు; దేవతాః = దేవతలను, స్నపయతి=స్నానము చేయించుచున్నాఁడు; స్వైరం=తానుగా, ఓదనం=అన్నమును, పచతి=వండుచున్నాఁడు; ఉచ్ఛిష్టాత్ =ఎంగిలివలన, నబి

భేతి=భయపడఁడు; ఉచ్చావచైః=ఎచ్చుతగ్గులవారైన-నానావిధములైన, యవనైః=తుఱకలతో,సంగతిం=కూడికను, యాతి=పొందుచున్నాఁడు; నికట+ఆగతాన్=సమీపమున+వచ్చినట్టి; మాతంగాన్=మాలలను; అగణయన్=ఎంచనివాఁడై; మార్గాన్=దారులను, ముహుః = పలుమాఱు, గాహతే = చేరుచున్నాఁడు.

తా. ఈకాశీ వాసపుబ్రాహ్మణుఁడు ఆయుధాలతో జీవించుచు, శాస్త్రాచారమునువిడిచి, శూద్రుఁడుతెచ్చిన నీళ్లతో స్నానముచేయుచు, ఆచమనముచేయుచు, దేవవిగ్రహములను స్నానముచేయించుచు, తానుగానే వండుకొనుచు, ఎంగిలికిని భయపడక, నానావిధపు తుఱకలతోఁగూడుచు, దగ్గఱించుచున్నమాలలనుకూడ నెంచక, పలుమాఱు త్రోవలలో తిరుగుచుండును. 121

తే. శస్త్రమేకాని కానఁడే శాస్త్రమేని
నేట శూద్రుఁడు తెచ్చిన నీట మునిఁగి
పుక్కిలించియు, జేజేలఁ బొసఁగ ముంచి
తనుగ వండియె యెంగిలికిని దలంక
కరిగి, తుఱకల మఱిఁగి, యా తెరువులందు
నోలి మాలలె మ్రోలరా నొదఁగఁడిందు.

టి. బొసఁగన్=చక్కఁగా, తలంకక=భయపడక, ఓలిన్ = వరుసగా, మ్రోలన్=దగ్గరగా.

కించ.—

శా. ప్రాతర్హన్త? కృతాప్లవోఽపి రజకస్పృష్టాన్ జడో రాసభైః
ఊఢాన్ ధారయతే పటాననుదినం ధృత్వాబహిర్గచ్ఛతి ।
గత్వామ్లేచ్ఛముఖాశుచీన్ స్పృశతిచస్పృష్ట్వాపినస్నాత్యహో
నస్నాఽతో ప్యథభుంక్తఏషచపలో ముక్త్వాపి నవ్రీడతి॥ 122

అ. జడః=మూఢుఁడై,చపలః=చంచలుఁడైన, ఏషః=ఈబ్రాహ్మణుఁడు,ప్రాతః=ఉదయాన, హంత=అయ్యో?కృత+ఆప్లవః+అపి=చేసిన+గంగాస్నానముగ

లవాఁడు+అయినను; రజక+స్పృష్టాన్=చాఁకలిచేత+తాఁకఁబడినవియై, రాస భైః=గాడిదలచేత, ఊఢాన్=మోయఁబడిన, పటాన్=బట్టలను, ధారయతే=ధరించుచున్నాఁడు; ధృత్వా=ధరించి, బహిః=వెలపట, గచ్ఛతి=పోవుచున్నాఁడు; గత్వా=పోయి, మ్లేచ్ఛ=ముఖ+అశుచీన్ = తురకలు+మొదలైన+అనాచార పరులను, స్పృశతిచ=తాఁకుచునున్నాఁడు, స్పృష్ట్వాఅపి+తాఁకియు, నస్నాతి=స్నానముచేయఁడు; నస్నాతఃఅపి=స్నానము చేయనివాఁడయ్యును, అథ=వెనుక, భుంక్తే=భుజించుచున్నాఁడు, భుక్త్వాపి=భుజించియు, నవ్రీడతి= సిగ్గుపడఁడు, అహో=ఆశ్చర్యము?

తా. ఇక్కడి బ్రాహ్మణుఁడు ఉదయాన స్నానముచేసియు, చాకలవాని చేత తాఁకఁబడి గాడిదలచేత తేఁబడిన బట్టలను ధరించి, వెలుపట తిరుగుచు, తురకలు మొదలైనవారిని తాఁకుచు, స్నానముచేయకయె తినుచుండును; ఇట్లు చపలబుద్ధి గలవాఁడయ్యును సిగ్గే పడఁడు.

మఱియు.——

ఆ. తగునె? మునిఁగి చాకిఁ దాఁకి గాడిదమోయు
బట్టదొడిఁగెఁ, దొడిఁగి బైటికేగె,
నేగి మ్లేచ్ఛవితతిఁ దాఁకెఁ, దాఁకియు మునుక-
విడిచె, విడిచి సిగ్గు విడిచెఁ గుడిచి.

అపిచ.——

శా. నీచైర్దుర్వ్యసనైశ్శునీభిరపివా నిశ్శఙ్కమాలోకితం
భుఙ్క్తే పఙ్క్తివిదూషకైస్సహనరైరజ్ఞాతవేదాక్షరః ।
మద్యాస్వాదనమత్తచిత్తజనతామోహాయ భీహానతః
కర్మాణ్యారభతే శ్రుతిస్మృతివచోదూరాణ్యసారాణ్యహో?॥

అ. అజ్ఞాత+వేద+అక్షరః = తెలిసికోఁబడని+వేదముయొక్క+ఒక యక్షరమైనగలవాఁడై, నీచైః = నీచులైన, దుర్వ్యసనైః = దుష్టులగు తురకలచేతను, శునీభిః అపివా=కుక్కలచేతనుకూడ, ఆలోకితం = చూడఁబడినదానిని,

పఙ్క్తివిదూషకైః = పఙ్క్తిలోదూషించువారైన, నరైస్సహ = మనుష్యుల తోఁకూడ, నిశ్శంకం=జంకులేకుండ, భుంక్తే=తినుచున్నాఁడు. మద్య+ఆస్వాదన+మత్త+చిత్త+జనతా+మోహాయ = కల్లు+త్రాగుటచేత + మదించిన+మనస్సుగల+జనసమూహముయొక్క+అజ్ఞానముకొఱకు, భీ+హీనతః=భయము+లేనందువలన,శ్రుతి+స్మృతి+వచః+దూరాణి =వేదములయు+మన్వాదిస్మృతులయు+వాక్యములకు+దూరములై,అసారాణి = నిస్సారములైన, కర్మాణి = క్రియలను, ఆరభతే= ఆరంభించుచున్నాఁడు.

తా. ఇక్కడిబ్రాహ్మణుఁడు వేదములో నొకయక్షరమైన నెఱుగనివాఁడవుటచేత నీచులైన తురకలును ఆడుకుక్కలును చూచిన యన్నమును పఙ్క్తిదూషకులైన నీచులతోఁకూడ జంకులేకుండ తినుచున్నాఁడు. కల్లుత్రాగి పత్తెక్కిన జనుల మోసపుచ్చుటకై భయమనునదిలేకయే, వేదస్మృతివాక్యములకు దూరములై నిష్ఫలములైన క్రియలనే చేయుచున్నాఁడు. 123

మఱియు.—

తే. తుఱకబఱకలుగని, శునిశ్రుతుటుములంటి
దూషితము నన్నమును బంక్తిదూషకులను
గలసి, తిని, త్రావి, మత్తిలుఖలులుమెచ్చ
కొఱకువిధి నిషిద్ధముఁజేయుకొంటెఁగంటె?

టి. తుఱక బఱకలు= దుష్టులైనతుఱకలు, శునితుటుములు = ఆడుకుక్కలసమూహములు, ఖలులు=దుష్టులు, విధినిషిద్ధముకొ=శాస్త్రనిషేధమునుగూడ.

అపిచ.—

శ్లో. కన్యాంకామప్యదూహ్యా ప్రవిజహదుదయద్యౌవనామజ్ఞ ఏనాం। ద్రవ్యాశాపాశకృష్టోభ్రమతి చిరతరం హన్త! దేశాన్తరేషు । అన్యోన్యాశ్లేషవాఞ్ఛా విగలితవయసో రాత్రినాలిన్యమత్యో । ర్దమ్పత్యోర్వ్యర్థదినైవం హతవిధిరుభయో ర్లోకయో శ్లోకయోగమ్॥ 124

అ. అజ్ఞః = వివేకములేనివాఁడు, కామపి = ఒకానొక, ఉదయత్ + యౌవనాం= కలుగుచున్న+వయస్సుగల, ఏనాం కన్యాం = ఈచిన్నదానిని, ఉద్వాహ్య= పెండ్లియై, ద్రవ్యాశాపాశకృష్టః = దుద్దాస యనెడు దారాల చేత కట్టఁబడినవాఁడై, ప్రవిజహాత్ =విడిచిపెట్టుచు, దేశాంతరేషు = వేఱుదేశములలో, చిరతరం=చాలకాలము, భ్రమతి=తిరుగుచున్నాఁడు; హంత=అయ్యో? అన్యోన్య+ఆశ్లేష+వాంఛా+విగలిత+వయసోః = ఒకరొకరియొక్క +ఆలింగనమందు+ కోరిక చేత+తొలఁగిపోయిన+వయస్సుగలవాఁడై, ఆర్త+మాలిన్య + మత్యోః = పొందఁబడిన + వ్యసనమనెడు మలినత్వముతోఁడి + మనస్సుగలవారైన, దంపత్యోః = దంపతులకు, ఉభయోః+లోకయోః=ఈ రెండులోకములలోను, శోకయోగం = దుఃఖసంబంధమును, హతవిధిః=చెడు దైవము, ఏవం=ఇట్లు, వ్యాదిత=ఇచ్చెను.

తా. ఇక్కడి అవివేకియైనవాఁడు మంచిగుణములుగలదైనను పెండ్లిచేసికొని వయసువచ్చినదైనప్పటికిని విడిచిపెట్టి ద్రవ్యాశచేత చాలాకాలమువఱకు దేశాంతరములలో తిరుగుచుండును, ఇట్లు ఒకరితోనొకరికి భోగములేక వయస్సుగడచిపోయి మనస్సున వ్యసనపడుచుండు ఈదేశపు దంపతులకు సంసారసౌఖ్యము లేనియట్లు పాడుదైవము చేయును గదా?

మఱియును.—

చ. అరుదగుకన్నెఁబెండ్లియయి, సుప్పడవచ్చినయౌవనంబుబాధా
మరసియు, వేఱుదేశమున కర్థసమార్జనమెప్డుఁగర్జమై,
యరుగుదురిందుఁ,గొందలమె యందుదురందఱుసొంపుదంపతుల్
పరమునఁగాకొ, గాకిహముఁ బట్టుననుక్, విధియోగవశ్యులై.

టి. అర్థసమార్జనము=ద్రవ్యసంపాదనము, కర్జమై= కార్యమై, కొందలమె= దుఃఖమె, సొంపుఅందరు, విధియోగవశ్యులై =దైవయోగమునకు వశ్యులై,

అపిచ.—

నాదీతే(తజనో యమికల్పినదీ తే శతేపహ! సేవా!

దుస్తర్కేషు భ్రామ్యతి దూరీకురుతే శ్రుతిస్మృతిసుతర్కాన్॥

అ. అత్ర=ఈకాశిలో, జనః=బ్రాహ్మణుఁడు, న+అధీతే=అధ్యయనముచేయఁడు, శతే=నూటిలోనైన, సహస్రేవా=వేయింటిలోనైన, కశ్చిత్=ఒకానొకఁడు, అధీతేయది=అధ్యయనము చేయుచున్నాఁడేని, దుస్తర్కేషు=సాధారణతర్కములలో, భ్రామ్యతి=అలుపుపడుచున్నాఁడు; శ్రుతి+స్మృతి+సుతర్కాన్=శ్రుతిస్మృతుల సంబంధమైన తర్కములను, దూరీకురుతే=దూరముచేయుచున్నాఁడు.

తా. ఇక్కడి బ్రాహ్మణుఁడు అధ్యయనముచేయకున్నను నూటిలోనైనను ఒకఁడు గౌతమాదితర్కములను చదివినను; శ్రుతిస్మృతిసంబంధములైన శారీరకాది తర్కములను చదువఁడు. 125

మఱియును.—

క. వడి నెవఁడును జదువండిట
విడివడి యెవఁడేని జదువు నేవేయిట, వాఁడె
ప్పుడు గౌతము దుస్తర్కమె,
ముడివడ శారీరతర్కమునె కొనఁ డొకఁడెన్.

టీ. విడివడి=స్వతంత్రపడి, ముడివడన్=శాంతపడునట్లుగా,

విశ్వావసుః.—

గ. కష్టమరే! బ్రాహ్మణనిందాం శృణ్వతః కంపతే మే హృదయం, యస్త్వయోపన్యస్తను చర్యావిపర్యయః, స ఏవ కలే రేవ దోషేణ బ్రాహ్మణానాం, కలౌ యుగే కార్తయుగం చారిత్రం కుత్ర నామ సంభావ్యతే, దురితలతికోపఘ్నాయితాత్మా దుర్జయః ఖలు కలిః. 126

అ. అరే=ఒరే, కష్టం=అన్యాయ్యము, బ్రాహ్మణనిందాం=బ్రాహ్మణుల

నిందను, శ్రుణ్వ [illegible]  [illegible] నవ్వు), కం

పతే=వణఁకుచున్నది. యః=ఏది, త్వయం=నీచేత, ఉపన్యస్తః = ఉపన్యసింపఁబడిన, సుచర్యా+విపర్యయః= మంచినడవడికకు+వ్యత్యాసమో, సఏవ=అదే, కలేః+ఏవ=కలియొక్కయే, దోషః=దోషము. బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క, నదోషః = దోషముకాదు. కలౌయుగే = కలియుగములో, కార్తయుగం= కృతయుగసంబంధమైన, చారిత్రం= చరిత్రము, కుత్రనామ+సంభావ్యతే= ఎక్కడ+తలంపఁబడుచున్నది? దురిత+లతికా+ఉపఘ్నాయిత+ఆత్మా=పాపములనెడు+తీఁగెలకు+ఆసరవలెయున్న+స్వరూపముగల, కలిః=కలిపురుషుఁడు, దుర్జయఃఖలు=గెలువఁగూడనివాఁడుగదా.

తా. ఏమిరాయిది? బ్రాహ్మణులను దూషించుటను వినుచున్న నామనస్సు వణఁకుచున్నది. నీవుచెప్పిన యీమంచినడవడికకు విరోధము కలిపురుషుని దోషమేగాని బ్రాహ్మణులదికాదు. ఈకలియుగములో కృతయుగముయొక్క నడవడిక యెక్కడ తలంపఁబడుచున్నది. తీఁగెలకు ఆధారవృక్షమువలె సకల దోషములకు ఆధారస్వరూపుఁడయిన యాకలిపురుషుఁ డెవనికి జయింపఁగూడినవాఁడగును?

విశ్వావసు:—

వ. ఒరే? అన్యాయ్యము? ఈబ్రాహ్మణనిందనువిని నామనసు తత్తరించుచున్నయది. నీవుచెప్పిన యాయాయాచారవికారము కలిదోషప్రకారమునఁ గలదియేకాని; యీ బ్రాహ్మణులది కానేకాదు.

(క. కలియుగమునఁ, గృతయుగమునః
గలచరితము నెక్కడేనిఁ గలదే? తలఁపఁ
గలిగలుషలతౌఘములకుఁ
గెలఁకులఁ గలపట్టుగొమ్మ, గెలువఁగ వశమే.)

పశ్య:—

శా. హర్మ్యస్థాన మదర్శకర్ణనితతే ర్దుర్వానభర్మాసనం

శాస్త్రస్తోమలలాటభూలిపిలయ శ్శాన్తి స్సవానామపి ।
సర్వామ్నాయవచస్సమాపనదినం సంస్థా సదర్చావిధే
రర్థాశాజనిభూ రభూదిహ మహానర్థావహోఽయం కలిః. 127

అ. మహత్+అనర్థ+ఆవహః = గొప్పయగు+అనర్థములను+కలిగించుచున్న, అయంకలిః=ఈకలియుగము, ఇహ=ఇక్కడ, అధర్మ+కర్మ+వితతేః=ధర్మహీనములైన+క్రియలయొక్క+సమూహమునకు, హర్మ్యస్థానం=మేడవంటిదియు; దుర్మాన+భర్మ+ఆసనం=దురభిమానమునకు+బంగారుమయమయిన+పీఠమును, శాస్త్ర+స్తోమ+లలాటభూ+లిపి+లయః = శాస్త్రముల+సమూహముయొక్క+ఫాలప్రదేశమందలి+వ్రాఁతకు+నాశమును, సవానాం+అపి=యజ్ఞములకుకూడ, శాంతిః=ముగింపును, సర్వ+ఆమ్నాయవచః+సమాపనదినం=సకలమైన+వేదవాక్యములకు+ముగింపుదినమును, సత్+అర్చా+విధేః=మంచి+పూజావిషయముల+నియమమునకు, సంస్థా=సమాప్తియు, అర్థ+ఆశా+జనిభూః=ద్రవ్య+ఆశకు+జన్మభూమియు, అభూత్=అయ్యెను.

తా. ఈకలియుగము పాపములకు మేడగాను, దురభిమానమునకు పీఠముగాను, శాస్త్రములకు నాశముగాను, యజ్ఞములకు విడుపుగాను, వేదవాక్యములకు ముగింపుగాను, పూజావిధికిని ముగింపుగాను, ద్రవ్యాశలకే జన్మభూమిగాను, కనఁబడి అనర్థములనే యిచ్చునదిగానున్నది.

చూడు:-

సీ. అన్యాయములవిల కై సన్యాయహర్మ్యము,
దురభిమానముల కై ర్చురపుగద్దె,
శాస్త్రింబులకును నొకై సలవ్రాలతుడుపును,
సవనినహములకు కై శాంతికరము,
సకలాగమముల కె కై సఁగుసమాపనదిన,
మర్చావిధులచర్చ కై కగుసమాప్తి,
ధనతృష్ణలకుఁ బుట్టు కై స్థలమును నట్టుల

యగును బృథ్విని నన కృతార్థావహంబు,

తే. గానఁ గలిగలుషములకుఁ గాన్పుదల్లి,
యైన దానన సకలన స్నానవులును
దారుమాఱయి సరితప్పి తఱియుఁ దప్పి
యుందు రిందులనేమి? మక్కెందుఁగలిని.

టి. విలసత్+న్యాయ+హర్మ్యము=ప్రకాశించు+న్యాయములకు+మేడ, న్యాయ్యస్థానము, కర్బురపుగద్దె=బంగారపుపీఠము, సవనివహములకు=యజ్ఞసమూహములకు, ఎసఁగు=అతిశయించు, సమాపనదినము=అమావాస్య, చర్చకు=కార్యమునకు, తృష్ణలకు=ఆశలకు, పృథ్విని=భూమియందు.

శ్లో. ఏతాదృశే కలియుగేఽపి శతేషు కశ్చిత్
జాతాదరో జగతి యశ్శ్రుతిమార్గఏవ।
యత్కిఞ్చి దాచరతి పాత్రి మసౌ స్తుతీనాం
శ్లాఘ్యం మితాపమపి కిం న మరౌ సరశ్చేత్॥ 128

అ. ఏతాదృశే=ఇటువంటి, కలియుగేపి=కలియుగములోఁగూడ, శతేషు=నూటిలో, కశ్చిత్=ఒకానొకఁడు, యః=ఎవఁడుగాని, జగతి=లోకములో, శ్రుతిమార్గఏవ=వేదమార్గములోనే, జాతాదరః = పుట్టిన ఆదరముకలవాఁడో; అసౌ=ఈ, స్తుతీనాంపాత్రం=స్తోత్రార్హుఁడైనవాఁడు, యత్ కించిత్=ఏదైన కొంత, ఆచరతి=నడుచుచున్నాఁడు; మరౌ=నీరులేనిభూమిలో, మిత+ఆపము పి=కొద్దియైన+జలముగలదియైనను; సరః చేత్=తటాకమున్నయెడల, శ్లాఘ్యం=కొనియాడఁదగినది, నకిం=కాదా?

తా. ఇట్టికలియుగములోఁగూడ ఒకానొకఁడు వేదమార్గములయందు ఆదరముకలిగి, ఏమైన కొంతసత్క్రియ జరిపినవాఁ డయ్యెనేని, వాఁడు నీరులేని భూమిలో కొద్దినీరుగల తటాకమైనఁ గొనియాడఁదగినయట్లే స్తోత్రపాత్రుఁ డగును.

తే. ఇట్టికలి నూట నొకఁడేని యెట్టిదేని
వేదసరణిన చరియించు నాదరమున
జగతి నుతుఁడగు నతఁడె; నిర్జలధరణిని
జలజలాశయ మలఁతేని శ్లాఘ్య మవని.

టి. జలజలాశయము=నీటితోడితటాకము, అలఁతి+ఏని=కొద్ది ది+యైనను, (తగునె మునిఁగి అనెడిపద్యములో దూషణమును ఇట పరిహరించుచున్నాఁడు.)

కించ:—

శా. యేకాయస్థజనాశ్చ యేనృపసుతా యేచద్విజా శ్శస్త్రిణః
తేయత్నాదనుసృత్యనిర్దయతయాశుష్కాంస్తురుష్కాధిపాన్
వేదాన్ భూమిసురాంశ్చపాన్తికృతిన స్తేచేత్ గృహేష్వాసతే
బ్రాహ్మణ్యాయజలాఞ్జలిఃకిల భువి ప్రాజ్ఞైః ప్రదేయోభవేత్ ॥

అ. (ప్రాతర్ హంత అనేదానికి పరిహారము) యే+కాయస్థజనాశ్చ=గ్రామకర్ణమువారెవరో, యేనృపసుతాః=రాజపుత్రులెవరో. యేచ+శస్త్రిణః+ద్విజాః = ఆయుధములతో జీవించునట్టి బ్రాహ్మణులెవరో, తే=అట్టియీ మూడు విధములవారును, యత్నాత్=ప్రయత్నముతో, నిర్దయతయా=దయాహీనతచేత, శుష్కాన్=శుష్కించిపోయిన, తురుష్కాధిపాన్ = తురకరాజులను, అనుసృత్య=అనుసరించి, దేవాన్=దేవతలను, భూమిసురాంశ్చ = బ్రాహ్మణులనున్, పాంతి=రక్షించుచున్నారు. తే=అట్టి, కృతినః = పుణ్యాత్ములు, గృహేషు=ఇండ్లలో, ఆసతేచేత్=ఉండిరేని, బ్రాహ్మణ్యాయ = బ్రాహ్మణకర్మకై, ప్రాజ్ఞైః=ప్రాజ్ఞులచేత, భువి=భూమిలో, జలాంజలిః = తర్పణము, ప్రదేయః=ఇయ్యఁదగినది, భవేత్ కిల=అగునుగదా?

తా. కర్ణమువారును, రాజులును, ఆయుధవ్యాపారులైన బ్రాహ్మణులును, తురకరాజులనుజేరి, దేవార్చనలను, బ్రాహ్మణులనుం గాపాడుచున్నారు. అట్టిపుణ్యాత్ము లింటవచ్చినయెడల, ఆబ్రాహ్మణులకు దానాదిక్రియలయందు ప్రాజ్ఞులు తర్పణ మియ్యవచ్చునుగదా!

మఱియు:-

మ. కరణాల్ రాకొమరుల్కరోపకరణాల్ కాశికి ద్విజాతీడ్గణాల్
కరుణాహీనుల నాతురుష్కఘనులర్ కాంక్షించిరక్షించెదర్
నిరతిన్ వేల్పుల నేలవేల్పుల, నీకర్ కీ వీ సేదినం బిండ్లనుం
దు రెదమ్మే,నందఱు వేజలాంజలియొనర్ రుర్బ్రాహ్మణ శ్రేణికిన్.

టి. ద్విజాతీడ్గణాలు=బ్రాహ్మణశ్రేష్ఠుల సమూహములు, కరోపకరణాలు=హస్తములందు శస్త్రాదిసాధనములు గలవారై, కాంక్షించి=అపేక్షించి—అనుసరించి, నిరతిన్=ఆసక్తితో, అందఱున్=ఈకాశీదేశరాజులును బ్రాహ్మణులును, వేన్=తక్షణమే.

గ. సర్వతోదృష్టిం ప్రసార్యసశ్లాఘం. 130

వ. అంతటనుంజూపు, వ్యాపింపఁజేసి స్తోత్రముతోన.

శా. ఆక్రాన్తాసు వసున్ధరాసు యవనై రాసేతుహైమాచలమ్
విద్రాణే క్షితిభృద్గణే వికరుణే నిద్రాతి నారాయణే।
నిర్విఘ్నప్రసరే కలావపి బలాన్నిష్కంటకం వైదికమ్
పన్థానం కిల తత్రతత్ర పరిపాత్యేకోహి లోకోత్తరః॥ 131

అ. యవనైః=తురకలచేత, ఆసేతుహైమాచలం = సేతుహిమాచలపర్యంతము, వసుంధరాసు=భూములు, ఆక్రాంతాసు=ఆక్రమింపఁబడుచుండఁగ, క్షితిభృత్+గణే=రాజుల+సమూహము,విద్రాణే=పరుగిడుచుండఁగ,నారాయణే=నారాయణుఁడు, వికరుణే=దయలేనివాఁడై, నిద్రాతి=నిదురించుచుండఁగ, కలౌఅపి=కలియును, నిర్విఘ్న+ప్రసరే=విఘ్నములేని+వ్యాప్తికలిగియుండఁగ, లోకోత్తరః=లోకములో శ్రేష్ఠుఁడు, ఏకః=ఒకఁడైనను, బలాత్=బలవంతముగ, నిష్కంటకం=నిరాటంకముగ, వైదికం=వేదవిహితమైన, పంథానం=మార్గమును, తత్రతత్ర=అక్కడక్కడ, పరిపాతికిల = పరిపాలించుచున్నాఁడుగదా?

తా. తురకలు సకలదేశములును ఆక్రమించుకొనియు, రాజులు పారిపోయియు, నారాయణుఁడు [illegible] [illegible] [illegible] కలియుగముగూడ

నిరాటంకముగ వ్యాపించుచునుండఁగ; బలాత్కారముగ నిర్విఘ్నమైన వేదమార్గమును ఈకాశిలో అక్కడక్కడ లోకశ్రేష్ఠుఁడగు నొకఁడైన నడుచుకొనుచున్నాఁడుగదా?

తే. తుఱక లాసేతుశీతాద్రి పరగ, విపుల
నృపుల పరుగిడ, నకరుణుఁ డపుడ నిదుర
కూర హరి, మీఱఁగలి శ్రుతి సారసరణి
కొకఁడె లోకోత్తరుఁడిటఁ బా లకుఁడు కదర?

టి. విపులన్ = భూమియందు, నృపుల = రాజులే, నిదురకూరన్ = యోగనిద్రలో ఈయవస్థను విచారింపకయుండఁగ.

ఇ. సేతుహిమాచలములు.— సేతువు (61) పేజిచూడుఁ? హిమాచలము— హిమవత్పర్వతము, ఇది సర్వపర్వతములకునురాజు, మేనకామనోరమలకు పతి, వారివలననే గంగాపార్వతులను కూఁతురులనుగా కనుఁగొనెను.

పునస్సశ్లాఘం:-

శ్లో. త్యజతు విహిత మేతద్దేశవాసీ నిషిద్ధం
భజతు తదపి లోకే నాస్తి ధన్య స్తదన్యః ।
త్రియుగపదనఖ శ్రీద త్తశుద్ధి ర్యదఙ్గే
లగతి దురితభఙ్గే లగ్నకో గాఙ్గపూరః॥ 132

అ. ఏతద్దేశవాసీ = ఈకాశీదేశమున వసించునతఁడు, విహితం = వేదవిహితమైన కర్మను, త్యజతు = విడిచునుగాక, నిషిద్ధం + నిషిద్ధమైనకర్మను, భజతు = అనుసరించునుగాక, తదపి = అట్లైనను, యత్ + అంగే = ఎవని + అవయవములో, త్రియుగ...శుద్ధిః—త్రియుగ = విష్ణువుయొక్క, పదనఖ = కాలిగోర్లయొక్క, శ్రీ = కాంతిచేత, దత్త = ఇయ్యఁబడిన, శుద్ధిః = పరిశుద్ధిగలదియై, దురితభంగే = పాపనాశనవిషయమై, లగ్నకః = చేరినదైన, గాంగపూరః = గంగాప్రవాహము, లగతి = చేరుచున్నదో?, (అట్టి) తత్ + అన్యః = వానికంటె + మఱియొకఁడు, ధన్యః = కృతార్థుఁడు, లోకే = లోకములో, నాస్తి = లేఁడు.

తా. ఈ కాశీదేశవాసియైనవానియొక్క శరీరమందు విష్ణుపాదమునఁ బుట్టి సకలపాపహరమైన గంగాజలము అంటుటమాత్రముచేతనె వాఁడు వేదవిహితమైన కర్మనువిడిచి, నిషిద్ధమైనకర్మను అనుష్ఠించినను, లోకమందు వానికంటె మించినకృతార్థుఁ డుండఁడు.

తే. ఇందుఁగలవాఁడు శాస్త్రవిహితము విడుచుఁ
గాని, తా నిషిద్ధముసేయుఁ గాని, వాని
కంటె నన్యుఁడు ధన్యుఁడు కలఁడె? విష్ణు
పది పవిత్రము గాత్రము పదిల మగుట.

టి. గాత్రము=శరీరము, విష్ణుపదిపవిత్రము=గంగాజలముచేత పావనమైన, పదిలము=భద్రమైనది.

ఇ. శ్రియఃపతిపదము=విష్ణుపాదము.—భగవచ్ఛబ్దార్థమునలె షడ్గుణైశ్వర్యములు కలవిష్ణునిపాదము. షడ్గుణములు—జ్ఞానశక్తిబలైశ్వర్యతేజోవీర్యములు చూడు? మొదటివృత్తము.

శ్లో. ప్రౌఢేషు గౌడేషు చ కాన్యకుబ్జే
ష్వగాధమేధేషుచ మైథిలేషు ।
అన్యేషు సత్స్వేషు బుధేషు ధన్యే
ష్వద్యాపి జీవం త్యధిభూమి విద్యాః॥ 133

అ. ప్రౌఢేషు=సమర్థులైన, అగాధ+మేధేషు=లోఁతైన+బుద్ధివిశేషముగల, గౌడేషు=గౌడులును, కాన్యకుబ్జేషు=కన్యాకుబ్జమువారును, మైథిలేషుచ=మిథిలాపురమువారును, అన్యేషు=ఇతరులైన, సత్సు=సత్పురుషులగు, ఏషు=ఈ, బుధేషు=పండితులైన, ధన్యేషు=కృతార్థులయందు, అద్యాపి=ఇప్పటికిని, విద్యాః=సకలవిద్యలును, అధిభూమి=భూమిలో, జీవంతి=జీవించుచున్నవి.

తా. గౌడులందును, కన్యాకుబ్జులందును, మైథిలులందును, మఱియు నితర మహాపండితులందును విద్యలు ప్రకాశించుచున్నవి.

తే. కాన్యకుబ్జులు, నలప్రౌఢ కిగౌడులును, న
గాధమేధులు మైథిల కిప్రాథమికులు
మఱియు నన్యులు ధన్యులు కిమఱియుఁ జదివి
గలిని గళలన్ని మనియుండఁ కిగలిగి చెలఁగె.

టి. ప్రాథమికులు=మైథిలులలో ప్రథములు, మనియుండఁగ = జీవించియుం డునట్లుగా,

గ. ఇదంతావ దవధేహి? 134

వ. ఈయదియంతయు నవధానమున వినుము?

ఇ. గౌడులు=గౌడదేశస్థులు—అనఁగా వంగదేశస్థులు; వీరు పంచగౌడులలో నివారు.

ఇ. కాన్యకుబ్జులు=కన్యాకుబ్జదేశస్థులు, వీరును పంచగౌడులలోనివారు. ఈ దేశము—కుశనాభునికూఁతులు నూర్గురినిఁ బృహదత్తు వివాహముచేసికొని వా యుశాపమువలన కుబ్జత్వమును పోఁగొట్టినప్రదేశము.

ఇ. మైథిలులు=మిథిలాపురివారు - వీరును పంచగౌడులలోనివారు, ఈ మిథి లాపురిరాజు జనకమహారాజు, ఇతని పూర్వికరాజైన నిమిచక్రవర్తి వశిష్ఠునిశాప మున విదేహుఁడై, అతనిరాజ్యము అరాజకమయ్యెనని అతనిదేహమును మథిం పఁగా అందుండి మిథిలుఁడని మఱియొకరాజుపుట్టెను; అందువలనే సీత ఆదే శపురాజువలన పెఱిఁగి జానకి, మైథిలి, వైదేహి అని పేరులొందెను.

శ్లో. ఏతద్దేశ్యప్రచురచరితా న్యన్యదేశస్థితానాం
రోచంతేచే దథచ మనసే మారుచఁకాఽత్ర హానిః।
ప్రాజ్ఞాః పుత్రా జనయితృహృదే పశ్య? యద్వత్స్వదంతే
తద్వద్విద్వ న్నపరమనసే తావతా కోఽత్రదోషః॥ 135

అ. ఏతత్...చరితాఁ—ఏతత్=ఈ, దేశ్య =దేశస్థులయొక్క, ప్రచుర= ప్రశస్తమైన, చరితాని=నడవడికలు, అన్యదేశ+స్థితానాం=వేఱుదేశములలో+ ఉండువారికి, ... మన సే=మన

స్సుకై, మారుచన్ = రుచింపకపోయినఁగాని, అత్ర = ఇక్కడ, కాహానిః = ఏమి హాని? ప్రాజ్ఞాః = జ్ఞానవంతులైన, పుత్రాః = బిడ్డలు, జనయిత్రో = తల్లిదండ్రుల యొక్క, హృదే = మనస్సునకు, యద్వత్ = ఏలాగున, స్వదంతే = రుచించుచుందురో, తద్వత్ = ఆలాగున, పరమనసే = ఇతరులమనస్సునకు, నస్వదంతే = రుచించరు. తావతా = అంతమాత్రమున, అత్ర = ఈబిడ్డలవిషయములో, కోదోషః = ఏమిదోషము? హేవిద్వన్ = ఓవిద్వాంసుఁడా, పశ్య = చూడు?

తా. ఈకాశీదేశపువారి నడవడికలు ఇతరదేశపువారికి సంతోషకరమైనను; కాకున్నను; ఏమితప్పు? బిడ్డలు తెలివికలిగి తల్లిదండ్రులకు సంతోషకరులై ఇతరులకు సంతోషకులు కాకున్నయెడల ఏమిదోషము?

తే. ఇచటఁ గలవారిచరితము ♦ లెవరికేనిఁ
గూర్చినను, గూర్పకున్నను, ♦ గొఱంతయేమి?
కొడుకునడకలు తలిదండ్రు ♦ లెడఁద కెపుడుఁ
గూర్పుఁ, గూర్చునె పెఱలకుఁ ♦ గొఱంతయేమి?

టి. తలిదండ్రులెడఁదకు = తలిదండ్రులహృదయమునకు "ఈ అకారవికల్పసంధి పూర్వకావ్యసిద్ధము."

కించ: —

శా. ప్రాత శ్శీతజలే నిమజ్య విబుధా నభ్యర్చయ త్యుచ్చకై
రార్యఃపర్యుషితంతు నాభ్యవహరత్యంధఃక్షుదంధోఽప్యసౌ।
భాగే గోమయలిప్త పవపచతే భుంక్తే తతోఽన్యత్రయత్
సీతంతద్విజహాతిభుక్తినియమోద్భృష్టఃక్వభూయానియాన్. 136

అ. అసౌ = ఈదేశస్థుఁడైన, ఆర్యః = పూజ్యుఁడు, ప్రాతః = ఉదయాన, శీతజలే = చల్లనిగంగాజలములో, నిమజ్య = మునిఁగి, విబుధాన్ = దేవతలను, అభ్యర్చయతి = పూజించుచున్నాఁడు; ఉచ్చకైః = మిక్కిలి, క్షుత్ + అంధః + అపి = ఆఁకటిచేత + పీడింపఁబడినవాఁడైనను, పర్యుషితం = చలిదియైన, అంధఃతు = అన్నమునో, నఅభ్యవహరతి ... గోమయలిప్తే ... చేత ... పూయఁబడిన, భాగ

ఏవ=స్థలములోనే, పచతే= వండుచున్నాఁడు, భుంక్తేచ= తినుచునున్నాఁడు. తతః=దానికంటె, అన్యత్ర=మఱియొకచోట, యత్=ఏది, నీతం = కొనిపోఁబడినదో, తత్=అట్టిఅన్నమును, విజహాతి=విడిచిపెట్టుచున్నాఁడు. ఇయాన్=ఇట్టి, భూయాన్=గొప్పదైన, భుక్తి+నియమః=భోజనమందు+నియమము, క్వ=ఎక్కడ, దృష్టః=చూడఁబడినది?

తా. ఈ కాశీబ్రాహ్మణుఁడు తెల్లవాఱనే గంగాస్నానముచేసి దేవతలను పూజించుచు, ఎంతయాఁకలియున్నను, చద్దితినఁడు. పేఁడయలికినచోటనే వండి తినును. వేఱుచోటికితెచ్చిన యన్నము విడిచివేయును. భోజనమందిట్టి నియమమెక్కడఁ గలదు?

మఱియు.—

ఉ. వేఁకువజాము జాహ్నవిని ♦ వేసరకే కృతమజ్జనంబునన్
లేఖులఁ బూజసేయు, నవ ♦ లీలను శీలనుతుండు మెండుగా
నాఁకలిగొన్నవాఁడయిన, ♦నాచలిదిన్ గొలఁదేనిఁదాఁకఁ, డెం
దాఁకనుగోమయంబలికి, ♦ తాన పచించుభుజించు, వేఱుచోఁ
గైకొనఁడన్న మెన్నఁడును, ♦గాంచితె? భోజననిష్ఠ శ్రేష్ఠతన్.

టి. వేఁకువ=ప్రాతఃకాలము, జాహ్నవిని=గంగలో, లేఖులన్=దేవతలను, అవలీలను=వేగముతో, శీలనుతుండు=మంచినడవడిచేత పొగడఁబడినవాఁడు.

గ. ఇతివిమానందూరతఃప్రస్థాప్య సాఞ్జలిబన్ధమ్. 137

వ. అని (ఇదినటి కార్యావర్తమునను వర్తించియుండి, యందుండి యామధ్యరాష్ట్రముప్రక్కకుందిరిగి) తమవిమానమును దూరమున నిలిపి, సలిపినయంజలిబంధముతో.

## సముద్రవర్ణనము.

(ఇ. సముద్రము.—ఇది సగరచక్రవర్తి తాను జేయు నశ్వమేధయాగమున నింద్రుఁ డశ్వము నపహరించుకొనిపోఁగా, అతని ద్వితీయభార్యాకుమారులాఱువేలమంది భూలోకమంతయు వెదకి యెక్కడను గానక, భూమిచుట్టు

త్రవ్వి త్రవ్వి పాతాళలోకమునకుఁబోయి, అక్కడ కపిలమహాముని తపస్సు చేయఁ, జూచి తమయశ్వము నితనినలననె దాఁచఁబడియుండునని తలంచి, యతనితపము భంగము చేయఁగా, నతఁడు కోపించి తనశాపముచేత వారినందఱను భస్మీభూతులను జేసెను. ఆసగరచక్రవర్తిమునిమనమఁడు భగీరథచక్రవర్తి తనపితామహులను పవిత్రపఱుచుటకై గంగాదేవిని ప్రార్థింపఁగా, గంగ భూలోకమునఁ బ్రవహించి భూమిచుట్టు నిండుకొనిపోయి భస్మీభూతులైనవారిని బవిత్రముచేసెను. ఆభూమిచుట్టు నిండినగంగ యీసగరులచేతఁ దేఁబడి సాగరమనియు; దినదినము చంద్రోదయమునకుఁ బొంగుచు, నీశ్వరాజ్ఞాముద్రచేత మితిమీఱక, సర్వజలజంతువులకును సంతోషప్రదమై సముద్రమనియు పురాణప్రశస్తము.)

హ. భువనకదనోత్కృద్ధద్వృద్ధశ్రవఃకులిశాయుధ
ప్రచకితగిరిప్రాణత్రాణప్రతిష్ఠితకీర్తయే।
ప్రసృమరమరున్నాట్యాచార్యప్రణర్తితవీచయే
మహితజనతామాన్యాయాస్మై మహోదధయేనమః॥ 138

అ. భువన...కీర్తయే—భువన=భూలోకముయొక్క, కదన=యుద్ధముచేత, ఉత్కృద్ధ్యత్=మహాకోపపడుచున్న, వృద్ధశ్రవః = ఇంద్రునియొక్క, కులిశాయుధ=వజ్రాయుధమునలన, ప్రచకిత=భయపడిన, గిరి=కొండలయొక్క, ప్రాణ=ప్రాణములయొక్క, త్రాణ=రక్షణమునకై, ప్రతిష్ఠిత = స్థిరపఱుపఁబడిన, కీర్తయే=కీర్తికలదియును; ప్రసృమర...వీచయే—ప్రసృమర=వ్యాపించుచుండెడు, మరుత్=వాయువనెడు, నాట్యాచార్య=నాట్యగురువువలన, ప్రణర్తిత=నర్తనము చేయఁబడిన, వీచయే=అలలుగలదియు; మహిత+జనతా+మాన్యాయ=పూజితమైన+జనసమూహమునకు+పూజ్యమునైన, అస్మై=ఈ, మహత్ ఉదధయే=మహాసముద్రమునకై, నమః=నమస్కారము. (హరిణీవృత్తము.)

తా. భూలోకమును ధ్వంసముచేయుటచే ఇంద్రుఁడు కోపగించి వేసిన వజ్రాయుధమునకు భయపడిన కొండల ప్రాణములను కాపాడినందు

కై పేరొందిన కీర్తిగలిగి, నాట్యగురువైన వాయువువలన నటనముచేసెడు అలలును గలిగి, సకలజనులచేత పూజింపఁబడెడి యీ మహాసముద్రమునకు నమస్కారము.

తే. ధరణి విధ్వంసమున బలధ్వంసి కినిసి
కులిశమును గొనఁ, గుసిలెడి కులగిరులకు
నసువు లొసఁగెడిసత్కీర్తి, యమరమూర్తి
నటననాచార్యుఁ డనిలుఁడు నటనసలుపు
నలలపూర్తియుఁ గలుగునీ జలధిఁ గొలుతు.

టి. బలధ్వంసి=ఇంద్రుఁడు, అసువులు=ప్రాణాలు, అమరమూర్తి=దేవస్వరూపము, అనిలుఁడు=వాయువు, జలధిక్=సముద్రమును.

కృశానుః సహాసం:–

శ్లో. పామరై రప్యపేయానా మిరాణాం పరిపాతరి ।
ఆశ్రయే జడజంతూనా మానినంసా కథం తవ? ॥ 139

అ. పామరై రపి=పామరులచేతకూడ, అపేయానాం = త్రాగఁగూడని, ఇరాణాం=కల్లువంటినీళ్లకు, పరిపాతరి=రక్షకమై, జడజంతూనాం=జలజంతువులకుగాని—మూఢజంతువులకుఁగాని, ఆశ్రయే=స్థానమైన సముద్రవిషయమై, ఆనినంసా=నమస్కారముచేయఁగోరిక, తవ=నీకు, కథం=ఎట్లు ?

తా. జ్ఞానహీనులుకూడ త్రాఁగఁగూడని కల్లువలె ఉప్పునీళ్లుగలిగి, జలజంతువులకువలె మూఢజంతువులకుఁ గూడ స్థానమైయుండు నీసముద్రమునకు నమస్కారముచేయు తలంపు నీకెట్లు కలిగెను ?

కృశానుఁడు సహాసుఁడై :–

క. విరివిగ నున్నను, నిన్నీ
రరుదుగ నెవరేని ద్రావని యానిరెని యాపా
మరులు; నిరాపుఁడు, జడతతి
కిరవగుత న్నెరఁగు నెట్లుల నిట్టుల సభంగుర్.

టి. ఇరాపుఁడు=సురాపాయి (జలపాలకుఁడు), జడతతికిన్ = జడజంతు సమూహమునకు (జలసమూహమునకు), ఎరఁగుట=నమస్కరించుట, సభంగున్ =భంగములతోఁగూడిన(అలలతోఁగూడిన).

గ. మమ త్వేధమానపరుషఘోషే. ఖల్వేతస్మిన్ రోషఏవో న్మిషతి॥ 140

అ. మమతు=నాకో, ఏధమాన+పరుష+ఘోషే = వృద్ధిపొందుచున్న+ కఠినమైన+ఘోషముగల,ఏతస్మిన్ =ఈసముద్రునియందు, రోషఏవ=రోషమే, ఉన్మిషతిఖలు=తోఁచుచున్నదిగదా?

వ. ఇటు కఠోరఘోషోన్మేషముకల యీసముద్రునియెడల నాకును రోషోన్మేషమే కలుగుచున్నది.

శ్లో. సన్తతం క్రందతే సర్వో దీప్యమానోదరాగ్నయే ।
మహాపాయసముద్రాయ దరిద్రాయైవ కుప్యతి॥ 141

అ. సర్వః=సకలజనమును, మహాపాయసముద్రాయ=అత్యంతమైన పాయసమందు సంతోషగ్రాహియై (అత్యంతమైన జలసమూహముగల సముద్రమై— అత్యంత జలసమూహమునకు ఇనుపముద్రగలదై), దీప్యమాన+ఉదరాగ్నయే= మండుచున్న జఠరాగ్ని (బాడబాగ్ని) కలదియై, సంతతం=ఎల్లప్పుడును, క్రందతే=రోదనముచేయునదియై, దరిద్రాయ=దుర్గతిగల, తే=నీకై, కుప్యత్యేవ=కోపపడుచున్నవాఁడే?.

తా. ఈసముద్రము అమృతకలశముకలదైనను (మహాజలసమూహమును, జఠరాగ్నివలె బడబాగ్నియు)కలిగి, ఒకరికియ్యక,(ఒకరినితేతే,ఏమిలేదు, ఏమిచేయుదును అని) ఎల్లప్పుడును రోదనము చేయుచున్నది. ఇట్టి ఈదరిద్రమైన దానిని అందఱును కోపింతురే.

క. ఎపుడున్ మొఱయిడెదు? గడుఁ, గ
డుపున్ విపులాగ్ని యెరియ, శ్రీ డాగ్రెదు, నిన్నీ

విపుల సదాపాయసము
ద్రః పటుపరిద్రః కని, కినియఁ కొ డః యెడఁద నెవఁ డేఁ.

టి. ఈవిపులన్ = ఈభూమియందు, సదాపాయసముద్ర = సదాఅపాయము గలవాఁడా?—సముద్రుఁడా ? (మంచిజలసమూహమునకు అయస్సంబంధమైన ముద్రకలవాఁడా—మంచినీళ్ల నే ఈయనివాఁడా?)

గ. సమృద్ధోఽప్యయమతిలుబ్ధతయా బుద్ధిమద్భిరనాదృత్యః॥ 142

అ. సమృద్ధోపి=సర్వసంపన్నుఁడై నను—అయం= ఈసముద్రుఁడు, అతిలుబ్ధతయా=మిక్కిలి లోభగుణముండుటచేత, బుద్ధిమద్భిః=బుద్ధిమంతులచేత, అనాదృత్యః = ఆదరింపఁదగినవాఁడుకాఁడు.

వ. ఇతఁ డతిసమృద్ధుఁడై నను, అతిలుబ్ధత చేత బుద్ధిమంతుల కాదరింపఁదగినవాఁడు కాఁడు.

పశ్య.—

వ. రత్నాకరోఽపి చ రమాభ్యుదయాలయోఽపి
స్వర్ణస్థలీ రధిగతోఽపి బహూర్మికోఽపి।
తాదృగ్ధనోపచయకృత్తరణిప్రచారాత్
నోపైత్యహో? వితరణిత్వ మసౌ కదాపి. 143

అ. రత్న+ఆకరోపి=మణులకును—శ్రేష్ఠవస్తువులకును+గనియైనదియు, రమా+అభ్యుదయ+ఆలయోపి=లక్ష్మియొక్క - సంపత్తియొక్కయు+అభివృద్ధికిని-ఉత్పత్తికిని+స్థానమైనదియు, స్వర్ణ+స్థలీః= శుద్ధజలములకును - బంగారుకును+స్థలములను, అధిగతోపి=పొందినదియును, బహు+ఊర్మికోపి=అనేకములైన+అలలును—ఉంగరములునుకలదియు, ఐనను; అసౌ = ఈసముద్రము, ధనోపచయకృత్ =ద్రవ్యవృద్ధిని చేయునది; తాదృక్ =అట్టిది, తరణిప్రచారాత్ =ఓడలతోతిరుగుటవలన, వితరణిత్వం=దానగుణము, కదాపి=ఒకప్పుడును, న+ఉపైతి=పొందదు. అహో=ఆశ్చర్యము ? (వసంతతిలకవృత్తము.)

తా. ఈసముద్రుఁడు రత్నాలు, బంగారు, ఉంగరాలు, లక్ష్మియు, గలవాఁడేయైనను, ఓడలతో తిరుగుటవలన, ధనవృద్ధిగలిగియు; ఒకప్పుడైన, ఒకరికేమియునియ్యఁడు. తాను తరణిప్రచారము కలిగియు, వితరణికాకుండుటే ఆశ్చర్యము?

చూడు.—

ఆ. మణులగనియు, సిరికి ని మనికిపట్టును నయ్యు;
స్వర్ణవర్ణితోర్మి ని యర్ణవుండు
ధనము వడ్డికొనఁగు ని తరణులుగలిగి వి
తరణి కాఁడదేమొ? ని యొరులకొనఁగ.

టి. స్వర్ణవర్ణితోర్మి=బంగారుచేత కొనియాడఁబడిన యుంగరములు గలవాఁడు—మంచిజలముచే కొనియాడఁబడిన అలలుగలవాఁడు, అర్ణవుండు = సముద్రుఁడు.

గ. సృష్టిరేవాస్యవిఫలేతి మేదృష్టిః. 144

అ. అస్య=ఈసముద్రముయొక్క, సృష్టిరేవ=సృష్టియే, విఫలా=వ్యర్థము. ఇతి=అని, మే+దృష్టిః=నా+చూపు.

వ. విధాతృసృష్టిని నితనిసృష్టియే విఫలమని నాదృష్టి.

తథాహి.—

శా. నాస్త్యేషా ముపయుక్తతా తటతరౌ సస్యోపయోగఃకుతః
నస్నానాయచ యోగ్యతాస్యపయసాంకానామపానార్హతా।
ఉద్గర్జన్త మనన్త మన్తరుషితై ర్దుర్జన్తుభిర్భీషణం
స్రష్టుఃసృష్టవతో జలాశయమముం కోవాశయఃకథ్యతామ్॥

అ. అస్య=ఈసముద్రముయొక్క, ఏషాంపయసాం= ఈజలములకు, తటతరౌ=గట్టునందలి వృక్షవిషయమందును, ఉపయుక్తతా=ఉపయోగము, నాస్తి=లేదు, సస్య+ఉపయోగః = పయసునకు+ఉపయోగము, కుతః= ఎక్కడ?

స్నానాయచ=స్నానమునకును, యోగ్యతా=అర్హత, న=లేదు, పాన+అర్హతా=పానము చేయుటకు+యోగ్యత, కానామ = ఎక్కడిది? ఉద్గర్జంతం = మోగియుచు, అనంతం = మితిలేనిదై, అంతః+ఉషితైః = లోగ+నున్న, దుర్జంతుభిః=దుష్టజంతువులచేత, భీషణం=భయంకరమైన, అముం=ఈ, జలాశయం=జడస్థానమును—జలస్థానమును, సృష్టవతః= సృష్టించెడు, స్రష్టుః=బ్రహ్మయొక్క, ఆశయః = అభిప్రాయము, కోవా = ఎట్టిదో, కథ్యతాం=చెప్పఁబడుఁగాక ?

తా. ఈసముద్రజలము గట్టున చెట్టునకును ఉపయోగముకానిది పయిరుకుపయోగమెట్లు? స్నానమున కుపయోగముకానిది పానమున కుపయోగమెట్లు? ఎప్పుడును మోగియుచు, లోనున్న దుర్జంతువులవలన భయంకరమైన ఈసముద్రమును సృష్టించుటకు బ్రహ్మాయభిప్రాయమెట్టిదో తెలుపుము ?

అక్లేకదా.—

ఉ. అంబుధివారిపూర మది * యర్హముకాదన, గట్లచెట్లుస
స్యంబులునెట్లొ, యెట్లనిన*స్నానము సేయన,త్రావఁద్రోవయె
ట్లంబులజంతుసంతతి భ * యంకరుఁడయ్యెను? వీనిసృష్టిసే
యం బనియేమొకో? యజుని * యాశయమేమొకొ? తెల్పి
[మల్పమేన్.

టి. వారిపూరము = జలసమూహము, అజుని+ఆశయము = బ్రహ్మ+అభిప్రాయము.

మం. యస్యస్వర్ణశ్రియఉరుతరా నిత్యమాయాంత్యయత్నాత్
తేన స్వాయ త్యనుగుణతయా నక్రియేత వ్యయశ్చేత్ ।
వహ్నిగ్రాసో భవతి విధితో మంథనం బంధనంవా
లక్ష్మీం ప్రేప్సో ర్జగదధిపతే రత్ర సాక్షీ సరస్వాన్॥ 146

అ. యస్య=ఎవనియొక్క, ఉరుతరాః=మిక్కిలిగొప్పవైన, స్వర్ణ+శ్రియః=బంగారము యొక్క యము — శుభకరమైనజలసముయొక్క యము+సమృద్ధులు, అయ

త్నాత్ = యత్నములేకయే, నిత్యం=ఎప్పటికిని, ఆయాంతి=చేరుచున్నవి, తేన= అందుచేత, స్వాయతి+అనుగుణతయా = తన పరవుకు+అనుకూలతచేత, వ్యయః=సెలవు, న క్రియేత చేత్=చేయకపోయినయెడల, విధితః=దైవమువలన, వహ్నిగ్రాసః=నిప్పుఆహారము-బడబానలభక్షణమైనన్, భవతి = అగుచున్నది; లక్ష్మీం=సంపదనుగాని-లక్ష్మినిగాని-సీతనుగాని; ప్రేప్సోః=పొందఁగోరుచున్న, జగదధిపతేః= రాజువలనఁగాని-విష్ణువువలనఁగాని-శ్రీరామునివలనఁగాని, మంథనం=దెబ్బలైనను-తఱచుటలైనను, బంధనం= (కట్లచేతనైనను—కొండలచేతనైనను) బంధించుటయు, భవతి=కలుగుచున్నది. అత్ర = ఈవిషయములో, సరస్వాన్ =ఈసముద్రుఁడె, సాక్షీ=దృష్టాంతము. (మందాక్రాంతా)

తా. ఎవనికి సువర్ణధనసమృద్ధి కష్టపడకయే కలుగుచుండునో, దానికితగిన సెలవుచేయనివానికి కడుపులోనిప్పుమంటయే కలుగుచుండును.లక్ష్మినిగైకొనగోరి విష్ణువుయొక్క మందరపర్వతమథనము, శ్రీరామునియొక్క పర్వతసేతుబంధనమును ఈసముద్రునికి కలుగుటయే దృష్టాంతము.

తే. ఎచ్చుస్వర్ణంబు నేతనికి వచ్చుబడికిఁ
దగిన వెచ్చము సేయ నాకి తఁడిటు గడుపు
మంట యొడిగట్టుఁ దఱిగట్టు నంటఁగట్టు
వడును సిరిగోరు నతని కి తఁడిటసాక్షి.

టీ. తఱిగట్టునంటన్+కట్టుపడును = కష్టకాలముకట్టుపఱచును అనుటయందు+కట్టుపడును— (మందరపర్వతము అంటఁ గట్టుబడును) ఇట—తఱిఅనుచో కాలమర్థమందు అలఘురేఫములేనిది శ్లేషాదినియమములందు దోషముకాదని ఆలంకారికాభిప్రాయము.

కింబహునా.——

వృ. కుంభజపీతోత్సృష్టం శిష్టైరస్పృశ్య మర్ణవము పేత్య।
ఉద్గతతృష్ణోఽప్యుష్ణా దుదకం పాంథో జనో న గృష్ణాతి॥ 147

అ. కుంభజ+పీత+ఉత్సృష్టం= అగస్త్యునిచేత+త్రాగఁబడినదై + విడువఁబడినదియు, శిష్టైః = పెద్దలచేత, అస్పృశ్యం = తాఁకఁగూడనిదియునైన, అర్ణవం=సముద్రమును, ఉపేత్య=చేరి, ఉద్గతతృష్ణోపి= అతిశయించిన డప్పియపేక్షకలవాఁడయ్యును, పాంథోజనః=బాటసారియైనవాఁడు, అస్మాత్=ఈసముద్రములోనుండి; ఉదకం=నీటిని, నగృహ్ణాతి=తీసికొనఁడు.

తా. అగస్త్యమహాముని త్రాగి విడిచినదగుటచేత పెద్దలు తాఁకఁగూడని ఈసముద్రమును చేరి, యేబాటసారియైన, ఎంతదాహముకలవాఁడైనను, దీనిలోనుండి నీటినే తీసికొనఁడు.

క. కలశజనను త్రాగినయెం
గిలియని పెద్దలువదిలిన, క్షీరమునే, నాఁ
కలిగొని డప్పికినే, నిం
దులఁ గొనఁ డొక తెరువరియును దూష్యంబగుటన్.

టీ. కలశజనను=అగస్త్యునియొక్క, దూష్యంబు=దూషింపఁదగినది.

ఇతి. కుంభజుఁడు=కలశమున జనించినవాఁడు—అగస్త్యమహాముని. ఇతఁడు సముద్రతీరమున ఊర్వశినిచూచి మోహించిన మిత్రావరుణులవీర్యము స్ఖలితమైపడిన కుంభమునుండి వశిష్ఠమునితోఁగూడ పుట్టినయతఁడు.

మఱి యితఁడు కాలకేయులు అనురాక్షసులు దేవతలను అప్పుడప్పుడు బాధించుచు, సముద్రమున దాఁగుకొనుచుండుటను దెలిసి, దేవతలు ప్రార్థింపఁగా; తోడనేపోయి ఆసముద్రజలమునంతయును ఆపోశనముతో పానము చేసి వారిని వెడలఁజేసి యథాప్రకారము సముద్రమును విడిచెను. వెనుక వారి సంతతివారినికూడ అర్జునుఁడే సంహారము చేసెను.

మఱియు నితఁడు వాతాపీల్వలులనెడి రాక్షసులు కామరూపులై వాతాపిని మాంసముగవండి ఇల్వలుఁడు బ్రాహ్మణుఁడుగాపోయి తనపితృకార్యమని బ్రాహ్మణులనుపిలిచి భుజింపఁజేసి భుక్తశేషమునకై వలె వాతాపినిపిలువఁగా, వాఁడా బ్రాహ్మణులను పొట్టచించుకొనివచ్చు వానినివాని తినుచుండుటను తెలిసి,

తాను నొకనాఁడు వాండ్రనుజంపుటకయ్యే బ్రాహ్మణార్థముపోయి, వారుము నువటివలె నేచేయఁగాఁ దానును వాతాపిని జీర్ణింపఁజేసికొని ఇల్వలుఁడు పైఁబడి రాఁగా, వానిఁకోపించి భస్మముచేసెను.

మఱియు నీయన తనయాశ్రమము సమీపమున తనశిష్యుఁడైన వింధ్యపర్వతము మేరుపర్వతముతో తానె హెచ్చని వివాదము వేసికొని పెరిగిపెరిగి పొడవై సూర్యచంద్రాదులమార్గమునకుఁగూడ అడ్డమైనపుడు దేవర్షులు లోకమునకు కలిగి నయీయాపత్తు నివారించుటకై వేఁడుకొనఁగా,తోడనపోయి తనకు దండప్రణామముచేయుటకై నేలపట్టమైన యావింధ్యపర్వతముతోడ దక్షిణమధురపశ్చిమమున మలయపర్వతమునకుపోయి ఇదోవచ్చెద, అందనుకను నీవిట్లేయుండుమనిచెప్పి అదిమొదలావింధ్యము అట్లేయుండునట్లుచేసి తానును అక్కడనే ఇదివఱకు నున్నయతఁడు.

మఱియు నీతఁడు స్వర్గలోకమున దేవేంద్రపదవి ననుభవించుచుండినను, వేదములను వేదవేత్తలైన బ్రాహ్మణులనుకూ అలక్ష్యముచేసి దూషణముచేయుచుండు నహుషుని సర్పముగా శపియించినయతఁడు.

విశ్వావసుః.—

గ. సఖే? సర్వగుణాకర స్సరిత్పతి రేష నదూషణీయః. 148

అ. సఖే=ఓస్నేహితుఁడా? సర్వగుణాకరః=సకలసద్గుణములకునునిగనియైన, ఏషసరిత్పతిః=ఈసముద్రుఁడు, నదూషణీయః=దూషింపఁదగినవాఁడుకాఁడు.

విశ్వావసువు.—

వ. సఖా? సకలగుణములకు నాకరంబగు నీసాగరంబు దూషింపఁదగినవాఁడు.

క్షీరార్ణవవర్ణనము.

ఇ. (క్షీరార్ణవము—ఇది శ్రీమన్నారాయణమూర్తివ్యూహస్వరూపమున వటపత్రశాయియై శయనించి తనయోగనిద్రచే జగత్సృష్టిస్థితిసంహృతులను సంక

ల్పించుకొనుచు, స్థితి తనచేతను, సృష్టిసంహృతులను బ్రహ్మరుద్రులచేతను జరి పించుకొనుచు శీతవాతపోతోద్ధూత క్షీరశీకరస్వీకృత సదాసుఖశయనమైయుండు స్వస్థానము. ఇదియె—"లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరమహార్ణవాః" అను సప్తసముద్రములలో ఆఱవపాలసంద్రము.

తథాహి.—

ఆ. ఉచ్చైశ్శ్రవః ప్రదాతు ర్వృద్ధశ్రవసే పున స్తదనుజాయ ।
వామవిలోచనదాతు ర్వదాన్యమస్మాద్వదాఽన్యమర్ణవతః॥

అ. వృద్ధశ్రవసే=ముసలితనముకలవాఁడై చెప్పుడుపడినవానికి—ఇంద్రునకు, ఉచ్చైశ్శ్రవః ప్రదాతుః=గొప్పచెవులుగలదానిని—గుఱ్ఱమునుఇచ్చినవాఁడును, పునః=మఱల, తదనుజాయ=వానితమ్మునికి—విష్ణువునకు, వామవిలోచనదాతుః=గుడ్డికంటివానికి—ఎడమకన్నైనచంద్రునకును దాతయైనవాఁడునైన, అస్మాత్=ఈ, అర్ణవతః = సముద్రునికంటె, అన్యం=మఱియొక, వదాన్యం=దాతను, వద=చెప్పుమా ?

తా. దేవేంద్రునకు ఉచ్చైశ్శ్రవమనెడి గుఱ్ఱమును, వానితమ్ముఁడైన యుపేంద్రునకు నెడమకన్నుగానుండు చంద్రుని నిచ్చిన ఈసముద్రునికంటె మఱియొకదాతయుండినను జెప్పుము ?

తే. కంటె ? దాతను నీతని కె కంటెఁ జెపుమ ?
యిచ్చె నుచ్చైశ్శ్రవమునన్న కె యింద్రునకును,
నీఁకను నితనికిఁ దమ్ముఁ డు కె పేంద్రునకును,
జంద్రునిచ్చెను సవ్యంపుఁ కె జక్షువుగను.

ఆ. అమృతంవిబుధేభ్యోఽదా దభీష్టఫలదంతరుంచ ధేనుంచ ।
దిగ్వసనాయ సితాంశుకమిత్థితఏతాదృశః క్వవాదాతా॥

అ. విబుధేభ్యః=విశేషజ్ఞానులకు—దేవతలకును, అమృతం=మోక్షమును—అమృతమును, అభీష్టఫలదం=ఇష్టఫలమునిచ్చునట్టి, తరుం= కల్పవృక్షము

నుక్, ధేనుంచ=కామధేనువునుక్, అదాత్=ఇచ్చెను. దిగ్వాససాయ= వస్త్రహీనునికి—శివునికిని, సితాంశుకం = తెల్లవస్త్రమును—చంద్రునిక్, అదాత్=ఇచ్చెను. ఏతాదృశః=ఇట్టి, దాతా=దాతయైనవాఁడు, క్వవా=ఎక్కడ, ఈక్షితః=చూడఁబడెను ?

తా. దేవతలకు అమృతమును కల్పవృక్షమును కామధేనువును, దిగంబరుఁడైన శివునికి తెల్లవస్త్రమునువలె చంద్రుని ఇచ్చెను. ఇట్టిదాత నెక్కడ చూచితివి ?

క. ఒసఁగెను నమృతము విబుధుల
కొసపరి తరు ధేనువులను గైకొని విప్రముల్
విసువ కెసఁగ నొసఁగెను ది
గ్వాసునకు వెస విశదాంశు గైకధృతిసుఖంబున్.

టీ. దిగ్వాసునకున్=దిగంబరునకు—శివునకు, విశదాంశుకధృతిసుఖంబున్=శ్వేతకిరణుఁడైన చంద్రునియొక్క—అతిశుద్ధమైన వస్త్రముయొక్కయు ధారణసౌఖ్యమునున్.

ఇతి. క్షీరార్ణవము - (140, 143 వృత్తములలోనిది) ఇది - దేవతలు తాము రాక్షసులవలన బాధింపఁబడుచును మరణము నందకుండనె యట్లు త్రిమూర్తులను ప్రార్థింపఁగా, ఆమహావిష్ణువు తాను శయనించియుండు క్షీరాబ్ధినితఱచి అమృతముతీసి ఆదేవతలకు క్షుధావ్యాధిజరానిద్రామరణాదులులేక సార్వకాలికులుగా నుండుటకై ఈయమృతము నీయవలెనని దానికి సహాయులుగా రాక్షసులను మోసముతో చేర్చి దేవతలతోఁగూర్చి మందరపర్వతమును కవ్వముగాను వాసుకిని త్రాడుగాను ఆదేవరాక్షసులను తఱచువారుగాను జేసికొని ఆసముద్రమును తఱచితఱచి అమృతము పుట్టఁబోవునపుడు ఆవాసుకి తాళఁజాలక విషము గ్రక్కుకొనఁగా, అది అగలుసెగలతోలేచి ఆదేవరాక్షసులును తాళుకోలేక విడిచిపెట్టి పోఁజేసెను. అపుడు మహాశివుఁడుచూచి అయ్యో ! ఇంతకష్టపడి దీనివలన కార్యభంగమేల కావలెనని సాహసించి ఆవి

షమునంతయును జవురుకొని వారుకొని తాను మ్రింగివేయఁగా, పార్వతీదేవి దీనివలన వీరికేమి కష్టముకలుగునోయని ఆవిషము లోనికిమ్రింగనీయక తనచే తనే యాతనికంఠముపట్టి నిలిపెను. అందువలననే ఆయన యెప్పుడును విషకంఠుఁడు నీలకంఠుఁడు నాయెను. ఈయుపకారమును తలఁచియే ఆమహావిష్ణువు ఆవెనుక అం దమృతముతేలినది చూచి తోడనే రాక్షసులను వంచించుటకై మోహినీరూపముతో వారికి కనఁబడి వారిని తనసౌందర్యసౌకుమార్యాదులకు మోహింపఁజేసి దూరదూరము వెంబడించుకొనిపోయెను. అప్పుడు తాను సర్వవ్యాపియాటచే వారి మోసవుచ్చుచునుండియు నిక్కడికివచ్చి ఆసముద్రమున ధన్వంతరి కలశముతో నెత్తుకొనివచ్చిన యాయమృతముతోఁ గూడ పుట్టినట్టి చంద్రుని తనకెడమకన్నుగా నుంచుకొన్నదేకాక, ఆశివునికిని తలపైనుంచి తన పాదోద్భవమైన గంగాదేవితోఁగూడ అతని చంద్రశేఖరునిగాను గంగాధరునిగానుజేసి ఆవిషవేగమును తగ్గించెను. మఱియు అందుపుట్టిన లక్ష్మీదేవిని తాను దారగా అంగీకరించుకొని అందలి కౌస్తుభమణిని తనవక్షమందుంచుకొని మఱియందుల కల్పవృక్ష కామధేను చింతామణులను ఐరావతోచ్చైశ్శ్రవములనుగా దేవేంద్రునకిచ్చి ఆయమృతమును దేవతలకంఠఱకును పంచిపెట్టునట్లు చేసిన ఈ యుపకారమున కీసముద్రునికిని తనపాదపుత్రికయైన గంగాదేవిని భార్యగాను తనభార్యయైన లక్ష్మీదేవిని పుత్రికగాను ఆచంద్రునే పుత్రుఁడుగాను చేసినదే కాక, తానును అల్లుఁడుగానునైన ఆయనచేతనే అతిపవిత్రతయు అతికృతార్థతయు కలదిగాఁ జేయఁబడిన సముద్రము.

గ. అముష్యఖలు భాగ్యవత్తాం శేషాదయోపి వక్తుమశక్తాః. 151

ఆ. అముష్య = ఈసముద్రునియొక్క, భాగ్యవత్తాం = భాగ్యవంతునితనమును, శేషాదయోపి=ఆదిశేషుఁడు మొదలైనవారును, వక్తుం=చెప్పుటకు, అశక్తాఃఖలు=శక్తిలేనివారుకదా?

వ. ఇతనిభాగ్యమును శేషాదులును జెప్ప శక్తిగలవారు కారు గదా?

పశ్య.—

ఉ. జహ్నోరపత్యం జగతః పవిత్రం
కళత్ర,మబ్ధే స్తనయః కళాత్మా।
కన్యాతు ధన్యా కమలా, బిభర్తి
జామాతృభావం జగదీశఏవ॥ 152

అ. అబ్ధేః=ఈసముద్రమునకు, కళత్రం = భార్య, జగతఃపవిత్రం = లోకపావనమైన, జహ్నోః+అపత్యం=జహ్నుమునియొక్క + పుత్రికయైనగంగ; తనయః=పుత్రుఁడు, కళాత్మా = విద్యాస్వరూపుఁడైన చంద్రుఁడు; కన్యాతు = కన్యకయో, ధన్యా=ధన్యురాలైన, కమలా = లక్ష్మి; జగదీశఏవ= జగదీశ్వరుఁడైనవిష్ణువే, జామాతృభావం=అల్లునితనమును, బిభర్తి=భరించుచున్నాఁడు.

తా. ఈసముద్రునికి గంగాదేవిభార్యయు, చంద్రుఁడు పుత్రుఁడును, లక్ష్మిదేవి పుత్రికయు, జగదీశ్వరుఁడైన విష్ణువే అల్లుఁడునైనవారు. (ఉపజాతి)

చూడు.—

క. వనధికి జహ్నునిసుత పా
వనవనితయు, సుతుఁడు విధుఁడు, శ్రీ వరసుత తనకున్
వనజాలయ లోకజనని,
వనజాక్షుఁడె యల్లుఁడౌట శ్రీ వర భాగ్యమె కా?

## జగన్నాథ క్షేత్రవర్ణనము.

ఇ. జగన్నాథక్షేత్రము.—ఇదే పురుషోత్తమక్షేత్రము. ఈపురుషోత్తమపురి శ్రీకృష్ణుని దేహావసానమునకు వెనుక, సముద్రముఁపొంగి ద్వారకాపట్టణము మునిఁగి, ఆకృష్ణదేహము ఆసముద్రములో కొట్టుకొనివచ్చి, యిక్కడ తనభక్తుఁడైనప్రద్యుమ్నమహారాజుచేత దారువునసంపుటముచేసి స్థాపింపఁబడినక్షేత్రము.

గ. అన్యచ్ఛేదమద్య...ం...ర్తతే. 153

ప్రతి. అ. అన్యచ్చ=మఱియొకటి, ఇదం=ఇది, అస్య=ఇతనికి, భాగధేయం= భాగ్యముగా, వర్తతే=ఉన్నది.

వ. ఇదియు నితనికి మఱియొక భాగధేయముగా నున్నయది.

శా. యత్తీరే పురుషోత్తమ స్థలమిదం యక్షాప్సరః కిన్నర
ప్రేష్ఠై ర్నిత్య మధిష్ఠితం భగవత స్సాన్నిధ్యసౌఖ్యాస్పదం।
అత్రత్యక్తవతామసూ౯ కరగతా ముక్తి, స్తదాస్తాంమసౌ
దేహోదాహ వినా కృతోఽప్యవికృతః కాష్ఠాదివ త్తిష్ఠతి॥

అ. యత్తీరే=ఏసముద్రపుగట్టున, భగవతః=భగవంతునియొక్క, సాన్నిధ్యసౌఖ్యాస్పదం=సన్నిధియుండుటచేత సౌఖ్యస్థానమై, యక్షాప్సరః కిన్నర ప్రేష్ఠైః=యక్షులు అప్సరసలు కిన్నరులు మొదలుగాఁ గలవారిచేత; నిత్యం= ఎప్పుడును, అధిష్ఠితం=ఆశ్రయింపఁబడినదైన, ఇదం=ఈ, పురుషోత్తమస్థలం= జగన్నాథక్షేత్రము,తిష్ఠతి=ఉన్నదో, అత్ర=ఆయీక్షేత్రములో, అసూ౯= ప్రాణములను, త్యక్తవతాం=విడిచినవారికి, ముక్తిః=మోక్షము, కరగతా=చేతిలోనిది, తత్ = అది, ఆస్తాం=ఉండనీ? అసౌ=ఈ, దేహః=శరీరము, దాహ వినాకృతోపి=దహనము లేనిదైనను, అవికృతః=వికారములేనిదై, కాష్ఠాదివ త్=కట్టె మొదలైనదివలె, తిష్ఠతి=ఉన్నది, అహో=ఆశ్చర్యము?

తా. ఈసముద్రపుగట్టున భగవత్సన్నిధియుండి సౌఖ్యముగలిగి, యక్షకిన్నరాదు లాశ్రయించుచు పురుషోత్తమపురియని జగన్నాథక్షేత్ర మున్నది. ఇచ్చట చనిపోయినవారికి మోక్షము హస్తగతమే. ఆ చనిపోయినశరీరమో, దహనములేకయే దుర్గంధాదులునులేక, కట్టెవలెనుండును. ఇది ఆశ్చర్యముకదా?

ఉ. ఇందలితీరధారుణి నిక్కదే పురుషోత్తమవ౯ స్థలం, బహో?
యిందులజీవముల్ విడుచుకొనెవ్వఁడు, వానికిముక్తి హస్తగం
బందదియట్టులుండ,నహాకహాం మృతుదేహముదాహ మొందకే
మొందుకుఁగందకుండునొకొ?కయిమ్మునఁగాష్ఠపుసౌష్ఠవమ్మున౯

టీ. ఇమ్మున౯=చక్కఁగా, కాష్ఠపు సౌష్ఠవమ్మున౯=కాష్ఠముయొక్క మేలిమిచేత.

కించ.—

ఉ. నివేదితస్యాత్ర రమాసఖాయ
నీచాహృతస్యాపి కిమోదనాదేః।
భక్త్యాశనం హంత? భవార్జితానాం
మహాంహసాం నాశనమామనంతి. 155

ఆ. అత్ర=ఇక్కడ, రమాసఖాయ=లక్ష్మీపతియైన జగన్నాథునికై, నివేదితస్య=ఆరాధింపఁబడినదై, నీచాహృతస్యాపి=అధములచేత తేఁబడినదైనను, ఓదనాదేః=అన్నము మొదలైనదానియొక్క, భక్త్యా=భక్తితో, అశనం=భక్షణము, భవార్జితానాం = సంసారములో సంపాదింపఁబడిన, మహత్ అంహసాం=గొప్పపాపములకు, నాశనం=నాశకమునుగా, ఆమనంతికిల=తలంచుచున్నారుకదా? హంత=ఆహా ?

తా. ఈ జగన్నాథక్షేత్రమందు జగన్నాథునకు నీచులు తెచ్చిన అన్నాదులనుకూడ భక్తితో భక్షించుటయు మహాపాపములకు నాశకమని పెద్దలు తలంచుచున్నారు.

మఱియు:—

క. ఆదరమున మనహరికి ని
వేదించు ప్రసాదము భవ కృజినఘ్నుంబౌ;
నే దుశ్శీలుఁడు నే నిడఁ
దాఁ గుది భక్తిం బ్రసాపడన, యనుదురిటఁల్.

టీ. భవవృజినఘ్నుంబౌల్ =సంసారసంబంధమైన పాపములను పోఁగొట్టునది యగును, ప్రసాపడన=సాపడఁగానె.

## శ్రీజగన్నాథస్వామివర్ణనము.

ఇ. శ్రీ జగన్నాథస్వామి.—వీరు అంతిమదశయందు తమశరీరము యమునాప్రవాహమున వచ్చి సముద్రతీరమున పరమభక్తిప్రకృష్టుఁడైన ప్రద్యుమ్న

మహారాజుచే ప్రదర్శింపఁబడి, తమయాజ్ఞాప్రకారముననే పాండవాది పంచతీర్థములలోఁడి ప్రద్యుమ్న సరోవర సమీపమందలి యీ నీలాచలక్షేత్రమందు ప్రతిష్ఠింపఁబడి, సుభద్రా బలభద్రార్జునులతో ఇప్పుడును సేవసాయించుచున్న శ్రీపురుషోత్తమస్వామి.

సభక్త్యన్మేషం:—

వృ. దారుణి సన్నిహితాయ
ప్రాజ్ఞైర్హుతమశ్నుతే మఖేషుహవిః।
శిశిరాయ నిత్యరుచయే
శుచయే రచయేయ మద్భుతాయ నతీః॥ 157

అ. దారుణి=యూప స్తంభమందు, సన్నిహితాయ=సమీపించినదై, ప్రాజ్ఞైః=జ్ఞానులైన యాజ్ఞికులచేత, మఖేషు=యజ్ఞములలో, హుతం=హోమము చేయఁబడిన, హవిః=హవిర్భాగమును, అశ్నుతే=భక్షించునదియై, శిశిరాయ=దయచే చల్లనిదై, నిత్యరుచయే=సర్వదాకాంతులుకలదై, అద్భుతాయ=ఆశ్చర్యకరమైన, శుచయే = అగ్నికి, నతీః = నమస్కారములను, రచయేయం = చేయుదును.

తా. యజ్ఞములలో యూప స్తంభముదగ్గర యాజ్ఞికులిచ్చునట్టి హవిర్భాగమును ఆహారము చేయుచు, కృపతో ఆశ్చర్యముగా చల్లనైన కాంతులతోఁడి శ్రీపురుషోత్తమరూపమగు అగ్నిహోత్రునకు నమస్కారములు చేయుచున్నాను.

అనురాగమునతిరేకమున:—

తే. దారువునయందు నిందువం కే దారువులన,
జన్నముల వేల్పు వేల్మి ని కే జంబుగొనున ?
శుచియు శిశిరుఁడు శాశ్వత కే రుచియు నెతఁడో
యతని యద్భుతమునకిదే నతులొనర్తు

టి. వందారువులనఁగా=ఆశ్రితులనఁగానె, కొనున=కైకొనునే, శుచి=పరిశుద్ధుఁడు-అగ్నిహోత్రుఁడు.

## ఘూర్జరదేశవర్ణనము.

ఇ. (ఘూర్జరదేశము-ఇది పశ్చిమసముద్రతీరములో గుజరాతి అనిచెప్పఁబడుచు,పంచద్రావిడులలో ఘూర్జరులనెడువారునుండు దేశము.) ఈపంచద్రావిడులు-ఆంధ్రి, ద్రావిడ, కర్ణాటక, ఘూర్జర, మహారాష్ట్రిలు.

గ. (ఇతి నమస్కృత్య సుదూరమన్యతో విమానం ప్రస్థాప్య సశ్లాఘమ్) సఖే? సఏషసర్వసంపదా మాస్పదతయా త్రిదశాలయస్యాదేశఇవ ఘూర్జరదేశ శ్చక్షుషోస్సుఖాకరోతి. 158

అ. (ఇతి=అని, నమస్కృత్య=నమస్కరించి, సుదూరం=బహుదూరముగా, అన్యతః=మఱియొకప్రక్క, విమానం=విమానమును, ప్రస్థాప్య=నడిపి, సశ్లాఘం=శ్లాఘించుటతో) సఖే=ఓస్నేహితుఁడా? సఏషః=ఆఇదియే, సర్వసంపదాం=సకలసంపదలకును, ఆస్పదతయా=ఆస్పదమగుటచే, త్రిదశాలయస్య=దేవలోకమునకు, ఆదేశఇవ=నిర్దేశకమువలె, ఘూర్జరదేశః=గుజరాతిదేశము, చక్షుషోః=కన్నులకు, సుఖాకరోతి=సుఖమును కలిగించుచున్నది.

వ. (అని నమస్కారము కావించి యతిదూరము మఱియొకప్రక్కనుఁ విమానము పోనిచ్చి మెచ్చుచుఁ) సఖా? సకలసంపదలకు నాస్పదమయి, నిర్జరాలయమునకు నిర్దేశకమువలె ఘూర్జరమను నీదేశము మనకన్నులకుఁ సుఖమును గలిగించుచున్నది.

టీ. నిర్జరాలయమునకు=స్వర్గమునకు, నిర్దేశకము=నియామకము.

శి. సకర్పూరస్వాదుక్రముకనవవీటీరస లసన్
ముఖా స్సగ్వశ్లాఘాపద వివిధదివ్యాంబరధరాః।
కనద్రత్నాకల్పా ఘుమఘుమితదేహాశ్చ ఘుసృణై
ర్యువానో మాద్యంతే యువతిభి రమీ భూయసితరాం॥ 159

అ. సకర్పూర... ముఖాః—సకర్పూర=కర్పూరముతో కూడినదై, స్వాదు =రుచియైన, క్రముక=వక్కలచేత, నవ=క్రొత్తయైన, వీటీరస=తాంబూలరసముచేత,లసత్=ప్రకాశించుచున్న,ముఖాః=మొగములు గలవారును; సర్వ... ధరాః—సర్వ=సకలమైన,శ్లాఘా=స్తోత్రములకు, పద=స్థానమై, వివిధ=నానావిధములైన, దివ్యాంబర=మేలైనవస్త్రములను, ధరాః=ధరించినవారును; కనత్+రత్న+ఆకల్పాః=ప్రకాశించునట్టి+రత్నములతోడి+ఆభరణములుగలవారును; ఘుసృణైః=కుంకుమముచేత, ఘుమఘుమితదేహాశ్చ=ఘుమఘుమలాడుచున్న దేహముగలవారునైన, అమీ=ఈ, యువానః=యౌవనవంతులు, తుల్యరతిభిః=సమానమైన ప్రేమగలవారగు, యువతిభిః = యౌవనవతులతో, మోదంతే=సంతోషపడుచున్నారు.

తా. ఈఘూర్జరదేశపు యౌవనవంతులు కర్పూరముతో రుచియైన తాంబూలము వేసికొని, మేలై కొనియాడఁదగిన నానావిధవస్త్రములుధరించి, రత్నాలసొమ్ములు వేసికొని, కుంకుమము పూసికొని, దేహమంతా ఘుమఘుమలాడుచు, సమానప్రేమగల తమ యౌవనవతులతో తాము రమించుచుందురు. (శిఖరిణీవృత్తము.)

క. కపురపుఁ దములము మొగమున,
వపువున వలిపములును, మణికి వరభూషణముల్
విపులములై, యువయువతు, ల
నుపమలయై యిందు నుందు రోలిఁ గేలిఁ.

టి. వపువునన్ = దేహమున, వలిపములు=సన్నవస్త్రములు, విపులములు=విస్తారములు, యువయువతులు = యౌవనముగల స్త్రీపురుషులు, అనుపమల=సాటిలేనివారై, ఓలిన్=వరుసగా, కేలిన్=క్రీడతో.

గ. అత్రవధూనామప్యన్యాదృశం సౌందర్యం. 160

అ. అత్ర=ఇక్కడ, వధూనామపి= స్త్రీలకుఁగూడ, సౌందర్యం=అందము, అన్యాదృశం=సాటిలేనిది.

వ. ఇక్కడ సుకృశులకును నసదృశసౌందర్యముకలదు.

శా. తప్తస్వర్ణ సవర్ణమంగక మిదం, తామ్రోమృదుశ్చాధరః,
పాణీ ప్రాప్త నవప్రవాళసరణీ, వాణీ సుధాధోరణీ।
వక్త్రం వారిజమిత్ర, ముత్పలదళశ్రీసూచనే లోచనే,
కేవాఘూర్జరసుభ్రువామవయవాయూనాం నమోహావహాః॥

అ. ఇదం=ఈ, తప్తస్వర్ణసవర్ణం=అపరంజితోసమమైన, అంగకం=అంగమును; తామ్రః=ఎఱ్ఱనై, మృదుః=మెత్తనైన, అధరశ్చ=పెదవియును; ప్రాప్త+నవప్రవాళ+సరణీ = పొందఁబడిన+క్రొత్తపవడములయొక్క + రీతిగలవియైన, పాణీ=చేతులును; సుధాధోరణీ=అమృతధారవంటి, వాణీ=వాక్కును; వారిజమిత్రం=తామరతో సమానమైన, వక్త్రం = మొగమును; ఉత్పలదళ+శ్రీసూచనే=కలువరేకులయొక్క+కాంతిని తెలుపునవియైన, లోచనే=కన్నులును; ఘూర్జరసుభ్రువాం=ఘూర్జరదేశస్త్రీలయొక్క, అవయవాః=అంగములు, కేవా= ఏవి, యూనాం=యౌవనవంతులకు, మోహ+అవహాః=మోహమును + కలుగఁజేయునవి, నభవంతి=కావు?

తా. ఈ ఘూర్జరస్త్రీలయొక్క బంగారువంటి యంగములును, అతిమృదువై యెఱ్ఱనైన పెదవియును, పవడములవంటిచేతులును, అమృతమువంటివాక్కును, తామరవంటి మొగమును, కలువలవంటి కన్నులును యౌవనవంతులను మోహింపఁజేయుచున్నది.

ఉ. మేనపరంజిమంజిమము, మెత్తనిజొత్తిలుకావిమోవి, కేలానవకంపువిద్రుమము, నయ్యమృతాకృతిపల్కు, బెళ్కుమోమోనళినాప్త, మాప్తకనుకలుత్పలముల్ కను? గుజ్జరాతిస్త్రీలే నవయౌవనావళికి నింపొనరింపనివారు తీరునన్?

టి. నళినాప్తము=తామరపక్షప్రియమైనది, ఆప్త=ఓప్రియసఖా, నవయౌవన+ఆవళికి = క్రొత్తయౌవనముగలవారి+సమూహమునకు, తీరునన్ = సౌందర్యముతో

కృశానుః:—

గ. సత్యమేవం,తథాపి నైతే సార వస్తూపభోగచతురాః. 162

అ. ఏవం=ఈలాగు, సత్యం=నిజమే? తథాపి=అయినను, ఏతే=వీరు; సార+వస్తు+ఉపభోగ+చతురాః=సారమైన+వస్తువులను + అనుభవించుటయందు +సమర్థులు, న=కారు.

కృశానుఁడు:—

వ. ఇటులిది నిజమే యైనను, వీరు సారవస్తువులయుపభోగయోగములయందుఁ జతురులుగారు.

తథాహి:—

మ. వ్రీడామారవ్యతికరవతీ ర్విద్యుదాభాః కృశాఙ్గీః
క్రీడాయోగ్యేఽప్యహహ ! సమయే గేహ ఏవత్యజన్తః ।
నిత్యాసక్తా నిరుపమమణిశ్రేణి వాణిజ్యలాభే
బంభ్రమ్యన్తే బహుదినపరిప్రాప్య దేశాన్తరేషు॥ 163

అ. నిరుపమ...లాభే—నిరుపమ=సాటిలేని, మణి = రత్నాలయొక్క, శ్రేణి=సమూహములతోడి, వాణిజ్య=వ్యాపారమువలని, లాభే=లాభమందు; నిత్యాసక్తాః = ఎప్పుడును పట్టుదలగలవారై, వ్రీడామారవ్యతికరవతీః=సిగ్గుతోడి మన్మథక్రీడకు మాఱుపాటుగలవారై, విద్యుదాభాః=మెఱుముకాంతులుకలవారైన, కృశాంగీః= స్త్రీలను, అహహ=ఆహాహా? క్రీడాయోగ్యే=క్రీడించుటకుతగిన, సమయేపి=కాలమునకూడ, గేహఏవ=ఇంటిలోనే, త్యజంతః= విడిచినవారై,బహు...తరేషు—బహుదిన = అనేకదినములతో, పరిప్రాప్య= చేరఁదగిన,దేశాంతరేషు=దేశాంతరములలో,బంభ్రమ్యంతే=చాలాతిరుగుదురు.

తా. ఈఘూర్జరదేశస్థులు దేశాంతరములలో రత్నాలవ్యాపారమున మెఱుమువలె కాంతులుగల స్త్రీలను మన్మథక్రీడార్హమైన కాలములోఁగూడనింటనే విడిచి తిరుగుచున్నారు. (మందాక్రాంతవృత్తము)

అశ్లేకదా:—

ఉ. సిగ్గొకయింతి, యెంతో మరుకేళిలు, మించెను మించుబోఁ
డులన్। దగ్గతజిందొలంగి తనుకు ధామములందమిమీాఁజి, వే
రముల్ । తగ్గక చేయఁబో యెదరుకదవ్వులలాతి విలాతులందు
వీరగ్గలమై, యిటంబరిణ యాం బవు టేమి ప్రయోజనంబొకో?

టీ. మరుకేళిలు=మన్మథక్రీడలు, ధామములన్=ఇండ్లలో, తమి=అత్యాశ, దవ్వులన్=దూరములో, లాతివిలాతులందు=వేఱుదేశములందు;

విశ్వావసుః :—

౧. మందమనీష? సఏష పురుషాణాంగుణవిశేషఏవ నతు దోషః.

అ. మందమనీష=ఓమందబుద్ధీ? సఏష = ఆయిది, పురుషాణాం = పురుషులయొక్క, గుణవిశేషఏవ=గుణవిశేషమే, నతుదోషః=దోషముకాదు.

విశ్వావసువు:—

వ. మందమనీషా? ఆయిది యిందుల పురుషవిశేషుల గుణవిశేష
మేకాని, దోషవిశేషము కాదు.

మ. దేశే దేశే కిమపి కుతుకా దద్భుతం లోకమానా
స్సంపాద్యైవ ద్రవిణమమితం సద్మభూయోఽప్యవాప్య।
సాయుజ్యం తే సుచిరవిరహోత్కంఠితాభి స్సతీభి
స్సౌఖ్యం ధన్యాః కిమపి దధతే సర్వసంపత్సమృద్ధాః. 165

అ. దేశేదేశే=నానాదేశములందు, కుతుకాత్=వేడుకతో, కిమపి=ఒకానొక, అద్భుతం=ఆశ్చర్యమును, లోకమానాః=చూచువారై, అమితం=అధికమైన, ద్రవిణమేవ=ద్రవ్యమునే, సంపాద్య=సంపాదించి, సద్మ=ఇంటిని, భూయోపి=మఱల, అవాప్య=పొంది, సర్వసంపత్సమృద్ధాః=సర్వసంపదలతో నిండినవారై, సుచిరవిరహోత్కంఠితాభిః=చాలాకాలమునుండి యెడబాటుచేత కోరఁబడుచున్న, సతీభిః=తమస్త్రీలతో, సాయుజ్యం తే=కూడుచున్నారు,

ధన్యాః=కృతార్థులునై, కిమపి=చెప్పశక్యముకాని, సౌఖ్యం=సుఖమును, దధతే= ధరించుచున్నారు.

తా. ఈదేశస్థులు ఒక్కొక్క దేశములోను ఆశ్చర్యములను జూచుచు, విస్తార ధనము నార్జించి మఱ్ఱిమఱ్ఱి నింటికివచ్చుచు, బహుకాలముగా విరహమునఁగో రి, తమతమభార్యలఁమఁజేరి. సర్వసంపదలుగలిగి, తాము కృతార్థులై సర్వసుఖ ము లనుభవించుచున్నారు.

ఉ. దేశవిదేశముల్ తిరిగి, కౌతుకిక వేడుకలెల్లఁజూచి, యెం
తేసిధనంబుదెచ్చి, తమ కెంపెచ్చినకోరిక నిల్లుసేరి, పే
రాసల సర్వసంపదల కాసరగా నలరింతురెంతొ యం
దాసరికాఁచివేచి, యసికొయాడని యాంధ్రనె కూడివేడుకన్.

టి. ఆసరగాన్ =ఆశ్రయముగా, ఆసరికిన్ =తాముపచ్చునందాఁక.

గ. అనేవంభావోపి పురుషాధమత్వ మావేదయతి. 166

అ. అనేవంభావోపి=ఇట్టి తలంపులేనివాఁడైనయెడ, పురుషాధమత్వం=నీచ పురుషత్వమును, ఆవేదయతి=తెలుపుచున్నాఁడు.

వ. ఇట్టి భావములేకుండువాఁడు వట్టి పురుషభావమునె కనుపఱు చుచుండువాఁడు.

తథాహి.—

మ. ఆకించన్యా దతిపరిచయా జ్జాయయోపేక్షమాణో
భూపాలానా మననుసరణా ద్బిభ్యదేవాఖిలేభ్యః ।
గేహేతిష్ఠన్ కుమతిరలసః కూపకూర్మైస్సధర్మా
కింజానీతే భువనచరితం? కిం సుఖంచోపభుంక్తే॥ 167

అ. అలసః=మందుఁడైనవాఁడు, గేహే=ఇంటిలో, తిష్ఠన్ = ఉండుచు, కూపకూర్మైః=నూతిలోని తాఁబేళ్లతో, సధర్మా=సమానుఁడై, ఆకించన్యాత్ = దారిద్ర్యమువలన, అతిపరిచయాత్=మిక్కిలి సహవాసమువలన, జాయయా=

భార్య చేత, ఉపేక్షమాణః=అలక్ష్యము చేయఁబడినవాఁడై, భూపాలానాం=రాజులలో, అననుసరణాత్ = అనుసరింపమినలనను, అఖిలేభ్యః = అందఱివలనను, బిభ్యత్+ఏవ = భయపడుచునే, కుమతిః=దుర్బుద్ధియై, భువనచరితం=లోకవృత్తాంతమును, కింజానీతే=ఏమి తెలిసికొనుచున్నాఁడు? సుఖంచ=సౌఖ్యమునుకా, కిముపభుంక్తే=ఏమనుభవించుచున్నాఁడు?

తా. లేమిడిచేతను, అతిసహవాసముచేతను, భార్యచే అలక్ష్యము చేయబడి, రాజుల ననుసరింపక యితరులకు భయపడుచు బావిలోని తాఁబేలువలె ఇంట నేయుండువాఁడు, లౌకికము నెఱుఁగక యేమిసుఖము ననుభవించును?

అదిస రే?:—

తే. లేమి నతిపరిచితిఁ దన ఁ లేమ యెగువ
వరులఁ గూడక, యోడుక ఁ యొరుల, కెపుడు
నింటనుండియె నుయికప్ప ఁ వంటియమతి
యేమి గనునీజగముఁ? గను ఁ నేమిసుఖము?

టి. ఓడుక=ఓడుకొని - భయపడుకొని (అనుబంధక్త్వార్థక కొనుసకు కాదేశము).

తథాహి.—

వ్యాపారాన్తరముద్దిశ్య వీక్షమాణో వధూముఖమ్ ।
యోగృహేష్వేవనిద్రాతి దరిద్రాతి స దుర్మతిః॥ 158

అ. యః=ఎవఁడు, వ్యాపారాంతరం= వేఱువ్యాపారమును, ఉద్దిశ్య=ఉద్దేశించి, వధూముఖం=ఆడుదానిముఖమును, వీక్షమాణః = చూచుచు, గృహేషు=ఇండ్లలో, నిద్రాత్యేవ=నిద్రించుచునేయున్నాఁడో? సదుర్మతిః=ఆదుర్బుద్ధిగలవాఁడు, దరిద్రాతి=దరిద్రుఁడగుచున్నాఁడు.

తా. బుద్ధిహీనుఁడైనవాఁడు నిష్ఫలమైన వ్యాపారమును దలంచి పెండ్లము ముఖమును చూచుచునే యింట నిదురించుచు దరిద్రుఁడగుచున్నాఁడు.

అది సరే?:—

క. ఏదే నొకపని నెపమిడి
యూఁదట నటు గనుచును దన కే యాలిమొగంబే
యే దెబె యింట నుండియె
వేఁదులు నిదురించు వాఁడె కే పెదపేదయగున్.

టి. వేఁదులు=వెఱ్ఱివాఁడు, (పెద=పెద్దరూపాంతరము)

ఇదంచావధీయతాం:—

వృ. ఇచ్ఛేద్యస్తు సుఖం నివస్తు మవనౌ గచ్ఛేత్సరాజ్ఞస్సభాం
కల్యాణీం గిరమేవ సంసది వదే త్కార్యేషుదద్యాత్కృతీ।
అక్లేశాద్ధనమార్జయే దధిపతే రావర్జయే ద్వల్లభా
కుర్వీతోపకృతిం జనస్య సమయే కస్యాపి నాపక్రియాం॥159

అ. యస్తు=ఎవఁడైతే, కృతీ=పుణ్యాత్ముఁడు, అవనౌ=భూమిలో, సుఖం=సుఖముగా, నివస్తుం=నివసించుటకు, ఇచ్ఛేత్=కోరునో, సః=వాఁడు, రాజ్ఞః=రాజుయొక్క, సభాం=సభనుగూర్చి, గచ్ఛేత్=పోవును; సంసది=రాజసభలో, కల్యాణీం=శుభకరమైన, గిరమేవ=మాటనే, వదేత్=చెప్పును; కార్యేషు=కార్యములలో, దద్యాత్=ఇచ్చును; అక్లేశాత్=కష్టములేక, - ధనం=ధనమును। ఆర్జయేత్=ఆర్జించును; అధిపతేః=యజమానునికి, వల్లభాన్=ప్రియమైనవారిని, ఆవర్జయేత్=మఱలించుకొనును; జనస్య=మనుష్యునికి, ఉపకృతిం=ఉపకారమును, కుర్వీత=చేయును; సమయే=సమయములో, కస్యాపి=ఒకనికైనను, అపక్రియాం=అపకారమును, నకుర్వీత=చేయఁడు.

తా. సుకృతముగలవాఁడు సుఖముగా వసింపఁగోరును, రాజసభకుఁ బోవఁగోరును, సభలో మంచిమాటనేచెప్పును, కార్యకాలములలో ప్రియమైనవారికి ధనధాన్యములిచ్చును, కష్టములేకయే ధనము సంపాదించును, రాజసంబంధులను అనుకూలురనుగాఁజేయును, జనుల కుపకారమేచేయును, అపకారము చేయఁడు.

ఇదియు నవహితమవపుఁగావుత:—

మ. వెలయన్ గోరెడి నెవ్వఁడివ్వసుధపైన్ వేసౌఖ్య,మావానికిన్
వలయున్ రాజసభన్ జరింప,వలయున్ శ్రీవాక్రువ్వమవ్వంబు
గాన్, వలయున్ సత్క్రియ సేయ, నీయవలయున్ శ్రీ వాఁడర్థ
మర్థింపఁగాన్,వలయున్ వేళలమేలుసేయ, వలయున్ శ్రీ వాఁ
డేదఁ గీడేదియేన్. 160

టి. మవ్వంబుగాన్ = మనోహరముగా, ఏదన్ వలయున్ = పోఁగొట్ట వలయును.

అన్యచ్చేద మవధారణీయం.—

వృ. అయుక్తం యుక్తంవా యదభిహిత మజ్ఞేనవిభునా
స్తుయాదేతన్నిత్యం జడమపి గురుంతస్య వినుయాత్ ।
వివిత్సుర్నైస్పృహ్యాం కథమపి సభాయా మభినయేత్
స్వకార్యంసంతుష్టే క్షితిభృతి రహస్యేవ కథయేత్ ॥ 161

అ. అజ్ఞేన=అవివేకియైన, విభునా=ప్రభువుచేత, అయుక్తంయుక్తంవా= అయుక్తమైనను యుక్తమైనను, యత్=ఏది, అభిహితం=చెప్పఁబడునో, ఏత త్=ఆదీనిని, నిత్యం=ఎప్పుడును, స్తుయాత్=స్తోత్రముచేయును; జడమపి=అవి వేకియైనను,తస్యగురుం=వానిగురువును,వినుయాత్=స్తుతించును;వివిత్సుః=తెలి యఁగోరువాఁడై, నైస్పృహ్యాం = నిరాశను, సభాయాం=సభలో, కథమపి= ఎట్లయినను, అభినయేత్=వెలిపఱచును; క్షితిభృతి=రాజు, సంతుష్టేసతి=సం తోషించుచుండఁగా, స్వకార్యం=తనకార్యమును, రహస్యేవ=ఏకాంతము లోనె, కథయేత్=చెప్పును.

తా. గర్వికానివాఁడు ప్రభువు మంచిదోచెడుదో చెప్పినది కొనియాడును; వానిగురువు వివేకములేనివాఁడైనను, వానిని కొనియాడును; ఆప్రభువు సభి

ప్రాయమును తెలియఁగోరి నిరాశతోనైనను నలుగురిలో వెలిపఱుచును; ఆప్రభు
వునకు సంతోషముగా తనకార్యమును రహస్యముగా తెలుపుకొనును.

మఱియు నిదియు నవధరింపనవుఁగావుత:—

మ. ఇలపైఁ గొయ్యుత్తమయుత్తమేనివిభుఁడొంకేమూఁఘశర్ జెప్పినన్
వలెనాచెప్పిన దేనుతింప, గురున్ కే వ్వాఁడేజుర్ జేరినన్
వలెవాఁడెన్నెడు నెన్నికద్దెలియ, ముకెన్నైరాశ్యముం దెల్పఁ
గాక్, వలెవాఁడుర్ ముదితుండెకాఁగఁ జెవిలోకేవాక్రువ్వ
[నెవ్వాకునేఁ.

టి. ముదితుండె=సంతోషించినవాఁడె, ఎవ్వాకునేఁ=ఏమాటనైనను.

గ. ఇత్యలంప్రసక్తానుప్రసక్త్యేతిదూరతో విమాన మానయన్
సానందం సాంజలిబంధం॥ 162

అ. ఇతి ప్రసక్త+అనుప్రసక్త్యా=ఇట్లు ప్రసక్తించినదానిని అనుసరించుట
తో, అలం=చాలును; ఇతి=అని, దూరతః=దూరముగా, విమానం=విమానమును,
ఆనయన్=తీసికొనిపోవుచు, సానందం=ఆనందముతో, సాంజలిబంధం=అంజలి
బంధముతోను.

వ. అని యిట్లు ప్రసక్తించిన (ఘూర్జర దేశదోషోద్ధరణము ననుస
రణమున) యిందలి యుత్తమాధమపురుషనిరూపణ మీవఱకే
చాలునని దూరమునన విమాన మానయించుకొంచు నానంద
ముతో నంజలిబంధముతోను.

## యమునా (కుంజగోపీకృష్ణ) వర్ణనము.

(యమునానది=కాళింది—ఇది సూర్యునివలనఁబుట్టి యమునికిచెల్లెలై
కళిందపర్వతమునుండి ప్రవహించి, శ్రీకృష్ణుఁడు తనకుప్రియతమయునయినం
దున గోకులబృందావనాదులందు అనేకలీలలతో సంచరించిన తీరప్రదేశము
కలది. దీనిప్రస్తావనమున కుంజగోపీకృష్ణులును సందర్శింపఁబడిరి.)

వృ. కృష్ణాశ్లేషవిశేషితాసితరుచే? కాలిన్ది? తుభ్యంనమః
కుఞ్జేభ్యశ్శ్రిత తావకామ్బుకణికాపుఞ్జేభ్య ఏషోఞ్జలిః।
గోపీభ్యఃపరిలిప్సయామురరిపో స్తేషుస్థితాభ్యోనతిః
నాథాయాఽభిరుపాసితాయచ నమోవాకానధీయామహి॥

అ. కృష్ణా...రుచే-కృష్ణ=శ్రీకృష్ణునియొక్క, ఆశ్లేష = ఆలింగనముచేత, విశేషిత=అధికమైన, అసితరుచే=నల్లనికాంతులుగల, కాలింది = ఓకాలిందీ! తుభ్యం=నీకు, నమః=నమస్కారము. శ్రిత...పుంజేభ్యః-శ్రిత=చేరిన, తావక=నీసంబంధమై, అంబుకణికా=నీటిబొట్లయొక్క, పుంజేభ్యః=సమూహములుగల; కుంజేభ్యః=పొదలకై, ఏషః=ఇది, అంజలిః=నమస్కారము. మురరిపోః=కృష్ణునియొక్క, పరిలిప్సయా=కౌఁగలింపఁ గోరికచేత, తేషు = ఆపొదలలో, స్థితాభ్యః=ఉన్న, గోపీభ్యః=గోపికలకు, నతిః=నమస్కారము. ఆభిః=ఈగోపికలచేత, ఉపాసితాయ=సేవింపఁబడుచున్న, నాథాయ=స్వామికిని, నమోవాకాన్ = నమస్కారవాక్యములను, అధీయామహి = మల్లమల్ల ఉచ్చరించుచున్నాము.

తా. అష్టభార్యలలో నొకతెయై కృష్ణుఁడాలింగనముచేయఁగా, మిగుల నీలకాంతిగలిగి నదీరూపయునైన ఓకాళిందీ! నీకును, నీజలకణములచేత చల్లఁబడుచున్న పొదరిండ్లకును, ఆకృష్ణుని ఆలింగనమునకై ఆపొదరిండ్లలోనున్న గోపికలకును, ఈగోపికలచే సేవింపఁబడుచుండెడి శ్రీకృష్ణునకును నమస్కారములు.

సీ. అలకృష్ణుఁ గని కవుం — గిలి కొనుకొలఁదినై
నాకృష్ణభావంబె — యావహించు
కాళింది? నీకిదె — కావింతు వందనం,
బంజలికావింతు — సింజదళిక
మగునికుంజమ? — నీకునందులస్వాదూద
క[illegible]

యందుల నాకృష్ణు ౯ నాలింగనము గోరు
గోపికాంగనలు మీా ౯ కుసుమజోహారు
తే. చేసెదను, వారలును నుపా ౯ సింపసొంపు
మిగులు వారలకును గృపా ౯ మే దురంపు
టాదరంబున శ్రీకృష్ణ? ౯ నాథుఁడవగు
నీక యొనరింతు జేజే ల౯ నేకముగను.

టి. సింజల్ + అళికము = మ్రోలెడి తుమ్మెదలుగల, నికుంజము = ఓపొదరిల్లా! రంజిత + దళ + సుమ + లతంబ = ఇంపయిన + ఆకులును + పూలును + తీఁగలునుగల, మేదురంపు = అతిశయమైన.

కృశానుః.—

గ. కృతంసఖే? జారచోరశిఖామణేః కృష్ణస్య జగదతిసన్ధాతుర నుసన్ధానేన 164

అ. సఖే = ఓచెలికాఁడా? జారచోరశిఖామణేః = జారులకును చోరులకును శిరోమణియై, జగత్ + అతిసంధాతుః = లోకానికే మించినవాఁడును (సృష్టిస్థితిలయములను చేయువాఁడు నైన), కృష్ణస్య = కృష్ణునియొక్క, అనుసంధానేన = అనుసరించి స్తుతించుటచేత, కృతం = చాలును.

కృశానుఁడు.—

వ. సఖా! సకలమైన దొంగలకుఁ బొజుంగులకుఁ శిఖామణియగు నీకృష్ణునియందలి జగంబు నతిసంధానంబున నీదు ననుసంధానంబును జాలును.

టి. అతిసంధానమునఁ (సంసర్గపాలన నాశనత్రయముయొక్క) అతిక్రమణ విషయమున.

తథాహి.—

వృ. లుంఠిత్వా నవనీత మన్యసదనే లోలేక్షణో భక్షయన్
గోపీభిః పరికృష్య మాతృసవిధం నీతో ముకుంద స్తయా।
'లుంఠీ ర్మానవనీత' మిత్యభిహితో ప్యేతద్వ్యలుంఠీః కిమి
త్యుక్తో మానవనీత మేవ హృతమిత్యాగో జనన్యాం న్యధాత్.

అ. అన్యసదనే=పరగృహమందు, నవనీతం=వెన్నను, లుంఠిత్వా=దొంగ లించి, లోలేక్షణః=చలించుచుండెడు కండ్లుగలవాఁడై, భక్షయన్ = తినుచు, పరికృష్య=లాఁగుకొని,గోపీభిః=గోపికలచేత,మాతృసవిధం=తల్లిసమీపమునకు, నీతః=కొనిపోఁబడిన, ముకుందః = కృష్ణుఁడు, తయా=ఆతల్లిచేత, నవనీతం=వెన్నను, మాలుంఠీః=దొంగిలింపకుము, ఇతి=అని, అభిహితో పి=చెప్పఁబడినవాఁడైనను, ఏతత్=దీనిని, కిం=ఏల, వ్యలుంఠీః = దొంగిలించితివి? ఇతి=అని, ఉక్తః=చెప్పఁబడినవాఁడై, మానవనీత మేవహృతం=నవనీతంమాహృత మేవ_నవనీత మే అపహరించలేదు, ఇతి=అని, ఆగః=అపరాధమును, జనన్యాం=తల్లియందు, న్యధాత్=ఉంచెను.

తా. కృష్ణుఁడు అన్యులయింట వెన్నదొంగలించి బెదరుచూపులతో తనతల్లియైన యశోదదగ్గరికి గోపికలచేత కొనిపోఁబడి ఆతల్లి వెన్నదొంగలించవద్దు అని చెప్పఁబడియు ఏల దొంగలించితివి యనియడుగఁగా,మానవనీత మేవ హృత మని నీవుచెప్పినట్లే చేసితినని తల్లి మీఁదనె తప్పుపెట్టెను.

అదిసరె.—

ఉ. మానినియాయశోదయుఁ గుమారునిఁగృష్ణునిఁబిల్చి,గోపికా
మానవతుల్మలంగు మటుమాయలకాఁడని తల్పకే,"అరే!
మానవనీత మేవహర మాధవ" యంచు వచించుమాతకున్
మానవనీత మేవ యను మాధవుఁడా పెనెతప్పుమోపఁగాన్.

టి. అరే మానవనీత మేవ హరమాధవ=అరే మాధవ నవనీతంమైవహర-అరే మాధవ=ఓరీకృష్ణా, నవనీతం=వెన్నను, మైవహార=ఎప్పటికిని దొంగిలించవద్దు, అనుతల్లి

మాటను, మానవనీతమేవ=నవనీతంమైన హరామి-నవనీతము దొంగిలింపనె దొం గిలింపను అనుప్రత్యుత్తరములో; (మానవ నీతమేవహరామి-మానవ=మనుష్యుల చేత, నీతమేవ=కొనిపోఁబడినదె, హరామి=దొంగిలించుచున్నాను, అని తనగూఢార్థము) సహితము తెల్పెను.

కించ.—

వృ. అంసే సలీల మధిరోప్య శుకం స్వహస్తాత్
గోప్యా భయాకులదృశః కుతుకీ ముకున్దః!
అంసంగతంశుక మిహాపనయేతి వాచం
తస్యానిశమ్య స తదంశుక మాచకర్ష ॥ 166

అ. సః ముకుందః=ఆకృష్ణుఁడు, స్వహస్తాత్=తనచేతిలోనుండి, శుకం=చిలుకను, భయాకులదృశః=భయముచే కదలుచున్న చూపులుగల, గోప్యాః=గోపికయొక్క, అంసే=భుజాగ్రమందు, సలీలం=లీలతో, అధిరోప్య=ఎక్కించి, కుతుకీ=వేడుకగలవాఁడై, అంసంగతం శుకం=అంకారముతోఁగూడిన శుకమును- అంశుకం=వస్త్రమును, ఇహ=ఇక్కడ,అపనయ=త్రోయుము, ఇతి=అని, తస్యాః=ఆగోపికయొక్క, వాచం=మాటను, నిశమ్య=విని, తదంశుకం=దానివస్త్రమును, ఆచకర్ష=లాఁగెను.

తా. కృష్ణుఁడు తనచేతిచిలుకను ఒకగోపికమూఁపునవిడిచి, అంసంగతం శుకమిహాపనయ = (ఇహ అంసహితం శుకం అపనయ)అంశుకం=అంశుకమను పదార్థమును, అపనయ=తొలగించుము. అను ఆగోపికమాటనువిని దానివస్త్రమును లాఁగివేసెను.

మఱియు.—

తే. అంసమునఁ జిల్క నెక్కించి ౕ యాకులాక్షి
యగు నొకానొక గోపిక ౕ యదరితనున
యనఁగి (యంసంగతంశుక ౕ మపనయ) యనఁ
దోన దానియంశుకమును ౕ దానలాఁగె.

టి. అంసమునన్ =మూపులో, తనున=తన్నే,(అంసంగతంశుకమపనయ)= మూఁపునఁజేరిన చిల్కనుదీయుము, అను గోపికమాటను (అం=అం అనెడిఅక్షరముతో, సంగతం=కూడుకొన్న, శుకం=శుకమనుపదముగల, అంశుకం-అను పదమునుగా అర్థముచేసి) పైఁట అనుఅర్థముగల అంశుకమను పదార్థమును.

అపిచ.—

వృ. నీత్వా రాధికయా నిశాం మురరిపుః ప్రాతర్గృహానాగతః
'త్వంమాభూరపరాధికః పునరితి ప్రోక్తోపి పూర్వంమయా।
కస్మాదేవమభూఽరితి' ప్రశితరుషా నిర్భర్త్సితో నీలయా
(త్వద్వాచైవ సరాధికోహ) మితి తాం వ్యామోహయన్
[మాయయా॥

అ. రాధికయా=రాధాదేవితోఁడ, నిశాం=రాత్రిని, నీత్వా = కడపి, ప్రాతః=ఉదయాన, గృహాన్ =ఇంటిని, ఆగతః = చేరిన, మురరిపుః = కృష్ణుఁడు, త్వం=నీవు, పునః=మఱల, అపరాధికః = రాధాసంగమాపరాధముగలవాఁడు (అపగతరాధికుఁడు),మాభూః=కాకుము, ఇతి=అని, పూర్వం=ముందే,మయా=నాచేత, ప్రోక్తోపి=చెప్పఁబడినవాఁడవైనను, కస్మాత్ = ఏమికారణమువలన, ఏవం=ఇట్లు, అభూః=అయితివి, ఇతి-అని, ప్రశితరుషా=తెచ్చుకొన్న కోపముగల, నీలయా=నీలాదేవిచేత, నిర్భర్త్సితః=బెదరింపఁబడినవాఁడై, మాయయా=మాయచేత, త్వద్వాచైవ=నీమాటచేతనే, అహం=నేను, సరాధికః=రాధాసహితుఁడను, ఇతి=అని, తాం=ఆనీలాదేవిని, వ్యామోహయత్ =మైమఱపఁజేసెను.

తా. రాత్రియంతయు రాధికతోఁగడపి, ప్రొద్దునవచ్చినకృష్ణుని నీలాదేవి నీవు అపరాధికుఁడవు=రాధనువదిలినవాఁడు—అపరాధము కలవాఁడు కాకుము. అని ముందేచెప్పియుండియు, మఱల నెందుకిట్లుచేసెదవు? అనియడిగిన నీలతో, నీమాటతోనే సరాధికుఁడను నేననిచెప్పి ఆనీలను మోసపుచ్చెను.

మఱియు.—

తే. రాధికనుగూడి వేడుక \ రాత్రికడపి
రేపకడ మూలయిలు సేర, \ రేఁగి నీల
యడఁతుఁ జెపు మిపు డపరాధి \ కుడవె? యనినఁ,
బడఁతి? నీయాన, యపరాధి \ కుఁడనె యనెను.

టి. అపరాధికుఁడు=రాధికను వదిలినవాఁడవు, అపరాధికుఁడను=(వద్దన్నది చేసిన) అపరాధము కలవాఁడను.

ఇతి. రాధికా—నందగోపునకు సహోదరియై శ్రీకృష్ణునికి ప్రియురాలైన రాధాదేవి.

విశ్వావసుః.—

గ. వయస్య? మైవంవాదీః, సహి పరమపావన స్సకలజగదంహ
స్సంహరణకృతే కృతావతారో వన్దారుజనానన్దనో యదు
నన్దనో నిన్దాపదవీ దవీయాన్. 168

అ. వయస్య=ఓ స్నేహితుఁడా! మైవంవాదీః=ఇట్లుచెప్పకు, సహి=అతఁడో, పరమపావనః=మిక్కిలిపవిత్రుఁడు, సకల+జగత్+అంహః+సంహరణకృతే=సమస్తలోక పాపనివృత్తికై, కృతావతారః=చేసిన అవతారములు కలవాఁడును, వందారుజనానందనః=నమస్కరించువారికి ఆనందమునిచ్చువాఁడును, యదునందనః=యదుకుమారుఁడును, నిందాపదవీదవీయాన్=నిందామార్గమునకు దూరస్థుఁడును.

విశ్వావసువు.—

వ. చెలికాఁడా, ఇటులాడకుము? అతఁడు పరమపావనుఁడు. సకలలోక శోకనిరాకరణ కరణార్థ మవతరించి, యాశ్రితానందనుండగు నీయశోదానందనుండు నీనిందాపదవికిం దూరమె యందనివాఁడు.

## శ్రీకృష్ణవర్ణనము.

(శ్రీకృష్ణమూర్తి. — వీరు, శ్రీరామావతారమున దేవతలును మహర్షులును ఆశ్రీరాముల సౌందర్య చాతుర్యాదులను సేవించి, వారితో ఐహికసుఖసంసర్గాదులు సైతము తామనుభవింప నపేక్షించి, వారినియమనప్రకారముగ వారి యపరావతారమైన యీకృష్ణావతారమున తమతమ యిచ్ఛానుసారముగ గో గోప గోపీరూపములుగాను ఘాసతరులతాగుల్మములుగాను జనియించిన యాదేవతాదులను వివిధవిధ లీలావినోదములతో నానందింపఁజేయుచు, మఱియు కుబ్జాకుచేల విదురోద్ధవ పాండవాదులను నానందింపఁజేయుచు, అందర్జునునకు సారథియై విశ్వరూపప్రదర్శనమున అతనిని పరమహిత విహిత భగవద్గీతోపదేశమున పరమవిరక్తునిఁగఁజేసి యానందింపఁజేయుచు, తామును ఎనమండ్రుభార్యలతోను పదార్వురు రాజకన్యకలతోను మఱి పదార్వేలగోపికలతోను ఆనందించుకొనుచునుండిన యా శ్రీమన్నారాయణమూర్తియే.)

ఉ. అసత్క్షయార్థా భ్యుదయస్య యస్య
జగుశ్చరిత్రం జగతః పవిత్రం ।
పునః పరస్మై పురుషాయ తస్మై
నమస్తనమ్యాయ నమస్తనోమి. 169

అ. అసత్ క్షయార్థ+అభ్యుదయస్య=అసద్విషయముల నాశముకొఱకై+అవతారముగల, యస్య=ఎవనియొక్క, చరిత్రం=చరితమును, జగతః=లోకమునకు, పవిత్రం=పావనమునుగా, జగుః=చెప్పుదురో? తస్మై=అట్టి, సమస్త+నమ్యాయ=సకలమైన వారిచేతను+నమస్కరింప నర్హుఁడైన, పరస్మైపురుషాయ=పరమపురుషుఁడైన శ్రీకృష్ణునికొఱకు, పునః=మఱల, నమః=నమస్కారమును, తనోమి=చేయుచున్నాను.

తా. ఎవఁడు సకలదోష నివారణార్థమై అవతరించిన యతఁడో, ఎతనిచరిత్రమును సర్వవిధపవిత్రమునుగా సకలజ్ఞానవంతులును చెప్పుదురో, అట్టి సకలలోకులకును నమస్కరింపఁదగిన ఆపరమపురుషుఁడగు శ్రీకృష్ణుని మఱలమఱల నమస్కరించుచున్నానని శ్లోకతాత్పర్యము.

తే. లోకశోకనిరాకరణైకజనన
మును భువనపవిత్రచరిత్రమును గలానిఁ
బరమపురుషుని నిదె సర్వపురుషనతునిఁ
బ్రణతిసేయుదు మఱిమఱి ప్రణుతిసేసి.

టి. లోక...జననమును=సకలలోక దుఃఖములను నిరాకరించుటకై ముఖ్యమైనయవతారమును, కలానిన్=కలవానిని, ప్రణతి=నమస్కారమును, ప్రణుతి=స్తోత్రమును.

గ. అస్యఖల్వత్యద్భుతం చారిత్రమాకర్ణ్యతాం:—

వ. ఇతని దేకదా? అతిమాత్రమద్భుతము చారిత్రము వినఁబడుఁగాత?

చోరస్యచౌర్యం జగతిప్రసిద్ధం
చౌర్యస్యచౌర్యం నతుదృష్టపూర్వం।
చౌర్యాణికార్యాణి బత శ్రుతాని
కృష్ణస్య ముష్ణంతి తమాంసి. 170

అ. చోరస్య=దొంగయొక్క, చౌర్యం=దొంగతనము, జగతి=లోకమందు, ప్రసిద్ధం=ప్రసిద్ధమును, చౌర్యస్య=దొంగతనముయొక్క, చౌర్యం=దొంగతనము, దృష్టపూర్వం=ముందెప్పుడునుచూచినది, న=కాదు. చౌర్యాణి=దొంగతనములనెడు, కృష్ణస్యకార్యాణి=కృష్ణునికార్యములు, బత=ఆహా?, శ్రుతాని=వినఁబడినవి? తమాంసి=పాపములుఅన్నిటినిన్, ముష్ణంతితమాం=బహుగా దొంగలించుచున్నవి.

తా. లోకములో దొంగకు దొంగతనముండినప్పటికిని, దొంగతనమునకు దొంగతన మెప్పుడును చూచినదికాదు. ఈకృష్ణునిదొంగతనము మొదలైనకార్యములు సకలదోషములనున్ చాలామట్టుకు అపహరించుచున్నవే అని వినుచున్నావే అది ఆశ్చర్యముకదా?

తే. మ్రుచ్చునకునగు మ్రుచ్చిమి కీ యచ్చుపడఁగ
ముట్చుటగునె? మ్రుచ్చిమికిని కీ మ్రుచ్చిమియన
మ్రుచ్చిమియె కృష్ణునిది హెచ్చి కీ పెచ్చుపెరుగు
తమము మ్రుచ్చిలు,నదె మ్రుచ్చుఁదనము మెచ్చ?

టి. కృష్ణుని మ్రుచ్చిమియే హెచ్చి పెచ్చుపెరుగు దోషమును మ్రుచ్చిలును.

కించ.—

చిత్రంచిత్రం జృమ్భితే కృష్ణమేఘే
కంసంప్రాప్తా ప్రాపలోపం సమృద్ధిః
ఆసీద్యుక్తం హా నిదాఘప్రశాన్తి
ర్హంసో హింసా మానసే కీర్తిరుత్థా. 171

అ. కృష్ణమేఘే=నీలమేఘము, (కృష్ణుఁడు అను మేఘము,) జృంభితేసతి= విజృంభించుచుండఁగా, హా నిదాఘప్రశాతిః— హా=ఆహా, నిదాఘ = ఎండ కాలము వేఁడిమికి, ప్రశాంతిః=ప్రశమనము, (హానిద=హానినిచ్చునట్టి, అఘ= అఘాసురుఁడనువానికి, ప్రశాంతిః=నాశము,) ఆసీత్=అయ్యెను, హంసః= హంసపక్షి, (హంసాసురుఁడు,) హింసాం=హింసను, మానసే=మానససరస్సు నందు, (=మనస్సున) ప్రాప్తవాన్=పొందెను, కీర్తిః=అడుసు (యవస్సు,) ఉత్థా = పుట్టెను, యుక్తం = ఇదిసరే, కంసంప్రాప్తా— కం=జలమును, సంప్రాప్తా = పొందిన, సమృద్ధిః = ఆధిక్యము, (కంసం) = కంసుఁడనువానిని, ప్రాప్తాసమృద్ధిః=పొందినసమృద్ధి,లోపం=నాశమును,ప్రాప=పొందెను,చిత్రం చిత్రం=మహాశ్చర్యము!

తా. కారుమేఘము క్రమ్మునప్పు డెండకాలపువేడి తీఱుటయు, హంసలు మానససరస్సున తిరుగుటయు, అడుసులేచుటయు, జలసమృద్ధియుండియు లోపముకలుగుటయు,ఆశ్చర్యము. అట్లే మేఘవర్ణుఁడైన కృష్ణుఁడుఅఘాసురహం సాసురులను కంసునిన్ సంహరించి కీర్తిపొందెను. (ఇట పైశ్లోకములోకూడ వి రోధాభాసమైనది.)

తే. కృష్ణమేఘవిజృంభణఁ దృష్ణ దీఱఁ
గంసురుచిరసమృద్ధియ గ్రాఁగు టేల?
తపమునణఁగిన హంసనంతపన మేల?
కీర్తిలేచినఁ దనకేల? కీర్తి నేల. 171

టి.కం-సురుచిర=జలము యొక్క అతిమనోహరమైన(కంసునిమనోహరమైన), తపము = తాపము (తపస్సు) హంస=హంసపక్షియొక్క (ఒకానొక రాక్షసుని యొక్క, యోగులయొక్కయు) ఇట ఆశ్చర్యప్రశ్నములు, విరోధాభాసశ్లేష రూపకములు.

గ. పున స్సభక్త్య స్స్మేషం భగవంతముద్దిశ్య.

వ. మఱియు భక్తియతిశయించి భగవంతును ద్దేశించి.

వృ. కంసం ధ్వంసయతే మురంతిరయతే హంసం తథాహింసతే
బాణంక్షీణయతే బకంలఘయతే పౌండ్రం పరంలుంపతే
భౌమంతామయతే బలాద్బలభిదోగర్వం పరాకుర్వతే
క్లిష్టం శిష్టగణం ప్రణమ్రమవతే కృష్ణాయ తుభ్యంనమః. 172

అ. కంసం=కంసుని, ధ్వంసయతే=ధ్వంసము చేసినవాఁడును, మురం=మురాసురుని, తిరయితే=నశింపఁజేసినవాఁడును, హంసం=హంసాసురుని, తథా=అట్లు, హింసతే=హింసించినవాఁడును; బాణం=బాణాసురుని, క్షీణయతే=క్షీణింపఁజేసినవాఁడును; బకం=బకాసురుని, లఘయతే=నశింపఁజేసినవాఁడును; పౌండ్రం=పౌండ్రాసురుని, పరం=బహుగా, లుంపతే=పీడించినవాఁడును; భౌమం=భూమిపుత్రుఁడైన నరకాసురుని, తామయతే = నశింపఁజేసినవాఁడును; బలాత్=బలిమితో, బలభిదః=ఇంద్రునియొక్క, గర్వం = గర్వమును, పరాకురతే=నిరాకరించినవాఁడును; క్లిష్టం=దుష్టులచే క్లేశపడినదై, ప్రణమ్రం=నమస్కరించినట్టి, శిష్టగణం=పెద్దలసమూహమును, అవతే=రక్షించువాఁడునైన; కృష్ణాయ=శ్రీకృష్ణుఁడవైన, తుభ్యం=నీకు, నమః=నమస్కారము.

తా. కంస, హంస, బాణ, బక, పౌండ్ర, నరకాసురులను, నశింపఁజేసి, ఇంద్రునిగర్వమణఁచి, దుష్టులచే పీడింపఁబడజాలక నిన్నునమస్కరించుశిష్టులను రక్షించునట్టి ఓకృష్ణా! నీకు నమస్కారము.

సీ. కంసవిధ్వంసము హంసనిహింసయు,
బాణసంక్షీణంబు భౌముతూవము,
మాముర సంహార మాశిశుపాలవి
ఫాలనమును, నల కాలయవన
యమనంబు, చాణూర శమనంబు, యమళార్జు
నవిభంజనము, కాళియవిజయమును,
పూతనప్రాణవిమోచనమును సుద,
ర్శనశాపమోచనమును దవాగ్ని,

తే. గళన, మఱి బకశకటవిదళన మిలను,
జేసి, ముచికుందకుబ్జాకుచేలవిదుర
ముఖమహాత్ముల ముఖవికాసకతఁ జేసి
వెలయునోకృష్ణ! నిన్నె నేవలతుఁ గొలుతు.

టి. నిహింస=హింస, భౌముతూవుము=నరకాసురనాశము.

కంసుఁడు వీఁడు రుద్రసేనునికొడుకై కృష్ణునిమేనమామ యై మథురాపట్టణమునకు రాజై తనచెల్లెలైనదేవకీదేవియెనిమిదవకొడుకువలన తనకు మరణమని విని ఆదేవకీవసుదేవులను కారాగృహమందుఁబెట్టి ఆమెబిడ్డలను పుట్టినతోడనే చంపుచు కడపట కృష్ణునిచేతనే చంపఁబడినయొకరాక్షసుఁడు.

హంసుఁడు—జరాసంధునిస్నేహితుఁడు డిచికునిసోదరుఁడు. ఈయన్నదమ్ములు శివునివలన ఆయుధములచేత చావకుండునట్లు వరముతీసికొని రాజులనెల్ల హింసించుచుం [illegible] డుచచ్చె

నని హంసునకును, హంసుఁడుచచ్చెనని డిచికునకును చెప్పిపంపఁగా, వారుదుఃఖించి బలాత్కారముగా, వానివలె వీఁడును ప్రాణములు విడిచినవాఁడు.

బాణాసురుఁడు—వీఁడు బలిచక్రవర్తి పెద్దకొడుకై, వేయిచేతులుగలిగి శివభక్తుఁడై, కృష్ణునిమనమఁడైన యనిరుద్ధుని తనకుతెలియక తనకూతురైన ఉషాకన్యక భార్యయైనది వెనుకఁదెలిసికొని, కృష్ణునితోయుద్ధముచేసి, నాలుగు చేతులుతప్ప తక్కినచేతులన్ని అతనిచేత నఱకఁబడి, కడన శివునిప్రమథగణములో ముఖ్యుఁడుగా నున్నవాఁడు.

నరకాసురుఁడు—వీఁడు వరాహావతారములో విష్ణువునకు భూమివలనఁబుట్టి అదితికర్ణకుండలములు దొంగిలించుకొని, గరుడవాహనముతో సత్యభామతో కూడవచ్చి యుద్ధముచేసిన ఆకృష్ణునివల్ల చంపఁబడినవాఁడు. వానిచెఱలో నుంచియున్న పదాఱువేలకన్యలను వివాహమై వచ్చునపుడు సత్యభామప్రేరేపణచేత శ్రీకృష్ణుఁడు స్వర్గమునుండి నందనవనపారిజాతవృక్షమును తెచ్చెను.

మురాసురుఁడు—వీఁడు నరకాసురునియన్నయై యుండి కృష్ణునిచేత చంపఁబడినవాఁడు.

శిశుపాలుఁడు—వీఁడు దమఘోషునకు కొడుకై నాలుగుచేతులతోను నొసటికంటితోనుపుట్టి, ధర్మరాజురాజసూయయాగసమయములో కృష్ణుని నిందించి అతనిచేత నే చచ్చినవాఁడు.

కాలయవనుఁడు—వీఁడు మధురాపురికి దండెత్తిరాఁగా, కృష్ణుఁడు పట్టణము విడిచి, ముచికుందుఁడు నిద్రించెడు పర్వతగుహలో మఱుఁగుపడెను. ఆకాలయవనుఁడాగుహానుదూరి అందలి ముచికుందుని కృష్ణుఁడనుకొని తన్ని వానిచే భస్మమగునట్లు చూడఁబడినవాఁడు.

చాణూరుఁడు—కంసునిభటుఁడు,వీఁడు మల్లయుద్ధములో కృష్ణునిచే సంహరింపఁబడినవాఁడు.

యమళార్జునులు—వీరొకరొకరు శపించుకొని మద్దిచెట్లయి కృష్ణునికట్టిన పలుపుతో కట్టఁబడి కదలకమెదలకయుండి యాకృష్ణునిచేత నే తన్ని విఱుగఁగొట్టఁబడి శాపమువిడుచుకొన్న గంధర్వులు.

కాళియుఁడు—విషనాగుఁడు, వీఁడు యమునయందలితనమీద దుమికిదు మికి నటనముచేయఁబడి యలజడిపడి కడన శ్రీకృష్ణునిచేత నే తఱుమఁబడి సము ద్రమున దాఁగబడియుండినవాఁడు.

పూతన—ఇది చనుమొనలలో విషముపూసికొని కృష్ణునికి పాలియ్యఁజోయి, అతనిఁజంపఁ జూడఁగా, అతఁడాపాలుతో ప్రాణములనుగూడపీల్చి చంపఁ బడినరాక్షసి.

సుదర్శనుఁడు—వీఁడు అంగిరసుని జూచి నవ్వి అతనిచే పాముగశపింపఁబడి కొన్నాళ్లకు కృష్ణుని కాలితన్నుతో నే శాపము తీఱినవాఁడు.

దవాగ్ని—ఇది శ్రీకృష్ణుఁ డనుదినమును వనమాలి యగుటకును, • గోపీగోప గోపరీతుఁడై వనవిహారమునకును సంచరించునపుడు దవానల మావిర్భవించి, యందులచుట్టుపట్టులను వసాపినీజలతాగుల్మాదులను దహించుచు, వచ్చుచుండఁ గని, యదరిబెదరి భ్రమించుచు, గోవులతోఁడి గోపికాగోపకు లాకృష్ణునిఁ జుట్టు కొని బెట్టు మొఱలిడుచుండుటను గనుఁగొని, వెంటనె తా నతిదయారసమున వారినందఱ నూరార్చి, యగలసెగలఁ బేర్చుకొనుచున్న యాకార్చిచ్చును జివిరి జవిరికొని, తనపధిముగ్ధ నవనీతాదిశీతాహారమువలనఁ జలువయిచ్చుచుండు తనగర్భాండభాండమునకు నొక్కప్రక్కకేనిఁ గొంతయుష్ణాహారముగ నిబిడం పుఁదలంపునఁ గబళించుకొని, యది వెలివడనీయక మ్రింగివేసినది చూచి యం దఱు నాశ్చర్యమందుచు నాపరమపురుషుని మహాశ్చర్యమై పరమపవిత్రమైన చరిత్రమును గనుఁగొని వినుకొని పరమానందభరితు లగునటుల నయినది.

బకాసురుఁడు—వీఁడు కంసునిపంపున బృందావనమున కృష్ణుని కొంగరూప ములో వచ్చి మ్రింగఁబోయి అతనిచే చంపఁబడినవాఁడు.

శకటాసురుఁడు—వీఁడు కంసునిబంటై బండిగానుండి పసిబాలుఁడైన కృష్ణు నిచే కాలితన్నుతో చుక్కచుక్కలై చచ్చినవాఁడు.

పౌండ్రుఁడు—బలిచక్రవర్తినాలవకొమారుఁడు. పుండ్రుఁడను వానివంశము వాఁడు. ఇది ఓఢ్రదేశమునకును ఉత్తరాంధ్రదేశమునకును మధ్యదేశము. పూర్వ ము పౌండ్రములని చెప్పబడుచుండెను.

ముచికుందుఁడు—ఇతఁడు మాంధాతకుకొడుకై ఒకనాఁడు అలసి కొండ గుహలోనిద్రించుచు, కాలయవనునిచేత కృష్ణుఁడని తన్నఁబడి,వానిని క్రూర దృష్టితో నీఱుచేసి, కృష్ణునిచే గంధమాదనమున బదరికాశ్రమములో తపస్సు చేయ నుపదేశింపఁబడి, అట్లే చేసినవాఁడు.

కుబ్జ—ఈమె కంసునికి వాసనద్రవ్యములు ఇచ్చుచుండినదై మూఁడు వంకరల దేహముగలదై ఆ వాసనద్రవ్యములతో కంసునియొద్దకుపోవుచుండి, బలరామ కృష్ణులుచూచి ఆద్రవ్యములు తమకడిగితీసికొని, పూసికొని సంతోషించిన యా కృష్ణునిచేతనే తన కుబ్జత్వము మాన్చుకొన్నయామె.

కుచేలుఁడు—ఇతఁడు బ్రహ్మవేత్తగా జితేంద్రియుఁడుగానుండియు, లేమిడి చేత కష్టపడుచు భార్యాప్రేరణచేత కృష్ణుని దర్శనముచేసి భక్తివిశ్వాసములు చూపి, అతనిచేతనే మహైశ్వర్యముకలవాఁడుగా చేయఁబడినవాఁడు.

విదురుఁడు—వ్యాసపుత్త్రుఁడు; ధృతరాష్ట్రునిమంత్రి ఇతఁడు పరమధర్మా త్ముఁడు, పాండవులకు మేలుచేయుమని పలుమాఱు చెప్పుచున్నయతఁడు, ఇతడు శ్రీకృష్ణునియందు పరమభక్తిపారతంత్ర్యము కలవాఁడు. కనుకనే శ్రీకృష్ణుఁడితని భక్తిపారవశ్యములకు పరమానందభరితుఁడై యొకప్పుడతని చేతులారనే పంచభక్ష్యపరమాన్నములు అతనితోసహభోజనముచేసి యతనిని మహానందకందళితహృదయునిఁ జేసి యుజ్జీవింపఁజేయఁబడెను.

ఇంద్రుఁడు=బలభిదుఁడు—ఇతఁడు కశ్యపబ్రహ్మకు అదితివలనఁబుట్టి, దిక్పా లురలో ప్రధానుఁడై, స్వర్గమున అమరావతీరాజధానియందు దేవతలకు రాజ యినవాఁడు.

౧. ఇతి విమానం సుదూరమానయ్య వన జనపద సరిద్గిరి ప్రభృతీనవేక్ష్య సవిస్మయ మీశ్వరముద్దిశ్య. 173

వ. అని విమానము బహుదూరము నానయించుకొంచు, వన ములు దేశములు నదులు నద్రులు మొదలైనవానింగాంచి యాశ్చర్యముతో నీశ్వరునిగుఱించి.

వృ. కత్యౌషధీః కతితరూన్ కతివా మహీధ్రాన్
కత్యంబుధీన్ కతినదీః కతిపుంస ఏతాన్
కత్యంగనా స్త్వమసృజః కతినాథ? దేశాన్
మన్యేత వైష మహిమా నహిమాతిబుద్ధౌ. 174

అ. హేనాథ=ఓస్వామీ! త్వం = నీవు, కతి ఓషధీః= ఎన్నిమూలికలను, కతితరూన్=ఎన్నివృక్షములను,కతివామహీధ్రాన్=ఎన్నికొండలను, కతి అంబుధీన్=ఎన్నిసముద్రములను, కతినదీః = ఎన్నియేళ్లను, కతిపుంసః ఏతాన్= ఈయెందఱిపురుషులను, కతి అంగనాః=ఎందఱి స్త్రీలను,కతిదేశాన్=ఎన్నిదేశములను, అసృజః=సృష్టించితివి, తవ=నీయొక్క, ఏషః మహిమా=ఈమహత్వము, బుద్ధౌ=బుద్ధియందు, నమాతిహి=చేరలేదుగదా, మన్యే=అని తలంచుచున్నాను.

తా. ఓబ్రహ్మా!ఎన్నో మూలికలను,చెట్లను, కొండలను, సముద్రములను, ఏళ్లనున్; ఎందఱినో స్త్రీపురుషులనున్, ఎన్నో దేశములనున్ సృష్టించిననీసామర్థ్యము, నాబుద్ధికందనిదయ్యె నని తలంచుచున్నాను.

ఆ. తరులు గిరులు ఝరులు శరధు లోషధులును
నదులు నదము లదన మెదను నెన్న
గనులు మణులు జనులు జనపదంబులు నెన్నొ
మహిమఁ జేసి తీవు మహిని మహిత.

టీ. ఝరులు=సెలయేఱులు, శరధులు=సముద్రములు, అదనము=అధికము.

గ. ఇత్యన్యతోఽగచ్ఛన్ పరతోఽవలోక్య స బహుమానమ్.

వ. అని మఱియొక్కప్రక్కకును మఱలుచు నెదురను గనుఁగొని సబహుమానంబుగ.

మహారాష్ట్ర వర్ణనము.

ఇది ఘూర్జరమునకు దక్షిణమునను, కర్ణాటమున కు తరమునను, ఆంధ్రదేశమునకు పశ్చిమమునను ఉండి, దండకాదివనపదంబులును, ఘూర్జరాదిజనపదం

బులును, నర్మదాదినదీనదంబులును, వింధ్యాదిపర్వతంబులును గలిగి ప్రాకృత భాషాప్రాబల్యంబున నుండెడిదేశము.

వృ. మహారాష్ట్రాభిఖ్యో మధురజలసాంద్రో నిరుపమ
ప్రకాశోదే శోఽయం సురపురనికాశో విజయతే
గృహస్థాయత్రాఽమీ గుణజలధయః కేఽపి విభవై
స్సమృద్ధా శ్శ్రద్ధాతో ముహు రతిథిపూజాం విదధతే॥ 175

అ. మధురజలసాంద్రః=తియ్యనినీటితో దట్టమై, నిరుపమప్రకాశః=సాటి లేని ప్రసిద్ధిగలదై, సురపురనికాశః=స్వర్గముతో సమానమైన, మహారాష్ట్రాభిఖ్యః=మహారాష్ట్రమను పేరు గల, అయందేశః=ఈదేశము, విజయతే=జయశీలమగుచున్నది. యత్ర=ఏదేశములో, విభవైః సమృద్ధాః=సర్వైశ్వర్యములతో నిండినవారై, గుణజలధయః=సద్గుణసముద్రులైన, అమీగృహస్థాః=ఈ గృహస్థులు, కేపి=కొందఱు, అతిథిపూజాం=అతిథులకు సత్కారమును, శ్రద్ధాతః=అక్కఱతో, ముహుః=పలుమాఱు, విదధతే=చేయుచున్నారు.

తా. మంచి నీటితోనిండి సాటిలేక స్వర్గమువంటి ఈ మహారాష్ట్రదేశము సర్వోత్కృష్టమై యున్నది. ఈదేశములో సంపత్తిసమృద్ధులై, సద్గుణసముద్రులై యుండుగృహస్థులు శ్రద్ధతో అతిథిపూజలు పలుమాఱు చేసికొనుచుందురు.

తే. ఈ మహారాష్ట్రదేశ మొ యామహేంద్ర
పురనికాశము, మధురపుష్కరనివేశ
మందు గృహమేధు లతిథులయందు శ్రద్ధ
నుపచరింతురు సిరుల నిరుపమగుణులు.

టి. మధుర పుష్కరనివేశము = తియ్యనినీటికి స్థానము, గృహమేధులు = గృహస్థులు.

కృశాను.—

గ. సఖే? కిం ప్రాక్కాలికం చారిత్ర మధునా కథయసి, అధునాకిల కలిమాలిన్యా దీదృశీ రీతి రేతద్దేశవాసినా మాసీత్ ॥176

అ. సఖే=స్నేహితుఁడా? కిం=ఏమి, ప్రాక్కాలికం = పూర్వకాలపు, చారిత్రం=చరిత్రము, అధునా=ఇప్పుడు, కథయసి=చెప్పుచున్నావు; అధునా =ఇప్పుడు, కలమాలిన్యాత్ =కలిదోషమువలన, ఈదృశీరీతిః=ఇట్టివిధము, ఏతద్దేశవాసినాం=ఈదేశస్థులకు, ఆసీత్ఖలు=అయ్యెనుగదా?

కృశానుఁడు.—

వ. సఖా, యేమి? తొలికాల మాచరితము చరిత నిప్పు డీరీతిఁ జెప్పుచున్నాఁడవు? ఇప్పుడుకదా? కలిమలినతవలని యీరీతి యీదేశవాసులకును గలిగియుండెను.

తథాహి.—

వృ. అపారై ర్వ్యాపారై రహరిహ నయంతో దశదిశా
స్వథస్నాతాస్సంధ్యాం విదధతి నజాతు స్వసమయే
త్యజంత స్స్వాంవృత్తిం ద్విజకులభవా గ్రామగణకీ
భవంతో హంతాఽమీ కథమపిచ జీవంతిబహవః॥ 177

అ. ఇహ=ఈదేశములో, బహవః=అనేకులు, అమీ=ఈగృహస్థులు, అపారైః=మితిలేని, వ్యాపారైః=వ్యాపారములతో, దశదిశాసు = పదిదిక్కులలోను, అహః=దినమును, నయంతః=నడుపుచు, అథ=ఆవెనుక, స్నాతాః=స్నానముచేసినవారై, సంధ్యాం=సంధ్యను, జాతు=ఒకప్పుడైన, స్వసమయే=తమవేళలో, నవిదధతి=చేయరు, స్వాం వృత్తిం=తమప్రవర్తనమును, త్యజంతః=విడుచుచు, ద్విజకులభవాః అపి=బ్రాహ్మణ కులజనులుకూడ, గ్రామగణకీ భవంతః=గ్రామములో కరణీకులగుచు, కథమపి=ఎట్లనో, జీవంతిచ=జీవించుచున్నారు. హంత=అయ్యో?

తా. ఈమహారాష్ట్రదేశములో అనేకులు బ్రాహ్మణగృహస్థులు అనేకవ్యాపారములతో పలుదిక్కులఁ దిరుగుచు దినములు గడుపుచు, సాయంకాలమున స్నానము చేసి సంధ్యావేళదాటిన వెనుక సంధ్యను చేయుదురు? మతి

యు తమఅధ్యయనాది వృత్తులను వదిలి గ్రామకర్ణీకులై నీచవర్తనముతో జీవించుచున్నారు? అయ్యో?

అదిసరే!—

తే. పనులవలనన పాఱులు పగలుగడపి
మాప,మునకిడి తమతఱిమాపి సంధ్య
లెడలి కులవృత్తి, యూరులయెడల గణకు
లగుచుఁ గక్కుర్తి జీవింతు రకట? యిచట.

టి. పాఱులు=బ్రాహ్మణులు,మాప=మాపు+అ-రాత్రియే,మాసి=మాన్పుకొని కించ.—

వృ. ఉపనయనవివాహా వుత్సవైక ప్రధానౌ
కలి విభవత ఏషాం కాలభేదానభిజ్ఞా
విజహాతి నకదాచిద్వేద పాఠైకయోగ్యే
వయసిచ యవనానీ వాచనాభ్యాస మేతే. 178

అ. కలివిభవతః=కలిమహత్త్వమువలన, ఉపనయనవివాహౌ=ఉపనయన వివాహములు, ఏషాం=వీరికి, ఉత్సవైకప్రథానౌ=వేడుకయే ముఖ్యప్రయోజన ముగాగలవై, కాలభేద అనభిజ్ఞా=సమయభేదమును తెలిసికొననివే? ఏతే= వీరు; వేదపాఠైకయోగ్యే=వేదాధ్యనమునకు ముఖ్యముగా తగిన, వయసిచ=వ యస్సులోను, యవనీవాచనాభ్యాసం = తురుష్కుల చదువు నభ్యాసమును, కదాచిత్=ఒకప్పుడైనను, నవిజహాతి=విడువరు.

తా. కలిమహిమచేత ఇక్కడి బ్రాహ్మణులకు విధివిహితమైన కాలను తెలిసికొనకున్నను, వేళకులేక, వేదాయధ్యనమునులేక, యౌవనములోను తురుష్కులచదువునే అధ్యయనము చేయుటను ఒకప్పుడును విడువరు.

మఱియు.—

తే. కలికిఁ గల కలిమి బలిమిఁ గాలమందు
ద్విజను లుపనయ పరిణయ త్యజను లగుచుఁ

దొలుఁజదువుఁ జదువు తఱినె తుజుకగ్రీకు
నాంగిలేయపుఁ జదువులె యభ్యసింత్రు.

టి. ద్విజనులు=ద్విజన్ములు—బ్రాహ్మణులు, పరిణయత్యజనులు = వివాహము విడిచినవారు.

అపిచ.——

స్ర. అజ్ఞానా మవిరామలౌకిక వచోభాజా మమీషాం పున
ర్మంత్రోచ్చారణ ఏవ పర్యవసితం మౌనవ్రతం కర్మసు
గ్రామాయ వ్యయలేఖనేన నయతాం కాలా నశేషా నహో
పారంపర్యత ఈదృశా మిహనృణాం బ్రాహ్మణ్య మన్యాదృశమ్.

అ. అజ్ఞానాం=తెలివిలేనివారై, అవిరామ లౌకిక వచోభాజాం=విడువని లౌకికపుమాటలుగల, అమీషాం=ఈగృహస్థులయొక్క, కర్మసు=కార్యములలో, మౌనవ్రతం=మౌనము, మంత్రోచ్చారణ ఏవ=మంత్రము నుచ్చరించుటయందే, పర్యవసితం=ముగించినది. గ్రామాయ = గ్రామముకై, వ్యయలేఖనేన=వ్యయముల వ్రాతచేత, అశేషాన్ కాలాన్ = సకలకాలములనున్, పారంపర్యతః=పరంపరగా, నయతాం=కడపుచున్న, ఈదృశాం=ఇట్టి, నృణాం=మనుష్యులకు,ఇహ=ఈదేశములో, బ్రాహ్మణ్యం=బ్రాహ్మణత్వము, అన్యాదృశం=వేఱైనదే.

తా. తెలివిలేక దేశభాషలే మాటలాడుచుండు వీరికి తమ కర్మలలో మౌనవ్రతాదులు మంత్రోచ్చారణాదులయందే ముగియుచుండఁగా, పరంపరగా గ్రామముల ఆదాయవ్యయముల వ్రాఁతలోనే కాలము కడపునిట్టివారికి బ్రాహ్మణత్వ మెట్లుకలుగును?

మఱియు.——

తే. అజ్ఞులశ్రాంతదేశవాగ్విజ్ఞు లగుచుఁ
గర్మలందును మంత్రతత్పరత్వ [illegible]

ముల సముచ్చారణనె మానమును ధరింతు?
రిచటి బ్రాహ్మణ్య మసదృశ మెచటఁగలదు.

టి. మంత్రతత్కర్మకాంగముల = మంత్రములయు, ఆమంత్ర కర్మలయు, వాని అంగములయు.

అన్యచ్చ.—

వృ. కుక్షేః పూర్త్యై యవననృపతే ర్భృత్యకృత్యాణి కర్తుం
విక్రీణీతే వపురపి నిజం వేతనై రేత దాస్తామ్
విప్రో భూత్వాఽప్యహహ? గణనానై పుణై ర్వంచయిత్వా
స్వర్ణ స్తేయం రచయతి పునః స్వామినాం పోషకాణాం. 180

అ. విప్రోభూత్వాపి= బ్రాహ్మణుఁడయ్యును, అహహ=అయ్యయో? కుక్షేఃపూర్త్యై=కడుపునిండుటకై, యవన నృపతేః=తురుష్కరాజునకు, భృత్యకృత్యాని=పనివానిపనులను, కర్తుం=చేయుటకు, నిజంవపురపి=తనశరీరమునుకూడ, వేతనైః=సంబళములతో, విక్రీణీతే=విక్రయించుచున్నాఁడు? ఏతత్ ఆస్తాం=ఇదియుండనీ; గణనా నైపుణైః=లెక్కలలో నేర్పులతో, వంచయిత్వా=మోసపుచ్చి, పోషకాణాం=పోషించువట్టి, స్వామినాం=యజమానుల యొక్క, స్వర్ణ స్తేయం=బంగారు దొంగతనమును, పునః=మల్లిమల్లి, రచయతి=చేయుచున్నాఁడు.

తా. ఇట్టి గృహస్థుఁడు బ్రాహ్మణుఁడయ్యును, పొట్టకొఱకు పనివానితనమునకై తనశరీరమును హెచ్చుజీతములకై అమ్ముకొనుచు, లెక్కలలో గట్టితనముచేత తన్ను పోషించు యజమానుల ధనమునుగూడ దొంగలించును.

మఱియును.—

తే. కడుపుకై తమజీతము యొడలి నమ్మి
కొ[illegible]

లెక్కలెక్కించి పోషకుల్ చిక్కువడఁగ
ధన మపహరింత్రు సాఖులయ్యును మఱింత.

గ. అహోబత? కలిమహిమా సదసద్వివేక వైధుర్య మఖిల
జనానాం. 181

వ. అయ్యో! కలిమహిమ కతన యుక్తాయుక్తవివేక విహీనతన
సకలజనులును గలిగియున్నారే?

టి. వైధుర్యం=విధురత్వము-శూన్యత; కతనన్=కారణముచేత, విహీన
తన=శూన్యతచేత నే.

వృ. యే ముష్ణంతి నిశి ప్రవిశ్య భవనంయేవా బలాత్కాననే
నైతే స్వామిధనం హరంతి నను తాన్ నిందంతిచోరా ఇతి
సద్యోహాంత? హారంతి పోషక ధనం సంఖ్యాంవిపర్యస్యయే
కష్టంతానపి వంచకానిహ పురస్కుర్వంతి సర్వేజనాః. 182

అ. యేజనాః=ఏజనులు, నిశి=రాత్రిలో, భవనం=ఇంటిని, ప్రవిశ్య=ప్రవే
శించి, ముష్ణంతి=దొంగలించుచున్నారో; యేవా=ఎవరు, బలాత్=బలవంత
ముగా, కాననే = అడవిలో, (ముష్ణంతి = దొంగలించుచున్నారో) ఏతే=
వీరు, స్వామిధనం=యజమానునిధనమును, నహరంతి=దొంగలింపరు? తాన్=
వారిని, చోరాఇతి=దొంగలని, నిందంతి=నిందించుచున్నారు. ననః=మంచిది;
యే=ఎవరు, సంఖ్యాం=లెక్కను, విపర్యస్య=విపరీతముచేసి, పోషకధనం=
యజమానునిద్రవ్యమును, సద్యః=అపుడే, హరంతి=అపహరించుదున్నారో?
హంత=ఆహా! వంచకాన్=మోసగాండ్రైన, తాన్ అపి=వారినిగూడ, ఇహ=
ఇక్కడ, సర్వేజనాః=జనులందఱును, పురస్కుర్వంతి=సన్మానించుచున్నారు,
కష్టం=అయ్యో!

తా. ఇంటదూరి రాత్రిలోను, ఆడవిలోపోయి పగటిలోను దొంగలించు
వారును ఇట దొంగలనఁబడరు. యజమానుని ధనమును దొంగలించు మోస

గాండ్రనైనను, ఇక్కడిజనులు సన్మానించుచున్నారు.

ఉ. ఎవ్వరు రేయిరోయిగలయిల్లు సొఱంబడి(మ్రుచ్చిలింతు, రం
దెవ్వరు కానఁగోనఁ బగలేమఱవేమఱ మ్రుచ్చిలింత్రు, వా
రెవ్వరుస్వామి సొమ్మునొకయింతయు మ్రుచ్చిలరైన, వారినే
యెవ్వరుదూఱుచుండు, రిదెయిందులనిచ్చలుస్వామిస్వమ్ములే
యివ్వగ మ్రుచ్చిలంతు, రిలనెవ్వరు వీరలగ్గారవింతురో?

టి. రోయి=ధనము, వేమఱు=వేమాఱు, నిచ్చలు=ఎల్లప్పుడు, ఇవ్వగన్ ఈరీతిని.

గ. "అయంఖల్వనుపమో దేశ" ఇతిత్వదుక్తం యుక్తమేవ
యదత్రస్వల్పేనాపి యత్నేన మహతీ ప్రతిష్ఠా సిధ్యతి. 183

అ. అయందేశః=ఈదేశము, అనుపమఃఖలు=సాటిలేనిదిగదా! ఇతి=అని త్వత్ ఉక్తం=నీచే చెప్పఁబడినది, యుక్తమేవ=యుక్తమే, యత్=ఏలనఁగా, అత్ర=ఈవిషయములో, స్వల్పేనయత్నేన అపి=స్వల్పప్రయత్నముతో నైనను, మహతీప్రతిష్ఠా=గొప్పప్రతిష్ఠ, సిధ్యతి=సిద్ధించుచున్నది.

వ. ఈమహారాష్ట్రదేశమో, నీచెప్పినది యొప్పినదేయగుచున్నది
గదా? ఎందుచేతనంటేని? యిందుల నల్పప్రయత్నముచేత
నుం గరిష్ఠప్రతిష్ఠయే సిద్ధించుచున్నయది యగుటచేత.

వృ. వేదవ్యాస స్సఇహ దశ యో వేద వేదాక్షరాణి
శ్లోకంత్వేకం పరిపఠతి య స్స స్వయం జీవ ఏవ
ఆపస్తంబ స్సకిల కలయేత్సమ్యగౌపాసనంయః
కష్టంహిశిష్టక్షితి కృతి కలౌకార్శ్య మృచ్ఛంతివిదా.

అ. ఇహ=ఇక్కడ, యః=ఎవఁడు, దశవేదాక్షరాణి=పది వేదాక్షరములు, వేద=తెలిసికొనునో, సః=వాఁడు, వేదవ్యాసః=వేదవ్యాస మహర్షియే? యః ఎవఁడో, ఏకంశ్లోకం=ఒకశ్లోకమును, పరిపఠతి=చదువుచున్నాఁడో, సః= వాఁడు, స్వయం=తానే, జీవఃఏవ=బృహస్పతియే? యః=ఎవఁడు, ఔపాస

నం=హోమమును, సమ్యక్=చక్కఁగా, కలయేత్=చేయునో, సః=వాఁడు, ఆపస్తంబఃకిల=ఆపస్తంబ ఋషియేకదా? శిష్టక్షతిక్రృతి=పెద్దలకు హానిచేయు నట్టి, కలౌ=కలియుగమందు, విద్యాః=సకలవిద్యలును, కార్శ్యం=కృశత్వ మును, ఋచ్ఛంతి=పొందుచున్నవి. కష్టం=ఇది దుఃఖకరమేగదా?

తా. ఈదేశములో వేదాక్షరములు పదియే తెలిసికొన్నవాఁడు వేదవ్యాస మహాఋషియనియు, శ్లోకమొకటే చదివినవాఁడు బృహస్పతియే యనియు, హోమమొకసారియైనఁ జేసినవాఁడు ఆపస్తంబ ఋషియే యనియు చెప్పఁబ డుటచేత ఈకలియుగములో సకలవిద్యా విశేషములును కృశించిపోవుచు న్నవి.

శా. వేదాదిన్ బదియక్షరాలెఱుఁగు శ్రీవిన్ వాఁడె యిందేరికిన్
వేదవ్యాసుఁడు, శ్లోకమొండెఱుఁగునేనిన్ వాఁడెవాల్మీకి,యా
పాదించున్ లవమిగ్నికార్యమతఁడాపస్తంబుఁ, డార్యాళియే
లేదేనిన్ గలినెల్లవిద్యలిఁక నోలిన్ జిక్కిచీఁకాకె యౌన్.

టి. ఆపాదించున్=చేయునో, ఆర్యాళియే=శిష్టసమూహమే, ఓలిన్= వరుసగా.

ఇ. వేదవ్యాసుడు. ఇతఁడు పరాశరమునికి సత్యవతివలన పుట్టి వేదములను విభాగించి, భారతమును రచించి, పదునెనిమిదిపురాణములు కూడచేసి, బ్రహ్మ సూత్రము మొదలైన వేదాంతగ్రంథములన్ జేసి శుకమహర్షిని కొడుకుగా పుట్టించుకొన్న కృష్ణద్వైపాయనమహర్షి.

బృహస్పతి. ఇతఁడు బ్రహ్మమానసపుత్రులలో అంగిరసుపుత్రుడై తారాపతి యగుచు, దేవతాచార్యుడై మహాబుద్ధిమంతుడై నవగ్రహములలోనున్నవాడు.

వాల్మీకి. ఇతఁడు నారదోపదేశముచేత ఛందస్సులోడ సంస్కృతరామా యణమును చేసి, బహుకాలము తపస్సుచేసి సమాధిలోనుండి తనపైని పుట్ట పెట్టి చాలాకాలమునకు ఆవల్మీకమునుండి వెలువడివచ్చి వాల్మీకియని పేరుతె చ్చుకొన్న మహాముని.

ఆపస్తంబఋషి. ఇతఁడు యజుర్వేద విహితకర్మలకు సూత్రములు చేసిన యొకమహర్షి.

విశ్వావసుః.—

గ. కిమరే! భూసురేష్వేవం దోష ముద్ఘోషయసి?

వ. ఏమిరా! ధరామరావళియం దిట్లు దోష ముద్ఘోషించుచున్నాఁడవు.

వృ. అత్రాపి సంతి బహవః కలితాగ్నిహోత్రా
శ్శాస్త్రార్థ బోధకుశలాః కిల శాంతిమంతః
అంతర్ముఖా స్సతత మాత్మవిదో మహాంతో
నిర్ధూత బాహ్యవిషయా నిగమాధ్వనిష్ఠాః. 185

అ. అత్రాపి=ఈదేశములోఁగూడ, బహవః=అనేకులు, శాస్త్రార్థబోధకుశలాః=కర్మకాండశాస్త్రముల అర్థము తెలుపుటయందు నేర్పరులును, నిగమాధ్వనిష్ఠాః=వేదోక్తముల కర్మలందు పట్టుకలవారును, కలితాగ్నిహోత్రాః=చేయఁబడు హోమముగలవారును, అంతర్ముఖాః = అంతర్జ్యోతి కభిముఖులైన వారును, సతతం=ఎప్పుడును, ఆత్మవిదః= ఆత్మస్వరూపము తెలిసికొనువారును, నిర్ధూతబాహ్యవిషయాః=ఎగరఁగొట్టఁబడిన శబ్దరూపాది బాహ్యవిషములుగల వారునై మహాంతః=శిష్టులు, సంతి=ఉన్నారు.

తా. ఈదేశములోఁగూడ శాస్త్రార్థములు బోధింపఁగలవారై వేదార్థములయందాసక్తిగలవారై దర్శపూర్ణమాసాదులందు హోమముచేయువారైదహరాకాశజ్యోతిరుపాసకులై ఆత్మపరమాత్మజ్ఞానవిశేషముగలవారై శబ్దస్పర్శాది విషయములందు విరక్తిగలవారైన జ్ఞానులును కర్మఠులును కలిగియున్నారు.

తే. అందు నుందురె యెందఱొ యాహితాగ్ను
లాత్మవిదులు శాస్త్రవిదు లహోతు లెపుడు

శాంతులు నిగమమార్గవిశ్రాంతులు నీక
విషయవిముఖులు పముఖు లీవిషయమునను.

టీ. అహితాగ్నులు-హోమము చేయఁబడిన అగ్నిహోత్రముకలవారు, ఆత్మవిదులు=ఆత్మజ్ఞానముకలవారు.

అన్యచ్చ.—

వృ. శుచీభూతాస్స్నానైః శ్రుతిహిత పురాణోక్తనియమా
దపూతానాం స్పర్శానవహిత హృదోఽమీ విజహతః
సురాభ్యర్చాం కృత్వా శుచికృత మదం త్యన్నమనఘం
మహారాష్ట్రే దేశే విలసతి మహా న్నేష హి గుణః. 186

అ. స్నానైః=స్నానముల చేత, శుచీభూతాః=పవిత్రులై, శ్రుతి...నియమాత్=వేదవిహితములైన పురాణముల చేత తెలుపఁబడిన ప్రవర్తన నియమముతో, అవహితహృదః= జ్ఞానవిశేషముతోడి హృదయముగలవారైన, అమీ=వీరు, అపూతానాం = అపరిశుద్ధులైనవారియొక్క, స్పర్శాన్ =, తాకుటలను, విజహతః=విడుచువారై, శుచికృతం= పరిశుద్ధులైనవారి చే చేయఁబడినదై, అనఘం= నిర్దోషమైన, అన్నం=అన్నమును, సురాభ్యర్చాం=దేవపూజను, కృత్వా=చేసి, అదంతి=భుజించుచున్నారు. మహారాష్ట్రదేశే=ఈమహారాష్ట్రదేశములో, ఏషః=ఈ, మహాన్ గుణః=గొప్పగుణము, విలసతిహి=ప్రకాశించుచున్నదిగదా?

తా. ఇక్కడివారు స్నానముతో పవిత్రులై వేదవిహిత పురాణోక్తములలో జాగ్రత్తగలిగి అపరిశుద్ధులైనవారలంకట పరిశుద్ధులైనవారు చేసిన యన్నమును భుజించుదురు. ఈమహారాష్ట్రదేశములలో నిదియే మహాగుణము.

మఱియును.

తామున్నూరు-చులూరన్ భుజియింతురో? ద్విజులునిర్దుష్టుల్

మ. శుచులై స్నానములన్, బురాణరుచులై శ్రుత్యుక్తయుక్తిన్,
భృశాశుచు లెయుండెడివారుఁదాఁక కె, మనశ్శుద్ధిన్ స్వదే.

వాళ్లికిఁ శుచులై చేసిన యన్నమేయొసఁగి, తచ్ఛుద్ధాన్నమే
మహారాష్ట్రజుల్

టి. శ్రుత్యుక్తయుక్తిఁ=వేదోక్తసంబంధముతో,:భృశాశుచులై=నిక్కలి యపరిశుద్ధులై, నిర్దుష్టులు=నిర్దోషులు.

కించ.—

వృ. చమూనియమనేన వా జనపదాధికారేణవా
ద్విజ వ్రజ ఉపవ్రజన్ ప్రభు పదం మహారాష్ట్రజః
నవృత్తి మిహ పాలయేద్యది ధరాసురాణాం తతో
భవేద్యవనవేష్టితం భువనమేతదబ్రాహ్మణమ్. 187

అ. మహారాష్ట్రజః=ఈమహారాష్ట్రములోజన్మించిన, ద్విజవ్రజః=బ్రాహ్మణసమూహము, చమూనియమనేనవా=సేనాధిపత్యముచేతగాని. జనపదాధికారేణవా=దేశాధికారముచేతఁగాని, ప్రభుపదం=ప్రభుత్వమును, ఉపవ్రజన్=పొందుచు, ధరాసురాణాం=బ్రాహ్మణులయొక్క, వృత్తిం=ప్రవర్తనమును, ఇహ=ఈ లోకములో, నపాలయేద్యది=పాలింపనియెడల, యవనవేష్టితం=తురుష్కులచేతఁ జుట్టుకొనఁబడిన, ఏతత్ భువనం=ఈలోకము, అబ్రాహ్మణం=బ్రాహ్మణులులేనిదే, భవేత్=అగును.

తా. ఈదేశపుబ్రాహ్మణులు సేనాధిపత్యముతోగాని దేశాధిపత్యముతోగాని ప్రభువులై బ్రాహ్మణవృత్తి నీ భూలోకములోనడపక పోయినయెడల నీలోకము తురుష్కులుచుట్టుకొని బ్రాహ్మణులే లేనిదియగును.

తే. మొనసనమైనను జనపదమునసనమైన,
ద్విజులెయధికారములఁ జేర, ద్విజులవృత్తి
పాలితంబయ్యె, నయ్యదెపరఁగదేని
యవని యనవనిసురమయూ యవనమయియు,

టి. యవనమయియున్=యవనులేమయముగాఁగలదియగుటగాక, అనవనిసురమయూన్=అవనిసురులులేనిదియేయగును.

గ. యచ్చ దోషాంతరం భవతా పరిభాషితం తదశేషమపి సాధుజనోపకారేణ పరిహార్యతే.

వ. వేదాదివిద్య లభ్యసింపమియకాక, యవనాది విద్యలభ్యసింపకుండమియను నీచెప్పినదోషాంతర మశేషమును సత్పురుషులకుజేయునుపకారముచేతఁ బరిహారము చేయంబడుచున్నది.

భు. అలం మంక్షు సంహర్తు మంహస్సహస్రం
సమేకోపి విప్రప్రవేకోపకారః
కఠోరః కుఠారః కిలైకోపి తిగ్మో
వినిర్భేత్తు మీష్టే విషద్రూననేకాన్. 189

అ. విప్రప్రవేకోపకారః=బ్రాహ్మణోత్తముల యుపకారము. సమేకోపి=అదియొకటేయైనను, అంహస్సహస్రం=వేయిపాపములమైనను, మంక్షు=త్వరగా, సంహర్తుం=పరిహరించుటకు, అలం=చాలినది. కఠోరః=దృఢమై, తిగ్మః=తీక్ష్ణమైన, కుఠారః=గొడ్డలి, ఏకోపి=ఒకటెయైనను,అనేకాన్=అనేకములైన, విషద్రూన్=విషవృక్షములను, వినిర్భేత్తుం=భేదించుటకు, ఈష్టేకిల=కోరుచున్నదిగదా? (భుజంగప్రయాతం.)

తా. బ్రాహ్మణులకుఁజేయు నుపకార మొకటేయైనను, పాపములు వేయింటినైన పోఁగొట్టుటకు జాలినదే. చులుకైన గట్టిగొడ్డలి యొక్కటియేయైనను, అనేకవిషవృక్షములను కొట్టివేయుటకు చాలినదేకదా!.

ఆ. చాలుదొసఁగు చాలు చాలఁదోలఁగఁజాలు
భూసురోపకార భాసురంపుఁ
గార్యమొండె, చాలుఁ గటుకుఠారమొకండె
యెన్నివిసపు విటపులేని నఱుక.

టి. చాలుదొసఁగుచాలు = విశేషములైన పాపముల సమూహమును, విటపులు=చెట్లు, (విరివిగానుండు చెట్లు)

కృశానుః.—

౧. అస్త్యేవ మథాప్యత్రత్యానా మాద్యేతరవర్ణానాం పున
రతిదుస్సహం చేష్టితం. 190

అ. అథాపి=అయినను; అత్రత్యానాం=ఇక్కడివారైన, ఆద్యేతరవర్ణా
నాం=బ్రాహ్మణులు తక్క తక్కినవర్ణములవారియొక్క, చేష్టితం=చేష్టయు,
ఏవం=ఇట్లు, అతిదుస్సహం=సహింపఁగూడనిదిగా, అస్తి=ఉన్నది.

కృశానుఁడు.—

వ. ఇట్లుండినను, ఇక్కడి బ్రాహ్మణేతరులకును, మఱియు, నతిదు
స్సహ చేష్టయుఁగలదు.

వశ్వ.—

దేశేదేశే లంపటాః పర్యటంతో
భంజంభంజం బ్రాహ్మణాదీ నశేషాన్
హారంహారం హంత! సర్వస్వ మేషాం
పాపాఏతే స్వోదరం పూరయంతి. 191

అ. లంపటాః=పరద్రవ్య మపహరింప నాసక్తిగల, ఏతేపాపాః=ఈపా
పులు, దేశేదేశే=ప్రతిదేశములో, పర్యటంతః=తిరుగుచు, బ్రాహ్మణాదీన్=బ్రా
హ్మణులు మొదలైన, అశేషాన్=అందఱిని, భంజంభంజం=పలుమాఱుకొట్టు
చు, ఏషాం=వీరియొక్క, సర్వస్వం=సకలధనమును, హారంహారం=అపహ
రించుచు, స్వోదరం=తమపొట్టను, పూరయంతి = నిండించుకొనుచున్నారు,
హంత=అయ్యో!

తా. ఇక్కడిక్షత్రియాదులు పరద్రవ్యములనుగోరి దేశదేశములుదిరుగుచు,
బ్రాహ్మణాదులనుకొట్టి సొత్తునుదొంగిలించుచు పాపిష్ఠులై తమపొట్టను నిండిం
చుకొనుచున్నారు.

చూడు.—

తే. దేశ దేశములఁ బడి ధనానాశఁ జేసి
బ్రాహ్మణాదులనడఁచి చాఁకిబడచినట్లు
ద్రోఁచి కొంచ చలక్రించులు కి దురితరతులు
స్వోదరముల నెంతయు నింతు కి రాదరముల.

టి. చాఁబడచినట్లు=చావఁగొట్టినట్లు, అలక్రించులు=ఆనీచులు, దురితరతులు=పాపకార్యములందు ఆసక్తిగలవారు.

విశ్వావసుః.—

గ. సత్యమేవ తథాపి ఏతేషాం చేష్టితం సహనీయమ్. 192

వ. అది నిజమైయైనను,వీరిలో నోర్చుకోఁదగిన చేష్టయుఁ గలదు.

తథాహి.—

వృ. మాయాచుంచుతయా భయావహగతిః ప్రత్యర్థి పృథ్వీభుజాం
మాహారాష్ట్రిభటచ్ఛటా రణపటు ర్నోపర్యటత్యేవ చేత్
దేవ బ్రాహ్మణవర్గనిగ్రహకృతౌ దేశాం స్తురుష్కా ఇమే
నిష్ప్రత్యూహ మనోరథా వితనుయుర్ని ర్దేవభూమీసురాన్.

అ. రణపటుః = యుద్ధమందు సమర్థమైన, మాహారాష్ట్రిభటచ్ఛటా = మహారాష్ట్రిల సేనాసమూహము, మాయాచుంచుతయా = కపటసామర్థ్యముచేత, ప్రత్యర్థిపృథ్వీభుజాం = శత్రురాజులైన తురుష్కులకు, భయావహగతిః = భయముగలిగించు నడతగలదియై, నోపర్యటత్యేవచేత్ = తిరుగనిదియేయైనయెడల, దేవబ్రాహ్మణవర్గనిగ్రహకృతౌ = దేవబ్రాహ్మణుల సమూహమును అలక్ష్యము చేయుటయందు, తురుష్కా ఇమే = ఈతురుష్కులు, నిష్ప్రత్యూహమనోరథాః = నిరాటంకమైన కోరికలుగలవారై, దేశాన్ =సకలదేశములను, నిర్దేవభూమీసురాన్ = దేవబ్రాహ్మణులు లేనివానిఁగా, వితనుయుః = చేయుదురు.

తా. మహారాష్ట్రజనులలోని సేనాసమూహము మోసముతో శత్రువులైన తురుష్కరాజులను భయముకలిగించుచు తిరుగకపోయినయెడల; దేవబ్రాహ్మణులను అలక్ష్యముచేయుచు నీతురుష్కులు నిరాటంకముగా నీభూమినే దేవబ్రాహ్మణులు లేనిదానిఁగా జేయుదురు.

అశ్లోకదా?

చ॥అని మొనగాండ్రయైనభటులై లయ్యును,మాయనుశత్రుకోటికేఁ
పున భయదార్భటీపటిమఁ బూర్ణులయై పలుమాఱుతారునెం
దునుజరియింపలేని,యిట దుష్టతురుష్కులు మూఁగి రేఁగియో
లిన క్షితిదేవదేవతతి లేచి యెటో పరుగెత్తఁజూడరే.

టి. మాయను = మాయతో, ఏఁపునన్ = విజృంభణముతో, ఓలిన = వరుసతోనే.

తతశ్చ.——

వృ. దేవక్షోణీ సురహితకృతే దారితమ్లేచ్ఛపుఞ్జైః
మహ్యాం సహ్యా కథమపి మహారాష్ట్రయూథస్య చేష్టా
వ్యాధివ్యూహ ప్రతిహతికృతాం వ్యక్త ముగ్రౌషధీనాం
కాయారోగ్య ప్రణయిహృదయైః కాటవం మర్షణీయమ్.

అ. దేవక్షోణీసురహితకృతే = దేవబ్రాహ్మణులకు హితముచేయుటకై, దారితమ్లేచ్ఛపుఞ్జైః = ఎగరగొట్టఁబడిన తురుష్కసమూహముగల, మహారాష్ట్రయూథశ్య=మహారాష్ట్రిలసేనయొక్క, చేష్టా=చేష్టితము; కథమపి= కష్టముతో, మహ్యాం = భూమియందు, సహ్యా = సహింపఁదగినది; కాయారోగ్యప్రణయిహృదయైః = శరీరసౌఖ్యమందు ఆసక్తిగల మనస్సుకలిగినవారిచేత, వ్యాధివ్యూహప్రతిహతికృతాం=రోగసమూహములకు పరిహారముచేయునట్టి, ఉగ్రౌషధీనాం=తీక్ష్ణమైనమందుమూలికలయొక్క, వ్యక్తం=స్పష్టమైన, కాటవం=కారము, మర్షణీయం=సహింపఁదగినదే.

తా. దేవబ్రాహ్మణుల హితముకొఱకై తురుష్కులను దరిమెడి మహారాష్ట్రులసేనచేష్ట యెట్టిదైన నోర్చుకొనవలసినదే? వ్యాధులను పోఁగొట్టెడి యౌషధముల కారము దేహసౌఖ్యము కోరెడువారి కోర్చుకోవలసినదేకదా?

అందువల్లనే.—

తే. దేవమహిదేవ హితకృతికొఱకై విరక్తిఁ
జేయు నలమ్లేచ్ఛ హతికృతిఁ జెపు మసహమె?
వ్యాధి పోఁగొరి ఘోరంపు టౌషధాల
కారగోరము గోరమె కడు సహించి.

టి. హిత=మేలుయొక్క, హతి=హననము, చెపుము=చెప్పుము, అసహమె=ఓర్వనిదా?

గ. "ఇత్యన్యతోవిమానం గమయన్నగ్రతో దృష్ట్వా" కఇమే బహవస్సమవేతామానుషాః మార్గాన శేషాన పహూన్యయంతి.

వ. (అని మఱొక్కప్రక్కకుఁ విమానమును ద్రిప్పుచు నెదుర నుగని) యొవరువీరు పలువురు మనుజులుచేరి మార్గములన్ని యుఁ సున్నచేయుచు న్నున్నవారు.

గ. ఇతినిపుణం నిరూప్య, సశ్లాఘమ్. 196

వ. అని చక్కఁగ నిరూపించి శ్లాఘించి.

వృ. అంగాః వంగాః కలింగానథమగధకురూః కోసలాః కేకయాః వా కాశ్మీరాః కుంతలాః వా యవనజనపదాః కించపాంచాలదేశాః । నేపాలాః కేరళాః వా కతిచనకృతినః పాండ్యతుండీరచోలాః । కర్ణాటాః గౌడలాటాః పరగతిఘ్నటనా లంపటాః పర్యటంతే. 197

అ. కృతినః=పుణ్యాత్ములు, కతిచన=కొందఱు, 'పరగతిఘటనాలంపటాః= పరలోకగమనమును కలిగించుకొనుటయందాశక్తిగలవారై, అంగాన్ ... లాటాన్ = అంగ, వంగ, కళింగ, మగధ, కురు, కోసల, కేకయ, కాశ్మీర, కుంతల, యవన, పాంచాల, నేపాళ, కేరళ, పాండ్య, తుండీర, చోళ, కర్ణాట, గౌడ, లాట, దేశములను, పర్యటంతే = తిరుగుచున్నారు. ఇవన్నియును ఛప్పన్నదేశములలోనివి.

తే. అంగ వంగ గౌడ కురు కళింగములకుఁ
జోళ మాళవ మగధ నేపాళములకుఁ
గురు సుకుంతల కేరళ కోసలముల
కరుగుదురు తైర్థికులు వేఱె బరార్థికులయి.

ఇ. అంగదేశము.—గంగాసరయూసంగమప్రాంతమున ఈశ్వరుఁడు తపస్సు చేయుచు తపోభంగము చేయుమన్మథుని యంగము తన అగ్నినేత్రమున భస్మముచేసి యనంగునిఁగాఁ జేసెను. ఆ యంగ మిచట నేలలోఁగలసిపోయినందుననే ఇది అంగదేశము అనఁబడియె.

వంగదేశము.— ఇది అణువంశస్థుఁడైన బలిచక్రవర్తి రెండవకొమారుఁడయిన వంగుఁడనురాజు పాలించుచున్నందుననే ఇది వంగదేశము అనఁబడియె.

కళింగదేశము.—ఇది బంగాళాదేశమునకు తూర్పుభాగమున ఆబలిచక్రవర్తి మూడవ కొమారుఁడైన కళింగుడనురాజు పాలించుచున్నందుననే ఇదికళింగదేశమనఁబడియె. ఇది ఓఢ్రదేశమునకు దక్షిణమునను కర్ణాటదేశమున కుత్తరమునను ఉండునది.

మగధదేశము.— ఇది మహాశూరులైన రిపుంజయుఁడు జరాసంధుఁడు మొదలయినరాజులు పాలించుచుండినది. ఇది వంగదేశమునకు పశ్చిమమున పాటలీపుత్రమే రాజధానిగాఁగలదేశము.

కురుదేశము.— ఇది హస్తినాపట్టణము రాజధానిగాఁగలిగి కురురాజుచే పాలింపబడుచుండినది. ఇచటనే భారతయుద్ధము జరిగినది.

కోసలదేశము.— ఇది సరయూనదీప్రాంతమున ఇక్ష్వాకువంశరాజులు పరిపాలించుచుండినది. ఇది అయోధ్యాపట్టణము రాజధానిగాఁగలిగి శ్రీరాములు పరిపాలించునపుడు ఉత్తరకోసలమనియు, అతని ప్రథమకుమారుఁడు కుశుఁడనునతఁడు కుశస్థలిని రాజధానిఁగాఁజేసికొని పరిపాలించుచుండినందున అది దక్షిణకోసలమనియు రెండుభాగములుకలది.

కేకయదేశము.— ఇది శిబిచక్రవర్తి కుమారుఁడైన కేకయరాజుచే పరిపాలింపఁబడుచుండినది. దీనిరాజధాని విపాశానదికి పశ్చిమోత్తరమున గిరివ్రజమనునది. ఆకేకయరాజు భరతునితల్లియైన కైకేయితల్లికి తండ్రి.

పాంచాలదేశము.—ఇది హిమవంతముసమీపమున హస్తినాపట్టణము రాజధానిగాఁగలది. ఇందు అజమీఢుని పుత్త్రుఁడైన నీలునివంశస్థుఁడు భర్మాశ్వుఁడు తన పంచపుత్త్రిలతో నావిషయమై (నాదేశమునకై) మీరు పంచపుత్త్రిలే నాకు అలం=చాలును అనుచు ఎప్పుడును పలుకుచుండినందున నే ఈపేరు కలిగినది. ఈదేశము ఉత్తరదక్షిణ పాంచాలములైయుండును. ఉత్తరపాంచాలమున అహిక్షేత్రమును దక్షిణపాంచాలమున కాంపిల్యమును ముఖ్యపట్టణములు. అందీ కాంపిల్యమే రాజధానిగాఁగల ద్రుపదరాజు కొమార్తె ద్రౌపదియు ఈ పాంచాలదేశపు పూర్వరాజుల వంశస్థురాలైనందున పాంచాలి అనియు పేరుగలిగినది.

గౌడదశము.—ఇది వంగదేశములో లక్ష్మణవతి అను గౌడపురియే ముఖ్యపట్టణముగాఁగలది. దీనితో చేరిన గౌడోత్కలమిథలకన్యాకుబ్జసారస్వతదేశబ్రాహ్మణులు పంచగౌడులనబడుదురు.

మాళవదేశము— ఇది మొదల ఉజ్జయిని అవల ధారాపురి రాజధానులుగాఁగలది. దీనినే విదర్భరాజు పరిపాలించుచుండినందున ఇప్పటి బీరారు బీడరుఅను దేశములతో విదర్భదేశమనియు చెప్పబడును.

యవనదేశము.— ఇదియే అరేబియా అనఁబడుచున్నది. ఇందు తురుష్కులే రాజులై

కుంతలదేశము.— ఇది బళ్లారికి పూర్వపశ్చిమముననుండు ఆదవేని రాజధానిగా పూర్వకాలమునను పేరుకలిగియుండినది.

కేరళదేశము.— ఇదియే దక్షిణమళయాళము. ఇందు దుష్యంతుని మునిమనుమఁడు కేరళుఁడను రాజు పరిపాలించుచుండినందున ఈదేశము ఈపేరు కలిగినది అయ్యె.

పాండ్యదేశము.— ఇది చోళదేశమునకు దక్షిణమున మళయాళమునకు దక్షిణమధుర రాజధానిగాఁ గలిగి ఆదుష్యంతునిపౌత్రుఁడు ఆక్రీతునిపుత్రుఁడయిన పాండ్యుఁడనురాజు పరిపాలించుచుండినదేశము.

చోళదేశము.—ఇది దుష్యంతునిపౌత్రుఁడైన ఆక్రీతునిపుత్రుఁడు చోళుఁడనురాజు పరిపాలించుచుండినదేశము. దీనిరాజధాని కాంచీపట్టణము.

కర్ణాటదేశము.— ఇది 228-వ పద్యములో దీనివిషయమును చూడుఁ?

తుండీరదేశము.— ఇది చెన్నపురిరాజధానికి పడమర శ్రీపెరుంబూదూరితో చేరిన తుండీరమండలము.

కృశానుః.—

గ. అరే? కిమేతాన్ నిందనీయా నభినందసి? 198

కృశానుఁడు.—

వ. ఓయీ? ఏమి యీ నిందనీయుల గుఱించి యానందించుచున్నావు.

వృ. నానాజాతి భవాఇమే కలిబలా దేకీభవంతో నరాః
వైరాగ్యాభినయం చిరాద్విదధతో వర్ణాశ్రమత్యాగినః
నిర్ధూతానఘవైదిక ప్రణమనా నిష్కించనా వంచనా
దక్షాదిత్సు విదిత్సు కుక్షి భృతయే భిక్షాటనం కుర్వతే॥ 199

అ. నానాజాతిభవాః=నానాజాతులయందుఁ బుట్టినవారై, కలిబలాత్ = కలిమహత్త్వమువలన, ఏకీభవంతః = ఒక్కటియై, వర్ణాశ్రమత్యాగినః = వర్ణా

శ్రమములను విడిచినవారై, చిరాత్ = బహుకాలముగా, వైరాగ్యాభినయం = విరక్తిని తెలుపుటను, విదధతః = చేయువారై, నిర్ధూతానఘవైదికప్రణమనాః = తొలఁగఁగొట్టఁబడిన నిర్దోషులైన వైదికులకు నమస్కారము గలవారై, నిష్కించనాః = దరిద్రులైన, ఇమేనరాః = ఈమనుష్యులు, వంచనాదక్షాః = మోసముచేయుటయందు సమర్థులై, కుక్షిభృతయే = పొట్టనిండించుటకొఱకై, దిక్షువిదిక్షు = దిగ్విదిక్కులయందు, భిక్షాటనం = భిక్షమునకై దిరుగుటను, కుర్వతే = చేయుచున్నారు.

తా. ఇక్కడిజనులు నానాజాతివారైనను కలిమహిమవలన నొక్కటిరై బ్రాహ్మణాదిబ్రహ్మచర్యాది జాతిధర్మములను విడిచి, వైరాగ్యము నభినయించుచు నిర్దోషులైన వైదికులకు నమస్కారముచేయనివారై తాము దరిద్రులైనను మోసపుచ్చుచునే పొట్టపోసికొనుటకై నానాదిక్కులభిక్షమెత్తుకొనుచున్నారు.

తే. స్వకులశీలాశ్రమంబుల నే వికలపఱచి
యఖిలజాతులు వైరాగ్యమే మభినయించి
వైదికులకును నెరఁగకే వైళమొరుల
మోసచేయుచే తిరియుదు రోసరిలక.

టి. ఎరఁగకే = నమస్కరింపకయే, వైళము = శీఘ్రము, ఓసరిలక = వెనుకదీయక.

కించ.—

వృ. విమలచరితా విశ్వామిత్రాదయః పరమర్షయో
బహుభి రతులై ర్బ్రాహ్మణ్యం య త్తపోభి రుపార్జయన్
తదిహ జహతో జన్మ ప్రాప్తం త్రయీవిముఖేష్వమీ
ష్వహహా? కతిచిత్పాషండేషు ప్రవిశ్యహతాజనాః॥ 200

అ.విమలచరితాః = పరిశుద్ధపునడవడిగల, విశ్వామిత్రాదయః = విశ్వామిత్రుఁడు మొదలైన, పరమర్షయః = మహర్షులు, బహుభిః = అనేకములై, అ

తుల్యైః = సాటిలేని, తపోభిః = తపస్సులచేత, యత్ బ్రాహ్మణ్యం = ఏ బ్రాహ్మణత్వమును, ఉపార్జయన్ = సంపాదించిరో, అమీజనాః = ఈజనులు, కతిచిత్ = కొందఱు, ఇహ = ఈలోకములో, జన్మప్రాప్తం=జన్మముచేత నేకలిగిన, తత్ = ఆ బ్రాహ్మణ్యమును, జహతః = విడుచుచు, త్రయీవిముఖేషు = వేదవిరుద్ధులైన, అమీషు = ఈ, పాషండేషు = పాషండులయందు, ప్రవిశ్య = చేరి, హతాః = భ్రష్టులైరి. అహహ = అయ్యయో?

తా. పూర్వము విశ్వామిత్రాది మహర్షులు తపస్సుఁజేసి బ్రాహ్మణ్యమును సంపాదించిరి. ఇప్పుడు ఇక్కడి కొందఱుజనులు పుట్టువుతోనె కలిగియుండు బ్రాహ్మణ్యమును విడిచిపెట్టి పాషండులతో కలిసి చెడిపోయిరి.

మఱియు.—

తే. గాధిపుత్రాది పరమర్షి గణము తమదు
తపమునను గన్న బ్రాహ్మణ్య మిపుడు జన్మ
మునన కన్నది దిగనాడి నులుచవేద
విముఖులను గూడి కొందఱు విడివడుదురు.

టి. నులుచవేదవిముఖులను = నీచులైన వేదబాహ్యులను, విడివడుదురు= స్వేచ్ఛగా తిరుగుదురు.

విశ్వావసుః.—

గ॥ కథమ రే? హరేర్భక్తేషు విరక్తేష్వపి అమీషు సన్నహ్యసి.

వ. ఎందుకురా? యీవిరక్తులైన హరిభక్తులందును సన్నద్ధపడుచున్నాఁడవు.

శ్లో॥ దోషేభ్యో నైవభేత్తవ్యం
దృఢాశ్చేద్భక్తి గచ్యుతే
తిమిరేభ్యో నహిభయం
దీపశ్చేలభ్యతే మహాన్॥

అ. అచ్యుతే = శ్రీకృష్ణునియందు, దృఢా = దృఢమైన, భక్తిశ్చేత్ = భక్తియున్నయెడల, దోషేభ్యః=ఏదోషములవలననయినను, నైవభేత్తవ్యం= భయపడవలసినదేలేదు; మహాన్ దీపః = గొప్పదీపము, లభ్యతేచేత్ = దొరికినయెడల, తిమిరేభ్యః = చీఁకట్లవలన, నహిభయం = భయమేలేదుకదా; (ప్రతివస్తూపమా)

తా. భగవానుఁడైన శ్రీకృష్ణునియందు దృఢమైన భక్తియున్నయెడల ఏభయమును గలుగదు; గొప్ప దీపమున్నయెడల చీఁకటివలన భయమేలేదు కదా?

క. హరిభక్తి కరముతిరమై
యిరవుకొనన్ వెఱవనేల కేయేద్దోషముకే
నురవడిఁ బరువిడు చీఁకటి
కుఱనేల? కరముదివె కరకముజ్జ్వలిమగాన్.

టి. ఉఱనేల = లక్ష్యపెట్టనేల; కరముదివె = చేతిదీపము, కరము = మిక్కిలి.

కించ —

వృ. దుఃఖంచ జన్మదురితంచ దృఢా మవిద్యాం
హాహంతి? హంతి పరమా హరిభక్తి రేకా
ఏకోపి రాఘవశరః కిల సప్తసాలాన్
శైలం రసాతల మపి త్వరయాబిభేద. 203

అ. పరమా=శ్రేష్ఠమైన, హరిభక్తిః = శ్రీకృష్ణునియందలిభక్తి, ఏకా = ఒక్కటియే, దృఢాంఅవిద్యాం = దృఢమైన అజ్ఞానమును, జన్మదురితంచ = జన్మదోషమును, దుఃఖంచ = సకలదుఃఖములనున్, హంతి = పడఁగొట్టుచున్నది, రాఘవశరః = శ్రీరామునిబాణము, ఏకోపి = ఒకటే అయినను, సప్తసాలాన్ = ఏడుమ్రాఁకులను, శైలం = కొండను, రసాతలమపి=

భూప్రదేశమునుఁ (పాతాళమునుఁ) త్వరయా = వేగముతో, బిభేద = భేదించినదిగదా? హోహంత = ఆహా?

తా. హరిభక్తియొకటే అయినను, అజ్ఞానాద్యఖిల దోషములను పోఁగొట్టును. ముందు శ్రీరామునిబాణ మొక్కటియే సప్తసాల పర్వతపాతాళములనుఁ భేదించినదిగదా?

మఱియు.—

కం. హరిభక్తియొక్కటియె భవ
దురితము దుఃఖం బవిద్యఁ ద్రోలఁ జాలుఁ;
గిరిసాల రసాతలముల
శరమొకటే రాముని యది సఖ! వెకలించెఁ.

టీ. గిరిసాల రసాతలములఁ = పర్వతమును, ఏడేపెచెట్లను, పాతాళమునుఁ.

అపిచ.—

వృ. ధునోతి నిబిడంతమః పరిలునాతిపాపాటవీం
తనోతిచ మనోరథా నుపచినోతినానోత్సవాఁ
అనక్తిచ పునఃపున ర్మను మన స్సుధానిర్ఝరై
ర్వ్యైవక్తిపరిపక్త్రిమం వృషగిరీశభక్తిశ్శుభమ్. 204

అ. వృషగిరీశభక్తిః = వెంకటాచలపతియైన శ్రీనివాసునిపైభక్తి—నందికేశ్వరగిరియైన శ్రీశైలమందలి మల్లికార్జునునిపై భక్తి, నిబిడం = దట్టమైన, తమః = అజ్ఞానమును, ధునోతి = పోఁగొట్టుచున్నది. పాపాటవీం = పాపములనెడి అడవిని, లునాతి=ఛేదించుచున్నది; మనోరథాఁ = కోరికలను, తనోతి = చేయుచున్నది; నానోత్సవాఁ = నానావిధపు వేడుకలను, ఉపచినోతి = వృద్ధిపఱచుచున్నది; సుధానిర్ఝరైః = అమృతధారలతో, మనః= మనస్సును, పునఃపునః = మర్ల మర్ల, అనక్తి = చేర్పుచున్నది; శుభం = శు

ఘమును, పరిపక్త్రిమం = పరిపక్వమైనదిగా, వ్యనక్తి = స్పష్టపఱచుచున్నది. నను = కాదా? (సముచ్చయాలంకారము)

తా. వృషాచలపతియందలి భక్తి అజ్ఞానమును పాపమునుఁ దొలఁగించి, కోరికల నిచ్చి పలు వేడుకల వృద్ధిపఱచి, అమృతవాక్కులతో మనస్సును తేర్చి, శుభమును ఫలింపఁజేయుచున్నదికాదా?

మఱియును.—

మ. భగవద్భక్తియ తీర్చుఁ బేర్చుతమమున్ శ్రీ బాపాటవీవాటిగా,
డఁగ నేర్చున్ మఱి నేర్చుఁ గోర్కులొసఁగన్ శ్రీ దానుత్సవో
త్సేకముల్, తగఁజేర్చున్ మదికింపుఁ గూర్చుబహుగాఁ శ్రీ దా
ర్చున్ శుభోదర్కమా, వగఁ బ్రాక్కర్మబలే బిలేశయగిరీశడ్వా
త్సల్యమాహాత్మ్యముల్.

టి. పేర్చుతమమున్ = అతిశయించునజ్ఞానాంధకారమును, గాడఁగన్ = మండునట్లు, ఏర్చున్ = దహించును, ఉత్సవోత్సేకముల్ = ఉత్సవాతిశయములను, శుభోదర్కమానగన్ = శుభసూచకమగురీతితో, ప్రాక్కర్మ = పూర్వకృతమును, తార్చున్ = చేర్చును, బిలేశయగిరీడ్వాత్సల్య మాహాత్మ్యములల్ = శేషశైలనాథుని వాత్సల్యము మహాత్మ్యమున్.

కిం బహునా.—

వృ. పూతాంగానాం పుణ్యగంగాదిసింధు
స్నానా న్నానాక్షేత్ర యాత్రాపరాణాం
దారాగారా పత్యవై రాగ్యభాజాం
సారాభిజ్ఞై రాదరః కార్యపహాం. 205

అ. నానాక్షేత్రయాత్రాపరాణాం = నానావిధముల క్షేత్రములయాత్రల యందు ఆసక్తిగలవారై, పుణ్యగంగాదిసింధుస్నానాత్ = పావనములైన గంగాదినదుల స్నానములవలన ... పరిశుద్ధమైన దేహముగల

వారై, దారాగారాపత్య వైరాగ్యభాజాం = భార్యయందును ఇంటియందును బిడ్డలయందును విరక్తినిజెందినవారైన, ఏషాం = వీరిలో, ఆదరః = ప్రేమ, సారాభిజ్ఞైః = సారముదెలిసినవారిచేత, కార్యః = చేయదగినది.

తా. నానాక్షేత్రముల యాత్రలుచేయుచును గంగమొదలైన పుణ్యనదుల స్నానముచేత పవిత్రులై పెండ్లము బిడ్డలు ఇల్లు మొదలైనవానియందు వైరాగ్యముగల యిక్కడి బైరాగులయందు సారజ్ఞులచేతనే ప్రేమచేయఁబడుచుండును.

వెక్కులేల?—

తే. చేరి గంగాది స్నానముల్ చేసిచేసి
చొచ్చి రంగాదిక్షేత్రముల్ చూచిచూచి
రక్తి విడని దారాది విరక్తి విడిచి
పరఁగు బైరాగు లాదరింపఁగను దగరె?

టి. రక్తివిడని = ప్రేమవిడువని, దారాదిన్ = భార్యాదులను, విరక్తిన్ = వైరాగ్యముతో.

## ఆంధ్రదేశవర్ణనము.

ఆంధ్రదేశము. ఇది.— కృష్ణా గోదావరీనదుల నడుమ శ్రీశైలద్రాక్షారామ కాళహస్తులనెడి త్రిలింగములకు మధ్యస్థానమగుటచేత త్రిలింగదేశము ఆంధ్రదేశము అనియు చెప్పఁబడునది. (మఱియు నిపుడిందలి యాంధ్రభాష—ఉత్తరమున బ్రహ్మపురముపఱకును దక్షిణమున చెన్నపురముపఱకును వ్యాపించియుండు త్రిలింగభాష=తెలుఁగుభాషయై యున్నయది.)

గ. ఇతివిమాన మన్యత్సమానయన్ నిపుణం విభావ్య. 206

వ. అనివిమానమును మఱియొకప్రక్కకున్ సమానయించుకొంచున్ దననేర్పున నాలోచించి

శ్లో॥ సుశోభనక్రమకరై
స్సేవితో జీవనార్థిభిః
మధ్యస్థబాడబో రాజ
త్యాంధ్రదేశో నదేశవత్ ॥ 207

అ. జీవనార్థిభిః = జీవనమును, నీటినిగా కోరునట్టి, సుశోభనక్రమక రైః = మేలయినశుభములు గల ఆచారక్రమములను జేయునట్టివారిచేత—మే లయినరంగులుగల మొగ ఆడు మొసళ్లచేతను, సేవితః = కొలవఁబడినదైన, మధ్యస్థబాడబః = నడమనున్న బ్రాహ్మణులు - బడబాగ్నియుకలదైన, ఆం ధ్రదేశః = ఆంధ్రదేశము, నదేశవత్ రాజతి = సముద్రమువలె ప్రకాశించు చున్నది - సాధారణదేశమువలె ప్రకాశించదు.

తా. ఈయాంధ్రదేశము నీటినివలె మంచి జీవనమును కోరుచు, చక్కని మొసళ్ళచే వలె మంచియాచారమును నడిపెడివారిచేఁ జేరఁబడుచు, మధ్యను బడబాగ్నివలె బ్రాహ్మణులను గలిగి, సామాన్యదేశమువలెఁగాక, సముద్రము వలె ప్రకాశించుచున్నది.

తే. చేగి శోభనక్రమకరుల్ సేజీవనార్థ
మాత్మవాసమునాసింప నాంధ్రదేశ
మదె నదీశమువలెనె మధ్యస్థబాడ
బంబునై యొప్పునెప్పుడు దండంబుమీఱ.

టి. నక్రమకరులు = మొగమొసళ్లును ఆడుమొసళ్లును, నదీశము=నదము లకు పతియైన సముద్రము, మధ్యబాడబంబు=నడుమనుండు బడబాగ్ని—బ్రాహ్మణులునుగలది. (శ్లేషాలంకారము.)

కృశానుః—

గ. అమే? కింప్రశంస స్వపయాతమర్యాద మముం దేశం. 208

వ. ఓయీ? మర్యాద తొలఁగినయీ దేశముఁ బ్రశంసించుచున్నావేమి?

పశ్య?—

వృ. గ్రామేగ్రామే నివసతి చిరాత్స్వామి భావేన శూద్రో
భృత్యోభూత్వా పఠతి గణనాం బ్రాహ్మణ స్తస్యపార్శ్వే
వేదాధ్యాయీ సరఇవమరౌ క్వాపి కశ్చిద్యదిస్యాత్
అత్రామత్ర ప్రకరకరణే వర్తతేఽసౌ నియుక్తః 209

అ. శూద్రః=శూద్రుఁడు, స్వామిభావేన=యజమానునితనముతో—పారుపత్యముతో, గ్రామేగ్రామే = ప్రతిగ్రామమందును, చిరాత్ = బహుకాలముగా, నివసతి=ఉన్నాఁడు. బ్రాహ్మణః=బ్రాహ్మణుఁడు, తస్యపార్శ్వే=వాని ప్రక్క, భృత్యః = సేవకుఁడు, భూత్వా = అయి, గణనాం = లెక్కను, పఠతి = చదువుచున్నాఁడు; మరౌ = నీరులేనిదేశములో, సరఇవ = సరస్సువలె, క్వాపి=ఎక్కడనైన, వేదాధ్యాయీ=వేదాధ్యయనముచేయువాఁడు, కశ్చిత్ =ఒక్కఁడు, స్యాద్యది = అయ్యెనేని, అసౌ= వీఁడు, అత్ర = ఈదేశములో,అమత్రప్రకరకరణే=మురికిపాత్రల సమూహమును త్రోముపనియందు, నియుక్తః = ఆజ్ఞాపింపబడినవాఁడుగా, వర్తతే = ఉన్నాఁడు.

తా. ఈయాంధ్రదేశములో నొక్కొక్కయూరియందును శూద్రుఁడు యజమానుఁడుగాను వానిప్రక్క బ్రాహ్మణుఁడు పనివాఁడై కర్ణముగాను నున్నారు. నీరులేనినేలలో తటాకమువలె వేదాధ్యాపకుఁడొకఁడున్నను,ఇక్కడ వాఁడు మురికిపాత్రలుతోమెడిపనిలో నియమింపఁబడియున్నాఁడు.

చూడు?—

తే. ఊరనూరను శూద్రులె పారుపత్య
గాండ్రు, విప్రులె భృత్యులు గణకులుగను

సరసువలె మరు భూమినొక్కరుఁడు వైది
కుండు నుండినఁ గడుగండకుండ లెపుడు ?

టి. పారుపత్యగాండ్రు = గ్రామ మునిషీపులు, గణకులు = కరణీకులు.

విశ్వావసుః—

గ. వయస్య మైవంవాదీః ? 210

వ. చెలికాఁడా? ఇటు లాడకుము.

వృ. మా నాను యత్నతమఖై రనఘై రిహామీ
మాచాధ్యగీషత వచాంసి చిరంతనాని,
దేవేషుభక్తిరవనీ త్రిదశేషుచైషాం
విశ్రాణనంచ వివిధాన్ విధునోతిదోషాన్. 211

అ. ఇహ = ఈయాంధ్రదేశములో, అమీ = ఈబ్రాహ్మణాదులు, అనఘైః = నిర్మలములయిన, మఖైః = యజ్ఞములచేత, మాయత్నతనామ= యజించరుగదా? చిరంతనాని = పురాతనములయిన, వచాంసిచ = వేదవచనములనున్, మాధ్యగీషత = చదువరుగదా? దేవేషు = దేవతలందు, భక్తిః = భక్తియు, అవనీత్రిదశేషు = బ్రాహ్మణులవిషయమందు, విశ్రాణనంచ = దానమును, ఏషాం = వీరియొక్క, వివిధాన్ = సకలవిధములయిన, దోషాన్ = దోషములను, విధునోతి = పోఁగొట్టుచున్నది.

తా. ఈ ఆంధ్రదేశస్థులు బ్రాహ్మణాదులు యజ్ఞము చేయరు, వేదవాక్యములు పలుకరు. అయినను దేవతలందుఁజేయు భక్తియు, బ్రాహ్మణులయెడలఁజేయు దానమును సకలదోషములనున్ పరిహరించుచున్నవి.

షట్పాది.—

ఆ. ఇందు నెందు నుందుకేరెండటో ద్విజులటు,
లేదిత్రేవి వేదవేదివేవి

మఖము ముఖము నేనికేమది నెంచి కాంచే, రా
దేవభ క్తి నవనీ దేవర క్తి.
నెసఁగి, పొసఁగుదొసఁగు లెన్నే నియడఁతు; గీ
వింతకంతకంతకేకంతు కలదె?

టి. ఏదియేని వేదము=వేద మేదియైనను, ఏదియేని = విడిచియైనను, మఖము ముఖము నేని=యజ్ఞముయొక్క ముఖమునైనను, అవనిదేవర క్తిః=బ్రాహ్మణు లందు ప్రేమచేతను, ఎసఁగి=అతిశయించి, పొసఁగు దొసఁగులు=సంభవించు దోషములు.

గ. పశ్యతావదేతేషాం భాగ్యవత్తాం. 212

వ. చూడుము? వీరి భాగ్యశాలితనమును.

వృ. రోమావళ్యా తపనసుతయా రమ్యహారద్యునద్యా
హృద్యాస్తుంగ స్తనగిరిజుషే నాభివాపీమనోజ్ఞాః
భూమేర్మూర్తీరివ వసుమతీ ర్భుంజతేభాగ్యవంతః
క్షోణీపాలాఇవయువజనాః కామమాంధ్రీః పురంధ్రీః. 213

అ. తపనసుతయా=సూర్యపుత్రియైన యమునవంటి, రోమావళ్యా=నూఁగారుచేతను, రమ్యహారద్యునద్యా=గంగవంటి సొగసైన ముత్యాల దండచేతను, తుంగ స్తనగిరిజుషః=పొడవైన కొండలనంటినటువంటి కుచములచేతను, హృద్యాః=మనోహరములై, నాభివాపీమనోజ్ఞాః=నూతులవంటి నాభిప్రదేశముల చేతను మనోహరములై, భూమేః మూర్తీరివ=భూమిరూపమువలె, వసుమతీః=కాంతిమంతురాండ్రైన, ఆంధ్రీః=ఆంధ్రదేశస్థలైన, పురంధ్రీః=భార్యలను, క్షోణిపాలాఇవ=రాజులవలె, భాగ్యవంతః = భాగ్యవంతులైన, యువజనాః= యౌవనవంతులు, కామం = బహుగా, భుంజతే = అనుభవించుచున్నారు. "ఉపమా."

తా. యమునయు గంగయు కొండలయు నూతులయువలె నూగారులయు ముత్యాలహారములయు స్తనములయు నాభులయు చేతమనోహరులైన భూ

మిస్వరూపములవలె కాంతిమంతులగుచుండైన ఈ ఆంధ్రదేశపు భార్యలను ఇక్కడి యౌవనవంతులు భాగ్యవంతులై భూమిపతులవలె అనుభవించు చున్నారు.

సీ. కాళిందినదివలెఁ గార్కొన్న నూఁగారు
గిరివరములవలెఁ గురుకుచాలు
దేవగంగానదిఁ దీరు ముత్తెపుఁ బేరు
డిగ్గియవలె నలఁపొక్కిలియును
సైకతస్థలములఁ సవతు మొమ్మొలయును
చీఁకటిమ్రాఁకులవలెఁ జెలఁగుతుఱుము
ననఁటికంబంబులఁ యనువునఁ దొడలును
వజ్రాలపోలెఁ బల్వరుస గలుగ
తే. భూమిమూర్తులవలె నాంధ్రసోమముఖుల
భాగ్యవంతులె యిట భూమిపాలురటుల
ననుభవించుచు నున్నవారనుదినంబు
వసుమతీత్వము కలుగ నీవనితలకును.

టి. సైకత=ఇసుకదిన్నెల, సవతు=వలె, తుఱుము=కొప్పు, సోమముఖులు=చంద్రముఖులు, వసుమతీత్వము=భూమిత్వము- కాంతిమతీత్వము-ధనవతీత్వము. (అలంకారము=మాలోపమ.)

శృణు తావత్ .—

వృ. కోవా కల్పతరో గుణస్సుమనసాం యత్స్వాశ్రితానా మసౌ
సారాంశాపహరతః ప్రసహ్య మధుపా నాధత్తే మహామోదతః ।
కర్ణే త్వర్జున కీర్తిహాని పరతా కాలాంబుదే గర్జనం
నీరంధ్రం పునరాంధ్రదేశ నృపతిష్వాస్తేఽనఘం స్పర్శనమ్॥214

అ. యత్=ఎందువలన, స్వాశ్రితానాం=తన్ను ఆశ్రయించిన, సుమనసాం=విద్వాంసులయొక్కయు-దేవతలయొక్కయు- పుష్పములయొక్కయు,

సారాంశాన్ = శ్రేష్ఠములైన ధనరూపములును - మధురూపములునైన భాగము లను, ప్రసహ్య=బలాత్కరించి, హరతః=హరించుచున్న, మధుపాన్ =మ ద్యపానులను-తుమ్మెదలను, మహామోదలః=మహాసంతోషములో, ధత్తే = అవలంబించుచున్నదో ? తత్ =అందువలన, కల్పతరౌ=కల్పవృక్షమునందు, అసౌ=ఇద, కోవాగుణః=ఏమిగుణము? కర్ణేతు=దాతయైన కర్ణునియందు, అ ర్జునకీర్తి హానిపరతా=నిర్మలమైన కీర్తిహానియందు ఆసక్తి-అర్జునునియొక్క కీర్తి హానియందు ఆసక్తియు, కాలాంబుదే=కాలమేఘమందు, గర్జనం=ఉఱుము ను, ఆంధ్రదేశ నృపతిషు=ఈ ఆంధ్రదేశరాజులందు, పునః=మఱలమఱల, నీ రంధ్రం=అధికమైన, స్పర్శనం=ఈవియు, అనఘం=నిర్దోషముగా, ఆస్తే= ఉన్నది.

తా. కల్పవృక్షము తన్ను చేరియుండు పుష్పములలోవలె దేవతలలోమక రందమహిమలను బలాత్కారముగా అపహరించెడు మధుపానులను మధుపము లనువలె తనతలను ధరించుచున్నది. ఇది సరికాదా? కర్ణుఁడు దాతయైనను అర్జు నకీర్తికి హానిచేయుటవలెను, వార్షికమేఘము వర్షింపకున్నను గర్జించుటవలెను ఈ యాంధ్రదేశరాజులలో అప్పుడప్పుడు చేయుదానము మిక్కిలి నిర్దోషమై యున్నది.

ఇది వినుః—

సురశాఖిన్ సుమనస్థిరాంశములఁ గొంకోచున్ బోవుభృంగాళిఁ దో
వరయున్ దా మధుపాళియాఁచయినఁ గొంకోడాడున్ దలం జేర్చి యే
మజ కే, కర్ణుఁడు నర్జునోత్థయశమున్ కొమాన్పందలంచున్ బయో
ధరమున్ గర్జిలు, నాంధ్రదేశనృపులో దానానఁ గారట్లుగా?

టి. సుమనః=దేవతలయు-పండితులయు-పుష్పములయు; మధుప=మధుపా నులయు-తుమ్మెదలయు; అర్జునోత్థ=అర్జునుని విజృంభించెడు-పరిశుద్ధమై విజృం భించెడు.

తా. తనయందలి స్థిరాంశములైన ఫలమకరందములను పానముచేయు భృంగములను మధుపాళియును తెలిసియు తనతలను జేర్చి కొండాడుకొనుచుం

డు కల్పవృక్షమువలె దుస్సహవాసము చేయకయు, అర్జున యశస్సును పోఁ గొట్టఁగోరిన కర్ణుఁడువలె మిత్రద్రోహము చేయకయు, వర్షము గురియని కాలమునఁగూడ విజృంభించి గర్జించు కాలమేఘమువలె డంబములాడకయు నిక్కడియాంధ్రదేశపురాజు లెప్పుడును దానప్రధానులుగానే యుండువారు.

సమంతాదవలోక్య.—

గ. వయస్యాత్ర గోదావరీతీరే కేషాంచిదేషా మవనీ
దివిషదా మతి శివపూజాలోలుపతాం పశ్య॥ 215

కలయం గని.—

వ. చెలికాఁడా! చూడు. ఇట గోదావరిదరిం గొందఱ ధరామరుల పరమశివపరిచర్యాధుర్యతను.

వృ. గోదావరీ విమలతీర్థ కృతావగాహాః
లింగేషు సైకతమయేషు శివం విభావ్య
భక్త్యా తిలాక్షతసుమైరపి బిల్వపత్రై
రర్చా మిహావనిసురాః పరికుర్వతేఽమీ॥ 216

అ. అమీ=ఈ, అవనిసురాః=బ్రాహ్మణులు, ఇహ= ఇక్కడ, గోదావరీ... గాహాః=గోదావరియొక్క నిర్మలమైన తీర్థమందు చేసినస్నానము గలవారై, సైకతమయేషు=ఇసుకమయము మైన, లింగేషు=లింగములయందు, శివం=శివుని, విభావ్య=తలంచుకొని, భక్త్యా=భక్తితో, తిలాక్షతసుమైః=నువులతో అక్షంతలతో పూవులతోను, బిల్వపత్రైరపి=బిల్వపత్రములతోను, అర్చాం=పూజను, పరికుర్వతే=చేయుచున్నారు.

తా. ఇక్కడిబ్రాహ్మణులు గోదావరీస్నానము చేసి, ఇసుకలింగములలో శివుని ధ్యానించి నువులు మొదలైనవానితో పూజించుచున్నారు.

క. గోదావరి మును కిడి శివు

వే తీర్చి తిలాక్షతబ
ల్యాదుల నర్చించెద రచకేలామరు లిందున్.

సభ క్త్యుద్రేకమ్.—

వృ. నమామి గిరినందినీరమణపాదపూజాహృతా
మితాఘనికరాన్ కరాంచితవరాక్షమాలాన్ సదా
అమూ నమలచేతస శ్శమదమాదియోగావహాన్
శ్రుతేర్గుణనికా నికామపరిపూతవక్త్రాంబుజాన్॥ 217

అ. గిరి...నికరాన్=పార్వతీపతియొక్క పాదములయొక్క పూజచేత హరింపఁబడిన అపరిమితములైన పాపములసమూహము గలవారును, సదా=ఎల్లప్పుడును,కరా...మాలాన్=చేతిలో చేర్చినవై శ్రేష్ఠములైన అక్షమాలలు గలవారును, శ్రుతేః=వేదముయొక్క, గుణనికా...బుజాన్=అధ్యయనమునల్లించుటచేత అత్యంతముగా పవిత్రమైనముఖపద్మము గలవారును, అమలచేతసః=నిర్మలమైన మనస్సుగలవారును, శమ...వహాన్=శాంతిదాంతి మొదలైనవాని యోగములను వహించినవారు నైన, అమూన్=ఈ బ్రాహ్మణులను, నమామి=నమస్కరించుచున్నాను.

తా. పార్వతీశ్వరునిపాదపూజ చేసి సకలదోషములను పోఁగొట్టుకొని చేతుల నక్షమాలలుంచుకొని వేదాధ్యయనము చేయుచు,మనస్సును పరిశుద్ధపఱచుకొని శాంతిదాంత్యాదిమోక్షోపాయము లనుష్ఠించుకొనుచు,నీ గోదావరీతీరమందుండు బ్రాహ్మణులకు నమస్కరించుచున్నాను.

భ క్త్యతిశయమున.—

తే. శంభుపదపూజఁ బాపవిశేజృంభ మడఁచి
కేలఁ దాలిచి స్ఫటికాక్షకమాల లోలి
విమలమనమును శమదమశేయమము లమరి
శ్రుతులవల్లించు పుణ్యవర్తకు లెలను గొలుతు.

గ. అహో! కృష్ణాగోదావరీమధ్య మధ్యాసీనానా మమీషాం
వైదికానామభినందనీ యోఽయ మనపాయ స్సంప్రదాయః॥

వ. ఆహా! కృష్ణా గోదావరుల మధ్యదేశముల నధివసించు నీవై దికుల సంప్రదాయము సంతోషణీయము నై నిరపాయ మై యున్నయది.

వృ. నిగమపాఠ నిరాకృత దుష్కృతా
నయవిదో బహవోఽత్ర ధరాసురాః
ప్రతివసంత ముపాత్తమఖాస్సుఖం
ప్రతివసంతి ముకుందపరాయణాః॥ 219

అ. నిగమపాఠ నిరాకృతదుష్కృతాః=వేదపాఠముచేతఁ దొలఁగఁ ద్రోయఁబడినదోషములు గలవారై, నయవిదః = నీతి వేత్తలైన, ధరాసురాః= బ్రాహ్మణులు, బహవః=అనేకులు, అత్ర=ఇక్కడ, ముకుందపరాయణాః=నారాయణపరాయణు లై, ప్రతివసంతం =ప్రతి వసంతఋతువులోను, ఉపాత్తమఖాః=అంగీకరింపఁబడిన యజ్ఞములుకలవారై, సుఖం=సుఖముగా, ప్రతివసంతి =వసించుచున్నారు.

తా. వేదములు చదువుచు నిర్దోషులై శ్రీమన్నారాయణునందు పరాయణులైయుండు నిక్కడిబ్రాహ్మణులు ప్రతి వసంతకాలములోను యజ్ఞములు చేయుచుందురు.

క. నిగమంబులఁ బఠియింతురు
నిగమింతురు ప్రతివసంతకేళిక్రతుల సుఖముల్
జగతీసురు లిట నయపటు
లగణితభగవత్పరాయణాత్మ మహాత్ముల్.

టి. నిగమింతురు=పూర్ణము చేయుదురు, నయపటులు=నీతిశాస్త్రసమర్థులు, అగణిత...మహాత్ముల్=లెక్కింపఁగూడని భగవానునియందాసక్తమైన మనస్సుగల మహాత్ములు.

గ. అత్రత్యానా మధికారవ్యాపార నిరతానా మప్యయం ఖల్వ కలంకో నియమః॥ 220

వ. ఇందుల నధికారవ్యాపారములందులనె నిరతులైనవారలకును నియమ మియ్యది నిష్కళంక మయ్యె యున్నయదికదా?

వృ. ఆశ్రయితవ్యో నరపతి
రార్జయితవ్యాని భూరి విత్తాని
ఆరబ్ధవ్యం వితరణ
మానేతవ్యం యశో దశస్వపిదిశాసు॥ 221

అ. నరపతిః=రాజు, ఆశ్రయితవ్యః=ఆశ్రయింపవలసినవాఁడు; విత్తాని = ద్రవ్యములు, భూరి=బహుగా, ఆర్జయితవ్యాని=సంపాదింపవలసినవి; వితరణం= దానము, ఆరబ్ధవ్యం=ఆరింభింపవలసినది; యశః=కీర్తి, దశస్వపిదిశాసు = పదిదిక్కులందును, ఆనేతవ్యం=తెచ్చుకొనవలసియున్నది.

తా. రాజు నాశ్రయించి, ధనములార్జించి, దానములు చేసి, పలుదిక్కులను కీర్తిని తెచ్చుకొనుటయే యిక్కడి వారి నిష్కళంకమయిన నియమము.

క. వెలయు నిదే నియమము, భూ
వలయేశుల నాశ్రయింపఁ గావలయు, ధనంబుల్
కొలఁదికి మించ గడింపఁగ
వలయు, వలయునీయఁ, గీర్తి గావలయు ఘటింపన్.

కృశానుః.—

సమంతాదవలోక్య.—

గ. హంత! సంతతమత్యంత దురిత నిరతా, యవనాఏవతావదమీషు విషయేషు ప్రాచుర్యతః పర్యటంతి? పశ్య సఖే!

కృశానుఁ డంతటం గని.—

వ. అయ్యో ! ఈ యాంధ్రదేశమునందు నమందదురితనిరతు లై యెల్లపుడు జెల్లుగం దురకలే తిరుగుచున్నవారు.

చెలికాఁడా ! చూడు.—

వృ. అవనా వతీత పవనాశ్వశోభినో
భవనాగశాయి భవనావమర్దినః
సవనాది ధర్మలవనాయ దీక్షితా
యవనాశ్చరంతి భువనాతిభీషణాః॥ 223

అ. అతీతపవనాశ్వశోభినః = (వేగముచేత) తోలఁగిపోయిన వాయువుగల గుఱ్ఱములతో ప్రకాశించువారును, భవనాగశాయి భవనావమర్దినః = శివవిష్ణు దేవాలయములను బడఁగొట్టువారును, సవనాదిధర్మలవనాయ=యజ్ఞము మొదలైనవానియు వర్ణాశ్రమ ధర్మములయు వినాశమునకై, దీక్షితాః = దీక్ష వహించినవారును, భువనాతిభీషణాః= లోకమందు అతిభయంకరులునైన, యవనాః=తురకలు, అవనౌ=ఈ ఆంధ్రభూమిలో, చరంతి=తిరుగుచున్నారు.

తా. ఇక్కడితురకలు వాయువేగమును మించిన వేగముగల గుఱ్ఱములతో సకలజనభయంకరు లై శివాలయ విష్ణ్వాలయములను బడఁగొట్టుచు యజ్ఞాదులను వర్ణాశ్రమ ధర్మములనుఁ జెఱుచుటకు దీక్షవహించి యెల్లెడలను దిరుగుచున్నారు.

ఆ. యవనులిం దమందజవనాశ్వముల నెక్కి
దేవతాలయాలఁ గీలఁగూల్చి
సవనధర్మసమితి సమసిపోవఁగఁ జేసి
భువనభీకరులుగ భువిఁ జరింత్రు.

టి. అమందజవన=విస్తారము లై వేగవంతములైన, సవనధర్మసమితి=యజ్ఞములయు, వర్ణాశ్రమధర్మములయు సమూహము.

విశ్వావసుః.—

గ. సత్యమేవ మథాప్యేతేషు తురుష్కయవనేష్వనన్యసాధా
రణవిక్రమే గుణ మముం గృహాణ॥ 224

వ. ఇట్లు నిజమైనను, ఈ యవనాదుల యనన్యసామాన్య మైన పరాక్రమక్రమమున గుణగ్రహణము చేయుము.

వృ. యుద్ధాయ ప్రమిలంతు హంత! పటవో యోధాస్సహస్రాధికా
యద్యేకోఽపి బలాత్తురుష్కయవనేష్వారూఢఘోటో భటః
నిస్త్రింశం పరికంపయన్ స్వకటకాన్నిష్క్రామతి క్రోధత
స్సర్వే తే కృపణాస్తృణాన్యశరణాః ఖాదంతి సీదంతి చ॥ 225

అ. పటవః=సమర్థులై, సహస్రాధికాః=వేయింటికిమించిన, యోధాః=యుద్ధము చేయువారు, యుద్ధాయ=యుద్ధమునకై, ప్రమిలంతు = చేరుదురు గాక; హంత=ఆహా! తురుష్కయవనేషు=పలుజాతుల తురుష్కులలో, ఏకోఽపి=ఒక్కఁడైనను, భటః=బంటు, బలాత్ =బలిమితో, ఆరూఢఘోటః=ఎక్కఁబడిన గుఱ్ఱముగలవాఁడై, నిస్త్రింశం=ఖడ్గమును, పరికంపయన్=త్రిప్పుచు, స్వకటకాత్ =తనకోటనుండి, క్రోధతః=కోపముతో, నిష్క్రామతియది=వెలుదేఱుచున్నవాఁడయ్యె నేని, తే సర్వే=ఆ సకలభటులును, అశరణాః=తిమ్ముఁ గాపాడువాఁడు లేనివారై, కృపణాః=దీనులై, తృణాని=తృణములైనను, ఖాదంతి=తినుచున్నారు, సీదంతి చ=దుఃఖించుచున్నారు.

తా. యుద్ధము చేయువారెందఱో యుద్ధానికి వత్తురుగాని, ఆపలుజాతులతురకలలో నొక్కఁడైనను ఖడ్గము త్రిప్పుకొనుచు తన కటకమునుండి కోపముతో వెడలు వాఁడయ్యె నేని; ముందటిభటు లందఱు దిక్కులేక దీనులై దుఃఖించుచునెయుందురు.

చ. దురమున కెత్తివచ్చినను దుర్ధరయోధులు క్రోధులై మహో
ద్ధురగతు లయ్యు, నయ్యవనధూర్వహుఁ డొక్కఁడు ఖడ్గ

హస్తుఁడై। యురవడి శౌర్యధైర్యములకైనుద్ధతుఁడై యట
దూఁకెనేనివా। ర్వెరవిడులౌచు వాల్చుఅచికవే పరకల్ కఱ
తుర్భయార్తులై.

టి. వెరవిడులు=ఉపాయములేనివారు, వే= వేగముగ, పరకలు=గడ్డిపోఁచలు(మృగప్రాయులగుదురనుట.)

కించ.—

వృ. పిబన్తు మదిరా మమీ, పరిలుపన్తు దేశానహో!
హరన్తు పరసున్దరీ రపలపన్తు వేదానపి,
తథాపిచ మృధాఙ్గణే తృణవదేవ ముక్త్వా తనుం,
హఠాద్విదధతే మరుత్పుర కపాటికోద్ఘాటనమ్॥ 226

అ. అమీ = ఈతురకలు, మదిరాం = కల్లును, పిబన్తు=త్రాగుదురుగాక! దేశాన్ = దేశములను, పరిలుపన్తు = నాశముచేయుదురుగాక! అహో= ఆహా! పరసుందరీః=పరస్త్రీలను, హరంతు = అపహరింతురుగాక! వేదానపి= వేదములనుగూడ, అపలపంతు=దూషింతురుగాక! తథాపి = అట్లైనను; మృధాంగణే=యుద్ధమునుంగిట, తనుం = దేహమును, తృణవదేవ = తృణమువలెనే, ముక్త్వా=విడిచి, హఠాత్=తటాలున, మరుత్పురకపాటికోద్ఘాటనం= స్వర్గలోక కవాటమునుభేదించుటను, విదధతే=చేయుచున్నారు.

తా. ఇక్కడి తురకలు కల్లుద్రాఁగుచు, పలుదేశములను పాడుచేయుచు, పరస్త్రీల నపహరించుచు, విధివిహితకర్మలను దూషించుచునుందురు గాని, యుద్ధభూమిలో తమశరీరమును గడ్డిపోఁచనువలె విడిచి, బలాత్కారముగా స్వర్గద్వారకవాటములను పగులఁగొట్టుదురు.

మఱియు.—

ఉ. త్రావఁగనిమ్ము కల్లు, పరదారలఁబెల్లు హరింపనిమ్ము, నా
నావరదేశముల్ [illegible] నాశముచేయఁగ నిమ్ము వేదముల్

వావిరిఁ ద్రోవనిమ్ము, మృధకేవాటిఁ దృణమ్మునుబోలె మానిమే
నే, విబుధేంద్రపట్టణ విశేనిష్ట కవాటము ద్రక్కలింత్రె పో!

టి. వావిరిగ = వడుసగా, మృధవాటిక = యుద్ధప్రదేశమున, మేనే= శరీరమునే.

## కర్ణాటదేశవర్ణనము.

(కర్ణాటదేశము.—ఇది ద్రవిడాంధ్రదేశముల మధ్య పశ్చిమపార్శ్వపు కన్నడదేశము, ఇందు మైసూరుతోఁజేరిన బెంగుళూరే ముఖ్యపట్టణమై యుండునది. ఇక్కడిభాష కర్ణాటము—అదియె కన్నడము.)

గ. ఇతి వ్యోమయాన మన్యతః స్పందయ న్నగ్రతో దృష్ట్వా
స ప్రత్యభిజ్ఞమ్॥ 227

వ. అని వ్యోమయాన మన్యత్ర జఱుపుచుఁ దన యెదురఁగాంచి, తోడన స్మరించుకొని.

శ్లో. కర్ణాటదేశో యః పూర్వం
కర్ణదేశ మభూషయత్ ।
సఏష సాంప్రతం పశ్య
చక్షుషోర్భూషణాయ తే॥ 228

అ. యఃకర్ణాటదేశః = ఏకర్ణాటదేశము, పూర్వం = ముందు, కర్ణదేశం= చెవిని, అభూషయత్=అలంకరించినదో ? సఏషః = అయిది, సాంప్రతం= ఇప్పుడు, చక్షుషోః = కన్నులకు, భూషణాయతే = అలంకారమగుచున్నది. పశ్య=చూడు.

తా. ఈ కర్ణాటదేశమును మును వినుచుంటిమి ? ఇప్పుడు చూచుచున్నాము; చూడు.

క. కర్ణాటదేశ మియ్యది
కర్ణాలంకారమయ్యెఁ గరమున్ మును, నా

కర్ణించితె! యదె, యిదె ని
ర్వర్ణింపుము! కనుల కిపు డపాలంకారమగున్.

టి. మును=ముందు, కరము=మిక్కిలి, నిర్వర్ణింపుము=చూడుము.

గ. లోచనాసేచనకంకిల! దేశస్యాస్య రామణీయకమ్॥ 229

అ. దేశస్య అస్య=ఈదేశముయొక్క, రామణీయకం = రమణీయత్వము, లోచన+ఆసేచనకంకిల = కన్నులకు+చల్లపఱుచునది కదా?

వ. ఈ దేశమురమణీయత చూడఁజూడను గనులకుఁ దనివి దీఱ నియదియ కదా?

వృ. ప్రతినగర మిహారామాః
ప్రత్యారామం పచేలిమాః క్రముకాః
ప్రసవాః ప్రతిక్రముకమ
ప్యుత్సర్పతి మధుతతిః ప్రతిప్రసవమ్॥ 230

అ. ఇహ=ఇక్కడ, ప్రతినగరం=ప్రతిపట్టణమందును, ఆరామాః=తోఁట లు; ప్రత్యారామం=ప్రతితోఁటలందును, పచేలిమాః=ఉడికింపఁదగిన, క్రముకాః=పోఁకలు; ప్రతిక్రముకం=ప్రతి పోఁకలందును, ప్రసవాః=పువ్వులు; ప్రతిప్రసవం=ప్రతిపూవులందును, మధుతతిః అపి=తేనెధారలును గూడ, ఉత్సర్పతి=వృద్ధిపడుచున్నది.

తా. ఊరూరఁ దోఁటలును, ఒక్కొక్కతోఁటలో పోఁకచెట్లును, ఒక్కొక్కపోఁకలో పువ్వులును, ఒక్కొక్కపువ్వులో తేనెధారలును వృద్ధి యగుచున్నది.

వృ. ప్రతిమధుబిందుమిళిందాః
ప్రేంఖంతి ప్రతిమిళింద మారావాః
ప్రత్యారావం సుదృశాం మదా
ఉదయ ప్రతిమదమ్॥ 231

అ. ప్రతిమధు బిందుమిళిందాః=ప్రతి తేనెబొట్టులోను తుమ్మెదలు, ప్రేంఖంతి=తిరుగుచున్నవి. ప్రతిమిళిందం=ఒక్కొక్క తుమ్మెదలోను, ఆరావాః=ఝంకారములును, ప్రత్యారావం=ప్రతిఝంకారములోను, ఉదారాః=గొప్పలైన, సుదృశాంమదాః=స్త్రీలవిలాసములును ప్రతిమదం=ప్రతివిలాసములోను, మదనః=మన్మథుండు, (విలసించుచున్నాఁడు).

తా. ఇక్కడ ఒక్కొక్క తేనెబొట్టులో తుమ్మెదలును, ఒక్కొక్కతుమ్మెదలో ఝంకారమును, ఒక్కొక్క ఝంకారములో స్త్రీలవిలాసమును, ఒక్కొక్కవిలాసములో మన్మథుఁడును విలసించును.

సీ. వీటవీటను దోఁట ◊ తోఁటఁదోఁటనుబోఁక
పోఁకఁబోఁకను బూలు ◊ పూలఁదేనె
తేనెఁదేనెను సోన ◊ సోనసోనను దేఁటి
తేఁటిఁదేఁటిని ఝంకృ ◊ తియును సందు
సోలుచానలచాలు ◊ చాలుచాలునఁజోఁక
జోఁకజోఁకను మరుఁ ◊ జోఁపుచూపు
చూపుచూపునఁ దూఁపు ◊ తూఁపుతూఁపున రాపు
రాపురాపున రేపు ◊ మాఁపునిట్ల
తే. కలికి కలుకుల కులుకుల ◊ కలరితలరి
కరఁగి చెన్నారుచున్నారు ◊ కలసిమెలసి
బొజుంగులెన లేక తనివోక ◊ పోల్క ప్రోలఁ
గనుము; కర్ణాటదేశంబు ◊ కనుల వేడ్కఁ.

టి. వీటను=పట్టణములో, చాలు=పఙ్క్తి, జోఁక=ఉత్సాహము, మరుఁ=మన్మథుని, చోఁపు=ప్రోత్సాహపఱచునట్టి, తూఁపు=బాణము, రాపు=ఒరయిక, కలికికలుకులకులుకులకుఁ=చాతుర్యముగల ప్రతిస్త్రీల యొయ్యారములకు, బొజుంగులు=విటులు, ఎన=సాటి, పోల్క=చక్కఁగా.

కృశానుః.—

గ. హంత! కథమభినందయసి నిందనీయ మముం దేశమ్॥ 232

వ. అకటా!ఏటు లీనిందనీయ మైన దేశము నభినందించుచున్నావు!

తథాహి.—

శ్లో. వేదవైదిక విద్వేష
దూషితా భస్మరూషితాః
చండాస్సంత్యత్రపాషండా
లింగాఽలింగిత వక్షసః॥ 233

అ. వేద...దూషితాః= వేదములందును, వైదికులందును ద్వేషముచేత దూషింపఁబడినవారై, భస్మరూషితాః = విబూదిచేత పూయఁబడినవారై, చండాః = క్రూరులై, లింగాలింగితవక్షసః = లింగములతో కౌఁగిలింపఁబడిన ఱొమ్ములుగలవారైన, పాషండాః=లింగబలిజలు, అత్ర =ఈదేశమున, సంతి= ఉన్నారు.

తా. ఈకర్ణాటదేశములో లింగబలిజలనెడివారు వేదోక్తములనుగాని, వైదికులనుగాని ద్వేషించుచు, విభూతిఁబూసికొనుచు లింగములం గౌఁగిలించుకొంచు, క్రూరులుగా నుందురు.

అట్లే కదా.—

ఆ. వేదవైదికులను ద్వేషించి దూషించి
వెల్లబసుమ మొడలనెల్ల నలఁది
యండనుందు రిందుఁ జండపాషండులు
సంగతాంగ లింగ సంఘులగుచు.

గ. ఆకర్ణయతావ దన్య దప్య మీషా మపచరితమ్॥ 234

వ. వీరి యొక్క దురాచారముల విను

వృ. శిరఃపురారే ర్ద్విజరాజపాద
దివ్యామృతై స్సిక్తమితీర్ష్యయేవ।
శూద్రా ఇమే లింగధరాః స్వయంతత్
స్వపాదతోయై స్స్నపయంతి కష్టమ్॥ 235

అ. పురారేఃశిరః = శివునితల, ద్విజరాజపాదదివ్యామృతైః-ద్విజరాజ=చంద్రునియొక్క—బ్రాహ్మణశ్రేష్ఠునియొక్క, పాద=కిరణములయొక్క—పాదములయొక్క, అమృతైః=అమృతకళలచేత—దివ్యజలములచేత, సిక్తం=తడుపఁబడినది; ఇతి=అని, ఈర్ష్యయా ఇవ=ఓర్వమిచేతవలె, లింగధరాః=లింగధారులైన, ఇమేశూద్రాః = ఈశూద్రులు, స్వపాదతోయైః = తమకాలినీటితో, స్వయం = తామె, తత్ =ఆశివశిరస్సును, స్నపయంతి = అభిషేకముచేయుచున్నారు; కష్టం=అయో!

తా. ఇఁక ఈ లింగబలిజలు ద్విజరాజ పాదజలములతో శివునిశిరస్సు తడుపఁబడెనని కడుపుమంటతో తమకాలినీళ్లతో నే ఆ శివశిరస్సును స్నానముచేయించుచున్నారు. ఇది యేమిదుఃఖము!

తే. రుద్రు ద్విజరాజపాదామృతార్ద్రశిరముఁ
జూచి యీసుతోవలెఁ దామె రేఁచి తమదు
పాదజలముల సంశుద్ధిపఱతు రెపుడు
శూద్రు లిట లింగధారులు చులక నకట!

టి. రుద్రు=శివునియొక్క, ద్విజరాజ = చంద్రునియొక్క-ద్విజశ్రేష్ఠులైన బ్రహ్మ క్షత్ర వైశ్యులయొక్క.

విశ్వావసుః.—

గ. సఖే! మైవం సంగిరిష్ఠాః ! యదస్మిన్ దేశే యదుశైలప్రభృతీని దివ్యక్షేత్రాణి దృశ్యంతే. 236

వ. సఖా! ఇట్లనకుము. యదుశైలము మొదలైన దివ్యదేశములును ఈదేశమున కనుపించుచున్నవి.

## యదుగిరి=తిరునారాయణపుర వర్ణనము.

(తిరునారాయణపురము.— ఇందలిస్వామి— మొదల సనకాదులవలనను, వెనుక ఆదిశేషునివలనను, ఆవెనుక శ్రీనృసింహమూర్తి ప్రహ్లాదునివలనను, అటు వెనుక శ్రీరాములతో లక్ష్మణునివలనను, తర్వాత బలరాములతో యదుకులతిల కుఁడైన శ్రీకృష్ణునివలనను సమర్చింపఁబడుచుండినందున వరుసగా ఇది నారా యణాద్రి=తిరునారాయణపురము, శేషాద్రి, నృసింహాద్రి, యాదవాద్రి = యదుగిరి, అనియు పేర్కొనఁబడియు; అక్కడక్కడఁ గల వేద, వైకుంఠ, వరాహ, పద్మ, పరాశర, కుశ, పలాశ, కల్యాణతీర్థములు అను అష్టతీర్థ ములతోను, ఇయ్యది దక్షిణబదరికాశ్రమమని అచటచటఁ గల వ్యాసాం బరీష, శుక, వికుక్షి, రుక్మాంగద, పుండరీకాది మహాతపస్సంపన్నులు చేయు చుండిన తపస్థలములతోను, క్షీరాబ్ధియందలి శ్వేతద్వీపమందు శ్రీమన్నారా యణు నాజ్ఞచేత గరుత్మంతుఁడు తిరుమణికాప్పను దాల్చుటకై తెచ్చి యుంచినయా శ్వేతమృత్తికతోను ప్రశస్తమై యుండుదివ్యదేశము.)

వృ. దురితి మవనతానాం దుర్నిరోధం నిరుంధ
న్సితమతిభి రతంద్రైస్సేవ్యమానో మునీంద్రైః
యదుగిరి రయ మింధే యత్ర నారాయణాత్మా
నివసతికిల? హర్షం నీలమేఘః ప్రవర్షన్॥ 237

అ. అవనతానాం=ఆశ్రితులయొక్క, దుర్నిరోధం=దుర్నివార్యమైన, దురితం=దోషమును, నిరుంధన్=పోఁగొట్టుచు; సితమతిభిః=పరిశుద్ధమనస్కులై, అతంద్రైః=ప్రమాదపడని, మునీంద్రైః=మహర్షులచేత, సేవ్యమానః=సేవింపఁ బడుచున్నదై, యత్ర=ఎక్కడ, నారాయణాత్మా=నారాయణస్వరూపమైన, నీలమేఘః=కార్మేఘము, హర్షం=ఆనందమును, ప్రవర్షన్=వర్షించుచు, నివస తి=వసించుచున్నదో, తత్ర=అక్కడ, అయం యదుగిరిః= ఈ యాదవగిరి ఇంధేకిల=ప్రకాశించుచున్నది కదా ?

తా. శ్రీ[illegible]నారాయణస్వరూపమగు నీలమేఘము ఆశ్రితుల [illegible]ఆనందము

ను పఠించుచున్నట్లు ఈ కర్ణాటదేశములో తిరునారాయణపుర మనెడి యదు. శైలము సకలాశ్రితుల దోషములం బరిహరించుచు, సకల మహామునీంద్రుల చేత సేవింపఁబడుచున్నది.

చ. సదమలశీలమైన యదుశైల మనంబడుదివ్యదేశ మిం
పొదవు,సమాశ్రితాఘములకోఘములం దెగఁజూచి,యేచి
స, మ్మదమున శుద్ధచిత్తులగుసామానులుగొల్వఁగ, నీలమేఘ
మ, భ్యుదయపరంపర ల్గురియుచుండును నిందుముకుందు
నాకృతిన్.

టి. సదమలశీలము=శ్రేష్ఠమై నిర్మలమైననడవడి గలది, ఓఘములన్=స. మూహములను, ఏచ=విజృంభించి.

## తిరునారాయణస్వామివర్ణనము.

(తిరునారాయణస్వామి.—వీరు - ఇందలి కల్యాణతీర్థతీరమున మొదట. శ్రీరామలక్ష్మణులచేతను, వెనుక బలరామ శ్రీకృష్ణులచేతను సమర్చింపఁబడు. చుండినందున శ్రీరామప్రియులనియు, ఆవెనుక ఢిల్లీసంస్థానమున బిడ్డవలె దోఁ గాడుకొనుచువచ్చి ఆ యతిరాజులవారిచే "ఎన్ చెల్వపిళ్లయే" అని ఆలింగ నము చేసికొనఁబడి ఆపేరుపొంది అబూబునాచ్చియారుతో వేంచేసిన యాసంవ. పత్కుమారులతోను, యదుగిరి నాచ్చియారుతోను ఆనందవిమానమున నే. వసాయించుచుండిన శ్రీమన్నారాయణమూర్తి.)

సభక్త్యున్మేషమ్.—

వృ. యదుగిరి తటాగారా స్వారాజమాళి పరిస్ఫురన్
మరకతమహోధారా నీరాజితాంఘ్రి సరోరుహా ।
నవజలధరాకారా నారాయణాహ్వయభూషితా
నిరవధిదయాసారా సారాజతేపరదేవతా॥ 238.

అ. యదుగిరితటాగారా=యదుశైలశిఖరమే స్థానముగాఁగలదియు, స్వా. రాజ-మాళి-పరిస్ఫురత్ -మరకత-మహః - ధారా-నీరాజిత-అంఘ్రిసరోరుహా=

స్వర్గలోకమునకు రాజైన ఇంద్రునియొక్క, శిరస్సునందు ప్రకాశించుచున్న పచ్చలకాంతుల పరంపరచేత మంగళార్తి లియ్యఁబడినపాదపద్మములు గలదియు, నవజలధరాకారా=క్రొత్తమేఘమువంటిరూపము గలదియు, నారాయణాహ్వాయభూషితా = నారాయణుఁ డనుపేరిచే నలంకరింపఁబడినదియు, నిరవధిదయాసారా=మితిలేనికృపయనెడి జడివానగలదియు నైన, సా=అట్టి, పరదేవతా=పరమదైవము, రాజతే=ప్రకాశించుచున్నది.

తా. ఈ యదుశైలమందు దేవేంద్రుని శిరోరత్నముల కాంతులతోడి పాదపద్మములతో నీలమేఘవర్ణుఁడైన నారాయణుఁ డనుపరమదైవము పరమకృపతో ప్రకాశించుచున్నవాఁడు.

అతిభక్తియుక్తముగా.—

మ. యదుశైలంబున నిర్జరేశ్వరకిరీటాగ్రోత్థగారుత్మతా
భ్యుదితోద్యోతరుచుల్పదాబ్జముల కెంతో వింత నివ్వాళులై
సదయంబైయసితాంబుదాభ మయికంసధ్వంసినామంబుతోఁ
బదిలం బౌపరదైవ మీపగిది విభ్రాజిల్లు నెల్లపుడున్.

టి. నిర్జరేశ్వర...రుచులు=దేవేంద్రుని కిరీటాగ్రమందుండి లేచిన పచ్చలలోనుండిపుట్టి ప్రకాశించెడు కాంతులు, నివ్వాళులై=ఆర్తులై, పదిలంబౌ=క్షేమకరంబౌ.

పునస్సవిస్మయమ్.—

శ్లో॥ యశ్ప్రభుర్యాదవక్ష్మాభృ
త్పురస్కృత్యాపురాబభౌ
అధునాయాదవక్ష్మాభృ
దధికకృత్యాసభాత్యహో ॥ 239

అ. యః ప్రభుః=ఏప్రభువు, పురా=ముందు, యాదవక్ష్మాభృత్=యాదవరాజైన ఉగ్రసేనునియొక్క, పురస్కృత్యా=పూజచేత—ముందుపఱచుటచేత, బభౌ=ప్రకాశించుచుండెనో, సః=అతఁడు, అధునా=ఇప్పుడు, యాదవక్ష్మా

భృత్ అధఃకృత్యా=యదుశైలముయొక్క తిరస్కారముచేత—క్రిందుపఱచుటచేత, భాతి=ప్రకాశించుచున్నవాఁడు. అహో=ఆశ్చర్యము.

తా. కృష్ణావతారమందు యాదవరాజైన ఉగ్రసేనుఁడు పూజించిన శ్రీమన్నారాయణుఁ డిప్పుడీ యదుశైలముక్రింద ప్రకాశించుచున్నయతఁడు. (శ్లేషానుప్రాణిత విరోధాభాసము.)

మఱల నాశ్చర్యముతో.—

తే. ఆర్యహితచరిత్రుఁ డెతఁడు పూర్వమందు
నందు యాదవగోత్రమునందునుండి
ముందుపడియె, నిపుడటె మిన్నంది యతఁడు
నిందు యాదవగోత్రంబుక్రిందువడియెను.

టి. యాదవగోత్రంబునందుండి=యాదవుల వంశమునందుండి, ముందుపడియె=సాక్షాత్కరించెనో, యాదవగోత్రంబు క్రిందుపడియె=ఈయాదవశైలము క్రిందిభాగమునె స్థానముగాఁగొనెను.

ఇ. యాదవరాజు-ఉగ్రసేనుఁడు—ఇతఁడు దేవకునియన్న దేవకీదేవికిని కంసునికిని తండ్రి, ఉత్తరమధురాపురియందు యాదవులకు రాజు.

సశ్లాఘం —

వృ॥ భూభృత్యస్మిన్ పక్షిరాజేన పూర్వం
శ్వేతద్వీపాదాహృతాం శ్వేతమృత్స్నాం
ధన్యా నిత్యం ధారయంతో లలాటే
మాలీమస్యాం మానసాన్నిర్మృజంతి॥ 240

అ. అస్మిన్ భూభృతి=ఈయదుశైలమందు, పూర్వం=ముందు, శ్వేతద్వీపాత్=శ్వేతద్వీపమునుండి, పక్షిరాజేన=గరుత్మంతునిచేత, ఆహృతాం=తేఁబడిన, శ్వేతమృత్స్నాం=తిరుమణిని, ధన్యాః=కృతార్థులైనవారు, లలాటే=నొసటియందు, ధారయంతః=ధరించువారై, మానసాత్=మనసునుండి, మాలీమస్యం=మాలిన్యమును, నిర్మృజంతి=తొలఁగించుకొనుచున్నారు.

తా. ముందు కృతయుగములో శ్వేతద్వీపములోనుండి గరుత్మంతుఁడు తెచ్చిన యీయదుశైలమందలి తిరుమణిని కృతార్థులైనయందఱు నుంచుకొని తమమనోమాలిన్యదోషములను దొలఁగించుకొంచు నున్నారు.

శ్లాఘించుచు.—

ఆ. వెల్లదీవినుండి శ్రీ వెల్లకుత్తుకపక్కి
తెచ్చి మునుప యునుపఁ శ్రీ దెల్లమృత్తు
నిటఁ గృతార్థు లిటుల శ్రీ నిటలదేశములందుఁ
దాల్తు్ర మలినతలవోలార్తు్ర మతుల.

టి. వెల్లకుత్తుకపక్కి=గరుత్మంతుఁడు, నిటలదేశములందు=నొసళ్లలో, మలినతలన్=మాలిన్యములను.

కించ.—

శ్లో॥ విష్ణుపద్యాకలనయా
విశ్రుతో విమలాశయః
కాసారోఽత్రహరత్యేనః
కవిః కంసారిభాగివ॥ 241

అ. విష్ణుపద్యాకలనయా = గంగానదియొక్క-విష్ణువిషయకపద్యములయొక్క సాంగత్యముచేత, విశ్రుతః=ప్రసిద్ధమై, విమలాశయః=నిర్మలమైన యభిప్రాయముగలదైన, అత్ర=ఇక్కడ, కాసారః=తటాకము,కంసారిభాక్ కవిః ఇవ=హరిని భజించుకవివలె, ఏనః = పాపమును, హరతి = హరించుచున్నది. (శ్లేషోపమ)

తా. విష్ణువుమీఁదిపద్యములఁ జేయు కవివలె గంగానదితోడికలయిక గల యిక్కడి కల్యాణిసరస్తీర్థము నిర్మలమై ప్రసిద్ధముగ పాపములు పరిహరించుచున్నది.

మఱియు.—

క. కమలాశయ మతిశయమై
కమలాకమనావనమనకీకవనంబువలెన్
విమలాశయ మతియశమై
ప్రమదావహ మయ్యె విష్ణుపద్యంబులమైన్.

టి. కమలాశయము = తటాకము, కమలాకమన+ అవనమన+ కవనంబువలెన్ = లక్ష్మీపతికై+ప్రణామముతోడి కవిత్వమువలె, ఆశయము=స్థానము–అభిప్రాయము, అతియశము = అతికీర్తికలది, విష్ణుపద్యంబులమైన్=విష్ణుపదీనదీజలములచేత – విష్ణువుమీఁదిపద్యములచేత, ప్రమదావహము = సంతోషప్రదము.

గ. ఇతి విమాన మితరత్ర పరిస్పందయన్ సానందమ్. 242

వ. అని విమానము ఆవలనం గదలించుకొంచు నానందమున.

## ఆనందతీర్థమునీంద్రవర్ణనము.

(ఆనందతీర్థమునీంద్రులు—వీరు పాచకక్షేత్రమున సువనూరున ద్వైతమతస్థాపకులై మధ్వమతస్థులైన మధ్వాచార్యులు.)

ఈమతము-జీవాత్మపరమాత్మలు వేఱువేఱై, పరమాత్మ యనెడుసర్వేశ్వరుఁడు అన్నివిధముల తనకుతానే భోగించువాఁడౌటచేత తాను భోక్త అనియు, జడజీవాత్మలు తనచే భోగింపఁదగినవి యవుటచే అవి భోగ్యములు అనియు నిర్ణయింపఁబడియెడి ద్వైతమతము.

వృ॥ రజతపీఠపురం నను కాంచన
శ్రియమిదం వహతే మహదద్భుతం
ఇహవసన్ శుభరీతి రహో బుధః
పరమయోగతఏవ విరాజతే॥ 243

అ. రజతపీఠపురం = వెండిపీఠముగలది—సువనూరు, నను=ఐనా, కాంచనశ్రియం=బంగారుకాంతిని – ఒకవిధమైనకాంతిని, వహతే = వహించుచున్నది.

ఇదం=ఇది, మహదద్భుతం=మహాశ్చర్యము; ఇహ=ఇక్కడ, వసన్=వసించుచు, శుభరీతిః=మేలైనయి త్తళిగల-మేలైనవిధముగల, బుధః=జ్ఞాని, పరమయోగతఏవ=శ్రేష్ఠమైనయోగముచేతనే—బహుగా ఇనుమునం దుండునట్టివాఁడుగానే, విరాజతే=ప్రకాశించుచున్నవాఁడు, అహో=ఆశ్చర్యము !

తా. వెండిలోఁడిది బంగారుకాంతి కలదిగానుండుట ఆశ్చర్యమేగాక, అందు ఇత్తడివలెనుండు నొకఁడు ఇనుముగా నేయుండుటయు ఆశ్చర్యమే. ఇట్లు ఈసువనూరు మేలైనరీతితోనుండునదిగాక, యీయూరియందు ఆనందతీర్థులు అనుజ్ఞాని శుభమైనరీతితో పరమయోగములోను ప్రకాశించుచున్నయతఁడు.

తే. తాను దుర్వర్ణ పీఠమై యైన, నూరు
వర్ణనకునెక్కు నౌరసువర్ణ పీఠ
మగుచు, నదిగాక యోగమై మిగుల నెసఁగు
రీతి నానందతీర్థుని రీతిపొసఁగు.

టి. ఊరు=సువనూరు (—వెండియూరు అని యిది కన్నడభాషాపదార్థము కలది.) అయోగమై=ఇనుమును పొందినదై—యోగమై=యోగముకలిగి, రీతిన్=విధముతో—ఇత్తడితో.

పునస్సశ్లాఘం.—

వృ॥ ఉచ్చైర్ద్విజేంద్రైరమృతాభిలాషా
దాసేవితో భువ్యభిజాతకీర్తిః
ఆనందతీర్థాహ్వయమత్రకశ్చి
దన్వర్థయన్నావిరభూన్మునీంద్రః॥ 244

అ. ద్విజేంద్రైః=బ్రాహ్మణులచేత— పక్షిశ్రేష్ఠులచేత, అమృతాభిలాషాత్=మోక్షమందు—నీటియందు అభిలాషతో, ఆసేవితః=సేవింపఁబడినవాఁడై, భువి=భూమియందు, అభిజాతకీర్తిః = పుట్టుచున్నయశస్సు—అడుసుకలవాఁడైన, కశ్చిత్ = ఒకానొక, మునీంద్రః= యోగి, ఆనందతీర్థాహ్వ

యం= ఆనందమునకయిన గురువుఅను పేరిని, అత్ర=ఇక్కడ, ఉచ్చైః=గట్టిగా, అన్వర్థయన్=సార్థపఱచుచు, ఆవిరభూత్=ఆవిర్భవించెను.

తా. పక్షులునీటికిగాను తీర్థమునుగోరినట్లు బ్రాహ్మణులు మోక్షమును గోరి సేవించుచుండఁగా కీర్తిగలిగియున్న ఆనందతీర్థుఁడనుగురువు ఆనందములోడనుండు గురువనఁతనపేరిని ఉపయోగపఱచుటకై జన్మించెను.

మఱల శ్లాఘించుచు.—

తే. ద్విజవరావళితాపదుస్త్యజతనణఁప
నమృతమాసించిసేవింప నమితకీర్తి
నంది యానందతీర్థాహ్వాయమును సార్థ
ముగ నొనర్చె నొకండిట ముని వరుండు.

టి. ద్విజవరావళి=పక్షి—బ్రాహ్మణశ్రేష్ఠసమూహముయొక్క, తాపదుస్త్యజతక్=తాపములను తొలఁగఁజేయఁగూడమిని.

కృశానుః.—

గ. అస్తుతావదేవ మథాప్యదసీయదర్శనానువర్తినామధునాతనానాంద్విజానామపిబహవ ఆకర్ణ్యంతామపచారాః. 245

అ. ఏవం= ఇట్లు, అస్తుతావత్=అగుఁగాక, అథాపి=ఐనను; అదసీయదర్శనానువర్తినాం=ఇతనిసంబంధమైన దర్శనమును అనువర్తించెడి, అధునాతనానాం=ఇప్పటి, ద్విజానాం=బ్రాహ్మణులయొక్క, బహవః = అనేకములైన, అపచారాః=దురాచారములు, ఆకర్ణ్యంతాం= వినఁబడుఁగాక.

వ. ఇట్లుండిన నుండనిమ్ము. ఇమ్మునిదర్శనమనువర్తించునిప్పటియి ప్పుడమివేల్పులయపచారము లపారములు వినఁబడుఁగాక.

వృ॥ సతత మకృత సంధ్యోపాస్తి రభ్యస్తశాస్త్ర
స్సవితరి గత బాల్యే కాల్యసంధ్యా ముపాస్తే
తదపి భువి నమాన్యం మన్యతే ధన్య మన్యం
త్యజతి విహితహానా త్ప్రాధ్వసం మాధ్వసంఘః॥ 246

అ. మాధ్వసంఘః=మధ్వసంబంధులసమూహము, అకృతసంధ్యోపాస్తిః=చేయఁబడనిసంధ్యోపాసనము గలదై, సతతం=ప్రతిదినము, అభ్యస్తశాస్త్రిః=అభ్యసింపఁబడినశాస్త్రములు గలదై, సవితరి=సూర్యుఁడు, గతబాల్యేసతి=పోయినపసితనముగలవాఁడగుచుండగా- ఉదయకాలముమించిపోవఁగా, కాల్యసంధ్యాం=కాలోచితసంధ్యను, ఉపాస్తే=ఉపాసించుచున్నది; తదపి=అట్లున్నను, అన్యం=ఇతరుని, భువి = లోకములో, ధన్యం = ధన్యుఁడైనవానిని, మాన్యం=పూజ్యునిఁగా, నమన్యతే=తలంపదు, విహితహానాత్ = వేదవిహితము విడుచుటవలన, సాధ్వసం=భయమును, త్యజతి=విడుచుచున్నది.

తా. ఇక్కడిమాధ్వులుప్రాతస్సంధ్యోపాసన చేయకయే యెప్పుడును శాస్త్రము లభ్యసించుచు ప్రాతఃకాలము పోయిన వెనుక ప్రాతస్సంధ్యను చేయుచున్నారు. ఇదిగాక మఱియొకనిఁ గృతార్థునినైనను మతాంతరుఁడని పూజ్యునిఁగాఁదలంపరు. మఱియు వేదోక్తము లైనసత్కర్మ లైననువిడిచి, పరలోకప్రాప్తిలేమికేని భయపడరు.

తే. నభము మొదటన రవిఁ గాంచుకొనపుడ గాని
సంధ్యవార్వరు శాస్త్రానుశీలనంగనిరతి
నయిన, నన్యుని ధన్యుని కొనయినఁ గొనరు
మాధ్వులుఁఉరుపో! విధివిహితాధ్వములకె.

టి. విధివిహిత అధ్వములకె=వేదవిహిత మార్గములకె, ఉఱుపో=లక్ష్యపెట్టరుగదా!

కించ.—

వృ॥ గాయత్రీం సహసా జహద్భగవతీం యజ్ఞోపవీతం త్యజన్
ముంచన్ కించ శిఖాం విరక్తఇవ యస్సంప్రాప్తతుర్యాశ్రమః
ఆరూఢశ్చ తురంగయాన మభయో హాహంత! దేశాంతరే
ష్వర్థానా ముపసంగ్రహాయ విచరత్యేషోఽప్యమీషాంగురుః॥

అ. యః=ఎవఁడు, అమీషాం=ఈమాధ్వులయొక్క, గురుః=గురువు, విరక్త

ఇవ=వైరాగ్యము కలవాఁడువలె, సహసా=వేగముగా, భగవతీం=భగవత్స్వరూపమైన, గాయత్రీం=గాయత్రిని, జహత్=విడుచుచు, యజ్ఞోపవీతం=జందెమును, త్యజన్=విడుచుచు, కించ=మఱియు, శిఖాం=సిగను, ముంచన్=విడుచుచు,సంప్రాప్త తుర్యాశ్రమః=అవలంబింపఁబడిన చతుర్థాశ్రమమైన సన్న్యాసముగలవాఁడో, ఏషః=అట్టియితఁడు, అభయః=నిర్భయుఁడై, చతురంగయానమపి=పల్లకీనికూడ, ఆరూఢః=ఎక్కినవాఁడై, అర్థానాం=ద్రవ్యములయొక్క, ఉపసంగ్రహాయ=సంగ్రహముకొఱకు, దేశాంతరేషు=దేశాంతరములలో, విచరతి=తిరుగుచున్నాఁడు.

తా. ఈమాధ్వులగురువు విరక్తికలవానివలె సన్యాసి యైనను, గాయత్రి విడిచినదేగాక, శిఖాయజ్ఞోపవీతములను విడిచి నిర్భయుఁడై పల్లకినెక్కి ద్రవ్యసంపాదనమునకై దేశదేశములు తిరుగుచుండును, (ఇట్లు) సన్న్యసించినవాఁడుకూడ వేదవిరుద్ధాచారములును జరుపుట ఆశ్చర్యమే అయ్యో!

మఱియు.—

మంజరి. భగవతిగాయత్రిఁ జె బలుకైనఁ బలుక
రుపవీతమునఁ బోఁగు చె నొకటైన వేయ
రొకవెండ్రుకైనను జె సికయందు నునుప
రలవిరక్తులటె తుర్యాశ్రమస్థులఁట ?
ధనసమార్జనమునకును నె ల్లదిశల
కును జనుదెంతు రుక్కునఁ బల్లకీల
నెవరికిన్ వెఱవ రీయవనిలో వీరి
గురువులు నిటులుండ్రె గుటిమీఱఁ గండ్రె.

టి. తుర్యాశ్రమస్థులు = చతుర్థాశ్రమమైనసన్న్యాసమున నుండువారు,ఉక్కునన్=గర్వముతో, మీఱన్=మించిపోవునట్లుగా.

గ. అహో! మహానేష వ్యామోహో విదుషామపి కలిమాహాత్మ్యాత్ పశ్య! 248

వ. ఆహా! కలిమాహాత్మ్యముచే నీమహామోహము విద్వాం సులకును గలదు; గనుమ!

వృ॥ యస్య క్వాపి విలోకనే సవసనం స్నానం బుధైః స్మర్యతే
యస్యాన్నగ్రహణేచ నిష్కృతితయా చాంద్రాయణం చోదితం
తస్య ప్రత్యుత వాహనస్థితయతే ర్దృష్టిర్విముక్తిప్రదా
తస్యాన్నంచ సమస్తపాపహృదితి ప్రత్యేతి విద్వానపి॥ 249

అ. క్వాపి=ఎక్కడనైన, యస్య=ఎవనియొక్క, విలోకనేసతి=దర్శనముకలుగఁగా, సవసనంస్నానం=వస్త్రముతోడిస్నానము, బుధైః=పెద్దలచేత స్మర్యతే=తలంపఁబడుచున్నదో? యస్య=ఎవనియొక్క, అన్నగ్రహణేసతి=అన్నముతీసికొనుటకలుగఁగా, నిష్కృతితయా=ప్రాయశ్చిత్తనియమముతో, చాంద్రాయణం= వ్రతవిశేషము, చోదితం = విధింపఁబడినదో? ప్రత్యుత= అట్లుగాజేని, వాహనస్థితయతేః = వాహనమందున్నయతి అయిన, తస్య=అతనియొక్క, దృష్టిః=దర్శనము, విముక్తిప్రదా = మోక్షప్రదమో? తస్య అన్నంచ=అతనియన్నముకూడ, సమస్తపాపహృత్=సకలదోషహారము,ఇతి= అని, విద్వానపి = పండితుఁడుకూడ, ప్రత్యేతి=నిశ్చయించుచున్నాఁడు.

తా. యతియైనను వాహనమందుండఁగ చూచినయెడల, సచేలస్నానము చేయవలయుననియు, ఆతనియన్నము తిన్నయెడల ఆహారనియమముగల చాంద్రాయణవ్రతమను ప్రాయశ్చిత్తమును చేసికొనవలెననియు చెప్పెదరుగాని, అట్టివానిదర్శనము మోక్షప్రదమనియు అతనియన్నము సకలదోషహారమనియు విద్వాంసుఁడుకూడ నిశ్చయించుచు భ్రమపడుచున్నాఁడు.

తే. సవసనస్నానకారణం బెవనిఁ గనుట
కఠినచాంద్రాయణవ్రతకారణంబు
నెవనియన్నము దినుటను నెందు శాస్త్ర
మట్టి వెకిరింత పై నెను. [illegible]

తే. ఎక్కనక్కము గనునట్టికొయెక్కిరింత
యెక్కియును నున్న యతిఁగన్న నెనఁగుము క్తి
యన్నమును దిన్నఁ గలుషము లన్ని యణఁగు
నంచు వింద్వ్యాసుఁడును నిశ్చయించు నిచట.

టి. సవసనస్నాన=సచేలస్నానమునకు, ఎవనికి=ఏవాహనమెక్కియున్న యతిని, ఎకిరింత—ఎక్కిరింత=వాహనము, చాంద్రాయణము=ప్రాయశ్చిత్తముకై ఆహారనియతి గలవ్రతభేదము.

గ. పశ్య తావత్కలికాలనరపాలస్య గృహస్థేషు ప్రద్వేషం భిక్షుషు పక్షపాతంచ. 250

వ. చూడుము; కలికాలమనెడిక్షితిపాలునకు గృహస్థులందు ద్వేషమును భిక్షుకులందు పక్షపాతమును గలిగియుండుట.

వృ॥ భిక్షాం కష్టమటంతి కుక్షిభృతయే పాదౌ గతైః క్లేశయం
త్యాచ్ఛన్నాశ్శిథిలైః పటైశ్చ గృహిణో జీర్ణేగృహే శేరతే
రాజత్పూస్తక్ష్మపటాః ప్రశ స్తశిబికారూఢా గృహిభ్యోఽన్నదా
గ్రావవ్యూహదృఢేమఠే స్థితిభుజో ధన్యాహిసన్యాసినః॥ 251

అ. గృహిణః=గృహస్థులు, కుక్షిభృతయే=పొట్టనించుటకై, భిక్షాం=బిచ్చమునుగూర్చి, అటంతి=తిరుగుచున్నారు, కష్టం=అయ్యో! పాదౌ=కాళ్లను, గతైః=నడలతో, క్లేశయంతి=కష్టపెట్టుచున్నారు; శిథిలైః=చినిఁగిపోయిన, పటైశ్చ=బట్టలతోను, ఆచ్ఛన్నాః=కప్పఁబడినవారై, జీర్ణే=శిథిలమైన, గృహే=ఇంట, శేరతే=శయనించుచున్నారు. సన్యాసినః=సన్యాసులు, ప్రశస్తశిబికారూఢాః=ప్రఖ్యాతమైన పల్లికలనెక్కినవారై, రాజత్పూస్తక్ష్మపటాః=ప్రకాశించుసన్నవస్త్రములు గలవారై, గ్రావవ్యూహదృఢే=రాలసమూహముచేత ధృఢమైన, మఠే=మఠమందు, స్థితిజుషః=వాసముగలవారై, గృహిభ్యః=గృహస్థులకు, అన్నదాః=అన్నదానముచేయువారు, ధన్యాహి = కృతార్థులు గదా.

తా. ఇక్కడివారు గృహస్థులైనను, పొట్టనించుటకై బిచ్చమెత్తుచు అక్కడక్కడ కష్టముతోఁదిరుగుచు, చినిఁగినబట్టలుకట్టుకొని, శిథిలమైన యిండ్లలో నుందురుగాని; సన్న్యాసులు సన్నపువస్త్రములుకట్టుకొని పల్లకీల నెక్కుకొని తిరుగుచు, తాలకట్టడపు గట్టిమఠములలో నివసించుచు ధన్యులుగా నున్నారు గదా?

చ. నిరతము జీర్ణవస్త్రము లనిష్టమునన్ మొలఁ జుట్టి పొట్టకై
తిరిపము లెత్తి పాదములు తీఁపులుతియ్యుచు గండ్లయిండ్లయం
దరతిఁ బరుండుచుందురు గృహస్థులు, భిక్షులొ వారికిత్తురో
గిరములు శాల్వవల్వ దృఢగేహము వాహము దాము వాడుచున్.

టి. అనిష్టమునన్=ఇష్టములేమితో, గండ్లయిండ్లయందున్=బొందలతోడి యిండ్లలో, అరతిన్=అనిష్టముతో, వారికిన్=ఆగృహస్థులకు.

అన్యచ్చ —

వృ॥ అనభ్యస్య వేదా నహో శాస్త్రవాదా
పఠంతః స్ఫుటం యే బత తన్మతస్థాః
అధీశా ననాదృత్య తద్భృత్యపూజా
పరాణాం నరాణాం పదం తే భజంతే॥ 252

అ. యే=ఏ, ఏతన్మతస్థాః=ఈమాధ్వమతస్థులు, వేదాన్=వేదములను, అనభ్యస్య=అభ్యసింపక, అహో=ఆహా! శాస్త్రవాదాన్=శాస్త్రవివాదములను, స్ఫుటం=చక్కఁగా, పఠంతః=చదువుచుండువారు; బత=అయ్యో! తే=వారు, అధీశాన్=ప్రభువులను, అనాదృత్య=ఆదరింపక, తద్భృత్యపూజాపరాణాం=వారి పనివాండ్రయొక్క పూజయందు పట్టుగల, నరాణాం=నరులయొక్క, పదం=స్థానమును, భజంతే=భజించుచున్నారు.

తా. ఈమాధ్వులు వేదములనువిడిచి శాస్త్రములను చదువుట, ప్రభువులను విడిచి వారిపనివాండ్రను పూజించువాండ్ర పాదము లాశ్రయించుటయుఁ గలవారుగా నున్నారు.

మఱియొకటి.——

ఆ. వేదములు త్యజించి ॥ వాదశాస్త్రములు ప
ఠించి యీమతస్థు ॥ లెంచ కకట
ప్రభుల విడిచి నడచి ॥ ప్రభుభక్తులకు భక్తి
పరులనరులపదమె ॥ సరి భజింత్రు.

కించ.——

వృ॥ ఏకాదశ్యాంకాలయోర్హోమహానా
దేషామగ్నిర్లౌకికత్వం యదాగాత్
తస్మాదేషాంవ్యర్థహింసానివృత్త్యై
స్యాదుత్కృష్టః పిష్టపశ్వాదరోఽపి॥ 253

అ. ఏషాం=ఈమాధ్వులయొక్క, అగ్నిః = ఆహవనీయాదియగ్ని, ఏకాదశ్యాం=ఏకాదశిలో, కాలయోః=ప్రాతస్సాయంకాలములయందు, హోమహానాత్=హోమమునువిడుచుటచేత, లౌకికత్వం = ప్రకృతాగ్నియగుటను, యత్=ఎందువలన, ఆగాత్=పొందెనో; తస్మాత్=అందువలన, వ్యర్థహింసానివృత్త్యై=నిష్ఫలమైనహింసనువానుటకై, ఏషాం=ఈమాధ్వులకు, పిష్టపశ్వాదరోపి=మట్టిముద్దతోఁచేసిన పశురూపమందే ఆదరము కూడ, ఉత్కృష్టః=మేలైనదిగా,స్యాత్=అగును.

తా. వీరు తమత్రివిధహోమాగ్నులును నేకాదశిలో ప్రాతస్సాయంకాలములలోను విడిచిపెట్టుటచేత అవి సామాన్యాగ్నులయ్యెను. అని అందు పశువు దేవతాంగీకార్యము కాదనియు, పిష్టపశు వే చాలును అనియు ఇష్టపడిరి.

మఱియు.——

తే. ఒగిని నేకాదశినిఁగాల ॥ హోమమెడలి
యగ్నిహోత్రముప్రాకృత ॥ మైన నడలి

వ్యర్థహింసకు నొడిగట్టకకర్థివీరు
పిష్టపశువునె గొనుదు రుత్కృష్టమనుచు.

విశ్వావసు:—

గ. కిమరే కేశవభక్తిప్రకర్షదీప్రానపి విప్రానదూషయసి శుద్ధా
కిల మధ్వసిద్ధాంతనిష్ఠానామియంహృదయంజరీహరీతిరీతిః. 254

వ. ఏమిరా? రమేశవిషయభక్త్యతిశయదీప్రుల విప్రులన్ దూ
తెదవు? పరిశుద్ధులైనయీమధ్వసిద్ధాంతులక్రమము హృద
యంగమము గదా.

వృ॥ ఆబాలస్థవిరం స్థిరం హరిదినే శుద్ధోపవాసవ్రతం
నిష్ప్రత్యూహ మహర్దివం విజయతే నారాయణారాధనం
శ్లాఘ్యాభాగవతేషుభక్తి రధికా శ్రద్ధాచ యేషాందృఢా
శాస్త్రేస్వీయగురూదితేనచరితంసాధ్వేషుమాధ్వేషుకిం॥ 255

అ. యేషాం = ఏమాధ్వులకు, ఆబాలస్థవిరం = బాలురు మొదలుకొని వృద్ధులపర్యంతము, హరిదినే=ఏకాదశియందు, స్థిరం=దృఢముగా, శుద్ధోపవాసవ్రతం=శుద్ధమైనఉపవాసముతోడివ్రతము; అహర్దివం=ప్రతిదినమును, నిష్ప్రత్యూహం=నిర్విఘ్నముగా నారాయణారాధనం=నారాయణార్చనమును; భాగవతేషు=భగవద్భక్తులందు, శ్లాఘ్యా=కొనియాడతగిన, భక్తిః=భక్తియు; స్వీయగురూదితే= తమగురువుచేత చెప్పఁబడిన, శాస్త్రే = శాస్త్రమందు, దృఢా=దృఢమై, అధికా = అధికమైన, శ్రద్ధాచ=హట్టుదలయును; విజయతే=ప్రబలపడుచున్నది. ఏషు=ఇట్టి, మాధ్వేషు=మాధ్వులయందు, సాధు=నిర్మలమైన, చరితం=చరిత్రము, నకిం=లేదా ?

తా. ఈమాధ్వులయందు ఏకాదశీదినమున బాలవృద్ధులతో శుద్ధోపవాసమును, దినదినము నిరాటంకముగా నారాయణార్చనమును, భగవద్భక్తులవిషయములో భక్తియును, గురువాక్యములందు శ్రద్ధయు,నుండుటచే వీరినడవడి మంచిదేకదా?

సీ. ఆబాలముపవృద్ధమై మాహారిదినములఁ
బరిశుద్ధముపవాసవ్రతము నుండ్రు
ప్రత్యహమును నొకప్రత్యూహమును లేక
నారాయణారాధనము నొనర్తురి
తమభాగధేయమంచు మహానుభావుల
భాగవతుల నతిభక్తిఁ గొల్తురి
తమగురువులయొద్దఁ దమిఁ జదివెడిశాస్త్ర
ములయందు శ్రద్ధ మిక్కిలి ఘటింత్రు

ఆ. కనుక నీఁకను నేది కావింప నింపకా
నుండనట్టి దదియొకండునుండ
దాఱిఱిచూడ నమ్మాధ్వులందును
వారిఁబోనివారి నేరిఁజూడ.

టి. ప్రత్యూహము=ఆటంకము, భాగధేయము=భాగ్యము, ఇంపకాన్ = ఇంపేగా.

గ. ఏతద్గురూణాం పునర్యతీనా మేషా మాకలితదోషవైధుర్యా
ఏషాశుభచర్యా. 256

వ. మఱియు పేరిగురువులైనయతివరులయు చరితము విదూరవి
ధురదురితమై యున్నయది.

టి. విదూరవిధురదురితము=చాలాదూరము తొలఁగిపోయినదోషములు గలది, వైధుర్యము=అభావము.

వృ॥ దనుజభిదభిషేకైస్తత్పురాణావలోకైః
పునరపహతిమోహైః పుణ్యతీర్థావగాహైః
భవకథనవిదూరైర్బ్రహ్మవిద్యావిచారైః
[illegible] 257

అ. దనుజభిత్ +అభిషేకైః=రాక్షససంహారకుఁడైన హరియొక్క+అభిషేకములతోను, తత్పురాణ+అవలోకైః=అతనిపురాణములైనభాగవతాదులు చూచుటలతోను, పునః+అపగతమోహైః= మఱిమఱి+తొలఁగిపోయిన అజ్ఞానములతోను, పుణ్యతీర్థ+అవగాహైః=పుణ్యతీర్థముల+స్నానములతోను, భవకథనవిదూరైః=సంసారవార్తలకుదూరమైన, బ్రహ్మవిద్యావిచారైః = వేదాంత విద్యావిచారములతోను, ఏతే=ఈ, యతివర్యాః=యతిశ్రేష్ఠులు, కాలం=యావజ్జీవకాలమునుక్షణమివ=నిమిషకాలమువలె,నయంతి= కడపుచున్నారు.

తా. ఈమాధ్వగురువులు భగవంతుని కభిషేకముచేయుచు, భాగవతాదులుచదువుచు, తమయజ్ఞానములను పోఁగొట్టుకొనుచు, పుణ్యతీర్థస్నానములు చేయుచు, సంసారమనువార్తయే మానివేదాంతశాస్త్రములను విచారించుకొనుచు, తమయావజ్జీవకాలమునుక్షణమునువలెఁ గడపుకొనుచుందురు.

మ. అనఘుల్తీర్థపవిత్రగాత్రు లయి ముఖ్యబ్రహ్మవిద్యావిచ
క్షణులై చక్రికి భక్తియుక్తముగ నిచ్చల్తామెయర్పింత్రుమ
జ్జనముల్తత్ప్రతిపాదకంబులె మహాశ్రద్ధఁ బురాణంబులుఁ
గనుచుం బ్రెప్పుడుఁ బాపమొప్పరువినంగా నైననయ్యాయ
[తుల్.

టి. అనఘుల్ = పాపరహితులు, నిచ్చలు=ఎప్పుడును, అయ్యాయతుల్= ఆయాయతులు

గ.యదపి తదుపరి త్వయాదూషణ ముపన్యస్తంతదపిమదపి హిత
హృదయేభ్యోభవాదృశేభ్యఏవరోచతేనతుగుణగ్రాహిభ్యః.258

అ. యదపి=ఏదియైనను, తదుపరి=వారిమీఁద, త్వయా=నీచేత, దూషణం=నిందించుట, ఉపన్యస్తం=ఉపన్యసింపఁబడినదో, తదపి=అదియు, మదపిహితహృదయేభ్యః = అజ్ఞానముచేత కప్పఁబడినమనస్సుగల, భవాదృశేభ్యః ఏవ=నీవంటివారికే, రోచతే=ఇష్టమగుచున్నది. గుణగ్రాహిభ్యః=గుణముగ్రహించువారికి, నతురోచతే=ఇష్టముకాదు.

వ. ఏది వారిమీఁది నీదూషణ ముపన్యసింపఁబడినదో, ఆయది యు సమదహృదయు లైననీయట్టివారికే కాక, గుణగ్రహణ కారులకు రుచించునదియ కాదు.

వృ॥ తత్తద్దేశనివాసి శిష్యనివహత్రాణాయ గుర్వాజ్ఞయా
సంచారాక్షమ ఏష విందతి యతిశ్చేద్వాహనం కాక్షతిః
దత్తం విత్త మశేష మాస్తికజనై ర్దైత్యారి నిత్యార్చనా
సాత్కృత్య స్వయమస్పృశ న్వసతిచేన్నిందాస్తికిం తావతా॥

అ. తత్తత్ ...త్రాణాయ=ఆయాదేశములందు నివసించు శిష్యసమూహము యొక్క రక్షణమునకై, గుర్వాజ్ఞయా=గురువునాజ్ఞచేత, సంచారాక్షమః= సంచరించుటందు అశక్తుఁడైన, ఏషయతిః = ఈమాధ్వగురువు, వాహనం = వాహనమును, విందతిచేత్=గ్రహించుచున్నాఁడేని, కాక్షతిః = ఏమిహాని ; ఆస్తికజనైః=ఆస్తిగలవారిచేత, దత్తం=ఈయఁబడిన, అశేషం = సకలమైన, విత్తం=ధనమును, దైత్యారి...సాత్కృత్య=విష్ణువుయొక్క దినదినారాధనకై సత్కరించి, స్వయం=తాను, అస్పృశన్=తాఁకక, వసతిచేత్ = ఉన్నాఁడేని, తావతా=దానిచేత, నిందా=దూషణము, అస్తికిం=ఉన్నదా ?

తా. సన్న్యాసియైన ఈమాధ్వగురువు తిరుగ శక్తిలేక గురువునాజ్ఞగొని, శిష్యుల నుపదేశాదులచే ననుగ్రహించుటకై దేశాలు తిరుగ పల్లకినెక్కుకొనుట యేమితప్పు ? ఆస్తి గలశిష్యులు హరియారాధనకై యిచ్చినధనమును తాను తాఁకకుండుటవలన నింద యేమి ?

శా. ఆయాదేశనివేశశిష్యతతిరక్షార్థంబు గుర్వాజ్ఞచే
వేమే తేర నశక్తులై యతివరుల్ వృద్ధత్వమం దెప్పుడే
నాయీయానెక్కుడు నెక్కుడుర్ గొదువయేమర్థింపకర్థంబుదై
తేయారాతిసమర్చనార్థ మొసఁగంబేదియం గొఱంతేమియో!

టీ. వేగ, ఎక్కుడుర్=వాహనమును, ఎక్కుడుర్=ఎక్కఁగానే, దైతేయారాతి=విష్ణువుయొక్క.

కృశానుః.—

వృ॥ స్వామిని వినియుక్తానాం
స్వత్వే నానధ్యవస్యతాం యతినా।
క్వత్యం యత్యన్నత్వం
ప్రత్యవయాం త్యత్ర తద్భుజశ్చ కుతః? 260

అ. స్వత్వేన=తనదిగా, అనధ్యవస్యతాం=నిశ్చయింపనివై, స్వామిని=స్వామివిషయమున, యతినా=యతియైన గురువుచేత, వినియుక్తానాం=ఉపయోగింపఁబడిన వైనవానికి, యత్యన్నత్వం=యతియన్న మగుట, క్వత్యం=ఎక్కడిది? తద్భుజశ్చ = దానిభుజించువారును, కుతః=ఎట్లు, అత్ర = ఇక్కడ, ప్రత్యవయంతి=కాపాడుకొనుచున్నారు?

.తా. ఈ మాధ్వయతులు స్వామికి వినియోగపఱచినయన్నాదులు యతియన్నమగుట యెట్లు? దాని భుజించువారును అపవిత్రులవుట యెట్లు?

మఱియు.—

తే. తనదియంచు నధ్యవసించుకొదానిన కద?
స్వామికి వినియోగించున కొ దా; మఱెట్టి
యన్నమది యతియది యని కొ యెన్న నొఁగ
దా? మదె యుపయోగింతు రే కొ రై ననమ్మి.

టి. అధ్యవసించుదానిన=నిశ్చయింపఁబడుదానిసే, వినియోగించునది=ఉపయోగపఱుపపలసినది.

గ॥ ఏతేన మతాంతరస్థా అపి మతాధిపతయో యతయో వ్యాఖ్యాతాః। 261
ఇదం చాపథేయమ్॥

వ. ఇందువలన మతాంతరస్థులైనమతాధిపతులును దోషదూషితులు గ్గారెరి.

ఇదియు నవధానమున వినునదియ.

వృ॥ యది కతిపయే జాత్వాలస్యా ద్యథాసమయం ద్విజాః
బత నతినుయుస్సంధ్యో్యపా స్తిం భవిష్యతి కిం తతః ।
నిగమచరితా నంగీకారో౽హి దూషణ మంగినా
మశకనవశాద్దోషాయైషాం నజాత్వననుష్ఠితిః॥ 262

అ. కతిపయే=కొందఱు, ద్విజాః=మాధ్వబ్రాహ్మణులు, ఆలస్యాత్=మందబుద్ధిచేత, యథాసమయం=కాలముతప్పక, సంధ్యోపాస్తిం=సంధ్యోపాసనమును, జాతు=ఒకప్పుడైనను, నతనుయుః యది=చేయరేని, బత=అయ్యో! తతః=దానివలన, కిం భవిష్యతి=ఏమి కాఁగలదు? అంగినాం=మనుష్యులకు, నిగమచరితానం గీకారః=వేదవృత్తాంతముల నంగీకరింపకపోవుట, దూషణం హి=నిందకదా? అశకనవశాత్=అశక్తివశముగ, అననుష్ఠితిః=అనుష్ఠింపకపోవుట, ఏషాం=వీరికి, దోషాయ=దోషముకొఱకు, నజాతు=ఒకప్పుడును కాదు.

తా. ఈమాధ్వబ్రాహ్మణులు కాలము తప్పక సంధ్యోపాసనమును, వేదాధ్యయనమును చేయకపోవుట నింద్యమే యైనను, వారివారి శక్తిహీనతవల్ల వారువారు చేయకపోవుటచే వారిని నిందింపరాదు.

ఆ. కొంద ఱం దశక్తిని నిం దఱి దప్పక
యున్నకర్మ చేయకున్నఁ గొదువ
యేమి? స్మార్తశ్రౌతకర్మకర్మయే గాని
కొనకయునికి దోషమునకయునికి?

కించ.—

శ్లో॥ "పంథాన మనురుంధానః
పిత్రా దే రైనదుష్యతి"
ఇతిస్మృతి మధీయానై
రేషాందోషో హి దుర్వచః॥ 263

అ. పిత్రాదేః=పితృపితామహప్రభృతులయొక్క, పంథానం=మార్గమును, అనురుంధానః=అనుసరించువాఁడు, నదుష్యత్యేవ=దూషింపఁ బడనే పడఁడు. ఇతి=అని, స్మృతిం=స్మృతిని, అధీయానైః=అధ్యయనించువారిచేత, ఏషాం=వీరియొక్క, దోషః=దోషము, దుర్వచోహి=వచియింపఁగూడనిది కదా?

తా. "అవశ్యం పితురాచారో గ్రాహ్యస్సర్వైః కులాగతః" అను స్మృతిని దెలిసినవారు తమపితృపితామహులవంశాచారములను వదలనివారు ఈమాధ్వబ్రాహ్మణులవంశానుగత మైనయేకాదశీ హోమహోనాదిని దోషము గాఁజెప్పఁ దలంపరు.

మఱియు.—

క. పిత్రాచారము చేకొని
స్తోత్రార్హుం డగునతండు ♣ దూషణమునకున్
బాత్రుఁడుకాఁ డన, వీరును
బిత్రాచారము కొనిరనుపేక్షనపేక్షన్.

టి. అనుపేక్షన్=అశ్రద్ధచేయమియందు, అపేక్షన్=అభిలాషతో.

గ॥ ఇతి విమానం దూరత స్సమానయన్ పరితో దృష్ట్వా॥ 264

వ. అని విమానమును దూరమున సమానయించుకొంచుఁ గలయఁ గనుంగొని.

వృ॥ భాషావేషాచారై
ర్భూషాభిః పూరుషాశ్చ యోషాశ్చ।
వీక్షస్వ ప్రతిదేశం
విలక్షణా ఏవ హంత! లక్ష్యంతే॥ 265

అ. ప్రతిదేశం=దేశదేశమందును, భాషావేషాచారైః = భాషల వేషముల ఆచారములచేతను, భూషాదిభిః = ఆభరణములచేతను, విలక్షణాః = వేఱువేఱైన, పూరుషాశ్చ=పురుషులును, యోషాశ్చ = స్త్రీలును, లక్ష్యంతఏవ=కనఁబడుచున్నేయున్నారు! హంత=ఆహా! వీక్షస్వ=చూడుము!

తా. అక్కడక్కడి స్త్రీపురుషులు భాషచేతఁ గాని, వేషముచేతఁ గాని, ఆచారముచేతఁగాని, భూషణములచేతఁగాని, వేఱువేఱుగా కనఁబడుచున్నారు. చూడు.

క. వేషవిశేషాచారవి
శేషవిభూషావిశేషశేముషి భాషా
శేషవిశేషములఁ బురుష
యోషలును విచక్షణుల్స సముద్వీక్షింపన్.

టి. వేష...శేముషిన్ = వేషాదులయొక్క—బుద్ధియందును, భాషాశేష విశేషములన్ = భాషలయొక్క అశేషములైన విశేషములందును, సముద్వీక్షింపన్=చక్కఁగా చూడఁగా, విచక్షణులు=నేర్పరులు, సముద్వీక్షింపన్ = చూడఁగా.

కృశానుః.—

గ॥ సఖే! వీక్షస్వేతి మావోచః! కింతుసత్వరమతిక్రామ! కీశకల్పజనా నిమాన్ జగపదాన్॥ 266

అ. సఖే = స్నేహితుఁడా, వీక్షస్వేతి = చూడుమని, మా+అవోచః = చెప్పకుము. కింతు = మఱియు, సత్వరం = శీఘ్రముగా, కీశకల్పజనాన్ = వానరప్రాయులైనజనులు గల, ఇమాన్ జనపదాన్ = ఈదేశములను, అతిక్రామ=దాఁటిపోవుదము.

కృశానుఁడు.—

వ. వయస్యా! ఉద్వీక్షింపకు మనకు. మఱి ఈక్రోఁతులవలె జనులుఁ గలజనపదములను త్వరగా విడిచి, కడచిరా!

వృ॥ చంద్రాలోకచయాంధకారభరయోశ్చాంపేయకింపాకయోః
రాజత్కుండలిరాజరాజిలకయో రాజీవధత్తూరయోః।
ఖేః కోకిలలోకకాకకులయోః క్షీరార్ణవాంధోర్వరివ

వ్యక్తం పండితమూర్ఖయో స్సమదృశో వ్రాత్యా ఇహాత్యా
అమీ॥ 267

అ. చంద్రాలోకచయ-అంధకారభరయోః=వెన్నెలసమూహమునకు అంధకారసమూహమునకును, చాంపేయ-కింపాకయోః=సంపంగెలకు ముష్టిచెట్లకును, రాజత్కుండలిరాజ-రాజిలకయోః=ప్రకాశించెడుసర్పరాజునకు తుచ్ఛసర్పమునకును, రాజీవ-ధత్తూరయోః=తామరకు=ఉమ్మెత్తకును, ఖేలత్కోకిలలోక-కాకకులయోః=ఆడుచుండెడు కోకిలసమూహమునకు కాకులసమూహమునకును, క్షీరార్ణవ-అంధ్వో-రివ=పాలసముద్రమునకు నూతికిని వలె,పండితమూర్ఖయోః=పండితులకు మూర్ఖులకును, ఇహాత్యాః=ఇక్కడివారైన, అమీవ్రాత్యాః=ఈ యవివేకులు, సమదృశః=సాటిని జూచువారు. వ్యక్తం=ఇది స్పష్టము.

తా. ఇక్కడియవివేకులు చీఁకటితో వెన్నెలకును, ముష్టిచెట్లతో సంపెఁగచెట్లకును, నీచుత్రాఁచుతో సర్పరాజుకును, ఉమ్మెత్తతో తామరకును, కాకులతో కోకిలలకును, బావితో పాలసముద్రమునకునువలె, మూర్ఖులతో పండితులకును సాటి చూచువారుగా నుండుట స్పష్టము.

సీ. శారదచంద్రునిచంద్రికకై వడిఁ
గటికచీఁకటిగమి గాంచినట్లు
ఇంపుగ సొంపగుసంపెఁగకై వడిఁ
గ్రించుముష్టిని సమీక్షించినట్లు
బిలశాయికులభూషుఁ డలశేషుకై వశి
నీచును ద్రాఁచును జూచినట్లు
పరిమళసద్మంబు పద్మంబుకై వడి
గత్తునుమ్మెత్తను గన్నయట్లు
తే. కోకిలకులముపోలికఁ గాకికులము
కలశవారాశిపోలికిఁ గెలిచి గోలు

దలఁచినట్లు మూర్ఖులఁ బండితులనువలెనె
తలఁతు రవివేకు లకట ! యీస్థలమువారు.

టీ. శారద=శరత్కాలసంబంధమైన, క్రించు=నీచమైన, బిలశాయి=సర్ప ములయొక్క, నీచును=నీచమైన, సద్మంబు=గృహమైన, కలశవారాశి=పాలసం ద్రముయొక్క, కెలని=ప్రక్కలోని.

విశ్వావసుః.—

గ॥ ఓమిత్యగ్రే విమానముపానయన్ సానందంసాంజలిబంధంచ

అ. ఉపానయన్=కొనివచ్చుచు, స+ఆనందం=ఆనందముతో.

విశ్వావసువు.—

వ. అంగీకారసూచన మయినయోంకార సువచనము నచియించి యెదురఁ దమవిమానమును మఱలించుకొనుచు నానం దముతో, అంజలిబంధముతోను.

## వేంకటాచల వర్ణనము.

(శేషశైలము = శేషాచలము. ఈతిరుపతిపర్వతము.—వేం+కటపతి =అని అనేకదోషములను పరిత్యజించునది అనువ్యుత్పత్త్యర్థముచేత ఈ కలియుగ మున వేంకటాచలమనియు ; వృషభాసురుఁడు విష్ణువునుగూర్చి తపస్సు చేసి, అతనితో యుద్ధము కోరి, చక్రాయుధముచే వధింపఁబడి, వైకుంఠమును పొంది నందున ఈ కలియుగమున వృషాచలమనియు ; అంజనాదేవి పుత్రార్థమై తప స్సుచేసి, ప్రత్యక్షమైన ఆ వేంకటేశ్వరునివలన హనుమానుని సంతానముగ ల భించినందున త్రేతాయుగమున అంజనాచలమనియు ; ఆదిశేషుఁడు ద్వారపా లకుఁడుగ నుండి వాయుదేవుని అడ్డగించుటచే, అతఁ డతికోపములో వీచివీచి ఆపర్వతమునుకూడ ఎగురఁగొట్టఁగా, ఇతఁ డాపర్వతమును చుట్టుకొని కాపా డుకొనుచున్నందున ద్వాపరయుగమున శేషాచలమనియు ; ప్రఖ్యాతమై యుండునది.)

వృ॥ సురభితమ తమాలస్తోమపుష్యద్రసాల
ప్రకరతిలక సాల ప్రష్ఠసుష్ఠుద్రుజాలః।
శ్రితసమవనశీల శ్రీశలీలానుకూల
శ్శిథిలితభవమూల స్సేవ్యతాం శేషశైలః॥ 269

అ. సురభితమ-తమాల-స్తోమ-పుష్యత్-రసాల-ప్రకర-తిలక-సాల-ప్రష్ఠ-సుష్ఠు-ద్రు-జాలః = అతిపరిమళముగల -కానుగలసమూహమును- పెరుగుచున్న-తీయమామిళ్లసమూహమును - ఏపెలు మొదలు - శ్రేష్ఠములైన-మంచి-చెట్ల-సమూహమును కలదియు, శ్రిత-సమవన-శీలః = ఆశ్రితులను-సంరక్షించుటే-స్వభావముగాఁ గలదియు, శ్రీశ-లీలా-అనుకూలః = శ్రీనివాసునియొక్క-విలాసములకు-తగినదియు, శిథిలిత-భవ-మూలః=విచ్ఛిన్నము చేయఁబడిన సంసారములయు-లేక పాపములయు-కారణములుగలదియునైన, శేషశైలః= ఈ శేషాచలము-వేంకటాచలము, సేవ్యతాం= సేవింపఁబడునుగాక.

తా. కానుగులు, మామిడులు మొదలైన మేలివృక్షముల సమూహములతోను, ఆశ్రితులను సంరక్షించుటయందలి స్వభావముతోను గూడి, సకలదోషముల కారణములను పరిహరించుచు, శ్రీశ్రీనివాసునిలీలల కనుకూల మైనయీశేష శైలము సేవించుమా.

చ. సురభిరసాలసాలముల శోభితబాలతమాలశాలలన్
నిరతము శ్రీనివాసపదనీరజరేణులు సోఁకి శోకమూ
లరహిత మైనసానువుల రమ్యతరం బయి సంశ్రితావనం
బరయన, శేషశైల మిదె యద్భుతశీలము సేవ యవ్వెడిన్.

టి. నీరజరేణులు = తామరపుప్పొడులు, సానువులన్ = చరియలతోడ, అరయన్+అ=కనిపెట్టఁగానె, అద్భుతశీలము=ఆశ్చర్యస్వభావము గలది.

పున స్సహార్షమ్ —

వృ॥ పన్నగేషుచ నగేషు ఖగేషు
ద్విపి... ... ...

వల్లరీషుచ దరీషు ఝురీషు
ప్రార్థయంతి జని మత్ర మునీంద్రాః॥ 270

అ. అత్ర=ఇక్కడ, మునీంద్రాః=మునిశ్రేష్ఠులు, పన్నగేషుచ = సర్పములలోఁగాని, నగేషు=కొండలలోఁగాని, ఖగేషు = పక్షులలోఁగాని, ద్వీపిరాజిషు=పులులలోఁగాని, పృషత్సు = నక్కలలోఁగాని, దృషత్సు=ఱాలలోఁగాని, వల్లరీషుచ=తీఁగలలోఁగాని, దరీషు=గుహాలలోఁగాని, ఝురీషు = వెల్లువలలోఁగాని, జనిమ్=జన్మమును, ప్రార్థయంతి=వేఁడుకొనుచున్నారు.

తా. అన్యదేశవాసు లైనమునీశ్వరులు కూడ ఈతిరుపతియందు మృగపశుపక్షివృక్షపాషాణాపగాలతాదులయం దేదానియందైనను జన్మము కలిగినఁ జాలునని కోరుచున్నారు.

మఱల సంతోషముతో.—

ఆ. పరఁగఁ బ్లవగపతగకీపన్నగనగముల
వల్లరీ దరీ స్ఫురల్లహరుల
మౌనిజనుల జనులకేమేని నేమేనిని
గోరికొందు రిందు కెశౌరిఁ గోరి.

టి. స్ఫురల్లహరులన్ = విజృంభించెడిప్రవాహములలో నైనను, మౌనిజనులు+అ=మునిజనులే, జనులన్=జన్మములయందు, ఏమేనిని = ఏమిరైనను.

గ. అహోమహోన్నతాఖల్వస్య శైలస్యధన్యతా? యతః. 271

వ. ఆహా ! మహాసమున్నతక దా ! ఈమహీధరముధన్యత, ఏల యనఁగా.

శ్రీ వేంకటేశ్వర వర్ణనము.

(వేంకటేశ్వరులు—వీరు - తిరువేంగడముడయాన్ అని, శ్రీనివాసప్పెరుమాళ్లుఅనియు అలర్మేల్మంగైత్తాయారుతో స్వామిపుష్కరిణీతీరమున ఆనందనిలయవిమానమందు వ్యూహలక్ష్మీ వీరలక్ష్మీ పద్మావతీ సహితుఁడు నై తొండమాన్

చక్రవర్తికిని కుమారస్వామికిని ప్రత్యక్షమై తొండరడిప్పొడి మధురకవియాళ్వార్లు తక్క తక్కినయెనమండ్రుగు రాళ్వార్లయొక్కయు అండాళుయొక్కయు మంగళాశాసనములతో వేంచేసియున్నవారు.)

శ్లో॥ వైకుంఠేపి నిరుత్కంఠ మకుంఠవిభవం మహః।
తదత్ర చిత్రచారిత్రం రమతే రమయాసమమ్॥ 272

అ. అకుంఠవిభవం=నిరాటంక మైనవైభవము కలదియు, చిత్రచారిత్రం=విచిత్రమైనచరిత్రము గలదియునైన, తత్ మహః=ఆతేజము, వైకుంఠేపి=పరమపదములోను, నిరుత్కంఠం=ఉత్సాహము లేనిదియై, అత్ర=ఈశేషశైలమునందు, రమయాసమం=లక్ష్మీదేవితోఁగూడ, రమతే=ఆనందమునఁ గ్రీడించుచున్నది.

తా. ఆటంకము లేక, మహావైభవము గలిగి తేజోరూప మైన శ్రీనివాసమూర్తి ఆపరమపదమందును ఉత్సాహము విడిచి ఈశేషాద్రియందు విచిత్రచరిత్రములతో అలమేల్మంగనాచ్చియారుతోఁగూడ క్రీడించుచున్నయతఁడు.

క. కుంఠం బెత్తి వచింతు న
కుంఠం బగువిభవ మెపుడుఁ గొాలఁగ నిట వై
కుంఠంబున నునికి నిరు
త్కంఠం బయి మహము రమయుఁ గూడఁగ రమ్యం బై.

టి. కొాలఁగన్=ప్రకాశించుచుండఁగా,నిరుత్కంఠంబయి=ఆశలేనిదయి, మహము=తేజోరూప మైనదైవమును, రమయుక్=లక్ష్మియును.

వైకుంఠము—ఇది ఊర్ధ్వలోకము లేడింటికిని పైన విరజాతీరమున "కుంఠో నాస్తీతి వైకుంఠః" అని పరిణామాదిరహితమై అనశ్వర మైనయాత్రిపాద్విభూతియందు నిరతిశయానందసుఖావహుఁడై పంచోపనిషన్మయవిగ్రహుఁడై శ్రీభూనీళాదేవీసహితుం డైనశ్రీమన్నారాయణుఁడు అనంత గరుడ విష్వక్సేనాది నిత్యసూరి ముక్తపరివారములతోఁ గూడ పరత్వమున వాసముచేయుచుండు పరమపదము.

వృ॥ వివిధనిగమసారే విశ్వరక్షైకధీరే
వృషశిఖరి విహారే వక్షసాఽఽశ్లిష్టదారే
భగవతి యదువీరే భక్తబుద్ధే రదూరే
భవతు చిర ముదారే భావనా నిర్వికారే॥ 273

అ. వివిధనిగమసారే=అనేకవిధము లైనవేదములకు సారాంశమును, విశ్వరక్షా+ఏకధీరే=లోకరక్షణమందు ముఖ్యమైన ధైర్యముకలవాఁడును, ఉదారే=మహోదారుఁడును, నిర్వికారే=వికారములేమియు లేనివాఁడును, భక్తబుద్ధేః అదూరే=భక్తులయొక్క బుద్ధికిని దూరము కానివాఁడును, వృషశిఖరివిహారే=ఈ వృషశైలమందు క్రీడించువాఁడును, వక్షసా ఆశ్లిష్టదారే=వక్షస్థలముతో కౌఁగలింపఁబడినభార్య యైనలక్ష్మీదేవిని గలవాఁడునైన, యదువీరే=శ్రీకృష్ణమూర్తి యయినయీ శ్రీనివాసమూర్తి యగు, భగవతి=భగవంతునియందు, భావనా=నాధ్యానము, చిరం=సర్వదా, భవతు=కలుగుచుండునుగాక.

తా. వేదవేదాంతములందు ప్రతిపాదింపఁబడుచు, సర్వలోకసంరక్షకుఁడై భక్తులందె యాసక్తుఁడై, వికారములు లేక ఔదార్యముకలవాఁడై, వక్షస్థలమున లక్ష్మితోఁ గూడి, ఈతిరుపతులయందలి శ్రీనివాసమూర్తి యగునాభగవంతుని సర్వదా ధ్యానముచేయుచున్నాను.

ఉ. సారెఁ దలంతు నెంతు శ్రుతిసార వృషాద్రివిహార ! విశ్వర
క్షారతిధీర! వక్షమునసంశ్రితదార ! యుదార ! యాశ్రితా
దూర ! వికారదూర ! యదుధూర్వహవీర! యపారసద్గుణా
ధార ! సదాసుధాంధసులధారకపోషకపాదపాథ ! నిన్.

టి. విశ్వరక్షారతిధీర = లోకరక్షణమందాసక్తితోఁ గూడినధీరుఁడా! సదాసుధాంధసులధారకపోషకపాదపాథ = ఎల్లప్పుడును దేవతలకు ధారకమును పోషకము నైనపాదతీర్థము (ఆకాశగంగ) కలవాఁడా!

వృషగిరి=వృషాద్రి—268 వృత్తముమీద చూడు!

గ॥ ఇతి సానందం ధ్యాయతి॥ 274

వ. అని యానందముతో ధ్యానము చేయుచున్నాఁడు.

కృశానుః.—

గ॥ హంత ! వ్యపేత విషయాంతరవ్యాసంగం త్వదం తరంగం
దేవ ఏవాస్మి న్ననుభవతి దృఢసంగమ్॥ 275

అ. హంత=అయ్యో ! వ్యపేతవిషయాంతరవ్యాసంగం=తొలఁగిపోయిన విషయాంతరములయందలిసంసర్గము గల, త్వదంతరంగం=నీమనస్సు, అస్మిన్ దేవే ఏవ=ఈదేవునియందే, దృఢసంగం = దృఢమైనభావనను, అనుభవతి = అనుభవించుచున్నది.

కృశానువు.—

వ. అయ్యో ! అన్యా విషయముల విడిచి నీభావ మీదేవవిష
యమునసే భావనానుభవవిభమున నున్నయది.

విశ్వావసుః.—

గ॥ సఖే ! సత్యమేన విదితంభవతా॥ 276

వ. సఖా ! సత్యమే నీవు తెలిసికొంటివి.

వృ॥ దధతీ చిరాయ సుదతీ మురఃస్థలే
తదతీతసీమ దదతీసుఖం సతామ్
రసికస్య చిత్తమిహ కస్య దేవతా
ప్రతిపన్న పన్నగనగా నగాహతే॥ 277

అ. ఉరఃస్థలే=ఱొమ్మున, సుదతీం = స్త్రీని, దధతీ = ధరించునదియై, అతీతసీమ=అతిక్రమించిన అంతిమస్థానము గలదియగు, తత్ సుఖం = ఆయానందమును, సతాం=సత్పురుషులకు, దదతీ=ఇచ్చునదై, చిరాయ=చిరకాలము నుండి, ప్రతిపన్న-పన్నగనగా=చేరిన-శేషశైలము కలదైన, దేవతా=దైవము, కస్యరసికస్య=ఏబ్రహ్మరసజ్ఞానికి, చిత్తం=మనస్సును, ఇహ = ఇక్కడ, నగాహతే=చేరదు.

తా. వక్షఃస్థలమున లక్ష్మిఁగలిగి, సత్పురుషులకు అత్యంతసుఖము నిచ్చుచుండు నిక్కడిదైవము ఎట్టిబ్రహ్మజ్ఞానికైనను చిత్తమునఁ జేరకపోదు.

ఆ. ఉరమునందఁ దెఱవ కనిరవొంద ధరియించి
నిరవధికము సుఖము నిరత మొసఁగ
నురగధరగమగుచుఁ బరఁగుపరమదైవ
మెరసికునిమనసు కెక్కఁ డిందు.

టి. నిరవధికము=మితి లేని, ఉరగధరగము = శేషాద్రియందు ఉండునది.

కృశానుః.—

గ॥ కిమరే? కేవల మర్థపర మముం దేవ మనుసంధత్సే॥ 278

కృశానువు.—

వ. ఏమిరా? (యథార్థముగ హిరణ్యాహరణుఁడు కనుక) ఇప్పుడు ను కేవల మర్థపరాయణుఁడై యయినయీదైవము నను సంధానము చేయుచున్నావు.

వృ॥ ఇష్టప్రాప్తి మనిష్టభంగ మపివా సంప్రార్థ్య భక్త్యాజనై
ర్యద్దాతవ్యమితి ప్రతిశ్రుత మభూ ద్ద్రవ్యం తదాప్తేఫలే
తేదాస్యంతి నచేత్స్వయం భయమసావుత్పాద్య తేషాంపునః
కృత్స్నంసార్థహిరణ్యహృత్ప్రద ఇదం గృహ్ణాతి వృద్ధ్యాసమమ్॥

అ. ఇష్టప్రాప్తిం=ఇష్టసిద్ధియును, అనిష్టభంగమపివా = అనిష్టము సిద్ధింపమియును, సంప్రార్థ్య=కోరి, జనైః=జనులచేత, యత్ = ఏది, భక్త్యా = భక్తితో, దాతవ్యమితి = ఇయ్యఁదగినదియని, ప్రతిశ్రుతం = వినఁబడినది, అభూత్=ఐనదో, ఫలే=దానిఫలము, ఆప్తే = ప్రాప్తింపఁగా, తద్ద్రవ్యం = ఆద్రవ్యము, తే=వారు, నదాస్యంతిచేత్=ఇయ్యనివారైరేని, స్వయం=తానే, అసౌ=ఈవేంకటేశ్వరుఁడు, తేషాం=వారికి, భయం=భయమును, ఉత్పాద్య= పుట్టించి, పునః=మఱల, సారహిరణ్యహృత్ప్రదః = యథార్థముగ ధనమును

తీసికొనువాఁడు - హిరణ్యకశిపుని సంహరించినవాఁడు అను సంజ్ఞాశబ్దము కల వాఁడై, ఇదం=ఈచెప్పిన ద్రవ్యమును, కృత్స్నం=పూర్ణముగ, వృద్ధ్యాసమం= వడ్డితోఁ గూడ, గృహ్ణాతి=తీసికొనుచున్నాఁడు.

తా. ఇష్టముకలిగి, అనిష్టముకలుగకుండవలెనని భక్తితో వేఁడుకొని లోకులు ఇచ్చెదమని నియమించుకొన్న ద్రవ్యము వారికి ఆయాఫలము ప్రాప్తింపఁగానే, వా రాధనము నియ్యనియెడల వారికి భయము కలిగించి,తనహిరణ్యాహారి యను పేరు తోఁచునట్లుగా, వారిధనమును కొఱవడకుండ వడ్డితోఁ గూడ తీసికొను చున్నాఁడు.

మ. తమయిష్టంబులు కల్గుకై మఱి యనిష్టంబుల్ నివర్తించుకై
తమిఁ బ్రార్థించి జనుల్ తదన్యతరమొందం దోసవిత్తమ్ము
ని । త్తము కొమ్మింతని మున్న చెప్పి వెనుకం దా మింతయుం
దప్పి రేని । దను భీతిల్లఁగఁ జేసి చేకొను నెపైకొనర్ వడ్డితో
నంతయున్.

టి. తమిన్ = ఆశతో, తదన్యతరము = వానిలో నొకటిని, ఒందన్ = పొందఁగా.

కించ.—

వృ॥ తాతేత్యామంత్ర్య కంచి ద్వనభువి తృషితస్తోయబిందూన్య
యాచే। కస్యాప్యుచ్చైస్తటాకం ఖనతి ఇహగిరావాహంత!మృ
ద్భారమూహే। దత్తాం కే నాపిసూనావలి మధిమకుటం మ్ర
ణ్మయీ మేవ దధ్రే । సోఽయం భూయ శ్శ్రీనిజై ర్భువన
పతి రితి స్తూయతే ధ్యాయతేచ॥ 280

అ. యః=ఎవఁడు,వనభువి=వేంకటాచల వనభూమియందు, తృషితః=దప్పి కొన్నవాఁడై, కంచిత్=ఒకానొకని, తాతేతి=తాతాయని, తోయబిందూన్ నీటిబొట్లను, యయాచే=యాచించినాఁడో ! ఇహగిరౌ=ఈపర్వతమందు, త

టాకం=గుంటను,ఖనతః=త్రవ్వుచున్న, కస్యాపి=ఒకానొకనికిఁగూడ, ఉచ్చైః=ఎచ్చుగా, మృద్భారం=మట్టిబరువును, హంత=అయ్యో! ఊహే=మోయుచున్నాఁడో! కేనాపి=ఒకానొకనిచేత, దత్తాం=ఇయ్యఁబడిన, మృణ్మయీమేవ=మట్టిగానే యున్న, సూనావలిం=పూలమాలెను, అధిమకుటం=కిరీటమందు, దధ్రే=ధరించినాఁడో! భూయః=మరల, సోఽయం=అట్టి యీ వేంకటేశ్వరుఁడు, శ్రుతిజ్ఞైః=వేదవేత్తలచేత, భువనపతిరితి=జగత్పతియని, స్తూయతే=స్తోత్రముచేయఁబడుచున్నాఁడు, ధ్యాయతేచ=ధ్యానింపఁబడుచునున్నాఁడు.

తా. ఎవనినో యొకని అప్పా అని పిలిచి దప్పికొంటినని, నీటిబొట్టు లిమ్ము అనియు ; ఎవనికో యొకనికి గుంటత్రవ్వువానికి మట్టిమోసెననియు; ఎవఁడో యొకఁడు మంటియుంట లర్పింపఁగా పూలమాలెవలె తాల్చికొనియెననియు, ఈ వేంకటాచలమందు ఆవేంకటేశ్వరుఁడె యిట్లు చేసెనని అతనినే పొగడి అందఱును ధ్యానముచేయుచున్నారు.

సీ. ఒకనాఁడు నీర్వట్టి ♦ యొకని నట్టడవిని
 నీటిబొట్టొకటినె ♦ మాటి కడిగె,
ఒకనాఁడు చెర్వొత్తు ♦ నొకనిచేరువ చేరి
 మట్టి మోసెను బర్వు ♦ బిట్టనాక,
ఒకనాఁడు మంటితో ♦ నొకఁ డుంట లిచ్చిన
 దాఁ బువ్వులుగఁ బట్టి ♦ తలను బెట్టె,
ఒకనాఁడు పాలకై ♦ యొకత్రేఁడు త్రేసిన
 గొడ్డఁటిత్రేటున ♦ గోడు గుడిచె,
తే. ఇట్టిదీనుని నీయట్టి ♦ వట్టిఛాందస
 పవరు లెప్డు సెప్పుదు ♦ రప్రమేయుఁ
 డయినజగదీశ్వరుం డని ♦ యదియ కాక
 తలఁచెదరు కూడనట్టులె ♦ తలఁపులందు.

టీ. నీర్వట్టి=దప్పిగొని, అనాక=అనక, గ్రేఁడు=గొల్లఁడు, గోడు=దుఃఖము, ఛాందసప్రవరులు=వేదవేత్తలలో శ్రేష్ఠులు—అవివేకులలో శ్రేష్ఠులు, అప్రమేయుఁడు=ఊహింప శక్యము కానివాఁడు.

విశ్వావసుః.—

గ॥ కిమరే? కరుణానిధయే వేంకటాచలపతయేఽప్యసూయసి !
శృణు తావత్ ॥ 281

విశ్వావసువు.—

వ. ఏమిరా? కేవలము దయాపయోధి యైనయీ వేంకటాధిపతి యందును నీ వసూయపడుచున్నావు? వినుము.

వృ॥ నియంతా జంతూనాం నిఖిలజగదుత్పత్తివిభవ
ప్రతిక్షేపైః క్రీడన్ పరమపురుషః పన్నగనగే
పరత్వే సౌలభ్యప్రకటనకృతే వేంకటపతిః
కృపాసింధుః కాంకా మిహ మనుజలీలాం నతనుతే॥ 282

అ. వేంకటపతిః=వేంకటేశ్వరుఁడు, జంతూనాం= సకలజంతువులకును, నియంతా=నియామకుఁడై, పరమపురుషః=పురుషోత్తముఁడై, పన్నగనగే=ఈ శేషాచలమందు, నిఖిల...ప్రతిక్షేపైః=సర్వలోకముల సృష్టిస్థితిలయములతో, క్రీడన్=క్రీడించుచును, పరత్వే=పరతత్త్వమందును, సౌలభ్యప్రకటనకృతే = తనసౌలభ్యగుణమును ప్రకటించుటకై, కృపాసింధుః = దయాసముద్రుఁడై, ఇహ=ఇక్కడ, కాంకాం=ఏమేమి, మనుజలీలాం=మనుష్యలీలను, నతనుతే= చేయఁడు!

తా. ఈ వేంకటాచలపతి ఇక్కడ సకలప్రాణులకును, సకలలోకముల సృష్టిస్థితిలయములకును నియామకుఁడై క్రీడించుచును, తనపరత్త్వమందలి సౌలభ్యమును దెలుపుటకై తాను దయాసముద్రుఁడై యేమేమొ లీలలను జేయుచుండువాఁడు.

మ. జగదుత్పత్తి స్థితిలయంబునొసఁగఁ గ్ సర్వాంతరాత్ముండు
 పన్నగశైలంబున నిందుఁ గ్రీడ సలుపుఁ గ్ నారాయణుం
 డప్పుఁ డా। భగవన్నిత్యపరత్వయుక్తుఁ డయుఁ గ్ భావిం
 చి సౌలభ్యముఁ । నెగడింపఁ దరులీల లెన్నొయొనరించెఁ
 దానఁ దానై దయన్.

టి. దానఁ=ఆపర్వతమునందు. ("తమయిష్టంబులు కల్లుకై") అను దూషణము నిరసించుచున్నాఁడు.

కించ.——

వృ॥ కిము ప్యుపాదాయదిశ న్నభీష్టం
 కృత్స్నం జనేభ్యః పతి రంజనాద్రేః।
 కృష్ణావతారీయ కుచేల సంప
 త్ప్రదానరీతిం వివరీవరీతి॥ 283

అ. అంజనాద్రేఃపతిః=వేంకటేశ్వరుఁడు, కిమపి = కొంచెమునైన, ఉపాదాయ=తీసికొని, జనేభ్యః=జనులకై, అభీష్టం=అపేక్షితమును, కృత్స్నం=విశేషముగా, దిశఁ=ఇచ్చుచు, కృష్ణా...రీతిం=కృష్ణావతారమందలి కుచేలునకు సంపద నిచ్చినవిధమును, వివరీవరీతి=మిక్కిలి వివరించుచున్నాఁడు.

తా. ఈవేంకటేశ్వరుఁడు కృష్ణావతారమందు కుచేనిలుకి అటుకులు కొంచెము దీసికొని అఖిలైశ్వర్యము లిచ్చుటవలె ఇక్కడను జనులయొద్ద నేదేని కొంత తీసికొని వారియభీష్టములన్నియు నిచ్చుచున్నవాఁడు.

క. ఒకకొంచెము తీసికొనుచు
 సకలాభీష్టము లొసఁగును గ్ జనసమితికి, ము
 న్నొకకొంచియ మటుకులకే
 సకలైశ్వర్యము కుచేలకొసంపదమి కొసఁగెన్.

ఇ. కుచేలుఁడు—162వ పుట చూడు.

ఇ. కృష్ణుఁడు—155 వ పుట చూడు.

వృ॥ ప్రియసహచరీ లక్ష్మీః, స్థానం సహస్రవసు స్స్వయం,
కువలయపతి శ్శ్యాలో, రత్నాకర శ్శ్వశురో హరేః।
తదపి హరతి ద్రవ్యం పూర్ణో జగత్పతి రేష యత్
తదిహ భజతాం కర్తుం నృణా ముదగ్ర మనుగ్రహమ్॥284

అ. హరేః = విష్ణువునకు, ప్రియసహచరీ = భార్య, లక్ష్మీః = లక్ష్మియు; స్థానం=వాసస్థానము, స్వయం=తానే, సహస్రవసుః=సూర్యుఁడును; శ్యాలః= బావమఱఁది, కువలయపతిః=చంద్రుఁడును; శ్వశురః=మామ, రత్నాకరః= సముద్రుఁడును; తదపి=అయినప్పటికిని, యత్=ఎందువలన, భజతాం=తన్ను భజించునట్టి, నృణాం=మనుష్యులకు, ఉదగ్రం=సంపూర్ణమైన, అనుగ్రహం= అనుగ్రహమును,కర్తుం=చేయుటకై,ఇహ=ఈతిరుపతియందు, ఏషః=ఈ, జగ త్పతిః=జగదీశ్వరుఁడైన వేంకటేశ్వరుఁడు, పూర్ణః = తాను సర్వసంపన్నుఁ డైనను, ద్రవ్యం=ద్రవ్యము కొంచెమైనను, హరతి=తీసికొనుచున్నాఁడు.

తా. సర్వైశ్వర్యసంపన్నురాలగులక్ష్మీదేవి తనకు ప్రియురాలుగాను, భూమండలాధిపతియై-కలువలఱేఁడైనచంద్రుఁడు తనకు బావమఱఁదిగాను, సకలరత్నములకును గని యైనసముద్రుఁడు తనకు మామగాను గలయామహా విష్ణువైనవేంకటేశ్వరుఁడు, తాను జగదీశ్వరుఁడై, సర్వసంపన్నుఁడగుచును, తన్ను భజించుచున్నవారికి సంపూర్ణానుగ్రహము చేయుటకే, కొంచెముధన మునైనఁ దీసికొనుచున్నవాఁడు.

చ. ఎవనికి జాయ శ్రీయ, నెల కెవ్వనికొండె విభావసుండు,తాఁ
గువలయ బోధనాధికుడుకూర్మిని బేర్మినిబావ,మామగా
రెవని కనూత్నరత్ననిధి యెజ్జగదుజ్జ్వలుఁడాతఁడీ
యవని భజించునంచితులకెంతయునీయ నొకింత దీయుఁగా!

టి. విభావసుండు=కాంతులును ధనములును గలవాఁడు -సూర్యుఁడు, కువ లయ బోధనాధికుఁడు=భూమండలమును - కలువలనుఁ బ్రకాశింపఁజేయుట

యం దధిసుఁడు-చంద్రుఁడు; అనూత్నరత్ననిధి=ప్రాచీనమైన రత్నములకు స్థానము-సముద్రము, జగదుజ్జ్వలుఁడు = జగత్తును ప్రకాశింపఁజేయువాఁడు-జగదీశ్వరుఁడు, అంచితులు=పూజితులు-భక్తులు.

ఇ. లక్ష్మీదేవి=లోకమాత—2 వ పుట చూడు.

ఇ. సహస్రసుసువు=సూర్యుఁడు—9 వ పుట చూడు.

ఇ. కువలయపతి=చంద్రుఁడు-91 వ పుట చూడు.

ఇ. రత్నాకరము—122, 133 వ పుటలు చూడు.

గ॥ అఖిలహేయప్రత్యనీకానంతకల్యాణగుణైకతానస్య విశ్వనిదానస్య శ్రీనివాసాభిధానస్య పరబ్రహ్మణో గుణార్ణవామృతకణానాం వర్ణనే అనిపుణధిషణా ధిషణాదయోఽపి ॥ 285

అ. అఖిల...తానస్య=సకలమైన హేయవిషయములకు విరుద్ధమైన సకలకల్యాణగుణములకు ముఖ్యస్థితిగలిగినవాఁడును, విశ్వనిదానస్య=జగత్కారణభూతుఁడును, శ్రీనివాసాభిధానస్య = శ్రీనివాసమూర్తి యనుతిరునామము గలవాఁడునైన, పరబ్రహ్మణః=పరబ్రహ్మయొక్క., గుణార్ణవామృతకణానాం=గుణములనెడి సముద్రమందలి యమృతబిందువులయొక్క, వర్ణనే=స్తోత్రమునందు, ధిషణాదయోపి = బృహస్పతి మొదలైనవారునుగూడ, అనిపుణధిషణాః=సమర్థములుకానిబుద్ధి గలవారు.

వ. దురంతములైన హేయగుణములందొకటియైన లేక యనంతములైనకల్యాణగుణములకాస్పదంబై, సమస్తప్రపంచమునకు ముఖ్యకారణంబై, పరబ్రహ్మంబైనయీశ్రీనివాసమూర్తియొక్క గుణగణకలశార్ణవకణవర్ణనమైనను, ఆవాచస్పతిప్రభృతులకును వాచామగోచరమె కాక, వారిమనంబులకు మననీయంబును గాదయ్యె.

ఇ. ధిషణుఁడు=బృహస్పతి—171 వ పుట చూడు.

స్ర॥ గాంభీర్యైకావలంబే గరిమ నివసతౌ కాంతి కుల్యాతటాకే

కల్యాణాంభోజకల్యే నిరవధి కరుణాసార కల్లోలరాశౌ
చాతుర్యౌదార్యలక్ష్మీవిహరణశరణే సద్గుణౌఘాన్ బభూవే
దేవే శ్రీవేంకటేశే న జిగణయిషతా కేనవాగ్లానవాచా॥ 286

అ. గాంభీర్య+ఏకావలంబే=గంభీరత్వమునకు ముఖ్యాధారుఁడును, గరిమ+నివసతౌ = గౌరవమునకు స్థానమైనవాఁడును, కాంతి+కుల్యా+తటాకే=కాంతియనెడు కాలువతోడి సరస్సువంటివాఁడును, కల్యాణ+అంభోజ+కల్యే =శుభములనెడి తామరలకు ఉదయకాలమువంటివాఁడును, నిరవధి...రాశౌ=అత్యంతమైన దయాసారమునకు సముద్రమువంటివాఁడును, చాతుర్య...శరణే=నేర్పుదానములసమృద్ధి అనులక్ష్మికివిహరించుటకైన గృహమువంటివాఁడునైన, దేవే+శ్రీవేంకటేశే= శ్రీవేంకటేశ్వరదేవునియందు, సద్గుణౌఘాన్ = సద్గుణసమూహములనుగూర్చి, జిగణయిషతా=గణింపఁగోరిన, కేనవా=ఎవనిచేతఁగాని, గ్లానవాచా=తగ్గిపోయినవాక్కుచేత, నబభూవే=కాఁగలదికాదు.

తా. ఈవేంకటేశ్వరునియందలిగాంభీర్యగౌరవకాంతి కల్యాణకారుణ్య చాతుర్య ఔదార్యాది సకలసద్గుణములను గణించువాఁడెవఁడుగాని వాక్కుచాలనివాఁడె యగును.

సీ. గాంభీర్యమునకు ము ఖ్యం బైనపట్టును
ఘనగౌరవంబున కునికిపట్టు
కాంతికాలువలకుఁ గలనీటిపట్టును
గల్యాణకమలకుఁ గంటెబొట్టు
కారుణ్యమునకును గల్లోలములపట్టు
నౌదార్యలక్ష్మికి నాటపట్టు
చాతుర్యలక్ష్మి కా చందంబున నెయాట
పట్టగువేంకటేశ్వరునిఁ బట్టు
తే. సుగుణగణములగణనము సుంత యైన
నెట్టిదిట్టని కైనఁ దాఁ బెట్టు బెట్టి

దంబు పుట్టింపదే ! వాగ్వివాదంబ ముడిగి
డస్సి క్రుస్సినకరణి నీశ్వరణితలిని.

కించ.—

శ్లో॥ సమగ్రా హి హరే ర్వేదై
స్సమగ్రాహి గుణావలిః
ప్రత్యక్షేఽపి పర త్వేఽస్య
ప్రత్యక్షేఽపి నసంశయః॥ 287

అ. సమగ్రాః=సంపూర్ణమైన, హరేః+గుణావలిః=స్వామియొక్క గుణ సమూహము, వేదైః=వేదములచేత, ప్రత్యక్షేఽపి=ప్రత్యక్షమందును, పరత్వే =పరతత్త్వమందును, సమగ్రాహిహి = గ్రహింపఁబడెనుగదా ? అస్య=ఇతనియొక్క, ప్రత్యక్షేపి=ప్రత్యక్షమైనపుడు, నసంశయః = సందేహములేదు.

తా. స్వామిగుణములు వేదవిహితములే యైయున్నను, అతఁడు ప్రత్యక్షమగుచుండినచో పరోక్షమందును సందేహమా ?

మఱియు.—

తే. గుణము లెవనికి వేదాంతగణితము లగు
వాఁడు ప్రత్యక్ష మగుడును వాని దాప
రత్వమున నట్లు సందేహరహిత మగును
బరుఁడో ప్రత్యక్షుఁడో యనఁబడుతలంపు.

గ॥ అహో ! మహోన్నతస్యాప్యస్య సౌలభ్యం కనకకుసుమస్య
సౌరభ్యమివ రసికేభ్య ఏవ స్వదతే ! పశ్య ! ॥ 288

వ. అహో ! మహోన్నతుఁ డైనను, ఇతనిసౌలభ్యము సౌవర్ణ
పుష్పముసౌరభ్యమువలె, రసికులకే రమణీయ మై యున్న
యది. చూడు !

టి. సౌలభ్యము=సులభత్వము, సౌరభ్యం=పరిమళమే, కనకకుసుమము=సౌవర్ణపుష్పము—సంపంగిపువ్వు.

వృ॥ ప్రచండవిశ్వకంటకప్రఖండనైకపండితః
పతంగమండలే వస న్యఏష పాండవప్రియః
అకుంఠరీతికః ప్రసన్నపుండరీకలోచనః
స కుండలీంద్రభూధరప్రకాండమండనాయతే॥ 289

అ. యః=ఎవఁడు, ప్రచండ...పండితః= కూ్రరులై లోకకంటకులైన వారిని ఖండించుటయందు ముఖ్యమైన నేర్పుగలవాఁడును, పతంగమండలే=సూర్యమండలమున, వసన్=నివసించుచు, అకుంఠరీతికః=సంపూర్ణస్వరూపముగల వాఁడును, ప్రసన్నపుండరీకలోచనః=తేఁట యైన తెల్లఁదామరలవలె కన్నులు గలవాఁడునైన, సః+ఏషః = ఆ+యీ, పాండవప్రియః=పాండవులకు ప్రియుఁడైన శ్రీకృష్ణమూర్తి యగువేంకటేశ్వరుఁడు,కుండలీ...యతే=ఈశేష శైలమునకు శ్రేష్ఠమైనభూషణ మగుచున్నాఁడు. (పంచచామరము).

తా. శ్రీకృష్ణమూర్తి యైనవేంకటేశ్వరుఁడు, క్రూరులైదుష్టులైనవారిని ఖండించుచు, స్థిరమర్యాదలు గలిగి పుండరీకాక్షుఁడై సూర్యమండలమందు వసించువాఁడైనను, ఈశేషాచలమునకు అలంకారముగా నున్నవాఁడు.

పాండవప్రియుఁడు = శ్రీకృష్ణుఁడు— ఇతఁడు దేవకీవసుదేవులపుత్రుఁడు, నందయశోదలపెంపుడుపుత్రుఁడు, బలరామునితమ్ముఁడునై సత్యభామాదు లష్టభార్యలుగాను, అందు రుక్మిణీదేవి పట్టపుదేవిగాను కలిగియు, షోడశరాజ కన్యకలతోను షోడశసహస్ర గోపికలతోను లీలాలోలుఁడై ఇట్లు తనతోడ ఐహికానందములనుకూడ అనుభవించి ఆనందింపఁగోరియున్న అనేకదేవతలను మహర్షులను అందు విదురాకూ్రరకుచేల ద్రౌపద్యాదిభక్తులను వారు వారుకోరుకొనునట్లానందింపఁజేయుచు, కంసకాళియశిశుపాలమురనరకాదిశ త్రువులను సంహరించుచు, తాను పంచపాండవుల కత్యంతప్రియుఁడౌటవలన కౌరవయుద్ధమందు అర్జునునకు విశ్వరూపమున తనయందు విశ్వాసము కలిగిం

చుకొని అతఁ డస్వతంత్రుఁ డగునట్లు భగవద్గీతోపదేశముచేసి తాను గీతాచార్యుఁ డనఁబడుచు, దశావతారములలో అష్టమావతార మైనశ్రీమహావిష్ణువు.

పంచచామరము. ఎతండు శత్రుమండలంబు కెల్లఁ జెండుపండితుం
డెతండు మిత్రమండలంబుకె నిల్లు చేసికొన్నవాఁ
డెతండు పుండరీకనేత్రుఁ డెడి ట్లఖండరీతివాఁ
డతండె యిందు శేషశైలకమందుమండనంబునౌన్

గ॥ అవలోకయ ! తావదురగవరధరణీధరశిరోమణె శ్చక్రపాణే
రనితరసుకరవరనికరవితరణకౌశలమతిపేశలమ్॥ 290

వ. చూడుమా ! ఈ శేషశైలశేఖరమణి యైనశ్రీరమణీరమణుని యనితరసాధారణ మైనవరవితరణమునం దతిపేశల మైనకౌశలమును.

టి. వరవితరణము=వరము లిచ్చుట, అతిపేశలము=అతిమృదువు.

వృ॥ మూకారబ్ధం కమపి బధిరాః శ్లోక మాకర్ణయంతి,
శ్రద్ధాళు స్తం విలిఖతి కుణిః, శ్లాఘయా వీక్షతేఽంధః,
అధ్యారోహ త్యహహ! సహసా పంగుర ప్యద్రిశృంగం,
సాంద్రాలస్యా శిశుభరణతో మందమాయాతి వంధ్యా॥

అ. బధిరాః=చెవిటివాండ్రు, మూకారబ్ధం=మూఁగవాం డ్రారంభించిన, కమపిశ్లోకం=ఒకపద్యమునైనను, ఆకర్ణయంతి=వినుచున్నారు, తం=ఆశ్లోకమును, కుణిః=చేయిమొండివాఁడు, శ్రద్ధాళుః=శ్రద్ధగలవాఁడై, విలిఖతి=వ్రాయుచున్నాఁడు, అంధః=గ్రుడ్డివాఁడు, శ్లాఘయా=శ్లాఘనముతో, వీక్షతే=చూచుచున్నాఁడు, పంగురపి=కాలుమొండివాఁడు కూడ, అద్రిశృంగం=కొండకొనను, సహసా=త్వరగా, అధ్యారోహతి=ఎక్కుచున్నాఁడు, అహహ=ఆహా! వంధ్యా=గొడ్రాలు, శిశుభరణతః=బిడ్డనుమోసికొనుటవలన, సాంద్రాలస్యా=మిక్కిలియలసత గలదై, మందం=మెల్లఁగా, ఆయాతి=వచ్చుచున్నది.

తా. ఈవేంకటాచలమందు ఆవేంకటేశ్వరుఁడు చెవిటివాండ్రకు శ్లోకాలు వినిపించుచు, మూఁకవాండ్రచే పలికించుచు, చెయిమొండివాండ్రచే వ్రాయించుచు, గ్రుడ్డివాండ్రకు చూపించుచునే గాక, ఈపర్వతశిఖరమును కాలిమొండివాండ్రనెక్కించుచు, గొడ్డురాండ్రనుం గర్భమున బిడ్డనుమోసికొని యలసటతోడియాలస్యముతో రప్పించుచున్నవాఁడు.

సీ. ఏనాఁడుఁ బలుకనేఁ లేనట్టిమూఁగయుఁ
బక్కనముల్ హృద్యమై పలుకు, వాని
నేనాఁడు వినఁగనేఁ లేనట్టిచెవిటియు
వింతగాఁ జెవులిచ్చి వినును, వాని
నేనాఁడు వ్రాయనేఁ లేనట్టిచెయిమొండి
వశిని శ్రద్ధాళువై వ్రాయు, వాని
నేనాఁడుఁ జూడనేఁ లేనట్టిగ్రుడ్డియుఁ
జక్కఁగాఁ జూచియే చదువు, మఱియు.

తే. నడువ లేనట్టికుంటియు నడిగ నడచి
యిక్కధరమున శిఖరము నెక్కు మఱియు
నెక్కనచ్చును గొడ్రాలు నెక్కసమున
నిండుకడుపున బరువున బెండువడుచు.

టి. ఇక్కధరమున=ఈపర్వతమునందు, బెండువడుచు= బలహీనపడుచు.

గ॥ సర్వతః పర్వత మాలోక్య సశ్లాఘమ్॥ 292

వ. పర్వతమును సర్వత్రను నవలోకించి శ్లాఘించి.

వృ॥ సర్వోత్తుంగ శ్శ్రితశుభగుహా స్స్వభిఖ్యాతసీతో
భాస్వద్వంశోపచయజనక స్సానుజస్ఫూర్తికోయః
ఏనం నూనం క్షితిభృతమియం జానతీ జానకీశం
కీశశ్రేణీ కలయ శరణీ కుర్వతీ నర్వరీతి॥ 293

అ. యః=ఏపర్వతము, సర్వోత్తుంగః=అన్నిటికంటె పొడుగై, శ్రితశుభ గుహః=ఆశ్రయించి శుభకర మైనగుహుఁడును—గుహాలునుగలదై, సాధ్వభిఖ్యాతసీతః=సజ్జనులచేత కొనియాడఁబడినసీతయు-లతభేదమునుగలదై, భాస్వత్+వంశ, ఉపచయ+జనకః=సూర్యవంశమునకును-ప్రకాశించు వెదుళ్లకును అభివృద్ధినికలిగించునదై, సానుజస్ఫూర్తికః=తమ్ములయు - చరియలయు సంపూర్తికలదైనదో, ఏనం= యీ, క్షితిభృతం= రాజును—పర్వతమునుక్, జానకీశం = శ్రీరామునిఁగా, జానతీ=తెలియునది యైన, ఇయంకీశశ్రేణీ = ఈవానరపఙ్క్తి, శరణీకుర్వతీ= రక్షకునిఁగాను—నివాసమును గాను చేసికొనునదై,వర్వరీతి=మిగుల చుట్టుకొనుచున్నది, కలయ=చూడు !

తా. ఇక్కడ గుహ అనెడుగుహుఁడును, సీతాలత యనెడుసీతాదేవియును వేణువృక్ష మనెడిసూర్యవంశమును, సానువులనెడి భరతాదులైన తమ్ములును గలిగినయీకొండ యనెడిరాజునే శ్రీరామునిఁగాఁ జూచుకొన్న యీవానర శ్రేణి తనకు రక్షకముగాను, వాసస్థానముగాను వరించుకొనుచున్నది.

సూర్యవంశము. సూర్యుఁడు= వివస్వంతుఁడు. అతనివలన వైవస్వతమను, కుక్షి, కకుత్థ్స, కువలయాశ్వ, మాంధాతృ, త్రిశంకు, హరిశ్చంద్ర, సగర, భగీరథ, రఘు, అజ, దశరథ, శ్రీరాములవంశము.

తే. సతతసీతాసమేతాంకశసహితుఁ డగుట
భరితగుహుఁడును సానుజశస్ఫురితమహుఁడు
నగుట క్షితిధరు నితని శ్రీశరఘువరుఁ డని
కలయ శరణము కావించెఁ శ గాంచు ! కపుల

టి. సీతాసమేతాంక=లతావిశేషములతో— సీతాదేవితో, సమేత=కూడిన, అంక=సమీపస్థలముతో—ఒడిభాగముతో, భరితగుహుఁడు=భరింపఁబడిన గుహాలు—గుహుఁడును కలవాఁడు, సానుజస్ఫురిత+మహుఁడు=సానువులందు పుట్టిన—తమ్ములతోఁగూడిన+తేజస్సుగలవాఁడు, క్షితిధరుక్ = పర్వతుని—రాజును, కలయక్=అంతటను, శరణము=వాసస్థానము-రక్షణము.

వృ॥ ప్రకాశబహుపాదవత్యపి ఫణిక్షమాభృత్యతః
ప్రకాశమవలోక్యతే పరమమన్యదత్యద్భుతం
నిజోరసిపయోధర శ్చిర మచంచలాం విద్యుతం
పయోధరమురస్యసావపి బిభర్తి నిత్యం నిజే॥ 294

అ. ప్రకాశ బహుపాదవత్యపి=ప్రకాశములై విస్తారములైన పాదములును-తోడితిప్పలును గలదైనను, ఫణిక్షమాభృతి=గూఢపాద సర్పరాజైన ఈ శేషాద్రియందు, అతః=అంతకంటె, అన్యత్=మఱియొకటి, పరమం=శ్రేష్ఠమైన, అత్యద్భుతం=అత్యాశ్చర్యము, ప్రకాశం=ప్రసిద్ధముగా, అవలోక్యతే=చూఁడఁబడుచున్నది; నిజ+ఉరసి= తనఱొమ్మున, పయోధరః=మేఘము, చిరం = చాలాకాలముగా, అచంచలాం=మెఱుముకాని-చలింపని, విద్యుతం=మెఱుమును; బిభర్తి=భరించుచున్నది. అసావపి = ఇతఁడును, ఉరసి = తనఱొమ్మున, పయోధరం=స్తనమును - మేఘమును, నిత్యం=ఎల్లపుడును, బిభర్తి=భరించుచున్నాఁడు.

తా. తాను గూఢపాదమైనను, బహుపాదములు గలయీశేషపర్వతమునందు, మఱి మహాశ్చర్యమొకటి ప్రకాశముగాఁ గనఁబడుచున్నది. అదేమనఁగా ఈపర్వతమనెడి పయోధరము తనఱొమ్మునఁ గదలనిమెఱుమును ధరించుటయు, ఈవేంకటేశ్వరుఁడు పయోధర మనెడి స్తనముతోడ లక్ష్మిని ఎప్పుడును ఱొమ్ముననే భరించుటయును కలిగియున్నదనుటయే.

మఱిల నానందముతో.—

ఉత్సాహవృత్తము.

కరిను గూఢపాద మగుచుఁ గాంగంటె ? గాఢపాద మాన్
ధర మిదే య టుండ మఱియు దానికంటె వింత యిం
దురముమైఁ బయోధరంబె యొరయుఁ దిరము మెఱుమున
ట్లురముపైఁ బయోధరము నెఱి మొరయు మెఱుము నెప్పుడున్

టి. ధరము+ఇదే=ఈపర్వతమే, గాఢపాదము=కనఁబడని పాదములు-

ప్రత్యంతపర్వతములు కలది—సర్పస్వరూపము, గాఢపాదము=దట్టమై—కనప డని పాదములు—ప్రత్యంతపర్వతములు కలది, పయోధరంబె= మేఘమె, మెఱు మ్మక్=మెఱుపుఁదీగెయు—లక్ష్మియు, పయోధరమునె= స్తనమునె, (విరోధా భాస శ్లేషరూపకములు.)

## వనవర్ణనమ్.

గ॥ ఇతి విమానం దక్షిణత స్సమానయ న్సానందం, విలోకయ సఖ విపినానా మ మేషాం పరమం రామణీయకమ్॥ 295

వ. అని దక్కినపుందిక్కునకు విమాన మానయించుకొంచు నానందముతో సఖా! యీకాననములపరమరమణీయతను గనుఁగొనుమా!

వృ॥ పురఃపురో ఘనం వనం వనేవనే మహాగిరిర్
మహాగిరౌ మహాగిరౌ విరాజతే గుహాగృహం
గుహాగృహే గుహాగృహే విహారతత్పరో హరిర్
హరౌహరౌ నిరంకుశః కృతేభసాధ్వసో ధ్వనిః॥ 296

అ. పురఃపురః=ఎదురెదుట, ఘనంవనం=మహారణ్యము, వనేవనే=ప్రతివ నమున, మహాగిరిః=పెద్దకొండ; మహాగిరౌమహాగిరౌ=ఒక్కొక్క పెద్దకొండ లోను, గుహాగృహం=గృహమువంటిగుహ; గుహాగృహే గుహాగృహే=ప్రతి గృహమువంటి గుహాలోను, విహారతత్పరః=విహరించుటయందాసక్తి గల, హ రిః=సింహము; హరౌహరౌ=ప్రతిసింహమునందును, నిరంకుశః=నిరాటంకమై, కృతేభసాధ్వసః=కలుగఁజేయఁబడినయేనుఁగులకు భయము గలదైన, ధ్వనిః= ఘీంకారశబ్దము, విరాజితే=ప్రకాశించుచున్నది.

తా. ఎదురెదుర మహారణ్యములు అందు మహాపర్వతములు, అందును మహాగుహలు, అందును విహరించుసింహములు, ఆసింహములయందు ఏనుఁగులు భయపడునట్టి గర్జనధ్వనులును విజృంభించుచుండును.

తే. ఎదురెదురఁ గన ఘనవన శ్రీ మేఁపు చూపు
వనవనమునన యురుగిరి శ్రేయెనయు మొనయు
గిరిగిరినిన గుహాగృహ శ్రీ మిరులు కొలలు
గుహగుహన హరి విహరించు శ్రీకొంచు మించు
హరి హరియుఁ గరు లదరంగ శ్రీ నార్భటించు.

కృశానుః.—

గ॥ కిమరే? వర్ణయ స్యచక్షుష్యాణి మనుష్యాంగకబలనచపలచం
డపుండరీకాననాని కాననాని॥ 297

అ. కిమరే=ఏమిరా ? మనుష్యాంగ+కబలన+చపల+చండ+పుండరీక+ఆననాని=మనుష్యుల+అంగములను + కబలించుటయందు+ఆసక్తిగల+ తీక్షణములైన+పెద్దపులుల+మొగములుగలవై, అచక్షుష్యాణి=చూడఁగూడనవైన, కాననాని=అడవులను, వర్ణయసి=వర్ణించుచున్నావు.

వ. ఏమిరా? యీచూడనుం గూడనియడవిని గొనియాడు చున్నాఁడవు? అదె చూడు! మనుష్యులయంగములం గబళింపఁ దెంపుఁ జేసి గండము లదరు చుండు నీచండము లగుపుండరీకముల మొగములను.

వృ॥ ఇత స్త్రాసద్గ్రానవ్యతికర ఇత స్సం త్యజగరా
ఇతో లుంఠాకానాం సముదయ ఇతః కంటకచయాః
ఇతో వ్యాఘ్రా ఉగ్రా జ్వలనజనకా వేణవ ఇతో
వనం సంలక్ష్యై తన్న న ఇద మహో మోహ మయ తే॥

అ. ఇతస్త్రావత్=ఇక్కడనో, గ్రాసవ్యతికరః = జాలసమూహము; ఇతః=ఇక్కడ, అజగరాః=పాముభేదములు, ఇతః=ఇక్కడ, లుంఠాకానాంసముదయః=దొంగలసమూహము; ఇతః=ఇక్కడ, కంటకచయాః=ముండ్లగుంపులు; ఇతః=ఇక్కడ, జ్వలనజనకాః=నిప్పులుపుట్టించునట్టి, వేణవః=వెదుళ్లు; ఇతః=

ఇక్కడ, ఉగ్రాః=భయంకరములైన, వ్యాఘ్రాః=బెబ్బులులును, సంతి=ఉన్నవి. ఏతత్ వనం=ఈయడవిని, సంలక్ష్య=చూచి, ఇదంమనః=ఈమనస్సు, మోహం=బుద్ధిమఱపును, అయతే=పొందుచున్నది.

తా. ఈయడవియందు బండఱాలును, వేలువేలుసర్పాలును, దొంగలును, ముండ్లును, పెద్దపులులును, వెదురులపొదలునున్నవి. ఇట్టియడవిని జూచి నామనస్సు తెలివి తగ్గుచున్నది.

తే. కొండపాములు కొండఱాళ్లుండు లందు
మండుబొంగులు దొంగలు మఱియు నెందుఁ
గనిన, బెబ్బులు లబ్బబ్బ గనఁగరాదు
గుండె లదిరెను బెదురున బెఁడుపడుచు.

విశ్వావసుః—

గ॥ సఖే! నిపుణనిరూపణత ఏ తేషాం గుణానపి గృహాణ॥ 299

వ. సఖా! చక్కఁగ నిరూపణమున, ఇటఁ గొనములు నున్నయది, గయికొనుమా?

వృ॥ అనాయాసగ్రాహ్యా ణ్యవనిపతిభోగ్యాన్యపి ఫలా
న్యయత్నేన ప్రాప్యా స్త్వపి సుదృగవేక్ష్యా స్సుమనసః
అసూర్యం పశ్యా న్యప్యహహ! సులభా న్యశ్మభవనా
న్యరణ్యానీభాజా మతిపతతి భాగ్యం కిల గిరః॥ 300

అ. అవనిపతిభోగ్యాని+అపి=రాజులకు అనుభవింపఁగూడినవైనను, ఫలాని=పండ్లు, అనాయాసగ్రాహ్యాణి=కష్టము లేక గ్రహింపఁదగినవియు, అయత్నేన=యత్నములేకయే, ప్రాప్యాః తు అపి=పొందఁదగినవియైనను,సుమనసః=పుష్పములు, సుదృగవేక్ష్యాః=చక్కనికన్నులతో- స్త్రీలచేతను, చూడఁదగినవియు, అసూర్యంపశ్యాని అపి=సూర్యుని చూడఁదగనివియైనను, అశ్మభవనాని=శిలాగృహములు, సులభాని=సులభములైనవియు, అహహ=ఆహా! అర

ణ్యానీభాజాం=అడవులనుండు వారియొక్క, భాగ్యం=భాగ్యము, గిరః=మాటను, అతిపతతికిల=మీఱుచున్నదిగదా!

తా. ఇక్కడిమామిడి మొదలగుపండ్లు రాజులే అనుభవింపఁదగినవిగాను, కొనకయే పువ్వులు పువ్వుబోణులకును యత్నింపకయే చూడఁదగినవిగాను, గుహలు సూర్యరశ్మియే కనఁబడనివిగా నున్నయవి. ఆహా! ఈయడవిలోనివారిభాగ్యము చెప్ప శక్యము కానిదిగా నున్నయది గదా!

చ. అలయక చేకొనం దగుచుఁ కొనక్కఱ రాజులు కైకొనం దగుఫ
ఫలములు ప్రూవులో చెలులకుఁ ప్రార్థనచేసికొనందగుఁ సదా
చలునల్ తావులై మిగులఁ జక్కని బాలగృహాలు నెండక
న్నొలయవి టెనసించుక్రొత్త పుణ్యులభాగ్యము నేమనందగున్

అపిచ.—

వృ॥ గహనగుహావిహారిహరిపాణిరుహాభిహత
ద్విరదశిరస్తటోద్గలితమౌక్తికసంహతిభిః।
అహహ! విభూషితై రిహగిరౌ విహరంతి సుఖం
సమమబలాజనై రతివిలాసపరాశ్శబరాః॥ 301

అ. రతివిలాసపరాః=మైథునక్రీడలయం దాసక్తులైన, శబరాః=వేఁగులవాండ్రు, గహన...సంహతిభిః=అడవిలోనిగుహాలలో విహరించు సింహములగోళ్లతోఁ గొట్టఁబడినయేనుఁగుల కుంభస్థలములనుండి లేచినముత్యములసమూహములచేత, విభూషితైః=అలంకరింపఁబడిన, అబలాజనైస్సమం=స్త్రీలతోఁగూడ, ఇహగిరౌ=ఈవేంకటాచలమందు, సుఖం=సుఖముగా, విహరంతి=విహరించుచున్నారు, అహహ=ఆహా!

తా. ఈతిరుపతికొండయందలి వేఁగులవాండ్రు ఇక్కడిగుహాలలోని సింహములు ఏనుఁగులకుంభస్థలములను గొట్టి నేలఁబడినముత్యాలతో సింగారించుకొన్న స్త్రీలతోడ సురతక్రీడలయందు విహరించుచుందురు.

మఱియు.—

చ. గొబ్బున విహారము ల్సలుపు ఘోరమృగేంద్రుల గోళ్ల దెబ్బలన్
గబగబ రాలు నేనుగుల గాఢశిరంబుల మౌక్తికంబులన్
సొబగునఁ దాల్చి పొల్చుతమ జోటులఁగూడి విలాసలాలసుల్
శబరులు చూడు? వేడుకఁ బరిచారము చేసెద రిందునం దహా!

టీ. జోటులన్ = స్త్రీలను, విలాసలాలసుల్ = క్రీడలయందాసక్తిగలవారు.

గ॥ ఇతి, వ్యోమయానం, దక్షిణతః ప్రాపయన్ పురతో నిర్దిశ్య॥

వ. అని దక్కినపుందిక్కునకున్ విమాన మానయించుకొంచు నెదుర నిర్దేశించి.

## ఘటికాచలవర్ణనమ్.

(ఘటికాచలము = చోళంగిపురము—ఇది, ప్రహ్లాదుని రక్షించుటకై హిరణ్యకశిపుని సంహరించి పోయి క్షీరసాగరమున యోగనిద్రలో నున్న యానరసింహస్వామిని ప్రార్థించి ఈయోగనృసింహస్వరూపమున నే ఈపర్వతమునను సేవ సాయించుచుండవలెనని ఆప్రహ్లాదుఁడపేక్షించినదియే కాక; దేవేంద్రుఁడు రాక్షసబాధలను చిక్కి స్రుక్కుచుండుటను మార్గమున ఇంద్రద్యుమ్నమహారాజు చూచి ఆరాక్షసులను తెలిసికొని నేను పోయి సంహరించెద నని లేచిపోవఁ జూడఁగా, ఆయింద్రుఁడును దిక్పాలకులును కావలసిన ఆయుధములతోడ సేనాసమూహము నిచ్చి ఈనరసింహస్వామిని ప్రార్థించి హనుమంతుని సహాయముగను నిచ్చి ఇందు ధూమ్రాక్షమకరాక్ష కుంభనికుంభాదులను ఈపురమున సంహారించినందున ప్రద్యుమ్నపురము హనుమత్పురము అని పేరొందినదియే కాక అక్కడక్కడ ఎంతోకాలము తపస్సు చేసిచేసి యోగాభ్యాసము చేసినను, ఇక్కడ ఒక్కఘటికలోనె [= గడియలోనె] యోగాభ్యాసము చేయుట చేత ఇందలివారిని తప్పక పరమపదము నొందించుచున్నది యైనయిందు ఆ యోగనృసింహస్వామి లక్ష్మీసహితుఁడై హేమకోటివిమానమున పూర్వాభిముఖముగ సేవసాయించుచున్నాఁడు కలిగియున్నయది.)

వృ॥ కంఠోపరి కంఠీరవశుచి
దంష్ట్రారుచివిచిత్ర చంద్రికయా
స్ఫటికాచలఇవ నయనే
ఘటికాచల ఏష సంప్రతి ధినోతి॥ 303

అ. కంఠోపరి=కంఠమునిూఁద, కంఠీ...చంద్రికయా = తనసింహరూపము యొక్క తెల్లనైన కోఱలకాంతియనెడి ఆశ్చర్యకరమైన వెన్నలచేత, స్ఫటికాచల ఇవ = పటికములకొండవలె, ఏషఘటికాచలః = ఈఘటికాచలము, నయనే=కన్నులను, సంప్రతి=ఇప్పుడు, ధినోతి=సంతోషపఱచుచున్నది.

తా. ఈ చోళంగిపురమందు ఆ నృసింహస్వామియొక్క తనసింహరూపము నందలి తెల్లనికోఱలకాంతులనెడి వెన్నెలచేత, పటికాలకొండవలెనుండు ఈ ఘటికాచలము ఇప్పుడు మనకండ్ల కానందము నిచ్చుచున్నది.

క. తటభాగములం గేసరి
పటుదంష్ట్రారుచులజ్యోత్స్న పర్వుచు నెపుడున్
స్ఫటికాచలమున్ వలె నీ
ఘటికాచలమున్ జెలంగెఁ గనుపండుగ నై.

టీ. కేసరి = సింహముయొక్క, జ్యోత్స్న = వెన్నెల, పర్వుచున్ = వ్యాపించుచు.

గ॥ సభక్తిప్రకర్ష మంజలిం బధ్వా.—

## శ్రీనరసింహస్వామివర్ణనము.

(శ్రీనరసింహస్వామి — వీరు హిరణ్యకశిపుఁడు నరమృగసురప్రముఖుల చేత తనకు మరణము లేనట్లు బ్రహ్మవలన వరముఁ బొందియున్నందున వానివలన బాధపడు ప్రహ్లాదుని సంరక్షించుటకై దేహము నరస్వరూపముగాను ముఖము సింహముఖరూపముగాను స్తంభమందును ఉద్భవించి,ఆహిరణ్యకశిపుని సంహరించిన యామహావిష్ణువు దశావతారములలో నాలుగవయవతారము.)

శ్లో॥ వరకేతుస్థతార్క్ష్యాయ
స్మరకేళిపుషే శ్రియః।
నరకేక్షణవిఘ్నాయ
నరకేసరిణే నమః॥ 304

అ. వరకేతుస్థతార్క్ష్యాయ=శ్రేష్ఠమైన టెక్కెమందుండు గరుత్మంతుఁడు గలవాఁడును, శ్రియః = లక్ష్మికి, స్మరకేళిపుషే = మన్మథక్రీడను వృద్ధిపఱచు వాఁడును, నరకేక్షణవిఘ్నాయ = నరకమును జూచుటకుఁగూడ విఘ్నముగల వాఁడునైన, నరకేసరిణే=నరసింహస్వామికి, నమః=నమస్కారము.

తా. గరుడధ్వజుఁడుగా లక్ష్మీపతిగానున్న యిక్కడి నరసింహస్వామికి మేము నరకమునే చూడకుండఁజేయుటకై నమస్కారముచేయుచున్నాము.

వ. ప్రకృష్టభక్తిచేఁ బ్రబద్ధాంజలి యై.

క. పులుఁగులపతి కేతన, మల
కలుములజవరాలి మేలికాౕమితలీలా
కలనము నరకవికలనము
కలనరహరికి న్నమస్సు కావింతు నిదే.

టి. కేతనము=టెక్కెము, కామితలీలాకలనము=కోరఁబడిన విలాసములను గూర్చుటయు, నరకవికలనము=నరకనాశమును.

తార్క్ష్యుఁడు=గరుత్మంతుఁడు—ఇతఁడు వినతాకశ్యపులకు పుత్రుఁడు. సూర్యసారథి యైన అనూరువునకు తమ్ముఁడును, సంపాతిజటాయువులకు తండ్రియును పినతల్లిపుత్రులైన కాద్రవేయులకు దేవలోకమున ఇంద్రుని జయించి అమృతము తెచ్చి యిచ్చినవాఁడును, లోకోపకారకులైనపుళిందులను తాము దాయభాగమునకుఁగాను శపించుకొనఁబడి గజకచ్ఛపరూపులైన విభావసు సుప్రతీకులను భక్షించుకొనినవాఁడును, సర్వదా సర్వేశ్వరునికి వాహనమై వేదస్వరూపుఁడు నైనపక్షీశ్వరుఁడు.

కించ.—

శ్లో॥ స్థిరశంఖాదిచిహ్నాయ సురసంఘార్చితాంఘ్రయే
పరసంహారదక్షాయ నరసింహాయ మంగళమ్ ॥ 305

అ. స్థిరశంఖాదిచిహ్నాయ=స్థిరమైనశంఖచక్రాదులే చిహ్నములుగాఁగలవాఁడును, సురసంఘార్చితాంఘ్రయే=దేవసమూహముచేత పూజింపఁబడినపాదములు గలవాఁడును, పరసంహారదక్షాయ=శత్రువులను సంహరించుటయందు సమర్థుఁడు నైన, నరసింహాయ=నరసింహస్వామికి, మంగళం=మంగళము.

తా. శంఖచక్రాదులు గలిగి శత్రుసంహారకుఁడై దేవత లర్చించెడుపాదములు గలనరసింహస్వామికి మంగళము.

మఱియు.—

క. మంగళ మరిదరభరణా!
మంగళ మమరార్చ్యచరణ! మహనీయగుణా!
మంగళ మరిసంహరణా!
మంగళము నృసింహదేవ! మహితసుభావా!

టి. అరిదరభరణా=చక్రమును శంఖమును ధరించుట గలవాఁడా, మహనీయగుణా=గొప్పదయాదిగుణములు గలవాఁడా! మహితసుభావా=మహత్త్వముతో నెంచఁబడినమంచిమనస్సు గలవాఁడా!

జంభాసురుఁడు—కుమారతారకయుద్ధములో దేవేంద్రునిచే చంపఁబడిన యొకరాక్షసుఁడు.

శంభువు=ఈశ్వరుఁడు—ఇతఁడు త్రిమూర్తులలో నొకఁడు, భార్య పార్వతీదేవి, కుమార వినాయక వీరభద్రులు కుమారులు, ఇతనికి నొసట మఱియొక నేత్రమును, చేతులఁ గపాలశూలాయుధములును, మొలను పులిచర్మమును, చెవుల సర్పములును, ఱెక్కమున వృషభమును గలిగి, సంధ్యానర్తనములోను నందివాహనములోనుండి, ఒకప్పుడు భూమియే రథమై సూర్యచంద్రులు చక్రములై వేదములు గుఱ్ఱములై బ్రహ్మయే సారథియై, మేరువు అమ్ముగాను నమ

ద్రము అంపపొదిగాను విష్ణువే బాణాలుగాను ఐ, లోకములను చెఱుచుచుం డునట్టి త్రిపురాసురులను సంహరించినవాఁడు; మఱి యితఁడు విష్ణువునాజ్ఞ చేత దేవరాక్షసులు అమృతము తఱుచునపుడు మేరువును కవ్వముగా వాసు కిని త్రాడునుగాను చేసికోనఁగా, ఆకష్టము సహింపఁజాలక వాసుకి క్రక్కు కొన్నవిషము త్రాగి పార్వతిచేత గొంతుపట్టఁబడి కంఠముననె నిలిచియున్న విషముతోను ఆవిషజ్వాల చల్లఁబడుటకై తలను చంద్రునితోను గంగతోను కూడియున్న జటాజూటముతోను కైలాసమున విలాసముతోను నుండునతఁడు.

ప్రహ్లాదుఁడు—29 వ పుట చూడు.

శ్లో॥ జంభదంభహరక్షేమా రంభలంభకమూర్తయే
శంభుసంభావనీయాయ స్తంభడింభాయమంగళమ్॥ 306

అ. జంభ-దంభ-హర-క్షేమ-ఆరంభ-లంభక - మూర్తయే=జంభాసురుని యొక్క - గర్వమును - హరించినట్టి యింద్రునికై - క్షేమములను - ఆరంభిం చుటలను=లభింపఁజేయునట్టి - శరీరముగలవాఁడును, శంభు - సంభావనీయా య=శివునిచేత - పూజింపఁదగినవాఁడు నైన, స్తంభ - డింభాయ= స్తంభము నకు బిడ్డఁడుగు నరసింహస్వామికి, మంగళం=మంగళము.

తా. దేవేంద్రునిక్షేమమునకైయును, శివుడు చేయు పూజనమునకయ్యును (హిరణ్యకశిపుని సంహరించుటకైయును ప్రహ్లాదుని రక్షించుటకై యును), ఉక్కుస్తంభమునందుఁ బుట్టిననరసింహస్వామికి మంగళము.

క. జంభాసురదంభాహర
సంభవుకారంభవిహితసంభవసహితా !
శంభూచితసంభావిత !
స్తంభోద్ధితడింభ ! నీకు సన్మంగళ మౌన్.

టి. జంభాసురదంభ - ఆహర - సంభవుక - ఆరంభ - విహిత - సంభవ - సహితా=జంభాసురునిగర్వమును పూర్ణముగా హరించునట్టి - క్షేమముల యొ క్క - ఆరంభమునకై - విధింపఁబడిన - నృసింహాజన్మముతోఁ గూడినవాఁడా !

కృశానుః.—

గ॥ కిమరే? క్రోధమయేఽపి నరమృగేంద్రే స్తవవచనం విరచయసి? 307

వ. ఏమిరా? యీకోపస్వరూపమైన నరసింహరూపమందును వినుతివచనములు విరచించుచున్నావు?

శ్లో॥ ప్రహ్లాదమాహ్లాదయితుం తమేకం
సర్వస్యకుర్వన్ భువనస్యభీతిం
సైంహం దధే సంహననం పురా య
స్తవ స్తవ స్తత్ర కథం ప్రవృత్తిః ॥ 308

అ. యః=ఎవఁడు, తం=ఆ, ప్రహ్లాదం=ప్రహ్లాదుని, ఏకం= ఒక్కనిని, ఆహ్లాదయితుం=సంతోషపఱచుటకై, సర్వస్యభువనస్య=సకలలోకములకును, భీతిం=భయమును, కుర్వన్ = చేయుచు, సైంహం =సింహస్వరూపమైన, సంహననం=శరీరమును, పురా=ముందు, దధే=ధరించెనో, తత్ర = ఆనరసింహునియందు, తవ=నీయొక్క, స్తవః=స్తోత్రము, కథం=ఎట్లు, ప్రవృత్తః=ప్రవర్తించినది ?

తా. ఒకప్రహ్లాదుని సంతోషపఱచుటకై లోకమునంత భయపఱచుచు, సింహస్వరూపమును ధరించినవానినిగుఱించి నీ వెట్లు స్తోత్రము చేయుచున్నావు ?

తే. ఒకనిఁ బ్రహ్లాదుఁ బ్రాహ్లాదు సేయఁ జేయ నొనరుచుటకు
సకలభువనంబులకు భీతి సలుపు చిటుల
సింహసంహననము ధరించెను నెతండు
అతనిఁ గొని కొనియాడెదు వీవిత మదెటుల?

టి. ప్ర+ఆహ్లాదుఁ=ప్రకృష్టమైన సంతోషము గలవానిని గా.

విశ్వావసుః.—

గ॥ వయస్య! సైంహం వాక్యం... 309

వ. చెలికాఁడా! యీపగిదిని బలు కాడకుము. ఏల యంటేని?

వృ॥ అపుణ్యధౌరేయహిరణ్యదూన
త్రిలోకశోకక్షపణాయ శౌరిః
కాయాధవాయాసనిరాసదంభాత్
స్తంభాదిహాజృంభత సంభ్రమేణ॥ 310

అ. శౌరిః=విష్ణువు, అపుణ్య-ధౌరేయ-హిరణ్య-దూన-త్రిలోక-శోక-క్షపణాయ=పుణ్యహీనులందు ప్రధానుఁడైన-హిరణ్యకశిపుని చేత- దుఃఖితములైన-త్రిలోకములయొక్క-దుఃఖమును-పోఁగొట్టుటకై, కాయాధవ-ఆయాస-నిరాస-దంభాత్ =కయాధు వనెడిలీలావతికి పుత్రుఁడైనప్రహ్లాదునియొక్క-శ్రమమును -పోఁగొట్టుటయందలి- ఉద్రేకమువలన, ఇహ = ఇక్కడ, స్తంభాత్ = స్తంభమునుండి, సంభ్రమేణ=అతివేగముతో, అజృంభత=విజృంభించెను.

తా. హిరణ్యకశిపుని సంహరించి త్రిలోకములకును శోకము లేకుండుటకై లీలావతీకుమారుఁడైనప్రహ్లాదునికష్టములు దీర్చుటకై యావిష్ణువు ఈయుక్క స్తంభమునుండి, ఇక్కడ విజృంభించి ప్రత్యక్షమయ్యెను.

తే. ఖలుఁడు ఘనుఁడు నగుహిరణ్యకశిపువలన
ముజ్జగంబులు పడుపాటు లుజ్జగింప
నతనిసుతునెపంబున నవతరించె
స్తంభమున సంభ్రమమున విజృంభణమున.

గ॥ ఇదం చావధార్యతాం॥

వృ॥ మనుష్యతిర్యక్త్వ ముపేత్య సద్యో
దేవ స్స్వయం స్థావరతోఽభ్యుదంచన్
విచిత్రశక్త్యన్వయ మత్ర వేద్యైః
ప్రతాయ్యమానం ప్రకటీకరోతి॥ 311

అ. దేవః=స్వామి, మనుష్యతిర్యక్త్వం=మనుష్యత్వమును, మృగత్వమును, ఉపేత్య=పొంది, స్థావరతః=జడమైన స్తంభమునుండి, సద్యః=అప్పుడే,

స్వయం=తానుగానే, అభ్యుదంచన్ = ఆవిర్భవించుచును, వేదైః=వేదముల చేత, ప్రతాయ్యమానం=ప్రకటింపఁబడుచున్న, విచిత్రశక్త్యన్వయం=ఆశ్చర్యమైన సామర్థ్యముతోడి సంబంధమును, అత్ర=ఇక్కడ, ప్రకటీకరోతి=ప్రసిద్ధపఱచుచున్నాఁడు.

తా. ఇక్కడ భగవంతుఁడు మనుష్యుఁడుగానైనఁ గాక, మృగముగానైనఁ గాక ఉభయరూపము గావించుకొని, తల్లివలన లేక స్తంభమువలననే తొమ్మిదినెలలైనను గాక, అప్పుడే ఆవిర్భవించుచు, వేదవిహితమైన అఘటనఘటనాపటిమను, ఈపామరలోకమందు ప్రకటించుచున్నాఁడు.

వ. ఇదియు వినుమదియ.

సీ. మానవాకారము ♦ మఱి తిర్యగాకార
　　మేకమై తొమ్మిది♦యేని నెలలు
కాకున్న జననియే ♦ కాకున్న జడమున
　　నెవఁడుఁ గా కిటు లౌనె ♦ యవతరించి
యేదియో కాక త్ర♦యీవిద్యలే కూడి
　　వెల్లడి చేసెడి♦విభవవిషయ
మఘటితఘటనాస♦మర్థత ప్రకటించెఁ
　　బామరప్రచుర మీ♦భూమి నిచట

తే. దేవదేవుఁడు దివ్యాను♦భావుఁ డితఁడు
చరితచాతుర్యుఁ డాశ్చర్య♦చర్యుఁ డెపుడుఁ
గంటె? కనులారఁ జెవులార ♦ వింటె? నీవు
తొంటిమూర్ఖ్యులే కనలేక♦యుంట వింటె.

టి. తిర్యక్కులు=పశుపక్ష్యాదులు, త్రయీవిద్యలు=వేదవిద్యలు, అఘటితఘటనాసమర్థత=ఘటింపనిదానిని నంతయు ఘటింపఁజేయుటందలి సామర్థ్యము, పామరప్రచురము=అజ్ఞులతో విస్తారమైన, దివ్య + అనుభావుఁడు=దివ్య

మైనప్రభావము గలవాఁడు, చరితచాతుర్యుఁడు=నడుచుకొన్న చమత్కారము గలవాఁడు.

పునస్సవిస్రంభం=మఱియు నమ్మకమ్మున.

శ్లో॥ ఘటికాచలం వపురవేత్య తత్త్వతో
ఘటికాచలం సమధిరుహ్య భక్తితః।
నరకేసరీంద్రచరణౌ విలోకయన్
నరకే సరిష్యతి నజాతు మానవః॥ 312

అ. మానవః=మనుష్యుఁడు, వపుః=శరీరమును, తత్త్వతః=స్వభావముతో, ఘటికాచలం=గడియలో నశించునదిగా, అవేత్య=తెలిసికొని, ఘటికాచలం=చోళంగివరముకొండను, సమధిరుహ్య=ఎక్కి, భక్తితః=భక్తితో, నరకేసరీంద్రచరణౌ=నరసింహస్వామిపాదములను, విలోకయన్ = దర్శనముచేయుచు, జాతు=ఒకప్పుడును, నరకే=నరకమందు, నసరిష్యతి=జాఱిపడఁడు.

తా. మనుష్యుఁడు తనశరీరము గడియలోనైనను, నశింపకుండునదికాదని తెలిసికొని, భక్తి గలవాఁడై యీఘటికాచలమునకు వచ్చి ఆనరసింహస్వామి పాదములను సందర్శించినయెడల, ఎప్పుడును నరకమున జాఱిపడఁజాలఁడు.

క. ఘటికాచల మచలమ యగా
పటుభక్తిని నెక్కి నిక్కపువము నరసింహుగన్
ఘటికాచలమేనిగా మే
నిటు లేనరుఁడుం గని నరకమెపుడున్ గనఁడౌన్.

దం. చలనముకానిదే యగు దృఢమైనభక్తితో ఘటికాచలమునెక్కి గడియలో చలించునదియని ఈదేహమును తెలిసికొనునట్టి యేమనుష్యుఁడును ఆనరసింహునిఁ గనఁగొని నరకము నెపుడును గనఁడు. ఔను? ఇది నిక్కువము.

## పీఠారణ్యావర్ణనమ్.

గ. ఇతి విమానమన్యత స్సంచోదయన్ సహర్షమ్॥ 313

వ. అని విమానమును మఱొక్కప్రక్కకు నడపుచు సంతోష
ముతో.

వీక్షారణ్యము=తిరువెవ్వుళ్లూరు—ఇది సుందరమైనచందనాదితరులతాదుల చేత వీక్షింపఁదగినది యైనందున వీక్షారణ్య మనియు; వీరరాఘవులే శాలి హోత్రమహాముని నేను నివసించుటకు కింగృహం=ఎవ్వుళ్=ఏయిల్లు అని అడిగినందున కింగృహ మనియు; మఱియు మధుకైటభులు అనురాక్షసులు దేవలోకమున దేవతలనే గాక భూలోకమున మహర్షులయజ్ఞాదికర్మలును చెఱుచుచు వారివారిని బాధించుచుండఁగా దేవతలు క్షీరసాగరమునకు పోయి శ్రీమన్నారాయణునితో మొఱపెట్టి అతనిచేత వారి నిందు సంహరింపఁజేసినది కాక; ఇందు తపస్వి యైనశాలిహోత్రమహాముని నిరాహారుఁడై చేసెడువైశ్వదేవము అనుయజ్ఞమున అతని పరీక్షించుటకై బ్రాహ్మణవేషధారియై వచ్చి ఆనారాయణుఁడు క్షుధార్తుఁడనై యున్నవాఁడను అని అన్నమును యాచింపఁగా అతఁ డప్పు డన్నము పచనముచేసి పెట్టి భుజింపఁజేసి అతనివలన మోక్షము నపేక్షించి ముక్తుఁ డైనదియే కాక; మఱియు కాశికచండాలకన్యకాసంగమమున కులాచారకర్మాచరణభ్రష్టుఁ డయ్యును ఇందలి హృత్తాపనాశినీస్నానఫలమున పవిత్రుఁ డైనదియే కాక, ఇందు చేసినస్వల్పపుణ్యము అధికముగా ఆవర్తించుటచేత-మఱలుటచేత పుణ్యావర్త మనియును పేరొందియున్నయది.

శాలిహోత్రుఁడు:—ఇతఁడు తనతపఃప్రభావముచేత ఆఁకలిదప్పు లడఁగి పోయెడినీటితోడితటాకముతోడఁ గూడుకొని యున్నయాశ్రమమున తపస్సు చేయుచున్నయొకమహర్షి.

వృ॥ వీక్షారణ్య మిదం వదంతి సరసీ హృత్తాపనాశి న్యసా
వస్యాం పోధసి వీరరాఘవ ఇతి ప్రఖ్యాతనామా హరిః ।
వ్యక్తం రాజతి వీతిహోత్ర ఇవ యో విస్తీర్ణ హేతిద్యుతిః
క్షేత్రం ప్రాప్తకుశస్థలీ ప్రభజతి శ్రీశాలిహోత్రాంచితమ్॥

అ. ఇదం=ఈక్షేత్రమును, వీక్షారణ్యం=వీక్షారణ్యమని, వదంతి=చెప్పుచున్నారు, అసౌ=ఈ, సరసీ=తీర్థము, హృత్తాపనాశినీ=మనస్తాపముల నశింపఁజే

యన్నది, అస్యాః - రోధసి=దీనిగట్టున, వీరరాఘవఇతి=వీరరాఘవులని, ప్రఖ్యాతనామా=ప్రసిద్ధమైననామము గల, యః=ఏ, హరిః=విష్ణువు, వ్యక్తం=స్పష్టముగా, వీతిహోత్ర ఇవ = అగ్నిహోత్రుఁడువలె, రాజతి=ప్రకాశించుచున్నాఁడో, విస్తీర్ణహేతిద్యుతిః=విశాలములైన చక్రాద్యాయుధములయు-జ్వాలలయు కాంతులుగలవాఁడై, శ్రీశాలిహోత్రాంచితం=శ్రీశాలిహోత్రమహర్షిచేత పూజింపఁబడిన, తత్ క్షేత్రం=ఆవీక్షారణ్యక్షేత్రమును, ప్రాప్తకుశస్థలీ=అందుచేరిన కుశస్థలి యనునట్టినది, ప్రభజతి=ఆశ్రయించుచున్నది.

తా. ఈక్షేత్రము వీక్షారణ్యమనియు, ఇందలితీర్థము తాపనాశని యనియు, ఇందలివిష్ణువు వీరరాఘవు లనియు ప్రఖ్యాతి చెంది విష్ణువు అగ్నిహోత్రుఁడువలె,జ్వాలలతోను ప్రకాశించుచు, కుశస్థలి యనునదితోఁ గూడి శాలిహోత్రమహర్షిచే పూజింపఁబడినయాక్షేత్రమందు ప్రకాశించుచున్నాఁడు.

సీ. వినుము ! వీక్షారణ్య మనునది యిది యం్రదు
సరసు హృత్తాపనాశని యి దంద్రదు,
ఆసరస్తీరమం దాహరి శ్రీవీర
రాఘవు లను పేరఁ బరఁగుచుండు,
ఆవీరరాఘవు లావీతిహోత్రుఁడు
వలె హేతిజైత్రుఁడై వెలయు ; నిందు
శాలిహోత్రుఁడు పూతచారిత్రుఁ డర్చించు
తత్క్షేత్ర మిదె కుశస్థలిని గలది

తే. కనుక నే యిందు వీరరాఘవులె యిందు
శేఖరాదులు తమశిరశ్శేఖరాళి
యర్చలను నర్చ లొనఁగించు నడుగులఁ గల
వాఁడై కింగృహస్థుఁడు చూడు వేడు కలర.

టి. హేతిజైత్రుఁడై=జ్వాలలతోను కాంతులతోను జయశాలి యై, పూతచారిత్రుఁడు=పవిత్రచరిత్రుఁడు, ఇందుశేఖరాదులు=చంద్రశేఖరుఁడు మొద

లగువారు, అర్చులను=కాంతులతో, కింగృహము=ఏమియిల్లు? స్వల్పగృహము (తిరు ఎవ్వుళ్ ఊరు=తిరువెవ్వుళ్లూరు).

గ॥ ఆకలయతు భవా నత్రేమం చమత్కారమ్॥

వ. నీవీచమత్కార మిందుఁ గనుఁగొందుగాఁక. 315

## శ్రీవీరరాఘవవర్ణనమ్.

వీరరాఘవస్వామి. వీరు—కనకవల్లితాయారుతో విజయకోటివిమానమున భుజంగశాయియై హృత్తాపనాశినీసరస్తీరమున కుశస్థలిలో శాలిహోత్రమహాముని కి ప్రత్యక్షమై తిరుమళ్లిశై తిరుమంగై యాళ్వార్లమంగళాశాసనములతో సేవ సాయించుచున్నవారు.

శ్లో॥ ద్విరేఫవర్ణాం సుమనోరమాం తనుం
బిభర్తి సంజ్ఞా మివ వీరరాఘవ
స్సుపర్వరాజేన యదీయ మంచితం
ముఖం పదద్వంద్వమివోపశోభతే॥ 316

అ. యదీయం=ఏవీర రాఘవులదియైన, ముఖం=మొగము, సుపర్వరాజేన=మంచి పున్నమచంద్రునిచేత, అంచితం=పూజింపఁబడినది గాను, పదద్వంద్వం=పాదములజంట, సుపర్వరాజేన=దేవతలరాజైన యింద్రునిచేత, అంచితమివ=పూజింపఁబడినదిగానువలె, ఉపశోభతే=ప్రకాశించుచున్నదో? సవీరరాఘవః=ఆవీరరాఘవులు, తనుం=తనశరీరమును, ద్విరేఫవర్ణాం=తుమ్మెదవర్ణమువంటివర్ణము గలదై, సుమనోరమాం=పుష్పమువలె రమింపఁజేయునది గాను, సంజ్ఞాం=తనపేరును, ద్విరేఫవర్ణాం=రెండురేఫాక్షరములు కలదై, సుమనోరమామివ=దేవతలను రమింపఁజేయునదిగాను వలె, బిభర్తి=భరించుచున్నవాఁడు.

తా. చంద్రుఁడు ముఖములో సమానుఁడుగా, ఇంద్రుఁడు పాదముల నర్చించువాఁడుగానుండు వీరరాఘవస్వామి దేవతలకు మనోహరమై పువ్వులవంటిదై, భ్రమరశబ్దార్థకద్విరేఫమను తుమ్మెదవలె నీలవర్ణమైనశరీరమును వీరరాఘవశబ్దస్థద్విరేఫములు గల తనపేరునువలె ధరించుచున్నవాఁడు.

తే. వీరరాఘవుఁడును జమత్కారి యూర !
సంజ్ఞయనువునఁ దనువును సంగ్రహించె
మొగముసరణిన చరణాబ్జయుగముఁ గాంచె
మఱి ద్విరేఫవర్ణమనోరమమును గాఁగఁ
దగి సువర్ణరాజసమంచితమును గాఁగ.

టి. ద్విరేఫము=రెండురేఫములుగల భ్రమరపదవాచ్యము తుమ్మెదయు, వీరరాఘవపదవాచ్యము స్వామియు (శ్లేషక్రమాలంకారములు.)

కృశానుః.—

గ॥ వయస్య! కిం సన్నహ్యసి వీరరాఘవ స్తవనే యదస్మిన్నపి పన్నగనగనాథ ఇవ పరధనగ్రహణపరత్వాదయః ప్రాదుష్యంతిదోషాః ॥ 317

వ. సఖా ! సన్నాహపడుచున్నా వేమిరా? ఈవీరరాఘవుని వినుతించుటయందు, ఎందు కనిన, నితనియందు నావేంకటాచలపతియందునలె పరధనపరత్వాదిదోషదూషణములు ప్రకర్షముగను గలిగియున్నవి గనుక.

విశ్వావసుః —

గ॥ తత్రాస్మదుక్తైనైవ తత్సమాధానేన పునరత్రాపి సంతోష్టవ్యమాయుష్మతాభవతా; పామరతే! రమతే నకస్యమనో వీరరాఘవే దేవే॥ 318

వ. అందు, మావచియించినయీసమాధానవచనముతోనే యిందును ఆయుష్మంతుఁడవై ననీవును సంతోషింపవలయును ; ఓమందమతీ ! ఎవనిమతి యీవీరరాఘవ దేవునందు నానందము నొందకయున్నయది !

వృ॥ స్వేక్షాసాధ్యజగజ్జని స్సుతనుపల్లాక్షాంకితోరఃస్థల
స్సాక్షాదేవపరఃపుమాన్ కృతనుతి ర్దాక్షాయణీశాదిభిః।
వీక్షారణ్యపతి ర్విరాజతి గతి ర్ద్రాక్షాసదృక్సాహితీ
ధీక్షాంత్యాయురరోగతాధనయశోమోక్షాద్యపేక్షావతాం॥

అ. స్వేక్షా - సాధ్య - జగజ్జనిః = తనచూపుమాత్రముచేత నే - సాధింపఁదగిన - జగత్సృష్టి గలవాఁడును, సుతను - పత్ - లాక్షా - అంకిత-ఉరఃస్థలః= తన స్త్రీ యైనలక్ష్మియొక్క - పాదమందలి - లత్తుకచేత - గుర్తింపఁబడిన - వక్షఃస్థలము గలవాఁడును, సాక్షాదేవ=సాక్షాత్తుగానే, పరఃపుమాన్=పరమపురుషుఁడును, దాక్షాయణీశాదిభిః=శివుఁడు మొదలైనవారిచేత, కృతనుతిః= చేయఁబడినస్తోత్రము గలవాఁడునైన, వీక్షారణ్యపతిః = ఈవీక్షారణ్యమునకు పతియైన వీరరాఘవులు, ద్రాక్షాసదృక్ - సాహితీ - ధీ - క్షాంతి - ఆయుః-అరోగతా - ధన - యశః - మోక్ష - ఆది - అపేక్షావతాం=ద్రాక్షతో సమానమైన - సాహిత్యము - బుద్ధి - ఓర్పు - ఆయుస్సు - ఆరోగ్యము-ద్రవ్యము-కీర్తి-మోక్షము - మొదలైనవానియందు - అపేక్ష గలవారికి, గతిః=దారియై, విరాజతి=ప్రకాశించుచున్నాఁడు.

తా. కటాక్షమాత్రముచేత జగత్సృష్టి చేయుచు, లక్ష్మిపాదములందలిలాక్షారసము వక్షఃస్థలమున గుర్తించుకొనుచు, రుద్రాదులస్తోత్రము కైకొనుచు, ఈవీక్షారణ్యమున సాక్షాత్తుగా పరమపురుషుఁడైనవీరరాఘస్వామి పాండిత్యమత్యాయురారోగ్యాదు లపేక్షించువారి కిచ్చుచుఁ బ్రకాశించుచున్నవాఁడు.

సీ. ఎవనిసంకల్ప మాభువనసంఘములకు
జననావనవినాశజననభూమి,
ఎవనియురంబ యాభువనమాతకు మహా
చారుతలవిశాలచంద్రశాల,
ఎవనిగుణావళి భవభవాన్యాదిదే
వావళివినుతుల కాస్పదంబు,

ఎవనిపరత్వంబు ♦ దివిజశేఖరులలో
శ్రుతిశిరఃప్రకరంబు ♦ శ్రుతముపఱచు.

తే. నతఁడ వీక్షావనాధిపుఁ ♦ డర్థి కర్థి
సుమతి సాహితి ధృతి నీతి ♦ శమము దమము
నాయు వారోగ్య మైశ్వర్య ♦ మనిశయశము
మొదలుగా నోయ నీయఁగా ♦ ముఖ్యగతియ.

టి. చారుతల=సొగసైన స్థలములచేత, భవభవాన్యాది=పరమేశ్వరుఁడు పార్వతి మొదలైన, శ్రుతిశిరఃప్రకరంబు=వేదాంతసమూహము, అర్థికిన్=యాచకునికి, అర్థిన్=కోరికలో, ఓయన్=వరుసగా.

కించ.—

వృ॥ ఉపేక్ష్యవీక్షావన మున్నత స్సదా
సువర్ణవల్ల్యా సుమనః పుషాఽఽశ్రితః।
అహీనసేవ్యో హరిచందన స్తనో
త్యుపాశ్రితానా ముచితాం సువాసనామ్ ॥ 320

అ. సదా=ఎప్పుడును, సుమనః పుషా = దేవతలను-పుష్పములను-పోషించునట్టి, సువర్ణవల్ల్యా=కనకవల్లియనెడి లక్ష్మితోను-సంపంగితీఁగతో, ఆశ్రితః=ఆశ్రయింపఁబడినదై, ఉన్నతః=పొడవైనదై, అహీనసేవ్యః=సర్పరాజుచేత-పెద్దలైనవారిచేతను సేవింపఁబడునదైన, హరిచందనః=హరి యనెడు హరిచందన వృక్షము, వీక్షావనం=ఈవీక్షారణ్యమును, ఉపేక్ష్య=చేరి, ఉపాశ్రితానాం = తన్నాశ్రయించినవారికి, ఉచితాం=తగుమైన, సువాసనాం=మంచిభావనను - మంచిపరిమళమునున్, తనోతి=చేయుచున్నది.

తా. మంచిపుష్పలు గలసంపంగితీఁగెలతోఁ గూడి, సర్పశ్రేష్ఠములతోను గూడి, పొడవైన హరిచందనవృక్షమువలె, దేవతలను బోషించునట్టి కనకవల్లి తాయారులతోఁ గూడి, మహోన్నతుఁడై, మహోన్నతులైనవారితో ఆదిశే

షునితోఁ గూడిన యావీరరాఘవస్వామి, ఆవీక్షారణ్యమును జేరి తన్నాశ్ర యించినవారికి మంచివాసనవలె, మంచిభావనను గలుగఁజేయుచుండును.

మఱియు.—

తే. ఇందు వీక్షావనీ హరిచందన మిదె
యెల్ల వేళల సుమనస్సముల్లసితము
స్వర్ణవల్లీ సమేతము సహదహీన
పదము శ్రితశుభ వాసనాస్పదము గనుము?

టి. సహదహీనపదము=సహించునట్టి సర్పరాజులకు-ఆదిశేషునకు స్థానము. (శ్లేషాలంకారము.)

గ॥ ఇత్యన్యతో విమానం ప్రేక్షయ న్నగతో వీక్ష్య సంప్రత్య భిజ్ఞమ్॥   321

వ. అని మఱొక్కప్రక్కకుఁ విమాన మానయించుకొంచు నెదురఁ గనుఁగొని జ్ఞప్తిం జేసికొని.

## శ్రీభూతపురీవర్ణనము.

(భూతపురి—ఇది - అక్కడిచెఱువునకు తూర్పునను మూలమండపమున కుత్తరమునను ఉండు భూతేశ్వరుని దేవస్థానమందలి యాభూతేశ్వరుఁడును తనభక్తులైన భూతరాజములతో దర్శింపఁబడు చుండునది.)

ఈభూతపురియే—శ్రీ యాదికేశవ స్వామిసన్నిధి ముందున్న దానికన్న వెనుకటి ప్రాబల్యారంభమందు గోపురమండప ప్రాకారాదుల నిర్మాణములో ఆస్వామి గర్భగృహమునకు నెదుట ఆస్థానమండపారంభమందు దానికి తగిన చతుస్తంభాలు లభించనందున ఆకైంకర్యనిర్వాహకుం డైన తొండమాన్ చక్ర వర్తికి తాము సాయించినస్వప్నప్రకారము ఆచెఱువులో ఆ స్తంభములను కని పెట్టియును దాని ప్రతిమావిశేషములతోడి స్థాల్యౌన్నత్యములనుబట్టి యెట్టివా రికిని పైకెత్తఁ బట్టువడకపోయి చింతాక్రాంతుఁ డై యుండునారాజుస్వప్న ములో మఱల ఆభూతేశ్వరుఁడు తానే చెప్పి ........ తనభక్తులైన మ

హాభూతములచేత తెప్పించి, మీరు తెచ్చియిచ్చిన మేలిమికి మీరే అందావహించి అంపలివైభవములతో యతిరాజులకు ప్రత్యక్షమై యున్న ఆస్వామిని ఆయతిరాజవల్లి త్తాయారుతో సేవించుకొంచు నుండుండని నియమించియుండునది యిప్పటికిని కనుఁగొనువారికి ఆచితు స్తంభాలగంభీరాకారము లాశ్చర్యకరములై యున్న సన్నిధివైభవములతోను, మఱి శ్రీమద్రామానుజముని పరవరముని కూరనాథ ప్రభృతిసన్నిధుల వైభవములతోను, మఱియు మఠసత్రమందిరారామతటాకాములతోను, అందంపలి యుత్సవానుకూలాంతరాళబంగాళాలతోను విచిత్రతరమై యుండు నీతొండమండలమందలి శ్రీపెరుంబూదూరై యుండునది.

వృ॥ ఏషా భూతపురీ నిరీక్షితచరీ దోషాపహంత్రీ నృణాం
శ్రీమా న్యత్రగుణాబ్ధి రావిరభవద్రామానుజాఖ్యో మునిః
త్రయ్యంతామృతసింధుమంథనభవ ద్ధైయంగవీనాత్మకం
విజ్ఞానం యదుపజ్ఞమేవ విదుషా మద్యాపి విద్యోతతే॥ 322

అ. గుణాబ్ధిః=సకలసద్గుణసముద్రుఁడైన, శ్రీమాన్=ఉభయవిభూత్యైశ్వర్యముగల, రామానుజాఖ్యోమునిః=శ్రీమద్రామానుజులు అను తిరునామముగల మునులు, యత్ర=ఎక్కడ, ఆవిరభవత్=అవిర్భవించిరో? త్రయ్యంత - అమృతసింధు - మంథన - భవత్ - హయ్యంగనీన - ఆత్మకం=వేదాంతములనెడు - పాలసముద్రముయొక్క - తఱచుటవలన - కలుగుచున్న - వెన్నవిశేషమే - స్వరూపముగాఁ గలదియైన, విజ్ఞానం=విశిష్టాద్వైతజ్ఞానము, విదుషాం=విద్వాంసులలో, యత్ - ఉపజ్ఞమేవ=ఎవరివలన జ్ఞాపకమే యై, అద్యాపి=ఇప్పుడును, విద్యోతతే=ప్రకాశించుచున్నదో? యత్ర=ఎక్కడ, దోషాపహంత్రీ=దోషములను పడఁగొట్టునదియైన, సా=అ, ఏషాభూతపురీ=ఈ శ్రీపెరుంబూదూరు, మయా=నాచేత, నిరీక్షితచరీ=చూడఁబడినది.

తా. ఇదో సకలదోషములను పరిహరించు నీశ్రీపెరుంబూదూరు నేను చూచితిని. ఇది-పాలసముద్రమున తఱచినయమృతమువలె వేదాంతములందు తెలి

షించిన విశిష్టాద్వైత విషయమును విద్వాంసులకు ప్రధానజ్ఞాపకమునుగాఁ గలి
గించి సకలసద్గుణసముద్ర మైన శ్రీమద్రామానుజమునులయవతారస్థలము.

శా. శ్రీరాజిల్లు ప్రభూతభూతిపురి వీక్షింపంబడెన్ మాకు మున్
శ్రీరామానుజమౌనిమౌళి సుజనశ్రేష్ఠుఁడార్థి జన్మించె నెం
డారా! వేదశిరోమృతాబ్ధిమథనశ్రీహైయంగవీనంబుగన్
సారజ్ఞుల్ గనుగొందు రుపజ్ఞగను దత్సంబంధివిజ్ఞానమున్.

టి. ప్రభూతి=ప్రసిద్ధమైన, హైయంగవీనము=అప్పుడె దీసిన వెన్న, ఉపజ్ఞ
గను=ఆద్యజ్ఞానముగాను, తత్సంబంధి=ఆరామానుజమునిసంబంధియైన, (రూప
కాలంకారము.)

## శ్రీమద్రామానుజమునీంద్ర వర్ణనము.

శ్రీమద్రామానుజమునీంద్రులు—వీరు-శ్రీపెరుంబూదూరిలో శ్రీయాదికేశవ
స్వామిసన్నిధికిముందు ఆసూరికేశవాచార్యులవలన కాంతిమతీదేవికి తిరువనం
తాళ్వానునంశమున అవతరించి, ఇళైయాళ్వా రని తిరునామము ధరించి;
యాదవప్రకాశులయొద్ద విద్యాభ్యాసములో శ్రుతిస్మృతు లధికరించి, కప్యా
స మనుశ్రుతి కపార్థము విని సార్థము సాధించి; చోళరాజుపుత్రికి శ్రీపాదతీ
ర్థముచే బ్రహ్మరక్షస్సును తొలఁగించి; పాండ్యరాజుసభలో సరస్వతిని శ్రీభా
ష్యముచే మెప్పించి, తిరుకోట్టియూర్నంబిగారియొద్ద తాము పదునెనిమిది
మార్లు తిరిగి, లభించినచరమశ్లోకార్థము అక్కడిగోపుర మెక్కి అందఱకును
ప్రకటించి; తమ ఆచార్యులైన ఆళవందార్లు పరమపదమునకు వేంచేయునపుడు
వారిప్రేలిసంజ్ఞ కనిపెట్టి బ్రహ్మసూత్రభాష్యము రచియించి; శ్రీజగన్నాథమున
శ్రీపురుషోత్తముని సేవింపఁబోయి, తమనిదురలో వారిచే మోసికొనఁబడివచ్చి
విడిపించినకూర్మాచలములో సింహాచలమును సేవించి; తిరునారాయణపురము
నకుఁ బోయి అందుండి ఢిల్లికిఁ బోయి అందుండి బూబునాచ్చారుతో చెల్వ
పిళ్లను ఆమేల్కోటకు వేంచేపించి, శేషాకారమున వేయిఫణములతో అక్క
డిపండ్రెండువేలజైనులను జయించి; కోనేటి పెరుమాళ్లో వైల తిరుమల తిరు

నారాయణపుర పురుషోత్తమ సాలగ్రామ బదరికాశ్రమ నైమిశారణ్యాది దివ్యదేశములను సేవించి మంగళాశాసనము చేసిరి.

(వీరిపంచాచార్యులు—వీరు-పంచసంస్కారతిరుమంత్రద్వయార్థములు సాయించిన పెరియనంబిగారును, చరమశ్లోకార్థమును సాయించిన తిరుక్కోట్టియూర్నంబిగారును, శ్రీమద్రామాయణ మంత్రరాజమును సాయించిన తిరుమలనంబిగారును, సహస్రశాఖార్థమును సాయించిన తిరుమాలెయాండాన్, అంతిమోపాయమును సాయించిన తిరువరంగప్పెరుమాళరయరును - వీరె పంచాచార్యులు.)

(వీరితిరునామములు—అనంతాళ్వానువలన ఇళైయాళ్వారనియు, ఆళవందార్లవలన మొదల్వా ననియు, తిరుక్కోట్టియూర్నంబిగారివలన ఎంబెరుమానారనియు, నంబెరుమాళ్లవలన ఉడయవరు లనియు, తేవప్పెరుమాళ్లవలన రామానుజముని యనియు, చూడిక్కొడుత్తనాచ్చియారువలన కోవెలణ్ణ ననియు, పాండ్యరాజుసభలో సరస్వతివలన భాష్యకారు లనియు వీరితిరునామములు.)

(వీరువిరచించినగ్రంథములు—వ్యాససూత్రభాష్య, గీతాభాష్య, తర్కభాష్య, వేదాంతతత్త్వసార, వేదాంతసంగ్రహ, వేదాంతప్రదీప, న్యాయామృత, నారదీయపాంచరాత్ర, రంగనాథస్తవ, గద్యత్రయాద్యనేకస్వరూప గ్రంథములు.)

(వీరిశిష్యులు—కూరత్తాళ్వార్ మొదలు-అనంత, అకలంక, అరుణప్పర, ఈయుణ్ణి, ఉక్కల, కరంజి, కోయిల, గోమఠ, తిరుక్కోలూర్, తిరుమోకూర్, నడాదూర్, నడువిల, నెయ్యుండి, పిళ్లై, మాడిభూషి, మిళగ, వేదాంతి, శిట్టియూర్ శిరి, అను-ఆళ్వార్లును; మొదలియాండార్ మొదలు-పెరియ, శిరియ, కుంజప్పురచ్చి, అరయ, అమ్మంగి, అయ్యర్, ఆళవందార్, ఈయుణ్ణి, ఈశ్వర, మారుతి, మారొన్నిల్లామారుతి, సోమాసి, అను-ఆండార్లును, కిడాంబియాచ్చార్ మొదలు-శిరియ, కణియనూర్చిరియ, ఆచ్చి, ఈచ్చంబాడి, ఎన్న, కొంగిల, అయ్యాపిళ్లై, తూయప్పిళ్లై, అను-అచ్చార్లును; వడుగనంబి మొదలు-కురుంజ, వంగిపుర, చొట్టై, ముడుంబై, మరుదూర్, మళపూర్,

తొండనూర్, కొమాండూర్, తిరుక్కురుగూర్, శ్రీవిల్లిపుత్తూర్, శ్రీపరాంకుశ, అను-నంబులును; శ్రీభట్టర్ మొదలు-శ్రీపరాంకుశ, శ్రీగోవింద, తిరువరంగ, అళగియమణవాళ, తిరుప్పల్లి దేవరాజ, వరందరుం పెరియ పెరుమాళ్, ఉళ్లూర్పెరియ పెరుమాళ్, నంబియూర్, శ్రీరంగరాజ, అను-భట్టర్లును; శ్రీకులశేఖరజియ్యర్ మొదలు ఆళ్ కొండవల్లి, ఈచ్చంపాడి, గోవింద, సాలగ్రామ, తిరునారాయణపుర, తిరువాయిమొళ్ళి, తిరువెళ్లరె, తిరుమళ్ళిశి, తిరుపుళ్ కుళ్ళి, తిరుక్కొడందె, తిరుపుష్ణం, తిరునిన్రయూర్, తిరుమాలిరుంశోలై, అను-జీయర్లును; తిరునారాయణపుర త్తరయర్, మొదలు-పెరుమాళ్ కోయిల్పెరుమాళ్, రాజనారాయణ పెరుమాళ్, రాజమహేంద్రప్పెరుమాళ్, తిరునరంగమాళిగై, తిరువాయిమొళ్ళి, తిరునగరి, తిరుక్కురుంగుడి, తిరుక్కణ్ణపుర, తిరువనంతపుర, తిరుమాలిరుంశోలె, తిరువేంగడంపిళ్లై, తిరునరైయూర్, అను-అరయర్లును; ఆసూరి పెరుమాళ్, మొదలు-కిడాంబి, అమ్మంగి, ఆర్కాట్టు, పట్టని, ముని, శ్రీకులశేఖర, అను-పెరుమాళ్లును; ఎంబార్, మొదలు-కరాంజిసోమయాజి, పెరియకోవిల్వళ్లల్, అణియరంగత్తముదన్, అను,ఆండాన్లును; పట్టరఫిరాన్ దాసర్ మొదలు-శ్రీవిల్లిపుత్తూర్, శ్రీనారాయణ, శ్రీగోవర్ధన, శ్రీశఠగోప, శ్రీరామానుజ, యతివరచూడామణి, పక్కైవిల్లి, పిళ్లైయురంగావిల్లి, తిరువేంగడ, తిరువరంగ, తిరుమాలిరుంశోలై, తిరువాయ్ మొళ్ళి, పిళ్లైతిరువాయ్ మొళ్ళి, తిరువళ్ళులివళైనాట్టు, వానమామలై, అళ్ళకియమణవాళ, పేరరుళాళ, మకిళలంకార, అను-దాసులును; వీరసుందరబ్రహ్మరాయర్ మొదలు-జగన్నాథ, వీరరాఘవ, అనుబ్రహ్మరాయర్లును; రామానుజంపిళ్లాన్ మొదలు-తిరునగరి, తిరుకురుకైప్పిరాన్, అను-పిళ్లాన్లును, గోమఠత్తయ్యర్ మొదలు-పెరియ, శిరియ, వైత్తమానిధి, అను-అయ్యర్లును; మఱి, అరుళాళప్పెరుమాళెంబెరుమానార్, ఎంబెరుమానార్శెల్వప్పిళ్లై, వంటర్, శుంటర్, అరియవర్, ఆంటవర్, అనువారును; మఱియు, తిరువనంతపురత్తమ్మై, మొదలు-తిరువాట్టార్, తిరువణ్ పరిశారం, తిరునరైయూర్, తిరుప్పతి, తిరు[illegible] [illegible] అమ్మంగి [illegible], అను అమ్మైయా

ర్లును; నాయకి త్తేవియార్, మొదలు-పెరియపెరుం, శిరియపెరుం, తుయ్యాపె రుం, తిరుక్కోడంధై తుయ్యవాయిరం, పెరుంబూదూ త్తిరువరంగం, అను-దేవియార్లును; పొన్నాచ్చియార్, మొదలు-కొంగిప్పిరాట్టి, దేవకిప్పిరాట్టి, య తిరాజవల్లి, పంకయచ్చెల్లి,ఇన్నిళఞ్జి, అనునాచ్చియార్లును; కూరత్తాంటాళ్ చూడిక్కొడుత్తాళ్, మొదలైన అమ్మైయార్లును-వీరిశిష్యులు.)

వీరిలో డెబ్బదినల్గురు సింహాసనస్థులు—వారు-ఆళవందార్ పుత్రపౌత్రులు-చొట్టైనంబి, పిళ్లైయప్ప, ఎన్నాచ్చాన్; పెరియనంబిగారిపుత్రులు - పుండరీకు లు; పెరియతిరుమలైనంబిగారిపుత్రులు - తిరుమలైనంబి, రామానుచన్ పిళ్లై; తిరుక్కోట్టియూర్నంబిగారిపుత్రులు-తెర్కాళ్వాన్, కూరత్తాళ్వాన్ పుత్రులు-భట్టర్, శ్రీరామప్పిళ్లై; మొదలియాండాన్ పుత్రులు- కంబాడెయాండాన్; మఱి నడువిలాళ్వాన్, గోమఠత్తాళ్వాన్, మొదలైనవార్లు.

వీరిలో ఉత్తమాశ్రమస్థులు ఏఘ్నార్గురు; ఏకాంగులు పండ్రెండువేగురు. ఈయేకాంగులందఱును, నంబులలో కొందఱును, అరయర్లలోకొందఱును, కొత్తైమ్మలలో కొందఱును, దాసులందఱును; మఱి-కూరత్తాండాన్, చూడి క్కొడుత్తాళ్, మొదలైన యమ్మగార్లును, చాత్తాదశ్రీవైష్ణవులు; తక్కిన ఆళ్వార్; ఆండాన్, ఆచ్చాన్, అరయర్, జీయర్, భట్టర్, మొదలైనవా ర లందఱును, మఱి-అమ్మైయార్, దేవియార్, నాచ్చియారు లందఱును. చాత్తినశ్రీవైష్ణవులు.

కించ—మఱియు.

వృ॥ కామాదివైరిగణ భీమానవద్యనిజ నామాభిలాపగరిమా
వైమానికార్యసమభూమావనౌవచనసీమాతిలంఘిమహిమా
శ్రీమా ననూనకలసోమాననో విమలధామావమానితరవిః
క్షేమాణిజృంభయతుభూమావముత్రచసరామానుజోయతిపతిః॥

అ. కామాది-వైరిగణ - భీమ-అనవద్య - నిజనామ - అభిలాపగరిమా=కా మక్రోధాదులనెడి - శత్రుసమూహమునకు - భయంకరమై - నిర్దోషమైన - తన పేరిని - కీర్తించుటయొక్క గౌరవము గలవాఁడును, అవనౌ =భూమియం

డు, వైమానికార్య - సమభూమా=దేవతలకు గురువైనబృహస్పతికి - సమాన
మైన ఐశ్వర్యత్వాతిశయముగలవారును, వచనసీమ - అతిలంఘి - మహిమా =
వాక్యాంతములచేత - దాఁటునట్టి - మహిమగలవారును, అనూనకల -
సోమాననః=కొఱంతలేని కళలుగల - చంద్రునివంటిముఖము గలవారును, విమ
లధామ - అవమానితరవిః=నిర్మలమైనకాంతితో-అవమానింపఁబడిన సూర్యుఁడు
గలవారును - నైన, సః=ఆ, శ్రీమాన్ రామానుజః యతిపతిః=శ్రీమద్రామా
నుజమునులు, భూమా=ఈలోకమందును, అముత్రచ=పైలోకమందును, క్షే
మాణి=క్షేమములను, జృంభయతు=వర్ధిల్లఁజేయుచురుగాక.

తా. అరిషడ్వర్గములను పరిహరించెడు తిరునామము గలిగి బృహస్పతివలె
వాగ్మిత్వమును గలిగి, తనవాక్యములచేతను అతిమహత్త్వము గలిగి, సూర్యు
ని మించినకాంతులును గలిగి, చంద్రుని మించినమొగమును గలిగిన యాశ్రీమ
ద్రామానుజమునులు ఇహలోకమందును పరలోకమందును గూడ క్షేమములు
వర్ధిల్లఁ జేయుచుందురు గాక.

సీ. కామాదిదోషము ॥ లాక్రమించి కావింపఁ
గానీనినామము ॥ ల్గల నిధాన
మాదిత్యులకును మ ॥ హాచార్యునిమనీ
షను నె మించినమనీ ॥ షకు నిదాన
మాభారతీపతి ॥ వేభారతీతతి
కైన మీఱినమహి ॥ మాతిభూమి
యాసోముసామని ॥ వేసారి వేమాఱు
నోమనిమోమున ॥ గోముగీము

తే. ధామనిధి నగునుద్దామ ॥ ధామనిధియు
నసమసుమనోభిరామ రా ॥ మానుజముని
యఖిలజనులకు క్షేమము ॥ లతులగతుల
నిచ్చు నిచ్చట నిచ్చలు ॥ నిచ్చ హెచ్చ

టి. కాసీని=కలుగఁజేయని, నిధానము=నిక్షేపము, మనీష=బుద్ధి, నిదానము=ముఖ్యకారణము, వేభారతీతతి = వేయివిధములవాక్యమూహము, మహిమ+అతిభూమి=మహిమలచేత అతిశయించినవారును, సోమున్ = చంద్రుని, సామని=సగమని, ఓమని=ఇష్టపడని, గోము+గీము=అందమునకు + గృహమైనవారును, ధామనిధినగు=సూర్యునికవ్వునట్టి, ఉద్దామధామనిధి=అతిశయించినకాంతులకు నిక్షేపము, సుమనః = మంచిమనస్సుగలవారికిని - దేవతలకును, నిచ్చలు=ఎల్లపుడు.

అపిచ—మఱియు.

శ్లో॥ స జయతి రామానుజయతి
రజయతి పరవాదినం యదీయోక్తిః
సంజయతి బోధ మనఘం
రంజయతి బుధాన్ వ్యథాంచ భంజయతి॥ 324

అ. యదీయోక్తిః=ఏరామానుజుల భాష్యవచనము, పరవాదినం=ప్రతివాదిని,అజయతి=అవమానపఱచుచున్నదో-గొఱ్ఱెనువలెఁజేయుచున్నదో, అనఘం=నిర్దోషమైన, బోధం=జ్ఞానమును, సంజయతి=చేర్చుచున్నదో, బుధాన్ = జ్ఞానులను, రంజయతి=సంతోషపఱచుచున్నదో, వ్యథాంచ=వారిబాధనున్, భంజయతి=పడఁగొట్టుచున్నదో, సరామానుజయతిః=ఆరామానుజమునులు, జయతి=సర్వోత్కృష్టులుగా నున్నారు.

తా. ఆరామానుజమునులు తమభాష్యప్రవచనములచేత పరవాదులను జయించుచు, నిర్మలజ్ఞానమును గలిగించుచు, జ్ఞానులను సంతోషపఱచుచు వారిదుఃఖములను పడఁగొట్టుచు, సర్వోత్కృష్టులుగా నున్నారు.

క. ఆరామానుజయతిపతి
క్రూరాత్ములతతి జయించి కోవిదులతతిన్
వే రంజించి వెతలతతి
వారించి విబోధవితతి వగఁ బూరించెన్.

టి. కోవిదుల=జ్ఞానులయొక్క, విబోధవితతి=జ్ఞానసమృద్ధిని.

అన్యచ్చ—మఱొకటి.

శ్లో॥ తే మీమాంసాశాస్త్ర ప్రమథనపరికలితబుధజనానందా
లక్ష్మణమునేః ప్రబంధా లక్ష్మణపూర్వజశరా ఇవ జయంతి॥325

అ. తేమీమాంసాశాస్త్ర - ప్రమథన - పరికలిత - బుధజనానందా=ఆ మీమాంసాశాస్త్రముయొక్క, (అమీ - మాంసాశ-అస్త్ర)=ఆయారాక్షసుల అస్త్రముల చేత) పర్యాలోచనముచేత (నాశపఱచుటచేత) ఏర్పఱుపఁబడిన విద్వజ్జనులయొక్కయు (దేవసమూహముయొక్కయు) ఆనందము కలవియైన, లక్ష్మణమునేః-ప్రబంధాః=ఆ శ్రీరామానుజుల ప్రబంధములు, లక్ష్మణపూర్వజశరా ఇవ=లక్ష్మణాగ్రజుఁడైన శ్రీరాములబాణములవలె, జయంతి=సర్వోత్కృష్ట మగుచున్నవి.

తా. రాక్షసులను అస్త్రములచేఁ బడఁగొట్టి దేవతల ఆనందములుగలిగించు శ్రీరామబాణములువలె మీమాంసాశాస్త్రములను పర్యాలోచించి చేసి విద్వజ్జనానందము గలిగించిన ఈరామానుజప్రబంధములు సర్వోత్కృష్టము లై యున్నవి.

క. ఏమీమాంసాశాస్త్ర
ప్రామాణ్యప్రమథనమునఁ శ్రీ ప్రమదప్రదముల్
రామాశుగములవలె నా
రామానుజసత్ప్రబంధశ్రీరత్నము లెసఁగున్.

టి. ఏమీమాంసాశాస్త్రమందు ప్రమాణసిద్ధముగ ఆలోచనముచేయుట చేత (ఏమీ? మాంసాశుల అస్త్రముల నియమము వదలమిచే నాశముచేయుట చేత) (శ్లేషోపమలు).

గ॥ అత్రకశ్చిదపశ్చిమో విపశ్చితామిత్థమేన మనుదినం ప్రణమతి॥

వ. ఈవిషయమును ఎదురులేని విద్వదగ్రేసరుఁ డొకఁడు ఈవిధమున[illegible] ప్రతిదినమును [illegible]చుచున్న వాఁడు.

శ్లో॥ రామానుజాయ గురవే నరవేషభాజే
శేషాయ ధూతకలయే కలయే ప్రణామాన్
యో మాదృశానపి కృశాన్ పరిపాతుకామో
భూమావవాతర దుదంచిత బోధభూమా॥ 327

అ. యః=ఎవఁడు, కృశాన్=దీనులమైన, మాదృశానపి=మావంటివారినిగూడ, పరిపాతుకామః=పరిపాలింపఁ గోరిక గలవారై, ఉదంచితబోధభూమా=తగిన జ్ఞానాతిశయము గలవారై, భూమా=ఈభూమియందు, అవాతరత్=అవతరించిరో? నరవేషభాజే=మనుష్యస్వరూపమును బొందినవారై, ధూతకలయే=ఎగురఁగొట్టఁబడినపాపములు గలవారై, శేషాయ=ఆదిశేషులైన, రామానుజాయగురవే=ఆరామానుజులు అనుగురువులకు, ప్రణామాన్=నమస్కారములను, కలయే=చేయుచున్నాను.

తా. దీనులైనమమ్మును గూడ పరిపాలించువారై జ్ఞానమును బోధించుచు సకలదోషములను పరిహరించుచు, ఈ నరస్వరూపములో ఆదిశేషావతారులైన ఆరామానుజగురువులకు ప్రణామములు చేయుచున్నాను.

క. రామానుజగురు నరవే
షామోదవిశేషు శేషు సేనాహతదోషున్
వేమారును బ్రణమించెద
వే మాదృశుఁ బ్రోవ బోధవిశదవిభూషున్.

టి. వే=వేగముగా, బోధ-విశద-విభూషున్=జ్ఞానమనెడు నిర్మలమైన భూషణములు గల.

గ॥ ఇతి ఏతచ్చాకర్ణయతాం॥ 328

వ. అని యిదియును వినుదువుగాక.

శ్లో॥ రామానుజౌ యామునతీర్థసేవా
పరావుదీతౌ నరకం నిరోద్ధుం

తయోః పురాణః ప్రణినాయగీతాం
తస్యా నవీనస్తు తతాన టీకాం॥ 329

అ. యామునతీర్థ - సేవాపరౌ=యమునానదీసంబంధ మైన తీర్థముయొక్క-యామునాచార్యులయొక్క- సేవయం దాసక్తిగలవారైన, రామానుజౌ=బలరాములతమ్ముఁడు శ్రీకృష్ణుఁడును యతిరాజులును, నరకం=నరకాసురుని-నరకమునర్, నిరోద్ధుం=నిరోధించుటకు, ఉదీతౌ=అవతరించిరి, తయోః=వారిద్దరిలో, పురాణః=మందటివాఁడైన శ్రీకృష్ణుఁడు,గీతాః=భగవద్గీతను, ప్రణినాయ=నిర్మించెను; తస్యాః=ఆభగవద్గీతకు, టీకాం=వ్యాఖ్యానమును, నవీనస్తు=ఈవలివారైన యీరామానుజులో, తతాన=చేసిరి.

తా. యమునాతీర్థమును సేవించెడు శ్రీకృష్ణుఁడు, నరకాసురాదులను సంహరించుటకై యవతరించి భగవద్గీతను రచియించినట్లు, ఈరామానుజమునులు ఆయమునాచార్యులసేవాపరతంత్రులై నరకమును నాశపఱచుటకై యుదయించి యాభగవద్గీతకు వ్యాఖ్యానమును విరచించిరి.

చ. అరయుచు రామసోదరులు శ్రీ యామునతీర్థసమంజసాదరుల్
నరకనిరోధనార్థమదశన్ జనియించినయందు కందు నొ
క్కరుఁడు పురాణపూరుషుఁడు శ్రీ గాథగగీతఘటించె మించివే
ఱొరుఁడు నవీనుఁడౌనతఁ డశనూనగ దానిక టీకవాశొనెన్.

టి. సమంజసాదరుల్=చక్కనియాదరము గలవారైన, అదశన్=ఆకాలమున, గాథగా=శ్లోకరూపముగా, అనూనగ=తక్కువ లేనిదిగా.

కృశానుః.—

గ॥ సత్యమేవం తథాపి తత్పథాను ధావినాం మేధావినా మపి
పరావమంతృత్వాదయోదోషాః ప్రసిద్ధాః॥ 330

కృశానుఁడు.—

వ. ఇట్లిది నిజం బయిన నితనిమార్గంబున నతిమేధాసమృద్ధులకైనను, పరావమాననాది ప్రకృష్టదోషంబులు ప్రసిద్ధంబులె.

తథాహి—అదేకదా?

వృ॥ శ్రీరామానుజదర్శనైకరసిక శ్శిష్టః ప్రకృష్టైర్గుణైః
పూర్ణానాంవిదుషాంమతాంతరజుషాంపంక్తౌనభుంక్తేక్వచిత్
ఆహాంతౌదన మంతతశ్శుచితమం తద్దృష్టమాశు త్యజ
త్యాస్తాంతత్స్వమతస్థితై రపి సమంప్రాయేణనాశ్నాత్యసౌ॥

అ. శ్రీరామానుజదర్శన - ఏక-రసికః=శ్రీరామానుజుల విశిష్టాద్వైత దర్శనమందు - కేవలము రసికులైన, శిష్టః=పెద్దలు, ప్రకృష్టైర్గుణైః=అతిశయము లైనగుణములతో, పూర్ణానాం విదుషాం=నిండినవిద్వాంసులైన, మతాంతర జుషాం=వేఱువేఱుమతముల ననుసరించినవారియొక్క, పంక్తౌ=పంక్తియందు, క్వచిత్=ఎక్కడనైన, నభుంక్తే=భుజించరు, అంతతః=లోఁగ, తద్దృష్టం= వారిచే చూడఁబడిన, ఓదనం=అన్నము, శుచితమం=పరిశుద్ధమయ్యును, అసౌ=ఈపెద్దలు, ఆశు=తోడనే, త్యజతి=విడుచుచున్నారు, తత్ - ఆస్తాం= అది అట్లుండనీ; స్వమతస్థితైరపి=తమదర్శనములో నుండువారితోను,సమం= సమానముగా, ప్రాయేణ=బహుగా, న-అశ్నాతి=భుజింపరు, ఆహాంత=అయ్యో!

తా. ఈరామానుజుల దర్శనమం దుండువారు మహాసద్గుణులైనను, మతాంతరులగోష్ఠిలో భుజించరు. వారు చూచినయన్నము ఎంతశుచియైనను, విడిచిపెట్టుదురు; అదియె కాక, తమమతములోనివారితో నైన కూడ భుజింపరు ! అయ్యో !

శా. శ్రీరామానుజదర్శనప్రవణులేరేరీ గుణశ్రేష్ఠులా
చారశ్రేష్ఠులె యామతాంతరులతోసాపాటు పాటింపర
వ్వారేరేఁగనిరఁ భుజింపరు మతస్థోవ్వారేని నయ్యారె!మా
వారంచుఁ స్వమతస్థులందొకరిఁ జేర్వంజేర్ప రవ్వేళలోన్.

కించ—మఱియు.

వృ॥ నైషాంన్యాయ్య ఇహ ద్విజాన్వయజుషాం భాషాప్రబంధ
[illegible] జాగ్రతి

తీరం క్షీరపయోనిధే రుపగతో దైత్యారి దీప్త్యావృతం
కో వా ధావతి దుగ్ధలబ్ధిచపలో గోపాలకస్యాలయమ్॥ 332

అ. ద్విజాన్వయజుషాం=బ్రాహ్మణకులజన్ములైన, ఏషాం=ఈరామానుజమతస్థులయొక్క, విశ్వపుమర్థసాధనవిధౌ=సకలపురుషార్థములను సాధించుకార్యమునందు, బద్ధాదరే=నిర్ణయింపఁబడినయాదరము గల, వేదే=వేదము, జాగ్రతి సతి=సిద్ధముగా నుండియు, భాషాప్రబంధశ్రమః=ద్రవిడభాషాప్రబంధములయందు పాటుపడుట, ఇహ=ఈలోకమందు, నన్యాయ్యః=న్యాయోక్తము కాదు, దైత్యారిదీప్త్యా-ఆవృతం=విష్ణుప్రకాశముచేత కప్పుకొనఁబడిన, క్షీరపయోనిధేఃతీరం=పాలసముద్రముగట్టును, ఉపగతః=చేరినవాఁడు, కోవా=ఎవఁడుగాని, దుగ్ధలబ్ధిచపలః=పాలు లభించుటయందు చాపల్యముగలవాఁడు, గోపాలకస్య ఆలయం=గొల్లవానియింటినిగూర్చి, ధావతి=పరుగిడుచున్నాఁడు.

తా. ఈరామానుజమతబ్రాహ్మణులు సకలపురుషార్థసాధనమైన వేదముండియు ద్రవిడప్రబంధమందు పాటుఁబడుట పాలు కోరి పాలసముద్రముగట్టునందుండియు,సాధారణమైనగొల్లనియింటికి పరుగిడుటవలె న్యాయమెట్లగును?

ఉ. వీరలు వారలుంబలె భువిం ద్విజవంశజులైనవారలున్
సారపుమర్థసాధనము సంస్కృతవేదము సిద్ధమయ్యు; న
వ్వారిగ ద్రావిడాత్మకప్రబంధపరిశ్రమ సేయఁగోరు టా
క్షీరపయోధితీరగుఁడె క్షీరము కల్లన గొల్లఁ గోరుటే!

టి. తీరగుఁడె=తీరముచేరినవాఁడె, అల్లనన్=మెల్లఁగా.

కించ — మఱియు.

గ॥ ఏతన్మతానువర్తినాం కేషాంచి దేషా చేష్టా నేష్టా వైదికా
నాం పశ్య! 333

వ. ఈమతమునంద కొందఱియాచార మీయది యావేదవిహిత
కర్మకర్మఠులకు సమ్మతము కాదు చూడు!

ముంచంత్యః పంచయజ్ఞాన్ ద్రవిడపఠితిభి[illegible] నభిజ్ఞాన్

నిందంతో హంత! యజ్ఞా నసకృదపి హరేర్వందనం వారయంతః
లుంపంత శ్శ్రాద్ధచర్యాంయతిమపిగృహిణాంవందనంకారయంతః
సద్ద్వేషంధారయంతః కతిచిదవిహితైస్సంక్షిపంత్యేవకాలమ్ ॥

అ. పంచయజ్ఞాన్ = పంచయజ్ఞములను, ముంచంతః = విడుచువారై, ద్రవిడఫణితిభిః = ద్రావిడవాక్కులచేత, అనభిజ్ఞాన్ = అజ్ఞులను, మోహయంతః = భ్రమింపఁజేయువారై, యజ్ఞాన్ = ఇతరములైన జ్యోతిష్టోమాదియజ్ఞములను, నిందంతః = నిందించువారై, హరేరపి = విష్ణువునకును, అసకృత్ = పలుమాఱు, వందనం = నమస్కారమును, వారయంతః = విడిపించువారై, సద్ద్వేషం = సత్పురుషులతోడిద్వేషమును, ధారయంతః = అవలంబించువారై, యతిం + అపి = సన్యాసినైనను, గృహిణాం = గృహస్థులకు, వందనం = నమస్కారమును, కారయంతః = చేయించువారై, శ్రాద్ధచర్యాం = శ్రాద్ధకర్మానుష్ఠానమును, లుంపంతః = విడుచువారై, కతిచిత్ = కొందఱు, అవిహితైరేవ = విధివిహితములుకాని కర్మలతోనే, కాలం = సర్వకాలమునున్, సంక్షిపంతి = కడుపుచున్నారు.

తా. ఈరామానుజమతస్థులు కొందఱు బ్రహ్మయజ్ఞాదిపంచయజ్ఞములు విడిచి, అజ్ఞానులను ద్రవిడవేదములతో భ్రమింపఁజేసి కామ్యకర్మలని జ్యోతిష్టోమాదియజ్ఞములన్ దూషించి, హరినైనను పలుమాఱు నమస్కరింపక, సత్పురుషులతోనైనను జేరక సన్యాసినైనను గృహస్థులకు వందనము చేయించుచు శ్రాద్ధకర్మలను న్విడిచి, వేదోక్తముకాని కర్మలతోనే కాలము కడపుచుందురు.

సీ. బ్రహ్మయజ్ఞాదిక । పంచయజ్ఞంబుల
విడిచి వీఁడెడికి ద్రావిడము నొడివి
తేరింపఁ జేసి జ్యోతిష్టోమముఖమఖ
ములదూఱి పలుమాఱు । చెలఁగి చేయు
హరి నమస్కారంబు । లవలికిఁ బోఁద్రోచి
యవ్వారితో ద్వేష । మావహించి
స్వమతస్థ సంసారి । సన్న్యాసి నైనన
మస్కరింపఁగఁ జేసి । మఱియు శ్రాద్ధ

తే. మునన నైనను వేదోక్తమును జరించు
టుడిగి శ్రుతి నైన స్మృతి నైన నుడువ కున్న
కొన్ని కర్మలచేతనే యున్నకాల
మంతయును బుచ్చుచున్నారు చింత లేక.

టి. బ్రహ్మయజ్ఞాదికము=బ్రహ్మయజ్ఞ దేవయజ్ఞ భూతయజ్ఞ అతిథియజ్ఞములు.

కించ—మఱియు.

వృ॥ ఘంటాఘోషం త్యజంతో హరిపరిచరణే సర్వలోకావిగీతం
ఖ్యాతం త్రైలోక్యమాతుశ్శ్రుతిభిరభిహితం వైభవం ఖండయంతః
సంకేతశ్రద్ధయైవ స్వచరణసలిలం స్వీయగోష్ఠ్యాం పిబంతః
కేచిద్విప్లావయంతే జగదభిదధతః కేశవం దోషభోగ్యమ్॥335

అ. కేచిత్=కొందఱు, సర్వలోక+అవిగీతం=సర్వలోకమందుఁబ్రశస్తమయిన,ఘంటాఘోషం=ఘంటావాదనధ్వనిని,హరిపరిచరణే=విష్ణ్వారాధనయందు త్యజంతః=విడుచువారై, శ్రుతిభిః=శ్రుతులచేత,అభిహితం=ప్రకటింపఁబడినదై, ఖ్యాతం=లోకప్రసిద్ధమైన, త్రైలోక్యమాతుః=త్రిలోకమాతయైన శ్రీమహాలక్ష్మి యొక్క, వైభవం=స్వాతంత్ర్యరూపమైన వైభవమును, ఖండయంతః=ఖండించువారై, స్వీయగోష్ఠ్యాం=తమమతస్థుల గోష్ఠిలో, సంకేతశ్రద్ధయా=తమసంకేతమందలి అభినివేశముతో, స్వచరణసలిలంఏవ=తమపాదతీర్థమునే, పిబంతః=పానముచేయువారై, కేశవం=సర్వేశ్వరుని, దోషభోగ్యం=సకలదోషములును భోగ్యములుగా కైకొనువానినిగా, అభిదధతః=చెప్పెడువారునై, జగత్=లోకమును, విప్లావయంతే=విపర్యాసపఱచుచున్నారు.

తా. ఈతెంగలవారు తిరువారాధనయపుడు ఘంట వాయించుట మానుటయేకాక, త్రిలోకమాతయైన యాశ్రీదేవికిఁగూడ స్వాతంత్ర్యములేదనుటయు, మఱి తమగోష్ఠిలో తాము సంకేతించుకొన్నతమపాదతీర్థమునే తామును స్వీకరించుటయేకాక, తామునేసికొన్నదోషములన్నియు నాసర్వేశ్వరుఁడే అనుభవించువాఁడనుటయుఁ జూడ లోకమును తాఱుమాఱుచేయుటయే.

సీ. హరిపరిచరణావసరమున ఘణఘణా
  రవరణద్ఘంటను రమణఁ గొనరు
శ్రుతిశతకథితవిశ్రుతమైన శ్రీజగ
  జ్జనయిత్రివిభుత నేసరణిఁ గొనరు
స్వస్వగోష్ఠినె స్వస్వసంకేతశ్రద్ధచే
  స్వపదాంబుపానంబు సలుపుచుంద్రు
కాదని యనకయ కలదోషములఁ జేసి
  హరికి దోషములె భోగ్యము లటంద్రు
తే. ఇటులఁ గుటిలత జగములఁ జటులగతుల
మోసపుచ్చుచు మెచ్చుచు వీసవోక
యిందు నుందురు కొందఱు మందమతుల
మందమదులును నగువారు మహిని రహిని.

కించ——మఱియు.

వృ॥ యజ్ఞాఃపంచమహాత్వదేనసహితా యేచాపరే విశ్రుతాః
యత్కర్మగ్రహసంక్రమాదిసమయే సర్వేబుధాః కుర్వతే।
తత్సర్వం విసృజంతి కామ్యమితి యే త్రయ్యధ్వవిధ్వంసకా
స్తైర్ద్వైనిత్యతయా౽౽శ్రితే మదశనం యాచవ్యవాయక్రియా॥

అ. యే=ఏవి, పంచయజ్ఞాః=బ్రహ్మయజ్ఞాదులైదు, మహాత్వదేనసహితాః=మహాయజ్ఞములని మహత్వదముతోఁ గూడినవో? యే=ఏవి, అపరేచ=ఇతరజ్యోతిష్టోమాది యజ్ఞములును, విశ్రుతాః=ప్రసిద్ధములో? యత్=ఏది, గ్రహ-సంక్రమ-ఆదిసమయే = గ్రహణము+సంక్రమణము మొదలైనకాలములో, కర్మ=పితృకర్మగా, సర్వేబుధాః=జ్ఞానులందఱును, కుర్వతే=చేయుచున్నారో, యే=ఎవరు, త్రయీఅధ్వవిధ్వంసకాః=వేదమార్గమును ధ్వంసముచేయువారై, తత్ సర్వం=అదియంతయును, కామ్యమితి=కామహేతుకర్మ యని, విసృజంతి=[illegible] యాచ=ఏది,

వ్యవాయక్రియా=మైథునక్రియయో ? ద్వే=ఈరెండుమాత్రమే, తైః = వారి చేత, నిత్యతయా=నిత్యకర్మగా, ఆశ్రితే=అంగీకరింపఁబడుచున్నవి.

తా. వీరు పంచమహాయజ్ఞములును, జ్యోతిష్టోమాదులును, గ్రహణసంక్రమణాదులును వేదోక్తములని పెద్దలు చేయుచుండునవియే యైనను, అవి కామహేతుకర్మలని యన్నియువదలి, భక్షణమైథునములుమాత్రము చేయుచున్నారు.

సీ. బ్రహ్మయజ్ఞాదికపంచమహాయజ్ఞ
ములును జ్యోతిష్టోమముఖమఖములు
గ్రహణసంక్రమణాదికాలకృత్యము లైన
పైతృకప్రభృతికప్రచురకర్మ
లుద్యతవైదికవిద్వదగ్రేసరు
లాచరించెడునవి యైనవానిఁ
గామ్యంబు లని యవి కావింప రైనను
గావించువారితోఁ గలిసి భోజ

తే. నమును గావించుటయు వ్యవాయమును నెపుడు
మెండు కావించుటయు ననురెండు నివియె
నిత్యమును గృత్యమును గాఁగ నియతిఁ దలఁచు
చుందు రివ్వారు శ్రుతిదూరు లిందు నెందు.

టి. ఉద్యత=విజృంభించిన, కామ్యంబులు = కామహేతువులు, వ్యవాయము=సంగమము.

శ్లో॥ విదుషామపి మోహ మావహంతో
వితథైతిహ్య సహస్రవర్ణనేన
వినయాభినయాత్తలాఃకిలామీ
విజయంతే కపటాలయా జగంతి॥ 337

అ. వితథ+ఐతిహ్య+సహస్రవర్ణనేన=అబద్ధములైన+సంప్రదాయములను-

వేయివిధముగ వర్ణించుటచేత, విదుషామపి=ప్రాజ్ఞులకుఁగూడ, మోహం=స్వమతమందు మోహమును, ఆవహంతః=కలుగఁజేయుచు, ఖలాః=దుష్టులై, కపటాలయాః=కపటమునకు స్థానమైన, అమీ=వీరు, వినయాభినయాత్=అణఁకువను అభినయించుటచేత, జగంతి=లోకములను, విజయంతేకిల = జయించుచున్నారుకదా?

తా. ఈ తెంగలవారు లేనిపోనియైతిహ్యములు చెప్పి ప్రాజ్ఞులకుఁగూడ స్వమతాభినివేశమును గలుగఁజేయుచు, డంభమునకై తమయందు లేని అణఁకువనే కనఁబఱచుచు ఈజగత్తునె జయించుకొనుచున్నారు.

(ఔపచ్ఛందసికం వృత్తం.)

క. కన ఖలులును ఘన కపటులుఁ
గని వినయము నభినయించి ఘనులను గూడన్
క్షణమున స్వవశము సేయుదు
రనుపదమును లేనిపోనిక్రైతిహ్యములన్.

కించ—మఱియు.

వృ. యస్యాం నాస్తి పురస్కృతి ర్నయవిదాం యజ్వాతు హాసాస్పదమ్। పూజ్యంతేచ నిరక్షరాః పునరమీ సాంకేతికాచార్యకాః। వేదానామవహేలనం వ్యతిహతా వర్ణాశ్రమప్రక్రియా। గోష్ఠ్యై దుష్కలిపుష్కలీకృతిపుషే కస్యైచి దస్యై నమః॥ 338

అ. యస్యాం=ఏగోష్ఠియందు, నయవిదాం=నీతిశాస్త్రవేత్తలకును, పురస్కృతిః=గౌరవపఱచుటయు, నాస్తి = లేదో? యజ్వాతు = యాజకుఁడో, హాసాస్పదం=నవ్వులాటకే స్థానమో?నిరక్షరాః=వేదాద్యక్షరములే తెలియని, అమీ=ఈ, సాంకేతిక+ఆచార్యకాశ్చ=సంకేతించుకొన్న-ఆచార్యపురుషులు అను నామమాత్రమే కలవారును , పునః=మఱలమఱల, పూజ్యంతే=పూజింపఁబడుచున్నారో? వేదానాం=వేదములకును, అవహేలనం=అవమానముకల

దో? వర్ణాశ్రమ-ప్రక్రియా=బ్రాహ్మణాది వర్ణాశ్రమములయొక్క-ఆచారము, వ్యవహితా=తొలఁగఁద్రోయఁబడినదో? దుష్కలి పుష్కలీకృతిపుషే=దుష్పాపములను వృద్ధి పఱచుటనే వర్ధిల్లఁజేయుచున్న, అస్యై=అట్టియీ, కస్యైచిత్=ఒకానొక, గోష్ఠ్యై=తెంగలవారిగోష్ఠికై, నమః=నమస్కారము.

సీ. ఏగోష్ఠి నేశాస్త్రి భోగీశు లైనను
  సత్కార మింపార నలుపఁబడరు
ఏగోష్ఠి నేయాగి వాగీశు లైనను
  బరిహాసమే సేయఁ బాత్రు లగుదు
రేగోష్ఠి నాచార్య వాగార్యు లంచన
  క్షురకులు లైన నర్చనకుఁ దగుదు
రేగోష్ఠి నేవేద మేఁ గామ్యమే యంచు
  నవహేళనము సేయ నాస్పదంబె

తే. యగును మఱివర్ణములకును నాశ్రమంబు
లకును విధ్వంసకము మహాసకలకలుష
ములకు సంవర్ధకము నగు నలఘురీతి
నట్టియీగోష్ఠికె నమస్సహస్ర మిడుదు.

టి. భోగీశులు=ఆదిశేషులు, వాగీశులు=బ్రహ్మలు, వాగార్యులు =బృహస్పతులు, కామ్యము=కామహేతువు.

కిం బహునా—విశేష మేల?

వృ॥ ప్రాయో యేషాం సకృదకరణే ప్రత్యవాయో౽స్తి భూయాన్
యజ్ఞాదీం స్తానిహ విజహతి స్పష్టవేదోపదిష్టాన్।
కర్త్రైవామీ విదధతి జడాః కింతు సంకేతసిద్ధమ్
కష్టంకష్టం బత హత కలేః కశ్చిదున్మేష ఏషః॥ 339

అ. ప్రాయః=బహుశా, యేషాం=ఏయజ్ఞములయొక్క, సకృత్ =ఒకసా

రైన, అకరణే=చేయమివిషయమై, భూయాన్ ప్రత్యవాయః=గొప్పపాపము, అస్తి=కలుగుచున్నదో? తాన్=అట్టి, స్పష్టవేద ఉపదిష్టాన్ = స్పష్టముగా వేదములచేత తెలుపఁబడిన, యజ్ఞాదీన్=బ్రహ్మయజ్ఞాదులను, ఇహ=ఈలోకములో, విజహతి=విడుచుచున్నారు. కింతు=మఱియు, అమీ-జడాః=ఈమూఢులు, సంకేతసిద్ధం=తమ సంకేతమందె సిద్ధమైయుండు, కర్మ+ఏవ=కర్మనే, విదధతి=చేయుచున్నారు. కష్టంకష్టం=మఱిమఱి యన్యాయ్యము! బత = అయ్యో! ఏషః=ఇది, హాతకలేః=పాడుకలిపురుషునియొక్క, కశ్చిత్=ఒకానొక-చెప్పఁగూడిని,ఉన్మేషః=ప్రభావము.

తా. వేదోక్తములయ్యును,యజ్ఞాదులొకడైనఁ జేయకపోవుట పాపమనుకొనక,వానిని విడిచియైనను; ఈమూఢులు తమ సంకేతించుకొనిన కర్మనొకటినైన విడువకయే చేయుచున్నారు. అయ్యో! ఏమి? ఈ కలిపురుషుని ప్రభావము!

చ. అనయము నాచరించునవె యైన నొకప్పుడు తప్పఁడుందొ
సం, గన విహితంబులే యగు మఖాదుల నేమియు నాచ
రింప రీ, యనయులు స్వస్వకల్పితము లైనవె కొన్ని స
మాచరింతు రే, మన నగు నిన్నియుం దలఁప నక్కట
యిక్కలిదుర్విజృంభ మే!

టి. తప్పఁదుర్=తప్పినతోడనే, దొసంగుఅనన్=దోషము అనునప్పుడు.

కించ—మఱియు.

వృ॥నగాహంతే గంగామపి నటజటాసార ఇతి యే
నను జ్ఞం త్యంభోధా లవణరసవేశంతక ఇతి
నపంచైవం గవ్యాన్యపి పశుశకృత్సారఇతిహా!
పిబంత్యేషాం దోషాన్ కఇహనిపుణస్స్యాద్గణయితుమ్॥ 340

అ. యే=ఎవరు, గంగామపి=గంగనుకూడ, నటజటా+అసారఇతి=నటరాజైన శివునియొక్క జటలలోని+వర్షములని, నగాహంతే=మునుఁగరో; అం

భోధౌ=సముద్రమందు, లవణరసవేశంలక ఇతి=ఉప్పునీళ్లు గల పడియ అని, నమజ్జంతి=మునుఁగరో; ఏవం=ఇట్లు, పంచగవ్యాని అపి=పంచగవ్యముల నైన ను, పశుశకృత్ సారఇతి=పశువుయొక్క పేఁడసారమని, నపిబంతి=పానము చేయరో; హా=అయ్యో! ఏషాం=అట్టి యీతెంగలవారియొక్క, దోషాన్=దోషములను, గణయితుం=లెక్కించుటకు, ఇహ=ఇక్కడ, కః=ఎవఁడు, నిపుణః=సమర్థుఁడు, స్యాత్=అగును.

తా. ఎవరు గంగలోనుగూడ శివునిజడలలోని సారమని మునుకయే వేయరో? సముద్రములోఁగూడ ఉప్పునీటిగుట్టయని మునక వేయరో? అట్లే పంచగవ్యములనుగూడ పసుల పేఁడతోడఁ జేరినది అని త్రాగరో? అట్టివీరిదోషములను లెక్కించుటకు ఎవఁడు గట్టివాఁడుగానుండును?

మ. అలగంగాజల మల్లధూర్జటిజటౌఘాసార మంచున్, మఱీ
జలరాశిన్ లవణప్రసార మనుచున్ స్నానానికిం బోరు; పం
చ లసద్గవ్యములుం బశూజ్ఝితశకృత్సారంబులంచానరీ;
రల యీదుర్గుణము ల్గణింపఁగ సమర్థప్రాణి యెవ్వాఁడిలన్.

విశ్వావసుః ——

టి. ధూర్జటి-జటా-ఓఘ-ఆసారము=శివుని-జడల-సమూహములోని-వర్షము.

గ॥ కిమరే? కలంకలేశరహితేషు శ్రీమద్రామానుజదర్శనైకని ష్ఠేషు గరిష్ఠేష్వపి సన్నహ్యాసి? అథవాభవాదృశానాం కృశవివేకానాం కానామ మర్యాదా॥ 341

విశ్వావసువు.——

వ. ఏమిరా? ఏమియు దోషమే లేనియీశ్రీమద్రామానుజదర్శనైకనిష్ఠులు గరిష్ఠులైయున్నను, వీరిపై సన్నాహపడుచున్నాఁడవు? నీయట్టియల్పవివేకము కలయట్టివారలమరియాద యిట్టిదియ.

ఉ క్తంహి —— చెప్పఁబడినదేకదా!

శ్లో॥ అనల్పకం ధరాయాం హి సర్వజ్ఞస్యాపి దారుణాః
ఆరోపయంతి మాలిన్యం కాకోలాఇవ తే ఖలాః. 342

అ. ధరాయాం=భూమియందు, తేఖలాః=అట్టిదుష్టులు, దారుణాః=భయంకరములైన, కాకోలాఇవ=మాలకాకులవలె— 'కాలకూటవిషమువలెను, అనల్పకం=అత్యంతమైన, మాలిన్యం = దోషమును—అశుద్ధిని—నీలవర్ణమును, సర్వజ్ఞస్యఅపి=అంతయు తెలిసినవానికైనను—శివునికైనను, అనల్పకంధరాయాం=గొప్పకంఠమందు, ఆరోపయంతి = పైఁబెట్టుచున్నవారు. (శ్లేషోపమలు—అలంకారములు.)

తా. శివునికంఠమందు కాలకూటవిషము నీలవర్ణము నిచ్చినట్లును, అక్కడక్కడ మాలకాకులు అశుద్ధినిగలిగించునట్లను, ఎంతటిసర్వజ్ఞునకైనను దుష్టులు లేనిపోనిదోషమునె పైఁబెట్టుదురు.

ఆ. ఖలుఁడు గలుగఁజేయుఁ గాకోలమేపోలె
లేనిమలినమేని ప్రాని యిలను
జాలఁ గూళ యగుట సర్వజ్ఞునకుఁ గాని
తదుపకంఠతలమె తడవి తడవి.

దం. ఇలలోఖలుఁడు తాను చాలా కూళయగుటచేత ఎంతటిసర్వజ్ఞునకును—శివునికిని, పూనుకొని వెదకివెదకి వాని ఉపకంఠతలమున=సమీపమున-కంఠము దగ్గఱ, కాకోలమేపోలె= మాలకాకియువలె, లేనిమలినమేని=లేనట్టిదోషము నైన-అశుద్ధినైన - నీలవర్ణమునైనను, కాలకూటవిషమువలెను గలుగఁజేయుచుండును.

గ. పశ్య తావదే తేషాం పవిత్రతమంచరిత్రమ్॥ 343

వ. చూడు. వీరిచరిత్రము అతిమాత్రము పవిత్రము.

వృ॥ ఉచ్ఛిష్టా న్యతీదూరతః పరిహర న్త్యస్పృ శ్య స్త్వసత్సంగతిం
ప్రాణాపత్స్వపిబాంధవేతరగృహే ప్రాశ్నంతినాపోప్యమీ

కామ్యం నిర్మిమతే నకర్మ, భగవత్కైంకర్యఏవ స్థితాః
సత్వస్థైః స్పృహణీయఏషజయతి శ్రీవైష్ణవానాంక్రమః॥344

అ. అమీ=వీరు, ఉచ్ఛిష్టాని=ఎంగిలియైనవి, అతిదూరతః = బహుదూరముగా, పరిహరంతి=త్రోసివేయుచున్నారు, అసద్భిః=అసత్పురుషులతో, సంగతిం=సహభోజనాదులతోడి సంగతిని, ఉజ్ఝంతి=విడిచిపెట్టుచున్నారు,ప్రాణాపత్సు అపి=ప్రాణాపదలలోకూడ, బాంధవేతరగృహే=బంధువులు కానివారియింట, అపోపి=నీటినైన, నప్రాశ్నంతి=అనరు, కామ్యం=స్వర్గాదికామహేతువైన, కర్మ=కర్మను, ననిర్మిమతే=చేయరు, భగవత్కైంకర్యఏవ=భగవత్కైంకర్యమందే, స్థితాః=ఉన్నవారు; ఏషః=ఈ, శ్రీవైష్ణవానాంక్రమః =శ్రీవైష్ణవులరీతి, సత్వస్థైః = సాత్వికులచేతనే, స్పృహణీయః=కోరఁదగినదై, జయతి=సర్వోత్కృష్టమగుచున్నది.

తా. ఈరామానుజమతస్థులు ఎంగిలి యైనయన్నాదులను అంటనివారై యేయున్నను అసత్పురుషులతో సహభోజనాదులను చేయకయు, ప్రాణాపత్తులలోకూడ బంధువులు కానివారినీటినైనను అంటకయు, స్వర్గాదిహేతుకర్మలను జేయకయు నుండెడివారు; ఇట్టి యీ శ్రీవైష్ణవులరీతి అతిసత్త్వసంపన్నులకే కోరదగినదిగానున్నది (శిష్టపంక్తిలో భుజింపకుండుట దోషమనునది యిది.)

సీ. అన్యు లంటిన దని ♦ యాత్మీయమతిఁ దోఁప
దూరంబునన దానిఁ ♦ దొలఁగఁద్రోతు
రసమంజసు లటంచు ♦ ననద తోఁచిన వారి
తోడ సాపడుటయ ♦ తొడరిత్రోతు
రసువిపత్తుల నైన ♦ నన్యులగృహముల
నీరు నేనియుఁ ద్రావ ♦ నోరు దెఱవ
రే కర్మ నేనియు ♦ నాకామ్య మైనది
వేయుదు జేయరు ♦ వెలుగి ముఖ్యము

తే. నిరతభగవన్ముఖోల్లాస ♦ పరత నుండు
నుచితకైంకర్యములె చేయు ♦ చుర్వి నుందు
రట్టిశ్రీవైష్ణవులక్రమం ♦ బెట్టిసాత్త్వి
కులకు నైన మనోజ్ఞతా♦కలన నెసఁగు.

టి. అసమంజసులు=మంచియోగ్యతలేనివారు, అసువిపత్తులన్ = ప్రాణాపదలయందును, ఉర్విన్ =భూమియందు, మనోజ్ఞతాకలనన్ =మనోహరత్వమును కూర్చుటచేత, అసదు-అ=కొంచెమే.

కించ—మఱియు.—

వృ॥ ఫాలే శుద్ధమృదూర్ధ్వపుండ్రతిలకః పద్మాక్షమాలా గళే
దివ్యం శంఖరథాంగచిహ్నమనిశం దీప్తం భుజామూలయోః
వక్త్రే శౌరిగుణైకవర్ణనపరా వాచస్తదేనోముచా
మేతేషాం హరిభక్తితుందిలహృదాం వీక్షాపి మోక్షావహా॥

అ. ఫాలే=ఎవరినొసట, శుద్ధమృత్-ఊర్ధ్వపుండ్రతిలకః=శుద్ధమృత్తుతోడి నిలువుబొట్టో, గళే=కంఠమందు, పద్మాక్షమాలా = తామరపూసమాలెయో, భుజామూలయోః=బాహుమూలములందు, అనిశం=ఎల్లపుడును, దీప్తం=ప్రకాశింపఁబడునదై, దివ్యం=అసాధారణమైన, శంఖరథాంగచిహ్నం=శంఖచక్రములచిహ్నమునో, వక్త్రే=మొగమున, శౌరిగుణ-ఏకవర్ణనపరాః = భగవద్గుణములను—ముఖ్యముగా వర్ణించుటయందు పట్టుగల, వాచః=వాక్కులునో, తత్ = అందువలన, ఏనః+ముచాం=పాపములను పరిహరించువారై, హరిభక్తి+తుందిలహృదాం=భగవద్భక్తియందు పూర్ణమైనహృదయము గలవారైన, ఏతేషాం= అట్టి యీరామానుజమతస్థులయొక్క, వీక్షాపి=దర్శనమైనను, మోక్ష+ఆవహా= మోక్షమును గలిగించునదే.

తా. నొసట నూర్ధ్వపుండ్రముతోను, కంఠమున తామరపూసలదండలతోను, భుజాగ్రములందు శంఖచక్రాంకనములతోను, వాక్కున శ్రీమన్నారా

యణగుణానుసంధానములతోను సకలదోషవిముక్తులై యుండు నీరామాను జీయభగవద్భక్తులను సేవించినమాత్రమున నేమోక్షప్రాప్తికి సిద్ధమైయుందురు.

సీ. నిజనిటాలములను * నిర్మలమృదులోర్ధ్వ
పుండ్రరేఖలు కళ * పొసఁగఁ దీర్చి
నిజగళస్థలముల * నిస్తులజలజాక్ష
మాలిక ల్మెలిక్రక్రమానఁ జేర్చి
నిజభుజాతలముల * నిశ్చలతరశంఖ
చక్రచిహ్నములఁ బుష్కలతఁ దాల్చి
నిజవచోరచనల * నిరవధిహరిగుణా
వళి వర్ణనోక్తుల * వరుసఁ గూర్చి

తే. యలఘు లగునఘములయోఘములనమోఘ
గరిమ హరియించు హరిభక్తిభరితహృదుల
భాగవతుల మదీయుల * భాగధేయ
ముల నిరీక్షయు మోక్షద * మిల నిజంబు.

టి. నిజనిటాలములను=తమఫాలప్రదేశములలో, నిస్తుల=విస్తారమైన, నిజవచోరచనలన్=తమ వాగ్విరచనలయందు, నిరవధి=సంపూర్ణమైన, ఓఘములన్=సమూహములను, అమోఘగరిమన్=నిరాటంకమైన గురుత్వములో, మదీయుల=మాసంబంధమైన, భాగధేయములన్=భాగ్యములను, నిరీక్షయు=చూచుటకూడ, మోక్షదము=మోక్షమునిచ్చునది.

గ॥ దోషారోపణం చైతేషు త్వదీయ మపహాస్యమ్. 346

వ. (ఇటుల నీనిర్దోషులైన) లక్ష్మణపక్షవిలక్షణార్యులయెడలను నీనెఱపు దోషారోపణంబు నపహాసనిరూపణంబ యగు.

తథాహి—అశ్లోకదా!

వృ॥ ఇష్టాత్స్వబాంధవజనా దితరై రదృష్టం
యద్భక్తిర్నేత్ర్పాలమితా లక్ష్మణపక్షనిష్టాః

దోషః కిమేషదురితాపహరో గుణోవే
త్యేవం వివిచ్యపరిపృచ్ఛ గుణాగుణజ్ఞాన్॥ 347

అ. ఇహ=ఇక్కడ, లక్ష్మణపక్షనిష్ఠాః=రామానుజమతమందు నిష్ఠగలవారు, ఇష్టాత్=తమకిష్టమైన, స్వబాంధవజనాత్=తమబంధువులకంటె, ఇతరైః=వేరైనవారిచేత, అస్పృష్టం=చూడఁబడని, అన్నం=అన్నమును, భుంజతే=భుజించుచున్నారు, యత్=అనుటయేదో, ఏషః=ఇది, దోషఃకిం=దోషమా? దురితాపహరః=దోషపరిహారకమైన, గుణోవా=గుణమా, ఇతి=అని, ఏవం=ఇట్లు, వివిచ్య=వివేచించి, గుణ+అగుణజ్ఞాన్=గుణము అగుణము అని తెలిసినవారిని, పరిపృచ్ఛ=అడుగుము.

తా. తమబంధువులు కానివారు చూచినయన్నము నీరామానుజమతమువారంట రసుట దోషమా? గుణమా? యని గుణదోషజ్ఞుల నడిగిఁ దెలిసికొనుము.

తే. ఇష్టు లగుబందుగులె కాని శ్రేష్ఠులేని
కన్నయన్నము భుజియింప రన్న చెన్ను
గుణమొ యగుణమొ విభజించి గుణులగణము
నడుగు మడఁకువ నడఁకువ నగపడంగ.

కించ — మఱియు. —

వృ॥ దృష్టం బాధ్వేతరైః స్నతామనదతాం దోషోయ ఏషోపరైః
శిష్టైః స్పృష్టమనశ్నతా మిహమహారాష్ట్రాదికానాం సమః
ఏషాం దూషయితా నకోఽపి నియతాహారఃపరంతు ద్విజ
స్సర్వోపి నతుదూషణం హితభుజాం తేషామిదం భూషణమ్॥

అ. బంధ్వేతరైః=బంధువులు కానివారిచేత, దృష్టం=చూడఁబడినదానిని, అనదతాం=భుజింపని, సతాం=సత్పురుషులకు, యః-ఏషః- దోషః=ఏ యిది దోషమో అది, అపరైః-శిష్టైః=శిష్టులైన ఇతరులచేత, స్పృష్టం=అంటఁబడినదానిని, అనశ్నతాం=భుజింపని, మహారాష్ట్రాదికానాం=మహారాష్ట్రులు మొదలైనవారికిని, సమః=సమానుఁడై, నియత+ఆహారః=ఆహారనియమము గ

లవాఁడైన, కోఽపి=ఒకానొకఁడు, ఏషాం=ఈవైష్ణవులకు, దూషయితా=దూషకుఁడు, న=కాఁడు, పరంతు=మఱియు, సర్వాశీ=సర్వముభుజించువాఁడైన, ద్విజః=బ్రాహ్మణుఁడె దూషకుఁడు, ఇదం=ఇది, హితభుజాం=విధివిహితముగ భుజించువారైన, తేషాం=ఆవైష్ణవులకు, భూషణం=భూషణము, న తుదూషణం=దూషణమె కాదు.

తా. ఈరామానుజపక్షమువారు ఇతరులు చూచినదైనను దాని నంటకపోవుట ఆమహారాష్ట్రాదులు పెద్దలంటినదైనను తామంటకపోవుటవలెనున్నది. ఇట్టి ఆహారనియమము గలవాఁడు దూష్యుడుగాఁడు. ఇట్లుచేయుట అట్టి నియతాహారులకు భూషణమేగాని దూషణము గాదు. (ఇది శ్రోత్రియులయన్నము దూషిత మనువానిపరిహారము.)

సీ. బంధుల కాక నిర్బంధులు గనుఁగొన్న
యన్నము భుజియింప ◊ కున్నశిష్టు
లను గుఱించినదూషణను గన మఱి శిష్టు
లును నంటినన్నము ◊ దినక యున్న
యలమహారాష్ట్రాదికుల గుఱించినదూష
ణను గన నివి రెండు ◊ నెనయ నెనయె
యాహారనియమము ◊ ననయము గలవారు
వారికిం దూషకు ◊ లేరుఁ గారు

తే. దూషకుఁడౌ యగు సర్వాశి ◊ దోషి యగుట
ద్విజుఁడు తానయ్యునయ్యది ◊ తేఱిచూడ
దూషణము కాదు తెమ కది ◊ భూషణంబె
యగును నాహారనియతుల ◊ కతుల మగుచు.

టి. ఎనయక=చేరఁగా, ఎనయె=సమానమా ? అనయము=ఎల్లప్పుడు.

శ్లో॥ యశ్శ్వశతాది ప్రభృతి ముని వినిర్మితదివ్యప్రబంధాధ్యయనే

దోషఉద్భావిత స్సోఽయమితిహాసపురాణాదభి ర్వేద ముప
బృంహయద్భ్యో విద్వద్భ్యో నరోచ తే. 348

వ. ఏది శఠవైర్యాదిమునివినిర్మితద్రవిడప్రబంధాధ్యయనంబునం
దును దోష ముద్ఘోషింపఁబడినదియో అది యితిహాసపురా
ణాదిప్రబంధములచేతి నుపబృంహితము లగువేదములందు
ను నతివేదిత్వము గలవైదికవిద్వత్ప్రిచయ ములకుఁ రుచి
యించునదియు కాదు.

టి. ఉపబృంహితములు=తెలుపఁబడినవి. అతివేదిత్వము=అధిక జ్ఞానము.

వకుళభూషణులు.

వృ॥ వకుళవిభూషణేన గురుణా కరుణానిధినా
శ్రుతిముకుటాభిసంధి మవధార్యపరం గహనం
రచిత మిహ ప్రబంధ మనుసందధతాం కథితం
సమమపి దూషణం స్మృతిపురాణ మధీతవతామ్. 349

అ. కరుణానిధినా=దయాసముద్రులైన-వకులభూషణేన= శఠగోపులనియె
డి,గురుణా=గురువులచేత, శ్రుతిముకుట=వేదాంతములయొక్క,అభిసంధిం=అ
భిప్రాయమును, పరం=అత్యంతమైన, గహనం=కాఁజడవిసిగా, అవధార్య=నిశ్చ
యించి, రచితం=విరచింపఁబడిన, ప్రబంధం=ద్రవిడ ప్రబంధమును,అనుసందధ
తాం=అనుసంధించువారికి, ఇహ=ఇక్కడ, కథితం=చెప్పఁబడిన,దూషణం-అపి
=దూషణమును, స్మృతిపురాణం=మన్వాదిస్మృతులను వైష్ణవాదిపురాణము
లనుఁ, అధీతవతాం=చదువువారికిని, సమం=సమానము. (ఇది ద్రవిడప్రబంధ
సమాధానము.)

తా. ఈశఠగోపులు పరమదయాళువులై దురవగాహములైన ఉపనిషదర్థ
ములను, ద్రవిడప్రబంధములుగా విరచించుట మన్వాదివైష్ణవాది స్మృతిపు
రాణములను పఠించుటవలె దూషణము కాదు.

ఇ. వకుళవిభూషణులు=శఠగోపమునులు.—వీరు పాండ్యదేశమందు

తామ్రపర్ణీనదీతీరమున కురుకాపురియందు విష్వక్సేనాంశమున పడుగురాళ్వారులు తమ కవయవములుగాను పెరుమాళ్లకు తామనయవిగాను అగుటకై కారి అనువారికుమారులై బాల్యమంతయు మౌనవ్రతముతోనే యుండి వెనుక తిరునగరియందు దేవనాయకస్వామిసన్నిధియందు తింత్రిణీవృక్షకోటరమున నిలిచి సామవేదము నుత్తరభాగమంతయును ద్రావిడవేదముగా విరచించి, మధురకవియాళ్వారుల కాచార్యులునై యెన్నో దివ్యదేశసన్నిధులకు మంగళాశాసనములు చేయుచు, శఠులకు శత్రువులౌటచే శఠగోపులనియు, పరమతస్థులకు అంకుశమువంటివారగుటచే పరాంకుశులనియు, వకుళమాలికలే ఆభరణముగాఁ గలవారగుటచే వకుళాభరణులనియు, కారి యనువారికుమారులగుటచే కారిమారన్ అనుతిరునామములచే ప్రకాశించుచు, పరమవిలక్షణుల నందఱను జ్జీవింపఁజేయు చున్నవారు.

మ. సకలామ్నాయశిరస్సహస్రకథితశ్లాఘ్యార్థసారంబె శ్రీ
వకుళాలంకరణార్యవర్యకృతి దీవ్యద్దివ్యభవ్యప్రబం
ధకలాపంబు స్మృతుల్ పురాణములు తత్తత్సన్మునీంద్రప్రణీ
తకథాగాథలు నొటఁ దత్పరసనేతత్వాభిజ్ఞులుందూష్యలో.

టి. దీవ్యత్ -దివ్య-భవ్య- ప్రబంధకలాపంబు=ప్రకాశించునట్టి - అసామాన్యమై-మంగళకరమైన ప్రబంధసమూహము.

కించ — మఱియు —

వృ॥ ఉపాదేయం ప్రాజ్ఞై రుచితవిషయం ద్రావిడవచో
ప్యయుక్తార్థం హేయం భవతి వచనం సంస్కృతమపి
హారిం బిభ్రచ్ఛ్వేత స్యనతిసుభగోఽపి స్తుతిపదం
నసద్రూపోఽప్యంతగ్గకరణధృతనారీ స్తనభరః॥ 350

అ. ఉచితవిషయం = తగినవిషయములు గల, ద్రావిడవచోపి = ద్రవిడవాక్యైనను, ప్రాజ్ఞైః=ప్రాజ్ఞులచేత, ఉపాదేయం=గ్రహింపఁదగినది,అయుక్తార్థం=తగనివిషయములుగల, సంస్కృతం వచనమపి=సంస్కృతవాక్యైనను,.

హేయం=త్యాజ్యము, భవతి=అగుచున్నది. అవతి సుభగోపి = రూపవంతుఁడు కాకున్నను, హారిం=హరిని, చేతసి=మనస్సున, బిభ్రత్=ధరించువాఁడు, స్తుతి పదం=స్తోత్రమునకు స్థానము; స్వరూపోపి=రూపవంతుఁడే యయ్యును, అంతః కరణ+ధృత+నారీ స్తన+భరః=మనస్సున+ధరించిన+స్త్రీ స్తనభారముగలవాఁడు, నభవతి= స్తుతిపాత్రుఁడుగాఁడు.

తా. కురూపియైనను హరిపదధ్యానహృదయుఁడైనవాఁడు స్తోత్రపాత్రుఁడౌను గాని, రూపవంతుఁడైనను, మనస్సున మాత్రమె నారీస్తనభారవాహియైనవాఁడు స్తుతిపాత్రుఁడు కానియట్లె తగినవిషయములు గల ద్రవిడవాక్యమైనను ప్రాజ్ఞులను గ్రహింపఁదగినదే గాని,తగనివిషయములుగల సంస్కృతవాక్యమైనను, ప్రాజ్ఞులకు గ్రహింపఁదగినదే కాదు. (వేదార్థప్రతిపాదక మయ్యును, దేశభాషయగుటచేత చదువ నుచితముకా దనుదానికి పరిహారము ఇది.)

ఉత్సాహ. ఉచితవిషయములైనద్రవిడసూక్తులయ్యు గ్రాహ్యమే
యుచితవిషయరహితసంస్కృతోక్తమయ్యు గ్రాహ్యమా
యచిరశౌరిచరణహృదయుఁడు రుచిరుండు నర్హుఁడే
రుచిరుఁ డయ్యు నచిరతరుణిరూఢహృదయుఁ డర్హుఁడా?

టి. అచిర=కొద్దికాలమునుండే, అరుచిరుండు=సుందరుఁడు కానివాఁడు, అచిర-తరుణి-రూఢహృదయుఁడు=కొంతసేపైనను స్త్రీచేత నెక్కించుకొనఁబడినహృదయము గలవాఁడు.

గ॥ వస్తుత స్త్వగస్త్యవ్యాకరణానుశిష్టానా మనవద్యశిష్టపరిగ్రహావిశేషప్రకృష్టానాం ద్రవిడశబ్దానాం కోనామసంస్కృతాదపకర్షః॥ 351

వ. వాస్తవముగ నగస్త్యమహామునిప్రణీతవ్యాకరణానుసరణనిర్ణీతసిద్ధత్వంబును నిర్దుష్టశిష్టజనపరిగ్రహణపరికల్పితప్రకర్షంబును గలయీద్రావిడశబ్దంబుల కాసంస్కృతశబ్దంబుల వలన నపకర్షం బెట్లు లగు?

పశ్య—చూడు.—

వృ॥ స యాసాంవ్యాకర్తా చులుకితసముద్రో మునివరః
ప్రబంధారః ప్రౌఢా శ్శఠమథనముఖ్యా శ్శమధనాః
ప్రవక్తార శ్శుద్ధాః ప్రథితయశసః పూర్వగురవో
గిరాంపారే తాసాం జయతి గరిమా ద్రావిడగిరామ్॥

అ. చులుకితసముద్రః=పుక్కిలించినసముద్రము కల, సః మునివరః=ఆమునిశ్రేష్ఠుఁడైన అగస్త్యమహాముని, యాసాం=ఏద్రవిడవాక్కులకు, వ్యాకర్తా=వ్యాకరణము చేసెనో; ప్రౌఢాః=ప్రగల్భులైన, శఠమథనముఖ్యాః = శఠగోపులు మొదలైనవారు, ప్రబంధారః=ప్రబంధములు చేసిరో; శుద్ధాః = పరిశుద్ధులై, శమధనాః=శాంతియే ధనముగాఁగలవారై, ప్రథితయశసః=ప్రసిద్ధమైన కీర్తి కలవారునైన, పూర్వగురవః=పూర్వాచార్యులు, ప్రవక్తారః = అధ్యయనము చేయువారో; తాసాంద్రావిడగిరాం=అట్టి ద్రావిడవాక్కులయొక్క, గరిమా=గౌరవము, గిరాంపారే=వాక్కులకట్టకడను, జయతి=సర్వోత్కృష్టముగ నున్నయది.

తా. ఈద్రావిడభాషయను సముద్రమునే పానముచేసిన ఆయగస్త్యమహామునియే వ్యాకరణకర్తగాను, మహాసమర్థులైన శఠగోపమహాముని ప్రముఖులే ప్రబంధకర్తలుగాను, మహాకీర్తిసంపన్నులైన రామానుజమహామునిప్రభృతులే అధ్యేత లధ్యాపకులుగాను నున్నపుడు అట్టియీద్రావిడవాక్కుల ప్రాగల్భ్యమెవ్వరికిఁ గాని వాక్కులకు విషయమే కాకయున్నదా?

ఉత్సాహ. తగ నగస్త్యమునివినిర్మితంబ లక్షణంబు విం
తగ శఠారిముఖ్యకల్పితంబ లక్ష్య మొందుఁ బూ
ర్వగురువు ల్పలుగురు నందె వ్యాఖ్య లెన్నొ చేసి రిం
తగఁ దనర్చుతాదృశంబ ద్రవిడ మెపుడుఁ బేర్చెడున్.

పాఠాంతరము.

సీ. జలరాశిసకలంబు చులుకంబులో నిడి

పుక్కిలించినమానికేపుంగవుండు
శమదమధను లైనకేశఠమథనాదులు
ప్రతిభమైఁ ప్రబలినకేప్రౌఢతములు
నిఖిలపూర్వాచార్యు కే లఖిలవేతాంతప్ర
వర్తకాచార్యు లకేవార్యయశులు
సువిలక్షణులు నిల కే శుభలక్షణులు నల
వరముముక్షువు లార్యకేవైష్ణవులును.

తే. వసుధ నీభాష నభిలాష కే నరుస నౌర!
లక్షణము లక్ష్యములు నందు కే లక్షలక్ష
వ్యాఖ్యలును జేసి తత్తదకేధ్యయన మిపుడుఁ
జేసి వాసిం ప్రకాశింపఁ కే జేయుచుందు.

శఠమథనులు=శఠగోపులు 332. వ పృత్తముక్రింద చూడుఁడు.

తా. ఈద్రవిడభాష కాయగస్త్యులు లక్షణమును, ఆళ్వార్లు లక్ష్యమును, పూర్వాచార్యులు వ్యాఖ్యానములును జేసినవికాక, తక్కినముముక్షువులై శ్రీమహావైష్ణవులిప్పటికిని అధ్యయన అధ్యాపనములను జేయుచున్నారు. క్రమాలంకారము.

గ॥ యశ్చైకదేశే విషయదూషణోపన్యాస స్తత్రాపి వ్యాకర్ణ్యతామ్॥ 353.

వ. అం దేకదేశమందుఁ గొందఱవిషయమై నీయుపన్యసించు దూషణోపన్యాసము విషయమునందును వినుమయిది.

టి. ఏకదేశవిషయ=కొందఱవిషయమై - తెంగలవిషయమై.

కించ—మఱియు.—

వృ॥ యజ్ఞాఃపంచచసంచితాత్మధిషణామాన్యానధాన్యాథవారాః
తత్తద్దేవశరీరమాధవముఖోల్లాసావహానప్యమీ

సంత్యజ్యాప్యవధానతః ప్రభుతమం స్వారాధనైస్తోష యం
త్యేషాం సచ్చరితం యశాంసి భజతాం సూతే పునీతే జగత్ ॥

అ. సంచిత-ఆత్మధిషణాః = నిశ్చయము చేయఁబడిన-ఆత్మజ్ఞానము గలవారైన, అమీ=వీరు, యజ్ఞాన్ పంచ=బ్రహ్మయజ్ఞాది పంచయజ్ఞములను, అథ=ఆ వెనుక, మాన్యాన్ =పూజ్యములైన, అన్యాధ్వరాన్ చ = ఇతరజ్యోతిష్టోమాది యజ్ఞములను, తత్తద్దేవ-శరీర-మాధవ-ముఖ-ఉల్లాస-ఆవహాన్ -అపి = ఆయా యజ్ఞాధిదేవతలే- శరీరముగాఁగల-విష్ణువుయొక్క-ముఖమునకు - అగ్నియనుముఖమునకు-తృప్తిని-కలిగించునవెయైనను; సంత్యజ్యఅపి=విడిచియు, అవధానతః= అవకాశములో, ప్రభుతమం=సర్వదేవప్రభువైన విష్ణువును, స్వ-ఆరాధనైః= తమ ఆరాధనలచేత, తోషయంతి=సంతోషింపఁజేయుచున్నారు. భజతాం= ఆవిష్ణువునే భజించువారైన, ఏషాం=వీరియొక్క, సత్-చరితం = సత్ప్రవర్తనము, యశాంసి=కీర్తులను, సూతే=పుట్టించుచున్నది, జగత్ = లోకమును, పునీతే=పవిత్రపఱచుచున్నది.

తా. బ్రహ్మయజ్ఞ దేవయజ్ఞ భూతయజ్ఞ పితృయజ్ఞ మనుష్యయజ్ఞములు అను పంచమహాయజ్ఞములు, ఇతర జ్యోతిష్టోమాది యజ్ఞములును జేయక విడిచిపెట్టియు, ఈతెంగలవారు ఆసకల యజ్ఞాదిదేవతలై అగ్నిముఖులైన యఖిల దేవతలును తనకు శరీరభూతులై దేవాదిదేవుఁడై యున్నయీమహావిష్ణువునే ఆత్మజ్ఞానసాక్షాత్కారులై ఆరాధించుకొనుచుందురు. కాఁబట్టి అట్టివీరిఆచరణము జగత్పావనకారణమె యగును.

సీ. బ్రహ్మయజ్ఞాదిక • పంచయజ్ఞములును
మఱి యన్యయజ్ఞము • లాన్యములును
తద్దేవదేహుఁ డే • తి ద్దేవదేవున
కవె తదుల్లాసక • మైన, వాని
మానినఁ మానని • మానుగ నామాధ
వారాధనమె పరా • యణత నెపుడు

నవధానమునఁ జేయుగనట్టియాత్మజ్ఞునుఁ
డేమహాత్ముఁడు వానికయిద్ధమహిమ
తే. చరిత మెప్పుడు నొప్పెడుగచతురకీర్తి
నిచ్చుచుండును మఱి యెందుగముచ్చటులును
ముచ్చటను బావనము చేయుఁ గ బెచ్చు పెరిఁగి
పరమపురుషముఖోల్లాసగపరుఁడౌ పరుఁడు.

టి. తద్దేవదేహుఁడు=ఆయజ్ఞాధిదేవతలే దేహముగాఁ గలవాఁడైన, ఏతద్దేవదేవునకుగ్=ఈదేవదేవునకు, ముచ్చటులును=ముల్లోకములును, ముచ్చటను=మనోజ్ఞత్వముతో, పరుఁడు=శ్రేష్ఠుఁడు, "అగ్నిముఖావై దేవాః" అని శ్రుతి.

వృ॥ సర్వాభ్యర్హితవైష్ణవాంఘ్రిపయసాం పానేన పూతాత్మభిర్
బహ్వాయాసనిషేవ్యపావనజటా గంగాఽపి నాఙ్గీకృతా
సామీప్యేపి పయోనిధిః పరిహృతః పశ్వాదికామ్యాద్విధే
స్సారాసారవివేచనే సముచితా సందృశ్యతే చాతురీ. 355

అ. సర్వ-అభ్యర్హిత - వైష్ణవ-అంఘ్రిపయసాం = సకలమైనవారిచేతను పూజింపఁబడిన-శ్రీవైష్ణవుల - పాదతీర్థములయొక్క, పానేన=పానముచేత, పూత-ఆత్మభిః=పవిత్రమైన ఆత్మగలవీరిచేత, బహు - ఆయాస - నిషేవ్య-పావనజటా=అధికమైన- శ్రమచేత - సేవింపఁదగిన-పవిత్రమైన - మూలభాగములు గల, గంగాపి=గంగాజలముకూడ, న-అంగీకృతా = అంగీకరింపఁబడినది కాదు. సామీప్యేపి=సమీపమందైనను, పయోనిధిః=సముద్రము, పరిహృతః=పరిహరింపఁబడినదియె, పశు-ఆది - కామ్యాత్ = పశుబంధము-మొదలైన-కామ్యకర్తయైన, విధేః = నియమముయొక్క, సార-అసార-వివేచనే=యుక్త-అయుక్తములను - విభాగించుటయందు, సముచితా = తగిన, చాతురీ=చాతుర్యము, సందృశ్యతే=కనఁబడుచున్నది.

తా. అందఱును ఆచరింపఁదగిన శ్రీవైష్ణవుల పాదతీర్థమును పానముచేసి చేసి తాము పావనులైనవారు ముల్లోకములను పవిత్రముచేయు గంగాజలమునుకూడ

అంగీకరింపకయు, దగ్గరనుండునదియైనను స్నానాదులకు సముద్రజలమును గూడఁ ద్రోసివేసియు, పశుబంధము అజబంధము మొదలైన కామ్యకర్మలను గూడఁ జేయకయు నుండు నీతెంగలవారల యొక్క "ఇది సరి అది సరి కాదు" అని వివేచించెడిచాతుర్యము మన కిప్పటికిని గనఁబడుచున్నదియె.

జటా=మూలభాగము - "మూలే లగ్నకచేజటా" అని అమరము.

తే. వైష్ణవాంఘ్రిపయఃపూతశేవరులు వఱలు
గంగ నేనియు నిధి నేని కే గానఁబోరు
గానఁబడెఁ బశుబంధాదికేకామ్యవిధి న
సారసారవివేచనకేచాతురి యిదె.

టి. వఱలుగంగ నేనియుఁక్ = ప్రకాశించు గంగనైనను, కామ్యవిధిఁక్ = కామ్యహేతుకక్రియా విషయమందు.

గ॥ హంత ! ఏతేష్వేవ సాంసిద్ధికామచ్యుతభక్తి మపేక్ష్య విజయతే తద్భక్తభక్తి రనితరసాధారణీ॥ 356

వ. ఆహా ! వీరిలో భగవద్భక్తి జన్మాంతరకృతసుకృతసంసిద్ధ మయ్యును, దానికన్నఁ దద్భక్తభక్తియే యనన్యసామాన్యమై జయావహ మైనయది.

శ్లో॥ దృష్టే ఘటిత్యఖిలలోకనిదానభక్తే
సాష్టాంగ మత్రప మపాకృతసర్వగర్వం
అస్పృష్టదేశసమయం ప్రణమంతి తేషాం
ధన్యాత్మనాం వద కి మన్యదుపాస్య మస్తి. 357

అ. అఖిలలోకనిదానభక్తే = సకల లోకములకును ఆదికారణ మైన శ్రీమన్నారాయణునియొక్క భక్తుఁడు, దృష్టే=చూడఁబడినయెడల, ఝటితి= శీఘ్రముగా, అత్రపం=లజ్జారహితముగాను, అపాకృత సర్వగర్వం=తొలఁగఁ ద్రోయఁబడిన సకలగర్వముగలదిగాను, అస్పృష్టదేశసమయం = దేశ

కాలములను అనుసరించనిదియుఁగాను, సాష్టాంగం=సాష్టాంగముగా, ప్రణమంతి=ఎవరు నమస్కరించుచున్నారో, తేషాం=అట్టి, ధన్యాత్మనాం = ధన్యాత్ములకు, అన్యత్=మఱియొక, ఉపాస్యం=ఉపాసింపఁదగినది, కిం అస్తి=ఏమియున్నది, వద=చెపుమా?

తా. భగవానుఁడైన శ్రీమన్నారాయణునికి భక్తుఁడు కనఁబడినయెడల, తోడనే సిగ్గుగాని గర్వముగాని లేక, కాలదేశములను జూడక సాష్టాంగప్రణామముసేయు నీధన్యాత్ములైన తెంగలవారికి వేఱేమియు సేవింపఁదగినది లేదు.

మ. భగవద్భక్తులఁ గానఁగానె భువి సంభావించి సాష్టాంగ మి
వ్వగఁ గావింతురు వింతగా గణనమున్ వర్జించి లజ్జింపకే
తగుచోటుం దగువేళ నాక తమకుం ధన్యాత్మతం గోరి వీ
రొగిఁ గావింపఁగ దీనికన్న నొకటిన్ యోజింప వేఱున్నదే.

టి. నాక=అనక, ఒగిన్=వరుసగా, సాష్టాంగము=కం. కరయుగచరణయుగంబులు,నురము లలాటస్థలంబు నున్నతభుజముల్,సరిధరణిమోపి మ్రొక్కినఁ, బరువడి సాష్టాంగమండ్రు పరమమునీంద్రుల్.

గ॥ యచ్చ యతివందనవిషయే వ్యవహితోఽసి తత్రాప్యాకర్ణ్యతామ్॥ 358

వ. ఏది యతివందనవిషయమందును నీ కనుగొలిపినదియో? అదియును వినుదియే.

వృ॥ ఉత్కర్షం చరమాశ్రమీ జడమతిస్స్వేనైవ జానాతిచేత్
నేదిష్ఠేష్వపి సర్వలోకగమితు ర్భక్తేషు భిత్తీయతే।
అన్యేఽమీయతయః ప్రబోధనుతయా స్సర్వస్యచోత్కర్షదా
భక్తి ర్భాగవతీతి సస్పృహమమూనర్చంతి నృత్యంతిచ॥359

అ. జడమతిః=మందబుద్ధిగలవాఁడైన, చరమాశ్రమీ=సన్యాసి, స్వేనైవ=తానుగానే, ఉత్కర్షం=శ్రేష్ఠత్వమును, జానాతిచేత్=ఎఱిగినవాఁడైయుండెనా, నుచున్నాఁ

డేని, సర్వలోకగమితుః=సకలలోకములందును వ్యాపకుఁడైన భగవంతునియొక్క, భక్తేషు=భక్తులు, నేదిష్ఠేషు-అపి= సమీపించినవారయ్యును, భిత్తీయతే=గోడయగుచున్నాఁడు, అన్యే=ఇతరులైన, అమీ-యతయః=ఈసన్న్యాసులు, ప్రబోధమతయః=జ్ఞానముతోడిబుద్ధి గలవారై, సర్వస్య=అందఱికిని, ఉత్కర్షదా=మహత్వమును ఇచ్చునట్టిది, భాగవతీ = భగవత్సంబంధమైన, భక్తిః=భక్తియే, ఇతి=అని, సస్పృహం=కోరికతో, అమూన్ =ఈగృహస్థాదివైష్ణవులను, అర్చంతి = పూజించుచున్నారు; నృత్యంతిచ=నటించుచున్నారు.

తా. సన్న్యాసాశ్రమము గలిగియు మందబుద్ధియైనవాఁడు ఉత్కృష్టతను దెలిసియు భగవద్భక్తులు సమీపించినప్పుడును తాను గోడవలె ప్రతినమస్కారమైనఁ జేయకయుండును. తక్కిన ఇతరసన్న్యాసులు ఉత్కృష్టజ్ఞానముకలిగి భగవద్భక్తియే సర్వోత్కృష్టమని తద్భక్తభక్తుల నెవరినైనను బూజించుచు నానందముతో వర్తించుచుందురు.

చ. యతి మతిమందుఁడై తనదుసన్న్యాశ్రమమందునశ్రేష్ఠతాభిసం
హతి నతి సేయఁడాహరిపదాశ్రితసంహతికాడ గోడయై,
యతి మతిమంతుఁడో హరిపదాశ్రితకోటికి మాటికి న్మహో
న్నతినతిసేయుశ్రేయమని సన్నుతనయున్మతిసేయుస్థేయుఁడై.

టి. శ్రేష్ఠతాభిసంహతిన్ =శ్రేష్ఠత్వమందలి తలంపుచేత, సంహతికాడన్ =సమూహమునొద్ద, స్థేయుఁడై=మిక్కిలిస్థిరుఁడై.

ఇదంచావధేయం——ఇదియుఁ దెలియునదియ.

వృ॥ చతుర్వేదాధ్యాయీ సకలవిహితాచారనిపుణో
నిషిద్ధాచారాన ప్యథపరిహరన్ శాస్త్రపదవీమ్।
యతిర్వా ప్యన్యోవా హరిచరణభక్తా న్యది జనాన్
ఉపేక్షేత క్షాంతే ర్నభవతి పదం విశ్వగమితుః॥ 360

అ. చతుర్వేదాధ్యాయీ=నాలుగు వేదములు నధ్యయనము చేయువాఁడు,

సకలవిహితాచారనిపుణః=సమస్త వేదవిహితము లయిన అనుష్ఠానములందు సమర్థుఁడైనను, నిషిద్ధాచారాన్=వేదనిషిద్ధాచారములను, పరిహరన్ అపి=విడుచువాఁడైనను, శాస్త్రిపదవీం=శాస్త్రివిహితమార్గమును (చరించుచున్న) యతిర్వా=యతియైనను, అన్యోపివా=గృహస్థుఁడైనను, హరిచరణభక్తాన్=హరిపాదభక్తులయిన, జనాన్=వైష్ణవజనులను, యది ఉపేక్షేత=ఉపేక్షించినవాఁడైనయెడల, విశ్వగమితుః=జగదధిపతియైన భగవంతునియొక్క, క్షాంతేః=క్షమకు, పదం=స్థానము, నభవతి=కాఁడు.

తా. చతుర్వేదము లధ్యయనముచేయుచు, వేదవిహిత శాస్త్రివిహితాచారములలో సమర్థుఁడయ్యును; వర్ణాశ్రమములందు నిషిద్ధాచారములను విడిచియు, యతీశ్వరుఁడుగాని గృహస్థుఁడుగాని వైష్ణవులను ఉపేక్షించినయెడల, అతఁడు భగవత్క్షమకు ఆస్పదముకాఁడు.

తే. వేదవేదియు నాచారవేదియు నయి
యతియు నేనియుఁ దదితరుఁ డైనతఁడు నేని
హరిపదాప్తు ననాచారపరుని నేని
యుజ్ఝనివాఁడైన హరిక్షమకయుజ్ఝనివాఁడె.

గ॥ తదనతిక్రాంతలోకమర్యాద మాశ్రమత్రయస్యైవ న కేవలం నిఖిలాశ్రమిణామపి పరస్పరభక్తిప్రకర్షప్రకటితదాస్య ముక్తిప్రత్యుద్గమాభివాదనాదిక మవశ్యానుష్ఠేయమేవేతి సాధు జానీహి॥ 361

అ. తత్=అందువలన, అనతిక్రాంతలోక మర్యాదం=లోకమర్యాదను మీఱనిదైన, ఆశ్రమత్రయస్యైవ = బ్రహ్మచర్యాద్యాశ్రమముల మూఁటికే, న కేవలం=కాదుగాని, నిఖిలాశ్రమిణామపి=చతురాశ్రమములవారికిని, పరస్పర భక్తిప్రకర్ష ప్రకటితదాస్యం=ఒక్కొక్కరియొక్క భక్త్యతిశయముచేత ప్రచురపడిన దాస్యప్రవృత్తిగాని, ఉక్తిప్రత్యుద్గమాభి వాదనాదికం=మాటకెదుటిమాట అభివాదనము మొదలైనదిగాని, అవశ్యానుష్ఠేయమేవ=అవశ్యము అనుష్ఠింపఁదగినదే, ఇతి=అని, సాధు=బాగు, (నా) జానీహి=తెలిసికొనుమా.

వ. ఆలోకమర్యాద యతిక్రమింపక, యీతుర్యాశ్రములకే కాదు; ఆసర్వాశ్రములకుం బరస్పరభక్తిప్రకర్షంబునం జేయు దాస్య ప్రకటనంబును, ప్రశ్రయకథనంబును, ప్రత్యుద్గమనంబును, అభివాదనంబును, ఆదిగాఁ గలయవి యవశ్యంబు సమష్ఠేయంబులే యని యనువునం దెలిసికొనుము.

గ॥ యదపి ప్రపన్నజనజీవన ప్రధాననిదానపావనపాదావనే జనావలంబిదూషణం తదపితన్మహిమాఽపరిజ్ఞాన విజృంభితం బుద్ధేః పిశునయతి దౌర్భాగ్యం ॥ 362

అ. యదపి = ఏదైతే, ప్రపన్నజనజీవన ప్రధాననిదాన పావన పాదావనే జన అవలంబిదూషణం=ప్రపన్నులు ఉజ్జీవించుటకు ప్రధానమై యాదికారణమై పవిత్రమైన శ్రీపాదతీర్థము నవలంబించుటయందలి దూషణమో, తదపి=అదియు, తన్మహిమా అపరిజ్ఞాన విజృంభితం=వారిమహిమను తెలియమిచేత విజృంభించిన, దౌర్భాగ్యం=దుర్భాగ్యత, బుద్ధేః=నీబుద్ధికి, పిశునయతి=కనఁబఱచుచున్నది. (ఇట్లు యతివందనమును గుఱించినదూషణమును పరిహరించి, శ్రీవైష్ణవపాదోదక సేవనమును గుఱించిన దూషణమును పరిహరించుచున్నాఁడు.)

వ. మఱియుఁ బ్రపన్నులుజ్జీవించుటకుం బ్రధాన కారణంబునం బరమపావనం బయినయీపాదతీర్థమువిషయమునను నీచేయుదూషణము దానిమహిమను దెలియమినింబట్టియ, బిట్టు ఱేఁగిననీబుద్ధి దౌర్భాగ్యమునకే సూచక మగుచున్నయది.

తథాహి—అట్లేకదా?

వృ॥ స్వాతంత్ర్యం పరివర్జయన్నిజగురోరంఘ్రిద్వయాంశీ భవన్
శ్రీవైష్ణవస్వాభిజనస్య నిస్పృహతయా తన్వీత తీర్థాన్వయం
గోష్ఠీభూయ సమార్జితం నిపుణధీః శ్రీపాదతీర్థం స్వయం
స్వీకుర్యాద్యది పాంచరాత్రపదవీభాజాం నతద్దూషణమ్॥363

అ. స్వాతంత్ర్యం=స్వతంత్రతను, పరివర్జయన్=విడుచుచు, నిజగురోః=తమయాచార్యునియొక్క, అంఘ్రిద్వయ+అంశీభవన్=పాదద్వంద్వముయొక్క అంశభూతుఁడుగా అగుచు, స్వాభిజనస్య=తమవారలయొక్క, ప్రీత్యై=సంతోషముకొఱకై, నిస్పృహతయా=ఇతరేచ్ఛలేకుండ, తీర్థాన్వయం=తీర్థానుసరణమును, తన్వీత=చేయుచున్నాఁడు; గోష్ఠీభూయ = గోష్ఠియై, సమార్జితం=చేర్చుకొన్న, శ్రీపాదతీర్థం=శ్రీపాదతీర్థమును, నిపుణధీః = నేర్పుతోడి బుద్ధిగలవాఁడై, స్వయం=తానే, స్వీకుర్యాత్ యది = స్వీకరించినవాఁడయ్యేనేని, పాంచరాత్రపదవీభాజాం = పాంచరాత్రమార్గమును ప్రమాణముగా గ్రహించువారికి, తత్+దూషణం=అది+దూషణముగా, న=కాదు.

తా. స్వాతంత్ర్యమును విడిచి తాము స్వాచార్యుల పాదాంశభూతులు అనుకొనుచు, తమవారి సంతోషమునకై వేఱుగోరక తీర్థమునపేక్షించి గోష్ఠిలో ఆశ్రీపాదతీర్థమును తాము స్వీకరించుటయందు పాంచరాత్రాగమమే ప్రమాణముగాఁగల రామానుజమతస్థులకు అది దూషణము గాదు.

శా. స్వాతంత్ర్యంబుత్యజించి తాగురుపదాంశాంశంబై స్వకీయాభిజా
తాతిప్రీతిఁ గొనుం గతస్పృహతఁ దీర్థానీక పాత్రత్వముం
బూతాత్మత్వముఁ గోరి గోష్ఠిని గనుం బూజ్యుండు శ్రీపాదతీ
ర్థాతిప్రీతిని సేవణంబిదెసుమా యీపాంచరాత్రీయమున్.

చం. తాను స్వతంత్రతను విడిచి, ఆచార్యులపాదాంశ మనుకొనువాఁడై తనయాభిజాత్యమందు ప్రీతి విడిచి, ఆశలు దిగనాడినవాఁ డగుటచేత తీర్థసమూహమునపాత్రత లభించును. మఱియు నిట్లు తాను పవిత్రాత్మను గలవాఁడగుటనుం గోరి పూజ్యుండైనవాఁడు గోష్ఠియందు శ్రీపాదతీర్థము నతిప్రీతితోడ సేవించుటనుఁ లభించును. ఆపాంచరాత్రవిహితముకూడ ఇదే సుమా?

వృ॥ వద ? రహసి పదాంబు స్వీయ మాపీయ తేవా
విగతనిజపదాంభో నార్థ్యతే వాఽంఘ్రితీర్థం
అపితు తదభిలాషా స్వామినాం స్వాంఘ్రిసంగే
పృథికతరపవిత్రం సేవ్యతే పాదతీర్థమ్॥ 364

అ. రహసి=ఏకాంతమందు, స్వీయం=తనదైన, పదాంబు = పాదతీర్థము, ఆపీయతేవా = పానముచేయఁబడుచున్నదా? వద=చెప్పుము. విగతనిజపదాంభః = విడిచిపెట్టిన స్వపాదపు జలము గల, అంఘ్రితీర్థం = పాదతీర్థము, అర్థ్యతేవా=ప్రార్థింపఁబడలేదా? వద=చెపుమ? అపితు=మఱియు, తత్+అభిలాషా=ఆపాదతీర్థమందలి అభిలాష, స్వామినాం=సర్వేశ్వరునికి స్వాంఘ్రిసంగే-అపి=తనపాదముతో సంబంధముండియు, అధికతరపవిత్రం=మిక్కిలి పావనమైన, పాదతీర్థం = గంగోదకము, సేవ్యతే = సేవింపఁబడుచున్నదియే.

తా. తమగోష్ఠియందు పెద్దలు తమపాపతీర్థమును తీసికొందురు గాని, యథాస్థానమున లేని ఏపాదతీర్థమునైనను గోరరు; స్వామియైనవిష్ణువు తనపాదతీర్థమై అతిపవిత్రమై విష్ణుపది యని పేరొ్కన్నగంగోదకమును తాను స్వీకరించుచుండలేదా.

తే. స్వీయపాదాంబుపానంబె ౯ చేయు టనుచె
స్వాత్మపాదాంబు నన్యపా౯దాంబుపాన
మర్థిఁ జేయుట యది చూడ ౯ నార్యునకును
విష్ణునకు విష్ణుపదివారి౯విధము వినుము.

గ॥ తదవధేహి? ఉపేక్షణీయ నిజపదపయస్సంగే ౨ప్యంగీకరణమధికతరపవిత్ర బహుళతర హరిచరణ సంతతాంతరంగ జనచరణావనేజనస్య సముచిత మేవేతి॥ 365

అ. ఉపేక్షణీయ-నిజపదపయః-సంగేపి = ఉపేక్షింపఁదగిన-తమపాదతీర్థముయొక్క-సంబంధముండియు, అధికతరపవిత్ర-బహుళతర-హరిచరణ-సంతతాంతరంగజన-చరణావనేజనస్య=మిక్కిలి పవిత్రమై-మిగుల-భగవత్పాదములందు-సర్వదా హృదయముగలవారియొక్క-పాదప్రక్షాళన జలముయొక్క, అంగీకరణం=అంగీకరించుట, సముచితమేవ=తగినదే, ఇతి=అని, తత్=అది, అవధేహి=తెలిసికొనుము.

వ. అది తమపదపయస్సంగము కలదియే యైనను; ఉపేక్షింపక దాని నంగీకరింప నపేక్షించుట–పరమభాగవతులపదపయః కణము మాత్రమేయైనను, అతిమాత్రపవిత్ర మైనదే; కాన, దాని నవధానమునఁ గనుఁగొనుమ ?

వృ॥ మజ్జన్ జన స్స్వచరణద్వయసంగభాజి
గంగాఝరే నిజకలంకనిరాసహేతోః ।
పూర్ణోపమాన మవధేహి నిజాంఘ్రిసంగి
భక్తాగ్రగణ్యపదపద్మపయః పిపాసోః॥ 366

అ. స్వచరణద్వయసంగభాజి = తనపాదయుగ్మసాంగత్యమును పొంది యుండు, గంగాఝరే=గంగాప్రవాహమందు, నిజకలంకనిరాసహేతోః = తన పాపములు నిరాకరించుకొనుకొఱకు, మజ్జన్ = స్నానముచేయుచున్న, జనః= జనుఁడు, నిజాంఘ్రిసంగి-భక్తాగ్రగణ్య-పదపద్మ-పయఃపిపాసోః = తనపాదములతోడిసంబంధము గలదియై-భగవద్భక్తులలో ప్రధానులైనవారి_పాదపద్మములయొక్క--తీర్థమును పానముచేయఁగోరినవానికి, పూర్ణ+ఉపమానం=పూర్ణోపమానముగా, అవధేహి= తెలిసికొనుమా.

తా. ఎట్టిగంగాదిజలమందైనను తనపాదముల నుంచుకొనియు, తనసకల పాపములును పరిహరించుకొనుకొఱకు స్నానముచేయఁబడునో ; అట్లే తనపాద తీర్థముతోఁ జేర్పఁబడినదైనను, భగవద్భక్తినిష్ఠులైనప్రపన్నులలో ప్రధానులైనవారిపాదతీర్థమును స్వీకరించుటయును రామానుజీయ మతానుసారి సదనుష్ఠానమే.

తే. గాంగవారి యవారి నిజాంఘ్రిసంగి
జాణ స్నానాన నఘనిరాసానఁ, దాన
స్వాంఘ్రిసంగిభాగవతాంఘ్రిసార్థతీర్థ
పానమే యగుఁ దగు నుపమాన మెపుడు.

గ॥ ఆస్వామిపరంవాచవనికే వితండాయమానా స్సంధ్యాను విహిత

నాత్మప్రదక్షిణ మప్యధిక్షిపంతు హన్త? ఏ తేషా మనపాయ
సత్సంప్రదాయప్రవర్తక స్సకలగురుతిలక లోకగురు హృద
యానుసారీ సఏష విజయతే సౌమ్యోపయంత్రాదీనాం దేశి
క సార్వభౌమః॥ 367

అ. ఇదం=ఇది, ఆస్తాం=ఉండనీ ; వాచనికే=ఈమాటలో, వితండాయ
మానాః = వితండనుచేయువారు, సంధ్యాసు = సంధ్యావందనకాలములలో,
విహితం=విధింపఁబడిన, ఆత్మప్రదక్షిణమపి = తనప్రదక్షిణమును జేయుటను
గూడ, అధిక్షిపంతు = త్రోలఁగఁద్రోయుదురుగాక, హంత=అయ్యో! ఏతే
షాం=వీరియొక్క, అనపాయసంప్రదాయప్రవర్తకః=నిరపాయమైన సంప్రదా
యమును ప్రవర్తింపఁజేయువారై, సకలగురుతిలక = సకలాచార్యులకు శిరో
భూషణమై, లోకగురుహృదయానుసారీ = లోకాచార్యులైన శ్రీమన్నారా
యణునియొక్క అభిప్రాయము ననుసరించువారైన దేశికులలో, సఏషః =
ఆయీ, దేశికసార్వభౌమః = ఆచార్యచక్రవర్తియైన శ్రీరామానుజులు, విజయ
తే=జయశీలురుగా నున్నారు.

వ. అది యటుండనీ. ఇట వితండాయమానులు ప్రతిసంధ్యాసమ
యములందును విధివిహితమైన తమ చేయుప్రదక్షిణము నధి
క్షేపింపకే యున్నారుకారు? మహాశ్చర్యము! ఈమహాత్ము
లలో నిరపాయసంప్రదాయప్రవర్తకులును, సకలాచార్యుల
కును ప్రథమాచార్యుఁడైన సర్వేశ్వరుహృదయానుసరణసర
ణికె సంస్థాపకులును, సకలశరణాగతరక్షకులకును దేశికసా
ర్వభౌములు నయినయారామానుజులును సర్వోత్కృష్టులై
యున్నారు కారు?

శ్లో॥ పుణ్యశ్లోకః పరమభిమతః స్వస్థలేష్వాస్థయాఽసౌ
యస్య శ్లోకప్రథమపఠనశ్లాఘనాకంపమానే ః

చూడాసూనైః స్నపయతి మధుస్యందిభి శ్చంచరీకై
ర్దత్తస్వస్తి ప్రవచన మురోనిత్యభూషాం స్వయోషామ్॥368

అ. పుణ్యశ్లోకః = పవిత్రమైన యశస్సుకలిగిన, అసౌ = ఈలక్ష్మీపతి, పరం=మిక్కిలి, అభిమతిః=సమ్మతించినవాఁడై, స్వస్థలేషు = తనచోటులలో, ఆస్థయా=పట్టుతో, యస్య = ఏరామానుజులయొక్క, శ్లోకప్రథమపఠనశ్లాఘనాకంపమానైః = శ్లోకమునుయొక్క మొదటిసారె చదువుటతో-కొనియాడుటచేత కదలుచున్న, మధుస్యందిభిః=తేనెనుకార్చుచున్న, చూడాసూనైః=తలలోని పూవులచేతను, చంచరీకైః = వానిలోని తుమ్మెదలచేతను, దత్తస్వస్తిప్రవచనం=ఇయ్యఁబడిన స్వస్తివచనములు కలుగునట్లుగా, ఉరోనిత్యభూషాం=వక్షఃస్థలమందుః సదాభూషణప్రాయమైన, స్వయోషాం=తనభార్యయైన లక్ష్మీదేవిని, స్నపయతి=స్నానముచేయుచున్నాఁడు.

తా. ఈరామానుజులు సాయించినశ్లోకము నొకసారి చదివి కొనియాడుకొనుచు తనతలలో కదలుచున్నపూలతోను తేనెతోను భృంగములతోను, తన స్వస్తివచనములతోను తనవక్షఃస్థలమందలితనభార్య యైనలక్ష్మీదేవిని ఏలక్ష్మీపతి స్నానముచేయించెనో? అట్టిరామానుజులు వీరు అనుట.

ఉ. ఆకమలాక్షుఁ డేతతిని నాదృతి నేకృతి యాలకించి శ్లా
ఘాకలనంబునన్ శిరము కంపిల, నంటులఁ బూవుఁజల్లులన్
జోక ఘటించి, వక్షమున జోటిని దేఁటిగమిన్ శుభాంగగీ
తాకలనంబువాడునొగి నాకృతియీకృతి దేయుగున్.

టి. ఏతతినిన్ =ఎప్పుడును, ఆదృతిన్ =ఆదరముతో, ఏకృతి =ఏరామానుజులశ్లోకమును, శ్లాఘాకలనంబునన్ = శ్లాఘించుటచేత, జోకన్ =వేడుకతో, జోటిని=తనస్త్రీయైనలక్ష్మిని, తేఁటిగమిన్ =తుమ్మెదలసమూహముతో, శుభాంకగీతాకలనంబు=శుభలక్షణములు గలగానముచేయుటగా, పాడున్ =పాడునో, ఆకృతి=ఆశ్లోకము, ఈకృతిదే=ఈపుణ్యస్వరూపునిదే.

వృ॥ ఖలకృతపరిభాషాకిర నోద్వ్యాజిగీషా

వితతనిజమనీషా విస్తృతత్రిబ్రహ్మయోషా
జయతి దలితదోషా దత్తతత్వాభిలాషా
వరవరమునివేషా క్వాపి వైకుంఠభూషా॥ 369

అ. ఖల...గీషా—ఖల=దుష్టులచేత, కృత = చేయఁబడిన, పరిభాషా=నిందావాక్యములను, ఆకర్ణన=వినుటచేత, ఉద్యత్=విజృంభించుచున్న, జిగీషా=జయేచ్ఛగలదియు; వితతనిజమనీషా=విస్తారమైన స్వబుద్ధివిశేషము కలదియు; విస్తృతత్రిబ్రహ్మయోషా = విస్తరింపఁజేయఁబడిన సరస్వతీరూపమైన వాక్కులుగలదియు; దలితదోషా = ఖండింపఁబడిన సకలదోషములు కలదియు; దత్తతత్వ—అభిలాషా = ఈయఁబడిన పరతత్వమందలి అభిలాష కలదియు; వర-వరముని-వేషా=శ్రేష్ఠమైన మునిశ్రేష్ఠునియొక్క వేషముకలదియునైన, వైకుంఠభూషా = పరమపదమునకు భూషణమైన శ్రీరామానుజులు (శ్రీవిష్ణుమూర్తి), క్వాపి=ఎక్కడను, జయతి=సర్వోత్కృష్టులుగా నున్నారు.

తా. మతాంతరులను జయింపఁగలిగిన స్వబుద్ధివిశేషముచేత సరస్వతిని సంతసపఱచుచు, సర్వదోషములను పరిహరించి పరతత్త్వమందె యభిలాష గలిగి పరమపదమునకు పరమభూషణమువలె నున్నయీరామానుజమునులు—లేక యీ పరమపదనాథుఁడు ఎప్పటికిని సర్వోత్కృష్టులుగా నున్నవారు.

మ. ఖల గాథ ల్వేని వాని గెల్వ నవనిం గాంక్షించి యక్షీణవా
క్కులవాగ్దేవియుమోద మొదవదిశలన్ ఘోషించిదోషచ్ఛటల్
తొలఁగంజేసి, పరత్వతత్వముల సంతోషించురామానుజ
చ్ఛలవైకుంఠుఁడకుంఠతేజుఁడితఁడుక్ సామాన్యసన్మాన్యుఁడే?

టీ. గాథలు=పురాణములు, అవనిన్=భూమియందు, కాంక్షించి = కోరి, వాగ్దేవి=సరస్వతి, దోషచ్ఛటల్ = దోషసమూహములను, పరత్వతత్వములన్=పరత్వవిషయమైన తత్వములచేత, రామానుజచ్ఛలవైకుంఠుఁడు = శ్రీరామానుజులనెడి వ్యాజముతోడి శ్రీవైకుంఠనాథుఁడు, అకుంఠతేజుఁడు=సంపూర్ణప్రభావుఁడు.

గ॥ ఆకర్ణయ తావదేతదీయానాం పవిత్రతమం చరిత్రం॥ 370

అ. ఏతదీయానాం = వీరిసంబంధులయొక్క, పవిత్రతమం = అతిపవిత్ర మైన, చరిత్రం=చారిత్రమును, ఆకర్ణయ తావత్ =వినుమా?

వ. మఱియు నితనిమతావలంబులపవిత్రతమం బగుచరిత్రంబును వినుమ ?

శ్రీమద్రామానుజీయులవర్ణనము.

వృ॥ కతిచి దలసాః కర్మాయాసాద్విహాయ వినిశ్చలా
స్తదపి భగవద్భక్తిస్తేషాం ధునోతి భవవ్యథాం
శ్రమసహజనైకార్త్యైర్భోగ్యాణాం వినైవహిలంఘనై
ర్జ్వరనిరసనాయాలం వీర్యోత్తరం పరమౌషధమ్. 371

అ. అలసాః=మందబుద్ధులు, కతిచిత్ = కొందరు, ఆయాసాత్ =ఆయాసమువల్ల, కర్మ=నిత్యనైమిత్తికరూపకర్మను, విహాయ=విడిచి, వినిశ్చలాః = చలింపనివారైరి, తదపి=అయినను, తేషాం=వారికి, భగవద్భక్తిః=భగవంతుని విషయమైనభక్తి, భవవ్యథాం=సంసారదుఃఖమును, ధునోతి=పోఁగొట్టుచున్నది; శ్రమసహ-జన-ఏకార్త్యైః = క్షుధాదిశ్రమలోర్చువారైన - జనులయొక్క ముఖ్యార్హములయిన, లంఘనైః=లంకణములతో, వినైవ=లేకయే, నృణాం= మనుష్యులకు, జ్వరనిరసనాయ = జ్వరమునుపోఁగొట్టుటకై, వీర్యోత్తరం=బలిమికిప్రధానమైన, పరమౌషధం=మంచిఔషధము, అలంహి=సమర్థమేకదా?

తా. తనవ్యాధిశ్రమలను పోఁగొట్టుకొనుటకై లంకణాదులు చేయకపోయినను, ఆవ్యాధులు పోఁగొట్టుకొనుటకై గొప్పయౌషధమును తీసికొనునట్లుగా, కొందఱు బుద్ధిహీనులు తమనిత్యనైమిత్తికకర్మలను చేయకమానుకొన్నను, తాము చేయు భగవద్విషయికభక్తివలననే భవరోగములు దొలఁగించుకొనుచున్నారు.

తే. నిత్యనైమిత్తికక్రియ కీల్నె అప కతుల
భక్తిభరమది హరి యది కే సాంమవెతల

లంకణముచేయకయ చేయుకే లగువు ప్రజకు
జ్వరభరంబు నమోఘ మౌషధవరంబు.

కించ — మఱియు: —

వృ॥ రహస్యవ్యాఖ్యానై రఘువరచరిత్రానుకథనై
స్త్రయీసధ్రీచీనాం వకుళధరవాచాం ప్రవచనైః
అమీ భాష్యాఖ్యానై ర్హరిచరణకైంకర్యవిధిభిః
ప్రణామైశ్చార్యాణాం క్షణమివ నయంత్యత్ర దివసాన్ ॥372

అ. రహస్యవ్యాఖ్యానైః=రహస్యత్రయాదివ్యాఖ్యానములతోను, రఘువర చరిత్రానుకథనైః=రామాయణాదిపఠనములతోను, త్రయీసధ్రీచీనాం=వేద సమానములయిన, వకుళధరవాచాం=ప్రబంధవాక్యములయొక్క, ప్రవచనైః= అనుసంధానములతోను, భాష్య-ఆఖ్యానైః = భాష్యమును ప్రవచించుటలచేత ను, హరిచరణకైంకర్యవిధిభిః= భగవత్పాదకైంకర్యకార్యములతోను, ఆర్యా ణాం ప్రణామైశ్చ= పెద్దలకు చేయు ప్రణామములతోను, అమీ = ఈరామానుజ మతస్థులు, అత్ర= ఈలోకమందు, దివసాన్ =దినములను, క్షణం+ఇవ=నిమిష మాత్రమువలె, నయంతి=కడపుచున్నారు.

తా. ఈలోకమందు ఈరామానుజమతస్థులు భగవద్విషయికప్రణవనమః పదనారాయణపదరహస్యత్రయాదులతోను ద్వయార్థప్రతిపాదక శ్రీమద్రా మాయణాదులతోను వేదతుల్యములయిన ఆళ్వారులప్రబంధములతోను శ్రీమ ద్రామానుజభాష్యాదులతోను, మఱి భగవత్కైంకర్యములతోను ఈమతస్థు లలో పెద్దలకు చేయుప్రణామములతోను ఎంతకాలమునైన ఒకక్షణమువలె జరుపుకొనుచున్నారు.

సీ. అష్టాదశరహస్యశిష్టానుమతముఖ్య
సద్వ్యాఖ్య లెప్పుడుఁ జదువు తమకు
నద్వయద్వయబోధకామేయరామాయ
ణామె యెప్పుఁ బారాయణంబు తమకు

వేదవేదాంతనికి వేసకవకుళభృ
ద్వచనప్రవచనంబె కి నరము తమకు
రామానుజీయంబె కి ప్రామాణికం బని
భాష్యంబె వేమాటుం కి బఠన తమకు

తే. హరిచరణసరసీరుహా కి పరిచరణము
నార్యచర్యాగ్రణిప్రణా కి మాచరణము
నిత్యమును గృత్యములు తమ కి కత్యవశ్య
మిల్లె దిన మొకక్షణముగ కి నెపుడుం గాంచ్రతు.

టీ. అష్టాదశరహస్యములు = ముముక్షుపడి యాదృచ్ఛికపడి మొదలైనవి; అద్వయద్వయబోధకఅమేయ=అసమానమైన ద్వయార్థమును బోధించెడిదురూహమైన, పరిచరణము=పరిచర్య.

గ॥ (పునఃక్షణమనుధ్యాయసశ్లాఘం) అన్యదాస్తాంనామ, తామేవకామమన్యోన్యం కలహాయమానానాం నానావిధానాం శ్రుతీనా మవిరోధసాధనేన సాధుభావంప్రకటయంతీ మఖిలగుణాభిరామాం రామానుజసరస్వతీ మభినందామి–ప్రసిద్ధంహి “ సంధి మిచ్ఛంతి సాధవః ” ఇతి॥ 373

వ. (క్షణ మనుధ్యానించి శ్లాఘించియు) మఱియుండనీయుండది? మెండుగం దా మొండొండును గలహించుచుండు వివిధవేదతండంబులకు నవిరోధంబున సాధనంబునసనె “ సంధిమిచ్ఛంతిసాధవః=సాధువులు సంధిని గోరుచున్నారు”. అని సాధుభావంబెప్రకటించుచు సకలసద్గుణాభిరామ మయినయారామానుజసూక్తిధోరణి యసాధారణియనియభినందించుచున్నాను.

పశ్య—చూడు:—

వృ॥నిత్యంహేయగుణావధూనసపరా నైర్గుణ్యవాదా శ్రుతౌ

ముఖ్యార్థా స్సగుణోక్తయ శ్శుభగుణప్రఖ్యాపనాద్బ్రహ్మణః
అద్వైతశ్రుతయో విశిష్టవిషయా నిష్కృష్టరూపాశ్రయా
భేదోక్తి స్తదిహాఖిలశ్రుతిహితం రామానుజీయం మతమ్॥

అ. శ్రుతౌ=వేదమందు, నిత్యం=ఎప్పటికిని, బ్రహ్మణః = బ్రహ్మయొక్క, నైర్గుణ్యవాదాః = నిర్గుణత్వమును గురించిన వాదములు, హేయగుణఅవధూనన పరాః=విడిచిపెట్టఁదగిన గుణములను ఎగురఁగొట్టుటయందు ఆసక్తిగలదియు ; సగుణోక్తయః=సగుణత్వమును గురించిన వచనములు, బ్రహ్మణః=బ్రహ్మయొక్క, శుభగుణప్రఖ్యాపనాత్ =సుగుణములను ప్రబలపఱచుటవలన, ముఖ్యార్థాః=ముఖ్యమైన అర్థముగలవియు; అద్వైతశ్రుతయః=అద్వైతవిషయవేదములు, విశిష్టవిషయాః=విశేషించినవిషయము గలవియు; భేదోక్తిః=భేదమును తెలుపుమాట, తత్ =అది, ఇహ=ఇక్కడ, నిష్కృష్టరూపాశ్రయా = నిష్కర్షచేయఁబడిన స్వరూపమునకు స్థానమైనదియు, అఖిలశ్రుతిహితం=సకలవేదవిహితమైనదియై, రామానుజీయం=ఈరామానుజసంబంధమైన, మతం=మతము.

తా. ఎప్పటికిని పరబ్రహ్మవిషయమై "అనాదిమధ్యాంతవిహీనమేకమజరం।వీతశోకమజరంబ్రహ్మ" ఇత్యాదిశ్రుతులచేత హేయగుణరహితముఅని నిర్గుణవాదములును, "సర్వతఃపాణిపాదంతత్ । సహస్రశీర్షాపురుషః" ఇత్యాది శ్రుతులచేత సద్గుణసహితము అని సగుణవాదములును, "తత్త్వమసి । అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుతులచేత జీవబ్రహ్మలయైక్యవాదములును, ఈశ్వరుఁడు సూక్ష్మచిదచిద్విశిష్టుఁడనియు, జీవుఁడు స్థూలచిదచిద్విశిష్టుఁడనియు అభేదవాదములును, ఈజీవేశ్వరులు ఇట్లుకాక అరూపులేఅని భేదవాదములునుండియు, ఈరామానుజీయమైన విశిష్టాద్వైతమతము విరుద్ధముకాక సకలశ్రుతివిహితమై యున్నయది.

సీ. శ్రుతిపథంబునను విశ్రుతవిధంబుగను ని
ర్గుణవాద మగు హేయ౯గుణపరంబు
సగుణవాదము బ్రహ్మ౯సుగుణబోధపరంబు
ముఖ్యార్థమనియు నభిఖ్య యగును

వివిధవిధాద్వైతకవిశ్రుతశ్రుతు లవ్వి
యవ్విశిష్టవిషయకమాస్థ నగును
భేదోక్తి యెవ్వానికిమీఁదఁ దన్నిష్కృష్ట
రూపాశ్రయంబు నికరూఢి నగును

తే. కనుక సకలశ్రుతిహితముగను నవికల
మతుల, రామానుజీయమే కమహిని మహిత
మతము నిఖిలార్యసమ్మత మగుట దీని
కన్న సన్నుతమత మే జగానఁ గాన.

దం. వేదమార్గములోను ప్రసిద్ధవిధముగాను బ్రహ్మ గుణరహితుఁడు అనువాదము హేయగుణములకు విషయుఁ డగును. సుగుణసహితుఁడు అనువాదము ప్రఖ్యాతితో ముఖ్యార్థకమై సద్గుణవిషయుఁడు అగును. జీవేశ్వరులకు అభేదమును జెప్పెడి అనేకవిధములైన అద్వైతమందలి ప్రసిద్ధములగు ఆవేదనులు పుట్టుదలతో (చిదచిద్విశిష్టజీవేశ్వరులుఅని) అవిశిష్టాద్వైతవిషయము లగును. వానివిషయమై అట్లు భేదముచెప్పుటపైఁగ విశేషణశూన్యముగా నిష్కర్షింపఁబడిన స్వరూపమునకు జీవేశ్వరులు ప్రసిద్ధిగా ఆశ్రయులగుదురు. కాఁబట్టి ఆ రామానుజీయమతమే సమస్తవేదవిహితముగాను, చెడిపోవని మతముగాను, భూలోకములో పూజ్యమైనదిగాను, సరిలేనిదిగాను, సకలసజ్జనులకు సమ్మతమైనదిగాను అగుటచేత దీనికంటె కొనియాడఁదగినమతమును ఏజగానను గానను.

కృశానుః:—

గ॥ అవితథ మేత దథాపి య ఇమే సంచరంత్యాచార్యపురుషసమాఖ్యాతా ఏతన్మతాభినివిష్టా శ్శిష్టాస్తేషా మేషారీతి ర్నరో చ తేవివేచకేభ్యః॥ 375

కృశానుఁడు:—

వ. అది యథార్థమెయయ్యిన, నితనిమతాభినివిష్టులు శిష్టులని కొం

ద యాచార్యపురుషు లనుపేర నూరఁదిరుగుచున్నారు. వారి యీరీతి యేవివేచకులకును అగోచరము కాకపోదు.

పశ్యతావత్ — చూడుమది:—

వృ॥ హత్వామార్గే ద్విజాదీ నఖిల మపి ధనం హంత? హృత్వాఽతిదృప్తాః। దుర్వృత్తా స్తస్కరాయే వనగిరినిలయా యేచనీచా ఇహాన్యే।కృత్వా చక్రాంక మేషాం ఝుటితి విదధతఃకించ మంత్రోపదేశం। తద్దత్తైరేవ విత్తైర్దధతి తనుమమీవంశ పారంపరీతః॥ 376

అ. వనగిరినిలయాః = అరణ్యపర్వతములు స్థానముగాఁగల, యేతస్కరాః= ఏదొంగలు, ద్విజాదీన్ =బ్రాహ్మణాదులను, మార్గే=త్రోవలో, హత్వా=కొట్టి, అఖిలమపిధనం=సకలధనమునున్,హృత్వా=అపహరించి,అతిదృప్తాః=మిక్కిలి గర్వించినవారై, దుర్వృత్తాః=చెడునడవడికలుగలవారో, యేఅన్యేచ=ఏఇతరులును, నీచాః=కులహీనులో, ఇహ=ఇక్కడ, హంత=అయ్యో! ఏషాం=వీరికి, ఝుటితి=త్వరగా, చక్రాంకం=చక్రాంకణమును, కృత్వా = చేసి, కించ=మఱియు, మంత్రోపదేశం=మంత్రోపదేశమును, విదధతః=చేయువారైన, అమీ= ఈరామానుజమతాచార్యపురుషులు, తద్దత్తైః=ఆదొంగలచేత నీయఁబడిన, విత్తైరేవ=ధనములచేత నే; తనుం=తమశరీరమును, వంశపారంపరీతః = వంశపారంపర్యముతో, దధతి=ధరించుచున్నారు.

తా. అడవులలోను కొండలలోను వసియించు దొంగకిరాతులు మార్గములో బ్రాహ్మణాదులనుకొట్టి వారివలన సకలధనము నపహరించి గర్వించి దుర్వర్తనులయినను, వారికి యోచింపక చక్రాంకనముచేసి మంత్ర ముపదేశించెడి యీ రామానుజమతస్థులయిన యాచార్యపురుషులు వారిచేనె యీయఁబడినధనములు దీసికొని తమపారంపర్యముగా శరీరపోషణను జరిపించుకొనుచున్నారు.

ఉ. దారులు కాచి దోఁచి పలుకోదారులఁజోరుల తెచ్చియిచ్చునా పాటులసొమ్ము లమెయి నరపారముతీయుచుఁబొట్టవ్రాసికో

వారికిఁ జక్రదానము నకొవారిక మన్త్రముపోపదేశముఁ
జేరిచి చేయుచుండ్రు మది కే చేడ్పడితోడ్పడి వీరువారునై.

కించ — మఱియు: —

వృ॥ జారాన్ చోరాన్ కిరాతాన్ జనపదమథనాన్ రాజపాశాన్
మహీశాన్। శిష్యాన్ కృత్వాతిమత్తా శ్శ్రుతినయవిదురా
రాశ్శ్రోత్రియై ర్బ్రహ్మనిష్ఠైః। సాకం నో భుంజతేఽమీ సకృ
దపివినతిం కుర్వతేఽగ్రేన తేషాం। సంకేతేనైవ సిద్ధం తదిద
మవిదుషాం శ్లాఘ్య మాచార్యపుంస్త్వమ్॥ 377

అ. అమీ=ఈఆచార్యపురుషులు, జారాన్=విటులను, చోరాన్=దొంగ
లను, కిరాతాన్=వేఁటవాండ్రను, జనపదమథనాన్=దేశనాశకులై, రాజపా
శాన్=రాజాధము లయిన, మహీశాన్ చ=రాజులనున్, శిష్యాన్=శిష్యులను
గా, కృత్వా=చేసి, అతిమత్తాః = మిక్కిలి గర్వించినవారై, శ్రుతినయవిధు
రాః=వేదనీతులకు దూరులై, బ్రహ్మనిష్ఠైః = బ్రహ్మజ్ఞాననిష్ఠులయిన, శ్రోత్రియై
స్సాకం=వైదికులతోకూడ, నోభుంజతే = భుజింపరు. తేషాం=వారియొక్క,
అగ్రే=ఎదుట, వినతిం=ప్రణామమును, సకృదపి=ఒకప్పుడైన,న కుర్వతే=చే
యరు. తత్-ఇదం=ఆయిది, అవిదుషాం = అపండితులయిన వీరియొక్క, శ్లా
ఘ్యం=శ్లాఘ్యనీయమయిన, ఆచార్యపుంస్త్వం=ఆచార్యపురుషత్వము, సంకే
తేనైవ=తమసంకేతముచేతనే, సిద్ధం=సిద్ధమయినది.

తా. ఈరామానుజీయమతస్థులైనయాచార్యపురుషులును ఆజారచోరకిరా
తులనున్ దేశధ్వంసకులైన అధమరాజులనున్ శిష్యులనుగాఁ జేసికొని, గర్వి
తులై వేదమార్గములను విడిచి, బ్రహ్మజ్ఞానులయిన వైదికులతోఁ గూడనైన భు
జింపరుగాని; నమస్కారమునైనఁ జేయరు. ఇట్టియాచార్యపురుషత్వము అజ్ఞు
లైనవీరిసంకేతసిద్ధమే కాని శ్లాఘ్యము కాదు.

తే. జారచోరకిరాతులకొజనపదఘ్న
రాజపాశమహీశులకొ రక్షింని శిష్యు

లనుగఁ జేకొంచు శ్రోత్రియులకు సమక్ష
మునను నొకసారియైనను కవినతిఁ జేసి
భోజనము చేయ రాచార్యకపూరుషు లఁట !

గ॥ అహహో! మహా నయ మభిజనవిద్యావృత్తిసంపన్నానామన్యే
షా మప్యవినర్తో న్యామోహః॥ 378

వ. ఆహా! ఈమహావ్యామోహము! అభిజనాభిరతియు, అనవద్య
విద్యయు సమృద్ధములుగాఁ గలవారికిసహిత మనివారితము.

వృ॥ ఆచారస్య దవీయసాం ధనతృషా మజ్ఞాతవేదాధ్వనాం
కామాతంకకలంకపంకిలహృదాం కేషాంచి దేషా మమీ
శుద్ధాచారజుషో జితేంద్రియతయా శ్రేష్ఠాస్స్వయంసూరయ
శ్శిష్యత్వం యదుశంతి తత్కలికలేస్సామ్రాజ్యమత్రోర్జితమ్॥

అ. స్వయం=తాము, శుద్ధాచారజుషః = శుద్ధమైనయాచారమును జెందిన వారై, జితేంద్రియతయా = జితేంద్రియులగుటచేత, శ్రేష్ఠాః=శ్రేష్ఠులయిన, అమీ=ఈ, సూరయః=పండితులు, ఆచారస్య=ఆచారమునకు, దవీయసాం= అతిదూరులై, ధనతృషాం = ద్రవ్యాశగలవారై, కామ-ఆతంక-కలంక-పంకిల-హృదాం = మన్మథునివలని - వికోధమ నెడు-మాలిన్యముచేత-కలుషమైన-మనస్సుగలవారై, అజ్ఞాత-వేద-అధ్వనాం = తెలిసికొనని-వేదములయొక్క-మార్గముగలవారైన, ఏషాం=ఈ, కేషాంచిత్ = కొందఱియొక్క, శిష్యత్వం యత్ =ఏశిష్యత్వమును, ఉశంతి=కోరుచున్నారో, తత్ =అది, అత్ర=ఇక్కడ, కలేః=కలిపురుషునియొక్క, ఊర్జితం=బలిష్ఠమైన, సామ్రాజ్యంకిల = ప్రభుత్వముకదా?

తా. సదాచారసంపన్నులై జితేంద్రియులైన జ్ఞానులు కూడ ఆచారదూరులయి అర్థాశగలిగి వేదవిహితమార్గము తెలియక మన్మథవికారములచేత కలుషితమనస్కులయిన ఈయాచార్యపురుషులకు శిష్యులగుట కలిపురుషునిప్రభుత్వమే కదా?

సీ. ఆచారసాంద్రులు కానగుజితేంద్రియులును
నఖిలాగమజ్ఞులు కానయినవార
లాచారదూరు లర్థాశావిహారులు
నవిదితాగమసారు లగుచు మఱియు
మారవికారము ల్మీరక మది తాలు
మారైనవారి కేమఱియు మఱియు
వారె తారైనను దారుగా శిష్యత్వ
మారఁగా సారికే కోరికొనుచు
ఆ. నడుగు మడుఁగు లొత్తి యడఁకువ గాన్పింతు
రగుట నిచట నకట! యకటవికట
మయిన కలికిఁ గలుగుననలఘుసామ్రాజ్యంబు
పగటు వెగటు నగుచుఁ బ్రకట మయ్యె.
అపిచ—మఱియు:—

వృ॥ స్వయంతరితు మక్షమః కి మపరా నసౌ తారయేత్
ఇతి స్వయ మచింతయ న్నగణయ న్ధనానాం వ్యయమ్
జడం గురు రితిభ్రమ న్ర్శయతి పుస్తకాడంబరై
ర్బహూపకరణాన్వితై ర్బహుల దేవతావిగ్రహైః॥ 380

అ. అసౌ=ఈయాచార్యపురుషుఁడు, స్వయం=తాను, తరితుం=ఉత్తరించుటకు, అక్షమః=అశక్తుఁడు, అపరాన్=ఇతరులను, తారయేత్కిం=తరింపఁజేయుచున్నాఁడా? ఇతి=అని, స్వయం=తాను, అచింతయన్=ఆలోచింపనివాఁడై, ధనానాంవ్యయం=ద్రవ్యములవెచ్చమున్, అగణయన్=ఎంచనివాఁడై, జడం=అజ్ఞుని, పుస్తకాడంబరైః=పుస్తకముల ఆటోపముచేతను, బహు-ఉపకరణ-అన్వితైః = అనేకములైన-సాధనములతో-కూడుకొన్న, బహులదేవతావిగ్రహైః=అనేకములైన దేవతాప్రతిమలచేతను, గురురితి = ఆచార్యుఁడని, భ్రమన్=భ్రమించువాఁడై, శ్రయతి=ఆశ్రయించుచున్నాఁడు.

తా. ఈయాచార్యపురుషుఁడు తాను తన్నుతరింపఁజేసికొనలేనివాఁడైనను, ఇతరులనెట్లు తరింపఁజేయువాఁడగును ? అని యితరుఁడు నెంచక, ధనవ్యయమునుం దలంపక, వేదాంతాదిగ్రంథామలయు, అర్ఘ్యపాద్యాది పాత్రాదులయు, రామకృష్ణాది దేవతావిగ్రహములయు నాడంబరములను జూచి మహాచార్యపురుషుఁడని భ్రమించుకొంచు నే ఆశ్రయించుచున్నాఁడు.

పృథ్వి. తరించుకొనలేఁడుత న్నెటులు నీ తాఁ దరించుం బరుల్
వరించుజనుఁడుల్ జడుల్ గురుని నీ వర్యుఁడంచుం జెడుల్
మఱిధనముపోవిడుల్ మది భ్రమల్ మఱిపుస్తకో
త్కరంబు బహువిగ్రహంబులు సతంబు వీక్షింపుచున్.

టి. వరించుల్=కోరును, ఉత్కరంబు=సమూహము, సతంబు=సంతతము.

అపిచ—మఱియు:—

వృ॥ అమలమతిషు లోకే జాగరూకే ష్వనేకే
ష్వపి నిజగురువంశోత్పత్తి మేవావలోక్య
విగతశుభచరిత్రం వేదశాస్త్రానభిజ్ఞం
కమపి గురు రితీమే కష్ట మారాధయంతి॥ 381

అ. ఇమే=వీరు, అమలమతిషు = నిర్మలచిత్తులు, అనేకేషు = అనేకులు, లోకే=లోకమందు, జాగరూకేష్వపి = జాగ్రత్తగలవారై యుండియు, నిజ-గురు-వంశ-ఉత్పత్తిం-ఏవ = తమవారి-గురువుల - వంశమందలి-జన్మమునే, అవలోక్య=చూచి, విగతశుభచరిత్రం=విడిచివేసిన మంచినడవడి కలవాఁడును, వేదశాస్త్రిఅనభిజ్ఞం=వేదశాస్త్రిములు తెలియనివాఁడునైన, కం-అపి=ఒకానొకని, గురుః-ఇతి=ఆచార్యుఁడు అని, ఆరాధయంతి=పూజించుచున్నారు. కష్టం=అయ్యో !

తా. లోకములో పరిశుద్ధబుద్ధులై అనేకులుండఁగా, తమపూర్వులకును ఆచార్యులైన వారివంశమందే జన్మించినవారు అని వేదశాస్త్రిములు దెలియక మంచి నడవడికయే లేక యుండునెవనినైన నొకని తమ కాచార్యునిఁగాఁ జేసి కొని పూజించుచున్నారే? ఏమి యన్యాయము?

తే. లోకమున మనగురువు లోకేశు లుండఁ
దనగురుపరంపరను జాతుకొని వనధీతు
నైనఁ జేకొని కొనియాడుఁ గాని యనయ
మితరు నొకనాఁడు నేని సత్కృతిన గొనఁడు.

గ॥ అపరమపి కలే రాకర్ణయ చమత్కారమ్॥ 382

వ. మఱియొకటి కలికిఁ గలుగుచమత్కారకారితను వినుము.

వృ॥ సమ్యక్శిష్యజనం పరీక్ష్య బహుభి స్సంవత్సరై రుత్సుకం
శుశ్రూషాభి రుపాదిశ న్ప్రముదితాః పూర్వే భువీతి శ్రుతమ్
ఆరాధ్యేష్టసమర్పణై రవినతా నాచార్యఏవాదరాత్
అబ్దై ర్భూరితమైః ప్రసహ్య లభతే శిష్యా న్క్రమేణాధునా॥

అ. పూర్వే=పూర్వికులు, భువి=ఈభూమియందు, ఉత్సుకం=ఉత్సాహప డుచున్న, శిష్యజనం=శిష్యసమూహమును, బహుభిస్సంవత్సరైః=అనేక సంవత్సరములతో, శుశ్రూషాభిః=శుశ్రూషలచేత, సమ్యక్=చక్కఁగా, పరీక్ష్య= పరీక్షించి, ప్రముదితాః=సంతోషించినవారై, ఉపాదిశన్ = ఉపదేశించిరి ; ఇతి=అని, శ్రుతం=వినఁబడినది. అధునా=ఇప్పుడు, ఆచార్యఏవ=ఆచార్యుఁడే, అవినతాన్=వినయమే లేనివారిని, భూరితమైః అబ్దైః=బహుసంవత్సరములతో, ఆదరాత్=ఆదరముతో, ఇష్టసమర్పణైః = ఇష్టపదార్థము లిచ్చుటలతో, ఆరాధ్య=తృప్తిపఱచి, క్రమేణ=క్రమక్రమముతో, ప్రసహ్య=బలాత్కరించి, శిష్యాన్=శిష్యులనఁగా; లభతే=పొందుచున్నాఁడు.

తా. ముందటి యాచార్యపురుషులు తమప్రయత్నములో కనిపెట్టుకొని చాలాకాలము శుశ్రూషలుచేయుచుండువారిని పరీక్షించి శిష్యులనుగాఁ జేసికొని యుపదేశము చేయుచుందురు అని వినుచున్నాముగాని, ఇప్పు డిప్పటి యాచార్యపురుషులు వినయమైనఁ గనుపఱచనివారిని చాలఁగాలము ఆదరము కనఁబఱచి, వారికిష్టమైన భోజనపదార్థము లిచ్చియిచ్చి తృప్తిపఱచి బలాత్కరముగ శిష్యులనుగాఁ జేసికొనుచున్నారు.

చ. ఛలమున నేండ్లకొద్దిఁ గని కై చర్యలఁ దత్పరిచర్యలన్ గురుల్
తొలుతను శిష్యకోటికిఁ బృథుప్రథతో నుపదేష్ట లౌదు, రిం
దుల నిపుడిప్పు డీగురులు కైదుప్పటి నిప్పటియప్పడంబు నేఁ
డులకొలఁదిచ్చి నుచ్చికలకైదూష్యులశిష్యులఁ జేసికొంద్రుసూ ?

టి. ఛలమునన్ = వ్యాజముతో, చర్యలన్ = ప్రచారములతో, పృథుప్రథతో = అతిప్రశస్తితో.

విశ్వావసుః—విశ్వావసువు:—

గ॥ మందమనీష! మహాపురుషా నేవం మాదుదుషః॥ 384

వ. ఓమందబుద్ధీ! మహాపురుషుల నిటుల దూషింపకుము?

వృ॥ భవ జలధి నిమజ్జ త్సజ్జనోజ్జీవనార్థం
జగతి మహతి వంశే జాతవంతో మహాంతః
ప్రపదన ధన కృష్టాః పంచసంస్కారదానాత్
కతి న కృతిన ఏతే జ్ఞానహీనాన్ పునంతి॥ 385

అ. భవజలధి-నిమజ్జత్-సజ్జన-ఉజ్జీవనార్థం = సంసారసముద్రమందు-మునుఁగుచున్నవారిని సజ్జనులనుగా ఉజ్జీవింపఁజేయుటకై, జగతి=లోకములో, మహతివంశే=గొప్పకులమందు, జాతవంతః=పుట్టినవారై, మహాంతః = గొప్పవారై, కృతినః=సుకృతాత్ములైన, ఏతే=ఈయాచార్యపురుషులు, ప్రపదన-ధన-కృష్టాః=ప్రపత్తియనెడి-ధనముచేత-ఆకర్షింపఁబడినవారై, కతి = ఎంద ఱను, జ్ఞానహీనాన్=జ్ఞానహీనులైనవారిని, పంచసంస్కారదానాత్ = పంచసంస్కారములు కలుగనిచ్చుటచేత, నపునంతి=పావనపఱుపరు?

తా. సంసారములో పడి చెడువారిని సత్పురుషులనుగా ఉత్తరింపఁజేయుటకై ఉత్తమవంశోద్భవులైన యీయాచార్యపురుషులు వారివారి శరణాగతిని తమవాత్సల్యముతో అంగీకరించి వారిని పంచసంస్కారములచేత పవిత్రపఱచుచున్నారు.(తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగశ్చ పంచమః॥అనిపంచసంస్కారములు)(౩౭౦ 354 [illegible] శ్లోకము [illegible]కము.)

సీ. సంసృతిసంద్రంబు సంతరింపఁగ లేక
క్రిందుమీఁదుగఁ బడి యందె ద్రుందు
నజ్జనజనమును నుజ్జీవనము చేయ
నిజ్జగంబున డంభ ముజ్జగించి
యభిజనంబును గల్గి యనుభావమును గల్గి
ధన్యాత్ము లగుచు సన్మాన్యు లగుచు
ననివార్యు లైనట్టి యాచార్యులే యిట్టి
పుట్టంధువులయట్టు పుణ్యహీను

ఆ. లౌచు జ్ఞానహీను లైనవారలఁ గొని
వారిచేయుశరణ భూరిధన ము
టంచు నెంచుకొంచుఁ బంచసంస్కారంబుఁ
జేసి వారి శుచులఁ జేయుచుంద్రు.

టి. ద్రుందు=నశించునట్టి, అజ్జనజనము = అట్టి జనసమూహమును, ఉజ్జగించి=విడిచి, అభిజనంబును=ఆభిజాత్యము, అనుభావము=ప్రభావము, అనివార్యులు=వారింపశక్యముకానివారు, పుట్టంధువులు=పుట్టుగ్రుడ్డివారు.

కించ—మఱియు:—

వృ॥ ఆచార్యాః పురుషా మహత్తరకులే ష్వబ్జాక్షదాస్యోజ్జ్వలా
నావ స్సంసృతి వారిధేః పరమమీ నావాతరిష్యన్యది
అప్రాప్తాచ్యుతదాస్యవృత్తయ ఇహావిజ్ఞాతమంత్రోత్తమా
స్సర్వే తర్హి కలౌ వత ప్తశనవ్రొ హంతాపతిష్య న్నధః॥386

అ. సంసృతివారిధేః=సంసారసముద్రమునకు, నావః = ఓడలవంటివారై, పరం=మిక్కిలి, అబ్జాక్ష-దాస్య-ఉజ్జ్వలాః = ఆవిష్ణువుయొక్క-దాసకృత్యములచేత-ప్రకాశించువారైన, అమీ=ఈ, ఆచార్యాః = ఆచార్యపురుషులు, మహత్తరకులేషు=మిక్కిలి గొప్పవంశములందు, న అవతరిష్యన్ యది=అవతరిం

పకపోయిరయిరేని, ఇహ=ఈలోకమందు, కలౌ=ఈకలియుగములో, సర్వే=అందఱును, అప్రాప్తాచ్యుతదాస్యవృత్తయః=పొందఁబడని విష్ణువిషయకదాస్యమే వృత్తిగాఁగలవారుగాను, అవిజ్ఞాతమంత్రోత్తమాః=తెలియఁబడని ఉత్తమమంత్రము కలవారుగాను, అతప్తతనవశ్చ=పంచసంస్కారములేని శరీరము కలవారుగాను అగుచు, అధః=అధోలోకమున, అపతిష్యన్ = పడఁగలరు, హంత=అయ్యో !

తా. సంసారసముద్రము దాఁటి, విష్ణుపరిచర్యాపరతంత్రులైన యీయాచార్యపురుషులు మహోత్తమవంశోద్భవులు కానియెడల, ఈకలియుగములో స్వామికైంకర్యములేక, మంత్రానుసంధానములేక, పంచసంస్కారమైన లేక అధోలోకప్రాప్తులగుదురు.

శా. వీరాచార్యులు నుత్తమాన్వయులు నశ్రీవిష్ణ్వాజ్ఞ(?)లద్దాస్యమే
ధారాసారముగాఁ గలారు మఱియుం శ్రీ దారే భవాంభోధికిం
పారంబారము చేర్చువారు, మహి నాశ్రీహా! వీరె లేరేన్నరుల్
గారే? నారకు లీకలిం గలితచక్రప్రాంకణంబుల్ మఱి
నారం బౌమనురాజముల్ హరిసమర్చాతేజముల్ గానకే.

టి. నారకులు=నరకలోకసంబంధము కలవారు, కలిత చక్రప్రాంకణంబు=కూడుకొన్న చక్రాంకనము, మనురాజము=మంత్రరాజము, సమర్చాతేజము=అర్చనప్రభావము. (పంచపాదిశార్దూలము)

వృ॥ తాపాదిభి స్సపాపాం జనతాం పునతాం మహాత్మనా మేషామ్
దోష శ్చే దేవ సమో దుష్టాః పునతోపి గంగాపూరస్య॥387

అ. సపాపాం=పాపసహితమైన, జనతాం=జనసమూహమును, తాపాధిభిః=తాపాది పంచసంస్కారములచేత, పునతాం=పవిత్రపఱచుచున్న, మహాత్మనాం=మహాత్ములగు, ఏషాం=ఈయాచార్యపురుషులకు, దోషశ్చేత్ =దోషమయ్యేనేని, ఏషః=ఇది, దుష్టాః అపి=దోషయుక్తులనుగూడ, పునతః=పావనము చేయుచున్న, గంగాపూరస్య=గంగానదీప్రవాహమునకు, సమః=సాటి.

తా. పాపకృత్యములే ప్రధానమైయుండు కిరాతతస్కరులకుఁ గూడ, పంచసంస్కారము చేయు నీయాచార్యపురుషులదోషము ఎట్టిదోషులనైన నెంచక పావనముచేయు గంగాప్రవాహముదోషమువంటిది.

ఉ. తాపముఖంబు సెంది పరితాపము వొంది సపాపమూ ప్రజ
దాపముఖంబెపూన్చి పరితాపముమాన్చి యపాపమూసటుల్
బాపురె! చేయు నీగురులకాయనిదోషము గాంగమాప మా
పాపు లపాపు లౌనటుల కాయక చేసెడిదోషమే యగున్.

టి. గాంగముఆపము=గంగాసంబంధియైన జలసమూహము, తాపముఖంబు=తాపత్రయాదిని-తాపాదిపంచసంస్కారమును.

గ॥ ఇదం చావబోద్ధవ్యం॥ 388

వ. ఇదియుఁ దెలియవలయునదియ.

వృ॥ సద్వంశప్రభవ శ్చరిత్రరహితో ప్యాదృత్య ఏవోత్తమై
స్సాధ్వాచారయుతోపి దుష్కులభవ స్సభ్యేషు నాభ్యర్చితః
శాలగ్రామ మకృత్రిమం పటుమతి స్సల్లక్షణాయుక్తమ
ప్యాదత్తేనతు లక్షణాఢ్యమపి తంచక్రోజ్జ్వలం కృత్రిమమ్॥

అ. చరిత్రరహితోపి = మంచినడవడి లేనివాఁడయ్యును, సద్వంశప్రభవః= మంచివంశమందు పుట్టినవాఁడు, ఉత్తమైః = ఉత్తములచేత, ఆదృత్య ఏవ= ఆదరింపఁదగినవాఁడే ; సాధ్వాచారయుతోపి=మంచినడవడితోఁ గూడినవాఁడయ్యును, దుష్కులభవః=చెడువంశమందు పుట్టినవాఁడు, సభ్యేషు=సభ్యులలో, న అభ్యర్చితః=పూజింపఁదగినవాఁడు కాఁడు. సల్లక్షణ-అయుక్తమపి=మంచిలక్షణములతోఁ గూడనిదియైనను, అకృత్రిమం = కల్పింపఁబడనిదియైన, శాలగ్రామం=సాలగ్రామశిలను, పటుమతిః=సమర్థమైనబుద్ధిగలవాఁడు, ఆదత్తే=తీసికొనుచున్నాఁడు. లక్షణాఢ్యం = మంచిలక్షణములతోఁ గూడినదై, చక్రోజ్జ్వలమపి = చక్రముతో ప్రకాశించునదియైనను, కృత్రిమంతు= కల్పింపఁబడినదియైన సాలగ్రామమునైన, నఆదత్తే=తీసికొనఁడు.

తా. మంచినడవడిక లేకున్నను, మంచివంశమందుఁ బుట్టినవాఁడు ఉత్తములకు ఆదరింపఁదగినవాఁడే. మంచినడవడిక కలవాఁడైనను నీచవంశమందుఁ బుట్టినవాఁడు ఆదరింపఁ దగినవాఁడుకాఁడు. మంచిగురుతులు లేకున్నను కల్పింపని సాలగ్రామమును గుణాగుణములను కనిపెట్టునట్టి బుద్ధిశాలి తీసికొనును, అట్టిగురుతులు కలిగినను, చక్రము గురుతు గలుగ కల్పింపఁబడిన సాలగ్రామమును తీసికొనఁడు.

ఉ. వంశము శ్రేష్ఠమైయశుభవర్తనుఁడయ్యు సమాదృతుండగుఁదు
ర్వంశముగల్గువాఁడుశుభవర్తనుఁడయ్యుసమాదృతుండగాయా
ప్రాంశు సుదర్శనాఢ్య మగునద్భుతసాలశిలా విఖండ మే
యంశమునందుఁగృత్రిమముగానాదరణీయమెయన్యమన్యమే?

టీ. అప్రాంశుసుదర్శనాఢ్యము=ఆగొప్పసుదర్శనరేఖతోఁగూడినది, సాలశిలావిఖండము = సాలగ్రామశిలాఖండము, ఏయంశమునందున్ = ఏభాగమునందును, అన్యము=అట్లు కల్పితముకానిది, అన్యమే=ఆదరణీయమే.

గ॥ సవినయ మంజలిం బద్ధ్వా॥ 390

వ. వినయంబున విరచితాంజలి యై.

వృ॥ శిష్యార్పితేన శుచినా ద్రవిణేన తుష్టా
శ్శిష్టా ముకుందశరణాగతిధర్మనిష్ఠాః
సత్సంప్రదాయనియమప్రయతా స్సదా యే
తేభ్యో నమాంసి కరవై వరవైష్ణవేభ్యః॥ 391

అ. శుచినా=నిర్మలమై, శిష్యార్పితేన=శిష్యులచే నీయఁబడిన, ద్రవిణేన=ధనముచేత, తుష్టాః=సంతోషించినవారై, ముకుంద-శరణాగతిధర్మ-నిష్ఠాః=విష్ణుదేవునివిషయమై ప్రపత్తిధర్మమునందు ఆసక్తిగలవారైన, సదా=ఎప్పుడును, సత్సంప్రదాయ-నియమ-ప్రయతాః=సద్విషయసంప్రదాయమందలి విధులయందు ప్రయత్నపడువారు,యేశిష్టాః=ఏపెద్దలో? తేభ్యః=అ,వరవైష్ణవేభ్యః=వైష్ణవశ్రేష్ఠులకై, నమాంసి = నమస్కారములను, కరవై = చేయుచున్నాను.

తా. న్యాయ్యముగా శిష్యు లిచ్చినద్రవ్యమునకు సంతోషించి స్వామివిష యమై ప్రపత్తినిష్ఠులై సత్సంప్రదాయనియమములయందు ప్రయత్నపడుచుం డు శ్రీవైష్ణవులకు ప్రణామములు చేయుచున్నాఁడను.

క. పరిశుద్ధులు శిష్యు లొసఁగి
పరితుష్టులు శిష్టులు హరిశ్రీపదశరణాయుల్
పరమహితసంప్రదాయు, లె
వరో? యవ్వరవైష్ణవులకె శ్రీ వందనశతముల్.

టి. హరిపద-శరణ-అయులు = శ్రీహరిపాదములే-రక్షణమనెడు-శుభావహ మైనవిధిగాఁ గలవారు, సంప్రదాయము=సదాచారము.

గ॥ ఇతి విమాన మన్యతః ప్రస్థాపయన్నగ్రతో దృష్ట్వా॥ 392

వ. అని విమానమును మఱియొక్కప్రక్క కానయించుకొంచు నెదురను గనుఁగొంచు.

## తిరువల్లిక్కేణి పార్థసారథి వర్ణనము.

తిరువల్లిక్కేణి- ఇది పాండవకౌరవయుద్ధములో పార్థునకు=అర్జునునకు సార థ్యము చేసి పార్థసారథి అనుపేరశ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవితోను ప్రద్యుమ్నా నిరుద్ధసాత్యకిబలరాములతోను ఆనందవిమానమునందు వేదవ్యాసమహాముని చే ప్రతిష్ఠింపఁబడి, అర్జునునకును తొండమాన్ చక్రవర్తికిని సుమతిరాజునకును ప్రత్యక్షమై అత్ర్యాదిమహర్షులచే అర్చింపఁబడుచు, తెళ్లియసింగరు తేవప్పెరు మాళ్లు మన్నాథులు శ్రీరాములు అనువారిసన్నిధులతోను గూడి, తిరుమళ్లిశై తిరుమంగై పేయాళ్వారులమంగళాశాసనములు కలిగి, ఇంద్రాదితీర్థము లైదిం టినడుమ కైరవిణీసరస్సు=అల్లి కేణి తీరమున సేవసాయించు దక్షిణబృందా రణ్య మనఁబడియెడి క్షేత్రము కలది.

వృ॥ఏషా కైరవిణీ విశల్యకరణీ దోషాశుగార్తాత్మనాం
ఏతద్రోధసి పార్థసారథిరితి ఖ్యాతస్సమింధే హరిః

యత్పాదాంబుజచుంబినాం సురపతేః కోటీరగారుత్మత
స్తోమానాం తులసీదలప్రకరతో నోవేద భేదం జనః॥ 393

అ. యత్ పాదాంబుజచుంబినాం = ఏపార్థసారథియొక్క పాదపద్మము లను అంటుచున్నవైన, సురపతేః= దేవేంద్రునియొక్క, కోటీరగారుత్మతస్తోమానాం = కిరీటమందలి గరుడపచ్చల సమూహములకు, తులసీదళప్రకరతః= తులసీపత్రముల సమూహముతో, భేదం= భేదమును, జనః=జనుఁడు, నోవేద = తెలిసికొనఁడో? సా=అట్టి, ఏషా=ఈ, కైరవిణీ=అల్లికేణి, దోష-ఆశుగ-ఆర్త-ఆత్మనాం = సకలదోషములనెడి-బాణములచేత - బాధింపఁబడిన - మన స్సుగలవారికి, విశల్యకరణీ=బాణపుముక్కలను తీయుమూలికవంటిది; ఏతత్-రోధసి=ఈ-యల్లిక్కేణిగట్టున, పార్థసారథిః ఇతి=పార్థసారథియనెడి,హరిః= విష్ణువు, ఖ్యాతః=ప్రఖ్యాతిగలవాఁడై, సమింధే=ప్రకాశించుచున్నయతఁడు.

తా. ఎవని పాదాంబుజములయందు ప్రణామముఁ జేయుదేవేంద్రుని కిరీట ములోని గరుడపచ్చలు ఆపార్థసారథి పాదములందలి తులసీదళము లని సేవిం చుజను లెంచుకొందురో? అట్టి ఈ అల్లిక్కేణితీరమందు పార్థసారథి అని ప్ర సిద్ధమైనవిష్ణువు ప్రకాశించుచున్నతఁడు. కనుక ఈతిరువల్లిక్కేణి బాణముల ములుకులు తీసివేయు మూలికావిశేషమువలె సకలదోషములను పరిహరించు నదియైనది.

ఉ. (హీరమణీఘృణిప్రచురహేమతటీకటిఁ) బాపరోపధూ
త్కారవిశల్యసత్కరణిఁ గాంచితె? కైరవిణిన్ సురేంద్రకో
టీరహరిన్మణిద్యుతి యిదే తులసీదలపుంజరంజితం
బౌ రహి నంచు నెంచుదురు పార్థునిసారథిపాదపద్మమున్.

దం. (రవలకాంతులతో వ్యాపించియున్న బంగారుగట్లు నడుముగాఁ గల దియు) పాపములనెడి బాణాల నెగరఁగొట్టుటయందు విశల్యకరణి యనెడి యోషధీవిశేషమైనదియునైన యీకైరవిణియనెడితిరువల్లిక్కేణియందు పార్థ సారథియొక్క పాదపద్మము ఇదో! దేవేంద్రుని కిరీటమందలి పచ్చలకాంతి

తులసీదళసమూహమువలె మనోహరమైనది అగును అనుచు కోరికతో సేవించు జనము ఎంచుచుండును చూచితివా? (అలం=ఉత్ప్రేక్షలు).

వృ॥ అత్ర వసంతి స్సంత శ్చిరంత నోక్త్యంతచింత నాశ్రాంతాః
ఆతన్వంతం సుచరిత మాతన్వంతో విభాంతి శాంతధనాః॥394

అ. అత్ర=ఇక్కడ, వసంతః = వాసముచేయువారైన, సంతః=సత్పురుషులు, చిరంతనోక్త్యంత-చింతనా-అశ్రాంతాః = అనాదివాగంతములయిన వేదాంతములయొక్క-చింతనమందు-బడలికపడనివారై, శాంతధనాః=శాంతరసమే ధనముగాగలవారై, ఆతన్వంతం=శరీరాంతమువఱకు, సుచరితం=సత్ప్రవర్తనమును, ఆతన్వంతః=జరుపువారునై, విభాంతి=ప్రకాశించుచున్నారు.

తా. ఈతిరుపల్లిక్కేణియందు వసియించువారు వేదాంతములు పరిశ్రమచేయుటయందు శ్రమనుదెలియనివారై. పరమశాంతులై తమయావజ్జీవము సత్ప్రవర్తనములోనే యుండువారు.

క. ఇచట వసించెడుసజ్జన
నిచయము నిగమాంతచింత నిరతిన్ నిరతం
బుచితక్రియ బాల్యము సుత
గచియించును దనువుదనుక రమ్యశమం బై.

టి. నిచయము=సమూహము, నిగమాంత-చింతన్ = వేదాంత-చింతనమందు, నిరతిన్=ఆసక్తితో, ఉచితక్రియన్ = ఉచితముగా, రమ్యశమంబై=మనోహరమైన శాంతిగుణముగలదై.

కృశానుః—కృశానువు:—

గ॥ అస్తు తథాపి పరికలిత గుణప్రహాణహూణ ప్రాయహేయ జన నిబిడ నగరవిశేషసన్నికర్ష ఏవాత్ర మహాన్ దోషః, దుర్లభాః ఖలు హూణేభ్యః కుత్సితతమా లోకే॥ 395

అ. అస్తు=అవుఁగాక, తథాపి = అట్లయినను, పరికలిత-గుణ-ప్రహాణ-హూణప్రాయ-హేయజన-నిబిడ-నగరవిశేష-సన్నికర్ష ఏవ-సమీపమునున్న-సు.

గుణములయొక్క-విసర్జనముగల-శ్వేతజనులతో సమానులై-త్యాజ్యులైన జనుల చేత-పట్టమైన-పట్టణవిశేషమునకు-దాపుగానుంటయే, అత్ర=ఇక్కడ, మహాన్ దోషః=గొప్పదోషము; లోకే=ఈలోకమందు, హూణేభ్యః=ఈశ్వేతజనుల కంటె, కుత్సితతమాః=కేవలకుత్సితులు, దుర్లభాః ఖలు=దొరకనివారు కారు కదా?

వ. ఉండనీ. ఉండినను, సుగుణగణము విడిచి విరివిగ నిరవుకొను నీములుచజనులు వెలుచగ నున్న చెన్నపట్టణము సన్నికర్షమే యీాక్రైరవిణీక్షేత్రము దోషప్రకర్షము. ఈజగత్సంకరమునఁ గుత్సితతము లీహూణప్రాణులకంటె వే ఱేవారును దొరకు టరిదికద ?

వృ॥ హూణాః కరుణాహీనా స్తృణవద్బ్రాహ్మణగణం నగణయంతి
తేషాం దోషాః పారేవాచాం యేనాచరంతి శౌచమపి॥

అ. కరుణాహీనాః=దయాశూన్యులైన, హూణాః=ఈహూణులు, బ్రాహ్మణగణం = బ్రాహ్మణసమూహమును, తృణవత్ = గడ్డిపోచనువలె, నగణయంతి = నిరాకరించుచున్నారు; యే=ఏహూణులు, శౌచమపి = శౌచమును గూడ, న-ఆచరంతి=చేయరో? తేషాం = అట్టివారియొక్క, దోషాః=దోషములు, వాచాంపారే=చెప్పమించియుండునవి.

తా. ఈహూణులు తాము శౌచమునైనఁ జేయరుగాని, కనికర మనునదే లేక, ఆచారవంతులైన బ్రాహ్మణులనుగూడ లక్ష్యముచేయరు; వీరిదోషములు చెప్ప నలవికానివి.

తే. హీనకరుణు లీధరణి నీహూణజనులు
తృణముగానైన బ్రాహ్మణగణము గొనరు
చెప్పఁదీఱునె వీరలకొప్పు మనకు
నాచరింపరు పెంపఱి శౌచ మయిన.

గ॥ పునస్సని ర్వేదం విధి ముద్దిశ్య॥ 397

వ. మఱలు ని ర్వేదంబున దైవంబు నుద్దేశించి.

వృ॥ శౌచత్యాగిషు హూణకాదిషు ధనం, శిష్టేషుచ క్లిష్టతాం,
దుర్మేధస్సు ధరాధిపత్య మతులం, దక్షేషు భిక్షాటనమ్,
లావణ్యం లలనాసుదుష్కులభవా, స్వగ్ర్యాసునీరూపతాం,
కష్టం సృష్టవతా త్వయా హతవిధే కిన్నామలబ్ధం ఫలమ్॥

అ. శౌచత్యాగిషు=శౌచమునే వదలినట్టి, హూణకాదిషు = హూణతురుష్కాదులందు, ధనం=ధనమును; శిష్టేషు=సదాచారసంపన్నులందు, క్లిష్టతాం చ=దారిద్ర్యమును; దుర్మేధస్సు=దుర్బుద్ధిగలవారియందు, అతులం=సాటిలేని, ధరాధిపత్యం = రాజఱికమును; దక్షేషు = బుద్ధిసామర్థ్యము కలవారియందు, భిక్షాఅటనం=బిచ్చమునకై తిరుగుటయు; దుష్కులభవాసు= హీనకులజలైన, లలనాసు=స్త్రీలయందు, లావణ్యం=సౌందర్యమును; అగ్ర్యాసు = అగ్రకులజలైన స్త్రీలయందు, నీరూపతాంచ=రూపహీనతయును; కష్టం=అయ్యో! హతవిధే=ఓపాడుబ్రహ్మా! సృష్టవతా = ఇట్లు సృష్టించుచున్న, త్వయా=నీచేత, కింనామ=ఏమి? ఫలం=ఫలము, లబ్ధం=లభింపఁబడినది?

తా. శౌచమేచేయని యీశ్వేతముఖాదులను సంపన్నులనుగాను, సదాచారసంపన్నులైనవారిని దరిద్రులనుగాను, బుద్ధిసమర్థులు కానివారిని రాజ్యాధిపతులుగాను, బుద్ధిసమర్థులైనవారిని బిచ్చకులనుగాను, దుష్కులజలైన స్త్రీలను సుందరులనుగాను, సత్కులజలైన స్త్రీలను కురూపిణులనుగాను సృజించితివే? ఓబ్రహ్మా! నీసృష్టి కిట్టిదేనా ప్రయోజనము?

సీ. ఆచారహీనుల కా హూణకాదుల
కర్థ మిచ్చా విహారార్థ మిచ్చి
యాచారపరులకు నా భూమిసురులకుఁ
దఱి కనర్థకము పేదఱిక మిచ్చి
మందబుద్ధులకు న మందగర్వులకును
జయము రాజిలఁగ రాజఱిక మిచ్చి
బుద్ధిమంతులకుఁ బ్రబుద్ధమంత్రులకును

దిరముగాఁ దిరియఁగాఁ దిరిప మిచ్చి
తే. వనితలకు దుష్కులలకు లావణ్య మిచ్చి
రూఢిగను గులజలకుఁ గురూప మిచ్చి
యవుర ! దేవర ! ఫలమేమి జవురుకొంటి
విట్టి నీసృష్టి నొకప్ట మిష్టమయ్యె?

విశ్వావసుః—విశ్వావసువు:—

గ॥ అవేహి? త్వ మేతేష్వపి గుణగ్రాహిత్వమ్॥ 399
వ. కృశానూ! నీ వీహూణుల యెడలను గుణగ్రాహితను గనుమ.
వృ॥ ప్రసహ్య నహరంత్యమీ పరధనౌఘ మన్యాయతో
వదంతి నమృషావచో, విరచయంతి వస్త్వద్భుతమ్
యథావిధి కృతాగసాం విదధతి స్వయం దండనమ్
గుణా నవగుణాకరేష్వపి గృహాణ హూణేష్వమూన్॥ 400

అ. అమీ=ఈహూణులు, పరధన-ఓఘం = పరులసొత్తుల-సమూహమును, అన్యాయతః=అన్యాయముగ, ప్రసహ్య=బలాత్కరించి, నహరంతి=హరించరు; మృషావచః = అబద్ధపుమాటను, నవదంతి=మాటాడరు ; అద్భుతం = ఆశ్చర్యమైన, వస్తు=గ్లాసుపాత్రాదిపదార్థమును, విరచయంతి = చేయుచున్నారు ; కృత-ఆగసాం=చేయఁబడిన-అపరాధము కలవారికి, యథావిధి=విధిప్రకారము, దండనం=శిక్షను, స్వయం=తాముగా, విదధతి = చేయుచున్నారు ; అవగుణ+ఆకరేషు = దుర్గుణములకు+స్థానమైన, హూణేషు = ఈశ్వేతముఖులందు, అమూన్ గుణాన్ అపి=ఈగుణములనున్, గృహాణ=గ్రహింపుమా.

తా. ఈహూణులు పరులసొత్తులు కోరక, అబద్ధములాడక, చిత్రములైన గ్లాసులు సులోచనములు మొదలైనవి చేసికొనుచు, తమప్రభువులవలన తప్పుచేసినవారికి తగినశిక్షను జేయించుకొంచునుండువారు. ఇట్టివీరియందు ఏదుర్గుణములుండినను, ఇట్టియసాధారణగుణములను మనము గ్రహింపవలెను.

పృథ్వి. బలాత్కృతి హరింపరా బరులసొమ్ము లన్యాయులై

తలంపరు మృషోక్తు, లంతలనకే తార్తు రత్యద్భుతాల్,
నలంతు లయినన్ విఘు ల్వదిలికే నర్తిల ర్నిచ్చ, లి
ట్లలంతిగుణము ల్గలా రయినకే నద్భుతా లీగుణాల్.

టి. తార్తురు=కలిగింతురు, వలంతులు=సమర్థులు, అలంతి=అల్పులైన.

గ॥ ఇతి విమాన మితః ప్రతీచ్యాం దిశి యోజనపంచక మతిక్రా
మన్ పురతోదృష్ట్వా సామోదం॥ 401

వ. అని విమాన మక్కడకుఁ బశ్చిమదిక్కునకై యామడ
లైదిటిం గడపి యెదుటం గని యామోదమునుం గొని.

## కాంచీపట్టణవర్ణనము.

(ఈకాంచీపట్టణము=క+అంచీ—బ్రహ్మ-పూజించుచుండినది అని ప్రఖ్యాతి పడిన దివ్యదేశము. ఇది బ్రహ్మ విష్ణువును ప్రత్యక్షముచేసికొనుటకై యజ్ఞము చేయుచు ఆలస్యమైనందున సరస్వతి ఆయజ్ఞమును చెఱుచుటకై ప్రవహించుచు వచ్చినవేగవతీనదితోను, గోపుర ముఖమండప ప్రాకారాదులతోను, ఉత్తరవేదియొద్ద చరి దరులతోడి కరిగిరి యందలి కరివరద రాజులపుణ్యకోటి విమానముతోను, వారిదేవియైన పెరుందేవి తాయార్ల కల్యాణకోటివిమానముతోను, మఱి పదునెనిమిది విష్ణ్వాలయములతోను, ఇదియే కాక, పంచలింగములలో పృథివీలింగమై యేకామ్రనాథుఁడనెడి పేరితోడి పరమశివునాలయముతోను, ఆయనదేవియైన కామాక్షిదేవియాలయముతోను, మఱి నూటనాలుగుశివాలయములతోను అతిరమణీయమై "అయోధ్యా మధురా మాయా కాశీ కాంచీ అవంతికా పురీ ద్వారవతీచైవ సప్తైతా మోక్షదాయికాః" అని మోక్షప్రదాయకపట్టణము లేడింటిలో నొకటియై సత్యవ్రతక్షేత్రము, వరాహక్షేత్రము,నృసింహక్షేత్రము అనియు ప్రఖ్యాతమైనయది.)

వృ॥ ఇయం కాంచీ, కాంచీ కరిశిఖరిణః, కాపినగరీ
గరీయస్యాం యస్యాం విహరణజుషాం పక్షలఘుశామ్

ముఖం దర్శందర్శం రజనికర మాదర్శ మమల
స్వరూపం కే పంకేరుహమపి ననిందంతి రసికాః. 402

అ. గరీయస్యాం=గొప్పదైన, యస్యాం=ఏపట్టణమందు, విహారణజుషాం=విహారముకలిగియున్న, పక్ష్మలదృశాం= స్త్రీలయొక్క, ముఖం= మొగమును, దర్శందర్శం=చూచిచూచి, తస్యాం=ఆపట్టణమందు, కే రసికాః=ఏరసికులు, అమలస్వరూపం=నిర్మలస్వరూపము కల, రజనికరం=చంద్రుని, ఆదర్శం=అద్దమును, పంకేరుహమపి=తామరనున్, న నిందంతి= నిందింపరు. కరిశిఖరిణః=హస్తగిరికి, కాంచీ=ఒడ్డాణమువంటిదైన, కాంచీ=కంచి యనెడి, కాపి=ఒకానొకమనోజ్ఞమైన, నగరీ=పట్టణము, ఇయం=ఇది.

తా. ఈకంచి కరిశైలమునను మొలనూలువలె చుట్టును గలిగియున్నది. ఇందలి స్త్రీల మొగమును జూచి, రసికులందఱును చంద్రునిఁ గాని, అద్దమును గాని, పద్మమునుగాని ఆమొగముకంటె అందముకానివి యని, వాని నేమియం దము అని నిందించుచుందురు.

శా. ఈకాంచిం గరిశైలకాంచి విహరత్కృష్ణాహివేణ్యాస్యముల్
జోకం గాంచి మనోహరంబులనుచుఁ జోషిల్లుఫుల్లాబ్జముఁ
గోకారిన్ సకళంకునిన్ గఠిన మాశ్రీ(?)మ్మించుటద్దమ్మునున్
మూకే కాదు,కనుంగొనన్ రసికతన్ మాన్యాళికిన్ గాదుగా.

టి. విహరత్-కృష్ణాహివేణీ-ఆస్యముల్=విహరించుచుండెడి (కృష్ణసర్పమువలె జడలుగల=) స్త్రీల మొగములను, జోకన్=సంతోషముతో.

కించ.—మఱియు:—

వృ॥సుమనోజనవాదరణస్థానం స్థానే సద్రూపశోభినీ, సేయమ్
సురతాభ్యుదయవిధాత్రీ శుభ కాంచీ సాధు రంజయతి చేతః॥

అ. సు-మనోజ - నవ-ఆదరణ - స్థానం = మన్మథుని-క్రొత్తక్రొత్త - ఆదరమునకు- మంచిస్థానమై— సుమనోజన - వాద-రణ-స్థానం = పండితజనుల - శాస్త్రచర్చయనెడి - యుద్ధమునకు - స్థానమై, స్థానే = తగినదే; సత్ - ద్రు-

ఉపశోభినీ = మంచివైన-వృక్షములచేత-ప్రకాశింపఁజేయునదై — సద్రూప-శోభినీ=మంచియాకారముతో-శోభిల్లఁజేయునదై, సురత—సురతా - అభ్యుదయ-విధాత్రీ = సురతముయొక్క - దేవత్వముయొక్క-అభివృద్ధిని - చేయునదై; సాఽయం=ఆయీ, శుభకాంచీ=శుభకరమగు ఒడ్డాణము—కాంచీపట్టణము, చేతః=మనస్సును, సాధు=చక్కఁగా, రంజయతి=రంజిల్లఁజేయుచున్నది.

తా. ఈకాంచీపట్టణము ఒడ్డాణమువలె మన్మథక్రీడలకు మంచిస్థానమై, మామిడి మొదలైనమంచివృక్షములు కలిగి, సురతక్రీడ నభివృద్ధి చేయునదై యుండుటయేకాక; పండితుల శాస్త్రీయచర్చలతోను, మంచిమణిమంటపాదులతోను, మనోహరమై యక్కడఁ జేరువారికి పరమందు దేవత్వమును గలుగఁ జేయునదియై రాజిల్లుచున్నది. (అలంకారము—శ్లేష.)

తే. వసుధ నా సుమనోజనసేవాదరణము
స్థలము, సుమనోజ్ఞసద్రూపసంస్థితంబ
నిరతమును సురతోదయసపరతి నుంటఁ
గాంచి గాంచినఁ గాంచనైకాంచితంబ.

టి. కాంచి=ఒడ్డాణము—కంచి, కాంచన-ఏక-అంచితంబు - అ = బంగారమువలె-ముఖ్యమై-అంచితంబ=మనోజ్ఞమయినదియే.

గ॥ నగరీమేనాం దక్షిణేన కరుణార్ఘురీవ భగవతో వేగవతీనామ
ప్రవహతి పావనీ శ్శైవలినీ॥ 404

వ. ఈనగరికి దక్షిణమున భాగవతియయిన కరుణానదివలె వేగవతి యనెడి ద్వీపవతి యతిపావని యై ప్రవహించుచున్నది.

టి. భాగవతి=భగవత్సంబంధిని, ద్వీపవతి=నది.

ఇ॥ వేగాపగ=వేగవతీనది—ఇది యిక్కడిప్రాంతములలోని అశ్వా, మంజుశా, కంపా, హరిద్రా, విరజా, క్షీరా, వేగవతీ—అనుసప్తనదులలో నొకటియైనది. మఱియు సరస్వతీదేవి బ్రహ్మచేసెడి అశ్వమేధయాగమపుడు తన భర్తృవియోగమునకు చాలాకాలము తాళఁజాలక, ఆయాగమునకు విఘ్నము చేయఁగోరి అతివేగముతో [illegible]ప్రవహించుచు వచ్చినది.

వృ॥ మాధుర్యాధ్యయనోపపన్నమధునిష్యందాని, మందానిల
వ్యాలోల త్తటచారుభూరుహశిఖానిష్పాతిపుష్పాధికైః
డిండీరైస్స్మితవంతి పాంతు, దురితాద్వేగాపగాయాస్స్ఫుర
ద్వేగోద్వేజితవాజిమేధమఖకృద్వేధాంసి, పాథాంసి, నః॥ 405

అ. మాధు...ష్యందాని—మాధుర్య=తీయదనము, అధ్యయన=చేర్చుటకై, ఉపపన్న=కూడుకొన్న, మధునిష్యందాని=తేనేసోనలుగలవై; మందా...ధికైః=మందానిల - సన్నగాలిచేత, వ్యాలోలత్ = చలించుచున్న, తట=గట్లయందలి, చారు=సొగసైన, భూరుహశిఖా = చెట్లకొనలనుండి, నిష్పాతి=పడుచున్న, పుష్ప=పూవులచేత, అధికైః=అత్యంతములైన, డిండీరైః=నుఱుగులచేత, స్మితవంతి=నవ్వుచున్నవై; స్ఫుర... ధాంసి—స్ఫురత్ =అధికపడుచున్న, వేగ=ప్రవాహవేగమునకై, ఉద్వేజిత=భయపడిన, వాజిమేధమఖకృత్ =అశ్వమేధయాగముచేయుచుండు, వేధాంసి=బ్రహ్మదేవుడుగలవైన, వేగాపగాయాః=వేగవతీనదియొక్క, పాథాంసి=జలములు, నః=మమ్మును, దురితాత్ = పాపమునుండి, పాంతు=రక్షించునుగాక?

తా. సన్ననిగాలికిఁ గదలి గట్లలోని చెట్లకొనలనుండి తీయనితేనెబొట్లతో జాఱి పడుచుండు పూవులచేత నిండుకొనియుండు నుఱుగులచేత నవ్వుచుండునట్లుండి, బ్రహ్మ తాను జేయునశ్వమేధయాగ మేమి చెడిపోవునో యని భయపడు నంతటిప్రవాహవేగము గల యీవేగవతీజలము మమ్ముఁ గాచుచుండుఁగాక?

సీ. మధురిమ కలుగుకై మకరందనిష్యంద
ములు తీరభూరుహములను గురిసి
యలతీరభూరుహముల మందమారుత
ములఁ బతత్సుమవారములను గలసి
చిఱునవ్వు నవ్వినకై తెఱఁగునఁ దరఁగల
నూయాలలూఁగెడు నురువు లాఁగి
యలనాఁటియశ్వమేధాధ్వరంబునయందు

విధియె సాధ్వస మందు కవ్యథకు లోఁగి
తే. కలిత కల్హారకైరవకలితవిమల
సలిల సలలితవీచీవికచలితచకిత
శకున కులకలనాదమోదకజనౌఘ
మైనయీవేగవతియె మా కఘవిఘాతి.

టి. పతత్సుమవారములను = జాఱిపడుచున్న పుష్పసమూహములను, తరంగలన్ = అలలలో, ఆఁగి = పట్టుకొని, అధ్వరంబునయందు = యజ్ఞమందు, విధియె = బ్రహ్మయె, సాధ్వసము-అందు = భయమునుపొందునట్టి, మోదకజన-ఓఘము = సంతోషపడుజనసమూహముకలది, అఘవిఘాతి = పాపహారి.

ఇ. మఖకృద్వేధ = యజ్ఞకర్తబ్రహ్మ—(బ్రహ్మయాగము)ముందు కాలమందు ఈబ్రహ్మ ఆమహావిష్ణువును ప్రత్యక్షము చేసికొనుటకై యీకాంచీపట్టణమందు చేయుచుండిన యశ్వమేధయాగము.

గ॥ ఇతశ్చ సఖే! చక్షుర్నిరూప్యతామ్॥ 406

వ. చెలికాఁడ! యీడను నీచూపు నిరూపింపుము?

## హస్తిగిరివర్ణనము.

ఇ. గజభూభృత్ = కరిగిరి. ఇది-గంధర్వులిర్వురు దాయభాగమునకై యొక్కరొక్కరు శపించుకొని కరిమకరములుగా పుట్టి కనిపెట్టుకొనియున్నమకరిచేత కరిచిక్కుకొని చాలాకాలము విడువఁబడక కృశించి యెందఱినో వేఁడుకొని యెవరివలనను ఉపయోగము లేక తుదకు ముక్తినపేక్షించి శ్రీమన్నారాయణుని ప్రార్థింపఁగా, శ్రీనారాయణుఁడు వచ్చి కటాక్షించి ఆగజేంద్రుని విముక్తునిఁ జేయఁగా, ఆయనదయాళుత్వమున కధికానందపడి అదిమొదలానారాయణునాజ్ఞచేతనే ఆగజేంద్రుఁడీకాంచీపురమున వరదరాజస్వామిగానున్న యానారాయణునకే వాసస్థానమైనపర్వతము.

వృ॥ య ఏష రాజత్కటక స్సదాలిభి
స్సతతాశ్రిత [illegible]

స నిత్యశుద్ధం వరదం త ముద్వహ
న్యథార్థనామా గజభూభృ దీక్ష్యతే॥ 407

అ. యః ఏషః=ఏయిది, రాజత్-కటకః = ప్రకాశించు-సానుప్రదేశములు-కుంభస్థలములుకలదియు; సత్-అలిభిః—సదా - అలిభిః = సత్పురుషుల-సమూహముల చేత—ఎప్పుడును-భృంగములచేత, సమాశ్రితః=ఆశ్రయింపఁబడినదియు; శోభనదాన-సంపదా= శుభములనిచ్చుటయందలి - శుభకరమైనమదజలములందలి-సమృద్ధిచేత, నిత్యశుద్ధం=ఎల్లప్పుడును నిర్మలమైన, వరదంతం=ఆవరదరాజులను—శ్రేష్ఠమైనదంతమునుక్, ఉద్వహన్=వహించుచు, యథార్థనామా= నిజమైనపేరుగల, సః=ఆ, గజభూభృత్ = కరిశైలము—కరిరాజును, ఈక్ష్యతే= చూడఁబడుచున్నది.

తా. ఈకరిశైలము తనచర్యలలో సత్పురుషులకు శుభప్రదమగుచు, సర్వదా పరిశుద్ధస్వరూపుఁడైన వరదరాజులను తాను శిరసా వహించుచుండియు; కరిరాజువలె కుంభస్థలములును, మదజలమును, అందు భృంగములును గలిగి, గొప్పదంతములును వహించునదిగా నున్నయది.

తే. కటకమకుట మెయ్యది శుభప్రకటదాన
ముత్కటసదాళిసకటమయ్యదుత్కటేభ
ధరణిభృన్మణివరదదద్వహనఘటిత
పటుతఁ గన్పడె నన్వర్థపదమ కాఁగ.

దం. ఏహస్తిగిరి—ఏహస్తిరాజము మకుటమువలె ఉన్నతనితంబములు గొప్పకుంభస్థలములె కిరీటముగా కలదో, మంగళములకు ప్రసిద్ధమైనదానము—మంగళకరమై ప్రసిద్ధమైన మదజలముకలదో, విశేషించిన సత్పురుషసమూహము-ఎల్లప్పుడు తుమ్మెదలును సమీపమున కలదో, ఆ, విజృంభించిన హస్తిపర్వతశ్రేష్ఠము - హస్తిరాజశ్రేష్ఠము (వరద-దత్—వర-దదత్ = కోరికలుకలుగనిచ్చుదంతములను - వరములిచ్చు వరదరాజును) వహించుటచేత కూర్పఁబడిన పటిమచేత సార్థకమైననామముకలదిగా కనఁబడెను. (శేషలు)

గ॥ సభక్తిప్రకర్ష మంజలిం బధ్వా॥ 408
వ. భక్తి యతిశయించి యంజలియు బంధించి.

## శ్రీ వరదరాజస్వామివర్ణనము.

(వీరు—ఈకాంచీపురమున కరిగిరితోడి సత్యవ్రతక్షేత్రమందు అగ్నితీర్థము మొదలు పంచతీర్థములతోడి అనంతసరసీతటమందు భృగు నారదమహర్షులకు ను అనంతగజేంద్రులకును బ్రహ్మదేవునకును ప్రత్యక్షమగుటకై ఆబ్రహ్మ చేసెడి యశ్వమేధయాగమందు అతఁడిచ్చు హవ్యకవ్యాదులందు తా నంగీకరించిన వపతో పరిమళించు నధరపల్లవముతో లేచి సాక్షాత్కరించి కృతయుగమున ఆ బ్రహ్మచేతనే పూజింపఁబడినట్లు త్రేతాయుగమున గజేంద్రునిచేతను, ద్వాపర యుగమును బృహస్పతిచేతను, కలియుగమున ఆదిశేషునిచేతను పూజింపఁబడి యిప్పటికిని భక్తులకెల్లరకును కోరినవరము లిచ్చుచు,అళగసింగప్పెరుమాళ్లతోను తనదేవియైన పెరుందేవి తాయారుతోను గూడి పూదత్తయాళ్వారియొక్కయు తిరుమంగైయాళ్వారియొక్కయు మంగళాశాసనములు కలిగి సేవసాయించు చున్న శ్రీదేవరాజపెరుమాళ్లు.)

వృ॥ ద్విపాచల ముపాశ్రితం త్రిదశపాదపస్వర్గవీ
త్రపాకర ముపాస్మహే దిగధిపావనం పావనమ్
కృపాశిశిరలోచనం కృతభవవ్యథామోచనమ్
వపాసురభిలాధరం వరదనామ ధామ స్థిరమ్॥ 409

అ. ద్విపఅచలం=హస్తిశైలమును, ఉపాశ్రితం=ఆశ్రయించినదియు, త్రిదశపాదప- స్వర్గవీ-త్రపాకరం = కల్పవృక్షమునకును - కామధేనువునకును-సిగ్గును గలుగఁజేయునదియు, దిగధిప-అవనం = ఇంద్రాదిదిక్పాలకులను-రక్షించునదియు, పావనం=పవిత్రమైనదియు, కృపా శిశిర-లోచనం = దయచేత-చల్లని-చూపులుకలదియు, కృత-భవవ్యథా - మోచనం = చేయఁబడిన - సంసారదుఃఖములను-విడిపించునదియును, వపా-సురభిల-అధరం = మేదస్సుచేత - పరిమళిం

పఁబడిన+పెసవికలదియును,వరద నామ=వరద రాజులుఅను పేరుకలదియునైన, స్థిరం=శాశ్వతమైన, ధామ=తేజమును, ఉపాస్మహే=ఉపాసించుచున్నాము.

తా. ఈహస్తిశైలమందు దానమువలన కల్పవృక్షకామధేనువులనుగూడ మించుచు, ఇంద్రాదులను రక్షించుచు, కనికరముతోడి చూపులతో సమస్త దుఃఖములనుఁ బోఁగొట్టుచు, బ్రహ్మాశ్వమేధయాగమందు హోమద్రవ్యముగా ఓష్ఠమందె పరిమళించుచున్న వపతోడఁగూడ ఆవిర్భవించియున్న యీవరద రాజస్వామిని సేవించుచున్నవారము.

సీ. కరిశైలమును జేరి సురసాలమును మీఱి
కోరినకోరికల్ కోరి యొసఁగ
దిక్పాలురకుఁ దానె దిక్కుగా నేర్పడి
పరమపావనతకే పాలుపడఁగఁ
గెందామరలఁ బోలు కంనోయి దోఁపించు
పరమకారుణికతకు బరిఢవిల్ల
సంసారసాగరసమ్మగ్నులను దేల్చు
దురితదూరకతమైఁ బరఁగుచుండ

తే. వేధయే చేయునాయశ్వమేధమందుఁ
దానుగానే వపారసపానమందు
వాంఛ నవతరించినతన వరదనామ
ధామ మీయదే మాకు నుత్తారకంబు.

గ॥ కృశాను మామంత్ర్య॥

వ. కృశానునిం బిలిచి. 410

శ్లో॥వరదం భో! భజ సతతం శరదంభోరుహవిలోచనం దేవమ్
పరదంభోపహతికరంహరదంభోలిధరముఖమఖాశనుతమ్॥411

అ. భో=ఓకృశానూ! శరత్-అంభోరుహ - విలోచనం = శరత్కాలమందలి తామరలవలె- కన్నులుగలవాఁడును, పరదంభ - ఉపహతికరం = శత్రు

వులయొక్క-గర్వమును-నాశముచేయువాఁడును, హర - దంభోలిధర - ముఖ-మఖాశ-నుతం = శివుఁడును-ఇంద్రుఁడును - మొదలైన-దేవతలచేత - స్తోత్రము చేయఁబడినవాఁడునైన, వరదం-దేవం = వరదరాజులనెడి-స్వామిని, సతతం= ఎల్లప్పుడును, భజ=భజింపుమా? (వృత్త్యనుప్రాసాలంకారము)

తా. ఓకృశానూ! శరత్కాలపుఁదామరలవలె కనులు కలిగి, రుద్రేంద్రాదులస్తోత్రములకు పాత్రుఁడై, శత్రులగర్వము నడఁచుచుండునట్టియీవరదరాజస్వామిని భజించుచుండుము?

క. వరదుని గని శర ణనుమా
శర దురు సరసీజపత్త్రసమ నేత్రు మహా
ద్ధురతర రిపు దంభ హరు౯
హరహరిహయజయవిజృంభణాదరణపరున్.

టి. హర...పరు౯=శివునకును, ఇంద్రునకును, జయాతిశయమందలి యాదరమందు, ఆసక్తిగలవాఁడునైన.

గ॥ పున స్సానుస్మరణ గోమాంచమ్॥ 412

వ. మఱల ననుస్మరించి యవయవంబులుం బులకరించి.

వృ॥ తాపత్రయప్రశమనా దమృతం గ్రహీతుమ్
తామేవ వైధహయమేధవపా ముపాసే
అంభోధిజాధర సుధారస వాసి తేన
యాచుంబితా వరదరాజ ముఖాంబుజేన॥ 413

అ. అంభోధిజా-అధర-సుధారస-వాసితేన = క్షీరసాగరపుత్రియైన లక్ష్మీదేవియొక్క - మోవియందలి - అమృతరసముచేత - పరిమళించుచున్న, వరదరాజ-ముఖాంబుజేన=వరదరాజస్వామియొక్క-మోముదామరచేత, యా=ఏవప, చుంబితా = చప్పరింపఁబడినదో? తాం=ఆ, వైధ-హయమేధ - వపాం ఏవ= బ్రహ్మసంబంధియైన అశ్వమేధమందలి - వపనే, తాపత్రయ - ప్రశమనాత్ =

తాపత్రయమును+నశింపఁజేయుటనుండి, అమృతం=మోక్షమును, గ్రహీతుం=గ్రహించుటకై, ఉపాసే=భజించుచున్నాను.

తా. ఈవరదరాజస్వామి తనముఖారవిందమున ఆలక్ష్మీదేవియధరామృతరసపరిమళము సదా యుండియు, ఆబ్రహ్మాశ్వమేధయాగమందలివపాపరిమళమును గోరి, తనయధరమున ధరించియుండునట్టి యావపనే నేనుఈతాపత్రయాలు పోఁగొట్టుకొని యామోక్షమును సిద్ధింపఁజేసికొనుటకై భజించుకొనుచున్నవాఁడను.

తే. తాపములతిగ తెగమాపి కేత దమృతమును
గాంచఁ గాంచనగర్భ యాగమున వప ను
పాసచేసెద నెద నున్న కేపత్మలాక్షి
యధరసుధ గ్రోలువరదు ముఖాబ్జప్రపను.

టి. తత్-అమృతమును = ఆ-మోక్షమును, ముఖాబ్జప్రపను = ముఖకమలమనెడి పానీయశాలయందు, కాంచనగర్భ=బ్రహ్మయొక్క, తిగ = మూఁడు.
(తాపత్రయము—ఆధ్యాత్మిక, అధిభౌతిక, ఆధిదైవికములు.)

గ॥ పున స్సానందమ్॥ 414

వ. మఱలఁ బరమానందభరమున.

వృ॥ భువనవహనశీలా సింధురాగం భజంతీ
జయతి వరదమూర్తి స్సాధు వేగాపగాచ
దముయితు ముఖతీర్ణా ధాతృయజ్ఞం ద్వితీయా
సఫలయితు మిహాద్యా సాదరా ప్రాదురాసీత్॥ 415

అ. భువన-వహన-శీలా = లోకములను-జలములను-ఉద్వహించుటే—ప్రవహించుటే-స్వభావముగాఁగల, వరదమూర్తిః=వరదరాజస్వామి, వేగాపగాచ=వేగవతియు, సింధుర-అగం—సింధు-రాగం = హస్తి-శైలమును—సముద్రమందలి-ప్రేమను, భజంతీ=అవలంబించునదై, సాధు=చక్కఁగా, జయతి=సర్వోత్కర్షముగానున్నది. ఇహ=ఇక్కడ, ఆద్యా=మొదటిది, ధాతృయజ్ఞం=బ

హ్మాయజ్ఞమును, సఫలయితుం=సఫలపఱచుటకు, సాదరా= ఆదరముతోఁగూడి నదియై,ప్రాదురాసీత్ =ప్రాదుర్భవించెను; ద్వితీయా=రెండవది, దమయితుం =చెడఁగొట్టుటకు, అవతీర్ణా=పుట్టినది.

తా. జగద్రక్షణమే స్వభావముగాఁగల యావరదరాజస్వామి యీహస్తి శైలము చేరి బ్రహ్మయజ్ఞము సఫలపఱచుటకును, జలప్రవాహామే స్వభావము గాఁగల ఆ వేగవతీనది సముద్రసంగమాపేక్షను పొంది బ్రహ్మయజ్ఞమును చెఱుపుటకును ఆర్భవించిరి.

ఆ. భువనవహనజయము ♦ భువి సింధురాగము
వరదమూర్తి వేగ ♦ వతియుఁ బడయు
ద్రుహిణసవన మపుడు ♦ దులిపింప రెండవ
దవధరింప మొదటి ♦ దవతరించె.

టి. జయము=ఉత్కర్షమును, ద్రుహిణసవనము=బ్రహ్మయజ్ఞమును, దులిపింపన్ =నశింపఁజేయుటకును, అవధరింపన్ = ఉద్ధరింపఁజేయుటకును, అవతరించెన్ =అవతారమెత్తెను. (శ్లేషయథాసంఖ్యాలంకారములు.)

కృశానుః—కృశానుఁడు.—

గ॥ వయస్య ! తవేయం జయానభిజ్ఞే తస్మిన్ జయతీత్యుక్తిరయుక్తా । సవనసఫలీకరణ ఫణితిరపి తత్ప్రాతికూల్యభాజిని నోచితా॥

వ. సుహృదయా ! యిటు జయానభిజ్ఞుఁ డౌనితనియందు జయోక్తి యయుక్తమగుటయకాక, సవనము నవధరించుటకై యవతరించెననుటయు, దానిప్రతికూలునందనుకూలమగుటయ కలదా ?

తథాహి.—అటులె కదా?—

శ్లో॥అజయజ్ఞోద్భవే తస్మిన్ కథంనామ జయజ్ఞతా
సవనాశానుకూలే కా సవసాఫల్యకారితా॥ 417

(పైఁజెప్పినదానినే విభాగభేదముచేత ఇట్లు శ్లేషగాఁ జెప్పుచున్నాఁడు.)

అ. అ-జయజ్ఞ-ఉద్భవే=జయజ్ఞుఁడుకానివాఁడుగా-జన్మముగల, తస్మిన్=ఆపరద రాజులయందు, జయజ్ఞతా=జయజ్ఞుఁడగుట, కథంనామ=ఎట్లు? సవనాశ-అనుకూలే=యజ్ఞము-చెఱుపుటకునుఅనుకూలుఁడైనవానియందు, సవ-సాఫల్య-కారితా=యజ్ఞములకు-సఫలత-చేయుట, కా=ఎట్టిది? (అర్థాంతరము) హేఅవ=ఓభాగ్యరహిత! కృశానూ! అజయజ్ఞఉద్భవేతస్మిన్=బ్రహ్మయజ్ఞమున జన్మముగలవానియందు, జయజ్ఞతా=జయజ్ఞత్వము,కథంన=ఎట్లు కలుగదు? సవనాశ-అనుకూలేతస్మిన్ = దేవతలకు అనుకూలుఁడైనయతనియందు, అసవసాఫల్యకారితా=యజ్ఞసాఫల్యము చేయకుండుట, కా=ఎట్టిది?

తా. అజయజ్ఞజన్ముఁడై జయజ్ఞుఁడుగా జన్మించుటయు, సవనాశుల కనుకూలుఁడై సవసాఫల్యము కలుగుటయు నెట్లు? అనియు, బ్రహ్మయజ్ఞజన్ముఁడై జయజ్ఞతయు సవనభుక్కుల కనుకూలుఁడై సవసాఫల్యము లేకపోవుటయు నెట్లు అనియు విభాగవివేచనము.

తే. అజని యజయజ్ఞజని యెతఁ డతనియందు
సటజయజ్ఞత యెటు గల్గు నదియ కాక
యవున? సవనాశపాశము నతనియందె
కలదు, కలదంట సవనసఫలత వెంట.

టి. అజని=జన్మరహితుఁడో, అజయజ్ఞజని = జయజ్ఞుఁడు కానివాఁడుగా (బ్రహ్మయజ్ఞమందు) జన్మముకలవాఁడో, జయజ్ఞత=జయజ్ఞుఁడగుట, సవనాశపాశమును=యజ్ఞధ్వంసముచేయుట అనెడుబంధముకూడ- యజ్ఞభుక్కులైన దేవతలందు ప్రేమబంధముకూడ, వెంటన్=తోడనే, కలదంటసవనసఫలత= సవనసాఫల్యము-అసవనసాఫల్యము కలదంట?

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ సఖే! శ్లేషభంగ్యైవ దోషముద్భావయతా భవతా సకల
హేయప్రత్యనీకతైవాస్మిన్నావిష్కృతా యుక్తంచైతత్॥

వ. నీ వీ శ్లేషముఖాననే దోషముద్ఘోషించుచును సకలహేయప్ర

త్యనీకతయే యితనియందు నావిష్కరించుచున్నావు. ఇది యును యుక్తము.

టీ. శ్లేషముఖాన నే=నానార్థవాచకశబ్దద్వారా, హేయప్రత్యనీకత=దోషప్రతికూలత.

వృ॥ పద్మోల్లాసవిధాయిని సత్పథదీప్తికృతి చక్రభవ్యకరే
భాస్వతి వరదే భవితా నజాతు దోషానుషంగవార్తాపి॥ 419

అ. పద్మ-పద్మా-ఉల్లాసవిధాయిని = తామరలకు - లక్ష్మికి - సంతోషమును జేయునతఁడును, సత్పథ-దీప్తికృతి = ఆకాశమార్గమునకు—సన్మార్గమునకు-కాంతినిజేయునతఁడును, చక్ర-భవ్యకరే=చక్రవాకములకు—చక్రాయుధముచేత-శుభకరమైన-కిరణములు—హస్తముకలయతఁడునైన, భాస్వతి=సూర్యునియందును, వరదే=వరదరాజస్వామియందును, దోషా—దోష-అనుషంగవార్తాఽపి=రాత్రితోడి—సకలదోషములతోడి - సంబంధపుమాటయైన, జాతు = ఒకప్పుడైనను, నభవితా=కలుగఁజాలదు. (శ్లేషయథాసంఖ్యాలంకారములు.)

తా. తామరలకు వికాసమును, ఆకాశమునకు ప్రకాశమును, జక్కవలకు ఉల్లాసమును గలిగించు సూర్యునియందు రాత్రితోడిసంబంధ మనుమాటయే లేనట్లు; లక్ష్మీదేవికుల్లాసమును, సన్మార్గమునకు ప్రకాశమును, చక్రహస్తమును గలిగియుండు నావరదరాజస్వామియందు ఏదోషముతోడిసంబంధ మనుమాటయే లేకయుండును.

ఆ. సత్పథప్రకాశ ! సతత పద్మోల్లాస
చక్రభరణము లను ! సద్గుణములె
భూషలుగను వెలుఁగ ! దోషానుషంగ మఁట
వార్త గలుగు నెటుల ! వరదహరికి.

టీ. వరదహరికి=వరదరాజస్వామియనెడి సూర్యునికి. (శ్లేషరూపకములు)

గ॥ సనుంతా దవలోకయ న్నంజలిం బద్ధ్వా॥ 420

వ. కలయం గాంచి యంజలియుం గావించి.

వృ॥ సేవేఽనంతసర, శ్శ్రయే కరిగిరిం, శ్రీపుణ్యకోట్యాసమమ్
ధ్యాయా మ్యుత్తరవేది, మత్ర మహితం దేవాధిరాజం భజే।
కల్యాణీం కలయామి కంజనిలయాం కల్యాణకోటిస్థితాం
ఈడే రాఘవయాదవాదిమకిటీ,వందే ముకుందాశ్రితాన్॥

అ. అనంతసరః=అనంతసరస్సును, సేవే=అనుసరించుచున్నాను; కరిగిరిం=హస్తిశైలమును, శ్రయే = ఆశ్రయించుచున్నాను; ఉత్తరవేదిం=ఉత్తరవేదికను, శ్రీపుణ్యకోట్యాసమం=పుణ్యకోటివిమానముతోఁ గూడ, ధ్యాయామి = ధ్యానముచేయుచున్నాను;అత్ర=ఈయుత్తరవేదియందు, మహితం=పూజితుఁడైన, దేవాధిరాజం=వరదరాజస్వామిని, భజే=సేవించుచున్నాను; కల్యాణకోటిస్థితాం=కల్యాణకోటివిమానమందుండునట్టి, కల్యాణీం=మంగళస్వరూపురాలైన, కంజనిలయాం=పద్మాలయ యైనలక్ష్మిని, కలయామి= సేవించుచున్నాను; రాఘవ - యాదవ-ఆదిమకిటీన్ = శ్రీరాముని-శ్రీకృష్ణుని - ఆదివరాహస్వామినిన్, ఈడే= స్తుతించుచున్నాను; ముకుందాశ్రితాన్ = హరిసమాశ్రితులైన సనకాదులను, వందే=నమస్కరించుచున్నాను.

తా. అనంతసరస్సున స్నానముచేసి, హస్తిశైలమెక్కి, పుణ్యకోటివిమానముతో ఉత్తరవేదిని స్మరించుకొని, అందు ఆదేవరాజస్వామినిసేవించి, కల్యాణకోటివిమానమున ఆపెరుందేవి తాయారునుసేవించి, మఱియు నందు శ్రీరాముని శ్రీకృష్ణుని ఆదివరాహస్వామినిన్ ప్రణుతించుచు, అందు అందఱను సేవించుచుండు సనకాదులనున్ నమస్కరించుచున్నాను.

సీ. సదనంతసర సెంతో కసదమలస్వాంత మై
సేవింతు నిదె చెంతఁ గఁ జింత లణఁగఁ
గరిరాజు గిరిరాజు కసురవగు తేజుతో
నాశ్రయింతును సాజ కమైనయోజఁ
బుణ్యకోటిని గోటి కపుణ్యము ల్గలుగుకై
పాటింతు దురితపాప మ్మోటికోటి

వేధోశ్వమేధీయ వీధి యుత్తరవేది
ధ్యానింతు నిదె సదాధ్యయనవేది
తే. ద్విరదవరదుని వరదునిఁ ద్వర వరింతుఁ
గలయఁ గలయింతుఁ గమలను గనులనిలయ
రాము రామసోదరుఁ గిరిఁ బ్రణతిఁ గాంతుఁ
జనకసనకాదులకును వందనము లెంతు.

టి. కరిరాజుగిరిరాజుక్ = హస్తిశైలమును, ఓజక్ = వరుసతో, ధుత+పాప-ఘూటికోటి = తోలఁగఁగొట్టఁబడిన-పాపముల నెడు - అశ్వసమూహముకలది యైన, వేధః-అశ్వ మేధీయ-వీథి = బ్రహ్మయొక్క-అశ్వమేధయజ్ఞ సంబంధియైన-మండపపంక్తి కలదియై, కిరిక్ = వరాహస్వామినిక్, చనక = విడిచిపోవక.
గ॥ ఇతిప్రతీచ్యాందిశి కించిదంతర మతిక్రమ్యసవిస్మయానందమ్॥
వ. అని పశ్చిమంబునకుం గొంతయంతరం బతిక్రమించి సవిస్మయం బగు సంతోషభరంబున.

అత్రహి-ఇక్కడఁ గదా:—

వృ॥ స్వావజ్ఞానసమున్మిషద్రుషి సరస్వత్యాం విరించ్యధ్వర
ప్రత్యూహాయ నదీప్రవాహవిధయా పర్యాపతంత్యామహో
దూనే తద్రుహిణే గణేచ మరుతాం దీనే మఖం విఘ్నతః
పాతుం సేతుకృదేవ సేతు రభవత్పక్షీంద్రకేతు స్స్వయమ్॥

అ. స్వ-అవజ్ఞాన-సమున్మిషత్ - రుషి = తనయొక్క-అవమానముచేత-రేఁగుచున్న-కోపముగల, సరస్వత్యాం = సరస్వతి, విరించి-అధ్వర-ప్రత్యూహాయ = బ్రహ్మయొక్క-యజ్ఞముయొక్క-విఘ్నముకై, నదీప్రవాహవిధయా = వేగవతీ నదీప్రవాహరీతితో, పర్యాపతంత్యాంసత్యాం = వచ్చుచుండఁగా; తత్ద్రుహిణే = ఆబ్రహ్మ, దూనేసతి = దుఃఖించుచుండఁగా; మరుతాంగణేచ = దేవతలయొక్కసమూహమును, దీనేసతి = సోలిపోవుచుండఁగా; మఖం = యజ్ఞమును, విఘ్నతః = విఘ్నమునుండి, పాతుం = రక్షించుటకై, పక్షీంద్రకేతుః = గరుడధ్వ

జుఁడైన, సేతుకృత్ = శ్రీరాముఁడు, స్వయమేవ = తానే, సేతుః = సేతువుగా, అభవత్ = అయ్యెను.

తా. సరస్వతి తన్ను బ్రహ్మ అవమానించినందుకై కోపపడి ఆ బ్రహ్మయజ్ఞము ను జెఱుపుటకే తాను వేగవతీనదిగా వేగపడి వచ్చి వెల్లువయై ముంచుకోఁగా; బ్రహ్మయే కాక, యందఱు దేవతలును దుఃఖితు లగుచుండఁ జూచి, ఆయజ్ఞమును గాపాడుటకై యీ దేవరాజస్వామియే తాను సేతువుగా అడ్డపడెను.

సీ. తన పరాభవమున • కెనసిన కినుక రేఁ
గిన దైనభారతి • తనదుపతియొ
చేసెడునది యైనఁ • జేకొని క్రతువును
గాసిచేసెడుకోఱ • కోసరిలక
వైఁబడి పాఱెడి • పగిదికి బ్రహ్మయు
మానమందు భయమందుచున కృశింప
సరసిద్ధసాధ్యకి • న్నరులును మునివరు
లెల్ల రుల్లోలురై • డిల్లపడఁగఁ

తే. గాంచి కరుణించి మఖము వి • ఘ్నము దలంచి
మున్ను మున్నీట సేతువ • యెన్ని చేసి
నట్టి పక్షీంద్రకేతువె • యాక్షణమున
సేతు వయ్యెను గాదె ర • క్షింప దాని.

టి. భారతి = సరస్వతి, ఓసరిలక = వెనుకతీయక, పక్షీంద్రకేతువె = గరుడ ధ్వజుఁడె.

కించ.—మఱియు.—

శ్లో॥ పరం వేగం సరస్వత్యా ఉద్వేగమపి తత్పతేః
స ఏష సేతూద్ధరణోఽప్యరుణ ద్యుగప త్ప్రభుః॥ 424

అ. సేతూద్ధరణః = సేతువునుద్ధరించినట్టి, సఏషఃప్రభుః = ఆయీప్రభువైన శ్రీరాముఁడు, సరస్వత్యాః = వేగవతీరూపయైనయాసరస్వతియొక్క, పరం =

అధికమైన, వేగం=వేగమును, తత్పతేః=ఆసరస్వతీపతియైన బ్రహ్మయొక్క, పరం=అధికమైన ఉద్వేగమపి=భయమునుకూ, యుగపత్ =ఒకప్పుడె, అరుణత్ = అడ్డిపఱిచెను.

తా. అప్పుడు సేతూద్ధరణము చేసి ఆశ్రీరాముఁడు ఇప్పు డీ వేగవతిగా పాఱిన సరస్వతీపరివాహావేగము నే గాక, ఆసరస్వతీపతియైన యాబ్రహ్మయొక్క భయానిని గూడ నొక్కప్పుడె పడఁగొట్టెను.

తే. వేగవతి యగువాగ్దేవి వేగభరము
వాగధీశుఁ డగుమఖి యుద్వేగభరము
నొక్కసారియ సేతువు నుద్ధరించి
నట్టిఁ డగుప్రభుఁ డటు బిట్టు నట్టువఱిచె.

టి. మఖి=యాజకుఁడైనబ్రహ్మయొక్క, ఉద్ధరణము=తొలఁగించుటయు-చెలఁగించుటయు,(శ్లేషభిత్తితోడిఅభేధాధ్యవసాయము చేవిరోధాభాసాలం).

## పరిమళరంగనాయకవర్ణనము.

పరిమళరంగనాయకులు—(వీరు సత్యలోకమున తన్నారాధించుకొనుచున్న బ్రహ్మయందలి తనవాత్సల్యము చేత ఆబ్రహ్మ యీసత్యవ్రతక్షేత్రమున చేయునశ్వమేధయజ్ఞమునకు విఘ్నము చేయ వేగవతిగా వచ్చినసరస్వతి నాటంకపఱచుటకై ఆమెకంటె భాషావిశేషమున అధికశాబ్దికుఁడై తనశాబ్దికభాష్యపరిమళముతో విశేషించిన ఆయాదిశేషునే శయ్యగాఁ జేసికొని పరిమళించుకొనుచున్న యాశ్రీరంగనాయకులుగానె సేవసాయించువారు.

అపిచ.—మఱియు:—

వృ॥ఆశా మీశానబంధోశ్చరణనఖరుచాం భారయా స్మేరయంతీ
కుంభీడింభస్య కాష్ఠామపిమణిముకుటన్యస్తముక్తామయూఖైః
పర్యంకే శబ్దవిద్యాపరిమళసరళే పంకజస్పర్ధినేత్రా
వ్యాసక్తిర్వేగాపగాయాం స్వపితి భగవతీ కాపితాపింఛవర్ణా॥

అ. ఈశానబంధోః=శివునిచుట్టమైన కుబేరునియొక్క, ఆశాం=దిక్కును, చరణనఖరుచాం=కాలిగోళ్ల కాంతులయొక్క, ధారయా=పంక్తి చేత; కుంభీడింభస్య = కుంభసంభవుఁడైన అగస్త్యునియొక్క, కాష్ఠామపి = దిక్కును గూడ, మణిమకుట న్యస్తముక్తామయూఖైః=రత్నపుఁగిరీటమం దుంచఁబడిన ముత్యపుఁగాంతులచేత, స్మేరయంతీ=నవ్వించునది యై, పంకజస్పర్ధి నేత్రా=తామరతో చలపెట్టుచున్నకనులు కలదియై, తాపింఛవర్ణా=కానుఁగుపన్నెకలదియై, కాపి=ఒకానొక, భగవతీ=భగవత్సంబంధియైన, వ్యక్తిః=స్వరూపము, వేగాపగాయాం=వేగవతీ నదీతీరమందు, శబ్దవిద్యాపరిమళసరళే=శాబ్దిక భాష్యముయొక్క వాసనావిశేషముచేత మృదులమైన, పర్యంకే = శేషశయనమందు, స్వపితి=శయనించుచున్నయది.

తా. పద్మనేత్రములతోను, తమాలపర్ణములోను, దక్షిణదిక్కున శిరస్సుతోను, ఉత్తరదిక్కున పాదములతోను అభగవానుఁడైనరంగనాయకులు, ఆదిశేషశయ్యయందు శయనించుచున్నాఁడు.

కుంభీడింభుఁడు=కుంభడింభకుఁడు అగస్త్యమహాముని-147 వృత్తముచూడు.

తే. చరణనఖరుచిరుచిర కిన్నరపదిశయు
మకుటమౌక్తికమంజుకుంభజనిదిశయుఁ
బసఁగఁ బవళించుఁ బరిమళరసికరంగ
నాయకుఁడ? తోయజాయతనయనుఁ డితఁడు.

టి. కిన్నరపదిశయు=కిన్నరాధిపతియైన కుబేరునిదిక్కును, కుంభజనిదిశయు కుంభసంభవుఁడైన అగస్త్యునిదిక్కును, పసఁగఁ=మనోహరముగ.

స్వప్రత్యభిజ్ఞం. —

వృ॥ ప్రాజాపత్యముఖాంతరామతటినీపాథోనిరోధోద్యతః
ప్రాప్తః పావనహేమతామరసినీతీరం కృపారమ్యధీః
క్షేమం కోమలవల్లికాసహచరః పుష్ణాతు కృష్ణాంబుద
చ్ఛాయో న స్సమవాప్తరమ్య ... శేషయః॥

అ. యః=ఎతఁడు, మనాతి=గొప్పదైన, రంగే = శ్రీరంగమందు, భుజంగే శయః=శేషశాయియై, అవాతరత్ =అవతరించెనో, ప్రాజాపత్యమఖ-అంతరాయతటినీ - పాథోనిరోధ-ఉద్యతః = బ్రహ్మసంబంధియైన యజ్ఞమునకు-విఘ్నమైనవేగవతియొక్క-జలమును అడ్డగించుటకై - ఉదయించినతఁడును, కృపారమ్యధీః=దయారసముచేతమనోహరమైన బుద్ధిగలయతఁడును,కోమలవల్లికాసహచరః=కోమలవల్లి తాయారుకు భర్తయును,కృష్ణాంబుదచ్ఛాయః=నీల మేఘవర్ణుఁడును,పావన హేమ తామరసినీతీరం=పవిత్రమైన బంగారు తామరతటాకముగట్టును,ప్రాప్తః=చేరినతఁడునైన, సోఽయం=ఆయితఁడు, క్షేమం=క్షేమమును, పుష్ణాతు=వృద్ధిబొందించునుగాక.

తా. శ్రీరంగమందలి యారంగనాథుఁడు ఈతామరతటాకతీరమందు చేరి ఆబ్రహ్మయజ్ఞమునకు విఘ్నముగా పాఱిన వేగవతీజలము నడ్డగించుటకై కృపకలిగి కోమలవల్లి తాయారుతోఁ గూడి, యుండునతఁడై మాకు క్షేమమును వర్ధిల్లఁ జేయుచుండునుగాక.

వ. జ్ఞప్తిచేసికొని విజ్ఞప్తియుం జేసికొనియె.

ఉ. తామరచూలిమధ్వరము కై తారెడి తత్తటినీ నిరోధి యై
హేమసరోజినీతటిని కే నెమఱ కుండు కృపాకరుండు శ్రీ
కోమలవల్లితో నసిత కోమలతోల్లసితాంబుదాభుఁడా
శ్రీమహనీయరంగపతి సేమ మొసంగుత శేషశాయి యై.

టీ. తారెడి = చేరెడి, తటినీ = నదికి, అసిత+కోమలతా+ఉల్లసితాంబుద, ఆభుఁడు=నల్లనై +మృదుత్వముతో+ప్రకాశించెడి మేఘమువలె+కాంతులు గలయతఁడు.

## యథోక్తకారివర్ణనము.

యథోక్తకారి—(వీరు ఆబ్రహ్మయజ్ఞవిఘ్నకారిణి యైనయాసరస్వతి నడ్డగించుటకే శేషశయనుఁడై యక్కడ నున్నయన్నారాయణుని గని ఆమె వెనుదీయక,స్వామీ! నే నిట్లు రాను.పాతాళమార్గమున నె చని యాబ్రహ్మదేవుయజ్ఞ

కుండముననె యుండెద, తా మక్కడ నాకు సేవసాయించునట్లు నన్ననుగ్రహించవలెనని వేఁడుకొని పాతాళముగుండఁ బోయి ఆబ్రహ్మగుండమునకు వచ్చి నిల్వ ఆమె ప్రార్థించినట్లుగానె తా మనుగ్రహించి సాయించిన సేవ లభించి యానందించె. ఇట్లు యథా+ఉక్త+కారి = చెప్పినట్లు చేసినవారు అని తిరునామము కలిగిన యాభగవానుఁడు.)

గ॥ పున రనుధ్యాయన్ సానందమ్॥ 427

వ. మఱల ననుసరించి ధ్యానించి యానందించి.

వృ॥ శతమఖమణిస్తోమశ్యామం శయానమహీశ్వరే
శశిసఖముఖం రాజీవాక్షం సమున్నతనాసికమ్
మహితచరణం ధాతుఃపత్న్యా మహ స్తమసఃపరమ్
హృది లగతు మే బింబోష్ఠం తద్యథోక్తకృదాహ్వయమ్॥ 428

అ. శతమఖమణిస్తోమశ్యామం = ఇంద్రనీలరత్నముల సమూహమువలె శ్యామలవర్ణము కలదియు, శశిసఖముఖం = చంద్రునితో సఖ్యముగల మొగము గలదియు, రాజీవాక్షం = తామరలవలె నేత్రములుకలదియు, సమున్నతనాసికం=పొడవైన ముక్కుకలదియు, ధాతుఃపత్న్యా=బ్రహ్మభార్యయైన సరస్వతీదేవిచేత, మహితచరణం=పూజింపఁబడిన పాదములు కలదియు, బింబోష్ఠం=దొండపండువంటి పెదవి కలదియు, అహీశ్వరే=సర్పరాజైన ఆదిశేషునిమీఁద, శయానం=శయనించునదియు, యథోక్తకృదాహ్వయం=యథోక్తకారి యను నామముకలదియునై, తమసఃపరమ్=అజ్ఞానాంధకారమునుండి మీఱినదియునైన, తత్ మహః=ఆవిష్ణుతేజము, మేహృది=నాయొక్కహృదయమందు, లగతు=చేరియుండుఁగాక!

తా. ఇంద్రనీలమువలె మేని వర్ణమును, చంద్రునివలె మొగమును, తామరలవలె కనులును, దొండపండువలె పెదవియును, పొడుగైనముక్కును, సరస్వతి పూజించుపాదములును గలిగి; యథోక్తకారి యనెడియా తేజము నామనస్సున చేరియుండునుగాక !

ఉ. శ్యామలకోమలాంగు శశిసన్ముఖు నున్ముఖనాసు భాసురా
బ్జామలనేత్రు విద్రుమసమాధరుఁ దామరసోద్భవాంగనా
ప్రేమనుతాంఘ్రి తామరసుఁ బ్రేంఖదహీనశయాను నామనో
ధామవిహారిఁ జేయుదు సుధామనుహారి యథోక్తకారినిన్.

టీ. సుధామనుహారిన్ = చక్కని తేజముచేత మిక్కిలి మనోహరుఁడైన, నామనోధామవిహారిన్ = నామనోమందిరమున విహరించువానినిగా.

వృ॥ వేగవతి సేతుతయా ప్రాగవతీర్ణాఽఽదిదేవతా వినతాన్
ద్రాగవతీయందురితా ద్రాగవతీకలశజలధికన్యాయామ్॥ 429

అ. వేగవతీసేతుతయా = వేగవతీనదీప్రవాహమునకు అడ్డగించుటకే సేతువగుటతో, ప్రాక్ అవతీర్ణా = ముందు బ్రహ్మకై అవతరించినదై, కలశజలధికన్యాయాం = క్షీరసాగరకన్యయైన లక్ష్మియందు, రాగవతీ = ప్రేమకలదైన, ఇయం ఆదిదేవతా = శ్రీరంగనాయకమూర్తి, వినతాన్ = భక్తులను, దురితాత్ = పాపమునుండి, ద్రాక్ = త్వరగ, అవతి = రక్షించుచున్నది.

తా. లక్ష్మీప్రియుఁడైన శ్రీరంగనాథుఁడు బ్రహ్మయజ్ఞముచెఱుపు వేగవతి నడ్డగించుటకై యిట్లవతరించి, అఖిలాశ్రితులకు న్నిఖిలదోషములనుం దొలఁగించి కాచుచుండును.

ఆ. వేగవతికి నదికి వేగ సేతువు గాఁగ
నవతరించి మున్ను నవనతాళిఁ
బ్రోచె దురితపాళిఁ ద్రోఁచి దేవాద్యుఁడు
కలశజలధికన్యకాంతుఁ డితఁడు.

కృశానుః—కృశానువు.—

గ॥ అహో! కథమాశుకవిస్సన్నపి భవానముం దేవ మభినందతి॥
వ. ఆహా! ఆశుకవివేయైనను, నీవీ దేవునెట్లభినందించుచున్నావు?

తథాహి:—అట్లేకదా.—

వృ॥ అథః కరి ...యాద్ధే...

కలానిధిం ధిక్కురుతే ముఖేన యః
కృతాంతరాయస్య సరస్వతీజవే
స్తవే రుచి స్తస్యకథం భవే త్కవేః॥ 431

అ. యః=ఎతఁడు, ఆదిమశాబ్దికఉరగం = ఆద్యుఁడైశబ్దశాస్త్రవేత్తయైన యాదిశేషుని, అధఃకరోతి=క్రిందుపఱుచుచున్నాఁడో, కలానిధిం=సకలకళా సముద్రుఁడైనవానిని—చంద్రుని, ముఖేన= మొగముచేత, ధిక్కురుతే=ధిక్క రించుచున్నాఁడో, సరస్వతీజవే = వాగ్దేవీవిజృంభణమందును—వేగవతీవేగ మందును, కృతాంతరాయస్య=చేసినవిఘ్నము కలవాఁడైన, తస్య=ఆరంగనా థునియొక్క, స్తవే=స్తోత్రవిషయమై, కవేః=కవికి, రుచిః=ఆసక్తి, కథం = ఎట్లు? భవేత్=కలుగును?

తా. ఈరంగనాథుఁడు ఆదిశబ్దశాస్త్రవేత్త యైనయాదిశేషుని అధఃకరిం చుట గాక (శయనము చేసికొనుటయే గాక) ముఖముతో కళావంతుఁడైనవానిని (చంద్రుని) మించుచున్నాఁడు; మఱియు సరస్వతీ (వేగవతీనది) వేగమునకు ఆటంకముచేసెను. అట్టి ఇతనిగుఱించిన స్తోత్రమును ఏకవి కోరును?

తే. అడరునాదిమశాబ్దికు నడుగువఱిచి
ముఖమునన కళానిధిని విముఖునిఁ జేసి
తగ సరస్వతిజవము నెంతెగనొ నిల్పి
నతని స్తవమును రుచియించు నతఁడుఁ గవియె?

టీ. ఆదిమశాబ్దికుడ్=శబ్దశాస్త్రవేత్తలలో ప్రథముఁడైనవానిని (ఆదిశేషుని), అడుగువఱిచి=అలక్ష్యముచేసి (పడకచేసికొని), కళానిధిని = విద్యాసముద్రుని (చంద్రుని), ముఖమునన=మాటచేతనే (ముఖముచేతనే) విముఖునిఁజేసి=ముఖ ముచూపనివానిఁగాఁ జేసి (అవమానపఱచి).

విశ్వావసుః.—విశ్వావసువు —

గ॥ కి మేభిః శ్లేషైకావలంబనై ర్దోషై రముం దేవ మాశ్రితేషు జనేషు ఖల్వాపత్యూహ స్సరస్వతీప్రవాహో విజయతే॥ 432

టీ. శ్లేషఏక అవలంబనైః=శ్లేషయందే ముఖ్యమైనపట్టుగలవియగు, అప్ర తూహ్యాః=నిరాటంకమైన.

వ. ఈశ్లేషాశ్లేషమైన దోషోద్ఘోషము చేత నే తద్దేవత నాశ్రయిం
చిన జనసముదయ విషయమున సయిత మాసరస్వతీప్రవాహ
ము ప్రత్యూహరహితమైజయావహమై యున్నయదియకదా?

పశ్య.—చూడుము.—

వృ॥ కల్పంతే కామరామాస్ఫురదధరసుధాగర్వసర్వస్వమోషో
ద్యుక్తాన్యుక్తాన్యమీషాంరసికజనముదేధాతృయోషాహియేషాం
శ్లాఘావేలాసు దోలాయితనిజముకుటాకల్పకల్పద్రుసూనో
డ్డీనాలిధ్వానతానాకలనపరికనచ్చారువీణాభిగానా॥ 433

అ. ధాతృయోషా=సరస్వతీదేవి, యేషాం=ఎవరియొక్క, శ్లాఘావేలాసు= కొనియాటవేళలందు, దోలాయిత నిజముకుట-ఆకల్ప కల్పద్రుసూన ఉడ్డీనాలి ధ్వానతాన ఆకలన పరికనత్ చారువీణా అభిగానా= చలించుచున్న తనకిరీట మందలి భూషణములైన కల్పవృక్షపుష్పములనుండి ఎగురుచున్న తుమ్మెదల యొక్క ధ్వనియనెడి శ్రుతివిశేషముతోడి కూడికచేత వృద్ధియగుచు సొగసైన వీణాగానము గలదో; తేషాం=అట్టి, అమీషాం=ఈరంగేశ్వరాశ్రితులయొక్క, కామరామాస్ఫుర దధరసుధా గర్వసర్వస్వమోష ఉద్యుక్తాని=మన్మథ భార్యయైనరతీదేవియొక్క ప్రకాశించునట్టి పెదవియందలి అమృతరసముయొక్క గర్వమనెడి సర్వధనముయొక్క దొంగిలించుటయందు సిద్ధమైనవియైన, ఉక్తాని=వచనములు, రసికజనముదే=రసికుల సమూహముయొక్క సంతోషమునకై, కల్పంతేహి=కల్పించుచున్నవి కదా?

తా. సరస్వతీదేవి తన్ను కొనియాడునపుడు తనకిరీటములోని కల్పవృక్షపుష్పములలోనుండి ఎగిరెడి భృంగములతానధ్వనితోఁ గూడినవీణాగానము గలదిగానుండునో; అట్టి ఈరంగేశ్వరునియాశ్రితులైనవారి వాక్కులు రసికులకుసంతోషము[illegible]న్నయవి.

తే. అమృతమధురము లీదేవతాశ్రితోక్త
ములు సదా సదావళికిఁ బ్రమోదప్రదము
లగును వాణీ సువేణీ సుమను గతమధుప
గానతానప్రవీణ వీణానుగములు.

టి. వాణీసువేణీ సుమగత మధుపగానతాన ప్రవీణవీణా-అనుగములు= సరస్వతీదేవియొక్క చక్కనిజడయందలి పూలలోనుండు తుమ్మెదలగానశ్రుతుల యందు సమర్థమైనవీణెతోఁ గూడినవి.

గ॥ కించి దుత్తరతో దృష్టిమాధాయ సాంజలి బంధమ్॥ 434

వ. కొంచెము దక్కు దిక్కునకుదృష్టి మఱలించి యంజలిబంధించి.

వృ॥ క్షేమారమ్భనిదాన మాప్లవజుషాం హేమాభిరామామ్బుజ
స్తోమాయాతమరన్దతున్దిలపయోభూమా స్వభూమానితా
సహ్యాద్రిప్రభవాసమానవిభవా మహ్యంమమహ్యార్తిహృత్
పుహ్యాయోగివరేణ్యపుణ్యసరసీ ద్రుహ్యాదసహ్యంహసే॥ 435

అ. ఆప్లవజుషాం=నీటమునుఁగఁ గోరినవారికి, క్షేమారంభనిదానం=క్షేమములను మొదలుపెట్టుటలో ముఖ్యకారణమును, హేమ-అభిరామాంబుజస్తోమ ఆయాతమరంద తుందిల-పయోభూమా = బంగారువలె-సుందరమైన-తామరలసమూహమునుండి-జారిన తేనియలచేత-నిండిన - జలాతిశయముగలదియును, స్వభూ-మానితా = బ్రహ్మచేత-సన్మానింపఁబడినదియును, సహ్యాద్రిప్రభవా-సమానవిభవా=కావేరినదితో-సమానమైనమహిమ గలదియును, మహ్యం=భూమియందు, ఆర్తిహృత్=దుఃఖములను హరించునదియునై, పుహ్యా=పుహ్యాఅనెడి, యోగివరేణ్యా పుణ్యసరసీ=యోగులకు వరింపఁదగిన పావనమగు సరస్సు, మమ=నాయొక్క, అసహ్య-అంహసే = సహింపశక్యముకాని-పాపమునకై, ద్రుహ్యాత్ హి=ద్రోహపఱచునుగదా ?

తా. స్నానముచేయువారికి నేమముగా బంగారుతామరలతేనెలతోడిజలము గలిగి, బ్రహ్మచే ... పాపములను హరిం

చుచు, సకలయోగుల్లకును గోరందగిన యీపుష్యాసరస్సు నాసర్వదోషము లనర్థ అపహరించునుగదా?

తే. స్నాతలకు సేమ మలరించు * శాతకుంభ
కమల కమనీయపానీయ * గణ్యపుణ్య
సరసి యరసిన సహ్యాజ * సరి? యసహ్య
దురితహతిగ్రాహ్య పుష్య యా * ద్రుహిణప్రణుతి.

టి. శాతకుంభకమల=బంగారుతామరలచేత, ద్రుహిణ=బ్రహ్మచేత.

గ॥ ఇతివిమానం దక్షిణతః ప్రస్థాప్య సాదరమక్షీ నిక్షిప్య ప్రాంజలి ర్భూత్వా॥ 436

వ. అని విమానంబును దక్కినపుందిక్కునకుం బఱపి సాదరపు దృష్టిని సారించి సాంజలిబంధుఁడనై.

అష్టభుజస్వామివర్ణనము.

అష్టభుజస్వామి.-(వీరు, రాక్షసులప్రార్థనచే ఈశ్వరుఁడు అష్టపాదములతో శరభమూర్తియై యిక్కడి హస్తిగిరిబిలమందలి నృసింహస్వామిపై రాఁగా, తాము అష్టభుజములతో శంఖచక్రగదాఖడ్గధనుర్బాణపాశములు ధరించి అతనితో యుద్ధముచేసి జయించి అతనిని అక్కడనే బ్రహ్మయాగసంరక్షణార్థమై నిలిపి తాము నక్కడనే నివసించియున్నవారు.

వృ॥ విశ్వాహ్లాదకరీం కరీంద్రసరసీ కల్హారపారంపరీ
భవ్యామోదధురంధరానిలజడే ఽవ్యాలయే జాగ్రతీం
కష్టాపద్వినివర్తినీం ఘనతపః క్లిష్టాత్మనాం యోగినా
మిష్టా మష్టభుజాం భజామి విబుధై రాసేవితాం దేవతామ్॥

అ. విశ్వ-ఆహ్లాదకరీం = ప్రపంచమునకు-సంతోషమునుజేయునదియు, కరీంద్రసరసీ-కల్హారపారంపరీ-భవ్యామోద-ధురంధర - అనిల-జడే = గజసరస్సునందలి-చెంగలువల పంక్తియొక్క-మనోహరమైన పరిమళముయొక్క-భార

వాహియైన-గాలిచేత-చల్లనైన, దివ్యాలయే = దేవాలయమందు, జాగ్రతీం= ప్రకాశించునదియును, కష్ట-ఆపత్-వినివర్తినీం = కష్టములైన-ఆపదలను-పోఁగొట్టునదియును, ఘనతపః-క్లిష్ట-ఆత్మనాం = గొప్పతపస్సుచేత-కష్టపడెడు-మనస్సుగలవారైన, యోగినాం=యోగీశ్వరులకు, ఇష్టం=కోరఁబడినదియు, విబుధైః=దేవతలచేత, ఆసేవితాం=సేవింపఁబడునట్టిదియునైన, అష్టభుజాం= అష్టభుజస్వామియనెడు, దేవతాం=దేవుని, భజామి=సేవించుచున్నాను.

తా. లోకమునకు సంతోషమునిచ్చుచు, కష్టములను దీర్చుచు, యోగీశ్వరులకు కోరఁబడునతఁడై అక్కడిసరస్సున చెంగల్వలపరిమళముగల దేవాలయమందు దేవతలారాధించునతఁడైన అష్టభుజస్వామిని సేవించుచున్నాఁడను.

మ. జగదాహ్లాదకరుఙ్ గరీంద్రసరసీ కంజాగ్రతస్సరోజాతజా
తగతామోదధురంధరుఙ్ జితతపస్త్రస్తార్తిత్రిప్తాసరుఙ్
ప్రగతక్లేశసమూహమోహితబుధప్రత్యక్షరక్షాకరుఙ్
భగవంతుఙ్ భజియింతుమష్టభుజుగీర్వాణేడ్యుఁదార్క్ష్యధ్వజున్.

టి. ప్రగత-క్లేశసమూహ-మోహిత-బుధ-ప్రత్యక్ష-రక్షాకరుఙ్ = మిక్కిలికలిగిన-కష్టసమూహములచేత - మైమఱచిన-జ్ఞానులకు - ఎదుటనె - రక్షణముచేయువాఁడును, గీర్వాణ-ఈడ్యుఙ్ =దేవతలచే-కనందగిన.

గ॥ అథప్రతీచ్యాందిశి కించిదంతరంవిమానమానీయ సహర్షమ్॥

వ. అటుపిమ్మటఁ బడమటఁ గొంతయంతరము విమాన మానయించి హర్షించి.

దీపప్రకాశస్వామివర్ణనము.

దీపప్రకాశస్వామి—(వీరు బ్రహ్మదేవునియజ్ఞమునుండి ఆశార్ఙ్గపాణిస్వామిచేఁ దఱుమఁబడివచ్చి యిక్కడి హస్తిగిరిబిలమందు డాఁగఁబోయి అందలి నరసింహస్వామిచేతను తఱుమఁబడిపోయి శ్రీశైలమునమల్లికార్జునేశ్వరునివేఁడుకొనఁగా,అతఁడష్టపాదశరభావతారములో ఇక్కడికి వచ్చితనతో మోగుణమాయాంధకారములో అయుజ్ఞగుండమును ముంచుకోఁగా అప్పు డాబ్రహ్మచేఁ బ్రార్థిం-

పఁబడిన నారాయణమూర్తి తనతేజోతిశయములో దీపజ్యోతివలె ప్రకాశించుచు ఆయంధకారమును బోఁగొట్టినవారు.)

శ్లో॥ త్రిదశాకలితస్నేహ స్ఫూర్తిమాన్ శమయం స్తమః
భాతి దీపప్రకాశోఽత్ర శరణాగత బోధకృత్॥ 439

అ. త్రిదశాకలితస్నేహస్ఫూర్తిమాన్-త్రిదశా=మూడువత్తులతో, కలిత=కూడుకొన్న, స్నేహ=నూనెచేత, స్ఫూర్తిమాన్=నిండికగలదియు;(త్రిదశ=దేవతలయందు, ఆకలిత=కూడుకొన్న, స్నేహ=ప్రేమయొక్క, స్ఫూర్తిమాన్=నిండికగలవాఁడును) తమః=చీఁకటిని (అజ్ఞానమును), శమయన్=పోఁగొట్టుచు, శరణాగతబోధకృత్—శరణ=ఇంటికి, ఆగత=వచ్చినవారికి, బోధకృత్=ప్రకాశమునుచేయునదియునైన; (శరణ=రక్షణమునకై, ఆగత=వచ్చినవారికి, బోధకృత్=జ్ఞానమునిచ్చువాఁడునైన;) దీపప్రకాశః = దీపముయొక్కప్రకాశము (దీపప్రకాశస్వామి) అత్ర=ఇక్కడ, భాతి=ప్రసిద్ధపడుచున్నది (ప్రసిద్ధపడుచున్నవాఁడు).

తా. మూఁడువత్తులతో నిండునూనెతోను ప్రకాశించుచు, చీఁకటిని తొలఁగించి, యింటికివచ్చినవారికి తెలియఁబఱచు దీపప్రకాశమువలె, దేవతలయందు ప్రేమకలిగి, అజ్ఞానము తొలఁగి శరణాగతులైనవారికి జ్ఞానము కలిగించు దీపప్రకాశస్వామి ప్రసిద్ధపడుచున్నయతఁడు.

క. త్రిదశాకలితస్నేహమ
సదృశానలితభువనాంధతమసంతమసహారం
బధిగమితాశ్రితబోధము
ముదమున దీపప్రకాశమూర్తి రహించున్.

టి. అసదృశ-అనలిత-భువన-అంధతమసహారంబు = సాటిలేనిదై-చుట్టుకోఁబడిన-లోకమందలి-కటికచీఁకటిని హరించునది.

కృశానుః.—కృశానుఁడు.—

శ్లో॥ దీపప్రకాశసంజ్ఞా ... ... ...

రాత్రిచరప్రతికూలే నదీపజాతోల్లసద్రుచౌ నార్హా॥ 440

అ. ఉత్తమ-స్ఫురణే= పైకిలేచిన అంధకారముయొక్క (లేచిపోయిన అజ్ఞానముయొక్క మేలైన) - విజృంభణము కలవాఁడును, రాత్రిచర-ప్రతికూలే=రాత్రిలోతిరుగువారికి - (రాక్షసులకు) - ప్రతికూలుఁడును, న-దీప-జాత-ఉల్లసత్-రుచౌ = దీపమునుండి-పుట్టిన-ప్రకాశించు-కాంతులు కలవాఁడు కానివాఁడు-(నదీపజాతా-ఉల్లసద్రుచౌ = నదీపతియైన సముద్రుపుత్రియగు లక్ష్మీదేవియందు-అతిశయించు ప్రేమగలవాఁడునైన), అస్మిన్ దేవే=ఈదేవునియందు, దీపప్రకాశసంజ్ఞా=దీపప్రకాశకసంజ్ఞ, నఅర్హా=తగినదికాదు, (నార్హా?=తగినదికాదా?)

తా. ఉత్తమప్రకాశముకలిగియు, అంధకార మతిశయించి; రాత్రిలోతిరుగువారికిని ప్రతిగోపురద్వారమువంటివాఁడయ్యు రాక్షసులకు ప్రతికూలుఁడై; సర్వైశ్వర్యసంపన్నురాలైనలక్ష్మికి ప్రియుఁడయ్యు, దీపమువలన నైనప్రకాశములేని యీతనియందు దీపప్రకాశులనెడిపే రెట్లుతగును?(తగదా?)

తే. చనున? దీపప్రకాశసంజ్ఞను దలంప
నీదృశోత్తముఁడై యనన్యాదృశోక్త
గుణత రాత్రిచరప్రతికూలుఁడైన
దీపజోచితరుచి యైన దేవునందు.

టి. నదీపజోచితరుచి=దీపమువలన కలిగినవై యుక్తములైన కాంతులు కలవాఁడు కానివాఁడు—నదీపతిజాతయైన లక్ష్మియందు యుక్తాపేక్ష కలవాఁడు.

విశ్వావసుః.— విశ్వావసువు —

గ॥ మందమతే మైనంభాణీః॥ 441

వ. ఓమందమతీ! నీ వీచంద మనువదింపకుము ?

వృ॥ ప్రకటితదశావతారే ప్రచురాజ్యాకలనభావితస్ఫురణే
దీపప్రకాశనామ క్షమం విభావస్యదితభీతిహారే॥ 442

అ. ప్రకటిత-దశా-అవతారే=ప్రసిద్ధములైన-వత్తికలుగుట—దశ-

అవతారే=దశావతారములుకలవాఁడై,పరిచర-అజ్య-ఆకలన-భావిత-స్ఫురణే=పరిబలమైన-నేతియొక్క—(ఆజీ=యుద్ధముయొక్క) కూడికచేత - నిశ్చయింపఁబడిన - ప్రశస్తికలవాడై-విభావరి-ఉదిత-భీతిహారే = రాత్రివలన — (విభా) అరి=శత్రులవలన-పుట్టిన-భయమునుపోఁగొట్టువాఁడైన, విభౌ=స్వామియందు, దీపప్రకాశనామ=దీపప్రకాశుఁడను పేరు, క్షమం=సమర్థము.

తా. దశావతారములందును రాక్షసయుద్ధములందును ప్రసిద్ధపడి, శత్రుభయ మనునదియే లేకచేయుచును, మంచివత్తితోను మిక్కిలి నేతితోను ప్రకాశించి చీఁకటిభయమే లేకచేయు నీస్వామియందు ఆదీపప్రకాశుఁడనెడి పేరు సమర్థమైనదే.

క. సుదశావతరణకరణము
విదితాజ్యావిష్కరణసువిస్ఫురణము రా
త్ర్యుదితభయోద్ధరణ మగుట
సదమలదీపప్రకాశ సంజ్ఞ యుఁ జనదో?

టి. సుదశావతరణకరణము=మంచివత్తులు కలిగియుండుటను కారణమును-మంచి దశావతారములు చేయుటయును, విదితాజ్యావిష్కరణ సువిస్ఫురణము=ప్రసిద్ధమైన నేయికలుగుటచేత ప్రకాశించుటయు-యుద్ధములు కలుగుటయందు ప్రతాపించుటయు, రాత్ర్యుదితభయోద్ధరణము=రాత్రులయందు కలిగిన—రాత్రులందు తిరుగఁ బుట్టిన రాక్షసులవలని భయమును బోఁగొట్టుటయును, అగుటన్=కలుగుటచేత.

## వేదాంతదేశికవర్ణనము.

వేదాంతదేశికులు—వీరు కాంచీపురంబున తూప్పిల్కుడియందు వడమకులంబున పుండరీకదీక్షితపౌత్రుండును, తోతారాంబానంతార్యవర్యపుత్రుండును, శ్రీమద్వేంకటేశఘంటాంశసంభూతుండు నైనందున వేంకటేశాభిధానుండునై, స్వమాతులుండైన కిడాంబిఅప్పిళ్లె గార్లవలన పంచసంస్కారము లభించి, వారివలననే కాలాదపాతికీయం శాలంబులాది శాస్త్రములును చతుస్సహస్ర

ద్రావిడప్రబంధ తద్వ్యాఖ్యానములును, వేదాంతరహస్య వైశ్వదేవక్రమాది వేదాంతవిద్యలునుఁ లభించి ; శ్రీహయగ్రీవ శ్రీరంగరాజ శ్రీపాణియోగీంద్రులే తిరువారాధనమై, ఆహయగ్రీవోపాసనములోను వైనతేయసాక్షాత్కారములోను ఘటికాసహస్రకవనోన్ముఖుండై, తూప్పిల్పిళ్లై, వేంకటాచార్య, వేంకటనాథ, వేదాంతాచార్య, వేదాంతదేశికులు అనునామాంతరములును, కవితార్కికకంఠీరవ, కవివాదిగజకంఠీరవ, భగవద్రామానుజసిద్ధాంతనిర్ధారణసార్వభౌములు అనుబిరుదనామములును గలిగి, కోవిల, పెరుమాళ్ కోవిల, తిరుమల, తిరునారాయణపుర, పురుషోత్తమాది దివ్యదేశములను సేవించుచు, స్వసేవనోపేతచేతనోజ్జీవనచేతస్కుండునై యుండిరి.

వీరిస్వమతస్థశిష్యులు—కుమారానయనాచార్య, కిడాంబినయనాచార్య, బ్రహ్మతంత్రజీయర్, ప్రభాకరజీయర్, వేదాంతాచార్యభట్టారక, ఎళియభట్టారక, కందాడఎంబార్, తిరుమలనల్లాన్లు మొదలైనవార్లు. మఱి అన్యమతస్థులుగానుండి స్వమతస్థులైన శిష్యులు—అద్వైతసార్వభౌమ, విద్వజ్జనసార్వభౌమ, కాశీవాగీశ్వరభట్టారక, సోమేశ్వరభట్టారకులు మొదలైనవార్లు.

వీరు విరచించినగ్రంథములు—గీతాప్రబంధ, అభయప్రదాన, రహస్యత్రయ, ద్రవిడోపనిషత్సారములును; అధికరణసారావళియు ; తత్త్వత్రయ, కంతుక, ఘటికా, పరిహాసగాథలును; స్తోత్ర, చతుశ్శ్లోకీ, గద్యత్రయ, మీమాంసాభాష్యములును ; తత్త్వ, రహస్యములపదవీ, మాతృకలును; తత్త్వదీపికా, విషయవాక్యదీపికలును; మఱితత్త్వ, రహస్యముల నవనీత, రత్నావళులును ; రత్నావళీహృదయమును ; తత్త్వత్రయ, రహస్యత్రయచుళుకములును; న్యాయ, హరిదిన తిలకములును ; గీతార్థసంగ్రహ, సచ్చరిత్రసంగ్రహ, పాంచరాత్ర, రహస్యరక్షలును ; ప్రణవాకృతి, పుణ్యకో, ట్యానందనిలయ విమానవైభవములును; అంజలివైభవమును ; ఆదినాథ, జగన్నాథ, వేంకటేశ, దీపప్రకాశ, లక్ష్మీనృసింహ, శ్రీరంగరాజస్తవములును, అభీతి, మతిస్తవములును ; పరమార్థ, దేహళీశ, గోదా, శ్రీస్తుతులును; వేంకటేశప్రపత్తియు; దశావతార హయగ్రీవస్తోత్రములును; అష్టభుజ, నృసింహ, సుదర్శనాష్టకములును; అచ్యు

త, దయా, శరణాగతి, సంప్రదానశతకములును; వ్యూహపంచక, న్యాసదశక ములును; న్యాస, గోపాలవింశతులును; వరదరాజ, గరుడపంచాశతులును; యతిరాజసప్తతియు, పాదుకాసహస్ర, మీమాంసాపాదుకలును ; న్యాయ, సంప్రదాయ పరిశుద్ధులును ; సర్వార్థసిద్ధియు; భగవద్ధ్యానసోపాన, పరమపదసోపానములును ; వాక్యత్రయవివరణ, నిగమ పరిమళ, ఉపకారసంగ్రహ, విరోధిపరిహార, సారాసార, సారసంక్షేపరహస్య, న్యాయసిద్ధాంజనములును; మఱి కణ్ణినుణ్ శిరుత్తాంబువ్యాఖ్యాన, వేదార్థసారసంగ్రహవ్యాఖ్యానములును ; మఱియు దృష్టినిరసన, పరమతభంజన అద్వైతఖండనములును; మఱియు ననేకములును చేసి, అందఱనుక్ పఠనపాఠనములచే ప్రహర్షపఱచుచుండినవారు.

గీ॥ నిరూప్యసానందమ్॥ 443

వ. అటు నిరూపించి యానందించి.

వృ॥ శ్రీరంగేశ్వరశాసనా దధిగత శ్రుత్యంచలాచార్యకమ్
దాంతం యం కవివాదిదంతిహరి రిత్యార్యా వదంతి క్షితౌ
సర్వస్యామపి హంత తర్కసరణౌ స్వాతంత్ర్యమాసేదుషామ్
సుత్రామా సహి వేంకటేశకవిరా డత్రావిరాసీ ద్గురుః॥444

అ. శ్రీరంగేశ్వర శాసనాత్ = శ్రీరంగనాథునియాజ్ఞవలన, అధిగత-శ్రుత్యంచల-ఆచార్యకం=అవలంబించిన-వేదాంత ఆచార్యులనెడి పేరుగలవారును, దాంతం=దాంతియనెడి జితేంద్రియత్వగుణము గలవారును, సర్వస్యాం=సకలమైన, తర్కసరణౌ=తర్కశాస్త్రమార్గమందు, స్వాంతంత్ర్యం=స్వతంత్రతను, ఆసేదుషామపి=పొందినవారికింగూడ,సుత్రామా=ఇంద్రునివంటివారును, యం=ఎవరిని, ఆర్యాః=పెద్దలు, కవివాదిదంతిహరిః=కవులును ప్రతివాదులు ననెడి ఏనుఁగులకు సింహము, ఇతి=అని, క్షితౌ=భూమియందు, వదంతి=చెప్పచున్నారో, సః=అట్టి, గురుః=గురువులైన, వేంకటేశకవిరాట్ = వేంకటేశులనెడి కవిరాజు, అత్ర=ఇక్కడ, ఆవిరాసీద్ధి=పుట్టిరికదా? హంత=ఆహా!

తా. శ్రీరంగనాథులవలన వేదాంతాచార్యులనియు, శిష్టులచేత తర్కశా

స్త్రవేత్తలలో ప్రధానులనియు కవివాదులనెడి గజములకు సింహమనియు, పేరు పొంది, ఆచార్యులైన యీ వేంకటేశులనెడి కవిరాజు ఈకాంచీపట్టణమందె అవతరించినవారు.

శా. దాంతుండుద్భవమైయిటన్ సకలసత్ తంత్రస్వతంత్రుండు, శ్రీ
కాంతుండున్ దను నర్హుఁడంచుజగతిన్ గాంక్షింపరక్షింపవే
దాంతాచార్యతయిన్ వహించెఁగవిరాట్ జైత్ర తార్కికుల్ వాదులన్
దంతీంద్రంబులకున్ మృగేంద్రమగుటన్ దాన్ వేంకటేశప్రథన్.

గ॥ జనా నుద్దిశ్య॥ 445

వ. జనుల నుద్దేశించి.

వృ॥ భేదాభిదా విషయవాదాపత ద్దురుపపాదార్థసాధకమదో
త్సాదావహాద్భుతమఖాదాపగా స్యదవినోదాభిజాతభణితిః
పాదారవిందనతఖేదాపనోద చతురోదారమాధవగుణా
స్వాదాభితుష్ట ఇహ మోదాయవోభవతు వేదాంతదేశికమణిః॥

అ. భేద...భణితిః—భేదఅభిదా=భేదాభేదములైన ద్వైతాద్వైతముల యొక్క, వాద=వాదమునకై, ఆపతత్=వచ్చుచున్న, దురుపపాదఅర్థ=చెప్పఁగూడనియర్థములను, సాధక=సాధించువారియొక్క, మదఉత్సాద=గర్వమును నివారించుటకే, ఆవహ=ప్రవహించుటచేత, అద్భుత=ఆశ్చర్యమైన, మఖాద ఆపగా=దేవనదియైన గంగానదియొక్క, స్యద=వేగమువలె, వినోద = విలాసములో, అభిజాత=పైకిలేచిన, భణితిః = వాక్యములుగలవారై, పాదా...తుష్టః-పాదారవింద = తనపాదపద్మములను, నత = ఆశ్రయించినవారియొక్క, ఖేద=కష్టములను, అపనోద=పోఁగొట్టుటయందు, చతుర=సమర్థమై,ఉదార= అతిశయించిన, మాధవగుణ ఆస్వాద=భగవద్గుణానుభవమందు, అభితుష్టః= సంతోషించినవారైన, వేదాంతదేశికమణిః = వేదాంతాచార్యులు, ఇహ = ఇక్కాంచీపట్టణమందు, వః=మీకు, మోదాయ=సంతోషమునకై, భవతు = అగుదురుగాక.

తా. ద్వైతాద్వైతవిషయవాదములలో దురుక్తార్థములు సాధించువారి గర్వమణఁచుకై గంగావేగము గలవాక్కులతోను, స్వాశ్రితులకష్టములను తొలఁచుకై సమర్థములైన భగవద్గుణముల యనుసంధానములతోను సంతోషించుచుండు ఆవేదాంతాచార్యులు మనలనుఁ సంతోషింపఁజేయుదురుగాక.

సీ. ద్వైత మద్వైత మా సాదించువిషయమై
నిందార్థములె యెప్డు నిర్ణయించు
వారలగర్వము ల్వారింప నద్భుతా
వహ మయి గంగాప్రవహమువిధము
వేగమై మధురమై వినుల మా వాగ్ధారఁ
బరఁగి, పాదాంబుజప్రణతిఁ జేయు
వారలదుఃఖము ల్వారింపఁగాఁ దానె
చాతుర్యమును గాంచి సంభ్రమించు

తే. మాధవాద్భుతగుణగణాస్వాదజనిత
మోదభూయిష్ఠమానసమునఁ జెలంగి
దేవమణిఁ బోని వేదాంతదేశికమణి
మీకు మాకును మోదంబు మీఱ నొసఁగు.

అపిచ.—మఱియు.—

వృ॥ నానామ్నాయపరిశ్రమం కలయతాంనాస్త్యేవశాస్త్రేషుధీః
సత్యోరప్యనయో స్తయో ర్నసులభా సాహ్యాకృతా సాహితీ
అప్యేతాను సతీషు నాస్తి వినయో నాచారభక్తిక్షమా
చాతుర్యస్సచసాచసాచసచతా శ్చాలంబ్యఖేలంత్యముమ్॥

అ. నానా ఆమ్నాయపరిశ్రిమం = నానావిధములైన వేదములయందు అధ్యయనాదికష్టమును, కలయతాం=కలిగించుకొనుచున్నవారికి, శాస్త్రేషు = శాస్త్రములందు, ధీః=జ్ఞానము, నాస్త్యేవ=లేనేలేదు; తయోః=ఆ, అనయోః= ఈవేదశాస్త్రభ్యాసములయందలి ధీవేదములు, సత్యోః=అవి = ఉండియును,

సా=ఆ, అక్షతా=చెడనిదైన, సాహితీ=సాహిత్యము,నసులభాహి=లభించునది కాదుకదా? ఏతాసు=ఇవి, సతీష్వపి=ఉండియు; వినయః=అణఁకువ,నాస్తి= లేదు; ఆచార-భక్తి-క్షమా-చాతుర్యః=సత్ప్రవర్తనము-భక్తి-క్షాంతి-చతురత్వమును,న=లేవు;సచసాచసాచసచతాశ్చ=అది అది అది ఆదియుఅదియును,అమూం=ఈవేదాంతాచార్యులను, ఆలంబ్య=అవలంబించి, ఖేలంతి=క్రీడించుచున్నవి.

తా. అనేకులు వేదవేత్తలయ్యును శాస్త్రజ్ఞులుకాకయు,వేదశాస్త్రఉభయజ్ఞులయ్యును సాహిత్యపరులు కాకయు, సాహిత్యముతోడను వేదశాస్త్రజ్ఞులయ్యును వినయాచార భక్తిక్షాంతి చాతురీగుణములు లేకయున్నారు. వీరో ఆగుణములన్నియుఁ గలిగి లోకోత్తరులై యున్నవారు.

అపిచ:—మఱియు.—

ఉ. జానుగ వేదవేదులకు శాస్త్రపరిశ్రమ యుండ, దుండినన్
గాన సమీహ సాహితియుఁ గల్గదు, కల్గిన సద్వినీతియో ?
మానుగ నుండ, దుండ వసమానసమాచరణానురాగభా
గానుపమక్షమా,క్షమతలన్నియు,నాగురునందుఁ గందమా
దానిని దాని దాని మఱిదానిని దానిని దాని దానినే.

టి. జానుగన్=మనోజ్ఞముగ, సమీహన్=మంచికోర్కెతో, సమాచరణము=సదాచారము, అనురాగభాగము=ప్రేమతోడిభక్తి, అనుపమక్షమ=సాటిలేనియోర్పు, క్షమత=సమర్థత. (పంచపాదియుత్పలమాలావృత్తము.)

## హయగ్రీవవర్ణనము.

తురగముఖదేవుఁడు—హయగ్రీవుఁడు-మధుకైటభ రాక్షసులు వేదములను అపహరించికొనిపోయి పాతాళమున అణఁచివేయఁగా, యోగనిద్రలోనుండిన విష్ణుమూర్తి బ్రహ్మప్రార్థనచే మేలుకొని మనుష్యశరీరముతో హయగ్రీవముతోను (గుఱ్ఱపుమొగముతోను) వచ్చి ఆవేదములను దెచ్చియిచ్చెను. మఱొకప్పుడు ఈవేదముల నపహరించుకొనిపోయి సముద్రములో దాఁచివేసిన సోమకాసురుని మత్స్యావతారమై సంహరించి ఆవేదముల దెచ్చి బ్రహ్మకిచ్చెను.

కిం బహునా.—విశేషమేల ?—

వృ॥ అర్వాంత మాస్యే త ముపాస్య దేవం
గర్వం తమోజం కుదృశాం ప్రశాంతమ్
కుర్వంత మేకం గురు మంత రేణ
గుర్వంతరం కోఽత్ర గుణీ వృణీతే॥ 448

అ. ఆస్యే=ముఖమందు, అర్వాంతం=అశ్వరూపుఁడైన, తం దేవం=ఆ హయగ్రీవస్వామిని, ఉపాస్య = సేవించి, కుదృశాం=కుదృష్టులైన దుర్వాదులయొక్క, తమోజం=అజ్ఞానమువలనఁ గలిగిన, గర్వం=గర్వమును, ప్రశాంతం=అణఁగినదానిఁగా, కుర్వంతం=చేయుచున్న, గురుం=వేదాంతాచార్యులను, ఏకం అంతరేణ=ఒకరినిదప్ప, గురు అంతరం=వేఱు ఆచార్యుని, గుణీ=గుణవంతుఁడు, కః=ఎవఁడు, అత్ర=ఇక్కడ, వృణీతే=అంగీకరించుచున్నాఁడు?

తా. హయగ్రీవోపాసకు లై దుర్వాదుల గర్వ మణఁచుచుండు నీవేదాంతాచార్యుల నేగాక, మఱి వేఱొకని గుణవంతుఁ డంగీకరింపఁడు.

తే. తురగముఖ దేవు సముపాస కే పరఁగఁ జేసి
కుత్సితుల తమోజపుగర్వ కే ముత్సహించి
తెరలిచిన గురు విడిచి వే కే ఱొరుని గురుని
గుణియు నగువాఁడు నేవాఁడు కే గొని వరించు.

కృశానుః.—కృశానువు.—

గ॥ వయస్య మాస్త్యేవం వద? య దేతత్పక్షావలంబనతః పక్షాంతర స్వీకార ఏవ వర ఇతి మే ప్రతిభాతి॥ 449

వ. చెలిమికాఁడా! పలుకకుమిట్లు ? అట్లు వేఱొరునిగ్గురుని వరియింపఁ గాదను మర్కటకిశోరన్యాయసిద్ధమైనపక్షం బవలంబించుటకంటె "కష్టంకర్మ" అని మార్జాలకిశోర న్యాయ సిద్ధమైనపక్షంబు నవలంబించుటయే మేలని తోఁచుచున్నయది.

టి. కోఁతి యెక్కడ ఎగురుచున్నను, దానిఁబట్టుకొని దానిపిల్లయే పాలు ౹త్రాఁగును. పిల్లి తనపిల్లను నాకుచునుండియే దానికిపాలిచ్చి పెంచుచుండును. ఇట్లు తల్లియే పిల్లకు పాలు౹త్రాగించునట్లు మనము భగవచ్ఛేషభూతులమై తద్ర క్షణమున నే యుండువారము.

తథాహి.—అది సరే.—

వృ॥ యస్మిన్ పక్షేఽస్తిమోక్షో గురుణి లఘునివా సాధనేఽప్య ౹ప్రయుక్తే। శ్లాఘాహేతుశ్శ్ర్రమార్థ వ్యయకరయజనాద్యగ్ర్య కర్మ౹ప్రహాణమ్ । తంహంతోపేక్ష్యపక్షం ౹శ్రయతి జగతి కః కామ్యవేదోక్తకర్మా। నుష్ఠానా వశ్యకత్వ౹ప్రకటనకఠినం వేద చూడార్యమార్గమ్॥ 450

అ. యస్మిన్ పక్షే=ఏపక్షమందు, గురుణి=మహత్తైనదిగాని, లఘునివా= అల్పమైనదిగాని, సాధనే=ఉపకరణమైనకర్మ, అప్రయుక్తేపి=౹ప్రయోగింపఁబ డనిదైనను; శ్లాఘాహేతుః=శ్లాఘించుటకు కారణమైన, మోక్షః=మోక్షము, అస్తి=కలదో; ౹శమ-అర్థవ్యయ-కర-యజనాది-అగ్ర్యకర్మ-౹ప్రహాణం = ఆయా సమును - ౹ద్రవ్యనాశమునున్ - చేయునట్టి - యజ్ఞాదులైన - ౹బ్రాహ్మణకర్మల యొక్క - పరిత్యాగముగలదైన, తం పక్షం=అట్టితెంగలవారిపక్షమును, ఉపే క్ష్య=విడిచి, కామ్య-వేదోక్త-కర్మ-అనుష్ఠాన - ఆవశ్యకత్వ-౹ప్రకటన-కఠినం= కామ్యములై, వేదోక్తములైన-యజ్ఞాదికర్మలను - అనుష్ఠించుటయే - ఆవశ్యక మగుటను - ౹ప్రకటించుటయందు - దుష్కరమైన, వేదచూడార్య - మార్గం=వే దాంతాచార్యులయొక్క-పక్షమును, జగతి=లోకమందు, కః=ఎవఁడు, ౹శ్ర యతి=ఆ౹శయించుచున్నాఁడు? హంత=అయ్యో!

తా. తాను తెంగలపక్షమున ముముక్షులై అల్పానల్పములైన మోక్షసాధన ములలో నేదియైనఁ జేయకయే, యజ్ఞాదికర్మలను గూడ విడిచి; కామ్యకర్మల ననుష్ఠించుటే ఆవశ్యకమని ౹ప్రకటించు వీరివడగలపక్షమవలంబించువాఁడెవఁడు?

శ్లా. ఏ దానిం గొని మోక్షము మొదుఁ బురుషుంకేడేసాధనంబేసి యా

పాదింపంబడ కట్టెపతకమునకుం జెబత్యాంతరం బెక్కడే?
వేదోక్తంబదియైనఁ గామ్యమగుటన్ వేదాంతవర్యాగ్ర్యమా
ర్గాధీనం బగుకష్టకర్మమెవఁ డీహం జేయు,నూహింపుమా?

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ నిరూపణనిపుణోఽపిభవాన్ కథమేవం కథయతి॥ 451

వ. కృశానూ! నీవు నిరూపించు నిమిత్తమున నిపుణుఁడవే యైనను; ఎటుల నీ వీవేదాంతదేశికుల గుఱించి నుతించుచున్నావు?

వృ॥ వేదాంతార్థవిశోధితం హితపథం వ్యాధూయసాధూచితమ్
చాపల్యాదనురుంధతే తదితరం పంథాన మంధానరాః
ఇష్టం భక్షయ కాంతయాచవిహరే త్యేవం ప్రియాలాపినమ్
రోగార్తాశ్చపలాస్తువంతి నతు తం యఃపథ్యవాదీభిషక్॥

అ. అంధాః=తెలివిలేక గ్రుడ్డివారైన, నరాః=మనుష్యులు, సాధూచితం=సత్పురుషులకు యోగ్యమై, వేదాంతార్థవిశోధితం=వేదాంతార్థములందు పరిశోధింపఁబడిన, హితపథం = హితమైనమార్గమును, వ్యాధూయ = విడిచి, చాపల్యాత్ =చపలగుణముచేత, తత్ ఇతరం=దానికంటె వేఱైన, పంథానం=మార్గమును, అనురుంధతే=అనుసరించుచున్నారు. చపలాః=చంచలగుణముగలవారై, రోగార్తాః=వ్యాధిచేత పీడితులైనవారు, ఇష్టం=ఇష్టమైనదానిని, భక్షయ=భక్షించుము? కాంతయాచ=స్త్రీతోఁగూడ, విహర=విహరించుము? ఇతిఏవం=అనియిట్లు, ప్రియఆలాపినం=ప్రియములాడువానిని, స్తువంతి=పొగడుచున్నారు. యః=ఎవఁడు, పథ్యవాదీ=పథ్యమునే చెప్పునట్టివాఁడైన, భిషక్=వైద్యుఁడో? తంతు=వానినో, నస్తువంతి=పొగడరు.

తా. వ్యాధిగ్రస్తులు చపలగుణముగలిగి, కావలసినది తిను? కాంతతోవిహరించు? అని చెప్పెడువానిని పొగడుకొనుచు, అదివద్దు ఇదివద్దు అని పథ్యముండుమని చెప్పెడు వైద్యునైన, పొగడుకొనరు. అట్లే తెలివిలేనివారు వేదాం-

తార్థములం దేర్పఱుపఁబడిన సన్మార్గము వదిలి, చపలగుణములతో వేఱుమార్గము నవలంబించుచున్నారు.

తే. వేదచూడార్థశోధితా కె వితథపథము
విడిచి పరకీయపథమునె కె పడయువారు
కోరినవె కొను? మెనయుము కె దార ననెడు
వైద్యునకె కూర్తు, కూర్తురె ? కె వైద్యు నితరు.

కించ.— మఱియు.—

వృ॥ ఆమ్నాయమాళిగురుణా కరుణాకరేణ
నావాతరిష్యత యదీహ భవాబ్ధినావా
అజ్ఞాతభక్తి జగదశ్రుతసచ్చరిత్రమ్
అజ్ఞాతశాస్త్ర మభవిష్య దవైదికంచ॥ 453

అ. భవాబ్ధినావా=సంసారసముద్రమునకు ఓడవంటివారై, కరుణాకరేణ= దయానిధియైన, ఆమ్నాయమాళిగురుణా=వేదాంతాచార్యులచేత, ఇహ=ఈలోకమందు, నఅవాతరిష్యత యది=అవతరింపఁబడఁగలది యైనయెడల; జగత్= ఈలోకము, అజ్ఞాతభక్తి=తెలియఁబడనిభక్తిగలదియును, అశ్రుతసచ్చరిత్రం= వినఁబడని మంచినడవడిగలదియు, అజ్ఞాతశాస్త్రం=తెలియఁబడని శాస్త్రము కలదియు, అవైదికంచ=వైదిక కర్మాచరణము లేనిదియునుగా, అభవిష్యత్= కాఁగలదు.

తా. కరుణానిధియై సంసారసముద్రమును తరింపఁజేయు నీవేదాంతాచార్యులే యీలోకమం దవతరింపకపోయిరేని, యీలోకమే భక్తిహీనమై సత్ప్రవర్తనము శాస్త్రజ్ఞానము వైదికచింతయును లేనిదై పోవును.

తే. అవనిశ్రుతిశిరోగురుఁ డిటు కె లవతరింపఁ
డామెనేఁ శ్రుతి శ్రుతసంప్రదాయభక్తు
లలవరించుట జగమున కె కకట యెటు ? భ
వాంబుధి తరించుట ... లేకె ...

పునరాలోచ్య.—మఱల నాలోచించి.—

గ॥ అస్ఖలితనిగమమహాళిగురో రశేషవిద్యాసముద్ర తల స్పర్శి
త్వా దధునాతనవిబుధవ్యూహసమభివ్యాహారో నోచితః॥ 454

వ. ఈ వేదాంత దేశికు లను వీరికిఁ గల యశేషవిద్యా విశేష
సముద్రమందలి తలస్పర్శిత్వమువలన నిప్పటిశిష్టసమష్టితో
సమముగఁ జేర్చి చెప్పుట యొప్పియుండదు కదా ?

కించ.—మఱియు.—

శ్లో॥ నిశమయతి యః కిల దృశా
నిశామయత్యంఘ్రిణాచ యో విశ్వమ్
గజతురగౌచ ముఖే యౌ తై
స్సహ వేదాంతదేశికో గణ్యః॥ 455

అ. యః=ఎవఁడు, దృశా=కంటిచేత, విశ్వం=ప్రపంచమును, నిశమయతి=
వినుచున్నాఁడో; యః=ఎవఁడు, అంఘ్రిణాచ=కాలితోను, నిశామయతి=చూ
చుచున్నాఁడో; యౌ=ఎవరు, ముఖే=మొగమందు, గజతురగౌచ = ఏనుఁగు
గుఱ్ఱములునున్నవో; తైస్సహ=వారితోఁగూడ, వేదాంతదేశికః=వేదాంతాచా
ర్యులు, గణ్యః=ఎంచఁదగినవారు.

తా. కన్నులే చెవులుగాఁగల ఆదిశేషునితోను, కాలను గన్నుగల గౌత
మునితోను, ఏనుఁగుమొగమె తనమొగముగాఁ గల విఘ్నేశ్వరునితోను, గుఱ్ఱ
ముమొగమె తనమొగముగాఁ గల హయగ్రీవునితోను సమముగా ఈవేదాంతా
చార్యులు నెన్నఁదగియున్నవారు.

క. కనుఁగొనలను వినునతఁ, డడు
గునఁ గనుఁగొనిమెదునతఁడును కి గుఱ్ఱపుమొగముం
గన నేనుఁగుమొగముం గలి
గినవారును బోల వీరు సమ రేవలు దగునే?

టి. ఇట వీరితో పోలెడివారు వరుసగ శేషగౌతమహయగ్రీవగజాననులు.

దృశా నిశమయతి=కంటితో వినుచున్నవాఁడు.—

ఆదిశేషుఁడు— ఇతఁడు కద్రూకశ్యప బ్రహ్మల ప్రథమపుత్రుఁడై అనేక దివ్యక్షేత్రములందు తపస్సుచేసి బ్రహ్మను బ్రార్థించి అతనిచే అతిశక్తినిపొంది వేయిపడిగలతో భూభారమును వహించుచు గరుడుని స్నేహించుచు విష్ణువునకు శయనాసనాది రూపములతో పరిషద్గణప్రధానుఁడై చతుశ్శ్రీవసులైన సకల విధసర్పములకును రాజాధిరాజై యుండునతఁడు.

అంఘ్రిణా నిశామయతి=కాలితోచూచుచున్నవాఁడు.—

గౌతమర్షి— 52 వృత్తముక్రింద చూడుము?

ముఖేగజః=మొగమందు ఏనుఁగుమొగమురూపము కలవాఁడు.—

విఘ్నేశ్వరుఁడు— ఇతఁడు పార్వతీశ్వరుల ప్రథమపుత్రుఁడై తన్ను కొలుచువారికి విఘ్నములు కలుగకుండఁజేయుచు, దక్షయజ్ఞధ్వంసమున తనతమ్ముఁడైన వీరభద్రునిచేత తనతల నఱకఁబడి, ఈశ్వరునియాజ్ఞచేత ఏనుఁగుతల నంటించి బ్రతికింపఁబడి ; గజముఖుఁడు, ఏకదంతుఁడు, విఘ్నేశ్వరుఁడు, వినాయకుఁడు, లంబోదరుఁడు, హేరంబుఁడు, మోదుకహస్తుఁడు, మూషకవాహనుఁడు అను నిట్టిపేళ్ళతో ప్రచురపడుచు; కుమారస్వామికి అన్నయై తండ్రికి ప్రమథగణప్రధానుఁడై యున్నయతఁడు.

ముఖేతురగః— మొగమందు గుఱ్ఱముమొగమురూపము కలవాఁడు.—

హయగ్రీవుఁడు— 405 వృత్తముక్రిందఁ జూడు?

విచింత్య.—ఆలోచించి.—

వృ॥ గంభీరశబ్దేన విశాలమోహా
దశాపిశాచగ్రహమోచనేన
ఘంటా హరే ర్వేంకటనాథరూపా
కల్యాణ ముల్లాసయతి శ్రుతీనామ్॥ 456

అ. హరేః=వేంకటేశ్వరునియొక్క, వేంకటనాథరూపా=వేదాంతాచార్యరూపమైన, ఘంటా=ఘంట, గంభీరశబ్దేన...నేన = విశే

షమైన-అజ్ఞానవశ అనెడు-పిశాచము పట్టుటను - విడువించునదియైన, గంభీర శబ్దేన=గంభీరమైన శబ్దముతో-వ్యాఖ్యారూపవాక్కులతో, శ్రుతీనాం = చెవులకు-వేదములకు, కల్యాణం=శుభమును-శుభార్థమును, ఉల్లాసయతి=ఉల్లసింపఁజేయుచున్నది.

తా. ఈవేదాంతాచార్యరూపమైన వేంకటనాథుని ఘంటాఘోషము పిశాచమునువలె అజ్ఞానమును బోఁగొట్టి, తన గంభీరమైనధ్వనిచేతవలె వ్యాఖ్యావాక్కుచేత చెవులకువలె వేదములకున్ ఉల్లాసము కలిగించుచున్నయది.

క. వేంకటనాథునిఘంటయె
వేంకటనాథార్యరూపవిపరిణతం బై
కొంకక మోహపిశాచభ
యంకరగంభీరశబ్దమై తగుశ్రుతులన్.

పునస్సచమత్కారమ్.—మఱల చమత్కారముతో.—

శ్లో॥ వేదాన్తాచార్యశబ్దోఽస్మిన్ వేదాంతస్థాపనేక్షమః
ఇమం వివేకం కుర్వంతో దాంతాచార్యంచ తం విదుః॥ 457

అ. అస్మిన్=ఈలోకమందు, వేదాంతాచార్యశబ్దః=వేదాంతాచార్య లను నామపదము, వేదాంతస్థాపనే = వేదాంతార్థములను స్థాపించుటయందు, క్షమః=సమర్థమైనది; ఇమం=ఈ, వివేకం=విచారమును (ఈపదమును, వివేకం=విడిచినవే అక్షరముకలదానిఁగా) కుర్వంతః=చేయువారు, తం=ఆవేదాంతాచార్యులను, దాంత ఆచార్యంచ - దాంత = ఇంద్రియ నిగ్రహము గలవారికి, ఆచార్యం=ఆచార్యునిగాను, విదుః=తెలిసికొనుచున్నారు.

తా. ఈవేదాంతాచార్య లనుతిరునామము వేదాంతార్థస్థాపకులని తెలిపించియు, వే అక్షరమును విడిపించుననెడి వివేకపదార్థమును దెలిసికొన్నవారు వారికిఁగల దాంతాచార్య లను బిరుదునామమునుగూడ తెలిసికొనుచున్నారు.

క. వేదాంతాచార్య లనన్
వేదాంతస్థాపనన్ వివేకము నిజమే

యీాదానర్థ వింత యవు సు
వే దాంతాచాఠ్యులన వి శ్రీ వేకముఁ దగుటన్.

టి. వివేకము=వివేచనాశక్తి-విశేషమైన 'వే' యనునక్షరముకలది యగు
ట, (2) విగతమైన'వే' యనునక్షరము కలదియగుటయు.

కృశానుః.—కృశానువు.—

గ॥ కథంనామ ద్రుహిణ గృహిణీ చికురనికురంబచుంబి చంపక కు
సుమసుకుమారతరాః కవికథకకంఠీరవ గురోర్గిరోఽపి దుస్త
రప్రస్తరోదర నిష్ఠురబహిష్ఠ సాసూయహృదయనిర్భేదాయ
జాయంతే॥ 458

వ. సరస్వతీసతీ చికుర నికరాంచత్కాంచనకుసుమ సుకుమార
తరంబులగు నీకవి కథక కంఠీరవగురువు భాషణంబు లాభీష
ణపాషాణోపమేయ సాసూయదుర్హృదయ హృదయనిర్భేద
నిర్భరప్రభవంబులు నగును.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సఖే! శ్రుణుతావత్॥

వ. చెలికాఁడా! వినుమా?

వృ॥ వేదాంతార్యగిరః ప్రసూనమృదవో మోదందధానాస్సతామ్
ప్రౌఢగ్రావకఠోరకాణ్యపి పరం భిందంతి హృంది ద్విషామ్।
నందాద్యార్యజనాభినందితమృదుస్పర్శోఽపి పాదో హరే
ర్దుర్భేదే శకటాసురేతు శతకోట్యాకారమాగాన్న కిమ్॥ 459

అ. ప్రసూనమృదవః=పూవులవలె మెత్తనివై, మోదం=సంతోషమును,
సతాం=సత్పురుషులకు, దధానాః=చేయునవియైన, వేదాంతార్యగిరః=వేదాం
తాచార్యవాక్కులు, ప్రౌఢగ్రావ-కఠోరకాణ్యపి=గొప్పరాలవలె-కఠినము లైన
వియును,ద్విషాం=విరుద్ధులయొక్క, హృంది=హృదయములను,పరం=మిక్కిలి,

భిందంతి=భేదించుచున్నవి; నందాది-ఆర్యజన-అభినందిత-మృదుస్పర్శః అపి=నందగోపులు మొదలైన-పూజ్యులైనవారిచేత-సంతోషింపఁబడినదై-మెత్తనైన సంస్పర్శనుకలదియైనను, హరేః పాదః=శ్రీకృష్ణునిపాదము, దుర్భేదే=భేదింప శక్యముకాని, శకటాసురేతు=శకటాసురునియందో, శతకోటి-ఆకారం=వజ్రాయుధముయొక్క-స్వరూపమును, నఅగాత్ కిం=పొందలేదా?

తా. నందగోపాదుల కానందకరమై అతిమృదువైన శ్రీబాలకృష్ణుని పాదము శకటాసురునివిషయమై వజ్రాయుధమువలె నైనట్లు; ఈవేదాంతాచార్యుల శ్రీసూక్తులు అతిమృదువులైనను, అతికఠినములైన గుండ్రాలవలె పరమతస్థులహృదయములను భేదించుచున్నవికదా?

మ. కవికంఠీరవగీర్వరాలు, మృదులశ్లాఖ్యాతప్రసూనోత్కరా
లవనిఁ దుష్టికరాలు, నిష్ఠురతరాశలైనఁ ద్విషద్ధృద్దృష
న్నివహోద్యద్భిదురాలురాజిలవె? శ్లోకించెఁ బాలకృష్ణాంఘ్రిప
ల్లవముల్ శైశవమందె తచ్ఛకటభృద్దత్రోదిభిద్వజ్ర మై.

టి. ద్విషత్-హృత్-ద్రుషత్ - నివహ-ఉద్యత్ - భిదురాలు=శత్రులయొక్క-హృదయములనెడి - గుండ్రాలయొక్క - సమూహమునకై - లేచుచున్న-వజ్రాయుధములైన.

గ॥ పున స్సప్రార్థన మంజలిం బద్ధ్వా॥ 460

వ. మఱలఁ బ్రార్థనాపూర్వకముగఁ బ్రాంజలియు బంధించి.

వృ॥ దర్పావిష్టకుదృష్టి దుష్టసమయోత్సాదాయ భేదాంకురో
ద్భేదాయ ప్రబలేకలావపి జయోత్పాదాయవేదాధ్వనః
శ్రీమల్లక్ష్మణ పక్ష రక్షక బుధామోదాయ పాపాటవీ
చ్ఛేదాయార్థిమరుత్తరుర్విజయతే వేదాంతవిద్యాగురుః॥461

అ. దర్ప-ఆవిష్ట-కుదృష్టి-దుష్ట-సమయ - ఉత్సాదాయ=గర్వముచేత-ఆవేశింపఁబడినవారైన - దురభిప్రాయములయొక్క - దుష్టమైన-నిష్కర్ష సిద్ధాంతమును-తొలఁగించుటకును, భేద-అంకుర-ఉద్భేదాయ=ద్వైతవాదముయొక్క-

ఆరంభమును-ఎత్తివేయుటకును, కలౌ=కలియుగము, ప్రబలేపి=ప్రబలమైయుండియు; వేదాధ్వనః=వేదమార్గమునకు, జయ-ఉత్పాదాయ=జయమును-కలిగించుటకును, శ్రీమల్-లక్ష్మణపక్ష-రక్షక-బుధ-ఆమోదాయ=సంపద్యుక్తమైన-రామానుజీయమతమునకు - స్థాపకులైన-సత్పురుషులను - సంతోషపఱచుటకును, పాప-అటవీ - ఛేదాయ=పాపములనెడి - అడవిని-ఛేదించుటకును, అర్థి-మరుత్తరుః=కోరువారికి-కల్పవృక్షమైన, వేదాంతవిద్యాగురుః=వేదాంతవిద్యాచార్యులు, విజయతే=జయోత్కృష్టు లగుచున్నారు.

తా. గర్వితులైన మతాంతరుల సిద్ధాంతములను, ద్వైతమతవాదములను, సకలదోషములనుఁ వారించుచు; వేదమార్గములకు విజయమును, విశిష్టాద్వైత రామానుజ మతస్థాపకులకు సంతోషమునుఁ కల్పవృక్షమువలె కలిగించుచు; ఈవేదాంతాచార్యులు సర్వోత్కృష్టులుగా నున్నవారు.

సీ. దర్ప మావేశించు దర్శనేతరులయు
  సముదయసమయము సమయఁజేయ
 భేద మా తద్ద్వయవాదివాదము సము
  ద్భేద మద్వయముగఁ బృథివిఁ జేయఁ
 గలియుగమందును గలయంగ నామ్నాయ
  పథమునకు జయంబు పదిలపఱుప
 రామానుజీయ మై రమణీయ మైనట్టి
  సత్సంప్రదాయము సఫలపఱుప
తే. ధర దురాపపాప వనులఁ ద్వర దహింప
 వినతజనతాభిలాష. లావిష్కరింప
 సారరాజమహీజము సరణి ధరణిఁ
 దేజరిల్లెను వేదాంతదేశికమణి.

ఇ. శ్రీమల్లక్ష్మణ పక్షము = శ్రీ రామానుజీయమతము — ఇది ద్వైతాద్వైతమతములకంటె విశిష్టమై విశిష్టాద్వైతమత మనఁబడును. (అనఁగా)

ఈలక్ష్మణమునిపక్షమున తెంగలవైష్ణవమతము-జాతిభేదము లేక, వీతరాగులై భగవద్విషయమున ప్రపత్తినిష్ఠులైన ప్రపన్నులు తమతమ ఆత్మయాత్ర ఈశ్వరాధీనమే, దేహయాత్ర కర్మాధీనమె అనియు నిశ్చయించుకొని, ఉపాయాంతరమువిడిచి, ఉపేయమైన భగవత్కైంకర్యములోనే అన్వయించుచు, బ్రహ్మసంహిత యైన ద్రావిడ వేదాధ్యయనములోను ద్వయానుసంధానములోను ఆచార్య నియమన ప్రకారము సదాచారముననే కాలక్షేపము చేయఁబడుచుండెడి విశిష్టాద్వైతమతము.

ఈవిశిష్టాద్వైతము.—నిత్యనిరవద్య నిరవయవ నిర్వికార అజడానందాణురూప జ్ఞానాశ్రయమై ఈశ్వరునకె శేషమై యుండునట్టి నిత్యముక్తబద్ధాత్మకమై ఆత్మవాచ్యమైనచిత్తును, సత్వసంపన్నమై నిత్యమై జ్ఞానానందమయమై కేవలము భగవదిచ్ఛామాత్రప్రకారమై యుండియు జడమై ప్రకృత్యాదిచతుర్వింశతితత్వమయమై మహదాదివికారములఁ గలిగించుచు శరీరరూపములై యుండునట్టి పంచభూతాత్మకమై అనాత్మవాచ్యమైన అచిత్తును, నిఖిలహేయప్రత్యనీకానంతజ్ఞానానందైక స్వరూపుఁడై కల్యాణగుణపరిపూర్ణుఁడై సృష్టిస్థితిలయకర్తయు భర్తయు భోక్తయు శ్రీభూనీళాధిపతియు పరవ్యూహవిభవాంతర్యామ్యర్చావతారుఁడునై పరమాత్మవాచ్యమైన ఈశ్వరుఁడును అనెడు త్రివిధములతో విశిష్టమైన అద్వైతము. ఇదియె-ఆళ్వారులు రామానుజులు మొదలైన పూర్వాచార్యుల సమ్మతమైన మతము.

## నృసింహస్వామివర్ణనము.

(నరహరిః=నరసింహస్వామి.—304 వ వృత్తముపైగ ఇతిహాసము.)

గ॥ ఇత్యన్యతో దృష్టిం విన్యస్య ప్రాంజలిస్సన్॥ 462

వ. అని యన్యాశకుం దృష్టివిన్యాసముం జేసి యంజలియుం జేసి.

వృ॥ శ్రీమాన్ గభీరతర వేగవతీప్రతీర

భూమా వపుర్దుహి సురద్రు రివావతీర్ణః

కామాదివైరిగణ ముల్బణ మస్మదీయం
నామాసినా నరహరిః కవలీకరోతు॥ 463

అ. అఘద్రుహి=పాపనాశకమైన, గభీరతరవేగవతీ ప్రతీరభూమౌ = అతి గంభీరమైన వేగవతీనదియొక్క గట్టుభూమియందు, శ్రీమాన్=సంపద్యుక్తుఁడై లక్ష్మీసహితుఁడై, సురద్రుః ఇవ=కల్పవృక్షమువలె, అవతీర్ణః = అవతరించిన, నరహరిః=నరసింహస్వామి, నామఅసినా=తనతిరునామ మనుఖడ్గముచేత, ఉల్బణం=మీఱియున్న, అస్మదీయం=నాదియైన, కామ ఆదివైరిగణం=కామము మొదలైన శత్రుసమూహమును, కవలీకరోతు=మ్రింగివేయును గాక.

తా. సకలపాపనాశని యైన యావేగవతీ తీరమందు కల్పవృక్షమువలె అవతరించి యుండు నాశ్రీనరసింహస్వామి నాకామక్రోధాది యరిషడ్వర్గమును తన నామస్మరణమాత్రముననే మ్రింగివేయునుగాక.

తే. వేగవతితీరధారుణి కే విబుధధారు
ణీరుహమురీతి నవతీర్ణుఁ డై రహించె
నాదుకామాదిరిపుల నీ కానారసింహుఁ
డాత్మనామాసిఁ గామాసి కే నంటఁగొట్టు.

టి. ఆత్మనామ-అసిన్=తననామ మనుఖడ్గముచేత, కామాసిన్ = ఈకామాసి గ్రామమందు.

గ॥ తతోऽన్యత శ్చతసృ ర్నిక్షిప్య ప్రాంజలి స్సన్॥ 464

వ. దానికన్న నన్యదిశను దనదృశను నిలిపి యంజలియు సలిపి.

## వైకుంఠప్పెరుమాళ్వర్ణనము.

(పూర్వకాలమున ధర్మప్రవర్తనుఁడైన విరోచనమహారాజు తనకు పుత్రోత్పత్తి నిమిత్తమై కైలాసనాథు నారాధించి యతనియనుజ్ఞచేత ఈకాంచీపురమున విష్ణువునుధ్యానించి యందా విష్ణుపీఠిగ అశ్వమేధయజ్ఞముచేసి ఆవిష్ణు

వును ప్రార్థింపఁగా, వా రావైకుంఠమునుండి వచ్చి ప్రత్యక్షమై తమద్వారపాలకులైన జయవిజయములే నీకు వల్లవ విల్లవులని పుత్రులుగా కలుగుదురని యనుగ్రహించి యతని ప్రార్థనామూలమున అల్లే ఇక్కడను సేవసాయించుచున్నవారు.)

వృ॥ భయార్తజీవాతు దయామహిమ్నే
వైకుంఠధామ్నే తనవై నమాంసి
ఆమ్నాయ ఉక్తః పరమేశితేతి
నామ్నాయఉక్తః పరమత్ర చిత్రమ్॥ 465

అ. పరమ-ఈశితా=పరమేశ్వరుఁడు, ఇతి=అని, ఆమ్నాయే ఉక్తః=వేదమందు చెప్పఁబడినవాఁడు; అత్ర=ఇక్కడ, నామ్నాయ ఉక్తః = వేదమందు చెప్పఁబడనివాఁడు అనుట, పరంచిత్రం=మిక్కిలి ఆశ్చర్యము! (యః=ఎవఁడు, నామ్నా=పేరుమాత్రముచేత పరమేశ్వరుఁడని, ఉక్తః=చెప్పఁబడినవాఁడో; తస్మై=అట్టి) భయ-ఆర్త-జీవాతు-దయామహిమ్నే=సంసారభయమువలన-బాధింపఁబడువారికి-జీవనౌషధమైన- కృపామహత్త్వముగల, వైకుంఠధామ్నే=వైకుంఠప్పెరుమాళ్లకు, నమాంసి=నమస్కారములు, తనవై=చేయుచున్నాను.

తా. పరమేశ్వరుఁడని వేదోక్తుఁడై (నామ్నాయఉక్తః=వేదోక్తుఁడుకాఁడని యర్థాంతరమున ఆశ్చర్యపడి) వైకుంఠధాముఁడని పేరుతోఁగూడ వాస్తవార్థమున వేదోక్తుఁడే యై కడతేర్చు కరుణాప్రభావము కల యీవైకుంఠప్పెరుమాళ్లకు ప్రణామములు చేయుచున్నవాఁడను.

క. శ్రుతి శ్రుతపఱచెను "పరమే
శితా"యనుచుఁ దోఁడుతన విశిష్టత నదె వి
శ్రుతపఱచెను నిది యద్భుత
మతులదయు వికుంఠనిలయుశ్రీనాహరిఁ గొలుతున్.

టి. వికుంఠనిలయుఁడు=వైకుంఠుఁడు, శ్రుతి=వేదము.

గ॥ యుక్తం చైతత్, యతో "విష్ణుః పరమః" ఇతి శ్రుతా శ్రుతిః॥

వ. ఇదియును దగినదియె "విష్ణుః పరమః" అను శ్రుతి శ్రుత మైనయదియ.

శ్లో॥ అనపాయరమో విష్ణుః కస్మాదపరమో భవేత్
యుక్తం రమాపతే రన్యే దేవా స్త్వపరమా ఇతి॥ 467

అ. అనపాయ-రమః=ఎడఁబాపులేని లక్ష్మీదేవిగలవాఁడైన, విష్ణుః=మహావిష్ణువు, కస్మాత్=ఎందువలన, అపరమః=లక్ష్మీదేవిలేనివాఁడు - పరమపురుషుఁడుకానివాఁడు, భవేత్=అగును. రమాపతేః=లక్ష్మీపతికంటె, అన్యే=ఇతరులైన, దేవాఃతు=దేవతలో, అపరమాః = లక్ష్మీదేవినుండి తొలఁగఁబడినవారు, ఇతి=అనుట, యుక్తం=సరే.

తా. "విష్ణోరేషాఽనపాయినీ" అని లక్ష్మితో అనపాయియైన యీ మహావిష్ణువు పరమపురుషుఁడయ్యును, లక్ష్మిని విడిచినవాఁడు కాఁడు. ఇతనికంటె ఇతరదేవతలు లక్ష్మీసంపన్నులు కాకున్నను, పరమపురుషులును కారు.

క. అపరముఁ డగు నెటు ? విష్ణుం
డిపుడును ననపాయరముఁడు కే నీవడువున, యు
క్తపువితమె ? రమాపతి కిత
రపుదైవతము లెపుడు నపరములే యనఁగా.

## శార్ఙ్గపాణిస్వామివర్ణనము.

(వీరు—బ్రహ్మచేయు అశ్వమేధయజ్ఞమందు దేవతలతో వచ్చినరాక్షసులకు మర్యాదచేయనందున, వా రాదేవతలతో యుద్ధముచేయుచుండఁగఁ జూచి ఆబ్రహ్మ తనయజ్ఞమునకు భంగము సంభవించునని నారాయణునిధ్యానింపఁగా, తాము తోడనె వచ్చి తమ శంఖచక్రాదులతోడి శార్ఙ్గధనుస్సుతో అనేక బాణము లెక్కుపెట్టి రాక్షసులను తరిమివేసి యిక్కడ ఇప్పుడును ఆరూపమున నే సేవ సాయించుచున్నవారు.)

కించ.— మఱియు.—

వృ॥ జాగ్రత్యేవ శిరాంసి నిత్యవచసాం సర్వోన్నతౌ శార్ఙ్గిణః
తత్ర వ్యాసపరాశరాదికృతయో దత్తాదరా వస్తుతః
యః పాదాంబు దదాతి యస్తదుపసంగృహ్ణాతి గృహ్ణాతివా
యశ్చైతచ్ఛిరసైవ తేషు పరమం జానాతి కోనాత్మవాన్॥

అ. నిత్యవచసాం=వేదములయొక్క, శిరాంసి=శిరోభాగములైన ఉపనిషత్తులు, శార్ఙ్గిణః=విష్ణువుయొక్క, సర్వోన్నతౌ=సర్వోత్తమత్వవిషయమై, జాగ్రత్యేవ=జాకరూకములైయే యున్నవి. తత్ర=ఆవిషయమందే, వ్యాసపరాశరాది కృతయః=వ్యాసులు పరాశరులు మొదలైనవారి పురాణములు, దత్తాదరాః=కలుగనిచ్చినపట్టుదల గలవి, వస్తుతః = వాస్తవముగ, యః=ఎతఁడు, పాదాంబు=పాదజలమును, దదాతి=ఇచ్చుచున్నాఁడో; యః=ఎతఁడు, తత్ =ఆపాదజలమును, ఉపసంగృహ్ణాతి = చేర్చుకొనుచున్నాఁడో; యః=ఎతఁడు, ఏతచ్చ=ఈపాదజలమునుఁ, శిరసైవ=శిరస్సుతోనే, గృహ్ణాతివా=చేకొనుచున్నాఁడో; తేషు=వారిలో, పరమం = పరమపురుషునిఁగా, ఆత్మవాన్ = జ్ఞానవంతుఁడు, కః=ఎవఁడు, నజానాతి=తెలిసికోలేఁడు?

తా. ఎతని సర్వోత్తమత్వమును ఈశావాస్యాది సకలోపనిషత్తులును, భారతాది సకలపురాణములును వివరించుచున్నవో; ఎతని శ్రీపాదతీర్థమైన గంగాజలమును బ్రహ్మ కమండలములోను, శివుఁడు శిరస్సులోనుధరించెనో; అట్టియతనిఁ బురుషోత్తముఁడని, యేజ్ఞానవంతుఁడు తెలిసికొనఁడు?

వ్యాసముని—ఈయన సత్యవతీపరాశరమునులకు పుత్రుఁడై శుకమహర్షికి తండ్రియునై, వేదములను చతుర్విధములుగా విభాగించి; పదునెన్మిదిపర్వముల భారతమును, పదునెన్మిదిపురాణములను, బ్రహ్మసూత్రాది వేదాంతగ్రంథములను రచియించె; వేదవ్యాసుఁడు, కృష్ణద్వైపాయనుఁడుఅని ప్రసిద్ధపడియుండు నతఁడు.

పరాశరులు.—ఈయన వశిష్ఠపుత్రుఁడైన శక్తిపుత్రుఁడు, శుకునితండ్రియైన వ్యాసునితండ్రి, ఇతఁడు యమునానదిని పడవతో దాఁటించుచున్న దాశ

రాజుకూఁతురు సత్యవతినిచూచి ఆమెకు యోజనగంధిత్వమిచ్చి ఆమెవలన సద్యోగర్భమున ఆవ్యాసునిఁ గన్నయతఁడు.

సీ. నిరవధి నిత్య మహా నిరుపమ శ్రుత్యాళి
శిరము లెవ్వనిపరాత్పరతఁ బలికె
వ్యాసపరాశర ప్రముఖులకృతు లెల్లఁ
దలఁప నెవ్వానితత్పరత మెలఁగె
నేవాఁడు తనపాద పావనపానీయ
మదె యుపాదేయ మం చర్థి నొసఁగెఁ
బరమేష్ఠి దాని నే పావన మగుకమం
డలు నించి తానె సఫలత నెసఁగె
తే. నీశ్వరుఁడు దానిఁ గొని దా నిదే ధరించు
చున్నవాఁడు చూడుము? తన యుత్తమాంగ
మందె, యిందున నెవ్వాఁ డమందమహిము
నుత్తమోత్తముఁ డని యెన్న సత్తముండు.

గ॥ పునస్సచమత్కారమ్॥

వ. మఱలనుం జమత్కారసహితంబుగ.

వృ॥ దుర్వాదినో విష్ణుపదారవిందం
దోషాపహం నానుసరంతు మోహాత్
తేషాం మతంతు స్వయ మత్ర విష్ణు
పదారవిందానుస్మృతిం విధత్తే॥ 469

అ. దుర్వాదినః=మతాంతరులైన దుర్వాదమువారు, దోషాపహం=సర్వదోషహరమైన, విష్ణుపదారవిందం=మహావిష్ణు పాదారవిందమును, మోహాత్=అజ్ఞానమువలన, నానుసరంతు=అనుసరించరుగాని ; తేషాంమతంతు=ఆదుర్వాదులమతమో, అత్ర=ఇక్కడ, స్వయం=తానుగానే, విష్ణుపదారవిందానుస్మృతిం=ఆకాశతామరసమును అనుసరించుటను, విధత్తే=చేయుచున్నది.

తా. మతాంతరులు అజ్ఞానముచేత విష్ణుపాదారవిందము ననుసరించకపోయినను, వారిమతము ఆకాశతామరవలె అసంభవమే అగును.

తే. అవని దుర్వాదివిష్ణుపాదారవింద
ములను దోషాపహములను మోహముననన
యనుసరింపఁడు, తెన్మత మనుసరించుఁ
దనుగ విష్ణుపదారవిందము నెతమిని.

టి. నీటిలో నుండుతామర ఆకాశములో నుండుట అసంభవ మనుట.

## శ్రీత్రివిక్రమస్వామివర్ణనము.

త్రివిక్రమస్వామి—మూఁడడుగులు గలసామి. విష్ణుదశావతారములలోని యైదవదైన వామనావతారము. ఈయన, యింద్రుని తఱిమి త్రిలోకములను పరిహరించుకొన్న బలిచక్రవర్తివలన, ఆమూఁడులోకములను పరిగ్రహించుటకై, ఆవామనావతారమున మూఁడెయడుగులు యాచించుకొని, విశ్వరూప మెత్తికొని త్రిలోకములను మూఁడడుగులతోనె కొలిచి తీసికొని, ఆదేవేంద్రునికిచ్చి, ఇప్పుడు నల్లే యిక్కడ ఆనీలమేఘప్పెరుమాళ్లతోను, ఆశేషాకారప్పెరుమాళ్లతోను సేవసాయించుచున్నవారు.

గ॥ ఇత్యన్యతో దృష్టిం నిక్షిప్య.

వ. అని యన్యదిక్కునకుం దనదృక్కును నునిచి.

వృ॥ సముత్తరూఢద్రుమపుష్పనిష్పత
న్మరందసంతత్యభిషిక్త ముత్తమమ్।
రవిక్రమాశుత్వనిరోధిగోపురం
త్రివిక్రమస్యాయతనం నిశామ్యతామ్॥ 470

అ. సముత్త-రూఢ-ద్రుమ-పుష్ప-నిష్పతత్ - మరందసంతతి-అభిషిక్తం = సమీపమున-లేచిన-చెట్లయందలి-పువ్వులనుండి-పడుచున్న-మకరందధారలచేత ముంచఁబడినదై, ఉత్తమం = శ్రేష్ఠమై, రవి-క్రమ-ఆశుత్వ-నిరోధి-గోపురం=

సూర్యునియొక్క-రాకపోకలయొక్క-వేగమునకు-అడ్డమైన-గోపురములు కలది యైన, త్రివిక్రమస్య-ఆయతనం=త్రివిక్రమస్వామియొక్క-ఆలయము, నిశామ్య తాం=చూడఁబడునుగాక.

తా. చుట్టుప్రక్కల తేనెలు కారు పువ్వువృక్షములును, ఆకాశము నంటు గోపురములును గలిగియుండు త్రివిక్రమస్వామిసన్నిధిని వీక్షించుము?

ఆ. తరియ విరియఁ బూయు • తరువర సుమ సమూ
దయపతన్మరందమయము మఱియుఁ
దరణిసరణి నాపు • తద్గోపురము రవిఁ
దగుత్రివిక్రమాయతనము గనుము?

గ॥ సవిస్మయ మభిధ్యాయన్॥

వ. అద్భుతసహితంబుగ నభిధ్యానంబు సేయుచు.

వృ॥ అవ్యా దాశ్రయతా మనశ్వరపదప్రాసాదనిశ్శ్రేణికా
హార్షాదూర్ధ్వ ముదంచితస్సచరణ స్త్రైవిక్రమోనఃక్లమాత్
త్రైలోక్యార్పణత స్సితం శుభయశశ్ఛత్రం యదాసీద్బలే
ర్ద్రాఘిష్ఠో హరినీలదండఇవ య స్తద్ధారణాయోద్ధృతః॥ 471

అ. ఆశ్రయతాం=ఆశ్రయించువారికి, అనశ్వరపద-ప్రాసాద-నిశ్శ్రేణికా= నాశరహితస్థాన మైన వైకుంఠమునకువలె-దేవాలయమునకు-నిచ్చెనవంటిదియు, హార్షాత్=సంతోషమువల్ల, ఊర్ధ్వం=పైకి, ఉదంచితః = ఎత్తఁబడినదియు, త్రైవిక్రమః=త్రివిక్రమస్వామిసంబంధ మైనదియు, యః=ఏచరణము; త్రైలోక్య-అర్పణతః=త్రిలోకములను - సమర్పించుటవలన, బలేః=బలిచక్రవర్తికి, సితం=తెల్లనైన, శుభయశః=శుభకరమైనకీర్తి, యత్ ఛత్రం = ఏగొడుగుగా, ఆసీత్=అయ్యెనో, తత్-ధారణాయ=ఆగొడుగును-ధరించుటకై, ఉద్ధృతః= పైకెత్తఁబడినదై, ద్రాఘిష్ఠః = అతిదీర్ఘమైన, హరినీలదండఇవ = ఇంద్రనీల దండమువలె, సః చరణః= ఆవిష్ణుపాదము, నః=మమ్మును, క్లమాత్=కష్టమునుండి, అవ్యాత్=రక్షించునుగాక?

తా. ఈ త్రివిక్రమ స్వామియొక్క ఊర్ధ్వముఖ శ్రీపాదము పరమపద మునకునలె తమకో వెలకు నిచ్చెనగాను, తమకు త్రిలోకములును దానము చేసిన బలిచక్రవర్తికీర్తి యనెడు తెల్లని ఛత్రమునకు నల్లని యింద్ర నీలదండముగాను నుండునదియై మమ్ము రక్షించుచుండునుగాక.

ఉ. సేవకకోటికిం బరము సెందఁగ నందఁగ నిచ్చు నిచ్చనై
యీవఁగ శేవగానెగడు నీశనియంఘ్రి త్రివిక్రమక్రమో
ద్భావన మప్పుడాబలి కుశదారతఁ దెచ్చిన స్వచ్ఛకీర్తి ఛ
త్రావరణంబునైంద్రమణిశీయద్భుతదండమునండితాఘమాన్.

బలి=బలిచక్రవర్తి—ప్రహ్లాదునికి పుత్రుఁడైన విరోచనునికి పుత్రుఁడు. తాను బాణాసురుఁడు మొదలైన నూర్గురు అసురులకును తండ్రి, ఇతఁడు ఇంద్రునిపం చించి త్రిలోకములు నపహరించి త్రివిక్రమావతారమున విష్ణువునకు ఆత్రిలోక ములును దానమిచ్చి ఆతని మూఁడవపాదముచే నుంచఁబడిన తన శిరస్సుతో పాతాళమునకు కొనిపోఁబడి ఇప్పుడును "అశ్వత్థామా బలీ వ్యాసో హనూమాంశ్చ విభీషణః కృపః పరశురామశ్చ సప్తైతే చిరజీవినః ॥" అని చిరంజీవియై ఆత్రివి క్రమస్వామితోఁగూడ నున్నవాఁడు.

కృశానుః.—కృశానువు.—

గ॥ కిమరే? మామావిన మేవ మక్రమం త్రివిక్రమ మభివందసి?
వ. ఏమిరా? మిగులమామకాఁడై క్రమమునెవిడనాడిన
యిట్టి త్రివిక్రము నభివందించుచున్నాఁడవు?

పశ్య?—చూడుమ?—

శ్లో॥ శ్రీమానపి స్వయం దైత్యాత్, కుర్వాణః కుప్రతిగ్రహమ్।
విందన్ సమహతీం పృథ్వీం, మిష్టాన్నోత్ర భిదే దదౌ॥ 473

అ. సః=ఆత్రివిక్రముఁడు, స్వయం=తాను, శ్రీమాన్ అపి=భాగ్యవంతుఁడ య్యును—లక్ష్మీవంతుఁడయ్యును, దైత్యాత్=రాక్షసునివలన—బలిచక్రవర్తివలన, కుప్రతిగ్రహం=కుత్సితాదానము—భూప్రతిగ్రహణమును, కుర్వాణః సన్=చేయు

వాఁడునై, మహతీం=గొప్పదైన,పృథివీం=భూమిని,వింద౯ సన్=పొందువాఁడునై, ఇష్టాం=తనకిష్టమైన యాభూమిని, గోత్రభిదే=వంశచ్ఛేదకుఁడైన వానికి—ఇంద్రునికి, దదౌ=ఇచ్చెను.

తా. ఈత్రివిక్రమస్వామి బలిచక్రవర్తివలన భూదాన మడిగి తీసికొని దేవేంద్రుని కిచ్చినవాఁడయ్యెను; ఇతఁడు తాను భాగ్యవంతుఁడైనను, తీయఁగూడని రాక్షసునివలన కల్పితమైన దానమును తీసికొన్నదిగాక, దానిని వంశచ్ఛేదకుఁడైనవాని కిచ్చినది అక్రమమే; (అని తోఁచునట్లు చెప్పటచే ఇది వ్యాజస్తుత్యలంకారము.)

గ॥ విశిష్యాయ మకపటానాం కవీనాం నశ్లాఘనీయః॥ 474

వ. విశేషించి యితఁడు కపటులు కాని కవులకు శ్లాఘింపఁ దగువాఁడు కాఁడు.

తే. తాను శ్రీమానుఁ డై యాతుధానువలనఁ
గుప్రతిగ్రహ మొనరిచెఁ గుమతివలనఁ
దనుగ గోత్రాభివర్ధకతను బ్రసిద్ధిఁ
గొనుచు గోత్రాభిఘాతికె గోత్ర నొసఁగె.

టీ. గోత్రాభివర్ధకతను=భూమ్యభివర్ధకత్వమందు (వంశాభివర్ధకత్వమందు) గోత్రాభిఘాతికి పర్వతచ్ఛేదకునికి-భూచ్ఛేదకునికి-(వంశచ్ఛేదకునికి) ఇంద్రునికి.

యతః.—ఎందువలన నంటేని?—

శ్లో॥ నిత్యానపాయిప్రమదోఽపి నాథో
వటూభవ న్వంచితదాతృకోఽసౌ।
కవివ్యథాకృ త్ఖలు భూసురోఽపి
భూదానవత్వం క్షమమేవ లేభే॥ 475

అ. నిత్యానపాయి ప్రమదోఽపి=ఎప్పుడును ఎడఁబాయనిభార్య-లక్ష్మి కలవాఁడయ్యును, వంచితదాతృకః=వంచింపఁబడినవాఁడై దాతయైన బలిచక్రవర్తికల

వాఁడై, కవివ్యథాకృత్=కవులకును — శుక్రునకును కష్టమును చేయువాఁడైన, అసౌ=ఈ, నాథః=త్రివిక్రమప్రభువు, భూసురో౽పి=తాను బ్రాహ్మణుఁడ య్యును, భూదానవత్వం=భూమియందు రాక్షసత్వమును- బలిచక్రవర్తి చేసిన భూదానము కలవాఁడగుటను, లేభే = పొందెను, క్షమమేవ ఖలు = ఇది సమర్థమేకదా? —

తా. ఇతఁడు తాను లక్ష్మీసంతుఁడైయైనను, పసుగుగావచ్చి దాతను వంచించి కవికిని (శుక్రునికిని) మనోవ్యథ కలిగించినదేగాక, తాను బ్రాహ్మణుఁడుగ నుండియు, భూలోకమున దానవత్వమును పొందుట గట్టితనమే?

క. అనపాయిని సీమాతినిఁ
గొనియును పసు గాచు దాతఁ గొనకొని వంచిం
చినదె ద్విజుఁడై కవి వ్యథ
నొనరిచి భూదానవత్వ మొగిఁ దగి తనరెన్.

కవి=శుక్రుఁడు—ఇతఁడు బ్రహ్మమానసపుత్రులలోని భృగువుపౌత్రుఁడు, కవి పుత్రుఁడు, అసురుల కందఱకును ఆచార్యుఁడు, ఈతఁడు బలిచక్రవర్తి విష్ణువునకు మూఁడడుగులు దానముచేయునపుడు ఆదానమునకు ఆదరోద్భేదకపాత్రమురంధ్రమున దూరి ఆటంకము చేయఁగా, అపుడావామనుఁడు పుల్లతో పొడిచి అతనిని గ్రుడ్డివానినిజేసినందున ఒంటికంటివాఁడు అయ్యెను.

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ అభ్యుపగచ్ఛామ ఏవ భవతః ప్రౌఢగుణదోషీకరణపాండిత్యం ఆస్తామేవ శ్లేషచమత్కారః, ఆకర్ణయతావదేతత్ యదా శ్రితరక్షణాయ పద్మేక్షణః స్వమహత్త్వానమహూపమపి రూపమాపేదే॥ 476

అ. ప్రౌఢ-గుణదోషీకరణ-పాండిత్యం=ప్రౌఢమైన-గుణములను దోషములుగాఁ జేయుటయందలి-పండితత్వమును.

వ. ఇటు శ్లేష చేయుచమత్కార మటుండనీ? గుణములనుం దోషములుగఁ జేయు నీప్రౌఢపాండిత్యము నె యెందును గను చుందునుగాని; యేయది యాశ్రితులరక్షణార్థ మాపద్మేక్ష ణుఁడును దనమహిమానురూపమె కానివామనరూపము నుం బ్రాపించుచున్నాఁడో? విన్నాఁడవే యాయదియు?

వృ॥నిత్యోన్నతోఽపి నిరపాయరమాశ్రయోఽపి
దాతాపి హంత ! బహుశో మహతాం పదానామ్ ।
స్వీకృత్య వామనవపు శ్శ్రిత మింద్ర మీశః
పాతుం పదత్రితయ మత్ర బలిం బిభిక్షే॥ 477

అ. ఈశః=ఈత్రివిక్రమస్వామి, నిత్యోన్నతోపి=ఎల్లప్పుడు నుత్తముఁడే అయ్యును, నిరపాయరమాశ్రయోపి = విడుచుటయే లేనిశ్రీదేవికి స్థానమే అయ్యును, బహుశః=అనేకములై, మహతాం=గొప్పవైన, పదానాం=బ్రహ్మపదాదిపదములకు, దాతాపి=దాతయే అయ్యును, హంత = అయ్యో! వామనవపుః=కుఱుచశరీరమును, స్వీకృత్య=స్వీకరించి, శ్రితం = తన్నాశ్రయించిన, ఇంద్రం=దేవేంద్రుని, పాతుం=రక్షించుటకై, అత్ర=ఈభూలోకమందు, బలిం= బలిచక్రవర్తిని, పదత్రితయం=అడుగులు మూఁటిని, బిభిక్షే=భిక్షమడిగెను.

తా. ఈత్రివిక్రమస్వామి సర్వోత్తముఁడును, శ్రియఃపతియును, పరమపద బ్రహ్మపద ఇంద్రపదాదుల నిచ్చువాఁడు నయ్యును; తన్నాశ్రయించిన యింద్రునిఁ గాపాడుటకై వామనరూపము నెత్తుకొని బలిని మూఁడడుగు లడిగికొనెను.

చ. నిరతము నుత్తమోత్తమత నిక్కము గా నిరపాయలక్ష్మితన్నిరతుల కున్నతోన్నతవిశేషసంపద మిచ్చు నిచ్చలే మఱిని మహాధ్యుఁడయ్యు,శతమన్యుని ధన్యునిఁ జేసి ప్రోచుకై కరముచు వామనుండగుచు: కొనెఁగోరి పదత్రయిం బలిన్.

టి. తస్నిరతులకర్ =అతనియందత్యాసక్తులకు, ఉన్నతోన్నత-వినిశ్చల-సత్పదము=ఉన్నతమనగా ఉన్నతమై-అతిస్థిరమైన-పరమపదాది పదమును, శతమన్యుక్ =దేవేంద్రుని, పదత్రయిక్ =అడుగుల మూఁటిని.

గ॥ పున స్సభ క్తిప్రకర్షన్॥

అత్రహి.—ఇక్కడఁ గదా?

వృ॥ త్రైవిక్రమ స్త్రిపథగాజనక స్సపాదః
పాయా త్పురస్య మరుతాం మరుతాం నిహంతా ।
శంభోః స్ఫురన్ముకుటభూషణదానచుంచు
రంభోనిధేః శ్వశుర మాప్తగిరో య మాహుః॥ 478

అ. త్రిపథగాజనకః=గంగను పుట్టించినదియు, మరుతాంపురస్య=దేవతల పట్టణమైన స్వర్గమునకు, మరుతాం=నిర్జలప్రదేశత్వమును, నిహంతా=పోఁగొట్టునదియు; యం=ఏపాదమును, శంభోః=ఈశ్వరునియొక్క, స్ఫురత్-ముకుటభూషణ-దానచుంచుం=ప్రకాశించునట్టి-కిరీటమున కాభరణమును-ఇచ్చుటయందు సమర్థమైనదిగాను, అంభోనిధేః = సముద్రునకు, శ్వశురం = మామగాను, ఆప్తగిరః=వేదవాక్యములు, ఆహుః=చెప్పుచున్నవో ; సః=అట్టి, త్రైవిక్రమః=త్రివిక్రమస్వామిసంబంధియైన, పాదః=శ్రీపాదము, పాయాత్ = రక్షించునుగాక.

తా.: గంగనుపుట్టించి, స్వర్గమును జలసమృద్ధముగఁ జేసి, శివునిశిరస్సునలంకరించి, సముద్రుని అల్లునిఁగాఁ జేసికొనియున్న శ్రీత్రివిక్రమస్వామి శ్రీపాదము మమ్ము రక్షించుచుండునుగాక?

వ. మఱల భక్తిప్రకర్షంబున.

చ. అకుటిలవేదమార్గముల కే నంబుధిమామన, నంబభర్తకున్
మకుటమునన్ విభూషక మనన్ జెలువొందుఁగ? నెయ్యదయ్యదీ। ప్రకటిత మాత్రివిక్రముని కే పాదమె ప్రోచు మరు

త్వమ్రుక్ మరుత్సగరికిఁ బాఁచు, గంగజనకేనంబునఁ బంబిన
కారణంబె మైం.

టి. మరుత్వమ్రుక్ = మరుభూమి చెట్టుచామనీరును లేనినేల యగుటను, పంబిన=అతిశయించిన.

## కామాక్షీ దేవీవర్ణనము.

కామాక్షీదేవి=కంచికామాక్షి— కా-మా-అక్షి= సరస్వతి-లక్ష్మి-కనులుగాఁ గలది. ఈమె మొదట పరాశక్తి యనఁబడుచు, వెనుక తాను తన ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తి చేత మహాగౌరియైయుండి ఆవెనుక ఈకాంచీపురిలో కామాక్షియ నఁబడియె. ఈమె జన్మాంతరమున దక్షప్రజాపతికి పుత్రియై దాక్షాయణీ అనఁబ డియు, తండ్రియజ్ఞమున తన భర్తయైన శివుని పిలువక అవమానించినందున తాను అత్యాగ్రహమున మహాకాళియై అందఱిని భయపఱుచుచు తుదకు దేహ త్యాగము చేసికొని, వెనుక హిమవంతునికి మేరువుపుత్రి యైన మనోరమకు పుట్టి, పార్వతి, గౌరి, హైమవతి అనియు, ఈశ్వరునికి భార్యయై ఈశ్వరి, భవాని, శర్వాణి, రుద్రాణి అనియు, తాను సకలశుభస్వరూపిణియై సర్వ మంగళ, శివ అనియు పేర్లుకలిగి, ఆయీశ్వరునియందలి ప్రేమాతిశయమున అతనికి అర్ధాంగమై తాను అర్ధనారీశ్వరి అనియుఁగాక, అతనికిని అర్ధనారీశ్వ రుఁడని పేరును కలిగించిన యామె.

గ॥ ఇతి కించి దంతర మతిక్రమ్య॥ 479

అత్రహి.—ఇక్కడఁ గదా?—

వృ॥ కాంచీనగరవిభూషా, కామాక్షీ కల్పమంజరీ భజతామ్।
రక్షా సురసేనానాం, రాజతి శర్వస్య సర్వస్వమ్॥ 480

అ. భజతాం=భజియించువారికి, కల్పమంజరీ=కల్పవృక్ష పుష్పగుచ్ఛము వంటిదియు; సురసేనానాం=దేవసేనలకు, రక్షా=రక్షకమైనదియు; శర్వస్య= శంభునకు, సర్వస్వం=సకలధనస్వరూప మైనదియు; కాంచీనగరవిభూషా =

కాంచీపట్టణమున కలంకారమైనదియునైన, కామాక్షీ=కామాక్షీదేవి, రాజతి=రాజిల్లుచున్నది.

తా. ఈకాంచీపురమందలి కామాక్షీదేవి తన్ను భజించువారికోరిక లిచ్చుటకై కల్పవృక్షము పువ్వుల గుత్తివలెను, ఆశివునకు సకలవిధధనమువలెను, అందఱికిని రక్షకముగా రంజిల్లుచున్నది.

వ. అని కొంతయంతరము యతిక్రమించి.

తే. కాంచికాకల్ప మయి భజియించుప్రజకుఁ
కల్పభూరుహమంజరీకల్ప మగుచుఁ
గాంచఁగా నయ్యెఁ గామాక్షిఁ జి గాంచనాంగి
శర్వసర్వస్వ మమరేంద్రసైన్యరక్ష.

గ॥ నిరూప్య సవిస్మయానందం కామాక్షీ మామంత్య్ర॥ 481

వ. అని నిరూపించి విస్మయంబు నంది యానందించి యాకామాక్షిని యామంత్రించి.

వృ॥దంతశ్రీ స్తవ దృశ్యతే యది తతః కుందం ననిందంతి కే
వక్త్రం యద్యభిలక్ష్యతే బుధజనశ్చంద్రం నసంద్రక్ష్యతే ।
దృష్టే దృష్టియుగే పున ర్నవినుయా ద్బాలోపి నీలోత్పలం
సూక్తి శ్చేదనుభూయతేమధురతా కామాక్షి! కా? మాక్షికే॥

అ. కామాక్షి=ఓకామాక్షి! తవ=నీయొక్క, దంతశ్రీః=దంతకాంతి, దృశ్యతే యది=చూడఁబడునదేని, తతః=తర్వాత, కే=ఎవరు, కుందం=మొల్లమొగ్గను, ననిందంతి=నిందించరు? వక్త్రం==మొగము, అభిలక్ష్యతేయది = చూడఁబడునదేని, బుధజనః=తెలివిగలవారు, చంద్రం=చంద్రుని, నసంద్రక్ష్యతే=చూడరు; దృష్టియుగే=కంటిజంట, దృష్టేయది=చూడఁబడినదేని; బాలోపి=పసివాఁడైనను, నీలోత్పలం=నల్లకల్వను, పునః=మఱల, నవినుయాత్=వినుతించఁడు; సూక్తిః=మాట, అనుభూయతేచేత్==వాడుకపడునదేని, మాక్షికే=తేనెయందు, మధురతా=మాధుర్యగుణము, కా=ఎక్కడిది?

తా. ఈకామాక్షీదేవి దంతములు మొల్లమొగ్గలను, మొగము చంద్రుని, కన్నులు నల్లకలువలను, మాట తేనియను మించియుండును.

సీ. కామాక్షి ! నీదంత ♦ కాంత కాంతులు గాంచి
నిందింప రెవ్వారు ♦ కుందములను?
వామాక్షి ! నీమోము ♦ సోముగోమును గని
యాసోము నెవ్వార ♦ లాసగొనుదు?
రబ్జాక్షి ! నీలోచ ♦ నాబ్జయుగ్మముఁ జూచి
కలువలచెలువము ♦ దలఁతు రెవరు?
మత్స్యాక్షి ! నీతేఁట ♦ మాటమాదిరి గని
మధుమధురిమ నేరి ♦ మనసు గోరు?
తే. నిట్టిసోయగ మేయుగ ♦ మెచరియందు
నేని యెచరేని యేమేని ♦ మేనియందు
నౌర ! కన్నారఁ గన్నార? ♦ కాంచనాంగి !
కాంచినావె? నీవైనను ♦ గాంక్షఁ జేసి.

కృశానుః.—కృశానువు.—

గ॥ యద్యపి విద్యతే కామాక్ష్యా స్సర్వాభినందనీయం సౌందర్యం
తథాపి ముధాతదితి ప్రతిభాతి॥ 483

వ. కామాక్షికి సకలాభినందనీయమైనసౌందర్యము కలిగియున్నదియేమైనను, అదికేవలము విఫలముగనే తోఁచుచున్నయది.

తథాహి.—అట్లె కదా?—

శ్లో॥ కాంతో విరూపాక్ష ఇతి ప్రతీతః
కామస్య హంతా గిరిరాజపుత్ర్యాః।
స్తంబేరమాస్య స్తనయోపి తస్యా
లంబోదరః కిం ఫల మాభిరూప్యమ్॥ 484

అ. గిరిరాజపుత్ర్యాః=ఈపార్వతియైన కామాక్షియొక్క, కాంతః=పెనిమిటి, విరూపాక్షః=విరూపములైన-అసమములైన కన్నులు కలవాఁడయి, కామస్య=కామపురుషార్థమునకును-మన్మథునకును, హంతా = నాశకుఁడును; తనయోపి=కొడుకును, స్తంబేరమాస్యః=ఏనుఁగుమొగమువంటిమొగము గలవాఁడయి, లంబోదరః=వ్రేలాడుకడుపు గలవాఁడును; ఇతి=అని, ప్రతీతః = ప్రసిద్ధుఁడు. తస్యాః=అట్టి ఆమెకు, అభిరూప్యం=ఇట్టి రూపాభిమానము, కింఫలం=ఏమిఫలము ?

తా. ఈకామాక్షి యెంతోయందకత్తె యైనను, మగఁడు సరియైనకనులే లేనివాఁడైయుండియు, తనకోరికనుకూడ పడఁగొట్టువాఁడైయుండుటే గాక మన్మథునిగూడ దహించినవాఁడుగాను, కొడుకు ఏనుఁగుమొగము గలవాఁడే గాక, వ్రేలాడుపొట్టయును గలవాఁడుగాను నుండఁగా, ఈమెయందమెందుకు ఫలిత మగును ?

తే. కాంతుఁ డావిరూపాక్షుఁడు కామహంత
సుతుఁడు లంబోదరుఁడు గజాస్యుఁడును నగుట
నకట ! గిరిరాజపుత్రికి నఖిలవిధుల
రూపమునకును నిది యనురూపఫలమె?

గ॥ అనయోః ఖల్వంబికాత్ర్యంబకయో ర్దాంపత్య మననురూపమితి వ్యక్తమేతత్ ॥ 485

వ. ఈయంబికాత్ర్యంబకుల కనురూపదాంపత్యమె లే దనునది సుస్పష్టమె కదా?

వృ॥ఇయంతు సర్వమంగళా, సతు స్మశానమందిరో;
విభాతి హైమవత్యసౌ, సయాతి దిక్షు భిక్షుకః ।
ఇయంతు కుంకుమాంకితా, సభస్మరాశిరూషిత;
స్త్వరాలకుంతలాచసా, జటాభి రేష భీషణః॥ 486

అ. ఇయంతు=ఈమెయో? సర్వమంగళా=సకలశుభములును గలది, సతు=

అతఁడో? స్మశానమందిరః = సుడిగాడే ఉనికిచోటుగాఁ గలవాఁడు ; అసౌ= ఈమె, హైమవతీ=బంగారము కలదిగా - హిమవంతునికూఁతురుగా,విభాతి= ప్రకాశించుచున్నది ; సః=అతఁడు, దిక్షు=దిక్కులయందు, భిక్షుకః = బిచ్చగాఁడై, యాతి=పోవుచున్నవాఁడు ; ఇయంతు=ఈమెయో? కుంకుమాంకితా= కుంకుమచేత గుర్తింపఁబడుచున్నది; సః=అతఁడు, భస్మరాశిరూషితః=భస్మసమూహముచేత పూయఁబడినవాఁడు ; సాతు=ఆమెయో ? అరాలకుంతలాచ= వంకరలైన ముంగురులు గలదియు; ఏషః=ఇతఁడు, జటాభిః=జడలచేత, భీషణః=భయంకరుఁడు.

తా. ఈపార్వతీశ్వరులు దంపతు లయ్యును, ఒకరికొకరు విరుద్ధముగా ఆమె సర్వమంగళములతో నుండియు, ఇతఁడు స్మశానవాసియై; ఆమె యెంతో బంగారము గలిగియుండియు, ఈతఁడు బిచ్చగాఁడై; ఆమె కుంకుమముపూసికొని యుండియు, ఇతఁడు బసుమము పూసికొనియు; ఆమె ముంగురులతో నుండియు, ఇతఁడు జడలువేసికొనియు నున్నవారు.

ఉత్సాహ. ఈమె సర్వమంగళాఖ్య కయ్యునితఁడు ప్రేతభూస్థితుం;
డీమె హైమవతియు నైన నితఁడు భిక్షుకుండు; ను
మ్మీమె కుంకుమాంకితాంగ యితఁడు భస్మరూషితుం;
డీమె కుటిలకుంతలాఢ్య యితఁడు దీర్ఘజటుఁ డగున్.

టి. హేమమే హైమము అని రూపాంతరము.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ వయస్య ! మైవంవాదీః నఖల్వప్రశస్తైరపి స్మశానవాసకృత్తివాసఃప్రభృతిభి స్స్వాభావికసిద్ధిక మభిరూపాణా మాభిరూప్య మవహీయతే॥ 487

వ. వయస్య! వాదింపకుమిట్లు, అప్రశస్తములైనను, స్మశానవాసచర్మవస్త్రాదులచేత నీతని స్వతస్సిద్ధమయిన సౌందర్యము సుందరులకు గొదువ నీయదకదా?

వృ॥ నివస్తాం వా కృత్తిం, నివసతు చిరం వా పితృవనే
శివస్తావ ద్ధత్తా మహిగణ, మథాప్యేష సుభగః।
పరీతం శైవాలై రుషితమపి పంకేషు, మలినా
మలీనాం బిభ్రాణం, కిమిహ కమనీయం న కమలమ్॥ 488

అ. శివః తావత్ = ఈశ్వరుఁడో, కృత్తింవా = ఏనుఁగుతోలునైన, నివస్తాం = వస్త్రముగాఁ జేసికొనుఁగాక; పితృవనేవా = స్మశానేవా = సుడిగాటిలోనైన, చిరం = చాలకాలము, నివసతు = వాసముసేయుఁగాక; అహిగణం = సర్పసమూహమును, ధత్తాం = ధరించునుగాక; అథాపి = ఐనను; ఏషః = ఇతఁడు, సుభగః = సౌభాగ్యవంతుఁడే; శైవాలైః = తీఁగపాఁచితో, పరీతం = చుట్టఁబడినదియు, పంకేషు = అడుసులలో, ఉషితమపి = ఉండినదియైనను, మలినాం = మురికి గలిగియున్న, అలీనాం = తుమ్మెదలకు, బిభ్రాణం = ధారకమైన, కమలం = తామరపూవు, ఇహ = ఈలోకమందు, కమనీయం = సొగసైనది, నకిం = కాదా?

తా. తామరపూవు క్రింద అడుసును, పైఁగ తీఁగపాఁచియునుగాక, మురికి పట్టినతుమ్మెదలును ముసురుచుండునదియై యున్నను, అందఱకు నానందముకలిగించునటులనె ఈశివుఁడును ఏనుఁగుతోలే వస్త్రముగాఁగలిగి, స్మశానములోనే వాసము చేయుచుండుటయె గాక, పాములను సొమ్ములనగా పైనివేసికొనుచున్నను, అందఱకును ఆనందకరుఁడే!

ఉ. ఏనుఁగుతోలు తాలిచిన, నేనుడిగాట నివాస మున్న, నే
హీన మహీనపం క్తి ధరియించిన, నీశ్వరుఁ డెప్పుడొప్పెడుర్;
జానుగ నుండదే? కమలషండము పాఁచియుఁబంకముఁ మఱీ
తూనికలుఁ వికారముగఁ జిందోఁచిన, నీచిన నీటిపట్టులన్.

కించ. —మఱియు.—

వృ॥ రమణీయ స్సాహి పురుషో, రమణీయా త్రైవ రజ్యతి విదగ్ధా।
శ్లోక స్సఏవ సుభగ, శ్శ్రితం స కం హి యత్ర రసికస్య॥ 489



అ. యత్ర = ఎక్కడ, రమణీ = స్త్రీ, విదగ్ధా = గర్వరురాలై, రజ్యత్యేవ = రం

జిల్లుచు నేయున్నదో; సహిపురుషః=ఆపురుషుఁడే కదా? రమణీయః=మనోహ రుఁడు; యత్ర=ఎక్కడ, రసికస్య=సాహిత్యసారజ్ఞునకు, చిత్తం=మనస్సు, స క్తం=ఆసక్తమైనదో; సఏవశ్లోకః=ఆశ్లోకమే,సుభగోహి=మనోహరముకదా?

తా. రసికునకు సారస్యమును జూపుశ్లోకమువలె, స్త్రీని రంజిల్లఁజేయు పురుషుఁడే మనోహరుఁడు.

ఆ. రమణి యెవనియెడల రంజిలు, రమణీయుఁ
డట్టిపురుషుఁడే కదా? యథార్థ
ముగను బద్దె మెద్ది ముద మొదవించు స
హృదయహృదయమునకు హృద్య మదియ.

౫॥ అవధార్యతా మత్ర తదతిమాత్రం చిత్రమ్॥ 490

వ. అవహితమతివగుమ? అందును నిది అతిమాత్రము చిత్రము!

శ్లో॥ శివాక్ష్యాలోకతః కామో, జిత ఇత్యేవ శుశ్రుమ।
వ్యత్యాసోఽత్ర జితః కాంచ్యాం, కామాక్ష్యాలోకత శ్శివః॥

అ. కామః=మన్మథుఁడు, శివ - అక్ష్యాలోకతః=శివునియొక్క - కంటిచూపుచేత, జితః=జయింపఁబడినవాఁడు, ఇత్యేవ=అనియే, శుశ్రుమ=విన్నాము; అత్ర=ఈవిషయములో,వ్యత్యాసః=విపర్యాసము,కాంచ్యాం = ఈ కంచిలో, కామ - అక్షి - ఆలోకతః=మన్మథునియొక్క - కంటిచూపుచేత—కామాక్షి-ఆలోకతః = కామాక్షీదేవియొక్క - చూపుచేత, శివః = ఆశివుఁడు, జితః= జయింపఁబడెను.

తా. శివునికంటి మంటచేత మన్మథుఁడు జయింపఁబడెనని వింటిమి. ఇప్పుడా శివుఁడామన్మథుని కడుపుమంటచేతనే ఆకామాక్షీదేవికంటఁ గనుఁగొంటచేతనే జయింపఁబడియె ఇదేమి వ్యత్యాసమో?

క. వినుదుము వీనుల విజితునిఁ
గనె కాము శివాక్షిఁ దగిలి కనులను గాంచిం
గనెదము శివుని విజితునిఁ

గను నిదె కామాక్షిఁ దగిలి కెకవికట మిటన్.

అన్వయము. శివాక్షిన్ దగిలి కామున్ విజితునిఁగానే వీనులచే వినుదుము. కామాక్షిన్-కామునక్షిన్ దగిలి శివునినె విజితునిఁగానె కనులచేఁ గనెదము. ఇదె ఇటఁగడు వికటము.

గి॥ పుష్కలంకిల పుత్రభాగ్యమపి పర్వతరాజకన్యాయాః॥ 491

వ. పుష్కలము కదా? పుత్రభాగ్యము సహిత మీపర్వతరాజ పుత్రికి.

ఇభనాథవక్త్రుఁడు=గజాననుఁడు—412 వృత్తముక్రింద చూడుము.

## షడాననవర్ణనము.

షడాననుఁడు—ఇతఁడును పార్వతీపరమేశ్వరులపుత్రుఁడు. శివునిరేతస్సు అగ్నిమూలముగ శరవణమున విడువఁబడి కృత్తికలచే పెంపఁబడినందున అగ్నిభువు, శరవణభువు, కార్తికేయుఁడని చెప్పఁబడుచు; ఎప్పుడును కౌమారవయస్సులోనె యున్నందున కుమారుఁడనియు, ఆఱుముఖములతో నున్నందున షణ్ముఖుఁడనియు, అతిబాల్యమపుడె తారకాసురుని జయించినందున తారకారి అనియు, నెమలియె వాహనమైనందున మయూరవాహనుఁడనియు, శక్తియేఆయుధమైనందున శక్తిధరుఁడనియుచెప్పఁబడుచుండు సుబ్రహ్మణ్యుఁడు.

వృ॥ కుశలీభనాథవక్త్రః, ప్రథమో హిమాద్రితనయాయాః।
పంచాస్యాత్పితురధిక,ష్షడాననో నందనో ద్వితీయోఽస్యాః॥

అ. హిమాద్రితనయాయాః = హిమవత్పర్వతపుత్రి యైన యీకామాక్షి యొక్క, ప్రథమః పుత్రః=మొదటికొమారుఁడైన, భనాథవక్త్రః=నక్షత్రాధిపతియైన చంద్రునివలె మొగముగలవాఁడగు-ఇభనాథవక్త్రః=గజాననుఁడును, కుశలీ=క్షేమముగానున్నవాఁడు. అస్యాః=ఈపెయొక్క, ద్వితీయః నందనః=రెండవకొమారుఁడగు, షడాననః=షణ్ముఖుఁడు, పంచాస్యాత్=అయిదు మొగములుగల, పితుః=తండ్రికంటె, అధికః=ఎక్కువైనవాఁడు, కుశలీ=క్షేమముగా నున్నవాఁడు.

తా. ఈపార్వతికి మొదటికొడుకు విఘ్నేశ్వరుఁడు గజాననుఁడుగ నుండియు తాను చంద్రముఖిగాను, రెండవకొడుకు కుమారస్వామి అయిదుమొగములు గల తండ్రికంటె తా నాఱుమొగములుగలవాఁడుగాను క్షేమముగానుండుట అతిశయ మైనపుత్రభాగ్యము కదా?

ఏలనఁగా?-—

తే. కుశలి నిభసాథముఖుఁ గనెఁ గే నెనఁగ మొదట
గౌరి మదిఁ గోరి మఱి చమత్కారిణి యయి
పంచముఖుఁ డగు జనకుని కే మించుకొడుకు
షణ్ముఖునిఁ గనె వెనుక నాశ్చర్యచర్య.

గ॥ ఇత్యన్వ్యతః కించిత్పరిక్రామన్ సామోదమ్॥ 493

వ. అని నః ఱింకొంతయంతరంబునకుఁ బరిక్రమించుచుం బరమ ప్రమదంబున.

## ఏకామ్రేశ్వరవర్ణనము.

ఇ. ఏకామ్రేశ్వరుఁడు=ఏక-ఆమ్ర-ఈశ్వరుఁడు=వేదమెఏకమైయున్న-మామిడివృక్షముక్రింద వసించుచున్న ఈశ్వరుఁడు. ఈయన ఈ కాంచీపురమందు మొదట జ్యోతిర్లింగముగనుండి, వెనుక కామాక్షిచే పూజింపఁబడుటకై సైకతలింగమై యున్నయతఁడు.

ఇతఁడు త్రిమూర్తులలో నొకఁడై త్రినేత్రములు కలిగి తామసగుణ ప్రధానుఁడగుచు జగత్సంహారము చేయుచును సంధ్యలలో నటనము చేయుచునుండు నతఁడు, మఱి యితఁడు వృషభమును టెక్కెమున నుంచుకొని, నందిని వాహనముగఁ జేసికొని, చేత శూలాయుధము నుంచుకొని తలను గంగను చంద్రునిఁ బెట్టుకొని యుండునతఁడు. మఱి యితఁడు త్రిపురాసురులను జయించునపుడు భూమియే రథముగను,సూర్యచంద్రులే చక్రములుగను, వేదములు గుఱ్ఱములుగను, బ్రహ్మయే సారథిగను, మేరుపర్వతము విల్లుగను, విష్ణువె బాణముగను, సముద్రము అమ్ములపొదిగను ఐయుండినతఁడు. మఱియు

నితఁడు దేవరాక్షసులు పాలసంద్రమున నమృతము తఱచునపుడు కవ్వముగా నున్న మేరుపర్వతమునకు త్రాడుగానుంచుకొనఁబడిన వాసుకి అనుసర్పశ్రేష్ఠుఁడు తాళఁజాలక క్రక్కుకొన్న విషమును త్రాగివేసి, ఆవిషము పార్వతిచేత కంఠమందె పట్టి నిలుపఁబడినందున నిప్పుడును విషకంఠుఁడై యున్నయతఁడు.

వృ॥ శశాంకమాలి స్సహకారమూలే
కైలాసవాసీ స ఇహావిరాసీత్
యస్యాగ్నిభూ ర్దృక్చ తనూభవశ్చ
యోషాఽపి భూషాఽపిచ నాగరాజీ। 494

అ. యస్య=ఎవనియొక్క, దృక్చ=నేత్రమును, తనూభవశ్చ = కొమారుఁడును, అగ్నిభూః = అగ్నిగా ప్రభవించినదో-అగ్నిలో ప్రభవించినవాఁడో, యోషాపి= స్త్రీయును, భూషాపిచ=భూషణమును, నాగరాజీ=నగరాజపుత్రియైన పార్వతియొ-సర్పముల సమూహమో; సః=అట్టి, కైలాసవాసీ=కైలాసమున వసించునట్టి, శశాంకమాలిః=చంద్రశేఖరుఁడైన శివుఁడు, ఇహ= ఈకంచియందు, సహకారమూలే=మామిడిచెట్టుక్రింద, ఆవిరాసీత్ =ఆవిర్భవించెను.

తా. అగ్నిసంభవులైన నేత్రపుత్రులును, నగరాజపుత్రియైన పార్వతియు సర్పసమూహమునైన భార్యాభూషణములునుఁ గలిగి, కైలాసమందుండువాఁడయ్యు నీయేకామ్రేశ్వరుఁ డిక్కడ నీకంచియం దీమామిడిచెట్టుక్రిందఁ నావిర్భవించియున్నవాఁడు.

తే. వాసి నావిర్భవించెఁ గైకేలాసవాసి
మావిక్రేవను నతఁ డిందుకేమాళి, యిందు
నగ్నిభువు చూపుచూలును కేనగు నెవనికి
నగయునెలనాఁగ యగు నలకేనాగరాజి.

## కృశానుః.—కృశానువు.—

గ॥ వయస్య! కింవర్ణయసి విశ్వవిలక్షణచరిత్రంరుద్రమ్, లోకేహి

లోచనశైత్యం సంపిపాదయిషయా యతమానాన్ జనానేవ పశ్యామః; అయంతు పశుపతిః స్థాణురితిచ ఆహ్వాయ మన్వర్థయన్నిహ ఆశుశుక్షణి మక్ష్ణి నిక్షిప్తవాన్॥ 495

వ. వయస్యా ! వర్ణించుచున్నావేమి? నీ వీ విశ్వవిలక్షణచరిత్రుఁడైన రుద్రుని, లోకములో లోచనములకుఁ జల్లఁదనమును సంపాదించుకై యత్నించువారిని గాంచుచున్నాము ; ఇతఁడో పశుపతియనియు, స్థాణువనియుఁ దనకుఁ గలనామముల నన్వర్థము చేయుచు నిచటఁ దనకంటిమంటనె నించుచున్నాఁడు.

టి. విశ్వవిలక్షణచరిత్రుఁడు=లోకమునకంటె విగతలక్షణమైన-లోకములో విశేషమైన-చరిత్రము కలవాఁడైన, పశుపతి=పసులకు-సకలజంతుజాలమునకును అధిపతి, స్థానువు=కొమ్మలేనిచెట్టుపంగ, లయకాలమందు కదలకయుండువాఁడు, అన్వర్థయన్=సార్థపఱచుచు, ఆశుశుక్షణిం=అగ్నిని.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ అవధేహి తావ దభిధాస్యామి రహస్యమ్॥ 496

వ. అవహితుఁడ వగుము. ఆరహస్యము వచియించుచున్నాఁడను.

వృ॥అంగానుషంగా దతిశీతబాధా
మిందో ర్ద్యుసింధోశ్చ తదన్వయేన
హర్తుం వహత్యగ్నిమయీం తృతీయాం
హాహో? హసంతీమివ హంత ! దృష్టిమ్॥ 497

అ. హరః=ఈశ్వరుఁడు, ఇందోః=చంద్రునియొక్కయు, ద్యుసింధోశ్చ=ఆకాశగంగయొక్కయు, తదన్వయేన=ఆయొక్కొక్కటియొక్క సంబంధముచేత, అంగానుషంగాం = తన యంగములయందు సంబంధము గల, అతిశీతబాధాం=చలివలని యత్యంతకష్టమును, హర్తుం=హరించుటకై, తృతీయాం = మూఁడవదియైన, అగ్నిమయీం=అగ్నిస్వరూపమైన, దృష్టిం=కంటిని, హసంతీమివ=నంపట్టినిపలె, వహతి=వహించుచున్నవాఁడు-హంత=ఆశ్చర్యము!

తా. ఈశివుఁడు తనతలలో చల్లనిగంగనుɴ చల్లనిచంద్రబింబమునుɴ ధరిం చినందున నేకాక, అవి యొక్కొక్కటితోడి కూడికవలననుɴ గలుగు శీతల బాధను నిలుపుకొనుటకై కుంపటి నిప్పనువలె నిప్పుకంటిని కూడ వహించెను.

తే. ఇందువలనను మఱి నభస్సింధువలన
నంగములఁ గలశైత్యానుషంగ క్రమను
మాన్ప నింపుగఁ గుంపటి మాట్కిఁ దాల్చె
నగ్నినయనము మూఁడవకయక్షి మృడుఁడు.

కృశానుః.—కృశానువు.—

గ॥ హంత! తర్హి తుహినకిరణశకల సురసరిజ్ఝరీశిశిర శిరసస్త్రిపుర
హరస్య కథ మభిషేకక్రియతా॥ 498

వ. అట్లయ్యెనేని, అయ్యో! అయ్యిందుకళలవలనను, అయ్య
మరసరిజ్ఝరివలననుం (బెల్లు జిల్లని) చల్లఁబాఱి చీఁదఱవడు
తలకలయాకపర్ది కేకరణినభిషేకమున నభిలాషముకలుగును?

తతశ్చ.—తర్వాతను.—

వృ॥ గంగాతరంగావలిభి స్సుధాంశో
స్సుధాఝరైశ్చానిశ మార్ద్రమూర్ధ్నః
ముధాభిషేకం కలయంతి శంభో
స్తృప్తాయ తోయేన దదత్యపః కే? 499

అ. గంగాతరంగావలిభిః = గంగానదియలలసమూహములచేతను, సుధాం శోః=చంద్రునియొక్క, సుధాఝరైశ్చ=అమృతము వెల్లువలచేతను, అనిశం= ఎల్లప్పుడును, ఆర్ద్రమూర్ధ్నః=తడిసినయుచ్చితల గల్వాఁడైన, శంభోః=శివు నికి, అభిషేకం=అభిషేకమును, ముధా=వ్యర్థముగా, కలయంతి = చేయుచు న్నారు; తోయేన=నీటిచేత, తృప్తాయ = తనివిని పొందినవానికి, కే=ఎవరు, అపః=నీళ్లను, దదతి=ఇచ్చుచున్నారు?

తా. [illegible] గంగా

ప్రవాహమును, చంద్రునమృతప్రవాహమును తల నిండి యెప్పుడును తడసియుండు శివునకు అభిషేకమే చేయఁ గాదుకదా?

తే. రంగదుత్తుంగగంగాతరంగములను
వఱలు నమృతాంశు నమృతప్రవాహములను
శివున కభిషిక్తునకు నభిషేక మేల
కనెద రెందుకు నీరతృప్తునకు నీరు.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ అత్రాపి యుక్త ముత్తరం వ్యాహరామి॥ 500

వ. ఇందుకును యుక్తమగు నుత్తరమె వచియించుచున్నాను.

వృ॥ జ్వలనాకలనా ద్విషస్య పానా
ద్విషభాజాం వహనాచ్చ తప్తమూర్తేః
అనిశం త్రిదశాపగాధరస్యా
ప్యభిషేకప్రియతా హరస్య జాతా॥ 501

అ. జ్వలనఆకలనాత్ =(నొసటికంటి) అగ్నియొక్క కూడికవలనను, విషస్యపానాత్ =కాలకూటవిషముయొక్క పానమువలనను, విషభాజాంవహనాచ్చ=సర్పములయొక్క ఉద్వహనమువలనను, తప్తమూర్తేః=తపింపఁబడెడిశరీరముగలవాఁడై, త్రిదశాపగాధరస్యాపి=గంగనుధరించినవాఁడే యైనను; హరస్య=శివునకు, అనిశం=ఎల్లప్పుడును, అభిషేకప్రియతా=అభిషేకమందుప్రేమ, జాతా=కలిగియున్నదే.

తా. ఈశ్వరుఁడు తనతలయందు గంగయుండియు; నొసటికంట నిప్పును, గొంతున కాలకూటవిషమును, మెడను ఆవిషధరములే యైనపాములును గలిగి తపించుచుండెడి తనశరీరమునకు అభిషేకము అక్కఱ లేకయుండునా?

తే. దహనవిషవిషవహసముద్వహనములను
మిగులఁ గన త్రాఁగి వేఁగిన మేనివాని

కనిశమును శశిఁ ద్రిదశాపగను ధరించి
నను, శివున కభిషేకము సేను బ్రియంబె.

కృశానుః.—కృశానువు.—

గ॥ అ స్త్యేవ మథా ప్యన్యద ప్యనుయుజ్యతే॥ 502

వ. అది యట్లుండినను, మఱియొకటియు నడుగఁబడుచున్న యది.

గ॥ కిమసౌ విహాయసం విహాయ సంతతం శంకరశిరసి గంగాత
రంగాంతః ప్రతివసతి మృగాంకః కృశాంగః॥ 503

టి. విహాయసం=ఆకాశమును, గంగాతరంగఅంతః = గంగాతరంగములమధ్య, మృగాంకః=జింకగుర్తుకలవాఁడు-చంద్రుఁడు, కృశాంగః=కృశించినఅంగముగలవాఁడు.

తే. ఏమి? యీసోముఁ డావ్యోమ మేది యెపుడు
జటలపటలంబునను విశంకటభయంక
రంబు శంకరునిది యాశిరంబుపయిన
గాంగ మగు తరంగములఁ గృశాంగుఁ డాయె.

టి. వ్యోమను+ఏది=ఆకాశమును+విడిచి, జటలపటలంబునను=జడలసమూహములోను, విశంకటభయంకరంబు = విస్తార మైనభయమును గలుగఁజేయునది యై.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ శృణు సఖే! తత్ర కారణమ్॥ 504

వ. చెలికాఁడా! దానికిని గారణము వినుము.

వృ॥ శివశిరసి శీతభాను
స్సాగరసూనుత్వసూచనాయ పరమ్
అధివసతి తన్మహిష్యా
గంగాయాః జఠర ముల్వణ మేవ॥ 505

అ. ఏషః=ఈ, శీతభానుః=చంద్రుఁడు, శివశిరసి=శివునిశిరస్సునందు, సాగరసూనుత్వసూచనాయ=సముద్రపుత్రత్వమును సూచించుటకై, పరం=మిక్కిలి, అల్పతనుః=స్వల్పశరీరముకలవాఁడై, తత్ మహిష్యాః=ఆసముద్రుని భార్యయైన, గంగాయాః=గంగాదేవియొక్క, జఠరం=గర్భస్థానమును, అధివసతి=చేరుచున్నవాఁడు.

తా. ఈచంద్రుఁడు ఆశివునిశిరస్సున తాను సముద్రుపుత్రుఁడని తెలిపించుకొనుటకై ఆసముద్రుభార్యయైన గంగాదేవిని తనతల్లినిగాను తోఁపించుకొనుటకునై ఆగంగాగర్భమధ్యమున నే చేరియున్నవాఁడు.

క. పురహరుతల నీశీతల
కరుఁ డలసాగరకుమారకతసూచిత మా
కరణిని నాతనిసతి యా
సురనదియుదరంబులో శిశుతను వసించున్.

కృశానుః.—కృశానువు —

గ॥ తథాపి లుబ్ధఏష ఫల(పేప్సుభిరనాదృత్యః॥ 506

వ. అట్లయినను, ఆదికిరాతుఁ డగునితఁడు ఫలములఁ గోరువారు సమాదరింపఁ దగువాఁడు కాఁడు.

తథాహి.—అది సరే.—

## మేరుపర్వతము.

ఇ. సౌవర్ణభూధరము-బంగారుకొండ=మేరుపర్వతము. ఇది మహోన్నతమై బంగారుమయమై సప్తద్వీపములమధ్యనున్నదై ఒకప్పుడు హిమవత్పర్వతముతోడివివాదములో నీకంటె నేనే హెచ్చని పెరిఁగిపెరిఁగి భూమ్యాకాశములు నిండి సూర్యచంద్రుల రశ్మియే కనఁబడకుండుటచే దేవతలు మొఱవెట్టుకోఁగా, అగస్త్యమహాముని వచ్చి దీనిఁజూచి, అది సాష్టాంగనమస్కారముచేయఁగా, నీవిట్లేయుండుము. ఇదో పోయివచ్చెదను. అని దానికాజ్ఞయిచ్చిపోయి, ఇదివఱకు

అమలయపర్వతముననే (పట్టణికొండలోనె) నిలిచిపోయినందున ఇదియు నిది వఱకును అట్లే నేల నణఁగియున్నయది.

వృ॥ సౌవర్ణభూధర మపి స్వకరే నిధాయ
భిక్షాం కపాలభృ దిహాటతి కృత్తివాసాః
ఆస్తామిదం స్వయమసౌ పరిగృహ్య లుబ్ధో
లక్ష్మీపతిం తమపి మార్గణయాంచకార॥ 507

అ. స్వకరే=తనచేత, సౌవర్ణభూధరమపి=బంగారుకొండను-మేరుపర్వతమును, నిధాయ=పెట్టుకొని, కృత్తివాసాః = ఏనుఁగుతోలువస్త్రిమువాఁడై, కపాలభృత్=పుఱ్ఱెను చేకొన్నవాఁడునై, ఇహ=ఇక్కడ, భిక్షాం=బిచ్చమును కూర్చి, అటతి=తిరుగుచున్నవాఁడు; ఇదం=ఇది, ఆస్తాం=ఉండనీ? అసౌ=ఇతఁడు, స్వయం=తానె, లుబ్ధః=ఆదికిరాతుఁడై-లోభియై, లక్ష్మీపతిం=సర్వైశ్వర్యసంపన్నుఁడైన లక్ష్మీపతిని, పరిగృహ్య=చేకొని, తమపి = అతనినిగూడ, మార్గణయాంచకార=బాణముగాఁ జేసికొనెను. వెదకుకొనెను.

తా. మేరువు ధనుస్సుగాను, విష్ణువు బాణముగాను గల ఇతఁడు బంగారు కొండను చేతఁ బెట్టుకొనియును; పుఱ్ఱె చేతఁ బట్టుకొని, తోలు కట్టుకొని బిచ్చమెత్తుకొనుచున్నాఁడు గాక, లోభికిరాతుఁడై సర్వైశ్వర్యసంపన్నుఁడైన విష్ణువును గనిపట్టియు, అతని వెదకుటందే యున్నాఁడు.

తే. కనకధరమున కరమునఁ జే గలిగి, లుబ్ధు
కేలఁ బుఱ్ఱెను నేవికజేతోలు మొలను
దాల్చి తిరియు నదుండనీ జే తానె శ్రీప్ర
భువును గనియును మార్గణంబున ఘటించె.

టి. మార్గణంబున=బాణమందు-వెదకుటందు, ఘటించె=ఘటిల్లఁజేసికొనె, తిరియుక్=తిరిపమెత్తును.

వృ॥ సూక్ష్మసితాంశుకలాభోఽప్యపటో
హేమధర పదనివిష్టోపి।

లుబ్ధోఽయ మయోహ స్త స్తండుల
సత్త్వోఽప్యటత్యహో భిక్షామ్॥ 508

అ. అయం=ఈ, లుబ్ధః=లోభియైన-ఆదికిరాతుఁడైనశివుఁడు, సూక్ష్మ+సితాంశుక+లాభోఽపి-సితాంశు+కలాభోఽపి=సన్నమైన+తెల్లనివస్త్రముయొక్క+లాభముకలవాఁడయ్యును(సన్నమైన+చంద్రునియొక్క+కళా కాంతికలవాఁడయ్యును;) అపటః=వస్త్రహీనుఁడును-దిగంబరుఁడునై, హైమధరపద+నివిష్టోఽపి=బంగారుకలిగియుండుస్థానమందు (మేరుపర్వతస్థానమందు) ఉన్నవాఁడయ్యును; అయోహస్తః = ఇనుమువంటిశూలముతోడి+చేయి కలవాఁడునై, తండుల+సత్త్వోపి=బియ్యము+ఉండియు-(తండు+లసత్త్వోపి=నందికేశ్వరునిచేత-ప్రకాశించుట కలిగియుండియు) భిక్షాం=బిచ్చమునుగూర్చి, అటతి=తిరుగుచున్నాఁడు, అహో=వింత!

తా. చంద్రశేఖరుఁడు, దిగంబరుఁడు, మేరుపర్వతవాసి, శూలపాణి, నందికేశ్వరసేవితుఁడు, నైనయితఁడిట్లు సన్నవస్త్రముకలిగియు వస్త్రములేనివాఁడుగాను, బంగారుండుచోట నుండియు లోభిగాను, తండులను లుండియు బిచ్చమెత్తుచున్నవాఁడు.

క. పిపులసితాంశుకలాభుఁడు
నపటుఁడు సౌవర్ణధరపదావిష్టుఁడుఁ దా
నిపుడును లుబ్ధుఁ డయఃకరుఁ
డుపతండులసత్త్వుఁ డుగ్రుఁ డూరక తిరియున్.

టి. ఉగ్రుఁడు=కోపి-శివుఁడు, ఊరక=వ్యర్థముగా - విస్తారముగా, ఉపతండులసత్త్వుఁడు = తండులసామీప్యమందె ఉనికిగలవాఁడు - సమీపమందె నందికేశ్వరునితో ప్రకాశము కలవాఁడు.

ఇ. లుబ్ధుఁడు=ఆదికిరాతుఁడు-శివుఁడు. ఇతఁడు అర్జునునితో యుద్ధముచేసి అతనికి పాశుపతాస్త్రము నిచ్చునపుడు కిరాతునివేషమును పూనియున్న యతఁడు.

గ॥ అత్యల్ప మిదముచ్యతే యచ్ఛంకరసంగా ద్గంగాయామపి జీవనదాయిన్యాం సంక్రాంతా తద్గతా లుబ్ధతా॥ 509

వ. శివసంగమమున గంగానది జీవనద యయ్యెను, ఆశివునియం
దలిలుబ్ధతయుం దానుఁ జేకొనునది యయ్యె.

టి. జీవనద=జలము నిచ్చునది-బ్రదుకునిచ్చునదియు, లుబ్ధత=లోభిత్వము-ఆదికిరాతత్వము.

పశ్య.—చూడుము.—

వృ॥ముక్తాశ్రితావిష్ణుపదోదితాపి
గాంగేయ ముత్పాద్య వసు ప్రకృష్టమ్
ప్రాప్యాపి రత్నాకర నిత్యసంగం
కపర్దికాశాం నజహాతి గంగా॥ 510

గంగానది— 92 వృత్తమున చూడు?

అ. ముక్త-ముక్తా - ఆశ్రితాపి = సంసారవిముక్తుల చేత - ముత్యముల చేత, ఆశ్రయింపఁబడినదియైనను; విష్ణుపద-ఉదితాపి=విష్ణుపాదమున - ఆకాశమున-పుట్టినదియయ్యును; గంగా=గంగానది, ప్రకృష్టం = విశేషించిన, గాంగేయం-స్వర్ణమయమైన - గంగాపుత్రుఁడైన, వసు=ధనమును-అష్టవసువులలో నొకఁడగు భీష్ముని, ఉత్పాద్య=పుట్టించి, రత్నాకర-నిత్యసంగం - శ్రేష్ఠవస్తువుల కన్నిటికి స్థానమైనవానితో - సముద్రునితో - సదాసాంగత్యమును, ప్రాప్యాపి=పొందియు, కపర్దిక-కపర్దికా-ఆశాం=శివుని శిరస్సునందు - గుల్లలయందు-కోరికను, నజహాతి=విడువదు.

తా. ఆకాశమునఁ బుట్టి ముత్యములతోను బంగారు మొదలైనవానితోను రత్నాకరునితోను సహవాసము గలిగియుండియు, గుల్లలను గోరెడు నీగంగ యిట్లు విష్ణుపాదమునఁ బుట్టి ముక్తపురుషులతోఁ గూడి భీష్మాదులను బుట్టించి రత్నాకరసాంగత్యముతో నున్నను, ఆకపర్ది శిరస్సున నుంటయే కోరుచున్నది.

తే. విష్ణుపదమున నుదిత యైయె ౯ విష్ణుపదియె
యవుర! ముక్తావళీశ్రిత ౯ యై వసుప్ర
ధానగాంగేయజనక యైయె ౯ దాన కోరి

ప్రమదమునఁ బాటి రత్నాకరమును జేరి
యును గపర్ది కాశఁ బ్రకాశమునను విడదు.

టి. వసుప్రధాన గాంగేయజనక=ధనములలో ప్రధానమైన బంగారమును పుట్టించునది - అష్టవసువులలో ప్రధానుఁడైనభీష్ముని పుట్టించునది.

అన్యచ్చ.— మఱియొకటి.—

వృ॥ సర్వతోముఖసమృద్ధిజుషోద్య
త్పౌండరీకవనవాసనయాఽపి
య త్తయాఽప్యవధిజహ్నుమఖ స్త
త్సత్రఘాతి చిరసంగతి దోషాత్ ॥ 511

అ. సర్వతోముఖ-సమృద్ధిజుషా=యజ్ఞవిశేషములయు-జలములయు-సమృద్ధిని పొందినదియైనను, ఉద్యత్-పౌండరీకవన-వాసనయాపి=ప్రబలించుచున్న-యజ్ఞవిశేషములయు - తెల్లఁదామరలయు-సమూహామందలి - సంస్కారము-పరిమళముగలదియైనను; తయాపి=ఆగంగచేతకూడ, జహ్నుమఖః=జహ్నుముని యజ్ఞము, అవధి=నశింపఁజేయఁబడినది, యత్=ఏదియో, తత్=ఆయజ్ఞనాశము, సత్రఘాతి-చిరసంగతి-దోషాత్=దక్షయజ్ఞధ్వంసకుఁడైన శివునియొక్క-, చిరకాలసాంగత్యమనెడి - దోషమువలననే.

తా. నీటి నిండికయు నిండు తెల్లఁదామరలును గలిగి, యజ్ఞవిశేషములును వాని సంస్కారములును గల్గియుండు నీగంగానదిచేతఁ గూడ ఆదక్షయజ్ఞధ్వంసకుఁడైన శివునిసాంగత్యదోషమువలననే కదా? ఈజహ్నుమునియజ్ఞము కూడ ధ్వంసము చేయఁబడినది.

తే. సర్వతోముఖసుముఖ మఖవ్యసుఖము
పౌండరీకవాసనము నకపఁకధనము
నయ్యు, జాహ్నవీర్షుకము జాహ్నవసవన మొ
సవననాశిసహవసతి సమయఁ జేసె.

టి. సర్వతోముఖ సుముఖము = యజ్ఞవిశేషములందును - జలములందును-

ప్రేమ కలది, పౌండరీక-వాసనయా = పౌండరీకయజ్ఞవిశేషములయు- తెల్లఁ దామరలయు - సంస్కారము-పరిమళము కలదియు, అపంకధనము=అపాపులే-అడుసు లేమండుచే ధనముగాఁ గలదియు, సవననాశి-సహవసతిః =దక్ష యజ్ఞధ్వంసకుఁడైన శివునియొక్క - సహవాసముచేత, జాహ్నవ సవనమె = జహ్నుమునిసంబంధియైన యాగము నె, సమయఁజేసె=నాశము చేసెను.

ఇ. జహ్నుముని—బుధునిపుత్రుఁడైనపురూరవునిపుత్రుఁడు అమవసువు,అతని పుత్రుఁడైన భీమునిపుత్రుఁడు సుహోత్రుఁడు, అతనిపుత్రుఁడు ఇతఁడు; ఇతఁడు భగీరథునిప్రార్థనమున విష్ణుపది అయిన గంగ శివునిజటాజూటమునుండి ప్రవహించివచ్చి తనఆశ్రమమును ముంచుకొనఁగా, తాను దానిఁ బానముచేసి మరల ఆభగీరథుఁడు ప్రార్థించినందున తనచెవినుండి విడిచి పచ్చినందువలననే ఈగంగయు జాహ్నవి అనఁబడియె.

పునర్విమృశ్య.—మఱి విమర్శించి.—

వృ॥ ఈశః కరస్వీకృత కాంచనాద్రిః
కుబేరమిత్రం రజతాచలస్థః
తథాపి భిక్షాటన మస్యజాతం
విధౌ శిరస్థే కుటిలే కుత శ్శ్రీః॥ 512

అ. ఈశః=ప్రభువైనశివుఁడు, కరస్వీకృతకాంచనాద్రిః=చేతఁగైకొన్న బంగారుపర్వతము కలవాఁడు, కుబేరమిత్రం=ధనాధిపుఁడైన కుబేరునికి స్నేహితుఁడు, రజతాచలస్థః=వెండికొండలో నుండువాఁడు; తథాపి=అయినను; అస్య=ఇతనికి, భిక్షాటనం=బిచ్చమునకై తిరుగుట, జాతం=కలిగినది. కుటిలే= వక్రమైన, విధౌ=దైవము - చంద్రుఁడు, శిరస్థేసతి=తలలో నుండఁగా, శ్రీః= లక్ష్మి, కుతః=ఎక్కడిది?

తా. ఈశివుఁడు తనచేత బంగారుకొండయును, ఇంట వెండికొండయును, ప్రక్క ధనాధిపతియైన కుబేరుఁడే స్నేహితుఁడుగాను ప్రభువుగానుండియు; అతనితలను వక్రమైనదైవము దుండుటవలన అతనికి లక్ష్మి యెట్లునిలుచును?

తే. హరుఁడు కనకాద్రికరుఁడు నీశ్వరుఁడు తానె
శ్రీదహితుఁడను రజతాద్రిస్థితుఁడు నయ్యుఁ
దిరిప మేగతి యయ్యె సుస్థితిఁ దనకు
రాజె తల ద్రొక్క సిరి యెక్కనోజ యెట్లు.

టి. శ్రీద-హితుఁడు = కుబేరునకు-ప్రియుఁడు, రాజె=చంద్రుఁడె - మహాప్రభువె. (అర్థాంతరన్యాసాలంకారము).

ఇ. కాంచనాద్రి— మేరుపర్వతము— 454 వృత్తముక్రింద చూడు.

రజతాద్రి— కైలాసము— ఇది హిమవత్పర్వతమునకు వెనుకటిప్రక్క వెండిమయమై తనయందు మాణిభద్రాదిగుహ్యకులకు అధిపతి యై నవనిధులకును పతియై వసియించు కుబేరునితోడిస్నేహముతోఁ గూడ మహేశ్వరుఁడును తనకు అధిపతియై తనయందె వాసము చేయఁబడుచునున్న పర్వతము.

కించ.—మఱియు.—

గ॥ ఏష విరుద్ధధర్మా కృత్తివాసాః కుత స్తోతవ్యః॥ 513

వ. ఈవిరుద్ధధర్ముఁడు పరివేష్టితకరిచర్ముఁడు నెుగడఁదగువాఁ డగుట యెట్లు?

శ్రుణుతావత్ :—విను మంతయు.—

వృ॥ధత్తే మహోమూర్ధ్ని జడౌషధీశ
వహ్నాషర్బుధం ఫాలతలేఽంగకేషు
ఫణీంద్రమాళిస్థమణిప్రసూతం
హరోంధకారిత్వ మథాప్యుపైతి॥ 514

అ. హరః=శివుఁడు, మూర్ధ్ని=తలయందు, జడ-ఔషధీశం=చల్లని-చంద్రసంబంధియైనదియు, ఫాలతలే=నొసట, ఔషర్బుధం=అగ్నిసంబంధియైనదియు అంగకేషు=అంగములయందు, ఫణీంద్రమాళిస్థ-మణి-ప్రసూతం=మహాసర్పముల తలలందుండునట్టి-రత్నములవలన-పుట్టినదియునైన, మహః=తేజస్సును, ధత్తే=ధరించుచున్నాఁడు; అథాఽపి=ఇటుండియు, అంధకారిత్వం=చీఁకటికలుగఁ

జేయువానిగుణమును-అంధకాసురునికి శత్రువనుగుణమునున్, ఉపైతి=పొందుచున్నాఁడు.

తా. ఈశివుఁడు తనతలలో చంద్రతేజస్సును, నొసటిలో అగ్నితేజసును, వింటిలో సర్పశిరస్సులరత్నతేజమునున్ ధరించియు; తాను అంధకారియే అగుట ఆశ్చర్యము!

క. తల శీతలరుచిరోచి నొ
సల రోచిష్కేశరోచి సకలాంగములం
దుల ఫణిసుమణీరోచియుఁ
గలిగియునుం దొలఁగ దంధకారిత తనకున్.

టి. శీతలరుచిరోచి=చంద్రునితేజస్సు, రోచిష్కేశరోచి=అగ్నితేజస్సు.

ఇ. అంధకాసురుఁడు—వీఁడు దనువంశస్థులలో నొకదానవుఁడు, శివునిచేతనే సంహరింపఁబడినవాఁడు.

అపిచ.— మఱియు.—

వృ॥ తారకారిం వహ న్నంకే
మస్తకే తారకాధిపమ్।
అంగీకుర్వన్ సుదృశమ
ప్యలీకాక్షో విభాత్యయమ్॥ 515

అ. అయం=ఇతఁడు, అంకే=ఒడిలో, తారకారిం=తారకాసురశత్రువైన కుమారుని, మస్తకే=తలలో, తారకాధిపం=చంద్రునిన్, వహన్=వహించుచు, సుదృశం=మంచికంటెని-పార్వతిని, అంగీకుర్వన్నపి=స్వీకరించుచున్నను; అలీకాక్షస్సన్=కపటమైన-నెత్తిని కన్నుకలవాఁడగుచు, విభాతి=విరుద్ధముగా-విశేషముగా ప్రకాశించుచున్నవాఁడు.

తా. ఈశివుఁడు ఒడిని తారకారి నుంచికొని దానికి విరుద్ధముగా తలలో తారకాధిపతి నుంచికొనుటయు; (తగినచోట మంచికన్నుంచికొని, దానికి విరుద్ధముగా) నెత్తిచోట నొక్కకన్నైన నుంచికొనుట తగునా?

ఆ. తారకారి నంకసీతలమునఁ దాల్చుచుఁ
దారకాధిపతిని దలను దాల్చి
యశదృశను సుదృశను సంగీకరించుచు
నయిన, నళికనయనుఁ డలరు నెట్లు ?

ఇ. తారకారి=కుమారస్వామి. 449 వృత్తము చూడుఁ?

తారకాసురుఁడు—వీఁడు కశ్యపునికొడుకైన వజ్రాంగునికొడుకు, వీఁడు తపస్సుచేసి బ్రహ్మను గని ఎవరిచేనైనను చావులేకుండు వరమడుగఁగా, పుట్టిన యేడవదినములోని బాలునిచేమాత్రముగాక మఱెవరివలననైనను చావులేనివరముతీసికొని, ఏడుదినాలబాలుఁడైన ఆకుమారస్వామిచేతనె చంపఁబడినవాఁడు.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ కిమేభి శ్శబ్దశ్లేషైః శరణై ర్దూషణై రస్యఖలు మృత్యుంజయస్య విశ్వస్తుత్య మన్యాదృశం వదాన్యత్వమ్॥ 516

వ. ఈశబ్దశ్లేషలే ముఖ్యాశ్లేషము లైనదూషణము లేల? ఈ
శివునియొక్క యసదృశ మయినవదాన్యత్వము జగద్వినుత్య
మె కదా?

టి. ముఖ్య-ఆశ్లేషములు = ముఖ్యముగ - కూడికకలవి, జగత్-వినుత్యము= లోకముచేత - వినుతింపఁదగినది.

ఇ. మృత్యుంజయుఁడు=శివుఁడు, ఇతఁడు తన్నుగుఱించి తపస్సుచేయుచున్నమార్కండేయమహర్షిని యముఁడు పట్టి వధించినందున, తా నాఋషిని విడిపించుటకై మృత్యువనఁబడుచున్న ఆయముని తనకోపముతో కాలితో తన్ని జయించినయతఁడు. చూడుఁ? 451 వృత్తమువిూఁద.

వృ॥ దీర్ఘాయు ర్మునిసూనవే స్మరదతే దివ్యం తథాఽభీష్టదమ్
ప్రఖ్యాతాయ భగీరథాయ భగవత్పాదామృతం ప్రాదదాత్
పాపేభ్యోఽపిచ బాణపంక్తివదనప్రష్ఠేభ్య ఇష్టం ఫలమ్
ప్రాదా త్తస్య శివస్య భాతి జగదాహ్లాదాయ హాదాన్యకమ్॥

అ. యః=ఏశివుఁడు, మునిసూనవే=మునిపుత్రుఁడైన మార్కండేయునికై, దీర్ఘాయుః=దీర్ఘాయుస్సును, దదతేస్మ=ఇచ్చెనో; తథా=అట్లు, ప్రఖ్యాతాయ=ప్రసిద్ధుఁడైన, భగీరథాయ=భగీరథునకై, అభీష్టదం=కోరికలనిచ్చునదై, దివ్యం = అసామాన్యమైన, భగవత్పాదామృతం= విష్ణుపాదామృతమైనగంగను, ప్రాదాత్ =ఇచ్చెనో; బాణపఙ్క్తివదనప్రష్ఠేభ్యః=బాణాసురుఁడు-రావణుఁడు-ముందుగాఁగల, పాపిభ్యోఽపిచ=పాపులకైకూడ, ఇష్టంఫలం=కోరినఫలమును, ప్రాదాత్ =ఇచ్చెనో; తస్యశివస్య=అట్టిశివునియొక్క, వాదాన్యకం=దాతృత్వము, జగత్ ఆహ్లాదాయ = లోకముయొక్క సంతోషమునకై, భాతి=ప్రకాశించుచున్నది.

తా. మార్కండేయునకు దీర్ఘాయువును, భగీరథునకు కోరుకొన్న విష్ణుపాదతీర్థమును, మహాపాపులగు బాణాసుర రావణాసురాదులకుఁగూడ కోరినఫలములను నిచ్చినయీశివునిదాతృత్వము లోకాహ్లాదకము కాదా?

ఉ. ఇచ్చెను దీర్ఘమాయువును కే నిమ్ముగ నమ్మునిపుత్రుఁ బిల్చి, తా
నిచ్చెఁ జుమీ? భగీరథున కే కిష్టము విష్ణుపదామృతంబు వే
నిచ్చెను బాణరావణము కేఖేష్టుల కిష్టము లెల్లలోకముల్
మెచ్చఁగదా? వదాన్యతకు కే మిక్కిలి మిక్కిలికంటి దేవరన్.

ఇ. మార్కండేయుఁడు-భృగుమహర్షి పుత్రుఁడైనమృకండుమహర్షి పుత్రుఁడు.

భగీరథుఁడు—— 41వ వృత్తముక్రిందఁ జూడు?

బాణాసురుఁడు — వీఁడు బలిచక్రవర్తిప్రథమపుత్రుఁడు, వేయిచేతుల వాఁడు; వీఁడు తనకు తెలియక తనకూఁతురైన ఉష అనిరుద్ధుని కోరి వివాహముచేసికొనఁదెప్పించి యుంచుకొని యుంటను విని ఆయనిరుద్ధుని కారాగృహమున నాగపాశబద్ధుని జేసినది తెలిసి, ఆ యనిరుద్ధునితాతగారైన యాశ్రీకృష్ణమూర్తి వచ్చి యుద్ధముచేసి వానిచేతులు నఱుకుచుండఁగా, శివుఁడు వచ్చి వేఁడుకొని వానిని నాల్గుచేతులుమాత్రము కలవానినిగా నిలిపికొని తనప్రమథగణమున అగ్రేసరునిగాఁ జేసికొనఁబడి యున్నవాఁడు.

పంక్తివదనుఁడు—రావణాసురుఁడు— పదితలలవాఁడు, లంకారాజు, కుంభకర్ణ విభీషణులయన్న, మండోదరిమగఁడు, శ్రీరాములచే సంహరింపఁబడినవాఁడు. (వీరు సనకసనందనాదులశాపముచే జయవిజయులు అను శ్రీమహావిష్ణుద్వారపాలకులు రావణకుంభకర్ణులుగాఁ బుట్టినవారు.)

కృశానుః.—కృశానువు.—

గ॥ తదేత దాహతం భాషితం యస్మహాదేవస్య వాదాన్యకం జగదాహ్లాదయతీతి॥ 518

టి.. ఆహతం=కొట్టుపడినది - సరికాదు.

వ. ఎయ్యది వామదేవునివాదాన్యక మెల్లలోకముల మెప్పించుచున్నది యన్నదియో ? అయ్యది యనృతము వైయున్నయదియు.

యతః.—ఏలంటే ?—

వృ॥దత్వా వరం దానవరాక్షసేభ్యో
విశ్వస్యచ స్వస్యచ యో విషాదమ్।
సంపాదయామాస శశాంకమౌళే
ర్దాతృత్వ మేతస్య తవైవ హృద్యమ్॥ 519

అ. యః = ఏశివుఁడు, దానవరాక్షసేభ్యః = దనుజులకును రక్కసులకును, వరం=వరమును, దత్వా=ఇచ్చి, విశ్వస్యచ=లోకమునకును, స్వస్యచ=తనకును, విషాదం=దుఃఖమును, సంపాదయామాస=కలుగఁజేసెనో, ఏతస్య=అట్టియీ, శశాంకమౌళేః=శివునియొక్క, దాతృత్వం=దానగుణము, తవఏవ=నీకే, హృద్యం=మనోహరము.

తా. దనుజులకేకాక, రక్కసులకుఁ గూడ వరములిచ్చి లోకులుకాక, తానుగూడ దుఃఖపడినట్టి యీయీశ్వరునిదానగుణము నీకు మాత్రమే మనోహరముగాని, మాకెవ్వరికిని మనోహరము కాదు.

క. దనుజులకును రాక్షసులకు

ననిశము వర మొసఁగి లోకహాని స్వహానిన్
బొనరిచికొను నీభూతే
శునికిని గలదానగుణము శ్రీ చోద్యము నీకే.

విశ్వావసుః.— విశ్వావసువు —

గ॥ కుటిలధిషణ ! గుణమపి దోషఇతి ఘోషయతి భవాన్ ॥ 520

వ. ఓకుటిలమతీ ! గుణమునైనను దోష మనియే ఘోషించు చున్నావు నీవు.

తథాహి.—అది సరే.—

వృ॥ దైత్యేభ్యో స వరా నదాస్యతయది త్ర్యక్షో ముహు స్తర్హి తే
నాశక్ష్య న్భువనాని పేష్టుం, ముదయం నాప్స్య ద్దయా శార్ఙ్గిణః
నోదాయిష్యత మానుషాదిషు హరి ర్నో సేతు గీతాదికమ్
ప్రాభంత్స్యద్భగవాన్ భవార్ణవమమీ నాలంఘయిష్యన్నరాః॥

అ. సః-త్ర్యక్షః=త్రినేత్రుఁడయిన ఆశివుఁడు, దైత్యేభ్యః=రాక్షసులకు, వరాన్=వరములను,న అదాస్యత యది=ఇయ్యనివాఁడయ్యె నేని, తర్హి=ఐనప్పుడు, తేదైత్యాః=ఆరాక్షసులు, ముహుః=పలుమాఱు, భువనాని=లోకములను, పేష్టుం=నశింపఁజేయుటకు, నాశక్ష్యన్=సమర్థులు కాఁజాలరు; శార్ఙ్గిణః=విష్ణువుయొక్క, దయా=కృప, ఉదయం నాప్స్యత్=పుట్టఁజాలదు, మానుషాదిషు =మానుషాదిజాతులయందు, హరిః=విష్ణువు, నోదాయిష్యత=ఆవిర్భవింపఁజాలఁడు, భగవాన్=ఆభగవంతుఁడు, సేతుగీతాదికం=సేతువు భగవద్గీత మొదలైనదానిని, నోప్రాభంత్స్యత్ = బంధింపఁజాలఁడు, అమీ=ఈ, నరాః=మనుష్యులు, భవార్ణవం=పాపసముద్రమును, నాలంఘయిష్యన్ =దాఁటఁజాలరు.

తా. ఈశివుఁ డారాక్షసులు కోరిన వరా లీయనియెడల, వారు లోకములకు బాధకులు కారా? అప్పుడు విష్ణువు దయకలిగి, ఆరామకృష్ణాదులుగాను అవతరింపక పోవును; అవతరింపనియెడల ఆసేతుబంధన భగవద్గీతాదులు కలుగక పోవును; అవి లేనియెడల మనుష్యులు తరింతురా? ఇది శివుని గుణము కాదా? [illegible] ముఁ?

చ. దితిజులకై వరంబు లిడఁగోడ్తే హరుఁ డాదితిపుత్రు లీజగ
త్త్రితయముఁ పాడుసేయ బలుకోవిట్టలు కారె? తదర్థ మారమా
పతికి దయారసంబు ప్రభకోవంబును గాదు, రమాధినాథుఁ డ
ద్వితయత నిద్ధరిత్రి నవకోతీర్ణుఁడుగాఁ డలసేతుగీతముల్
వితతము గాఁగ నేర్పడవు కోవీఁకఁ దరింపరు లోకు లేకడన్.

కించ.—మఱియు.—

వృ॥ కంపాతరంగ శిశిరానిల డింభజాత
కంపాౖమ నిష్పతితపుష్పరసాభిషిక్తః
సంపాదయ త్యతులసంపద మర్థినోఽను
కంపాసుధాంబుధి రయం పతి రంబికాయాః॥ 522

అ. కంపా-తరంగ - శిశిర-అనిలడింభ - జాత-కంప-ఆౖమ-నిష్పతిత-పుష్ప రస-అభిషిక్తః = కంపానదియొక్క - అలలచేత - చల్లనైన - పిల్లగాలిచేత - పుట్టిన-కదలికగల - మామిడిచెట్టునుండి - జాఱిపడిన - మకరందముచేత - అభి షేకము చేయఁబడినవాఁడును, అనుకంపా-సుధా - అంబుధిః=దయ అనెడు- అమృతమునకు - సముౖదునివంటివాఁడు నైన, అంబికాయాఃపతిః = పార్వతీ పతి, అర్థినః=ౖపార్థించువానికి, అతులసంపదం=సాటిలేని సంపదను, సంపా దయతి=కలుగఁజేయు చున్నాఁడు.

తా. కంపానది యలలనుండి వచ్చిన చల్లని పిల్లి గాలికిఁ గదలి మామిడిపూ వులనుండి జాఱి వెల్లువయైవచ్చు తేనెచేతనే అభిషేకము గలిగియుండు నీయే కాౖమేశ్వరుఁడు ౖపార్థించువారికి అత్యంతదయతో అఖిలైశ్వర్యము లిచ్చు చుండువాఁడు.

క. కంపాకల్లోలానిల
కంపితసహకార కుసుమ కోగంధిలకాయుం
డింపారఁగ నీహరుఁ డను
కంపానిధి సంపద లిడుఁ కోగడు నరులకున్.

కంపానది—ఇది ఈకంచి సమీపభూమిలోని అశ్వా, మంజుళా, కంపా, హారిద్రా, విరజా, క్షీరా, వేగవతీ అను నీసప్తనదులలో నొకటి.

గ॥ పురీం నిరీక్ష్య సశ్లాఘం॥ 523

వ. కాంచీపురి నిరీక్షించి శ్లాఘాసహితంబుగ.

శ్లో॥ అల్పోఽపికాంచ్యా మావాసా దాసాదయతి గౌరవమ్
యత ఏతత్పురస్థాణు ర్గిరీశ ఇతి గీయతే॥ 524

అ. అల్పోఽపి=అల్పుఁడె నైనను, కాంచ్యాం=కంచిలో, ఆవాసాత్ = వాసము చేయుటవలన, గౌరవం=గొప్పతనమును, ఆసాదయతి = పొందుచున్నాఁడు, యతః=ఎందువలన (అంటే?), ఏతత్ పురస్థ-అణుః=ఈ కాంచీపట్టణమం దుండెడు-అణుమాత్రవస్తువు - ఏతత్పుర-స్థాణుః ఇతి=ఈకంచియందలి-ఏకామ్రేశ్వరుఁడు అనియు, గిరీశ ఇతి=పర్వతశ్రేష్ఠ మని - కైలాసపతి యనియు, గీయతే=వ్యవహరింపఁబడుచున్నది.

తా. ఈకంచిలోని యేయణుమాత్రవస్తు వైనను; కైలాసముగాను, కైలాసనాథుఁడుగాను అగుచున్నాఁడు గాన, ఇఁక నేపురుషుఁ డెంతయల్పుఁ డైనను, ఈకంచియం దుండువాఁ డెంతో మహత్త్వము కలవాఁడె యగును.

ఆ. అల్పతనువుసయితి * మావాసమునఁ జేసి
గౌరవంబు కాంచి * కాంచి వెలయు
నేల? యనఁగఁ దనుగ * నీపురస్థాణువు
పొగడఁబడుగిరీశు * డుగను నెగడి.

కృశానుః.—కృశానువు.—

గ॥ అన్యోన్యధర్మవిరుద్ధస్వభావాభ్యాం దేవాభ్యా మాక్రాంతా
మేనాం నగరీం విస్తౌషి॥ 525

వ. పరస్పరధర్మవిరోధిస్వభావదేవత లిద్దఱి వడిఁ బైకొనెడియీనగరిని గొనియాడుచున్నాఁడ వేమి?

వృ॥ దేవ... [illegible] ...

స్త్వత్రైకః కురుతే వినాయకమధ శ్చిత్రం పురశ్చాపరః
ఏకో నిత్య మనష్టమూర్తిరితరః ఖ్యాతోఽష్టమూర్తి ర్జగ
త్యేకో వారితవాన్ గజార్తి మచిరాద్రత్యాగజార్తిం పరః॥

అ. అధికాంచి=కంచియందు, ద్వౌ=ఇద్దరు, దేవౌ=విష్ణురుద్రులు, ప్రాచీప్రతీచ్యాశయోః=తూర్పుపడమరదిక్కులందు, లసతః=ప్రకాశించుచున్నారు. తత్ర=వారిలో, ఏకః=ఒకఁడు, వినాయకంచ=పక్షినాయకుఁడైనగరుడునిన్, అధః కురుతే=క్రిందుపఱచుచున్నాఁడు - వాహనమునుగాఁ జేసికొనుచున్నాఁడు; అపరః=మఱియొకఁడు, పురః కురుతే=ముందు పెట్టుకొనుచున్నాఁడు-పుత్రునిగాఁ జేసికొనుచున్నాఁడు; ఏకః=ఒకఁడు, నిత్యం=ఎల్లప్పుడును, అనష్టమూర్తిః=అష్టమూర్తికాఁడు - నశింపఁబడనిమూర్తి కలవాఁడు, జగతి=లోకమున, ఖ్యాతః=ప్రసిద్ధుఁడె; ఇతరః=మఱొకఁడు, అష్టమూర్తిః = అష్టమూర్తులు కలవాఁడు, జగతిఖ్యాతః=లోకమున ప్రసిద్ధుఁడె; ఏకః=ఒకఁడు, గజార్తిం=గజేంద్రునిబాధను, అచిరాత్=త్వరగా, వారితవాన్=పోఁగొట్టెను; పరః=ఇతరుఁడు, అగజా-ఆర్తిం=పర్వతపుత్రి యైన పార్వతిమన్మథబాధను, రత్యా=సురతముచేత, వారితవాన్=పోఁగొట్టెను. పశ్య=చూడు? (క్రమవిరుద్ధాలంకార.)

తా. ఈకంచిలో తూర్పున వరదరాజులు వినాయకుని (గరుడుని) వాహనముగాఁ జేసికొని, నష్టమూర్తి కాక, గజార్తిని (గజేంద్రదుఃఖము) పోఁగొట్టినవాఁడు; పడమర ఏకామ్రేశ్వరుఁడో ఆవినాయకుని బిడ్డనుగాఁ బెట్టుకొని, అష్టమూర్తియై, అగజార్తిని-పార్వతిదుఃఖమును, పోఁగొట్టెను.

సీ. పొడుపుఁజక్కి నొకండు పొ విడుపుఁజక్కి నొకండు
 ధృతి నుండు, ముని కొండె పొ దిక్కు వేఱు
క్రిందు నొకండును పొ ముందు నొకండు వి
 నాయకు నిడు నిడుకొటాయె వే ఱ
నష్టమూర్తి యొకండు పొ నష్టమూర్తి యొకండు

మూర్తివార్త యొకండ ♦ మునుపు వేలు
ఆగజార్తి యొకండు ♦ నగజార్తియు నొకండు
పాఁవుఁ, బాఁపుటొకండె ♦ రూపు వేలు.
తే. కాంచి నెలకొన్న చెలు వున్న ♦ గాంచినపుడె
కాంచఁగానగు నగుఁబాటె ♦ కాంచువారి
కేరికేనియుఁ గాని యి ♦ దేరి కెటుక
యేటివైరుద్ధ్యమో కాని ♦ నేఁటిదనుక.

వినాయక, అష్టమూర్తి, అగజల ఇతిహాసము.

వినాయకుఁడు— 442 వృత్తముక్రిందఁ జూడుు?

అష్టమూర్తి—ఇతఁడు భవుఁడు, శర్వుఁడు, ఈశానుఁడు, పశుపతి, భీముఁడు, ఉగ్రుఁడు, మహాదేవుఁడు, రుద్రుఁడు అని యెనిమిది నామములు వరుసతో మూర్తులు గలిగియుండు మహేశ్వరుఁడు. (443 చూడుు?)

అగజ=పర్వతపుత్రి - పార్వతి. 432 వృత్తముక్రింద చూడుు?

యద్వా.—ఏదేని.—

వృ॥ కాంచీనామ్ని పురే సురేశమహితే ప్రాక్పశ్చిమోద్దేశయో
శ్చిత్రం దైవతయోశ్చిరం నివసతో రీతి ర్విరుద్ధా మిథః
ఏకో యద్ద్విజరాజమ ప్యధరయ త్యన్య స్త ముత్తంసయ
త్యంఘ్రిణా హంత! బిభర్తి కశ్చిదపర స్స్వమూర్ధని స్వర్ధునీమ్॥

అ. సురేశమహితే=దేవేంద్రునిచే పూజింపఁబడిన, కాంచీనామ్నిపురే=కంచి అనుపేరుగలపట్టణమందు, ప్రాక్పశ్చిమోద్దేశయోః పూర్వపశ్చిమదిక్ప్రదేశములలో, నివసతోః=వసించుచున్న, దైవతయోః=దేవతలయొక్క, రీతిః=ప్రకారము, మిథః=పరస్పరము, విరుద్ధా=వ్యతిరిక్తము; చిత్రం =ఆశ్చర్యము! యత్ =ఎందువలన (అంటే)ద్విజరాజమపి=పక్షిరాజైన గరుత్మంతునిన్ ,ఏకః=ఒకఁడు, అధరయతి=వాహనముగా క్రిందుసఱచుచున్నాఁడు; అన్యః = మఱియొకఁడు, తం=అనక్షత్రరాజైన చంద్రుని, ఉత్తంసయతి=శిరోభూషణము

గాఁ జేసికొనుచున్నాఁడు; కశ్చిత్ =ఒకానొకఁడు, స్వర్ధునీం=ఆకాశగంగను, స్వేఅంఘ్రౌ=తనపాదమందు, బిభర్తి=భరించుచున్నాఁడు. అపరః = మఱియొకఁడు, స్వేమూర్ధని=తనతలయందు, బిభర్తి=భరించుచున్నాఁడు. హంత =అయ్యో!

తా. ఈకంచియందు ఆతూర్పున వరదరాజులు ఆద్విజరాజునే క్రిందుపఱచుకొన్నది కాక, ఆదేవగంగినుగూడఁ గాల జవులుకొనుచున్నవాఁడు గాని, పడమర ఏకామ్రేశ్వరుఁడో ఆద్విజరాజును తనతలయందుఁ బెట్టుకొని, ఆదేవగంగను గూడ తలయందె నిలుపుకొనుచున్నాఁడు. ఇదేమి పరస్పరవిరుద్ధమో? ఇదేమి ఆశ్చర్యమో? ఆహా! (ఇదియును క్రమ, విరుద్ధ అలంకారములు.)

తే. కాంచి నెదురెదురుగ నెదిరించి యిటుల
నుంటె కాకొక్కఁడొక్కఁడు కేదుంట లగుచుఁ
దలను గాలను లీలను కేదనుగఁబట్టెఁ
బెట్టె విధుని నీసురధుని కేనట్టె చూడు?

టి. విధుని=చంద్రుని, సురధుని=గంగను; (క్రమాలంకారము.)

గ॥ ఇతి విరుద్ధదేవాక్రాంత కాంచీనగర సమాగమా ద్వారణ
ధరాధరోఽప్యేవమ్॥ 528

వ. అని విరుద్ధదేవత లాక్రమించు నీకాంచితోఁ గాంచినవారి సమాగమంబు బలంబుచే నీవారణధరాధరంబు సైతమిట్టిదయగును.

తథాహి —అట్టిది సరే.—

వృ॥ ఛేత్తా గోస్త్రాచ హరి
ర్మహాసపజుణో హిరణ్యగర్భస్య
భయస్య దిభస్యాభయస్య
స్మాలాంచలయో శ్చ కాస్తి హస్తిగిరేః॥ 529

అ. మహో [illegible] -పొంది

యుండువాఁడైన,హిరణ్యగర్భస్య=హిరణ్యకశిపునకు-బ్రహ్మకు, ఛేత్తా=నాశకుఁడు, గోప్తా=రక్షకుఁడును; ఇభస్య=గజమునకు, భయకృత్=భయకారియు, అభయకృత్=అభయకారియు నైన, హరిః=నరసింహస్వామియు-వరదరాజస్వామియు, హస్తిగిరేః=ఈకరిశైలముయొక్క, మూల-అంచలయోశ్చ=క్రిందను-శిఖరమునందును, చకాస్తి=ప్రకాశించుచున్నాఁడు.

తా. ఈహస్తిగిరిక్రింద మద్యపాయియైన హిరణ్యకశిపుని సంహరించినది కాక, గజములనుఁ భయపఱచునతఁడైన నరసింహస్వామియు, శిఖరమున యజ్ఞకర్తయైనబ్రహ్మను రక్షించినది కాక, గజేంద్రున కభయమిచ్చినతఁడైన వరదరాజస్వామియు ప్రకాశించుచున్నవారు.

ఇభ అభయకృత్తు = గజేంద్రున కభయము నిచ్చినవాఁడు 25 వృత్తము క్రింద చూడు ?

క. కరిగిరిదరిఁ జరి నడుఁగిడి
హరి కరికి భయము నభయము నొనరించునుగా
ఇరవుకొని కనకగర్భునిఁ
గర మాసవపునిఁ గ్రుధఁ గృపఁ గ్రాఁచెఁ గాచెన్.

టి. ఆసవపుని=మద్యపాయియైన-ఆయజ్ఞపాలకుఁడైన, కనకగర్భునిన్ = హిరణ్యకశిపుని-బ్రహ్మను, క్రుధన్=కోపములో, కృపన్=కరుణతో, క్రాఁచెన్ = తపింపఁజేసెను, కాచెన్=కావన్-రూపాంతరములు. (క్రమాలంకారములు.)

గ॥ అయంచాపరో దోషః॥ 530

వ. మఱియు నిదియు నొకదోషముగ నున్నయది.

వృ॥దరానుషంగంచ గదాన్వయాంచ
త్యక్త్వా జనా యే నివసంతి కాంచ్యామ్
దంతావళాద్రీశ్వర మాశ్రితాస్తే
దేవా[illegible] 531

అ. యే-జనాః=ఏ-జనులు, దర-అనుషంగంచ=భయముతోడి-కూడికయు, గద-అన్వయంచ=రోగముతోడి-కూడికయును, త్యక్తుం = విడుచుటకై, కాంచ్యాం=కంచిలో, నివసంతి = నివసించుచున్నారో; తే=వారు, దంతావళాద్రీశ్వరం=హస్తిగిరిరాజమును, ఆశ్రితాః = ఆశ్రయించినవారై, దేహక్షయే=దేహాంతమందు, తౌ=ఆ,దర - అనుషంగంచ=శంఖ-సంబంధమునున్, గదా-అన్వయంచ=గదా-సంబంధమునున్, నియతం=నియమముగా, భజంతే=పొందుచున్నారు.

తా. ఈకంచిలో వాసముచేయువారు ఏభయముగాని, ఏరోగముగాని లేకుండుటకై ఈకరిగిరి నాశ్రయించి, తమదేహాంతమందు కామోదకీపాంచజన్యములు ధరించి విష్ణుసాయుజ్యమును పొందుచున్నారు. (శ్లేషాలంకారము.)

ఆ. కాంచివాస మెంచి కరిగిరీశ్వరుఁ గాంచి
జను లెదేది యేదికొనఁ దలంత్రు
ధరదరానుషంగ మరలేక తుద నదే
గద? గదానుషంగ మొనవఁ గాంత్రు.

టి. ఎదేది=ఏదరానుషంగ గదానుషంగములను, ఏదికొనన్=విడుచుకొనుటకై, తుదన్=అంతమందు, అదే = ఆపాంచజన్యకామోదకీసంబంధమును, కాంత్రు=విష్ణుసారూప్యమునకై కాంతురు.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సఖే! మైవం సంభాషిష్ఠాః ? యతఏకరూపధర్మదైవత మిదం నగరమితి సమర్థ్యతే॥ 532

వ. సఖుఁడా! యీవడువున నుడువకుము? ఒకటేరూప మైనధర్మము గలయీదైవతములఁ గలయది యని యీనగరము సమర్థింపఁబడుచున్నయది.

శ్రుణుతావత్.—విను మంతయు.—

వృ॥ ఫణిపతి సర స్ఫురంతీ

భనాయకధరో త్తమాంగశోభి తనుః
భవహారసంజ్ఞా కాంచ్యోః
పూర్వాపరయోర్హి దేవతా జయతి॥ 533

అ. ఫణిపతిసరస్ఫురంతీ=అనంతసరస్సునందు - (సర్పరాజులమాలెలచేత) ప్రకాశించునదియు, (ఇ) భనాయకధర ఉత్తమాంగ శోభితనుః=హస్తిగిరి యొక్క-(చంద్రునిధరించిన) శిఖరమందు (శిరస్సుచేత) ప్రకాశించు శరీరము కలదియు, భవహార-సంజ్ఞా=సర్వదోషహారమైన (భవుఁడు భవహారుఁడు అనెడు) నామధేయములు గలదియునైన, దేవతా=ఏకరూపదైవము, పూర్వాపరయోః=తూర్పుపడమరలుగాఁ గల, కాంచ్యోః=విష్ణుకంచి శివకంచులయందు, జయతిహి=సర్వోత్కృష్టముగా నున్నదికదా !

తా. చిన్నకంచిలో అనంత సరస్తీరమందు హస్తిగిరిశిఖరమున సకలభవ(-దోష)హారమైన నామధేయములతో వరదరాజస్వామియు, పెద్దకంచిలో సర్పహారములును, చంద్రశేఖరమును గలిగి, భవహారాది నామధేయములతో ఏకామ్రేశ్వరుఁడును నేకరూపమైన దైవముగా జయశీలురై యున్నవారు.

ఫణిపతిసరస్సు— అనంతసరస్సు.

తే. ఫణిసరస్స్ఫురితం బిది భవరధరశి
రోభిశోభితంబు భవహారాభిధంబు
నవనిఁ గాంచినఁ గాంచి పూర్వాపరంబు
లం బ్రమోదంబునన్ దైవతం బెలర్చు.

టి. (ఇ) భవరధరశిరః=కరిరాజగిరిశిఖరముచేత - నక్షత్రాధిపతిని ధరించిన శిరసుచేత.

గ॥ అన్యచ్చాస్య నగరస్య భూషణమేవ నతు దూషణమ్। ఇత్య
న్యత్ర దృష్టి మాదాయ సానందమ్॥ 534

వ. మఱియేదియేని యీపట్టణమునకు భూషణమేగాని దూషణము గాదు. అని యన్యత్రము దృష్టి సారించి సానందముగ.

గ॥ అహో! ఖలు మమాద్యపచేలిమం భాగధేయమ్॥ 535

వ. ఆహా! ఈభాగధేయము నాపూర్వపుణ్యపరిపాకమునకు రూపధేయము కదా ?

## పాండవదూతప్పెరుమాళ్ వర్ణనము.

పాండవదూతప్పెరుమాళ్ — (వీరు పాండవవంశమున జనమేజయమహారాజు వైశంపాయనమునివలన భారత మంతయు విని మాపాండవుఁడె యైయున్నయర్జునునకు దూతయై సారథియునై యుండిన శ్రీకృష్ణమూర్తిని నేను సేవించవలెనని యపేక్షింపఁగా, ఆమునివలన ఈసత్యవ్రతక్షేత్రమందు దశ్వమేధయాగమూలమున వారిసేవ అగు నన విని అతఁడట్లే చేయఁగా, అట్లే రుక్మిణీసత్యభామాసమేతుఁడై, యాశ్రీకృష్ణుఁడే యీవేదకోటివిమానమున ఇట్లు సేవ సాయించున్నతఁడు.)

వృ॥సురయూవతోపగీతః
ప్రాతః పద్మాననో మునిధ్యాతః
వ్యాసకృతౌ యః ఖ్యాతః
పాండవదూత స్సదృక్పథం నీతః॥ 536

అ. సురయూవత-ఉపగీతః=దేవయువతీసమూహముచేత - స్తోత్రము చేయఁబడువాఁడును, ప్రాతః పద్మాననః = ప్రాతఃకాలపుఁదామరవలె మొగము గలవాఁడును, మునిధ్యాతః=మహర్షులచేత ధ్యానము చేయఁబడువాఁడును, యః=ఎతఁడు, వ్యాసకృతౌ=వ్యాసునిచేఁ జేయఁబడిన భారతమందు, ఖ్యాతః=ప్రఖ్యాతిపొందినవాఁడో; సపాండవదూతః = ఆపాండవదూత నామ కృష్ణుఁడు, దృక్పథం=మాదృష్టిమార్గమును, నీతః=పొందఁబడినవాఁడు.

తా. దేవాంగనల గానమందును, నారదాదిమునుల ధ్యానమందును, వ్యాసాదికృతభారతాదులందును ప్రఖ్యాతుఁడై ప్రాతఃకాల తామరసమువలె ముఖమండలము గలపాండవదూతప్పెరుమాళ్లు ఇప్పుడు మన కనులకు నానందమును గలిగించుచున్నతఁడు. (అంత్యానుప్రాసాలంకారము).

క. ఖ్యాతుండు వ్యాసకృతినిం
బ్రాతఃపద్మాననుండు కే పాండవదూతుం
డాతతమునిసంధ్యాతుం
డీతఁడె కనుపడెడు సురసతీగీతుం డై.

కృశానుః.—కృశానుఁడు.—

గ॥ అనుచితకర్తాసౌ కిమర్థ మనువర్ణ్యతే॥ 537

వ. అనుచితకర్మఁ డగునితఁ డేమిటి కనువర్ణింపఁబడుచున్నాఁడు.

పృథాభువులు = పృథాపుత్రులు-పాండవులు కుంతిభోజుని పెంపుడుకూఁతురు కుంతి అను పాండవులతల్లికి పృథ అని సొంతపేరు.

వృ॥ సకలజగతా మీశానోపి స్వయం విగతశ్రియా
మిద మనుచితం దూతో జాతో యదేష పృథాభువామ్
కి మిహ మహతాం హృద్యా ఖద్యోతపోతనికేతనే
చిర మధిపతే ర్భాసాం దాసానుదాసతయా స్థితిః॥ 538

అ. ఏషః=ఇతఁడు, స్వయం=తాను, సకలజగతాం = సమస్తలోకముల కును, ఈశానోఽపి=ప్రభు వయ్యును; విగతశ్రియాం=విడిచిపోయినసంపదలు గల, పృథాభువాం=పృథాపుత్రులైనపాండవులకు, దూతః=దూతగా, జాతః= పుట్టినవాఁడు; (అనుట) యత్=ఏదో, తత్ ఇదం=ఆయిది, అనుచితం=తగినది కాదు. భాసామధిపతేః=తేజోధిపతియైనసూర్యునికి, ఖద్యోతపోతనికేతనే= మిణుఁగురుపురుగుపిల్లలయింట, చిరం = బహుకాలము, దాసానుదాసతయా= దాసులను అనుసరించుదాసునితనముతో, స్థితిః=ఉండుట, ఇహ = ఈలోక మందు, మహతాం=గొప్పవారికి, హృద్యాకిం=మనోహరమా ? (అనుప్రాసా లంకారము).

తా. ఇతఁడు సకలలోకములకును ప్రభు వయ్యును; తాను ఐశ్వర్యమంత యుఁ దొలఁగిపోయినయాపాండవులకు దూతగా నుండుట, సూర్యుఁడు పిల్ల మిణుఁగురుపురుగులయింట దాసానుదాసుఁడై యుండుట్ట లున్నయది.

తే. జగదధీశుఁడు తాన శ్రీవిగతులైన
పాండవులయింటిదూత యై పాటుపడు న
నంగ, జ్యోతిరింగణమందిరాంగణమున
నినుఁడు దాసానుదాసుఁడౌ ననఁగ నొకటె.

టి. జ్యోతిరింగణములు=మిణుఁగురుపురుగులు, శ్రీవిగతులు=ఐశ్వర్యవిహీనులు, మందిరాంగణమున=ఇంటివాకిట.

విశ్వావసుః.—విశ్వావసువు—

గ॥ పురోభాగిన్ భగవద్గుణేషు దోషమనీషయా భవానేవ దూష్యతి॥ 539

వ. ఓపురోభాగీ! ఈభగవద్గుణములందలి నీదోష మనీషచే నీవే యిట దూషింపఁబడియెదవు.

శ్రూయతా మేతత్.—ఇది వినఁబడుఁ గాక.—

వృ॥ కవిత్వస్య గాంభీర్య మౌదార్య మృద్ధేః
ప్రభుత్వస్య శౌర్యం గురుత్వస్య విద్యాం
మహావంశ్యతాయా స్సదాచారపూర్తిం
మహత్త్వస్య సౌలభ్య మాకల్ప మాహుః॥ 540

అ. కవిత్వస్య=కవనమునకు, గాంభీర్యం=గంభీరగుణమును; ఋద్ధేః=సంపదకు, ఔదార్యం=ఉదారగుణమును, ప్రభుత్వస్య=ప్రభు వగుటకు, శౌర్యం=శూరగుణమును; గురుత్వస్య=గురువగుటకు, విద్యాం=విద్యను; మహావంశ్యతాయాః=గొప్పవంశమునఁ బుట్టినవానిగుణమునకు, సదాచారపూర్తిం=మంచియాచారసంపూర్ణతను, మహత్త్వస్య = గొప్పతనమునకు, సౌలభ్యం=సులభగుణమును, ఆకల్పం=ఆభరణమునుగా, ఆహుః=చెప్పుదురు.

తా. కావ్యకవనమునకు గుణాలంకార వ్యంజనాదులతోడి గాంభీర్యగుణమె ఆభరణము, సంపదకు సమయానుసారముతోడి దాతృత్వగుణమె ఆభరణము, ప్రభుత్వమునకు నిత్యతుకత్వముతోడి శూరత్వగుణమె ఆభరణము; గురు వగు

టకు సర్వవిధములతోడి విద్వత్త్వగుణమె ఆభరణము, సత్కులజన్మమునకు శాస్త్రానుసారముతోడి సదాచారగుణమె ఆభరణము, మహత్త్వమునకు ఆశ్రితులకై అణఁకువతోడి సౌలభ్యగుణమె ఆభరణము అని యంద్ర అందురు.

సీ. కవితకు గాంభీర్యకలనముకై నడి
 ధనసమృద్ధికి దాతృతనము తరము
ప్రభుతకు శౌర్యసంప్రకటనపగిదిని
 గురుతకు విద్యాభినిరతిగతిని
నభిజనమునకును నాచారమునువలె
 బలిమికి బలహీనభరణమటులు
సరసవాణికిని వ్యాకరణముకరణిని
 సంపాదనమునకు సద్వ్యయంబు
తే. పోలెఁ బోల నాలోకింప నాలకింప
మహనిమహిమకు సౌలభ్యమనుహరహంబు
ననుగుణం బనఁ గద? యదే యనువు గాఁగ
జగదధీశునికరుణయే యగణితంబు.

టి. అదే=ఆచెప్పినదేఅంత, అనువుగాఁగన్=అనుకూలమగుటకై, అగణితంబు=లెక్కింపఁబడనిది.

గ॥ ఇత్యపరత్ర విమాన మానయన్ సానందమ్॥ 541

వ. అని మఱొక్కప్రక్కను విమాన మానయించుకొంచు నమందానందంబున.

శ్రీవిజయరాఘవవర్ణనము.

విజయరాఘవస్వామి—(వీరు దండకారణ్యమునుండి సీతాపహర్తయై రథముతోఁ బోవుచున్న రావణాసురునితో యుద్ధముచేసి చేసి తుదకు వానిచేతనె ప్రాణహతుఁడై కట్టుసురుతో తమదర్శనమునకై కనిపెట్టుకొని యున్నయా జటాయువును జూచి యంతయును విని కరుణాకటాక్షవీక్షణవిశిష్టులైనయా

శ్రీరాములు తనహస్తముతోనె యతనికి దహనసంస్కారము చేసి తోడనె యారావణాదిరాక్షసవిజయమునకై పోయి అంతయును జయించివచ్చిన యీ విజయరాఘవస్వామియే యిప్పుడు నీజటాయువుతీర్థతీరమున ఆ తిరుపగళ్ కుళ్ళిలో నట్లే సేవసాయించుచున్నవారు.

వృ॥ వికచరుచిరపుండరీకషండ
  ద్యుతిమదమోచనలోచనప్రభావః
  జయతి విజయరాఘవ స్సఏష
  శ్శుచితరగృధ్రసరోవరోపకంఠే॥ 542

అ. వికచ-రుచిర - పుండరీకషండ - ద్యుతి-మద-మోచన-లోచన, ప్రభావః=వికసించినదై-సొగసైన-తెల్లఁదామరల సమూహముయొక్క-కాంతులయందలి-గర్వమును-విడిపించెడి-కన్నులయొక్క-మహత్త్వము కలవాఁడైన, సఏషః=ఆయీ, విజయరాఘవః=విజయరాఘవస్వామి, శుచితర-గృధ్రసరోవర-ఉపకంఠే=అతిపరిశుద్ధమైన - జటాయు సరశ్శ్రేష్ఠముయొక్క - సమీపప్రదేశమందు, జయతి=సర్వోత్కృష్టుఁడుగా నున్నతఁడు.

తా. ఈజటాయుతీర్థతీరమందు ఈవిజయరాఘవస్వామి పూచి తెల్లనైన తామరలకంటె మించినకన్నులయందము గలిగియున్నయతఁడు.

ఆ. ఉదయసమయసముదితశోదరారుణమనో
  హరసరోజరుగపహారధీర
  నయనయుగళుఁ డీవిజయరాఘవుఁడు గృధ్ర
  సరసి దరసి యిందు జయముఁ జెందు.

కించ.—మఱియు.—

వృ॥ సంపాతిసోదరసరస్తటసంప్రరూఢో
  భాత్యద్భుతో విజయరాఘవపారిజాతః
  శాఖాతతే రుపరి సద్భి రుదీక్ష్యతే యో
  యస్యాథఏవ సకల స్సుమనః ప్రపంచః॥ 543

అ. సంపాతిసోదరసర స్తట - సంప్రరూఢః = సంపాతిసహోదరుఁ డైన జటాయుసర స్తీరమందు-పైకి లేచినదై, యః=ఏది, శాఖా తేః= శాఖలయొక్క-వేదశాఖలయొక్క - సమూహమునకంటె, ఉపరి=పైఁగను - ఉపనిషత్తులందును, సకలః=సమ స్తమైన, సుమనః-ప్రపంచః=పుష్పములయొక్క - దేవతలయొక్క-సమూహము, యస్య=దేనియొక్క-, అధఏవ=క్రిందనే, సద్భిః=సత్పురుషులచేత, ఉదీక్ష్యతే=చూడఁబడుచున్నదో; సః అద్భుతః=అట్టి ఆశ్చర్యకరమైన, విజయరాఘవ పారిజాతః=విజయరాఘవస్వామి అనెడి పారిజాత కల్పవృక్షము, భాతి=ప్రకాశించుచున్నది.

తా. ఈజటాయు స్తీర్థతీరమందు కొమ్మలపైఁగ నుండవలయు పుష్పాలు కొమ్మలక్రిందను, ఆకొమ్మలు చెట్టుపైఁగ నుండవలయు నవి చెట్టుక్రిందను నుండు లోకవిరుద్ధమైన యాపారిజాతకల్పవృక్షమువలె; ఈవిజయరాఘవస్వామి ఊర్ధ్వలోక సకలదేవతలును తనపాదాక్రాంతులై యుండఁగా, సకలోపనిషత్తులకును, ఆశ్వలాయనాప స్తంబీయాది సకల వేదశాఖలకును క్రిందులఁ గాక, శిరోభాగములందె ప్రకాశించుచుండును.

తే. తత్సర స్తీరసంప్రవృద్ధంబు విజయ
రాఘవాహ్వయపారిజాతాగమంబు
శాఖలను దానె వికసించి సకలసుమన
సులకును వికాసము స్వపాదములనె కూర్చు.

టి. అగమంబు=వృక్షము, శాఖలను=కొమ్మలనెడి ఆశ్వలాయనాది వేదశాఖలందు, సుమనసులకును=పుష్పములనెడి దేవతలకును, స్వపాదములనె=తనవేళ్లనెడి పాదములందె, కూర్చుఁ=కలుగఁజేయును.

గ॥ పున స్సభ క్తిప్రకర్షం జనానుద్దిశ్యభోభో భ క్తిము క్తిప్రేప్సవ ఇదం శ్రుణ్వంతు భవంతః॥ 544

వ. మఱల మఱియును భ క్తిఁ గావించి జనులనుద్దేశించి ఓహో భ క్తియుఁ ము క్తియుఁ గోరువారై మీరు దీని వినువారలాదురుగాక !

వృ॥ విశ్రుతాశ్రితవాత్సల్యం
వీరం విజయరాఘవమ్
నమస్కురుత యో గృధ్రం
సమస్కురుత దాహతః॥ 545

అ. యః=ఏ, విజయరాఘవః=విజయరాఘవస్వామి, గృధ్రం=జటాయువును, దాహతః=దహనముపలన, సమస్కురుత=సంస్కారము చేసెనో; తం=అట్టి, విశ్రుత-ఆశ్రిత-వాత్సల్యం = ప్రసిద్ధమైన-ఆశ్రితులయందలి-ప్రేమ, గల, వీరం=వీరుఁడైన, విజయరాఘవం=విజయరాఘవస్వామిని, నమస్కురుత=నమస్కారము చేయుఁడు.

తా. ఆశ్రితవాత్సల్యము ప్రసిద్ధమై జటాయువును దహనసంస్కారమును జేసిన యీవిజయరాఘవస్వామిని నమస్కారము చేయుఁడు?

క. మీరు జటాయువు శుచిసం
స్కారు నొనర్చి కృపఁ గూర్చి కడ తేర్చిన యీ
వీరు విజయరాఘవు జో
హారువు నొనరించి మించి ప్రార్థించుఁ డొగిన్.

గ॥ అత్ర గృధ్రసర స్తీరే విశ్వప్రసిద్ధా కాచి ద్వైచిత్రీ॥ 546

వ. ఇట జటాయున్సర స్తీరప్రదేశంబున లోకప్రసిద్ధ మయిన యొకానొక వైచిత్రి కనుపట్టుచున్నది కనిపెట్టుము ?

వృ॥ తనయార్థనయా సమాగతాభి
స్తరుణీభిః పరిభర్జితాశ్చ ముద్గాః
దృఢ మంకుర మత్ర దేవశక్త్యా
సమ మాసాం పులకాంకురైః ఫలంతి॥ 547

అ. అత్ర=ఇక్కడ, తనయ-అర్థనయా=పుత్రులవిషయమై-ప్రార్థనచేత, సమాగతాభిః=వచ్చిన, తరుణీభిః=వంధ్యా స్త్రీలచేత, పరిభర్జితాః=దంచఁబడిన,

ముద్గాశ్చ=పెసలును, దేవశక్త్యా=ఈ విజయరాఘవదేవుని ప్రభావముచేత, అంకురం=మొలకై, ఆసాం=వీరియొక్క, పులకాంకురైః సమం=గగ్గురుల మొలకలతోఁగూడ, దృఢం=నిస్సందేహముగా, ఫలంతి=పండుచున్నవి.

తా. ఈవిజయరాఘవక్షేత్రమందు వంధ్యాస్త్రీలుకూడ బిడ్డలప్రార్థనకై దంచిన పెసలగింజలు ఆ విజయరాఘవుల ప్రభావముచేత మొలకెత్తి ఆ స్త్రీలకు పులకాంకురములతోఁగూడ పెరుగుచుండును.

తే. సుతుల నిచ్ఛగించుచువచ్చుసతులు తాము
వంధ్య లయినను దంచియుఁ జెక్క మయిన
పెసలు నింపెసలారి పెంపెసఁగు వారి
పులకములతోన తచ్ఛక్తి మొలక లెత్తి.

కృశానుః.—కృశానువు.—

గ॥ నిజరూపమహిమా ననురూపస్థితిరసౌ విజయరాఘవః కిమీడ్యతే॥ 548

వ. తనరూపమహిమల కనురూపము కానియునికి గలయీవిజయరాఘవు నీవు చేకొని కొనియాడుచున్నాఁడ వేల?

వృ॥ శుకస్తుతో హంస మయూరవాహ
ముఖప్రగీతో గరుడాసనోఽసౌ
క్షీరాబ్ధితీరావసథోఽపి వాసం
కరోత్యహో? గృధ్రసరోంతికేఽస్మిన్॥ 549

టీ. అసౌ=ఈవిజయరాఘవులు, క్షీరాబ్ధితీరావసథః అపి = పాలసంద్రము గట్టె వాసస్థానముగాఁ గలవాఁడయ్యును; శుక-స్తుతః=చిలుకచేత-శుక మహర్షి చేత-పొగడఁబడినవాఁడును, హంసమయూరవాహ-ముఖ-ప్రగీతః = అంచ, నెమలి, (గుఱ్ఱము గాఁగల)హంసవాహుఁడు-బ్రహ్మ-మయూరవాహుఁడు-సుబ్రహ్మణ్యము - మొదలైన వారి చేత పొగడఁబడినవాఁడును, గరుడాసనః = గరుడపక్షియే-గరుత్మంతుఁడే పీఠముగాఁ గలవాఁడునై, అస్మిన్ = ఈ, గృ

ధ్రసరోంతికే=గద్ద సరసుయొక్క-జటాయు స్తీర్థముయొక్క సమీపమందు, వాసం=ఉనికిని, కరోతి=చేయుచున్నాఁడు.

తా. గరుడపక్షి నెక్కకొన్నవాఁడు చిలుక, అంచ, నెమలి, గుబ్బములుగాఁ గలవారి పొగడికలతో గద్దగుంటయొద్ద నుండునట్లుగా; ఈవిజయ రాఘవస్వామి తాను క్షీరాబ్ధివాసుఁ డయ్యును, గరుడవాహనముతో బ్రహ్మసుబ్రహ్మణ్య శుకమహర్ష్యాదుల స్తోత్రములతోను ఈజటాయు తటాకతీరమున వాసము సేయుచున్నవాఁడు. (ఇట శ్లేషానుప్రాణిత విరోధాభాసము.)

క. శుకగీతుఁడు హంసమయూ
రకమూషకవాహముఖ్యకలకును బ్రగీతుం
డిఁక గరుడాసనుఁ డాసను
సకలశనిధిశయుఁడు గృధ్రసరసి వసించున్.

టి. సకలశనిధిశయుఁడు = అమృతకలశముతోఁ గూడుకొన్న నిధియందు-పాలసముద్రమందు శయనించువాఁడైన విజయరాఘవస్వామి.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ త దేతద్దయాపయోనిధే రస్య భూషణ మేవ॥ 550

వ. ఆయది యీదయాపయోనిధికి భూషణమే కాని దూషణము కాదు.

వృ॥తత్త్వాదృ గుత్తమపదే తమసః పరస్తా
దస్తామయే వ్యతులసూరిభి రర్చితోపి
అత్రావిరాస హరి రేష చిరం నరాణాం
దృష్టిం కృతార్థయితు మేవ దృఢానుకంపః॥ 551

అ. తమసః పరస్తాత్=అజ్ఞానమునకంటె వేఱుగా, అస్త - ఆమయేపి = తొలఁగిపోయిన-సకలదోషములు గలదైన, తత్తాదృక్=ఆయట్టి,ఉత్తమపదే= పరమపదమందు, అతులసూరిభిః=సాటిలేని సనకాది మహర్షులచేత, అర్చితో పి=అర్చింపఁబడువాఁడయ్యును; దృఢానుకంపః = దృఢమైనదయారసము కల

వాఁడైన, ఏషహారిః=ఈవిజయరాఘవస్వామి, నరాణాం=భక్తులకు, దృష్టిం=దృష్టిని, కృతార్థయితు మేవ=సఫలపఱచుటకే, అత్ర=ఇక్కడ, చిరం=బహుకాలముగ, ఆవిరాస=ఆవిర్భవించియుండెను.

తా. అజ్ఞానులకు దూరముగా అఖిలదోషపరిహారకమై యుండు నాపరమపదమందు సకల సనకాది మహర్షులచే సమర్చింపఁబడుచుండు నాస్వామియే ఈవిజయరాఘవస్వామి యై ఇక్కడ సేవించు వారినేత్రములను సార్థపఱచుచున్నాఁడు.

తే. అటు తమంబునకుఁ బరంబు కే నయినయట్టి
యుత్తమం బయినపదంబు కే హత్తినట్టి
తనదువై కుంఠమున సూరికేవినుతుఁ డయిన
శౌరియే యిట్లు చూపట్టె కే భూరిదయను.

గ॥ (ఇతి దక్షిణతో విమానం ప్రస్థాపయన్ సహర్షమ్॥) 552

వ. దక్కినపుదిక్కునకున్ విమాన మానయించుకొంచున్ హర్ష ప్రకర్షంబున॥

క్షీరనదీవర్ణనము.

క్షీరనది=పాలేఱు—ఇదియు అశ్వాదిసప్తమహానదులలో నొకటియై చెంగల్పట్టు మధురాంతకములమధ్య పాఱెడియేఱు.

ఇయంహి.—ఇది గదా.—

వృ॥గంగా సింధు సరస్వతీ భవహరా తుంగా పతంగాత్మజా
రంగాభ్యాశ తరంగిణీ వ దఘతత్యంగారభంగావహా
శుగ్ధారాశమనీ మనీషిజనతా రబ్ధావగాహా ముహు
ర్ముగ్ధానా మపి శుద్ధిబుద్ధిజననీ దుగ్ధాపగాదృశ్యతే॥ 553

అ. గంగా...వహా=గంగ, సింధు, సరస్వతి, పాపనాశని, తుంగభద్ర, సూర్యతనయ=యమున, కావేరియువలె, పాపసమూహమనెడి, కొఱవులకు, భంగమును కలుగఁజేయునదియు; శుక్‌-ధారా-శమనీ=శోకముల-సమూహ

మును-శమింపఁజేయునదియు; ముహుః = పలుమాఱు, మనీషిజనతా-ఆరబ్ధ-అవగాహా=విద్వజ్జనముచేత-ఆరంభింపఁబడిన-స్నానములుగలదియు; ముగ్ధానామపి=మూఢులకుఁగూడ, శుద్ధిబుద్ధిజననీ = సదాచారమును సద్బుద్ధియును గలిగించునదియునైన, దుగ్ధాపగా=పాలేఱు, దృశ్యతే=చూడఁబడుచున్నది.

తా. ఈపాలేఱు గంగానదులవలె సకలపాపములనుకూ సకలశోకములనుకూ కొఱవులనువలె శమనింపఁజేయుచు, జ్ఞానులకు స్నానానుకూలమై, అజ్ఞానులకు సదాచారము సద్బుద్ధియుఁ గలిగింపఁజేయుచును గనఁబడుచున్నది.

టి. రంగాభ్యాశతరంగిణీ=శ్రీరంగమున కెదురుదిక్కున నుండునది-కావేరి.

తే. తుంగ గంగయుఁబోలె నుత్తుంగభంగ
సౌరి కావేరియుంబోలె సారనీర
యగుచుఁ బాపఘ్న శోకఘ్న యగుచుఁ గనఁగఁ
బడియెఁ బాలేఱు మేలేఱు పడియె ననఁగ.

టి. తుంగ=తుంగభద్ర, ఉత్తుంగభంగ=పొడవైనఅలలు కలది, సౌరి=సూర్యతనయ-యమున, సారనీర=శ్రేష్ఠమైనజలము కలది.

కించ.—మఱియు.—

వృ॥ మమ దుగ్ధనదీ ధనదీకృత మ
జ్జన్మానవా నవాంభోభిః
బుధజాతనుతా తనుతాం తనుతాం
తనుతాపహృద్ఘనాఘానామ్॥ 554

అ. నవ-అంభోభిః=క్రొత్తజలముచేత, ధనదీకృత-మజ్జత్-మానవా = కుబేరుఁడుగాఁ జేయఁబడిన-స్నానము సేయుచున్న-మనుష్యులుకలదియు, బుధజాత-నుతా=పెద్దలసమూహముచేత-స్తోత్రముచేయఁబడినదియు, తనుతాప-హృత్ = శరీరతాపములను-హరించునదియు నైన, దుగ్ధనదీ=పాలేఱు, మమ=నాయొక్క, ఘన-అఘానాం=గొప్ప-పాపములకు, తనుతాం = క్షీణత్వమును, తనుతాం = చేయునుగాక.

తా. ఈపాలేఱు, తనలో స్నానముచేసినవారితాపత్రయము లణఁచి ధనదులను జేయునట్లే మాపాపతాపములను సైత మణఁచి మమ్ము నట్లే చేయునుగాక.

ఆ. ఓయఁ దోయ మోయఁ జేయఁ దానంబుఁ దా
నేని నేని హానిఁ బూని పోని
తాప మాపి పాపతతినిఁ బోఁ జోపుఁబో
క్షీరనది నిధీశుఁ జేసి వాసి.

టి. ఓయన్ = మెల్ల మెల్లగా, తానంబు=స్నానము, తాన్ = తాను, ఏనినేనిన్ = ఎవనినైన, పోని=విడిచిపోని, ఆపి=నిలిపి, పోఁజోపుఁబో= తొలఁగఁజేయును పో? నిధీశున్ =నవనిధిపతియైన కుబేరునిఁగా, వాసిన్ =క్రమముతో.

కృశానుః — కృశానువు. —

గ॥ భవత్యేవ మథాప్యస్యాః క్షీరతరంగిణ్యా విధినా కృతా నీరసతా॥ 555

వ. అట్లుండిన నుండనీ? ఈక్షీరనది కీనీరసత యానీరజాసనుచేతనే కలుగఁజేయఁబడియె.

వృ॥ కాలుష్యలేశవిధురా
మధురాఽపి పయోనదీ
రోచతే సాధవే యుక్తా
నోచేల్లవణసింధునా॥ 556

టి. పయోనదీ=ఈపాలేఱు, కాలుష్యలేశవిధురా = మాలిన్యముయొక్క అణుమాత్రము నైనను విడిచినదై, మధురాపి=మధురమైనదయ్యును; లవణసింధునా=ఉప్పుసంద్రముతో, యుక్తా=కూడినది,నోచేత్ =కాదేని; సాధవే= సత్పురుషునికై, రోచతే=రుచించుచుండును.

తా. ఈనది నిర్మలమై మధురమైయును, ఉప్పుసంద్రముతోఁ గూడకున్న యెడల సత్పురుషులకందఱకును రుచియించునదియే యగును.

క. కలుషమ్ము లేశమే యయినన్

గలుగని దయి తీయఁదనము ♦ గలిగిన దయినన్

గలియనిదే నిధిపుష్పెనఁ

గలయఁ బయోనిధి రుచించుఁ ♦ గద ? సాధునకున్.

టి. కలియనిదేన్=కలియకుండ నుండునదియేని, కలయన్=అంతటను.

విశ్వావసుః.—విశ్వావసువు —

గ॥ గుణమపి దోషతయా భణసి॥ 557

వ. గుణమునుగూడ దోషమునుగానే పలుకాడు చున్నాఁడవు.

యతః.—ఎందువలన.—

వృ॥క్వచన సమాగతసింధుని

ధునీజలే సాధుని స్నానమ్

పంకవిలేపం కలయతి సం

ఘటయతి ధియ మితి స్మరంతి బుధాః॥ 558

అ. సమాగత సింధుని=చేరినసముద్రము గలదియు, సాధుని=మంచిదియు నైన, ధునీజలే=ఏటినీట, క్వచన=ఎక్కడనైనను, స్నానం=స్నానము, పంక-విలేపం = పాపముయొక్కగాని-అడుసుయొక్కగాని నాశమును, కలయతి=చేయుచున్నది; ధియం=జ్ఞానమునున్, సంఘటయతి=కూర్చుచున్నది; ఇతి=అని, బుధాః= పెద్దలు, స్మరంతి=తలంచుచున్నారు.

తా. "సముద్రగానదీస్నానం నరాణాం శుద్ధిబుద్ధిదమ్" అనుప్రమాణము వలన, ఎక్కడనైన, అక్కడలిఁ జేరిన చక్కనియేటినీట స్నానముచేయుట యే పాపవిముక్తియు, జ్ఞానసంయుక్తియున్ గలిగించుచున్నది యని పెద్దలు చెప్పుదురు.

క. ఒకచోఁ గలసినఁ గడలిన్

సకలాఘునిదాఘములకు ♦ శామక మయి పా

య కెసంగు నదిం గ్రుంకిన

యఖిలాత్ములకలరు బోధ ♦ మందురు బోద్దల్.

టి. సకలాఘ-నిదాఘములకున్ = సమస్తదోషములనెడి వెట్టలకు, శామకమయి=శమియింపఁజేయునదియై.

గ॥ (కించి ద్దక్షిణతోఽభిక్రమ్య॥) 559

వ. కొంతయంతరంబు దక్షిణంబునకె యతిక్రమించి.

## బాహానదీవర్ణనము.

వృ॥ మోహాదిదోషరహితాం తటవాసిదేహి
వ్యూహాయ కామపి మతిం మహతీం దిశంతీ
స్వాహాకరోతి దురితాని శుభప్రవాహై
ర్బాహానదీ బుధసమూహకృతావగాహా॥ 560

అ. తట-వాసి-దేహి-వ్యూహాయ=తీరమందు-వసించుచున్న-జీవులయొక్క-సమూహమునకై, మోహ-ఆది-దోష-రహితాం=మోహము-మొదలుగాఁగల దానివలని-దోషములు లేనిదియు, మహతీం=గొప్పదియు నైన, కామపి=ఒకానొక, మతిం=జ్ఞానమును, దిశంతీ=ఇచ్చునదియై, బుధసమూహ-కృత-అవగాహా=జ్ఞానులసమూహముచేత-చేయఁబడిన-స్నానములు గలదియైన, బాహానదీ=ఈబాహానది, శుభప్రవాహైః=శుద్ధములైన వెల్లువలచేత, దురితాని=పాపములను, స్వాహాకరోతి=నాశము చేయుచున్నది.

తా. ఈబాహానది తనతీరమునందలి జీవులకు సకల మోహాది దోషహారమైనజ్ఞానము నిచ్చుచు, వారివారికి తనలోని స్నానములచేతను సకలదోషములనున్ తనప్రవాహములతో పరిహారము చేయుచున్నది.

క. మోహాదిరహితమతి స
ద్వ్యూహాన కొసఁగు దోసఁగు సకేమూహాని కహా
స్వాహాకారము సేయును
బాహానది కృతబుధానుభవభువనం బై.

టి. మోహాదులు=అరిషడ్వర్గములు - మోహకామక్రోధలోభమదమాత్స

ర్యములు, కృత-బుధానుభవ-భువనంబై = చేయఁబడిన-పెద్దల అనుభవముతోడి-లోకముగాని-జలముగాని గలదియై.

గ॥ అస్యా శ్చోత్తరతీరే శ్రోత్రియోత్తంస నివాసయోగ్య స్సమగ్రగుణో౽సా వగ్రహార స్సం లక్ష్యతే॥ 561

వ. ఇట నిత్తటినికి నుత్తరంపుఁదీరంబున శ్రోత్రియోత్తంసులకు నివాసయోగ్యమై సమగ్రగుణహారంబుగ నీయగ్రహారంబు కనంబడియెడి.

టి. శ్రోత్రియ-ఉత్తంసులకు = వైదికులలో-శిరోభూషణమైనవారికి, సమగ్ర గుణహారంబుగ=సంపూర్ణమైన సద్గుణములే హారముగాఁ గలదిగా.

(ఈబాహానది సమీపమందలి కాంచీపురముచేరువ అరశాణిపాళెమున్న అగ్రహారము— ఈ ఆత్రేయాన్వయసంస్కృతకవి=వాసస్థానము.)

పశ్య.—చూడు.—

వృ॥కర్ణానందకరస్ఫురన్మధుకరవ్యాహారబాహాపగా
రోధశ్శాఖిమరందతుందిలపయఃకల్యాణకుల్యావృతః
ఆత్రేయాన్వయవిద్వదధ్వరహవిర్గంధానుబంధార్పిత
క్షేమోభాత్యరశాణిపాలఇతిహిగ్రామోభిరామో భువి॥562

అ. కర్ణానందకర-స్ఫురత్-మధుకరవ్యాహార-బాహాపగారోధశ్శాఖి-మరందతుందిల-పయః-కల్యాణ-కుల్యా-ఆవృతః=చెవులకు సంతోషకరమై-ప్రకాశించునట్టి-తుమ్మెదల ఝుంకారములతోడి- బాహానదీతీర వృక్షములయందలి-తేనెలచేత నిండియుండు-జలములచేత-శుభకరమైన-కాలువలచేత - చుట్టఁబడినదియు, ఆత్రేయాన్వయ-విద్వత్-అధ్వర- హవిః-గంధానుబంధ - అర్పితక్షేమః=ఆత్రేయ గోత్రమందలి-విద్వజ్జనులయొక్క-యజ్ఞములయందలి-పురోడాశాది హవిర్భాగములయొక్క-గంధసంబంధముచేత-కలుగఁజేయఁబడినక్షేమము గలదియునైన, అరశాణిపాల ఇతిగ్రామః=అరశాణిపాళెమనిగ్రామము, భువి=భూమియందు,అభిరామః=మనోహరమై,భాతిహి=ప్రకాశించుచున్నది గదా?

తా. ఈ బాహానది కాలువలగట్టులలోని చెట్టుల పూవుల తేనెధారలతోను, తుమ్మెదల ఝుంకారములతోను, ఇందలి ఆత్రేయగోత్రజులైన విద్వజ్జనులు చేసెడి యజ్ఞములయందలి పురోడాశ పపాదుల వాసనలతోను ఈ అరశాణిపాళె మను గ్రామము అభిరామమై యున్నయది.

సీ. బాహానదీతీర ♦ బహుళభూరుహముల
కుసుమరసంబుల ♦ కుల్య లమరి
వినువారివీనుల ♦ కనుమోద మొనరించు
మధుకరంబులగాన ♦ మహిమ కలిగి
ఆత్రేయకులమున ♦ నలశ్రోత్రియులు సేయు
మఖములహోమధూ ♦ మములు సెలఁగి
వేదశాస్త్రాభ్యాస ♦ వాదంబులను మేలు
ఘోషంబులే మేలు ♦ కొలుపుఁ లగుచు
తే. దినదినంబును నూఁతనూ ♦ తనము గాఁగ
జనులమనములఁ దనుపుచుఁ ♦ జనువిశాల
శీల మరశాణిపాలె నాఁ ♦ జాలి మేలి
గ్రామ మభిరామ మైనది ♦ కంటె భువిని.

కించ.—మఱియు.—

వృ॥ సాధ్వగ్రేసరయూపేత
స్సాకేతనగరశ్రియమ్
అగ్రహారోవహత్యేష
రఘునాథాభిరక్షితః॥ 563

అ. సాధు-అగ్రేసర-యూప-ఇతః=సత్పురుషులలో-శ్రేష్ఠులైన ఆత్రేయులయొక్క-యజ్ఞస్తంభములచేత-కూడినదై -సాధు-అగ్రే-సరయూ-ఉపేతః=చక్కఁగా-అగ్రభాగమును-సరయూనదితో-కూడుకొన్నదై, రఘునాథ-అభిరక్షితః=[illegible] రఘునాథుని చేత [illegible] రక్షింపఁబడినదైన,

ఏష అగ్రహారః=ఈయగ్రహారము, సాకేతనగర-శ్రియం=అయోధ్యాపట్టణము యొక్క-శోభను, వహతి=వహించుచున్నది.

తా. ఈయగ్రహారము సత్పురుషులు చేయు యజ్ఞములయూపస్తంభముల తో కూడి, కవితంత్రిడియైన రఘునాథ దీక్షితులు కాపాడునదియై; ఎదుట సరయూనదితో కూడి, శ్రీరాములు కాపాడునదియైన అయోధ్యాపట్టణము వలె నున్నది.

క. ఈసరికి నగ్రహారము
తా సరి రఘునాథరక్షితమ యై సిరి కి
ట్లాసరయూపేతమ యై
భాసురసాకేతనగరిపగిది నెసంగెన్.

టి. తాసరి=తానుసరి, యూపేతమయై=యజ్ఞస్తంభములతో చేరినదియై సిరికి ఇట్లు, ఆసర=ఆశ్రయము.

గ॥ కించి ద్విమాన మున్నమయ్య నద్యోః పార్శ్వద్వయ మవ
లోక్య సశ్లాఘమ్॥ 564

వ. విమాన మించు కెగయించి శ్లాఘాసహితంబుగ నాయేఱుల
యిరుతీరములనుం గనుంగొని.

వృ॥చారుగుణై స్సన్మణిభి
ర్జుష్టా బాహానదీపయస్విన్యోః
ఉపకూల మగ్రహారా
ఉదగ్రహారా ఇవావనేర్భాంతి॥ 565

అ. చారుగుణైః=మనోహరములైన గుణములవలె దారములు గల, సన్మణిభిః=సత్పురుషులనెడు మంచిరత్నములతో, జుష్టాః=కూడినవై, బాహానదీపయస్విన్యోః=బాహానదీక్షీరనదులయొక్క, ఉపకూలం=గట్టులందు, అగ్రహారాః=అగ్రహారములు, అవనేః=భూమికి, ఉదగ్ర-హారాఇవ=ఉన్నతములైన హారములవలె, భాంతి=ప్రకాశించుచున్నవి.

తా. మంచినూత్రములతోఁ గూర్చిన సద్రత్నములతో ఈభూమి అను స్త్రీకిఁ జేర్చిన ముత్యాలహారములవలె ఈరెండునదుల గట్టులలో సద్గుణముల తోఁ గూడిన సత్పురుషులతోఁ జేరియుండు అగ్రహారములు ప్రకాశించుచున్నవి.

తే. సారగుణ సన్మణులఁ గూడి సకలజనుల
మెదకు బాహానదీపయోనదులదరుల
నగ్రహారము లించు నుదగ్రహార
ములుగ నిలనెలంత కటంచు ముదము వెంచు.

కృశానుః—కృశానుఁడు.—

శ్లో॥ అమూ న్గ్రామా న్కథంకార
మగ్రహారా న్ప్రచక్షతే
సువృత్తముక్తారహితా
య దేనా న్శ్రితాజనాః॥ 566

అ. యత్=ఎందువలన, ఏనాన్=ఈగ్రామములను, ఆశ్రితాః=ఆశ్రయించిన, జనాః=జనులు, సువృత్తముక్తారహితాః-సు=చక్కనైన, వృత్త=గుండ్రనైన, ముక్తా=ముత్తెములతో, రహితాః=లేనివారో? సువృత్త=మంచినడవడికలు కల, ముక్త=ముక్తపురుషులతో, అరహితాః=లేనివారు కానివారో?తత్=అందువలన, అమూన్=అట్టి ఈ, గ్రామాన్=గ్రామములను, అగ్రహారాన్=అగ్రహారములనుగా, కథంకారం=ఎట్లు? ప్రచక్షతే=చెప్పుచున్నారు?

తా. ఇక్కడి జనులు మంచినడవడికలు కల ముక్తపురుషులతోడఁ గూడమి లేనివారయ్యును; మంచిముత్తెములు లేనివారై యుండఁగా, ఈగ్రామములను అగ్రహారములని యెట్లు చెప్పుచున్నారు?

క॥ కని యీగ్రామంబుల నిట్టు
లనుదురె? బుధజనులు నగ్రహారము లనుచున్
జను లిందులఁ గలవారలు
మునుకొని కనుఁగొన సువృత్తముక్తారహితుల్.

టి. అగ్రహారములు=అగ్రమందు ముక్తాహారములువలె (గృహములు)కలవి, సువృత్తముక్తారహితులు=సద్వృత్తములచేత విడువఁబడినవారు - బొత్తిగా లేనివారు, మునుకొని=ముందుపడి.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గీ॥ సఖే ! భవతా స్తుతిరేవ ఏషాం భంగ్యంతరేణ కృతేతి మృ
ష్యామి తుష్యామి చ॥ 567

అ. సఖే=స్నేహితుఁడా ! భవతా=నీచేత, ఏషాం=వీరియొక్క, స్తుతిః ఏవ=స్తోత్రమే, భంగ్యంతరేణ=వేఱువిధముగా, కృతా=చేయఁబడినది. ఇతి= అని, మృష్యామి=విమర్శించుచున్నాను, తుష్యామిచ=సంతోషించుచున్నాను.

వ. సఖా ! నీచేతిస్తుతియే వ్యాజస్తుతివిధమునఁ జేయఁబడుచు
న్నయది యని విమర్శించుచున్నాను. మఱియు హర్షించు
చున్నాను.

తుండీరమండలవర్ణనము.

ఇ. తుండీరమండలము=తొండమనాడు. ఇది కంచికిని తిరుపతికిని మధ్య ప్రదేశము కాక, ఉత్తరఆర్కాడు మొదలు చెంగల్పట్టుతోను శ్రీపెరుంబూదూరుతోను దక్షిణఆర్కాడువఱకు చేరియున్న ద్రవిడదేశభాగము.

గీ॥ అథ సర్వత స్తుండీరమండల మవలోకయన్ సహర్షాతిరేకమ్
వయస్య ! స్ఫుట మస్య తుండీరమండలస్య పశ్యతు భవాన్
పావనత్వం రామణీయకం చ॥ 568

వ. తర్వాత సర్వతోముఖముగఁ దుండీరమండలము నవలోకిం
చుచు నతిరేకించినహర్షంబున, చెలికాఁడ! చూడుమీ నీవీతుం
డీరమండలముపావనత్వము రమణీయత్వమున్.

వృ॥ తీరేతీరే స్ఫురతి సరితా మగ్రహారోఽత్రభూయాన్
అగ్ర్యోవర్ణో ధరణిమరుతా మగ్రహారేఽగ్రహారే

వర్గేవర్గే ధరణిమరుతాం వర్ధతే సాధుయజ్ఞో
యజ్ఞేయజ్ఞే శ్రవణసుభగ స్తోత్రశాస్త్రాదిఘోషః॥ 569

అ. అత్ర=ఇక్కడ, సరితాం=నదులయొక్క, తీరేతీరే=ప్రతిగట్టున, అగ్రహారః=అగ్రహారము, భూయాన్=విశేషముగ, స్ఫురతి=ప్రకాశించుచున్నది; అగ్రహారేఽగ్రహారే=ప్రతియగ్రహారమందును, అగ్ర్యః = శ్రేష్ఠమైన, ధరణిమరుతాం=భూసురులైన బ్రాహ్మణులయొక్క, వర్గః=సమూహము, స్ఫురతి=ప్రకాశించుచున్నది; వర్గేవర్గే=ప్రతివర్గమందును, యజ్ఞః=యజ్ఞము, సాధు=చక్కఁగ, వర్ధతే=వృద్ధిపొందుచున్నది; యజ్ఞేయజ్ఞే = ప్రతియజ్ఞమందును, శ్రవణసుభగః=చెవులకును మనోజ్ఞమైన, స్తోత్రశాస్త్రాదిఘోషః=స్తోత్రములు శాస్త్రములు మొదలైనవానియొక్క ఘోషము, వర్ధతే=వృద్ధిపొందుచున్నది.

తా. ఆతుండీరమండలమందు బాహూనది మొదలైన నదులతీరములందు అనేకాగ్రహారములు, అందందు అతిశ్రేష్ఠమైన బ్రాహ్మణవర్గములు, అందందు జ్యోతిష్టోమాది యజ్ఞములు, అందందు శ్రోత్రానందకరమైన స్తోత్రశాస్త్రాదుల ఘోషములును వర్ధిల్లుచున్నవి.

తరువోజ.

తీరా నదీతీరతీరానఁ గ్రాలు౯ హారాలువలె నగ్రహారాలు వేలు
హారాగ్రహారాగ్రహారానఁ గ్రాలు౯ సారజ్ఞసద్విప్రసంఘాలుచాలు
సారజ్ఞసద్విప్రసంఘానసార౯సక్రమమహాసవనాలు గ్రాలు
సారెకాసవనానసవనానఁ గ్రాలు౯సారతరస్తోత్రశాస్త్రాదిఘోష.

టి. హారాగ్రహారాగ్రహారానన్ = హారములవంటి ప్రత్యగ్రహారమందును, చాలు=వరుసగ, సారసక్రమమహాసవనాలు=శ్రేష్ఠమైన క్రమముతోఁ గూడిన గొప్పయజ్ఞములు, క్రాలున్=ప్రకాశించుచుండును.

కించ.—మఱియు.—

వృ॥తుండీరమండలనివాసిషు దుగ్ధసింధు
డిండీరఖండ నిభకీర్తిషు పండితేషు

ఆప్యాయమాన మఖిలై రవిగీత మేతత్
రోచేత ధూతదురితంచరితం నకస్మై॥ 570

అ. తుండీరమండల నివాసిషు=ఈ తుండీరమండలమందు వాసముచేయు వారును, దుగ్ధసింధు డిండీరఖండ నిభకీర్తిషు=పాలసంద్రములోని నురుగు గడ్డలతో సమమైన యశముగలవారునైన, పండితేషు = విద్వాంసులయందు, ఆప్యాయమానం=తృప్తిపడునదై, అఖిలైః=సకలవిషయములచేతను,అవిగీతం= నిందింపఁబడనిదై, ధూతదురితం=తొలఁగఁద్రోయఁబడిన దోషములు గలదైన, ఏతత్=ఈ, చరితం=నడవడి, కస్మై=ఎవనికి, నరోచేత=రుచింపఁబడదు?

తా. ఈతుండీరమండలమందలి పండితులు అతిపరిశుద్ధకీర్తి కలవారై యుండియు, వీరినడవడి వేదశాస్త్రపురాణాది విహితమై నిర్దోషమై యుండియు, ఎవరికి సంతోషకరులుకాక యున్నారు.

తే. ఔర! తుండీరమండలకె నధివసించి
క్షీరడిండీరమండలకీర్తి మించు
చతురపండితమండలి చరిత మెవని
కవని రుచియింప దింపుమై కె నఖిలవిధుల.

కృశానుః.—కృశానువు.—

గ॥ హంత! ఏతస్మిన్నంతిమయుగేపి అధ్వరకర్మాచరతాం అమీషాం చరితాని కథమివ రోచేరన్ కోవిదేభ్యః॥ 571

వ. కటా! ఈకడయుగమందును నధ్వరకర్మ లాచరించువీరలచరిత లభిజ్ఞుల కెటుల రుచించు?

వృ॥ న బుద్ధిర్వాక్సంపత్తిర్నచ కుశలతా యష్టు రనఘా
నచ ద్రవ్యం శుద్ధం నచ హృదయశుద్ధిః కలియుగే
ప్రసిద్ధిం కాంక్షంతః పరిమితధనా హంత! కృపణా
వృథా పశ్వాలంభం విదధతి తథాపి క్షితిసురాః॥ 572

అ. కలియుగే=ఈకలియుగములో, యష్టుః=యాజకునికి, అనఘా=నిర్దోషమైన, ఋత్విక్సంపత్తిః=మంత్రవేత్తలసమృద్ధి, న=లేదు; అనఘా=నిర్దోషమైన, కుశలతాచ=సామర్థ్యమును, న=లేదు; శుద్ధం=పరిశుద్ధమైన, ద్రవ్యంచ=హోమద్రవ్యమును, న = లేదు; హృదయశుద్ధిశ్చ = హృదయపరిశుద్ధియును, న=లేదు; తథాపి=అట్లయినను, పరిమితధనాః=అల్పద్రవ్యముకలవారై, కృపణాః=లుబ్ధులైన, క్షితిసురాః=బ్రాహ్మణులు, ప్రసిద్ధిం=ప్రఖ్యాతిని, కాంక్షంతః=కోరువారై, హంత=అయ్యో! వృథా=వ్యర్థముగా, పశ్వాలంభం=పశువధమును, విదధతి=చేయుచున్నారు.

తా. ఈకలియుగములో యజ్ఞముచేయువారికి మంత్రమంత్రార్థవేత్తలైన ఋత్విజులును లేక, తమకు యజ్ఞకర్మలయందు సామర్థ్యమునులేక, తగిన యజ్ఞసామగ్రియునులేక, తమకు మనశ్శుద్ధియునులేక, నిర్ధనులై యుండుటేకాక, లుబ్ధులునై యుండు నిక్కడిబ్రాహ్మణులు తాము దీక్షితులు, సోమయాజులు అను పేరుమాత్రమె కోరుచు, యథార్థానుష్ఠానములేక, వృథాగా మేషాదిపశువధమునే చేయుచున్నవారు.

తరల. అరుదు ఋత్విజు లోజి యాజకులకెల్ల కౌశలి నీకలిన్
పరమశుద్ధ మొకింతద్రవ్య మకల్పంకశుద్ధము చిత్త మి
ట్లరుదె యైనను గించిదర్థులు కనల్లె లుబ్ధులు నిద్ధరా
సురులుపేరప్రసిద్ధికే పశుసూదనంబునె సేయుదుర్.

టి. ఓజిన్=వరుసగా, కౌశలిన్=కుశలత్వమందు (అరుదు) అపంకశుద్ధము=నిర్మలమై పరిశుద్ధమైనది. కించిదర్థులు=కొంచెము ధనమువారు, పశుసూదనంబునె=మేషాదిపశుల చంపుటనే.

ఇ. ఋత్విక్కులు—వీరు అధ్వర్యులుమొదలు పదియాఱు భేదములవారు.

కించ.—మఱియు.—

వృ॥శౌచం నాచరితుం యథావిధి కలౌ శక్తాద్విజాః కించ తే
యః ఖల్వాచమనాప్లవాదినియమ స్తం స్మరు మప్యక్షమాః

క్వామీషాం పునరగ్నిహోత్రనియమః క్వేష్టేః రనుష్ఠానగీః
క్వాగ్నిష్టోమముఖామఖాస్సపశుకాఃక్వత్యాఽగ్నిచిత్యాతుసా॥

అ. కించ=మఱియు, కలౌ=కలియుగమందు, తే=ఆ,ద్విజాః= బ్రాహ్మణులు, శౌచం=శౌచమును, యథావిధి=శాస్త్రప్రకారము, ఆచరితుం=ఆచరించుటకు, శక్తాః=శక్తికలవారు,న=కారు; యః=ఏది, ఆచమనఆప్లవఆదినియమః=ఆచమనము స్నానము మొదలుగాఁగలనియమమో; తం=దానిని, స్మర్తుంఅపి = తలంపనుగూడ, అక్షమాః(క్షములు=శక్తులుకారుగదా? అమీషాం=అట్టివీరికి, అగ్నిహోత్రనియమః=హోమకర్మ, క్వ=ఎక్కడ? పునః=మఱల, ఇష్టేః=ఆయజ్ఞముయొక్క, అనుష్ఠానగీః=అనుష్ఠించుటఅనుమాట, క్వ=ఎక్కడ? సపశుకాః=పశుసహితములైన, అగ్నిష్టోమముఖాః = అగ్నిష్టోమము మొదలైన, మఖాః=యజ్ఞములు, క్వ=ఎక్కడ? సా=అట్టి,అగ్నిచిత్యాతు=స్థండిలాదికృతాగ్నిష్టోమాదియజ్ఞకర్మయో? క్వత్యా=ఎక్కడిది.

తా. ఈకలియుగపు బ్రాహ్మణులు పాదప్రక్షాళనాది శౌచములైన శాస్త్రియుక్తముగ చేయఁదెలియరుగాని, స్నానాచమనాదులనైనఁ జేయఁదలఁపరు; ఇట్లు నిత్యనియతకర్మలు దర్శపూర్ణమాసాదులు ననుష్ఠించుట అనుమాటయేలేని వీరికి స్థండిలవిశేషములతోఁ జేయుహోమములు అగ్నిష్టోమాది యజ్ఞములును ఎక్కడఁ గలుగును ?

కించ.—మఱియు.—

తరల. మఱియుశౌచమునాచరింపరు కేమానుదు ర్విధి నీకలిం
మఱియు నాచమనంబె చేయరు కే మజ్జనం బెటు సేయదుర్
మఱియు వీరికినగ్నిహోత్రము కే మంత్రమాత్రము లేదు వే
మఱను నిష్టియనుష్ఠితం బెటు కే మాన్య మన్యములెట్టిలో?

విశ్వావసుః —విశ్వావసువు.—

గ॥ స్థూలమనీష! మృషా కి మితి భాషసే॥ 574

వ. ఓమందమనీషా! మృషాభాషణములె భాషించుచున్నా వేల?

టి. మందమనీషా=ఓమందబుద్ధీ ! మృషాభాషణములు=అబద్ధపుమాటలు.

వృ॥ శ్రేష్ఠేభ్యః ప్రతిగృహ్య విత్త ముచితం సంపాద్యవిద్యాః కలౌ
శ్రద్ధాలూన్ శ్రుతికల్పసూత్రచతురాన్ లబ్ధ్వా శుచీ నృత్విజః
ప్రీతిం భాగవతీం ప్రకామ మభిసంధాయా హరంతః క్రతూన్
ధీమంతో యుగమంతిమంతుకృత మంత్యంతర్ముఖాస్సంతతమ్॥

అ. ధీమంతః=బుద్ధిమంతులై, అంతర్ముఖాః=అంతరాత్మయందు ఉన్ముఖులైనవారు, శ్రేష్ఠేభ్యః=శ్రేష్ఠులైనవారినుండి, ఉచితం=తగుమైన, విత్తం=ధనమును, ప్రతిగృహ్య=గ్రహించి, విద్యాః=విద్యలను, సంపాద్య=సంపాదించి, శ్రద్ధాలూన్=శ్రద్ధావంతులును, శ్రుతికల్పసూత్రచతురాన్ = వేదములందును ఋషికల్పసూత్రములందును సమర్థులును, శుచీన్=పరిశుద్ధులునైన, ఋత్విజః=ఋత్విక్కులను, లబ్ధ్వా=లభించి, భాగవతీం= భగవత్సంబంధియైన, ప్రీతిం = భక్తిని, ప్రకామం=మిక్కిలి, అభిసంధాయ=చేర్చి, కలౌ=కలియుగమందు, క్రతూన్=యజ్ఞములను, అహరంతః=దినమధ్యములందు, సంతతం= ఎల్లప్పుడును, కుర్వంతః=చేయువారై, అంతిమం=కడపటిదైన; యుగం=యుగమును, కృతమంతి=కృతయుగమునుగాఁ జేయుచున్నారు.

తా. ఇందు తత్త్వనిర్ణాయకులై పరబ్రహ్మపరాయణులైనవారు అఖిలవిద్యలను అర్థావగాహనపర్యంతము నేర్చుకొనుచు బ్రాహ్మణశ్రేష్ఠులవలననుండియే ద్రవ్యమును అనురూపముగా చేకొనుచు, యజ్ఞములందు శ్రద్ధాళువులై ఆగమములందు, ఆశ్వలాయనాది కల్పసూత్రములందును సమర్థులై పరిశుద్ధులైన అధ్వర్యాది ఋత్విజులతోఁ గూడ భగవద్భక్తి గలవారై యెప్పుడును యజ్ఞములు చేయుచు ఈకలియుగమును ఆకృతయుగమునుగాఁ జేయుచున్నవారు.

సీ. తత్త్వనిర్ణయమున సత్త్వసంపూర్ణత
గలుగుధీమంతులు గలుగునిష్ఠ
శిష్టులవలననె యిష్టము చెలువున

సముచితద్రవ్యము ౹ సంగ్రహించి
సకలవిద్యలశ్రుతిశ్రౌతసూత్రములఁ బ్ర
వీణుల శుచుల ఋత్విజులఁ గొంచు
బాగుగా నాభాగవతిఁ బ్రీతి భావించి
క్రతువులు గావించి ౹ క్రమము నెంచి
ఆ. అక్రమంబు లెపుడు ౹ వక్రంబు లయి మించి
కలియు కలియుగమును ౹ గాంతఁ జేసి
సక్రమంబుగాను ౹ సవరింతు రిట్టు లా
కృతయుగంబుగానె ౹ కృతులు కృతుల.

(1) శ్రుతులు= వేదములు ఋగ్యజుస్సామాథర్వములు.

(2) ఋగ్వేదము—మంత్రభేద ప్రతిపాదకము, యజుర్వేదము—విధిప్ర కారప్రతిపాదకము, సామవేదము—స్తోత్రాంతరప్రతిపాదకము, అథర్వణవేద ము—తచ్ఛాంత్యాది ప్రతిపాదకము.

(3) శ్రౌతకల్పసూత్రములు-ఆశ్వలాయనాదిఋగ్వేదవిహితకర్మసూత్రములు. బోధాయన, కాత్యాయన, దాహ్యాయన, మాధ్యందిన, ఆపస్తంబ, శాంభవీయ, శౌనకీయ, జైమినీయ, భారద్వాజ, అగస్త్య, శాకల్య, అగ్నివైశ్య, సత్యాషాఢ, కౌండిన్య, కౌషీతక, హిరణ్యకేశి, వాధూల, వైఖానసములు.

భగవచ్ఛబ్దార్థము— "సంపత్త్యైశ్వర్యవీర్యాణి వైరాగ్యజ్ఞానకీర్తయః ఏతేహిషడ్గుణాస్సైశ్చ సంపూర్ణోభగవాన్ స్మృతః" అని యీషడ్గుణములు సంపూర్ణముగా కలవాఁడు భగవంతుఁడు అందురు.

కించ.—రుతియు.—

వృ॥ అయజ్ఞార్హాద్రవ్యా వయ మితితు యజ్ఞా ద్విరమతాం
నకల్పేత స్వా న్నైష్కర్మ్యమ భగవదారాధన మపి
ప్రయత్నేన ద్రవ్యం శుచి కిమపి లబ్ధ్వా భగవతః
కృతం చేత్త్కైంకర్యం కిము తి న తదేవాధ్వరసమమ్॥ 576

అ. వయంతు=మేమో, అయజ్ఞార్హద్రవ్యాః = యజ్ఞమునకు తగినద్రవ్యము లేనివారము, ఇతి=అని, యజ్ఞాత్=యజ్ఞమునుండి, విరమతాం=చాలింతుముగాక; స్వ+అన్నైః=సొంత+అన్నములచేత, భగవదారాధనమపి = భగవన్నివేదనమునుగూడ, నకల్పేత నను=చేయకుందుమా? ప్రయత్నేన = ప్రయత్నముతో, శుచి=పరిశుద్ధమైన, ద్రవ్యం=ద్రవ్యమును, కిమపి=కొంచెమైనను, లబ్ధ్వా=పొంది, భగవతః=భగవంతునియొక్క, కైంకర్యం=కైంకర్యము, కృతంచేత్=చేయఁబడినదేని, తత్=ఆకైంకర్యము, అధ్వరసమమేవ=యజ్ఞముతో సమానమే, న ఇతికిం=కాదనియా?

తా. మేము యజ్ఞమునకు తగినంతద్రవ్యము లేక యజ్ఞముచేయనివారమైనను, మాసొంత అన్నముచేతనైన భగవన్నివేదనముచేయకుందుమా? ఎంతకష్టపడియైనఁ గొంతద్రవ్యమైన సంపాదించి భగవత్కైంకర్యము చేయుదుము; అదియే మాకు యజ్ఞముతో సమానము కాదా?

ఉ. సావనమర్థమున్నదియొకో సాలు సవం బని ద్రోవనిమ్ము తో
స్పావనమన్న మాభగవతోదర్పణసేయక యుందుమొక్కొ తాఁ
బావన మైన, దానినె కృపాలున కాహరి కాస దాసతా
భావన నర్పణం బొనరుపన్ సరికాదె? యిదానుఖాళితోన్.

దం. యజ్ఞసంబంధమైనద్రవ్య మున్నదా? యజ్ఞముచాలును, అని ఆయజ్ఞమును త్రోసివేయనీ? మనకు రక్షకమైనయన్నము ఆభగవంతుని కర్పణచేయకుందుమా? ఆయన్నము పవిత్రమే యైనయెడల; దానినే దయాళువైన ఆహరికి ఆసతో దాస్యమందలిఅభిప్రాయముతోను సమర్పణచేయఁగా, ఆయిది ఆయజ్ఞసమూహములో సరికాదా?

ఇ. భగవత్పదార్థములు సంపత్త్యైశ్వర్యవీర్యాణి.

అపిచ.—మఱియు.—

వృ॥ హింసాకృత్త్వాత్త్యేయా ఽతికథయతి యోవేదవైష్ణవయాగే
పశ్వాలంభం విధత్తే యదిక ఇహాసుఖే వైదిక స్సంశయాత

హింసాత్వాభావమేవాధ్వరపశునిహతేరాహరామానుజార్య
స్తత్పక్షస్థోఽపి యోనప్రసజతియజనేక స్తదన్యోగురుద్విట్॥

అ. హింసాకృత్=హింసచేయువాఁడు, ప్రత్యవేయాత్ = చెడిపోవును; ఇతి=అని, యో వేదః=ఏ వేదము, కథయతి=చెప్పుచున్నదో ? ఏష ఏవ=ఆయా వేదమే, యాగే=యజ్ఞమందు, పశ్వాలంభం = పశుహింసను, విధత్తే యది= చేయుచున్నదేవి; వైదికః=వేదవేత్త,కః=ఎవఁడు,ఇహమఖే=ఈయజ్ఞమందు, సంశయీత=సందేహపడును ? రామానుజార్యః=రామానుజాచార్యులు, అధ్వర పశునిహతేః= యజ్ఞమందలిపశువధమునకు, హింసాత్వ+అభావం ఏవ= హింస అగుటలేమినే, ఆహ=చెప్పిరి. తత్పక్షస్థోపి=వారిపక్షమం దుండువాఁడైనను, యః=ఎవఁడు, యజనే=పశుసంబంధియాగమందు, నప్రసజతి=చేరఁడో? తద న్యః=వానికంటె మఱొకఁడు, గురుద్విట్=గురుద్వేషి, కః=ఎవఁడు ?

తా. "నహింస్యాత్సర్వభూతాని"= ఏజంతువును గాని హింసించఁగూడదు, హింసించినవాఁడు పాపియగును; అనిచెప్పి, "అగ్నీషోమీయంపశుమాలభేత" యాగమందు ఛాగాదిపశుహింస చేయవచ్చును అని వేదము చెప్పుచుండఁగా, వేదవేత్తయైనవాఁడు యజ్ఞమందేలసందేహపడవలెను? యజ్ఞమానకులైన తెంగలైవారి యాచార్యులైన శ్రీరామానుజాచార్యులుకూడ యజ్ఞపశువధము హింసావిధముకాదని చెప్పుచుండఁగా; ఆ తెంగలపక్షమువారీయజ్ఞవిషయమునఁ జేరరైరేని, వారు గురుద్వేషులు కాకపోదురా ?

సీ. ప్రాణిహింసయ చేయఁ • బ్రత్యవాయము సేయు
నట్టివాఁ డేవాఁ డటంచుఁ బల్కు
నేవేద మేయెడ • నా వేద మాయెడ
యాగార్థపశుహింస • యగు ననంగ
నా వేదవేదియు • నగునట్టివాఁ డెవం
డాయాగమున సంశ • యమును జెందు
నా రామనుజుండు • నా యాగపశుహింస

హింస గాదని యానతిచ్చెనుక తన

తే. నతనిమతమున నెవఁడేని తా యాగమునఁ బ్ర
యోగమునఁ బ్రవర్తింపఁ డుద్యోగపడుచు
వాఁడు నిజముగ నిజగురుద్రోహమున కెపుడు
ద్వేషి యగువాఁడె యగును ద్రోహి యగుచు.

ఇ. రామానుజాచార్యులు—6 సంచికలో 171 పుటవెనుకప్రక్క చూడు?

ఇదంచావధేయం.— ఇదియుఁ దెలియునదియ.—

ఇ. జైనులు—వీరు వేదవిహితధర్మములు నమ్మి ఆచరింపనివారైనను, జీవహింస అనునది యేమాత్రమైనను జేయనివారై, శ్వేతాంబరులుగాను, లేక దిగంబరులుగాను నుండువారు.

వృ॥ హింసాంతరేష్వివ మఖాశ్రితహింసనేఽపి
జైనేతరోయది జనో భజతే జుగుప్సామ్
నార్యంతరేష్వివ ననిందతి నందనానాం
నిష్పాదనం కిమనఘేఽపి నిజే కళత్రే॥ 578

అ. జైన+ఇతరః=జైనునికంటె వేఱైన, జనః=మనుష్యుఁడు, హింసాంతరేష్వివ=ఇతరహింసలయందువలె, మఖాశ్రితహింసనేపి=యజ్ఞములో చేరినహింసయందుఁగూడ, జుగుప్సాం=ఏవగింతను, భజతేయది=పొందుచున్నాఁడేయేని, నార్యంతరేష్వివ=ఇతర స్త్రీయందువలె, అనఘే=నిర్దోషురాలైన, నిజే కళత్రేపి=తనభార్యయందుఁగూడ, నందనానాం = బిడ్డలయొక్క, నిష్పాదనం= పుట్టుకను, న నిందతి కిం=నిందింపఁడా ఏమి?

తా. జైనమతస్థులు తక్కఁ దక్కినవారైను, సకలహింసలవలె, యజ్ఞమందలిఘాతుకహింసలోనగూడ సహించనివారైనయెడల; లోకములో పరస్త్రీలందువలె గాక నిర్దోషురాలైన తన స్త్రీలయందుఁగూడ బిడ్డలను కనుకొనుటను గుతెంచియు నిందించుకొనుచుందురా? ఏమి?

తే. [illegible]

జైనజనుఁడు వినా మఱికేజనుఁ డెవండు
సేవగించునె? సుతుఁ గోరి కేయెరియూరి
సతులవలెఁ దనసలిని సకేమ్మతిని గాంచి.

గ॥ ఇద మప్యవగంతవ్యం.—ఇదియుఁ దెలిసికొనవలయునదియ.—

వృ॥ ఋత్విగ్విశుద్ధివిరహాది విశంకయా యే
కేచిత్కలౌ జహతి నిత్య మపి క్రతుం తే
ముంచంతి గుర్వశుచితావిషయేవ కిన్ను
చక్రాంక వైష్ణవమను గ్రహణాది సర్వమ్॥ 579

అ. యే=ఎవరు, కేచిత్=కొందఱు, కలౌ=కలియుగమందు, ఋత్విక్-విశుద్ధివిరహ-ఆది-విశంకయా=ఋత్విజులయొక్క - పరిశుద్ధ్యభావము-మొదలైనదానియందలి-సందేహముచేత, నిత్యం = ఎప్పుడును, క్రతుమపి=యజ్ఞమును గూడ, జహతి=విడుచుచున్నారో? తే=వారు, గురు-అశుచితా - విషయేన=ఆచార్యపురుషులయొక్క - పారిశుద్ధ్యాభావమందలి - సందేహవిషయముచేత, చక్రాంక-వైష్ణవమను - గ్రహణాది = చక్రాంకనమును-విష్ణుసంబంధియైనమంత్రమును-పరిగ్రహించుటమొదలైనదానిని, సర్వం=సమస్తమును, ముంచంతికిన్ను=విడుచుచున్నారా? ఏమి?

తా. కొందఱు తెంగలవారు ఈకలియుగములో అధ్వర్యాది ఋత్విజులు పరిశుద్ధులుగానున్నారో? లేదో? అని సంశయపడి యజ్ఞములను విడుచుచున్నారే యైనను; తమయాచార్యపురుషులును అపరిశుద్ధులో? కారో? అని సంశయపడి సమాశ్రయణాదిపంచసంస్కారములను గూడ విడిచిపెట్టుదురా? ఏమి?

(వైష్ణవమనువు = విష్ణుసంబంధిమంత్రము—ప్రణవము తోడిఅష్టాక్షరిమొదలైనవి.)

తే. యాజకుల పారిశుద్ధ్యము కే తేజరిలక
కలిఁ దొలంగిరతు కొందఱు కే క్రతుగణంబు

గుడు నపారిశుద్ధ్యము గొని కొనరె? యెవరుఁ
బంచసంస్కారమును నీ ప్రపంచమునను.

ఇ. పంచసంస్కారములు = తాపఃపుండ్ర స్తథానామ మంత్రోయాగశ్చ పంచమః'' అని తాపపుండ్రనామమంత్రయాగములె.

కించ.—మఱియు.—

వృ॥సర్వై ర్వేదైః స్మృతిగణయుతై స్సేతిహాసైః పురాణైః
శ్శిష్టాచారై రపి నియమితా నధ్వరా న్మధ్వరాతేః
ఆజ్ఞాసిద్ధా నహహ జహత స్తద్విరుద్ధాని కృత్యా
న్యాతన్వంతః కతిచి దపరా నప్యమీ శిక్షయంతి॥ 580

అ. సర్వైః=సకలమైన, వేదైః = వేదములచేతను, స్మృతిగణయుతైః = స్మృతులసమూహములతోఁ గూడినవై, సేతిహాసైః=ఇతిహాసములతోఁ గూడినవైన, పురాణైః=పురాణములచేతను, శిష్టాచారైః అపి = పెద్దలనడవడులచేతనుగూడ, నియమితాన్=నియమింపఁబడినవై, మధ్వరాతేః= మధువైరియైన భగవంతునియొక్క, ఆజ్ఞాసిద్ధాన్=అనుజ్ఞచేసిద్ధించినవైన, అధ్వరాన్=యజ్ఞములను,జహతః=విడుచుచున్నవారై, అహహ=ఆహా! తద్విరుద్ధాని=వానికివ్యతిరిక్తములైన,కృత్యాని=కార్యములను,ఆతన్వంతః=చేయువారై,అమీ=నీరు, కతిచిత్=కొందఱు, అపరాన్=ఇతరులనుగూడ, శిక్షయంతి=దిద్దుచున్నారు.

తా. వీరు శ్రుతులునను, స్మృతులు, ఇతిహాసములును, పురాణములును, శిష్టాచారములును విధించియుండియు, భగవదాజ్ఞాసిద్ధము లైనను; యజ్ఞములు చేయకపోవుటే కాక, తాము అశ్రుత్యాదివిరుద్ధకార్యములను గూడఁ జేయుచు, మఱికొందఱినిగూడ దిద్ది తమయట్లె నడిపించుకొను చున్నవారు ! ఆహా !

ఆ. స్మృతిపురాణములు శ్రుతీతిహాసములు వి
శిష్టశిష్టులును వచించిన వినక
తద్విరుద్ధములనె తవిలి చేయుచుఁ గొంద
ఱొరుల శిక్షసేయు చుందు రవుర!

వేదములు=శ్రుతులు—ఇవి పౌరుషేయములు అపౌరుషేయములు అనియు బ్రహ్మకాండము కర్మకాండము అనియు రెండురెండువిధములు; వీనిని విష్ణువు కృష్ణద్వైపాయనావతారములో ఋగ్యజుస్సామాధర్వణము లని నాల్గువిధములుగా విభాగించి వేదవ్యాసు లనిపేరుపొందెను. వీని అంగములు ఆఱు అవి శిక్షా, వ్యాకరణ, చ్ఛందో, నిరుక్తి, జ్యోతిష,కల్పములు.

స్మృతులు—ఇవి వేదార్థప్రతిపాదకములైనధర్మశాస్త్రములు. అవి మనుస్మృతి, బృహస్పతిస్మృతి, దక్ష, గౌతమ, యమ, ఆంగీరస, యాజ్ఞవల్క్య, ప్రచేత, శ్యాతాతప, పరాశర, సంవర్త, ఔశనస, శంఖ, లిఖిత, ఆత్రేయ, విష్ణు, హారీత, ఆపస్తంబస్మృతులు అని పదునెనిమిది విధములు.

ఇతిహాసములు—ఇవి రామాయణము భారతము మొదలైన పూర్వికులవృత్తాంతములు.

పురాణములు—ఇవి సృష్టి ప్రతిసృష్టి మన్వంతరములు వంశము వంశానుచరితము అని నాలుగు విషయములు దెలుపునవి. అవి—బ్రాహ్మ, పాద్మ, వైష్ణవ, శైవ, భాగవత, నారదీయ, మార్కండేయ, ఆగ్నేయ, భవిష్యత్, బ్రహ్మకైవర్త, లైంగ,స్కాంద,వారాహ, వామన, కూర్మ, మాత్స్య,గారుడ,బ్రహ్మాండములు అని పదునెనిమిదివిధములు.

కిం బహునా.—విశేష మేల ?—

వృ॥ యాగం యే బత! వైష్ణవా విజహతి చ్ఛాగచ్ఛిదాభీతితః
శిష్యక్లేశనసాధ్వసా జ్జహాతు తే చక్రాంకనప్రక్రియామ్
పూర్వస్మిన్ బహుసమ్మతి ర్భగవతః ప్రీతిః ఫలం నో ధనా
న్యల్పీయోఽభిమతిః పరత్ర ఫలమ ప్యర్థాప్తి రిత్థం భిదా॥

అ. యేవైష్ణవాః=ఏవైష్ణవులు. ఛాగ-ఛిదా-భీతితః=అజహింసయందలి-భయమువలన, యాగం=యజ్ఞమును, విజహతి=విడుచుచున్నారో; తే=ఆతెంగలవారు, బత=ఆహా! శిష్యక్లేశస-సాధ్వసాత్=శిష్యులను కష్టపెట్టుటయందలి-భయమువలన, చక్రాంకనప్రక్రియాం=చక్రాంకనముచేయుటను, జహాతు=విడుతురుగాక? పూర్వస్మిన్=ముందటిదానియందు, బహుసమ్మతిః=అనేకులస

మ్మతియు, భగవత్ ప్రీతిః=భగవత్ప్రీతియు, ఫలం=ఫలము ; నో ధనాని=ధనములు ఫలము కావు, పరత్ర=వెనకటి దానియందు, అల్పీయః-అక్షి మతిః=ఒకరిద్దరి సమ్మతియు, అర్థ ఆప్తిః అపి = ధనప్రాప్తియు, నో ఫలం=ఫలము కాదు, ఇత్థం=ఇట్లు, భిదా=భేదము.

తా. ఈతెంగలవారు అజమేధయాగము చేయకున్నను, శిష్యులను తపింపఁజేయవలెనని చక్రాంకనముచేయుటనైన విడిచిపెట్టుదురుగా? ఈ రెంటిలో మొదటిదానికి బహుజనసమ్మతియు భగవత్ప్రీతియు ఫలము; ధనము ఫలము కాదు. రెండవదానికి అల్పసంఖ్యాకులకైన సమ్మతియు, భగవత్ప్రీతియు, ధనప్రాప్తియును ఫలములుకావు. ఇదే తారతమ్యము.

ఉ. యాగము వైష్ణవాళి విడకైనా జడిసి సద్దర ! యిద్ధరాస్థలిన్
ఛాగముఁజేదమందు మతికల్పఁగలే కిల ఛాత్రతాపనో
ద్వేగితఁ జక్రముద్రణము కైవిడిన వీడఁగనిమ్ము రెంటిలో
బ్రాగభిభాషితంబు బహుళప్రార్థిత మర్పిత మచ్యుతార్థ, మ
ర్వాగభిభాషితంబా కతిప్రార్థిత మేమటి మానవార్థమే.

టి. ఛాత్ర-తాపన-ఉద్వేగితన్ = శిష్యులను-చంక్రాంకనముచే తపింపఁజేయుటయందలి భయముచేత.

కృశానుః విహస్య.—కృశానుఁడు నవ్వి.—

వృ॥ తప్తాభ్యాం శంఖచక్రాభ్యాం
తాపనం ప్రాణినా మిదమ్
ఛాగాలంభ సమత్వేన
సాధో! కి ముపవర్ణ్యతే॥ 582

అ. ప్రాణినాం=ప్రాణులకు, తప్తాభ్యాం=అగ్నితప్తములైన, శంఖచక్రాభ్యాం=శంఖచక్రములతో, ఇదం=ఈ, తాపనం=తపింపఁజేయుట, ఛాగాలంభసమత్వేన=పశుహింసతో సమముగా, హే సాధో=ఓ సాధూ! కిం = ఏల? ఉపవర్ణ్యతే=వర్ణింపఁబడుచున్నది.

తా. ఓసాధూ! అందఱకును చక్రాంకనముచేయుటను యజ్ఞమునకు పశుహింసచేయుటతో సాటిగా వర్ణించుచున్నావే ఏల?

క. వాగాడంబర ముండిన
నే గూడును పొగడ నిటుల కే నేవారికి నేఁ
ఛాగాలంభసమంబుగఁ
దాఁ గాంచున ? శంఖచక్రకృతాపనము గటా!

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ గుణదోషతారతమ్యా నభిజ్ఞ! శ్రుణుతావ దిదమ్॥ 583

వ. ఓగుణదోషతారతమ్యము తెలియనివాఁడా ! ఇది విను.

వృ॥ ఛాగాలంభసహస్రతః క్షితిసురస్యైకస్య హింసాధికా
తస్మాద్బ్రాహ్మణతాపనం న కిమిదం తుల్యం పశోర్హింసయా
శాస్త్రాత్తప్తరథాంగధారణ మిదం శ్రేయస్కరంచే త్తదా
వేదాదేవ మఖే పశోర్విశసనం నైతేన కిం మీయతే॥ 584

అ. ఛాగాలంభసహస్రతః=పశుహింసల వేయింటికంటె, ఏకస్య=ఒక, క్షితిసురస్య=బ్రాహ్మణునియొక్క, హింస=హింసయే, అధికా=ఎక్కువైనది, తస్మాత్=అందువలన, ఇదం=ఈ, బ్రాహ్మణతాపనం=బ్రాహ్మణునికి చక్రాంకనముతో తపింపఁజేయుట, పశోః=పశువుయొక్క, హింసయా = హింసతో, తుల్యం=సమానము, నకిం=కాదా? శాస్త్రాత్=శాస్త్రమువలన, ఇదం=ఈ, తప్తరథాంగధారణం=అగ్నితప్తమైన చక్రాంకనమును ధరించుట, శ్రేయస్కరంచేత్=శుభకరమైనదేని, తదా=అప్పుడు, వేదాదేవ=వేదమువలననే, మఖే=యజ్ఞమందు, పశోః=పశువుయొక్క, విశసనం=హింస, ఏతేన=దీనిచేత, కిం నమీయతే=ఏల పోల్పఁబడదు?

తా. వేలకొలఁది పశుహత్యలకంటె ఒకబ్రహ్మహత్యయే యెక్కువదోషము కలదిగానుండఁగా, ఒక బ్రాహ్మణునికి చక్రాంకనతాపము కలుగఁజేయుట ఒక పశుహత్యతో సమానముకాదా ? పాంచరాత్రాగమప్రకారము చక్రాంకన

తాపము శ్రేయస్కరమైనయెడల వేదోక్తముగా యజ్ఞపశుహింసచేయుట ఆచక్రాంకనతాపము కలుగఁజేయుటతో సమానముకాదా?

ఉ. భాగసహస్రహింస కొకటేత్మాసురహింసయె మించు నన్నచో
భాగనిహింసనంబు నలిత్మాసురహింసకు సాటి యౌనె? శ్రు
త్యాగతహింసభాగమునకే కారయ మేలయి యీదొరొక్కటేశా
స్త్రాగతచక్రముద్రణము కే నాశ్రితకోటికి శ్రేయ మైన నే.

గీ॥ ఇత్యలం శ్రుత్యయుతవిహితసదాచరణావశ్యకతా సమర్థనేన
కరబదరాస్తిత్వసాధక ప్రమాణాంతర పరికల్పన కల్పేన॥

వ. అని తనకరంబున బదరఫలంబు కొని దానియునికికె సాధనం
బుగఁ బ్రత్యక్షాన్యంబగు ప్రమాణంబు పరికల్పించుకొను
నట్లే, యిట్లు పదివేలవేదంబులు విధించి సత్పురుషులు సమా
చరించెడు సదాచరణంబులును సదావశ్యకంబు లని సమర్థిం
చుటె చాలు.

## చెంజిపురి (తంజావూరి) వర్ణనము.

(చెంజిపురి—తంజనగరము = తంజావూరు. ఇది పూర్వము చంద్రశేఖర మహారాజాదిమరాజపరిపాలితమై యుండి బృహదీశ్వరీదేవీసహితుఁడైన బృహదీశ్వరుని దేవాలయముతోను, వర్ణాశ్రమధర్మప్రవర్తనులైన చతుర్వర్ణములవారి మిద్దెల మేడలతోడి రాజవీథులతోను, శౌర్యసాహససుర్యులైన రాజభటులతోను, సుందరములైన మందిరారామములతోను రాజిలుచుండు తంజమామణి రాజధాని.)

గీ॥ ఇతి కించిదంతరం దక్షిణతో విమాన మానీయ సశిరఃకంపం॥

వ. అని మఱికొంతయంతరంబున దక్కినపుందిక్కునకు విమా
న మానయించుకొని (చెంజి యను తంజనగరంబు పరికించి)
తనశిరంబును బాకించి.

వృ॥ఖంజీకృతాఖిలహృదాం రమణీమణీనామ్
మంజీరమంజుతరశింజితరంజితేన
చంజీపురీ యువగణేన చకాస్తి పూర్ణా
సంజీవితోగ్రపరివంచితపంచబాణా॥ 587

అ. ఖంజీకృతాఖిల-హృదాం=నిగర్వులనుగాఁ జేయఁబడినఅందఱియొక్క హృదయములుగల, రమణీమణీనాం= స్త్రీరత్నములయొక్క, మంజీర-మంజుతర-శింజిత-రంజితేన= అందియలయొక్క-మనోజ్ఞమైన-శబ్దభేదముచేత రంజిలుచున్న, యువగణేన=యౌవనవంతుల సమూహముచేత, పూర్ణా=నిండినదై, సంజీవిత-ఉగ్ర-పరివంచిత-పంచబాణా=బ్రదికింపఁబడినవాఁడై-శివునిచేత- భస్మముగా మోసముచేయఁబడిన-మన్మథుఁడు గలదైన, చంజీపురీ=తంజావూరు, చకాస్తి=ప్రకాశించుచున్నది.

తా. ఈతంజావూరు ఊరియందలి యందఱను నిగర్వులనుగాఁ జేయునందముగల యౌవనవతుల కాలియందియలమ్రోఁతకును మోదము నందుచుండు యౌవనవంతులతోడఁ గూడి ఆశివునిచేత భస్మీభూతుఁడైన ఆమన్మథునిఁగూడ సజీవునిగాఁ జేయుచుఁ బ్రకాశిల్లుచున్నయది.

తే. చెంజి ఖంజీకృతాఖిలశ్రీచిత్తకంజ
మంజుమంజీరశింజితశ్రీరంజితయువ
యువతిజనపుంజ, సంజీవితశ్రీతోగ్రమథిత
మదనకదనసమంజసశ్రీ యెదురమెఱసె.

కించ.—మఱియు.—

వృ॥ఋక్సామయోశ్చ యజుషాంచ నివాసభూతాః
పూతా ద్విజాః స్మృతిపురాణకలాధురీణాః
కుర్వంతి వాస మిహ కర్కశతర్కశబ్ద
తంత్రత్రయీశిఖరసింధుతలస్పృశోఽమీ॥ 588

అ. ఋక్సామయోశ్చ=ఋగ్వేదమునకును సామవేదమునకును, యజుషాంచ

యజుర్వేదమునకును, నివాసభూతాః = వాసస్థానములై, పూతాః=పవిత్రులై, స్మృతి-పురాణ-కలా-ధురీణాః=స్మృతులయందును - పురాణములందును-కళల యందును-సమర్థులై, కర్కశ-తర్క-శబ్ద-తంత్ర-త్రయీశిఖర-సింధు-తలస్పృశః=కఠినములైన న్యాయశాస్త్రము-వ్యాకరణశాస్త్రము-మీమాంసాశాస్త్రము-వేదాంతము అనెడు-సముద్రములయొక్క-అంతర్భాగములను గూడ అంటి యుండువారైన, అమీ=ఈ, ద్విజాః=బ్రాహ్మణులు, ఇహ=ఇక్కడ, వాసం=వాసమును, కుర్వతి=చేయుచున్నారు.

తా. ఇక్కడి బ్రాహ్మణులు త్రివేదములందును, అష్టాదశస్మృతిపురాణము లందును, చతుష్షష్టికళలయందును, తర్కవ్యాకరణ మీమాంసాశాస్త్రములందును, వేదాంతములందును తుదముట్టc దేఁజినవారుగా నున్నవారు.

తే. సకలవేదవేదాంతాల సకలకళల
 స్మృతిపురాణాలవ్యాకృతికృతుల మఱియుc
 దర్కతంత్రాలc బారంగతప్రతిభులు
 ద్విభువు లీచెంజి నుంద్రు పవిత్రు లగుచు.

చతుర్వేదములు—ఋగ్యజుస్సామాథర్వములు. ఇవి 320-వ పుటకు వెనుక చూడు.

పురాణములు—ఇవియు పదినెనిమిదివిధములు 320-వ పుటకు వెనుక చూడు.

కళలు—ఇవి అఱువదినాలుగు విధములు. ఇవి ఇతిహా, సాగమ, కా, వ్యాలంకార, నాటక, సంగీత, కవిత్వ, వాచకద్యూతా వధాన, చిత్రలేఖన, మోహనాదులు. తర్కము—న్యాయశాస్త్రము = పదార్థవిషయములను దెలిపెడి శాస్త్రము.

శబ్దశాస్త్రము=వ్యాకరణము—శబ్దలక్షణములను దెలిపెడిశాస్త్రము.

తంత్రము—మీమాంస ఇది వేదార్థప్రతిపాదకశాస్త్రము. అది బ్రహ్మకాండము, కర్మకాండము అని రెండువిధములు.

త్రయీశిఖరము—వేదాంతము. ఇది వేదార్థముల సారాంశము.

ఈషాజ్ఞాన, గరిడీక్రీడలును; గజతురగారూఢకౌశల, మృగపక్షి యుద్ధకౌశల

ములును, భూరుహలోహన, వేత్రలోహములును; కృషి, వాణిజ్య, పశుపాలన, మృగయారతులును, వంచన, స్వరవంచన, కాలవంచన, విద్వేష, ణోచ్చాటన, మార, ణాకర్షణములును, కళా, పాక, స్వర, శకున, సాముద్రిక, రత్న, మాలినీశాస్త్రములును, ఖని, గంధ, రస, ధాతువాదములును, ఇంద్రజాల, మహేంద్రజాల, జాలవిద్యలును, జ, లాగ్ని, ఖడ్గ, వాయు, వా, గ్వాయుస్తంభనములును, మృ, ద్ఘటికా, పాదు, కాంజిన, నర, మణీ, మం, త్రౌష, ధాణిమాదిసిద్ధులును, ఉదక, ర్మాహవకర్మలును అనునవియే చతుష్షష్టికళలు.

కృశానుః సహసమ్.—కృశానుఁడు నవ్వుతో.—

వృ॥ నైత ద్విభాతి నగరం నగరమ్యదుర్గ
ప్రాకారసాధనదశాసు విశాం పతీనామ్
యుద్ధోన్నటన్భటశిర స్తటనిస్సృతాస్ర
స్రోతస్సహస్రభరవిస్రపలాస్థిసాంద్రమ్॥ 589

అ. విశాం=మనుష్యులకు, పతీనాం=ప్రభువులైన రాజులయొక్క, నగ-రమ్య-దుర్గ-ప్రాకార-సాధన-దశాసు=కొండలవలె-మనోహరములై,దాఁటఁగూడని, ప్రాకారములను-సాధించుటయనెడు - అవస్థలలో, యుద్ధ-ఉన్నటత్-భట-శిర స్తట-నిస్సృత-అస్ర-స్రోతః-సహస్రభర-విస్ర-పల - అస్థి-సాంద్రం = యుద్ధములో-విజృంభించుచున్న-వీరభటులయొక్క-తలలోనుండి-జాఱిన-రక్త ప్రవాహములయొక్క-వేలకొలఁది యతిశయమైన అపక్వగంధములతోడి - మాంసములచేతను-ఎముకలచేతను-దట్టమైన, ఏతత్-ఈ, నగరం=తంజావూరు, నవిభాతి=ప్రకాశించదు.

తా. ఈతంజావూరురాజుల మేడలలో ప్రాకారములలో యుద్ధముచేయు వీరభటుల తలలనుండి ప్రవహించు నెత్తురును మాంసమును ఎముకలును నిండి యుండునదియై యేవగింపఁదగినదియై యున్నది.

మ. నగరం బీనగదుర్గదుర్గమతమమాన్నతోగ్రసాలాగ్రముల్
తగ సాధించునవస్థలం బ్రభువు లత్యంతాద్భుతం బంద యు

ద్ధగతోద్యద్భటమస్తకస్థలగలద్రక్తామగంధామిష
ప్రగతాభీలపలాస్థిదుస్థితిని జూచిపట్టుగ జుగుప్సగ సదా.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ వయస్య! గుణాన్వయస్య పునరస్య నగరస్య నిందాచ్ఛద్మనా
ప్రశంసామేవ భవాన్ కృతవాన్॥ 590

వ. చెలికాఁడ! నీవీవీడు మహత్త్వసమన్విత మని నిందానిభ
మున నీదానిప్రశంసయే మఱలఁ జేయుచున్నాఁడవు.

యతః.—ఏలంటే.—

వృ॥ పురాతనానాంహి పురాంతరాణాం
ప్రశాసితాఽరోపి దిశాసు భూపాః
పురం తదేతి ద్వపురం త మాజౌ
హంతాభ్యుపేత్యాప్యల మర్థయంతి॥ 591

అ. దిశాసు=సకలదిక్కులలోను, పురాతనానాం=ప్రాచీనములైన, పురాంతరాణాం=వేలువేలుపట్టణములకు, ప్రశాసితారోఽపి=పరిపాలకులైనను, భూపాః=రాజులు, ఆజౌ = యుద్ధమందు, వపురంతం = దేహాంతమును, అభ్యుపేత్యాపి=పొందియును, తత్ ఏతత్ పురం=ఆయీపట్టణమును, అలం=బహుగా, అర్థయంతి హి=కోరుచున్నారు కదా! హంత=ఆశ్చర్యము!

తా. సకలదిక్కుల పట్టణములలోను పూర్వపురాజులు తాము తమదేహములు విడిచి కూడ ఈపట్టణమునే సకలైశ్వర్యములు కలదనికోరుచుందురు. ఆశ్చర్యము కదా!

క. హరిదంతరధరల నిరం
తర మాశింతురు పురాతనపురాంతరముల్
పరిపాలించెడి నృపు లీ
పురి సేరి శరీర మఱియుఁ గోరిఁ బోరితఱిన్.

కృశానుః.—కృశానువు.—

గ॥ నిరూపణ మభినీయ ససాధ్వసమ్ హంత చిరంతనానా మిదానీంతనానాంచ వసుంధరాధురంధరాణా మవారణీయోఽసావవివేకః॥ 592

వ. నిరూపించుట నభినయించి భయము నెంచి; అయ్యో! ఆపురాతనులు నీయధునాతనులు నయినరాజుల కీయవివేకము వీడఁగూడనిది యై యున్నయది.

పశ్య.—చూడు.—

వృ॥ప్రాజ్యే హంత! ధనే స్థితేఽపి నృవరో రాజ్యేఽపి సత్యూర్జితే
సంభోగానుగుణా విలోచనగుణై రంభోజదంభద్రుహః
కల్యాణీ స్తరుణీ రుపేక్ష్య కరుణాహీన స్ససేన స్స్వయం
హర్తుం శత్రుధరాం చిరా దభిలషన్ మర్తుం రణే జృంభతే॥

అ. నృవరః=రాజు, ప్రాజ్యే=విస్తారమైన, ధనే=ధనము, స్థితేఽపి=ఉండియు, ఊర్జితే=సమృద్ధమైన, రాజ్యే=రాజ్యము, సత్యపి=ఉండియు, విలోచనగుణైః=కనులగుణములచేత, అంభోజదంభద్రుహః = తామరల గర్వమును హరించువారును, సంభోగానుగుణాః=సంభోగమునకు. తగినవారును, కల్యాణీః=శుభశీలముకలవారునైన, తరుణీః=యౌవనవంతురాండ్రను, ఉపేక్ష్య=అలక్ష్యముచేసి, కరుణాహీనః=కనికరములేనివాఁడై, శత్రుధరాం=పగతునిభూమిని, చిరాత్=బహుకాలముగా, అభిలషన్=కోరుచు, రణే=యుద్ధమందు, స్వయం=తానె, ససేనః=సేనతోఁ గూడినవాఁడై, మర్తుం = మృతిపొందుటకు, జృంభతే=విజృంభించుచున్నాఁడు.

తా. రాజైనవాఁడు విశేషముగ ధనమును, మంచిరాజ్యమును గలిగియుండియు, మిక్కిలియందమును, మంచినడవడియును గలిగి, సంభోగయోగ్యలైన యౌవనవతులను కనికరము లేక విడిచి, పగతుని రాజ్యమును గెల్చుటకయ్యె

యుద్ధములో సేనలతోఁగూడ తాను మృతిపొందుటకైనను రేఁగుచున్నాఁడు.
ఇదేమి అవివేకము?

తే. రాజు రాజ్య మూర్జిత మైనఁ గ్రొత్త రాజ్య మైన
ధనము భోగానుగుణ లై నకొవనరుహాక్షు
లెడలఁ బుచ్చి యదయుఁ డరిగెపుడమి గొనఁగఁ
గోరి యని నైనఁ జనిపోవఁ గోరి పోవు.

విశ్వావసుః—విశ్వావసువు.

౧॥ విరుద్ధబుద్ధే వివేకమేవ తావ దవివేక మాకలయతి భవాన్॥
వ. చెలికాఁడ! నీవిటు విరుద్ధబుద్ధియై కలవాఁడవై నీవివేకము
నవివేకముగానె కావించుకొనుచున్నాఁడవు?

తథాహి.—అదిస రే?—

వృ॥ సంప ద్వన్యసరి ఝ్ఝరీ సహచరీ శంపాసమం ప్రాభవం
నార్య స్సూర్యకరావలీఢజలదచ్ఛాయాసుహృద్యావనాః
దేహాః స్నేహవిహీనదీపసఖ ఇత్యాలోచ్య పృథ్వీశ్వరాః
ప్రాణాన్ జుహ్వతి నాకమాకలయితుంశుద్ధాహియుద్ధానలే॥

అ. పృథ్వీశ్వరాః=రాజులు, సంపత్=సంపద, వన్యసరిత్ఝరీ-సహచరీ=
అడవిలోఁబుట్టిన-ఏటికాలువతో-కూడఁబుట్టినది; ప్రాభవం=ప్రభుత్వము, శం
పా-సమం=మెఱుపుతో-సరియైనది; నార్యః = స్త్రీలు, సూర్యకర-అవలీఢ-
జలదచ్ఛాయా-సుహృత్-యౌవనాః=సూర్యకిరణములచేత-కప్పఁబడిన- మేఘ
మునీడతో-స్నేహితమైన-యౌవనముకలవారు ; దేహాః = శరీరము, స్నేహవి
హీన-దీపసఖః=చమురులేని-దీపముతో-స్నేహముకలది ; ఇతి=అని, ఆలోచ్య=
ఆలోచించి, నాకం=స్వర్గమును, ఆకలయితుం=సంపాదించుటకు, యుద్ధాన
లే=యుద్ధమనెడి అగ్నియందు, ప్రాణాన్=ప్రాణములను, జుహ్వతి=విడుచు
చున్నారు. శుద్ధాహి=పరిశుద్ధులుకదా?

తా. రాజులు సంపదను కాటిలోని ఏటికాల్వగాను, రాజ్యకమును మెఱుపుతీఁగగాను, స్త్రీలపొలానమును ఎండను కప్పిన మబ్బునీడగాను, దేహమును చమురులేని దీపముగాను అనిత్యము లని నిశ్చయించి, నిత్యసుఖాస్పద మైన స్వర్గమునుకోరియే,అగ్నిలోవలె యుద్ధములో ప్రాణములనే విడుచుచున్నారు.

సీ. సర్వ మైశ్వర్య మాఁకఱురిసహచరి యగు
నిల నిలకయ పొర్లి యెగసి పాఱఁ
బాౖభవ ప్రాబల్య మాభంగి నాక్షణ
ప్రభ యగు క్షణిక మై పరిసిపోవ
నార్యవతంసలు సూర్యమహాంశులఁ
బ్రబ్బుమబ్బు లగుదు ర్పరుగువాఱ
దాహార్హ మైనయీ దేహ మాస్నేహము
లేక దీపమ యగుఁ దోన యవియ

తే. ననుచు నాలోచనము చేసి యతిపవిత్రు
లవనిపతు లీధరిత్రి యుద్ధానలమునఁ
దమదుప్రాణంబులను వ్రేల్తు రమలమతులు
నాకలోకంబునకుఁగాను నాఁడు నేఁడు.

నాకము—స్వర్గము=ఇది స్వర్గమర్త్య పాతాళము లనెడిమూఁడులోకములలో దేవతలు వాసముచేయు మొదటిలోకము.

గ॥ శృణు చేమం చమత్కారమ్॥ 596

వ. ఆకర్ణించు మీానచియించువచనంబును జమత్కరించును.

వృ॥ రక్తే భటే రణముఖే రుధిరేణ తస్మిఁ
రక్తా భవత్యమరయోషి దనుప్రవ తేవ
శూర స్సచే దతనుసాయకఖండితాంగ
స్సా ప్యుచ్ఛ్రకె రతనుసాయకఖండితాంగా॥ 597

అ. అమరయోషిత్ =దేవ స్త్రీ, అను వ్రతేవ=పతివ్రతవలె, రణముఖే=యుద్ధారంభమందు, తస్మిన్ =ఆ, భటే=భటుఁడు, రుధిరేణ=నెత్తుటిచేత, రక్తే సతి ఎఱ్ఱనయగుచుండఁగా, రక్తా=తాను నెఱ్ఱనిదియు-అనురాగముగలదియు, భవతి=అగుచున్నది. సః శూరః = ఆవీరభటుఁడు, అతనుసాయక-ఖండితాంగశ్చేత్ =గొప్పబాణాలచేత-ఖండింపఁబడిన అవయవములు కలవాఁడయ్యెనేని, సాఽపి=ఆదేవ స్త్రీయు, ఉచ్చకైః=మిక్కిలి, అతనుసాయక-ఖండితాంగా=మన్మథబాణాలచేత, ఖండింపఁబడిన అవయవములు కలది, భవతి=అగుచున్నది.

తా. యుద్ధములో వీరభటుఁడైనవాఁడు రక్తముచేత ఎఱ్ఱఁబాఱఁగానె, యుద్ధవీరులను జేరుదేవ స్త్రీయు పతివ్రతవలె తానును అనురక్తురాలైయే రాగిలును; ఆవీరుఁడు బాణఖండితాంగుఁడయ్యెనేని, ఈదేవ స్త్రీయు మన్మథబాణఖండితాంగయే అగును.

ఉ. రక్తమునన్ భటుండు రణరంగమునన్ గడురక్తుఁడైనఁ దా
రక్తయునాసురాంగన కరంబుపురంధ్రియుఁబోలె శౌర్యసం
సక్తుఁడు వాఁడు నాయతను సాయకఖండితదేహుఁడైన నా
సక్తయు నౌచునాయతనుసాయకఖండితదేహ తాను నౌన్.

కించ. మఱియు—

వృ॥ దీప్తో విప్రభ మాశ్రితక్షితితలం దివ్యేవిమానే స్థితో
గాఢాశ్లిష్టకృపాణపాణిచ కరగ్రస్తామర స్త్రీ స్తనః
తత్సందత్తనఖక్షతో బహుతరప్రత్యర్థిబాణక్షతమ్
యుద్ధాగ్నౌ హుతజీవితో నిజవపుర్వీక్షతే॥598

అ. యుద్ధాగ్నౌ=యుద్ధమనెడి యగ్నియందు, హుతజీవితః=వ్రేల్వఁబడిన జీవముగలవాఁడై, దీప్తః=ప్రజ్వరిల్లువాఁడై, దివ్యే=అమానుషమైన, విమానే=దేవయానమందు, స్థితః=ఉండువాఁడై, కరగ్రస్త-అమర స్త్రీ స్తనః=చేతపట్టఁబడిన-దేవ స్త్రీకుచములుకలవాఁడై, తత్ సందత్త-నఖక్షతః=దానిచేత చక్కఁగ నీయఁబడిన... = తేజోవి

హీనమై, ఆశ్రితక్షితితలం=చేరినభూప్రదేశము గలదై, గాఢ-ఆశ్లిష్ట-కృపాణ-పాణి=గట్టిగ-కౌఁగిలింపఁబడిన-ఖడ్గము-చేతియందుఁగలదై, బహుతర-ప్రత్యర్థి-బాణ-క్షతం=మిక్కిలి-శత్రువులయొక్క-బాణములచేత-కొట్టఁబడినదై, నిజం=తనదైన, వపుః=దేహమును, ముదా = సంతోషముతో, వీక్షతే=చూచుచున్నాఁడు.

తా. అగ్నిలోవలె యుద్ధములోఁ దగిలి వీడి లేచినజీవము గలవాఁడై దేవవిమానము నెక్కుకొని, దేవస్త్రీనిఁ గౌఁగిలించుకొని, దాని నఖక్షతములలోఁ దగులుకొనుచుండు నా వీరభటుఁడు తేజమువీడి నేలఁబడి, చేత ఖడ్గము కలిగి, పగవానిబాణపుదెబ్బలు పడియుండు తనదేహమును సంతోషముతో చూచుచుండును.

సీ. దీప్తులు గలిగి నే దీపించువాఁడను
దీప్తి లేకిదియె దుఃఖాప్తి కలది
దివ్యమై వెలిఁగెను నివ్యోమయాన మే
నెక్కితి క్షితిఁబడి యక్కు నిదియ
హస్తంబులను నమరీస్తనంబులను నేఁ
బూనితి నిది యసిఁ బూనెఁ గేల
సుఖదాయి తత్సురీ నఖముఖక్షతుఁడ నే
విశిఖముఖక్షతి విసుకు నిదియ
తే. యనుచు నాలంబు నాలంపు టగ్నిలోన
జీవనమ్ముల నిమ్ములఁ జేసి వ్రేల్చు
వార లావీరు లాత్మీయ వపువు లాఁచి
యేచి మదమున ముదమునఁ జూచికొంద్రు.

## శ్రీ దేవనాయకస్వామివర్ణనము.

(శ్రీదేవనాయకస్వామి—వీరు-తిరువింద్రపురమున గరుడనదీపినాకినీనదుల దగ్గఱ చంద్రవిమానమున శ్రీహేమాంబుజనాయకితో గరుడనాశ్రయించుకొని చంద్రు

నకును ప్రత్యక్షమై తిరుమంగై యాళ్వార్ల మంగళాశాసనములో సేవసాయించు చుండుస్వామి.)

గ॥ ఇత్యత్ర విమానం సంచారయన్ పరితో దృష్ట్వా॥ 599

వ. అని మఱియొక్క ప్రక్కకున్ విమానమును మఱల్చుకొని యంతటనుం గనుంగొని.

వృ॥ పినాకినీం పశ్య ఘనాఘనాశినీం
జలాచ్ఛ లక్ష్మీ్వం గరుడాపగా మపి
ఇదంతటే రాజతి దేవనాయకః
పరత్ర సర్గాదివ దేవనాయకః॥ 600

అ. ఘనాఘ-నాశినీం=గొప్పపాపములను-నశింపఁజేయునదై, జలాచ్ఛ = నీటిచేతను, లక్ష్మీ్వం=స్వల్పమైన, పినాకినీం=పినాకినీనదిని, గరుడాపగామపి = గరుడనదినిన్, పశ్య=చూడుమ? సర్గాత్=స్వర్గమునకంటె, పరత్ర ఇవ = ఆవలి చోటైన వైకుంఠమందువలె, ఇదంతటే=ఈరెండునదులగట్టున, దేవనాయ = క్రీడించుటకై, కః=ఎవఁడు? రాజతి=ప్రకాశించుచున్నాఁడో; దేవనాయకః= దేవకనాయకస్వామి అనెడి, సఏవ=అతఁడే, అయం=ఈవిష్ణువు.

తా. ఉత్తరమున పినాకికిని,దక్షిణమున గరుడనదికిని నడిమిగట్టున వైకుంఠమందువలె ఇక్కడ శ్రీదేవనాయకస్వామి యని యావిష్ణువె విహరించు చున్నతఁడు.

తే. కనుమ? పినాకిని నఘవినాశిని ని ధునిని
గనులఁ గనుమ? ఽఘుజల మఱి గరుడనదిని,
దేవనాయక నామక దేవుఁ డిందు
దరిని నిరవొందుఁ బరమందు హరినిఁ బోలి.

## శ్రీముష్ణక్షేత్రయజ్ఞవరాహవర్ణనము.

(శ్వేతయజ్ఞవరాహస్వామి—వీరు-హిరణ్యాక్షుఁడు భూమి నెత్తుకొనిపోయి సముద్రములో దాఁచిపెట్టఁగా, ఇంద్రాదిదేవతలు ప్రార్థింపఁ జేకొని

యామహావిష్ణు వీవరాహరూపముకైకొని పాతాళమునకుఁ బోయి ఆభూమి నె త్తుకొనివచ్చి యందఱినిన్ సంరక్షించుటకై యాహిరణ్యాక్షుని శిక్షించి యి క్కడనె యానరసురాదులచే యజ్ఞమందు పూజింపఁబడి, ఇప్పుడును ఈ శ్రీ ముష్ణక్షేత్రమున నిత్యపుష్కరిణీతీర్థతీరమందు వామనవిమానమున అంబుజవల్లి తాయారుతో అశ్వత్థనారాయణులుగ ప్రత్యక్షమై సేవసాయించుచున్న ఆది వరాహప్పెరుమాళ్లు.)

గ॥ ఇతరత్ర విమానం స్పందయన్ సానందమ్॥ 601

వ. ఇవ్వలి కవ్విమాన మెలయించి యెలమియుం గాంచి.

వృ॥ అద్య ప్రత్నం ప క్త్రిమం నశ్చరిత్రం
దేవః ప్రీత స్సుప్రభాతా నిశా మే
శ్రీముష్ణం య న్ముష్ణదంహ స్సహస్రం
క్షేత్రం ప్రాప్తం నేత్రయోః పాత్రభావమ్॥ 602

అ. నః=మాయొక్క, ప్రత్నం=పురాతనమైన, చరిత్రం=సుకృతచరితము, అద్య=ఇప్పుడు, ప క్త్రిమం=ఫలితమైనది; దేవః=స్వామి, ప్రీతః=సంతోషించి నవాఁడయ్యెను; నిశా=రాత్రి, మే=నాకు, సుప్రభాతా=చక్కఁగ తెల్లవాఱి నది; యత్=ఎందువలన, శ్రీముష్ణం=శ్రీముష్ణము - తిరుముషిఅనెడి, క్షేత్రం= క్షేత్రము, అంహస్సహస్రం=పాపముల వేయింటిని, ముష్ణత్ = నశింపఁజేయు చున్నదో; తత్=అందువలన, నేత్రయోః=మా నేత్రములకు, పాత్రభావం=పా త్రత, ప్రాప్తం=పొందఁబడినది.

తా. మా పురాతనసుకృతము లిప్పుడె ఫలించినది; స్వామియును సుప్రస న్నుఁడయ్యెను; ఈరాత్రియును చక్కఁగ తెల్లవాఱినది; వేలకొలఁది సకలపా పములనున్ పరిహరించునది యైన యీశ్రీముష్ణక్షేత్రము మా నేత్రములకును ఇప్పుడు పాత్రమాయెను.

తే. నాదుచరితంబు ఫలితంబు కై గాఁదొడంగె
నాదుదైవంబు సుప్రసన్నంబు నయ్యె

నాదు నిశ సుప్రభాతంబు కై నాఁ దనర్చె
నాదు నేత్రము పాత్రము కై నాఁ దలిర్చె
గనుల శ్రీముష్ణక్షేత్రమూర్తి కనినయపుడె.

అత్రహి.—ఇక్కడఁగదా ?

వృ॥ వరా వరాహరూపిణీ చరాచరాంతరస్థితా
సురాసురానుసేవితా ధరాధరాఽఽదిదేవతా
సదా సదావలిస్తుతా ముదా ముదారశేవధి
ర్హితాహి తార్క్ష్యకేతనా నతానతా గతిం నయేత్ ॥ 603

అ. చరాచర-అంతర-స్థితా=జంగమస్థావరములయొక్క - అంతరములందు - ఉండునదియై, సురాసుర_అనుసేవితా = దేవరాక్షసులచేత-అనుసరించి సేవింపఁబడునదియై, ధరాధరా=భూమినిధరించినదియై, సదా=ఎల్లప్పుడును, సత్-ఆవలి-స్తుతా=సత్పురుషులయొక్క-సమూహముచేత-పొగడఁబడునదియై, ముదాం=ఆనందాతిశయములకు, ఉదార-శేవధిః=మహత్తైన-నిధియై, హితా=జగద్ధితమై, తార్క్ష్యకేతనా=గరుడధ్వజముగలదియై, నత-ఆనతా = ఆశ్రితులచేత-నమస్కరింపఁబడినదియై, వరా=సర్వోత్తమమై, వరాహరూపిణీ = ఆదివరాహరూపము కలదియైన, ఆదిదేవతా=పరమదైవము,గతిం=అపునరావృత్తిప్రాప్తిని,నయేత్ = పొందించునుగాక.•

తా. చరాచరవస్తువులలో అంతర్యామియు, సురాసురులు సేవకులును, భూభారమును ధరించి సకల సత్పురుషులును పొగడుచుండ సకల విధానందములకును సముద్రమును, సకలలోకములకును హితకారియు, సకలభక్తులును నమస్కారములు చేయుచుండ ఆదివరాహ స్వరూపమును గలిగి యుండు ఆపరమదైవము వెనుక మనకు అపునరావృత్తి మార్గము గలుగఁజేయునుగాక?

తే. వరవరాహదేవుఁడు చరాచరవిహారి
యసురసురసేవితుఁడు ధరాధరుఁడు నెపుడు

సన్నుతుఁడు తార్క్ష్యయానుఁడు సన్నిధానుఁ
డానతానతుఁడు గతివిహీనుఁడౌను.

గ॥ శ్రీమత్కవీంద్రశ్చాత్ర కశ్చిదిత్థ మనుసంధత్తే॥ 604

వ. ఇక్కడ నొక్కఁడు శ్రీమంతులకుఁ గవులకు న్నేటి యనువతెఁ
డిటు లనుసంధించుచున్నతఁడు.

వృ॥ సదావదాత నిమ్నగాతటీకుటీరవాసినీ
కటీస్ఫుటీభవత్కరా కిటీశ్వరీ పటీయసీ
రసారసాదిహోదితా రసాలసాలసంవృతే
వనేఽవనేషు దీక్షితా మయేక్షితాఽదిదేవతా॥ 605

అ. రసా-రసాత్=భూమియందలి-ప్రేమరసమువలన, ఇహ = ఇక్కడ,రసాల-సాల-సంవృతే=మామిడిచెట్లచేతను-ఏపెచెట్లచేతను-చుట్టఁబడిన, వనే=అడవియందు, ఉదితా=ఆవిర్భవించినదియై, సదా-అవదాత-నిమ్నగా-తటీ-కుటీర-వాసినీ = ఎప్పుడును-పరిశుద్ధమైన-నదియొక్క-గట్టునందలి-చిన్నమందిరమందు-వసించునదియై,కటీ-స్ఫుటీభవత్-కరా=మొలయందు- స్పష్టమగుచున్న-హస్తము కలదియై, అవనేషు=రక్షణవిషయములందు, దీక్షితా=దీక్ష వహించినదియై, పటీయసీ=మిక్కిలిసామర్థ్యము కలదియై, కిటీశ్వరీ = ఆదివరాహస్వరూపమైన, ఆదిదేవతా=పరమదైవము, మత్-ఈక్షితా=నాచే-చూడఁబడినది.

తా. ఈభూలోకమున ప్రేమచేత ఈమామిడితోఁపులో ఆవిర్భవించి ఈ పినాకినిగట్టున, నడుమున చేయూంచుకొని భక్తులను రక్షించుటకై దీక్ష వహించి ఆదివరాహస్వరూప మైన ఈ యాదివరాహస్వామి ఇప్పుడు నాచే సేవింపఁబడియెను.

తే. క్షీరతటినీతటిని నీకుటీరవసతిఁ
గటినిఘటితకరాంబుజ స్ఫుటితకిటిగ
రసరసంబునఁ బొడగాంచె సరహి రసాల
వనమునం బరదైవం బవనమునెంచి.

కృశానుః.—కృశానుఁడు—

వృ॥ సోఽయం హేయప్రత్యనీకోఽపి శార్ఙ్గీ
కష్టం పృథ్వీకాంక్షయాఽభూద్వరాహః
ఇత్థం సిద్ధే బ్రూహి భూలాభలోభాత్
కంకం వేషం మానుషో నేహధత్తే? 606

అ. హేయ-ప్రత్యనీకోఽపి=త్యాజ్యవిషయములకు-విరోధియైనను; సోఽయం=ఆయీ, శార్ఙ్గీ=విష్ణువు, పృథ్వీ - కాంక్షయా=భూమిని-కోరుటచేత, వరాహః=సూకరము, అభూత్=ఆయెను; కష్టం=అయ్యో! ఇత్థం = ఇట్లు, సిద్ధేసతి=సిద్ధించుచుండఁగా; ఇహ=ఈలోకమందు, మానుషః=మనుష్యుఁడు, భూలాభ-లోభాత్ = భూమిని లభించుటయందలి-పేరాశవలన, కంకం=ఏ మేమి? వేషం=వేషమును, నధత్తే=ధరింపఁడు?

తా. రాగద్వేషాది హేయగుణరహితుఁ డయ్యును; విష్ణువు భూలాభమందలి లోభగుణముచేత ఇట్లు వరాహము కాఁగా; ఈలోకములో మనుష్యుఁడైనవాఁడు ఇట్లు భూమిని గోరి యేమేమినీచకృత్యములు చేయఁడు?

తే. ఆయితను హేయతను బాయునట్టిఁడైనఁ
గష్ట! మచ్యుతుడే క్షితిఁ గాంక్ష చేసి
యివ్వరాహంబె యైనఁ దా నెవ్వఁడేని
లాభలోభానఁ జెపుమ? యేలాగు కాఁడు?

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ అనభిజ్ఞో భవాన్ భగవ దవతార రహస్యస్య॥ 607

వ. నీవు భగవదవతారమున రహస్యము నెఱుఁగనివాఁడవు.

క్రశుణుః? వినుము?

వృ॥ పాఠీనీయం కామఠం కైటభారిః
కైట్యం రూపం యాతు కాంఠీరవం వా

అన్యద్వా యత్సర్వ మప్రాకృతం త
న్నాసౌ తేష్వ ప్యుజ్ఝతి స్వస్వభావమ్॥ 608

అ. కైటభారిః=విష్ణువు, పాఠీనీయం=మత్స్యసంబంధియు, కామఠం = కూర్మసంబంధియు, కైటం=వరాహసంబంధియు, కాంఠీరవం వా=సింహసంబంధియునైన, రూపం=రూపమును, అన్యత్-వా=మఱి యేరూపమునైనను, యాతు=పొందును గాక? యత్=ఎందువలన, సర్వం = సమస్తరూపమును, అప్రాకృతం=ప్రకృతిజన్యము కాదో? తత్=అందువలన, అసౌ=ఈభగవంతుఁడు, తేష్వపి=ఆసకలరూపములందును, స్వ-స్వభావం=తనదైన-మాహాత్మ్యస్వభావమును, నోజ్ఝతి=విడువఁడు.

తా. ఈభగవంతుఁడు మత్స్యకూర్మవరాహ నారసింహాద్యవతారము లెన్నియైన నెత్తును గాని, ఆ యవతారములు ప్రకృతిపరిణామ జనితములు కావు. కాఁబట్టి, అందందు తనమాహాత్మ్యమును విడుచునతఁడు కాఁడు.

తే. కఠినపాఠీనము కఠోరకమఠము మఱి
పటుకిటి యకుంఠకంఠీరవమును మఱివి
రూపరూప మప్రాకృతమై మోపి కాంచి
దానదాననె స్వస్వభావాన మించు.

టి. అకుంఠ=తక్కువకాని, విరూప=విశేషవిధములుగల, దానదాననె = ఆయారూపమునసె, పాఠీనీయం=పాఠీనసంబధి, కామఠం = కమఠసంబంధి, కైటం=కిటిసంబంధి, కాంఠీరవం=కంఠీరవసంబంధి.

ఇ. మత్స్యావతారము—పాఠీనీయం=మత్స్యసంబంధి. ఇది బ్రహ్మ నిద్రించుచుండఁగా, అతనియొద్దనుండి వేదములు దొంగిలించుకొని, సముద్రములో దాఁగుకొనియుండు సోమకాసురుని జంపి, వేదములు దెచ్చుటకై యావిష్ణు వెత్తిన యవతారము.

ఇ. కూర్మావతారము—కామఠం=కూర్మసంబంధి-ఇది రాక్షసులవలన తొందరలేకుండుటకై, దేవతలను జరామరణములు బాధింపకుండ నిత్యసుఖముగ నుండు

టకై యీయుఁబోయెడి దాని కమృతము తఱుచునపుడు పాలసంద్రములో మునిఁగిపోయిన మందరపర్వతము నెత్తుటకై యావిష్ణు వెత్తినయవతారము.

ఇ. వరాహావతారము—ఇది కల్పాంతమున సమస్తము జలమయమై భూమి మునిఁగిపోవఁగ శ్వేతవరాహరూపమై ఆభూమిని తెచ్చుటకై పాతాళమునకు పోయి తనకోఱపంటితో పెల్లగించి యెత్తి, అప్పుడు భూలోకమువారిని బాధించుచు లోకకంటకుఁడైన హిరణ్యాక్షుని సంహరించుటకై యావిష్ణు వెత్తిన యవతారము.

ఇ. నరసింహావతారము—ఇది దితికశ్యపుల పుత్రులు హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, హిరణ్యకశిపుని కుమారుఁడు ప్రహ్లాదుఁడు, ఇతఁ డెప్పుడు నారాయణనామపారాయణుఁడై విష్ణుభక్తుఁడై యుండఁగా, ఆవిష్ణువిరోధియైన హిరణ్యకశిపుఁడు ప్రహ్లాదుని బాధించుచు విష్ణునామమె విడుమనఁగా, ఆ విడువని ప్రహ్లాదుని రక్షించుటకై ఆహిరణ్యకశిపుని శిక్షించుటకై ఆమహావిష్ణు వెత్తిన యవతారము.

ఇ. వామనావతారము—ఇది. ఇంద్రు నోడించి బలిచక్రవర్తి యేలుకొనుచున్న త్రిలోకములను మఱల నాయింద్రుని కిచ్చుటకై వామనరూపమునఁ బోయి మూఁడడుగు లడిగి మూఁడులోకములను కొలుచుకొని, ఆమహాదాతయైన బలిచక్రవర్తిని చిరంజీవిగాఁ జేసి, యీయింద్రునికి ఆమూఁడులోకము లెప్పటి యట్టు లిచ్చి కాపాడుటకై యామహావిష్ణు వెత్తినయవతారము.

ఇ. పరశురామావతారము—ఇది ఇతఁడు రేణుకా జమదగ్నిమహామునులపుత్రుఁడై తనతండ్రియొక్క హోమపశువును చంపినకార్తవీర్యార్జున పుత్రులనుఁ వారితోఁ గూడ సర్వదుష్టరాజులనుఁ గూడ ఇర్వదొక్కమాఱు తిరిగితిరిగి సంహరించుటకై యామహావిష్ణువెత్తిన యవతారము.

శ్రీరామావతారము—ఇది: ఇతఁడు రఘువంశమున కౌసల్యాదశరథులకు పుత్రుఁడై తండ్రివాక్యమున సీతాలక్ష్మణులతో అరణ్యవాసము చేసి వాలిసంహారము చేసి హనుమత్సుగ్రీవాదులతో పోయి రావణాదులను సంహరించి విభీషణాదులను సంరక్షించుటకై ఆమహావిష్ణు వెత్తినయవతారము.

బలరామావతారము—ఇది: ఇతఁడు యదువంశమున ఆదిశేషునియంశము చేత దేవకి వసుదేవులకుఁ బుట్టి రోహిణిచే పెంచఁబడినవాఁడై రేవతికి పెనిమిటియై తాటిధ్వజమును నాఁగేటి ఆయుధమును, నీలాంబరమును గలిగి, పీతాంబరము గల తనతమ్ముఁడైన శ్రీకృష్ణునితోఁ గూడి దుష్టశిక్షణశిష్టరక్షణములకై యామహావిష్ణు వెత్తినయవతారము.

ఇ. బౌద్ధావతారము—ఇది త్రిపురాసురులు తమపురములో తా మనాచారు లయ్యును, అందలివైదికులనందఱను వేదవిరుద్ధాచారులనుగాఁ జేయుచు, తమపురమధ్యంబున నుండు అమృతకూపమువలని వాతస్పర్శనమున నే తాము మృతియే లేక సుస్థితి కలిగి యందఱను బధియించుచున్నందున, చింతాక్రాంతుండై విష్ణుమూర్తి గోవుగాఁ బోయి ఆయమృతమునంతయు పానముచేసి, వెనుక తాను బుద్ధుఁడై సన్యాసివలె వచ్చి వారికై బుద్ధమతమును స్థాపించి బౌద్ధులలోఁ జేర్చి వారి దారాదులకు సరోవరస్నాన క్రీడాదులసమయములలో పాతివ్రత్యాదిహితముల బోధించి, వారినందఱి ననురాగ పరిపూర్ణులనుగాఁ జేసి, తా నశ్వత్థవృక్షము నావహించి, అశ్వత్థనారాయణుఁ డని వారిచే పూజింపఁబడుచుండి తాను సహాయుఁడుగానుండి ఆత్రిపురాసురుల నారుద్రునిచే సంహరింపఁజేసిన యామహావిష్ణువునవతారము.

ఇ. కల్క్యవతారము—ఇది కలియుగాంతమందు ఈభూలోకమందలి యధర్మప్రవర్తనులను శిక్షించుటకును ధర్మప్రవర్తనులను రక్షించుటకును అశ్వముఖములో ఆమహావిష్ణు వెత్తఁబోయెడి యవతారము.

కించ. మఱియు. —

వృ॥ కోలం భువి కోఽలం జగదాలంబ మవైతుం
స్వామీ శుభకామీ కిల? భూమీ మసురాత్తామ్
వారాశిగభీరాంభసి కారాభవనేఽభి
న్యస్తామివ యస్తామివ ముస్తా ముదహార్షీత్॥  609

అ. జగ... [partially obscured by watermark] ...వరాహ

స్వామిని, అన్వైతుం=తెలిసికొనుటకు, కః=ఎవఁడు, అలం=సమర్థుఁడు? యః=ఎతఁడు, అసుర-ఆత్తాం=రాక్షసుఁడైన ఆహిరణ్యాక్షునిచేత-కొనిపోఁబడినదై, వారాశి-గభీర-అంభసి=సముద్రముయొక్క-గంభీరమైన-నీట, కారాభవనే = కారాగృహమందు, అభిన్యస్తామివ = ఉంచఁబడిన దానినివలె, తాం = ఆ, భూమిం=భూమిని, ముస్తామివ=తుంగముస్తగడ్డనువలె, ఉదహార్షీత్ = పైకెత్తెనో? సః=ఆ, స్వామీ=ఆదివరాహస్వామి, శుభకామీకిల=మనకు శుభము కోరునతఁడు కదా?

తా. ఆయాదివరాహస్వామి ఈ జగత్తున కాధారభూతుఁ డని తెలిసికొను వాఁ డెవఁడు? హిరణ్యాక్షుఁ డీభూమినెత్తుకొని మహాగంభీరమైన సముద్రములో కారాగృహములోవలె దాఁచఁగా; ఈస్వామియే కదా ఆదివరాహమూర్తియై పోయి తనకు ప్రియతరాహారమైన తుంగముస్తగడ్డనువలె ఈభూమి నెత్తుకొనివచ్చి మనకు క్షేమము కలుగఁజేసినయతఁ డాయెను.

తే. స్వామి శుభకామి యలభూమి కే సంగ్రహించి
యసుర వారాశికారాగృ హాన నునుపఁ
దుంగము స్తను నె త్తినకై భంగి నె త్తి
వరవరాహావతారాన కే వఱలె నపుర !

టి. అసుర=ఆహిరణ్యాక్షరాక్షసుఁడు, వారాశి కారాగృహాన్ = సముద్రమనెడు గిడ్డంగిలోన, ఉనుపన్=ఉంచఁగా, ఎత్తన్=ఎత్తుటకై.

గ॥ సభక్తిప్రకర్షం యజ్ఞవరాహమభిధ్యాయన్ తమామంత్ర్య॥

వ. అతిభక్తిసహితంబుగ నాయజ్ఞవరాహు నభిధ్యానించుచు నతనిన యామంత్రించి.

వృ॥ దాష్ఠిఘిష్ఠం కుహనావరాహ భగవన్! దంష్ట్రాత్మకం తేదృఢం
స్తంభం సంప్రతిచింతయామి జలధిస్నేహౌఘ సంపూరితా
యస్మిన్ విందతి దీపభాజనవిధా మామోదినీ మేదినీ
చిత్రస్సత్రచ రత్నసానురయతే నిష్కంపదీపాకృతిమ్॥611

అ. కుహనా-వరాహ=మాయచే-వరాహరూపముగల, హేభగవన్=ఓస్వామీ! యస్మిన్=ఏదీప స్తంభమందు, జలధి-స్నేహ-ఓఘ-సంపూరితా=సముద్రమనెడు-నూనెయొక్క-వెల్లువచేత-నింపఁబడినదై, ఆమోదినీ=సంతోషపడునదైన, మేదినీ=భూమి, దీపభాజన-విధాం = దీపపాత్రముయొక్క-రీతిని, విందతి = పొందుచున్నదో? తత్ర=ఆపాత్రమందు, చిత్రః=వింతయైన, రత్నసానుశ్చ=మేరుపర్వతమును, నిష్కంప-దీప-ఆకృతిం = కదలనట్టి-దీపముయొక్క-రూపమును, అయతే=పొందుచున్నదో, తం=అట్టి, తే=మీయొక్క, ద్రాఘిష్ఠం=అతిదీర్ఘమైన, దృఢం స్తంభం=గట్టి దీప స్తంభమును, సంప్రతి = ఇప్పుడు, చింతయామి=ధ్యానించుచున్నాను.

తా. ఓ మాయావరాహస్వామీ! ఈసముద్రమంతయు చమురుగాను, ఈ భూమియంతయు ప్రమిదెగాను, ఆ మేరువనెడి రత్నసానుపర్వతము దీపముగాను వెలుఁగుచుండెడి మీదీర్ఘదంష్ట్రి అనుదీప స్తంభమునే నే నిప్పుడును ధ్యానించుకొను చున్నవాఁడను.

ఉ. ఆదివరాహ ! నీదుకుహనాకృతి నాదృతి నెంతు, వింత యా
నీదృఢదంష్ట్ర స్తంభమున నీరధిస్నేహము నించి మించు నీ
మేదిని దీపపుంబ్రమిద మేరువె నిశ్చలదీప మాయె దా
మోదర! సాదరాత్మ! కమలోదరసోదరరోచిలోచనా!

టి. దామోదర=పలుపుదారము కడుపునఁగలవాఁడా! సాదరాత్మ=ఆదరముతోఁ గూడినహృదయము కలవాఁడా ! కమల-ఉదర-సోదర-రోచి-లోచనా=తామర-నడిభాగమునకు-సహోదరములైన- సమానములైన-కాంతులతోఁ గూడిన-కన్నులు కలవాఁడా!

## కావేరీవర్ణనము.

---

గ॥ ఇత్యన్యత్రాభిక్రామన్ మందానిలస్పర్శసుఖ మభినీయ సానందమ్॥ 612

వ. అని యన్యత్ర యతిక్రమించుచు మందమారుతసుఖస్పర్శ
మభినయించి యభినందించినమనస్సుతో.

వృ॥ కల్హారోత్పలతల్లజోల్లలనకృ త్కల్లోలనిర్లోలన
క్రీడాపాటవగాఢరూఢహిమతా సౌరభ్యవిభ్రాజితః
కావేరీసలిలావగాహరసికః కస్యైష నేడ్యో మరుత్
క్లాంతానాం పునరధ్వనీన వపుషాం యన్నిర్ధునీతే శ్రమమ్॥

అ. కల్హార-ఉత్పల-తల్లజ-ఉల్లలనకృత్ - కల్లోల - నిర్లోలనక్రీడా-పాటవ-గాఢరూఢ-హిమతా - సౌరభ్య - విభ్రాజితః = శ్రేష్ఠములైన-తెల్లనల్లకలువలను-ఎగురఁగొట్టునదియైన - గొప్పయలలను - ఎగురఁగొట్టుట యనెడు ఆటయందు-సామర్థ్యము చేత-మిక్కిలి యెక్కిన-చల్లఁదనము చేతను-పరిమళముచేతను-ప్రకాశించునదియై, కావేరీసలిల-అవగాహరసికః=కావేరీనదీ జలములో-మునుఁగుటయందు అనురాగముగలదియైన, ఏషః=ఈ, మరుత్ =గాలి, యత్ = ఎందువలన, పునః=మఱల, క్లాంతానాం=బడలికపడినట్టి, అధ్వనీనవపుషాం= బాటసారుల శరీరములకు, శ్రమం=కష్టమును, నిర్ధునీతే=బొత్తిగా పోఁగొట్టుచున్నదో? తత్ =అందువలన, కస్య=ఎవనికి, నఈడ్యః=పొగడఁదగినదికాదు.

తా. కావేరీజలములో మునుఁగుచు లేచుచు, ఇందలి కలువలను కమలములను ఊఁగఁజేయుచుండు పెద్దయలలను ఊఁపించుటే యాటగాఁ గలిగి, అందలి చల్లఁదనముతోను వాసనలోనుగూడి, బాటసారులు బడలికపడు కష్టములు పోఁగొట్టుచుండునట్టి యిందలి గాలి యందఱకును పొగడఁదగినదియే.

తే. కమలకల్హారకలహంసకవిమలకమల
కలితకల్లోలనిర్లోలకదలనసరస
పూతశీతలసురభిలకవాతపోత
కము కవేరకన్యారసికకము శ్రమంబుఁ
జనఁగఁ జేయును గదె? పాంథకజనుల కెపుడు.

వ. కావేరీఝరి నిరీక్షించి శిరఃకంపంబు కావించి.

వృ॥ హంత! రంగపురసంగత మత్రా
హం తరంగచలపంకజసంఘమ్
సహ్యజాఽఽయతఝరం బహుమన్యే
స హ్యజాఽయత తమ శ్శమనార్థమ్॥ 615

అ. అత్ర = ఇక్కడ, రంగపుర-సంగతం = శ్రీరంగముతో-కూడినదియు, తరంగ-చల - పంకజసంఘం = అలలయందు-చలించెడి - తామరలసమూహము కలదియునైన, సహ్యజాఽఽ-ఆయత - ఝరం = సహ్యకన్యకయైన కావేరియొక్క - వెడల్పైన-ప్రవాహమును, బహుమన్యే = బహుమానపఱచుచున్నాను. సః=ఆప్రవాహము, తమః-శమనార్థం = అజ్ఞానమును - నశింపఁజేయుటకై అజాయత హి=పుట్టినదికదా? హంత=ఆశ్చర్యము!

తా. ఈకావేరీప్రవాహము ఆశ్రీరంగముతోఁ జేరి, తామరలు గలిగి, అజ్ఞానాంధకారమును పోఁగొట్టుచున్నది కాఁబట్టి, దీని బహుగా సన్మానించుచున్నవాఁడను.

తే. రంగపురసంగ సుతరంగరంగదబ్జ
సంఘ సహ్యజ సకల మహాసహ్యతమను
శమము కావింప నావిర్భావము నొనర్చెఁ
గాన నే దీని సన్మానకర్మ మొనర్తు.

గ॥ ఏపాకిల దోషాకుల మనుజకులసకలకలుషశోషణబద్ధకంకణా, నిజతటనిబిడతమ వకులధవలకులతిలకామలకా విరలసరల కుంద చందన మందార సహకార కేసర సరస బదర కదంబ కదంబక గంభీరజంబీర జంబూసంపూర్ణపర్ణ కుసుమపలాశ సమృద్ధకపిత్థలోధ్ర నీరంధ్ర శిలీంధ్రపాటలపటలజటిలక్రముక ప్రముఖ వి[illegible]

మ శమకర మకరందరస సుగ్రసనతాత్పర్య పర్యటదదభ్ర విభ్రమమాలంబ రోలంబనికురంబకరంబితతయా కళిందనందనీ ప్రతిచ్ఛందతా మనువిందంతీ, నిశాకలిత విశాలసురతదశానుభవశ్రమశాలిక్షితీశ నిశాంతకృశాంగీజనమజ్జనవేలా దోలాయిత పృథులహార ప్రత్యుప్తముక్తాఫల రుచినిచయపరిచయ రచితయా శుచితయా పీతాంబరపదాంబురుహసంభవ సరిదంబుడంబరం విడంబయంతీ, సంతత మంతర్గతచిరంతనపురుషతల్పీభవ దనంతఫణామణిశ్రేణీశోణీభూతతయా సారస్వతీ మనుకుర్వంతీ, పార్శ్వద్వయ్యామపి నైయమికకర్మానుష్ఠాన శ్రద్ధాబద్ధాసన శుద్ధావనీసురారబ్ధానవద్య బ్రహ్మయజ్ఞసమయసమధిగత మంత్రబ్రాహ్మణామ్రేడనపూర్వకమజస్రం సహస్రపత్రమధ్యమధ్యాసీనానాం శ్రీరంగరాజనాభిసరోజవిరాజమాన నిఖిలనిగమపఠనముఖర చతుర్ముఖవైఖరీం వ్యాచక్షుమాణానాం మదకలమరాలయూనాం వరటాపరిరంభచుంబనముఖానంగసంగరప్రక్షోభవిస్మృత్వరై రభి రామతామరసపరాగై రభినవచందనరసమసృణశరీరేవ సలీలమాకంఠనిమగ్నమూర్తీనాం సుగాత్రీణాం వదనైరదసీయే పయసి వైహాయసాధ్వనా సమాగతశ్చంద్రమా స్సన్నిహితశ్రీరంగధామా స్వసమాననామా విధు ర్వ్యచితానేకావతార ఇతీర్ష్యాయా స్వయమపి బహూని రూపాణి విదధానో విరాజత ఇతి భ్రాంతా వనురాగమాంద్యసంపాదికాయా మితరేతరదృఢాశ్లేషవిశేషోన్మిషత్తోషాభిః కోకదంపతీపరంపరాభి ర్నిరాకృతాయామమ కుంఠోత్కంఠేవ యువలోకేన నిర్నిమేష మవలోక [illegible] వేరాత్మజేతి

ప్రసిద్ధిం సార్థయంతీ, శాంతనవాస్పదతయా గాంగేయతరం గిణీతిసంజ్ఞా మన్వర్థయంతీ, సమ్మజ్జనదురితహరాపి నమజ్జన దురితహరా, నిరాకృతపథికశ్రాంతి స్స్రవంతీ చక్షుషోరమం దంకలయత్వానందమ్॥ 616

అ. దోషా...కంకణా = అశుభదోషములచేత-కలఁతపడుచున్న - మను ష్యసమూహముయొక్క - సమస్తపాపములను - నశింపఁ జేయుటయందు - కట్టఁబడిన - హస్తసూత్రము కలదియు; నిజతట...కరంభితతయా = తన గట్టులందు - చిక్కలిచెట్టములైన - పొగడ - తెల్లనితక్కోలము - నూవు - ఈసిరిక-దట్టమైనదేవదారు - మొల్ల - గంధము-బాడిదె - మామిడి - పొన్న- రసవంతమైన పోఁగు - కడిమిసమూహము - గొప్పనిమ్మ - నిండినఆకులతో పూ వులతోఁగూడిన-మోదుగు - నిండిన వెలఁగ - బొద్దు - దట్టమైన తెగడ - కలి గొట్టులసమూహము - జడలుపాతినపోఁక - మొనలైన - చెట్లయొక్క - పూ లగుత్తుల సమూహముచేత - పైకిఁబాఱుచు - గొప్పకష్టములను-శమింపఁజేయు నట్టి- తేనెను-పానము చేయుటయందు - ఇష్టముతో - ఎగురుచున్న-విస్తారప్రే మకు- ఆస్పదమైన- తుమ్మెదల సమూహమువలన వ్యాపించుటచేత, కళిందనం దినీ-ప్రతిచ్ఛందతాం=యమునానదితోడి, సామ్యమును, అనువిందంతీ=పొం దుచున్నదియు; నిశా...రచితయా= రాత్రిలో- కూడుకొన్న- విశేషసురతక్రీ డామభవములందలి-శ్రమలతో ఒప్పుచుండెడి-రాజుల-అంతఃపుర స్త్రీసమూహ ముతోడి. స్నానవేళలయందు-వ్రేలుచున్న - గొప్పముత్యాలహారములలో చేరి యున్న- ముత్యముల- కాంతిసమూహముయొక్క - కూడికచేత - చేయఁబడి నట్టి, శుచితయా=తెల్లఁదనముచేత, పీతాం...డంబరం=విష్ణువుయొక్క-పాద పద్మమందు- జన్మముగల- గంగానదియొక్క- జలాతిశయమును, విడంబయంతీ =విలాసపఱచుచున్నదియు; సంతతం = సర్వదా, అంతర్గత...భూతతయా= లోపలనున్న- అపుదిరుఘుఁడైన శ్రీరంగనాయకులకు- శయ్యఅగుచున్న - ఆది శేషునియొక్క- పడిగలయందలి- రత్నములపంక్తులవలన- ఎఱ్ఱనిదియగుటచేత, సరస్వతీం = సరస్వతీనదిని, అనుకుర్వంతీ=అనుసరించుచున్నదియు; పార్శ్వ

ద్వయ్యామపి= ఉభయపార్శ్వములందును, నైయమిక...పూర్వకం = నియతకర్మలను-అనుష్ఠించుటయందలి- శ్రద్ధచేత- దృఢపఱుపఁబడిన- పీఠములయందు- పరిశుద్ధులైన- బ్రాహ్మణులచేత- ప్రారంభింపఁబడినవియై- నిర్దోషములైన-బ్రహ్మయజ్ఞములయొక్క- కాలమునందు- పొందఁబడిన- మంత్రములతో-బ్రాహ్మణులపిలుపు- మొదలుగా, అజస్రం=ఎల్లప్పుడు, సహస్రపత్రమధ్యం=తామరనడుమ, అధ్యాసీనానాం = అధివసించియున్నవై, శ్రీరంగ...వైఖరీం = శ్రీరంగనాయకియొక్క- పొక్కిటితామరయందు- ప్రకాశించుచు- సకలవేదపాఠములయందు- మోఁగుచున్న - బ్రహ్మయొక్క- రీతిని, వ్యాచక్షమాణానాం = పలుకుచున్నవైన, మదకల- మరాలయూనాం = మత్తుగల-యౌవనహంసలయొక్క, నరటా...విసృత్వరైః= ఆడుహంసలయొక్క- ఆలింగనముచేయుట- ముద్దుపెట్టుట—మొదలుగాఁగల - మన్మథయుద్ధములయొక్క - విజృంభణమందు - జాఱిపడిన, అభిరామ - తామరసపరాగైః = సొగసైన-తామరపుప్పొడులచేత, అభినవ-చందనరస-మసృణ - శరీరేవ = క్రొత్తదైన - చందనరసముచేత- పూఁకొనఁబడిన- దేహముకలదివలె, సలీలం=విలాసముతో, ఆకంఠ- నిమగ్న- మూర్తీనాం = కంఠముదాఁక - మునిఁగిన- శరీరముగల, సుగాత్రీణాం = సుందరస్త్రీలయొక్క, వదనైః=ముఖములతో, అదసీయే = సమీపమైన, పయసి= నీటిలో, వైహాయస- అధ్వనా = ఆకాశసంబంధమైన-మార్గముతో, సమాగతః = వచ్చినట్టి, చంద్రమాః = చంద్రుఁడు, సన్నిహిత-శ్రీరంగధామా=సమీపించినట్టి-శ్రీరంగస్థానముగలవాఁడును, స్వసమాననామా=తనకుసమమైనపేరు కలవాఁడునైన, విధుః=(విష్ణువు) అనెడి చంద్రుఁడు, విరచితానేకావతార ఇతి=చేయఁబడిన అనేకావతారములు కలవాఁడుఅని, ఈర్ష్యయా = ఓర్వమిచేత, స్వయంఅపి = తానుకూడ, బహూని = అనేకములైన, రూపాణి = రూపములను, విదధానః = చేయువాఁడై, విరాజతేఇతి= ప్రకాశించుచున్నాఁడని, అనురాగమాంద్య - సంపాదికాయాం= ప్రేమకొఱఁతను - కలుగఁజేయునట్టి, భ్రాంతా = భ్రమ, ఇతరేతర...తోషాభిః = ఒకటితోనొకటి...

కలవియైన, కోకదంపతీపరంపరాభిః=ఆఁడుమగజక్కవలయొక్క సమూహము లచేత, నిరాకృతాయాంసత్యాం = నిరాకరింపఁబడినది యగుచుండఁగా, అ నంత- ఉత్కంఠేన = కొఱవడని - పేరాశగలదియై, నిర్నిమేషం = నిమిష మైనలేకుండ, అవలోకమానేన = చూడఁబడుచున్న, యువలోకేన = యౌవ నజనముచేత, అలంకృతా = అలంకరింపఁబడినదియై, సారస్వత ఆభిముఖ్యేన= సరస్వతీసంబంధియైన విద్యాజాలమునకుఁగాని— సముద్రసంబంధమునకుఁగాని - అభిముఖముగానుండుట కలుగుటచేత, కవేరాత్మజేతి = కవికిఁగాని— కవేరరా జునకుఁగాని- కూఁతురు అని, ప్రసిద్ధిం=ప్రఖ్యాతిని, సార్థయంతీ=సఫలపఱచు చున్నదియు; శాంతనవ- ఆస్పదతయా = శంతనురాజపుత్రుఁడైన భీష్మునికిని— శాంతిసంపన్నులైన యోగులయొక్క స్తోత్రములకును-ఆధారమగుటచేత, గాం గేయ - తరంగిణీతి = గంగాపుత్రుఁడైనభీష్మునకు తల్లి— గంగాసంబంధియైన బంగారమునకు పుట్టిల్లైననది అని,సంజ్ఞాం= పేరిని,అన్వర్థయంతీ= సార్థపఱచు చున్నదియు; సమజ్జన - దురితహరా ఽపి=స్నానసహితులైనవారికి-పాపనా శనియైనను - సమజ్జనదురితహరా = (స్నానముచేత దురితహార కాదు అని విరుద్ధముకాకుండ) నమస్కరించు జనులకు దురితహరయగునదియు ; నిరా కృతపథికశ్రాంతిః = తొలఁగఁద్రోయఁబడిన బాటసారుల శ్రమములు గల దియునైన, ఏషా=ఈ, స్రవంతీ=కావేరీనది,చక్షుషోః=కన్నులకు, అమందం= విశేషమైన, ఆనందం=సంతోషమును, కలయతి=కూర్చుచున్నది.

తా. ఈ కావేరీనది దోషులను నిర్దోషులనుగాఁ జేయుటకై కంకణముకట్టు కొని, ఒక్కొక్కపుడు తన గట్టులలోని యెన్నోవిధముల చెట్టుల పూలలోని తేనియల నానియానియానందించుతుమ్మెదలు క్రమ్ముకొనుటచే దానిదాని నీల వర్ణముచే తానును నీలవర్ణయై నీలవర్ణకాంతికలిగి యుండు యమునానదితోను, అంతఃపురస్త్రీలు స్నానము సేయునపుడు వారి మెడలలో వ్రేలాడు ముత్యాల దండల ధవళకాంతులచే తానును ధవళకాంతికలదియై ధవళకాంతి గలిగి యుండు గంగానదితోను, తననడుమ శ్రీరంగశాయి శయనించు శయ్యయైన యాదిశేషుని సహస్రఫణములలోని మణిగణముల యరుణకాంతులచే తానును

అరుణకాంతికలదిగాయె యరుణకాంతి కలిగియుండు సరస్వతీనదితోను, సమానరాయె; తన యుభయపార్శ్వములందును నియతకర్మ లనుష్ఠించు బ్రాహ్మణులు తాము చేయు బ్రహ్మయజ్ఞాదులందలి మంత్రపఠనములు చేకొని తామును పలుకుచు తామరలలో నివసించుచు ఆశ్రీరంగరాజుల నాభితామరలలో నివసించి వేదపాఠమునను౦డు నాబ్రహ్మను బోలియుండు హంసలచే నూపఁబడెడుతామరపుష్పాదులను గంధపొడిగా తాను పూసికొనినట్లును,అందు స్నానముచేయు స్త్రీలమొగము లెన్నియో అన్నియువలె ఆజలమున ఆకాశమున సంచరించు చంద్రుఁ డనేకచంద్రులు కనఁబడునట్లును, అవి తమ సంయోగవిరుద్ధులు చంద్రులు కావని చక్రవాకదంపతులచేఁ దెలిసికొనినట్లును, కనఁబడుచు, తన్నుశాంతనవ గాంగేయ అని తోఁచునట్లును జేసికొనుచును; కవేరాత్మజ అనుపేరు ప్రసిద్ధితోను సకలపథికజనశ్రమల నివారించుచు, స్నానముచేయువారి సకల దోషములనుఁ బోఁగొట్టునది యని పేరుపొందియు, పోఁగొట్టునది యని విరోధముగా తోఁచియైనను; తన్ను నమస్కరించిన యెడల నందఱిని నన్నిదోషములచే నివర్తింపఁజేయునది యై సకలజనులకనులకు నానందమునే కలుగఁ జేయుచున్నయది.

ఇ. గాంగేయుఁడు = భీష్ముఁడు—ఇతఁడు - బ్రహ్మపుత్రుఁ డగుమనువునకు పుత్రుఁడైనప్రజాపతివలన ధూమ్రాదిసప్తభార్యలకు పుట్టినయష్టవసువులో ప్రభాసవలనఁ బుట్టినవాఁడు ప్రభాసుఁడు. తర్వాత ఈయష్టవసువులును ఆబ్రహ్మమానసపుత్రుఁడైన వసిష్ఠమహర్షి యొక్క హోమధేనువు నపహరించుకొనిపోయి ఆవసిష్ఠశాపముచేత ఈభూలోకమున మనుష్యస్త్రీయై శంతనునకు భార్యయైయున్న గంగాదేవికి పుత్రులైరి. వారిలో ప్రభాసుఁడు తక్కిన యేడ్గురినాల్గు నాల్గంశములనుగొని భీష్ముఁడను పేరితో మహాశూరుఁడును మహాధర్మవేత్తయును ధనుర్విద్యానిపుణుఁడునై ప్రబలి తనతండ్రియైన శంతనునకు సత్యవతిని వివాహము చేయించుకొనుటకై తాను బ్రహ్మచర్యవ్రతము నాచరించుచు తన తండ్రి సంతోషించి నీకిచ్చవచ్చినపుడెగాని మఱొక్కప్పుడు నీకు మరణము కల్గదు అని యిచ్చినవరము తీసికొని, భారతయుద్ధములో కౌరవులకు సేనాధి

పతి యై పదిదినాలయుద్ధములో అర్జునునిచేత పడఁగొట్టఁబడియుఁ గూడ ఉత్తరాయణము వచ్చునంతవఱకు శరతల్పమున నె శయనించి యున్నయతఁడు.

మంజరులు. ఇది కదా? కలుషదుర్విధకులకలిత

కలుషశోషణబద్ధకంకణ యగుట, 1
నిజతటనిబిడోరునింబజంబీర
వకుళావిరళతాళవరనారికేళ 2
సహకారకేసరసక్రమక్రముక
పిచుమందమందారపిచ్ఛిలప్రముఖ 3
తరుపుంజమంజరీచరదురుశ్రాంతి
శాంతికృన్మధురసాస్వాదసంరంభ 4
రోలంబనికురుంబనీలాంబరములఁ
గాళిందిపోలెం బ్రకాశించు, మఱియు 5
సురతపరిశ్రమభరితశరీర
రాజరాజాననారచితావగాహ 6
సమయపరస్పరసంలుఠత్కఠిన
కుచతటస్ఫుటితసంకులహారగళిత 7
ముక్తాఫలపరాగములఁ గలయుచును
గంగాతరంగిణిగతి మించు, మఱియుఁ 8
తనమధ్యమునఁ జిరంతనపూరుషునకుఁ
బర్యంకతల మైనఫణిఫణామణుల 9
శోణరూపము నయి శోభాయమాన
మై సరస్వతిభాతి భాసిల్లు, మఱియుఁ 10
దీరద్వయిని శ్రుతిస్థితకర్మకరణ
బద్ధాదరణశుద్ధబహుధరాసురుల 11

యధ్వరసమయస మధిగతమంత్ర
మనువచించుచు నబ్జ మధివసించుచును 12
రంగనాథునినాభి రాజీవమునను
రాజిలుచును బ్రహ్మ ప్రాఁజదువులను 13
బఱియించుటను దెల్పు పగిదిని బొల్చు
మదమరాళములు తా మెదమరాళులను 14
సంభ్రమమునఁ జేర్చు సంరంభమునను
సంక్షిప్తతామర సపరాగముఁను 15
అభినవచందన మలఁదు చందమునఁ
బస లూన మేన నిం పెసలారు మఱియు 16
నందంద మునిఁగెడు నరవిందముఖుల
ముఖముల సర్వతో ముఖములఁ గాంచి 17
విధుఁడు తా వినువీథి విశిచి యేతెంచి
రంగధాముఁడు దన రంగ స్వనాముఁ 18
డవతారము లనేక మందె నం చీర్ష్యఁ
దానును బహురూప ధరుఁ డయ్యె ననుచు 19
భ్రమియింపఁ గోకదం పతులు వారింప
యువనివహంబులు నుత్కంఠఁ గాంచ 20
సారస్వతాభిము ఖ్యారంభకలన
కని "కవేరాత్మజ" యని సార్థ యగును 21
మఱియు శాంతనవస మ్మదయుక్త యగును
గాంచ గాంగేయాప గాసార్థసంజ్ఞ, 22
మఱియు మజ్జనదోష మఱవఱ ల్చేయ
మఱి నమజ్జనదోష మఱవఱ ల్చేయు, 23

మఱిమఱి పథికశ్రమము తీర్చి పేర్చ
మఱిమఱి కనుపండు వఱ లేక గూర్చు. 24

టి. విధుఁడు=చంద్రుఁడు - విష్ణువు, సారస్వత=సరస్వత్ (సాగర) సంబంధి-సరస్వతీసంబంధియునైన, కవేరాత్మజ = కవేర ఆత్మజ—కవేః ఆత్మజ, గాంగేయఆపగ=స్వర్ణనది—భీష్మజననీనది, శాంతనవసమ్మద=శాంతిసంపన్నుల స్తోత్రమందలి సంతోషముతో—శంతనుపుత్రునందలి సంతోషముతో.

వృ॥ ప్రహసతి భవశోషకరీ
భవేన పరితోషితా సువర్ణనదీ
దుర్వర్ణరుచిః ఫేనై
స్సహ్యాసుతా జాహ్నవీ మసహ్యాసుతామ్॥ 617

అ. భవ-శోషకరీ = సంసారదుఃఖమును - నశింపఁజేయునదియు, సువర్ణనదీ = సత్కులముకలదియు (బంగారము కలదియు) నైననదియునై, సహ్యాసుతా=సహ్యగిరికన్యక యగు నీకావేరి, యా=ఏది, భవేన = సంసారము చేత (శివునిచేతను), పరితోషితా = సంతోషపఱుపఁబడినదియో, దుర్వర్ణరుచిః= దుష్కులమందు ఆసక్తి కలదియు—వెండికాంతివంటి కాంతి కలదియునో; తాం=అట్టి, అసహ్యాసుతాం = సహింపఁగూడనివానియొక్క (అకారవాచ్యుఁడైన విష్ణువుయొక్క సహించుకొనఁగూడిన) పుత్రికయైన, జాహ్నవీం=గంగానదిని, ఫేనైః=నుఱుఁగులతో, ప్రహసతి=నవ్వుచున్నది.

తా. ఈకావేరి తాను సంసారమందలి దోషమును బోఁగొట్టునదియై, సత్కులములో బంగారముకూడఁ గలిగియుండి, సంసారమును జేరఁబెట్టునదియై, దుష్కులములో వెండి యనెడినుఱుగుమాత్రమే కలిగియుండిన గంగానదిని పరిహాసము చేయుచున్నది.

క. భవశోషకి యగు తానది
భవతోషకి యని, సువర్ణవాహిని యగుతా

భువి నది దుర్వర్ణక యని
సవురగు సహ్యాజ యనహ్యాకిజ నగు నుఱుఁగుననే.

టి. తాను=కావేరి, అది=అగంగ, దుర్వర్ణక=వెండివలె తెల్లనినీరు కలది-దుష్కులముకలది, సహ్యాజ=సహ్యాపర్వతపుత్రి, అసహ్యాజకా=అకారవాచ్యుఁడైన విష్ణునిమనోజ్ఞపుత్రిని గంగను.

పున స్సశ్లాఘమ్.—మఱల శ్లాఘించుచు.—

వృ॥ స్వర్ణవంతం విదుఃకాంతం
రామాం హేమాపగా మిమామ్
దాంపత్య మనయో రేత
దనురూపం విశోభ తే॥ 618

అ. ఇమం=ఈ, కాంతం=పెనిమిటిని, స్వర్ణవంతం = సువర్ణవంతుఁడైన—తం-సు - అర్ణవం = అమంచిసముద్రమునుగాను; ఇమాం=ఈ, రామాం=స్త్రీని, హేమ అపగాం = బంగారునదియైన కావేరినిగాను, విదుః=తెలిసికొందురు. అనయోః=వీరియొక్క, ఏతత్=ఈ, దాంపత్యం=దంపతులతనము, అనురూపం=తగినదియై, శోభతే=ప్రకాశించుచున్నది.

తా. బంగారుమయము లైన యీ కావేరీసముద్రముల దాంపత్యము పరస్పరము తగినదియే.

క. పతియుఁగా స్స్వర్ణవుఁ డవుటయు
సతియుఁగా స్వర్ణాపగ యగుకి సవురు స్మరింపఁగా
క్షితి నతులితగతి నీదం
పతుల దె దాంపత్య మంద్రు కి పరమార్థవిదుల్.

టి. స్వర్ణవుఁడు=మంచిసముద్రుఁడు—స్వర్ణవహుఁడు, సవురు=అందము.

కృశానుః-సాక్షేపమ్.—కృశానుఁ డాక్షేపించి.—

వృ॥ పరిశోభితాశ్రమపార్శ్వ
మధ్యమతోరంగరాజతస్ఫురితా

కథమివ దధాతి కీర్తిం
కావేరీ కనకనిమ్నగేత్యేషా॥ 619

అ. పరిశోభి-తామ్ర - పార్శ్వా = అంతట ప్రకాశించునట్టి - తామ్రవల్లి చెట్లు-పార్శ్వభాగములందుఁ గలదియు, (పరిశోభిత-ఆమ్రపార్శ్వా=అధికముగ ప్రకాశించునట్టి-మామిడిచెట్లు ప్రక్కలఁగలదియు), మధ్యమతః=మధ్యభాగమందు, రంగరాజతస్ఫురితా=వంగలోహముచేతను వెండిముద్దలచేతను—(శ్రీరంగరాజుల చేతను) ప్రకాశించునదియునైన, కావేరీ=ఈకావేరి, కనకనిమ్నగా-ఇతి=బంగారుటేఱు అని, కీర్తిం=ప్రఖ్యాతిని, కథమివ = ఏలాగువలె, దధాతి=ధరించుచున్నయది.

తా. ఈకావేరి చుట్టుప్రక్కల తామ్రవల్లిచెట్లును మామిడిచెట్లును గలిగి, నడుమ వంగలోహరజతములను రంగనాథునిన్ వహించియు, బంగారుటే అను కీర్తి నెట్లు వహించుచున్నదో?

ఆ. శోభితామ్రములకు సుస్థిరస్థలతటుల్
రంగరాజతకు విరాజితాంత
రములు నమరి కర్బురపుటే అటం చెటుల్
సారకీర్తిఁ గనుఁ గవేరకన్య.

టి. రంగరాజతకువిరాజితాంతరములున్ = రంగరాజత్వమునకు—రంగమునకును రాజతమునకును కుత్సితముగ విరాజితములైన అంతరస్థలములును, కర్బురపుటే అటంచు=బంగారుటే అని.

విశ్వావసుః. —-విశ్వావసువు.—

గ॥ ఆపాదదూషణమిదం నిరూప్యమాణాయా అస్యాగుణఏవస్యా
త్పశ్య తావ దేతస్యా రామణీయకమ్॥ 620

వ. అప్పటికి దూషణముగఁ బొల్పడిన యీదూషణము ఈ నిరూపింపఁబడు కావేరీనదికి గుణమే యగును. కనుము దీని రామణీయకమును.

వృ॥పీతాంబరాలంకృతమధ్యభాగా
కల్హారమాలా కమనీయవేణీ
సహ్యాద్రికన్యా జనకస్య గేహాత్
పత్యుస్సమీపం వ్రజతి ప్రసన్నా॥ 621

అ. సహ్యాద్రికన్యా = సహ్యగిరికుమారి యైన కావేరి, పీతాంబర-అలంకృత-మధ్యభాగా = బంగారువస్త్రముచేత—విష్ణువుచేత - అలంకృతమైన-నడిమిచోటును—నడుముభాగమును కలదియు; కల్హారమాలా - కమనీయ - వేణీ = చెందామరసరముచేత - మనోజ్ఞమైన - జడయును—వెల్లువయును గలదియు; ప్రసన్నా=తిలివన్నెను-నిర్మాల్యమును గలదియునై, జనకస్య గేహాత్ =సహ్యగిరి యను తండ్రియింటినుండి, పత్యుః+సమీపం = పెనిమిటియొక్క—సముద్రముయొక్క-సమీపమును, వ్రజతి=చేరుచున్నది.

తా. ఈ కావేరి పీతాంబరమువలె ఆపీతాంబరుని ధరించి, చెందామరసరమువలె పెన్వెల్లువనుఁ వహించి, తిలివన్నెవలె నిర్మలతనుఁ గైకొని తన తల్లిగారియింటినుండి వచ్చి తనపెనిమిటి యైన సముద్రునిదగ్గఱకు చేరుచున్నయది.

తే. మఱి పరీతపీతాంబరకమధ్యభాగ
విమలకమలకల్హారకవేణిభాగ
సహ్యకన్యప్రసన్న యై సరగ నరుగు
గురునికడనుండి జీవితేశ్వరునికడకు.

పున ర్నిరూప్య.—మఱల నిరూపించి.—

వృ॥ఉద్గచ్ఛ దుచ్ఛలమగుచ్ఛ లసచ్ఛిరస్కాః
తీరద్వయేఽపి తరవః ప్రతిభాం త్వముష్యాః
ఏనాం తరీతు మిహ యత్నజుషః స్వశీర్ష
బద్ధావదాతవసనాః పథికా ఇవామీ॥ 622

అ. అముష్యాః=ఈనదియొక్క, తీరద్వయేపి=రెండుగట్లులందును, ఉద్గచ్ఛత్-ఉచ్ఛలత్-గుచ్ఛ-లసత్ - శిరస్కాః=పైకి లేచుచున్న-మిక్కిలి పొడవైన-గుత్తులచేత-ప్రకాశించునట్టి-పైభాగములు కలవియైన, అమీ=ఈ, తరవః=చెట్లు, ఏనాం=ఈకావేరిని, తరీతుం=దాటుటకు, ఇహ=ఇక్కడ, యత్నజుషః=ప్రయత్నముచేయువారై, స్వశీర్ష-బద్ధ- అవదాత-వసనాః=తమ తలలయందు-కట్టబడినట్టి-తెల్లనైన-వస్త్రముకలవారైన, పథికాఇవ=బాటసారులవలె, ప్రతిభాంతి=ప్రకాశించుచున్నయవి.

తా. కావేరీతీరముల వృక్షములు స్వశాఖాగ్రములలో పూచినతెల్లని పూలగుత్తులచేత తలలలో తెల్లనివస్త్రములు తలబట్టలుగ చుట్టుకొన్నబాటసారులవలె నున్నయవి.

క. ఇరుదరులం దలకొమ్మల
విరిసిన విరిగుత్తులొత్తి కవి న్నందె మహా
తరువులు తెరువరు లిన్నది
తరియింప సవస్త్రమస్తకతటులైరి యనన్.

గ॥ కించిదంతర ముపసృత్య అధస్తా దవలోక్య సహర్షమ్॥ 623

వ. కొంతయంతరము సమీపించి క్రిందిటిప్రక్కకును సమీక్షించి సంతోషముతో.

## శ్రీరంగనగరీవర్ణనము.

ఇ. (శ్రీరంగక్షేత్రము—ఇది భూలోకవిరజ యనఁబడు కావేరి కొల్లడ. మలనడుమ శ్రీరాములు అనుగ్రహించి ప్రత్యుపకారార్థ మిచ్చిన విభీషణుని యారాధనవిగ్రహ మైనశేషశయ్యతోడి శ్రీరంగనాథులు సేవసాయించెడు. చంద్రపుష్కరిణీతీరమున సప్తప్రాకారపరివేష్టితమై భూలోకవైకుంఠమని స్వయంవ్యక్తమైన ఆరంగమందిరము గలిగియుండు దివ్యక్షేత్రము.)

వృ॥ సారంగడింభనయనానవకేలియోగ్య

నారంగముఖ్యనగపుష్కలనిష్కుటేయమ్
శ్రీరంగదివ్యనగరీ ప్రథతే నయాబ్ధి
పారంగతై ర్బుధజనైః పరిభూష్యమాణా॥ 624

అ. సారంగడింభనయనా-నవకేలి-యోగ్య-నారంగముఖ్య-నగ-పుష్కల-నిష్కుటాం లేడిపిల్లలకన్నులవంటి కన్నులుకల స్త్రీలయొక్క-క్రొత్తఆటలకు-తగిన-నారింజ-మొదలైన-వృక్షములచేత-సంపూర్ణములైన- ఇంటితోఁటలు కలదియైన, ఇయం=ఈ, శ్రీరంగదివ్యనగరీ=శ్రీరంగ మను దివ్యక్షేత్రము, నయ-అబ్ధి- పారంగతైః=న్యాయశాస్త్రమనెడు - సముద్రమునందు - తుదముట్టినవారైన, బుధజనైః= పండితుల సమూహములచేత, పరిభూష్యమాణా=అలంకరింపఁబడునది యై, ప్రథతే=ప్రకాశించుచున్నది.

తా. ఈశ్రీరంగమనెడి దివ్యక్షేత్రము అందకత్తెలాడుకొనుట కనుకూలములైన పెఱటితోఁటలతోను, తర్కశాస్త్రమును సముద్రమునువలె గట్టెక్కినవారైన పండితజనులతోను ప్రకాశించుచున్నది.

క. సారంగాక్షీకేళీ
నారంగాదికనవీనసనగనిష్కుట మా
శ్రీరంగనగర మాగను
పారంగతపండితజనసపరిభూషిత మాన్.

గ॥ నిపుణం విభావ్యస్య శిరఃకంపమ్॥ 625

వ. నిపుణంబుగ నంకించి శిరంబు పంకించి.

వృ॥హంసా నిష్కుటదీర్ఘికావసతయః ప్రక్రాంతతర్కా అహో!
లీలోద్యానచరః పతంజలిగిరా పుంస్కోకిలః ఖేలతి
ద్వైతాద్వైతకథా యథా విదధతి క్రీడామయూరా ఇహ
సైవ్రరంతాంత్రిక కారికాః పరిపఠంత్యేతా ముహుశ్శారికాః॥

అ. ఇహ=ఈశ్రీరంగమందు, నిష్కుట-దీర్ఘికా-వసతయః= పెరటితోఁటలోని నడబావులె- వాసస్థానములుగాఁగల, హంసాః = హంసలు, ప్రక్రాంత-

తర్కాః=ఆక్రమింపఁబడిన -తర్కశాస్త్రములు కలవి; అహో=ఆశ్చర్యము! లీలా ఉద్యాన-చరః=విలాసముతో - క్రీడావనమందు- చరించునట్టి, పుంస్కోకిలః= మగకోకిల, పతంజలిగిరా = భాష్యవచనములో, ఖేలతి = క్రీడించుచున్నది; క్రీడా- మయూరాః = కేళికైన- నెమళులు, ద్వైతఅద్వైత- కథాః=ద్వైతాద్వైతకథలను, యథా = ఎట్లు, విదధతి=చేయుచున్నవో; తథా=అట్లు, ఏతాః=ఈ, శారికాః=గోర్వంకలు, తాంత్రికకారికాః=భట్టవార్తికములను, స్వైరం=స్వేచ్ఛగా, ముహుః=పలుమాఱును, పరిపఠంతి = చదువుచున్నవి ; అహో=ఆశ్చర్యము !

తా. ఈశ్రీరంగములో ప్రతి పెరటితోఁటలోను హంసలు తర్కశాస్త్రములును, కోకిలలు పాతంజలిభాష్యములును, నెమళులు కర్మకాండజ్ఞానకాండములును, గోర్వంకలు భట్టవార్తికములును తనంతట నే పలుమాఱును పఠించుచున్నయవి. ఆశ్చర్యము !

సీ. పెరటిశెగ్గియలందుఁ ◊ బెను పొందుహంసముల్
తర్కమార్గంబులు ◊ తగ వచించు
నుపవనంబులయందు ◊ నుపవసించుపికంబు
లలభాష్యభాషితంబులు ◊ వచించుఁ
గేలీవిహారము ◊ లెకలనిమయూరముల్
ద్వైతమద్వైతముఁ ◊ బగ వచించు
నూరెల సారికల్ ◊ నుఖరుతంబులఁ దమం
తన తంత్రకారికల్ ◊ విని వచించుఁ

తే. గీరము లగారముల మఱి ◊ యీరములను
నీరములతీరముల మఱి ◊ భూరుహముల
రంగ రంగ యనుచు నె ◊ శ్రీరంగ మెల్లఁ
బలుకు పలుకులఁ జెలరేఁగి ◊ పరిఢవిల్లు.

కించ.—మఱియు.—

వృ॥ ప్రాతః ప్రాతః పయసి విమలే పావనే సహ్యపుత్ర్యాః
స్నాయంస్నాయం సకలవిషయత్యాగినో యోగినోఽమీ
వారంవారం భుజగశయనం లోచనాభ్యాం పిబంతః
క్షేమంక్షేమం క్షణవ దఖిలం కాల మత్ర క్షిపంతి॥ 627

అ. అత్ర=ఇక్కడ, సకలవిషయత్యాగినః = సర్వవిషయములు త్యజించిన వారైన, అమీ=ఈ, యోగినః=యోగసంపన్నులు, ప్రాతఃప్రాతః = వేకువ వేకువను, సహ్యపుత్ర్యాః = కావేరియొక్క, పావనే=పవిత్రమై, విమలే=నిర్మలమైన, పయసి=నీటియందు, స్నాయంస్నాయం=స్నానముచేసిచేసి, లోచనాభ్యాం=కన్నులతో, భుజగశయనం=శ్రీరంగనాయకులను, వారంవారం = పలుమాఱు, పిబంతః=(స్పృశంతః) అనుకొనుచు, క్షేమంక్షేమం=నిత్యక్షేమముగా, అఖిలం=సర్వమైన, కాలం=కాలమును, క్షణవత్ = క్షణకాలమువలె, క్షిపంతి=కడపుచున్నారు.

తా. ఈశ్రీరంగమందు విషయాంతరములు విసర్జించి యోగసంపన్నులైన జ్ఞానవంతులు ప్రతిప్రాతఃకాలమందును కావేరీస్నానము చేసి శేషశయ్యలోడి శ్రీరంగనాయకులను సేవించుచు ఎంతకాలమైనను క్షణకాలమువలె కడుపుచునుండెదరు.

తే. వేకువను వేకువనునె కా  వేరివారిఁ
దోఁగితోఁగియె భోగులు  యోగు లెపుడు
సారెసారెకు రంగనిఁ  జక్షువులను
నానియానియు క్షణముగ  నంతకాల
మెడలఁ బుత్తురు క్షేమముల్  పడసి పడసి.

(కావేరీనది—ఇది దక్షిణమున కవేరరాజువలనఁ గలిగి సహ్యపర్వతమునుండి ప్రవహించుచు నుండు పుణ్యనది. ఇది అగస్త్యమహర్షి స్వర్గమునకు పోయి

తనకమండలమున దేవగంగ నెత్తికొనివచ్చి ఆసహ్యాపర్వతమందుంచి-స్నానము చేయఁబోయిన సమయమందు విఘ్నేశ్వరుఁడు కాకియైవచ్చి ఆకమండల జలమునుదొర్లింపఁగా, అది నదీరూపమునఁ బ్రవహించి సహ్యకన్యక, కావేరియ నఁబరఁగెను. అందు కగస్త్యుఁడు కోపించి విఘ్నేశ్వరునితలమీఁద మొట్టెను. అది మొదలుకొని యెవరుగాని విఘ్నేశ్వరునిదర్శనమున తల రెండుప్రక్కల మొట్టుకొనువారికి క్షేమము కలుగునని ఆయగస్త్యముని యనుగ్రహించుటకు ఇది కారణభూత మైనది.

కృశానుః.—కృశానువు —

గ॥ వయస్య విరుద్ధమేవ భాషసే॥ 628

వ. చెలికాఁడ! నీవుకూడ నిదే పలుకాడుచున్నాఁడవు.

వృ॥ సారంగదృష్టిం కథ ముత్సృజద్భ్యః
సా రంగదృష్టిః స్వదతే మునిభ్యః
కవేరజాసంగతి ముత్సిసృక్షోః
కవేరజాసంగరుచిః కథం స్యాత్ ॥ 629

అ. సారంగదృష్టిం=లేడిచూపులవంటి-చూపులుగల స్త్రీని, ఉత్సృజద్భ్యః=విడుచుచున్న, మునిభ్యః=మునులకు, సారంగదృష్టిః=సారంగదృష్టి-(శ్రీరంగనాథదర్శనము), కథం=ఎట్లు, స్వదతే=రుచించును ? అజాసంగతిం=ప్రకృతిసంబంధమును, ఉత్సిసృక్షోః=విడువఁగోరిన, కవేః అజాసంగరుచిః-కవేరజాసంగరుచిః=బ్రహ్మవేత్తకు, ఆఁడుమేఁకసంబంధమందు - (కావేరీసంబంధమందు) కోరిక, కథం స్యాత్ = ఎట్లు కలుగును?

తా. సారంగదృష్టి గలిగియు స్త్రీలను విసర్జించిన మునులకు మఱల అది (రంగదర్శనము) కలుగనియట్లు కవేరజాసంగతి విడిచినవానికి మఱల అది (కావేరిసంగతి) యెట్లు కలుగును? కలుగనే కలుగదు అనుట.

తే. సారె సారంగదృష్టి వేసారి కాంత
మునులును మనసారంగ దృక్షిప్తినిన "కఃక

వేరజాసంగ " యని వీడఁ క గోరియును గ
వేరజాసంగమునె వారు క కోరి కాంత్రతే.

టి. మనసారంగదృష్టినిన=మన-సారంగదృష్టినిన—మనసా-రంగదృష్టినిన, కః కవేః అజాసంగః=బ్రహ్మజ్ఞునకు ప్రకృతిసంగ మేల? కవేరజాసంగమునె = కావేరీసంగమునె, కాంత్రతే=కాంతురా? (ఏమియాశ్చర్య మనుట.)

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సఖే ! భవతా భణితానాం పదానాంవ్యాసేనైవ విరోధస్స
మాధేయః॥ ఇతి అగ్రతోదృష్ట్వా అంజలింబధ్వా॥ 630

వ. సఖా ! నీవాక్యముల విరోధమునకు నిరోధము నావ్యాసు
నిచే సమాధానము చేయఁదగినదియే యగును. అని యెదు
రం గని యంజలియుం గొని.

శ్రీరంగనాయక వర్ణనము.

(శ్రీరంగనాయకులు—వీరు-పరలోకములకంటె పయిగ పరమపదమనెడి తన నిత్యనివాసమైన శ్రీవైకుంఠమందున శ్రీమన్నారాయణమూర్తి తననాభీకమలోద్భవుఁడైన బ్రహ్మదేవునిచే ప్రార్థింపఁబడి సత్యలోకమందు బ్రహ్మకు తిరువారాధనమై యుండి; ఆతరువాత మహాభక్తిపరతంత్రుఁడైన యిక్ష్వాకు మహారాజుచే ప్రార్థింపఁబడి అయోధ్యయందు యిక్ష్వాకురాజుకు తిరువారాధనమై యుండి; అటుతర్వాత శ్రీరామపాదారవిందప్రతిపత్తి సత్తావిభూషణుఁడైన విభీషణునిచే ప్రార్థింపఁబడి యతనికి తిరువారాధనముగాఁ గొనితేఁబడి లంకకుఁ బోవుచు ఈచంద్రపుష్కరిణీతీరమున తిరుపగూడతో నుంచి ఆచమించుకొనివచ్చి మఱల ఆతిరుపగూడ నెత్తుకొనిపోవ నెంత యెత్తియును కొంతయైన కదలకున్న, నెంతో దుఃఖపడి యొడలుమఱచి అంతట నారాయణునివలన "నేనిందె యుందు" నీ విక్కడికి ప్రతిసాయంకాలమున వచ్చి తిరువారాధనము చేసికొనుచుండుమని యాజ్ఞాపించఁబడియుండి, ఆతర్వాత అంద లి నిచుళాపురి=ఉఱెయూర్ రాజై పరమభక్తి పరమధర్మాసక్తిపరుఁడైన ధర్మ

పర్మరాజుచే ప్రార్థింపఁబడి అతనికిని తిరువారాధనమై యుండి, ఇప్పుడును ఈ కావేరియనెడి విరజతోడి యీభూలోకవైకుంఠమనెడి శ్రీరంగమున పరభక్తి పరజ్ఞానాది సర్వ సద్గుణనిష్ఠాగరిష్ఠులై పరమవైలక్షణ్యవిశిష్టు లయిన శ్రీవైష్ణవులకును తిరువారాధనమై సుదర్శనాది సర్వాయుధ కౌస్తుభాది సర్వాభరణ పీతాంబరాది సర్వపటచ్ఛటలతోడను, వేదశృంగములతోడ ప్రణవ విమానము తోడను జయవిజయాది ద్వారపాలకులతోడను, శ్రీభూనీళాదేవులతోడి శ్రీదేవియైన శ్రీరంగనాయకితోడను, తననాభీకమలమందలి చతుర్ముఖబ్రహ్మతోడను, తన శయనమైన ఆదిశేషునితోడను, మఱి గరుడవిష్వక్సేనాది పరిషద్గణము తోడను, మఱియు పూదత్తె పేయ పొయిక్కైయాది పన్నిద్దరాళ్వార్లతోడను, వారి మంగళాశాసనములతోడను, అఖిల శిష్యోత్తారకులై మఠాధిపతులైన ఆచార్యపురుషులతోడను, మఱి పరిపరివిధ పరిచారకులతోడను, మఱియు నానాదేశాగత నవీన ప్రాచీన సేవకులతోడను సేవసాయించుచున్న యా శ్రీమహావిష్ణుమూర్తియె.)

వ॥ శ్రీరంగే శోభతే యస్య
శ్రీరంగే శోభతేచ యః
నమోఽహం కలయే తస్మై
నమోహం కలయే తతః॥ 631

అ. యస్య=ఎవనియొక్క, అంగే=వక్షోఽవయవమందు, శ్రీః=లక్ష్మి, శోభతే=ప్రకాశించుచున్నదో; యః=ఎవఁడు, శ్రీరంగేచ=శ్రీరంగక్షేత్రమందును, శోభతే=ప్రకాశించుచున్నవాఁడో; యతః=ఎందువలన, అహం=నేను, మోహం=అజ్ఞానమును, నకలయే=చేరనో; తతః=అందువలన, తస్మై=అ శ్రీరంగనాథునికి, అహం=నేను, నమః=నమస్కారమును, కలయే=చేయుచున్నాను.

తా. ఈ శ్రీరంగక్షేత్రమందలి యాలక్ష్మీవక్షఃస్థలుఁడైన శ్రీరంగనాథుఁడు నా యజ్ఞానమును పరిహరించునుగాక! అని నేను ఆరంగనాయకునకు నమస్కారమును జేయుచున్నాను.

క. శ్రీరంగతలాంగణమున
శ్రీరంగారంగనురము శ్రీ సేరంగ మనో
హారింగా రమితనమ
స్కారిం గావింతు మోహహకలన తోఁ బంగన్.

కించ.—మఱియు.—

వృ॥ ప్రణిపతికర్మీ కుర్మః
ఫణిపతిభోగేశయం రథాంగశయమ్
కారణ మేకం జగతాం
వారణపతిభీతివారణం ధామ॥ 632

అ. ఫణిపతిభోగేశయం=శేషుని శరీరమందు శయనించునదియు, రథాంగశయం=చక్రము హస్తమందుఁ గలదియు, జగతాం = లోకములకు, ఏకం = ముఖ్యమైన, కారణం=హేతువును, వారణపతిభీతివారణం = గజేంద్రునిభయమును పోఁగొట్టినదియునైన, ధామ=తేజమును, ప్రణిపతి కర్మీకుర్మః=నమస్కారకార్యము కలదానినిగాఁ జేయుచున్నాము.

తా. శేషశాయియై చక్రహస్తుఁడై సకలలోకములకును గారణభూతుఁడై గజేంద్రునకు భయనివారకుఁడునైన శ్రీమహావిష్ణువుయొక్క తేజోరూపమును మానమస్కారపాత్రముగాఁ జేసికొనుచున్నాము.

క. ప్రణమింతుము ప్రణుతగుణు
ఫణిపఫణాశయు రథాంగపరిచయశయు ర
క్షణచణచరణు జగత్కా
రణు వారణభీతిహరణు రమణీయఘృణున్.

కృశానుః.—కృశానువు.

గ॥ కిమస్మిన్నపి మహాభుజంగశాయిని క్రియంతే త్వయా ప్రణామాః॥ 633

వ. ఏమి? ఈమహాభుజగశాయి విషయమునను భ్రమలు చేయుచున్నావు నీవు?

తథాహి.—అటులె కదా?—

వృ॥ శ్యామోత్తుంగపయోధరోజ్జ్వలరుచిస్తన్వన్ భుజంగాన్వయం
శ్రీరంగస్థలనిత్యవాసరసికశ్శృంగారిణామగ్రణీః
ప్రాకారప్రకరాంతరస్థితిమతీ యారాజపద్మిన్యహో!
నిశ్శంకః పరపూరుష శ్చిర మసౌ నిద్రాతి తత్సన్నిధౌ॥ 634

అ. యా=ఏది, ప్రాకారప్రకర+అంతర+స్థితిమతీ= సప్తప్రాకారముల సమూహముయొక్క+నడుమ ఉనికిగలదియైన, రాజపద్మినీ=రాజుయొక్క పద్మినీస్త్రీ-చంద్రపుష్కరిణి, (ఉన్నదో,) తత్సన్నిధౌ=దానిదగ్గఱ,శ్యామా+ఉత్తుంగ+పయోధర + ఉజ్జ్వల+రుచిః=పదాఱేండ్లస్త్రీలయొక్క-శ్యామ=నల్లనై-పొడవైన- స్తనములయందు మేఘములయందువలె - ఱేఁగుచున్న, ఆశ-కాంతికలవాఁడును, శృంగారిణాం+అగ్రణీః = శృంగారపురుషులలో-శ్రేష్ఠుఁడును, భుజంగ+అన్వయం=విటులతో-ఆదిశేషునితో+సహవాసమును- సంబంధమును, తన్వన్=చేయువాఁడును, శ్రీరంగస్థల-నిత్యవాస-రసికః=శ్రీకరమైననాట్యస్థలమందు-శ్రీరంగక్షేత్రమందును-ఎల్లప్పుడును వాసముచేయుటయందు-రసవంతుఁడునునైన, అసౌ=ఈ, పరపూరుషః = అన్యపురుషుఁడు - పరమపురుషుఁడు, నిశ్శంకః=నిర్భయుఁడై, చిరం=చాలాకాలము, నిద్రాతి=నిదుర చేయుచున్నవాఁడు. అహో=ఆశ్చర్యము!

తా. సప్తప్రాకారములమధ్య రాజస్త్రీసమీపముననె పదాఱేండ్లవారి స్తనములం దపేక్షగలిగి, శృంగారముగ విటులతోఁగూడి నాట్యశాలయందు తేజీతిరుగుజారపురుషుఁడువలె; చంద్రపుష్కరిణీ సమీపముననె నీలమేఘమందువలె వర్ణముకలిగి, శృంగారముగ ఆదిశేషునిశయ్యనుగాఁజేసికొని, ఆశ్రీరంగక్షేత్రమందె వసించుపరమపురుషుఁడు అందెల్లప్పుడును యోగనిద్రయందునున్నవాఁడు; ఇది మహాశ్చర్యము!

సీ. శ్యామోల్లసద్దివ్యసౌధామోజ్జ్వలద్రమ్య
పటుపయోధరరుచుల్ ౯ పరఁగువాఁడు
కాలెత్తిపెట్టకె ౯ కలయంగఁ గను విను
నలభుజంగుఁడె ప్రక్క ౯ మెలఁగువాఁడు
రంగావనిన చేరి ౯ శృంగారమున కోరి
చిరనాసరసికుఁడై ౯ తిరుగువాఁడు
నరసిద్ధసాధ్యకిన్నరసురాసురుల చేఁ
బరపూరుషుఁడె యనం౯బడెడువాఁడు
తే. సప్తసాలవిశాలదు౯స్సాధసౌధ
భాగపున్నాగసచ్ఛాయఁ ౯ బాయకుండు
రాజపద్మనియొద్దనె ౯ రాత్రి పగలు
గన్న నద్దిర! నిద్దుర ౯ నున్నవాఁడు.

గ॥ శ్లేషావలంబనా దోషా ఇమే నమే రోషావహాః ప్రత్యుత దోషావహా ఇతి నాహా మత్రోత్తరయామి॥ 635

వ. ఈశ్లేషావలంబనము లగుదోషంబులు నాకు రోషావహంబులు కావుగాని, విచారింప దోషావహంబులే యగునని నే నిటఁ బ్రత్యుత్తర మిచ్చెడువాఁడను గాను.

పునర్నిరూప్య.—మఱి నిరూపించి.—

వృ॥ క్షితిభృద్భి ర్నిజమౌలిషు
ధృతపాదో విరహితాపకారీచ
ఇందురివ రంగబంధు
ర్దోషాభావేపి లోక్యతే కింతు॥ 636

అ. క్షితిభృద్భిః=రాజులచేతను-పర్వతములచేతను, నిజమౌలిషు=తమశిరోగ్రములందు, ధృతపాదః=ధరింపఁబడినపాదములు - కిరణములు కలవాఁడును,

అవిః= మేరుశైలస్వరూపుఁడును, విః=గరుడపక్షిరూపుఁడును, అహిత+అపకారీచ=శత్రువులకు అపకారముచేయువాఁడును-విరహి+తాపకారీచ= వియోగము గలవారికి+తాపముకలుగఁజేయువాఁడునైన, రంగబంధుః=శ్రీరంగేశుఁడు, ఇందురివ=చంద్రుఁడువలె, లోక్యతే=కనఁబడుచున్నవాఁడు, కింతు = మఱియు, దోషాభావేఽపి=రాత్రి లేనపుడును-సర్వదోషములు లేనపుడును,విలోక్యతే=కనఁబడుచునున్నవాఁడు.

తా. పర్వతములమీఁద కిరణములు వ్యాపింపఁజేయుచు, విరహముకలవారికి తాపము కలుగఁజేయుచునున్నను రాత్రిలోనె కనఁబడుచుండు చంద్రుఁడువలె, ఈశ్రీరంగనాథుఁడు బలిప్రముఖసకలరాజుల శిరస్సులందును పాదములుంచుచు శత్రులైనహిరణ్యకశిపుప్రముఖులకుపరి తాపముకలుగఁజేయుచు,"మేరుశ్శిఖరిణామహమ్" "వైనతేయోస్మిపక్షిణామ్"అనిపర్వతార్థక అవిశబ్దవాచ్యుఁడుగాను, పక్ష్యర్థకవిశబ్దవాచ్యుఁడుగానునై యున్నను, సర్వదోషములు హరించుటకై రేయుంబగలును గనుపడుచునె యున్నవాఁడు.

క. క్షితిభృత్తులమౌళులపైఁ
ధృతపాదుఁ డవిరహితాపకృధిక్కారియ కా
సతతము శశివలె రంగఁడు
తతదోషాభావమునను దగఁ గనుపించున్.

యద్వా.—లేదా?—

వృ॥నవిధా శుభరంగలక్షితాంగే
సుముదాప్యాయనకారిణీహ దృష్టే
కలయామి కురంగలక్షితాంగం
కుముదాప్యాయనకారిణం విధుం తమ్॥ 637

అ. ఇహ=ఇక్కడ, శుభరంగలక్షితాంగే = శుభకరమైనశ్రీరంగక్షేత్రమందు కనఁబడినఅంగములు గలవాఁడును, సుముదాప్యాయనకారిణి=మంచిసంతోషముతో తృప్తిచేయువాఁడునైన, విధౌ=విష్ణువనుచంద్రుఁడు, దృష్టేసతి=

చూడఁబడుచుండఁగా; కురంగలక్షితాంగం=కుత్సితమైనరంగమందు -లేడిలో- కనఁబడిన మధ్యాంగముగలవాఁడును, కుముదాప్యాయనకారిణం = కుత్సితమైన సంతోషముతో- తెల్లకలువలకును తృప్తిచేయువాఁడునైన, తంవిధుం =ఆ చంద్రుని, నకలయామి=చూడను.

తా. శుభలక్షణములు గలయీశ్రీరంగమందు ఆమోదముతో మనకందఱకును తృప్తినిగలిగించునట్టి యీశ్రీరంగనాథుఁడే చంద్రుండుగా కనఁబడుచుండఁగా, ఆయాకాశరంగమందు లేడి నాడించుకొనుచుఁ గుముదామోదమునే చేసికొనుచుండునట్టిచంద్రు నేలచూచుకోవలెను ?

తే. విధుఁడు శుభరంగలక్షితశ్రీఘఁడితండు
నమితమును సుముదాప్యాయనము నొనర్చు
విధుఁ డతండా కురంగలక్షితుఁడు చూడ
నమితమును గుముదాప్యాయనము నొనర్చె.

గ॥ పున ర్విచింత్య సవిస్మయమ్॥ 638

వ. మఱల విశేషించి చింతించి విస్మయంబునుం గాంచి.

శ్లో॥ రంగేశసేవకో యుక్తం
వార్తాంరీతిం భజే దతి
చిత్ర మేతదసంగీతి
వ్యపదేశం యదశ్నుతే॥ 639

అ. రంగేశసేవకస్య=రంగనాథునకు-తగరమునకు - ఆశ్రితుఁడు-పనిచేయువాఁడు, వార్తాంరీతింభజేత్ = నృత్యసమర్థమైనరీతిని పొందును, ఇతి=అనుట, యుక్తం=సరే; ఆర్తాంరీతింభజేద్వా=చొక్కమైన ఇత్తళినిపొందునా? (పొందఁడు;)అసంగీ=దుస్సంగతిలేనవాఁడు, ఇతి=అని,వ్యపదేశం=ప్రసిద్ధిని, యత్ = ఎందువలన, అశ్నుతే=పొందుచున్నాఁడో? తత్ ఏతత్=ఆయిది, చిత్రం = ఆశ్చర్యము !

తా. తగరపుఁబని చేయువాఁడు ఇత్తడిపనికిఁ జేరనియట్లు ఈశ్రీరంగనాయకుని సేవకుఁ డైనయతఁడు విషయాంతరసంగతుఁడు కాఁడు కదా?

ఆ. రంగసేవకుఁ డల శ్రీరంగఁ దా నొకరీతి
సేవకుఁ డన సరియె? శ్రీ సేవకుఁ డెలు
లతఁ డసంగి యనఁగ శ్రీ నవ్విషయములకుఁ
జిత్ర మిదియు నెందు శ్రీ ధాత్రియందు.

శ్లో॥ అన్య దద్భుత ముద్భూత
మత్ర శ్రీరంగధామని
యచ్చంద్రాభిఖ్యయా ప్యేషా
శోభతే పుష్కరి ణ్యహో! 640

అ. అత్ర=ఈ, శ్రీరంగధామని=శ్రీరంగక్షేత్రమందు, యత్ =ఎందువలన, ఏషా=ఈ, పుష్కరిణీ=తామరతటాకము, చంద్రాభిఖ్యయాఅపి=చంద్రకాంతితో-చంద్రపుష్కరిణి అనుపేరితో, శోభతే=ప్రకాశించుచున్నదో; తత్ = అందువలన, అన్యత్ =మఱియొక, అద్భుతం=ఆశ్చర్యము, ఉద్భూతం=పుట్టినది. అహో=అహా !

తా. ఈశ్రీరంగమున తటాకము తామరతటాక మయ్యును; చంద్రకాంతిచేత ప్రకాశించుచు, చంద్రపుష్కరిణి యనుపేరితోను నున్నయది. ఇదియు నొకవిరుద్ధ మయినయాశ్చర్యమె.

క. మఱియొకయద్భుతి మొదవెను
నరయఁగ శ్రీరంగధామ శ్రీమందున యెపుడున్
సురుచిర మై భాసిలుఁ బు
ష్కరిణియుఁ దానై యజస్ర శ్రీచంద్రాభిఖ్యన్.

గ॥ సమంతా దవలోక్య సశ్లాఘమ్॥ 641

వ. కలయఁ గనుఁగొని శ్లాఘాసహితంబుగ.

వృ॥రంగక్షేత్ర మిదం రమేశితు రభివ్యక్తిస్థలే ష్వాదిమమ్
తీర్థం సైవ మరుద్వృధా భగవతీ యాం తోష్టవీతి శ్రుతిః
సర్వాత్మా నగరస్యచాస్య జగతాం నిర్వాహకో నాయకో
వాసశ్చేదిహ లభ్యతేజగతికో వైకుంఠ ముత్కంఠతే॥ 642

అ. ఇదం=ఈ, రంగక్షేత్రం=శ్రీరంగము, రమేశితుః=భగవంతుఁడైన లక్ష్మీపతియొక్క, అభివ్యక్తిస్థలేషు=ఆవిర్భావస్థలములందు, ఆదిమం = ప్రథమమైనది; యాం=ఏవిరజాతీర్థమును, శ్రుతిః=వేదము, తోష్టవీతి = విశేషముగా స్తోత్రముచేయుచున్నదో? భగవతీ = భగవత్సంబంధముగల, మరుద్వృధా= కావేరి, సైవ=ఆవిరజాతీర్థమే; అస్య=ఈ, నగరస్య=రంగమునకు, నాయకశ్చ=నాథుఁడును, జగతాం=సకలలోకములకును, నిర్వాహకః = రక్షకుఁడై, సర్వాత్మా=సర్వాంతరాత్మయైన విష్ణువు; ఇహ=ఈక్షేత్రమందు, వాసః=వాసముచేయుట, లభ్యతే చేత్=లభింపఁబడినయెడల; జగతి = లోకమందు, కః=ఎవఁడు, వైకుంఠం=వైకుంఠమును, ఉత్కంఠతే=కోరుచున్నాఁడు ?

తా. ఈశ్రీరంగము ఆభగవంతుని యవతారస్థలములలో ప్రధానస్థలమై, వేదవినుతమైన ఆవిరజయే ఈకావేరియై, ఈరంగినాథుఁడే ఆసర్వాంతర్యామియైన పరమపదనాథుఁడై యుండఁగా ; ఇట్టి యీరంగక్షేత్రముననే ఎవరుగాని వాసముచేయువారు మఱల ఆపరమపదము నేల కోరుదురు?

శా. శ్రీరంగం బిది నూటయెన్మిదిమహాక్షేత్రంబులం దాద్య, మే
పారంగన్ విరజాఖ్యతీర్థ మిది సహ్యాగేంద్రసంజాత, సొం
పారంగన్ జగదీశ్వరుండెయిటకాహా! యీశ్వరుం,డిందునిం
పారంగన్ నివసించియెవ్వఁడెదనీహం జేయు? వైకుంఠమున్.

కృశానుః.—కృశానుఁడు.—

సార్ధాంగీకారమ్॥ అర్ధాంగీకారముతో.—

వృ॥ సోఽయం యద్యపి హృద్యఏవ విషయ స్సాయంతనేందీవర
శ్యామాంగేన సనాయకః కృశతమో భంగేన రంగేందునా

భ్రాంతాఃకింతుచరంతిహంతపిశునాశ్శాంతాత్మనాంతాపదాః
శ్రీమంతో యదుదంచనాద్బత న ఖల్వత్రా స మత్రాసతే॥

అ. సాయంతన-ఇందీవర-శ్యామ-అంగేన = సాయంకాలమందలి - నల్లకలువలవలె - నల్లనైన - అవయవములు - మధ్యభాగము గలవాఁడును, కృత-తమః-భంగేన = చేయఁబడిన- అజ్ఞానముయొక్క - అంధకారముయొక్క - నాశముకలవాఁడునైన, రంగ-ఇందునా=శ్రీరంగమునకు-మహాశ్రేష్ఠాధిపతియైన, యీరంగనాథుఁ డనెడు చంద్రునిచేత, సనాయకః = నాయకసహిత మైన-సోఽయం=ఆయీ, విషయః=దేశము, హృద్యఏవ=మనోజ్ఞమైనదే;యద్యపి=ఐనను; కింతు=ఏమోకాని, యత్ =ఎందువలన, భ్రాంతాః=పరధనభ్రమగలవారై, శాంత-ఆత్మనాం=శాంతిసంపన్నమైన-మనస్సు గలవారికి, తాపదాః=సంతాపము నిచ్చువారైన, పిశునాః=లుబ్ధచోరులు,చరంతి=సంచరించుచున్నారో, హంత=అయ్యో! తత్ -ఉదంచనాత్ = అట్టివారియొక్క-అభివృద్ధివలన, అత్ర=ఇక్కడ, శ్రీమంతః=సంపన్నులు, అత్రాసం = నిర్భయముగా, నఆసతే ఖలు=ఉండరుకదా? బత=అయ్యో!

తా. నల్లకల్వవలె నడిమిభాగము నల్లనై అంధకారమును బోఁగొట్టుచంద్రుఁడువలె నల్లకలువవలె నొడలంతయు నల్లనై అజ్ఞానమును బోఁగొట్టు నాశ్రీరంగనాథుఁడు నాయకుఁడుగా, ఈదేశము రమణీయమై యుండియు, నిందు పరధనాపేక్షచే పరమశాంతులకును పరితాపమును గలిగించుచు దొంగలు తిరుగుచుండుటచేత నే ధనసంపన్ను లిక్కడ నిర్భయముగా నుండుటలేదు.

ఉ. ఔర ! సనీలిమోత్పలసకోమాంగుఁ డభంగతమోవిభంగుఁ డు
త్తారకరంగరాడ్విధుఁ డుదారుఁడునాథుఁడెయీపురంబునన్
జోరులు శాంతచిత్తులకుఁ జోదితబాధల సంచరింత్రు వి
స్తారధనాఢ్యులిందుభయకాతంద్రులుగాకెటులుంద్రు నెమ్మదిన్.

కిం బహునా.—విశేష మేల ?—

వృ॥ నిత్యం కాంచనసింధుమధ్యరుచిగో నిష్కంపసంపన్నిధి

ర్ని స్తుల్యామపి కాంచనశ్రియ మురోమధ్యే దధానస్స్వయమ్
బిభ్యత్కిం పిశునేభ్య ఏష బహులప్రాకారసంవేష్టితే
శేతే ధామని రంగనాయక ఇతి స్వాఖ్యా మిహాఖ్యాపయన్॥

అ. నిత్యం=ఎప్పుడును, కాంచనసింధు-మధ్య-రుచిరః = బంగారురాశియొక్క-కావేరీనదియొక్క-నడుమ-మనోహరుఁడై, నిష్కంప - సంపత్ -నిధిః = నిశ్చలమైన-సంపత్తికి-నిక్షేపమైనవాఁడై, నిస్తుల్యాం=సాటిలేని, కాంచనశ్రియం అపి=బంగారములకాంతిని-అసామాన్యయైన లక్ష్మినికూడ, ఉరోమధ్యే=ఱొమ్మునడుమ, దధానః=ధరించునతఁడైన, ఏషః=ఈభగవంతుఁడు, స్వయం=తాను, పిశునేభ్యః=దొంగలవలన, బిభ్యత్కిం=భయపడుచునా? బహులప్రాకార సంవేష్టితే=అనేక ప్రాకారములతో చుట్టఁబడిన, ధామని=గృహమందు, రంగనాయక ఇతి=తగరములకు నాయకుఁడు-(శ్రీరంగనాయకుఁడు) ఇతి=అని, స్వఆఖ్యాం=తనపేరిని, ఇహ=ఇక్కడ, ఖ్యాపయన్ = ప్రఖ్యాతిపఱచుకొనుచు, శేతే=శయనించుచున్నాఁడు.

తా. ఈ ప్రవహించు బంగారుటేఱునడుమ సర్వసంపదలు కలిగియు, లక్ష్మితోఁగూడ బంగారుసరులతోఁగూడ లక్ష్మీసంపన్నుఁడై యుండు నీభగవంతుఁడుకూడ ఆ దొంగలకు భయపడుచు, తానెన్నో ప్రాకారములనడుమనుండి, బంగారమునకు నాయకుఁడనక (రంగమునకు=) తగరమునకు మాత్రమె నాయకుఁడనెడి పేరిని ప్రఖ్యాతము చేసికొనుచు, లోఁగనిద్రబోలాగు తూగుచున్నవాఁడు?

చ. కనక నదీనివేశము ప్రకాశము, శాశ్వత మీశ్వరత్వ. మ
ట్లానరఁగ శ్రీవిహారము నిరోజారము, అఁవుఁ జోరభీతినై
ఘన ముగుప్తసాలము నగారముమన్య వసించె రంగరా
ట్టనఁదన పేరు ధారుణిఁ దనంతట నంతటనాటఁ జాటుచున్.

టి. రంగరాట్టు=తగరమునకు-శ్రీరంగమునకు అధిపతి, స ప్తసాలము = ఏడు ప్రాకారములు కలది.

విశ్వావసుః.— విశ్వావసువు —

గ॥ సఖే! నజాతు శ్రీమతాం హానిః ప్రత్యుత తద్వేష్టౄణాం
పిశునానామేవ భవంత్యనర్థాః॥ 645

వ. సఖా! యెుకప్పుడును శ్రీమంతులకు హాని కలుగదు గాని,
చోరులకే యనర్థములు కలుగును.

వృ॥ పరవిత్తజిహీర్షయా ప్రవృత్తః
పిశునస్తు స్వయమేవ నాశమేతి
సులభశ్శలభస్య కిం నదాహః
పృథుదీపగ్రసనాయ జృంభితస్య॥ 646

అ. పరవిత్త జిహీర్షయా=ఇతరుల సొత్తులను అపహరింపఁ గోరికచేత, ప్రవృత్తః=ప్రవర్తించునట్టి, పిశునస్తు=దొంగయో, స్వయమేవ=తానే, నాశం=నాశమును, ఏతి=పొందుచున్నాఁడు; పృథుదీపగ్రసనాయ = గొప్పదీపమును మ్రింగుటకై, జృంభితస్య=విజృంభించినట్టి, శలభస్య=మిడుతపురుగునకు, దాహః=దహింపు, సులభః=సులభము, నకిం=కాదా?

తా. దీపమెంతటిదైనను, దానిని మ్రింగనెగిరిన మిడుతపురుగు దానిలోనే పడి మాడిపోవునట్లే, పరులసొత్తు దొంగిలింపఁ దిరిగెడిదొంగ తానే నశించునట్లయగునుగదా?

క. పరధనము గొనఁగ మనమును
బరువడిఁ బరియవిడు చౌర్యకపరుఁడే పరియుఁ
బొరయదె సులభంబుగ మృతి
యరయని శలభంబునకును నలదివెగవియన్.

గ॥ అల మన్యప్రసంగేన, తమేవ పరమేశం శ్రీరంగధామాన మనుసందధామి॥ 647

వ. వెఱప్రసంగము చాలు; పరమేశ్వరుఁడైనయాశ్రీరంగేశ్వరునే యనుసంధించుచున్నాను.

సవిస్మయమ్.—వింతపడి.—

వృ॥సపర్యాం విరుద్ధాదపి ప్రాప్తు మీప్టేః
సమర్థో జగత్యాం యతో రామచంద్రాత్
అరంగాధిరాజోదితప్రౌఢభక్తే
రపి ప్రాప పూజాం స రంగాధిరాజః॥ 648

అ. జగత్యాం=భూలోకమందు, సమర్థః = సామర్థ్యము గలవాఁడు, విరుద్ధాదపి=విరుద్ధవర్తనము కలవానివలన కూడ, సపర్యాం=పూజను, ప్రాప్తుం = పొందుటకు, ఈప్టే=కోరుచున్నాఁడు; యతః=ఏలంటే? సః=ఆ, రంగాధిరాజః=రంగరాజు, అరంగాధిరాజ ఉదితప్రౌఢభక్తేః=రంగాధిరాజు కానివానియందు-మిక్కిలి గాధిరాజునందు కలిగిన దృఢమైన భక్తి కలవాఁడగు, రామచంద్రాత్ అపి = శ్రీరామచంద్రునివలనఁ గూడ, పూజాం=పూజను, ప్రాప=పొందెనో; తతః=అందువలన.

తా. ఈరంగాధిరాజు రంగాధిరాజునందుఁ గూడ భక్తి గలిగిన ఆరామచంద్రునివలన పూజింపఁబడుట "లోకములో పూజనీయుఁడు తనకు విరుద్ధప్రవర్తనము కలవానివలనఁగూడఁ బూజింపఁబడును'' అనుమాటకు తగినదిగానే యున్నది.

గ॥ అథవా నాత్రవిరోధ ఇతి సమర్థయే॥ 649

వ. లేదా యీడను విరోధమే లేదని సమర్థించుచున్నాఁడను.

తే. అతిసమర్థుఁ డేతనిచేత కైనయిన నర్చ
రమణఁ గొనఁ గాంచు, రంగాధిరాజు గాంచ
కరమరంగాధిరాజోదితానురాగ
రామచంద్రార్చితుఁడు నభిరాముఁ డగుట.

టి. ఇట, సహజార్థమందు-కాంచక, అరమరక్, గాధి తుఁడు... అని విభాగము; అన్యార్థమందు- కాంచక్, కరము, అరంగాధి... అనువిభాగమున-కాంచక్ అని దాని ద్రుతమునకు లోపము కించిల్లక్షణదోషమే యైనను; పాదాం

తమందు ద్రుతలోపము బహుళమని యైనను, శ్లేషయమకాదులందు అది అంత దోషముకాదని యైనను లాక్షణికసమాధానము.

రంగాధిరాజు=శ్రీరామచంద్రార్చితశ్రీరంగాధిపతి—శ్రీరామచంద్రులు తమ సూర్యవంశమువారిలో తమ పితృవర్ణమునకు గృహతిరువారాధనమునకై భగవానుఁడు కృపచేసియిచ్చి తమకును తిరువారాధనమై యున్న తనదివ్యమంగళవిగ్రహస్వరూపులైన శ్రీరంగనాథులను లంకాయుద్ధములో తమకెంతో సహాయముచేసి పట్టాభిషిక్తుఁడునై తము ననుసరించి శరణాగతుఁడై తమపట్టాభిషేకమునకు వచ్చి సర్వవిధముల సంతుష్టుఁడై మఱలపోవు నా విభీషణునకు తిరువారాధనగా ప్రత్యుపకారము తలంచి యిచ్చిన తిరుపగూడతోటి వీరిని ఈకావేరిగట్టున చంద్రమతీతటాకముదగ్గర ఆచమించుటకై యుంచి మఱలి యెత్తుటకు లేక తత్తరపడి వ్యసనాయత్తచిత్తుఁడై యొడలు మఱచియుండఁగా అపుడు స్వామి అతనిస్వప్నములో నేనిక్కడ నే యుండవలెనని కోరుచున్నాను. నీ విప్పుడప్పు డొకదినమైన తప్పక వచ్చి తిరువారాధన చేసికొనుచుండుమని యాజ్ఞాపింపఁగా, నేఁటివఱకును చిరంజీవియై యుండు నావిభీషణునిచే సామాన్యులకు గోచరము గాక ఆరాధించుకొనఁబడుచుండు నా మహావిష్ణువు.

258 వృత్తము పయిగచూడు?

గాధిరాజు=విశ్వామిత్రుఁడు—పురూరవునివంశస్థుఁడు కుశికుఁడు. అతనికుమారుఁడు గాధి, అతనికొమారుఁడు విశ్వామిత్రుఁడు. తానురాజర్షి యయ్యును కోపగాఁడగుటచేత ఎన్నిమార్లొ తపోభంగమై తుదకు వశిష్ఠునితో స్పర్ధచేసి తపస్సతిశయించి బ్రహ్మర్షి యయ్యెను. ఇతఁడె తనకు తపోయజ్ఞభంగము లేకుండుటకై దశరథరాజును వేఁడుకొని అతనికొమారులు శ్రీరామలక్ష్మణులను బిలిచికొనిపోయి వారికి ధనుర్విద్యాదులను నేర్పి వారివలన సుబాహు మారీచాది దుష్టరాక్షసబాధ లేక నిర్విఘ్నముగా తనతపఃపరిపూర్తియు యజ్ఞపూర్తియు కావించుకొన్నవాఁడు.

శ్లో॥కువస్తు హంతా సద్వస్తు
సంగ్రహీ రాఘవః క్షమమ్

హంతా కురంగరాజస్య
రంగరాజ మపూజయత్ ॥ 650

అ. రాఘవః=శ్రీరాముఁడు, కువస్తుహంతా=కుత్సితవస్తువులను పరిహరించు వాఁడు, సద్వస్తుసంగ్రహీ=శ్రేష్ఠవస్తువులను సంగ్రహించువాఁడును, క్షమం=యుక్తమే ; కురంగరాజస్య=మాయలేడిరాజైన మారీచునికి, హంతా=సంహారకుఁడై, రంగరాజం=శ్రీరంగరాజును, అపూజయత్=పూజించెను.

తా. శ్రీరాఘుఁడు అసత్పదార్థములను విడిచి, సత్పదార్థములనే సంగ్రహించువాఁడగుటచేత మాయాకురంగమై వచ్చినమారీచుని సంహరించి శ్రీరంగనాథుని పూజించుచుండెను.

క. కుపదార్థత్యాగియతా
సుపదార్థగ్రాహి యగును ఋజువె? రాఘవుఁ డా
చపలకురంగపతినిహతి
నిపుణత రంగపతి వినతి ఋ నెఱపెఁ నెఱిమైన్.

కురంగరాజు=మారీచుఁడు—వీఁడు విశ్వామిత్రునియాగమందు వాయవ్యాస్త్రముచే శ్రీరాములవలన సముద్రములో పడవేయఁబడి తప్పించుకొనిపోయి ఆవెనుక ఆరావణునికి మంత్రియై యుండుటన తా నెన్నివిధములనో ఆ శ్రీరాముల బలపరాక్రమములు దెలిసి యెంతచెప్పినను వినక వాఁడు కోపగింపఁగా, వీఁడు బంగారుజింకయై వచ్చి, సీతాదేవి ఈజింకరూపు నేర్పు వన్నెలకు వింతపడి దీనిఁదెచ్చియిమ్మని శ్రీరాములను వేఁడుకోఁగా; వారు పోయి దానిఁ బట్టితెచ్చుటకు ఎంతోకష్టపడి కడకు దానిని జంపి, ఆచర్మమునైన తెచ్చి సీత కిచ్చెదమని బాణమువేసి హతము చేయఁబడినవాఁడు.

గ॥ పున స్సభక్తిప్రకర్షం భగవంత ముద్దిశ్య॥ 651

వ. పదపడి భక్తి యతిశయించి భగవంతు నుద్దేశించి.

వృ॥ శ్రితసురనుతిఘోషే. శత్రుషు స్ఫీతరోషే.
నిహతవినతదోషే. నిత్యదాస్యాభిలాషే

లలితవపుషి శేషే. లబ్ధసంపూర్ణతోషే
పరమపురుష ! శేషే. పర్వచంద్రావిశేషే.॥ 652

అ. శ్రితసురనుతిఘోషే=ఆశ్రితులైన దేవతల స్తోత్రముల ధ్వనులు కలవాఁడును, శత్రుషు=శత్రువులందు, స్ఫీతరోషే=అతిశయించినకోపము కలవాఁడును, నిహతవినతదోషే=తొలఁగఁగొట్టఁబడిన ఆశ్రితులదోషములుకలవాఁడును, నిత్యదాస్యాభిలాషే=ఎప్పుడును దాసత్వమందె అభిలాషకలవాఁడును, లలితవపుషి=మనోజ్ఞమైనదేహము కలవాఁడును, లబ్ధసంపూర్ణతోషే=లభింపఁబడిన అధికమైనసంతోషము కలవాఁడును, పర్వచంద్రావిశేషే = పూర్ణిమాచంద్రుని కంటె విశేషముకానివాఁడునైన, శేషే=ఆదిశేషునియందు, పరమపురుష=ఓ పురుషోత్తమా! శేషే=నిద్రించుచున్నావు.

తా. ఓ పురుషోత్తమా! తాము దేవతల స్తోత్రములతోను, శత్రువులమీఁది కోపముతోను, సకలాశ్రితులదోషములు పరిహరించుచు, ఎప్పుడును దాస్యవృత్తినే యుండి, నిండినసంతోషము కల్గి, పూర్ణచంద్రునివలె అతిధవళమై మనోహరమైన శరీరముగల ఆయాదిశేషునిశయ్యయందు శయనించుచున్నారు.

ఉత్సాహ. శేషు వినతవిబుధవినుతఘోషు విమతసమితిసం
రోషు నిహతవినతవితతదోషు లబ్ధలలితసం
తోషు నిత్యదాస్యసమభిలాషుఁ బర్వచంద్రవ
ద్వేషు వెస నజయ్యశయ్యఁ దిండుఁ జేసి పండితౌ !

గ॥ భగవన్ ! రంగచంద్ర ! భవదీయసమ్ముఖే భాషితుమపి వయం
బిభీమః॥ 653

వ. భగవానుఁడా ! రంగచంద్రుఁడా! భవదీయసమ్ముఖమ్మున భాషింపఁగనైన నేము భయపడుచున్నాము.

తథాహి:—అది సరే.—

వృ॥ వక్త్రే వ్యాకరణస్య వామ మితర ద్వస్త్ర ప్రవక్త్రీక్షణమ్
భాష్యంవ్యాకరణస్య సాధు విదధే శయ్యా యదీయా పునః

యద్వాహో ద్విజశేఖర శ్శ్రుతిమయో యస్యస్నుషా భారతీ
గోష్ఠ్యాం త్రస్యతి తస్య తే కవిజనో రంగేశ కర్తుం నుతిమ్॥

అ. యస్య=ఎవనియొక్క, వామం=ఎడమకన్ను, వ్యాకరణస్య=వ్యాకరణమునకు, వక్తృ=వక్తయో, యస్య=ఎవనియొక్క, ఇతరత్ ఈక్షణం = వేఱుకుడికన్ను, ప్రవక్తృ=వ్యాకరణప్రవక్తయో; పునః=మఱల, యదీయా=ఎవనిది, శయ్యా=పడక, వ్యాకరణస్య=వ్యాకరణమునకు, సాధు = చక్కఁగా, భాష్యం=వ్యాఖ్యానమును, విదధే=చేసెనో; యద్వాహః=ఎవనియొక్కవాహనమైన, ద్విజశేఖరః=బ్రాహ్మణశ్రేష్ఠుఁడు-పక్షిరాజు, శ్రుతిమయః = వేదములే స్వరూపముగాఁగలవాఁడో; యస్య=ఎవనియొక్క, స్నుషా=కోడలు, భారతీ =సరస్వతియో; హేరంగేశ=ఓశ్రీరంగనాథా! తస్య=అట్టి, తే=నీయొక్క, గోష్ఠ్యాం=గోష్ఠిలో, కవిజనః=కవిసమూహము, నుతిం=నీస్తోత్రమును, కర్తుం = చేయుటకు, త్రస్యతి=భయపడుచున్నది.

తా. ఓశ్రీరంగనాథా! తమయెడమకన్నయినచంద్రుఁడు చాంద్రవ్యాకరణమును, కుడికన్నయినసూర్యుఁడు సౌరవ్యాకరణమునుఁ జేసినది గాక; తమపడకగానున్న ఆదిశేషునంశమున ఆపతంజలి వ్యాకరణమునకు భాష్యమును జేసెను; మఱితమవాహనమైన గరుత్మంతుఁడో సకలవేదస్వరూపుఁడై యున్నవాఁడు; ఇదేగాక, తమకోడలైన సరస్వతియో సర్వభాషాస్వరూపిణి యై యున్నది; ఇట్లుండు తమగోష్ఠియందు ఏకవి తమను పొగడ శక్తుఁ డగును ?

సీ. ఏవానివామసత్కమీక్షణం బగుచంద్రుఁ
డావ్యాకరణమున కగును వక్త
యేవానిదక్షిణ కమీక్షణం బగుసూర్యుఁ
డీవ్యాకరణమున కేప్రవక్త
యేవానిపర్యంకమే యగుశేషుఁ డా
వ్యాకరణమునకై భాష్యకర్త
యేవానివాహమే యానై న తేయుఁడు

వేదమయుఁడౌ యాచు కె వెలయు మఱియు
తే. నెవరికోడలు భారతి కె యవును నట్టి
నిన్నుఁ గనుఁగొని మునుకొని కె సన్నుతింపఁ
గల కవిశ్రేష్ఠుఁ డేగోష్ఠిఁ కె గలఁ డెసంగ
రంగనాయక ! పాయ కెకెఱుంగఁ జెపుము.

ఇ. విష్ణువామేక్షణము=చంద్రుఁడు—విష్ణువునకు వామనేత్రము. ఇతఁడు కల్పాంతరములందలి అవతారాంతరములలో సముద్రపుత్రుఁడును, అత్రిఅనసూయలపుత్రుఁడు నై, నక్షత్ర బ్రాహ్మణౌషధీ తపోయజ్ఞముల కధిపతియు, అశ్విన్యాదులకు పతియునై, బృహస్పతిదార యైన తారవలన బుధుని గనుకొని, మనకు రాత్రులయం దంధకారహరణమునకై ఆకాశమందు కనఁబడుచునె యుండునతఁడు. ఇతఁడే చాంద్రవ్యాకరణకర్త.

సూర్యుఁడు.—విష్ణువునకు దక్షిణనేత్రము; ఇతఁడును కల్పాంతరమున అదితికశ్యపబ్రహ్మలపుత్రుఁడును, ఛాయాసంజ్ఞాదేవులభర్తయు నై, వైవస్వతమనువును యముని శనినిఁ గనుకొని, మఱి యమున తపతి అనుహుతులనుఁ గనుకొని, ద్వాదశాదిత్యులలో నొకఁడై ప్రాతర్మధ్యాహ్నసాయంకాలములలో బ్రహ్మరుద్రవిష్ణుస్వరూపుఁడు నై, మనకు పగటనె అంధకారహరణార్థమై ఆకాశమందు కనఁబడుచునె యుండునతఁడు. ఇతఁడు సౌరవ్యాకరణకర్త.

ఆదిశేషుఁడు.— విష్ణువునకు శయ్యయై యుండునతఁడు. ఇతఁడు కద్రూకశ్యపులపుత్రుఁడై బదరికాశ్రమాది దివ్యక్షేత్రములలో తపస్సు చేసిచేసి తనసత్యనిష్ఠాధైర్యాదులకు మెచ్చి బ్రహ్మయిచ్చిన భూభారవహనమంతటి శక్తియు, రుద్రుఁడిచ్చిన విష్ణుశయ్యాస్వరూపాద్యాసక్తియును గలిగి, గరుత్మన్మైత్రిలో సహస్రఫణామూర్తి యై పారిషద్గణప్రధానుఁడునై యుండి, కల్పాంతరములలో లక్ష్మణ బలరామ రామానుజా ద్యవతారములలోను నున్నతఁడు.

ఇ. పతంజలి — ఆయాదిశేషాంశసంభూతుఁడై సంస్కృతమున వ్యాకరణమునకు భాష్యకారకుఁడును, యోగశాస్త్రమునకు ప్రవర్తకుఁడు నైనయతఁడు.

ఇ. గరుత్మంతుఁడు = విష్ణువాహనము—ఇతఁడు పౌరుషేయమైన వేదమే స్వరూపముగాఁ గలవాఁడు. ఇతఁడు వినతాకశ్యపులపుత్రుఁడై, కద్రువదగ్గఱ నున్న వినతదాసీత్వమును పోఁగొట్ట దేవేంద్రునుండి యమృతము దెచ్చి కోరిన కాద్రవేయులకిచ్చి ఆహారముకోరి తల్లియుత్తరువున పుళిందుని భక్షణముచేసి, తనబలము ప్రబలించుటకై విభావసుసుప్రతీకులు దాయభాగమునకై యొకొక్కరు శపించుకొని రూపము మాఱియున్న గజకచ్ఛపములను భక్షణముచేసి ఒకవృక్షశాఖయందు నిలువఁగా, ఆబరువునకాశాఖ విఱుగఁగా, అందలివాలఖిల్యులను మెల్లఁగ దించి రక్షించినయతఁడు.

సరస్వతి.—బ్రహ్మభార్య. ఈమె విద్యల కధిష్ఠానదేవతయై తననాల్గుహస్తములలోను అక్షమాలా శుక కమల పుస్తకములను ధరించినదియై, సంగీతసాహిత్యములు రెండును స్తనములుగాఁగలిగి, ఆవిద్యలు కోరి అభ్యసించువారికి బిడ్డలవలె ఆస్తన్యపానమిచ్చుచు, తన్ను శరదృతువున పూజించువారికిని విద్యాసంపన్నతకలుగఁజేయుచుండునామె. ఈమెయే బ్రహ్మనుగన్న విష్ణునికోడలు.

గ॥ పున రంజలిం బద్ధ్వా సప్రార్థనమ్ ॥ 655

వ. మఱల నంజలీబంధంబును బ్రార్థనానుబంధంబునుం గావించి.

వృ॥వరగుణగణసీమా వారిదశ్యామధామా
సతత మమరరామా సంగసంగీతనామా
పరిహృతభవదామా భాసితాకల్పహేమా
మమ కలయతు భూమా మంగలం రంగధామా॥ 656

అ. వరగుణగణసీమా=శ్రేష్ఠములైన గుణసమూహములకు సీమాభూమియు, వారిదశ్యామధామా=మేఘమువలె నీలకాంతులు కలవాఁడును, సతతం=ఎప్పుడును, అమరరామాసంగసంగీతనామా=దేవస్త్రీలతోడికూడికతో పాడంబడుచుండెడు నామధేయములు కలవాఁడును, పరిహృతభవదామా=పరిహరింపఁబడినసంసారపాశములుకలవాఁడును, భాసిత-ఆకల్ప - హేమా=ప్రకాశించెడు-ఆభరణములలోని-బంగారముగలవాఁడును, భూమా=సర్వాతిశాయియునైన,

రంగధామా=శ్రీరంగధాముఁడు, మమ=నాకు, మంగలం=శుభమును, కలయతు =కలుగఁజేయునుగాక ?

తా. సకలకల్యాణగుణములు కలిగి, సంసారబంధములు తొలఁగించుచు, నీలమేఘవర్ణుఁడై సువర్ణభూషణుఁడై దేవతలు దేవతాస్త్రీలతోడఁ గూడి పొగడఁబడెడు శ్రీరంగనాథుఁడు మాకు మంగళప్రదాత యగునుగాత !

విజయమంగళము.

భూముఁడచిరసుగుణనికరసీముఁడసితలసితజలద
ధాముఁడమితశుభదపినుతనాముఁడపహృతాఖిలాఘు
దాముఁడమలభూషణాళిహేముఁడతులభఁగి రంగ
ధాముఁడచల రం గెసంగఁ దా నొసంగు మంగళంబు.

గ॥ అన్యతో వీక్ష్య సప్రశ్రయమ్॥ 657

వ. మఱొక్కప్రక్క వీక్షించి విశ్వాసంబునుం గావించి.

## శ్రీరంగనాయకీవర్ణనము.

శ్రీరంగనాయకి—ఈమె-శ్రీమన్నారాయణుని యపారకృపాస్వరూపిణి యగుటచేతనే సదా అవిష్ణువక్షస్థలవాసినియే యైయుండుటేకాక, అమృతమథనమపుడు నాక్షీరసాగరకన్యకయు నై లోకమాతయు నౌటచేత సర్వదా వాత్సల్యమున సర్వచేతనసంరక్షణమునకై తనభర్త యైనయావిష్ణువునకె పురుషకారిణిగా నిత్యానపాయినియు నై యున్నయామహాలక్ష్మియే అనారాయణాపరరూపులై యున్నయీ శ్రీరంగనాయకుల కిట్లు దేవి యై శ్రీరంగనాయకి యను తిరునామముతో ప్రశస్త యైయుండునట్టియామె.

శ్లో॥ స్వామినీం నౌమి నీలాబ్జ
మదమోచనలోచనామ్
అంగనాం రంగధామ్నోఽస్య
దీప్తిం మూర్తిమతీమివ॥ 658

అ. నీలాబ్జ-మద మోచన-లోచనాం=నల్లకల్వలయొక్క-గర్వమును - విడిపించు-కన్నులు కలదియై, మూర్తిమతీం=శరీర ధారిణియైన, దీప్తిమివ=కాంతినివలె, స్వామినీం=జగదీశ్వరియైన, అస్య=ఈ, రంగధామ్నః = శ్రీరంగనాథునియొక్క, అంగనాం= స్త్రీయైనమహాలక్ష్మిని, నౌమి=నమస్కరించుచున్నాను.

తా. నల్లకలువలవలె అందమైనకన్నులుకలిగి జగదీశ్వరియైన శ్రీరంగనాయకిని మూర్తిమంతమైన యీరంగనాయకునికాంతినివలె నమస్కరించుచున్నాను.

తే. స్వామినీ! నీకు వేవేప్రణామ మిడెద
మేచకోత్పలదలమదమోచకప్ర
ణద్ధనయనయుగీ! రంగనాయకీ ! స
మిద్ధరంగనాయకమూర్తి సుత్థదీప్తి !

దేవీ ముద్దిశ్య.—అద్దేవి నుద్దేశించి.—

వృ॥ మోహోన్మూలనమూలికా భవజుషాం మోక్షాధ్వనిశ్రేణికా
చేతశ్శుద్ధివిధానసిద్ధగులికా చింతాతమశ్చంద్రికా
విద్యావిభ్రమశాలికాఽసి కమలే విష్ణోః పురోమాలికా
మాత స్త్వం మమపారిజాతలతికా మోదాంబుధే ర్వీచికా॥

అ. హేమాతః=ఓతల్లీ! హేకమలే=ఓమహాలక్ష్మీ! త్వం = నీవు, భవజుషాం=సంసారమును-పాపమును అంటినవారికి, మోహ-ఉన్మూలన - మూలికా = అజ్ఞానమును-మైమఱపును - పెల్లగించుటకై -ఓషధీవిశేషమును, మోక్షాధ్వ - నిశ్రేణికా=ముక్తిమార్గమునకు - నిచ్చెనయును, చేతశ్శుద్ధి-విధాన - సిద్ధగులికా =మనశ్శుద్ధిని-చేయుటకై సిద్ధగుటికయు, చింతాతమః-చంద్రికా=వ్యసనములనెడి యంధకారమునకు-వెన్నెలయు, విద్యా విభ్రమశాలికా=విద్యలకు - విలాసశాలయు, విష్ణోః=విష్ణువునకు, ఉరోమాలికా=వక్షఃస్థలమందలి బంగారు సరముపంటిదియు, మోదాంబుధేః వీచికా=సంతోషసముద్రమునకు -అలయు, మమ=నాకు, పారిజాతలతికా=కల్పవృక్షలతయు, అసి=అయితివి.

తా. ఓతల్లీ! ఓమహాలక్ష్మీ! నీవు సాంసారికులకు అజ్ఞానము తొలగించుచు,

మోక్షమార్గము గలిగించుచు, మనఃపారిశుద్ధ్యము వఱలించుచు, వ్యసనాంధకారము మఱలించుచు, వివిధవిద్యలకును విలాసశాల లై, విష్ణువునకు వక్షోమాల లై, బ్రహ్మానందము నందఁజేయుచు, కల్పవృక్షలతికవలె మాకు సకలాపేక్షలనుఁ సఫలపఱచుచున్నావు కదా ?

సీ. బలుమోహములవ్యూహములను నున్మూలన
మును జేయుమూలిక యె మొలకె యనఁగ
విపులమోదముఁ జూపు విమలమోక్షముఁ జూపు
సరణికి నిశ్రేణికరణి యనఁగ
బద్ధచేతనులకు నిద్ధచేతశ్శుద్ధి
నలవఱిచెడిసిద్ధగుళిక యనఁగ
మంతు కెక్కినవింతచింత లన్నీకటి
ప్రకరంబునకును జంద్రిక యనంగ
తే. సకలవిద్యల విభ్రమశాలిక యన
విశ్రుతాశ్రితులకు హర్షవీచిక యన
నలరి హరి యురోమాలిక యయినసీవు
సతతౌ మైత్రి మాకిలఁ బారిజాతలతిక.

కృశానుః — కృశానుఁడు —

శ్లో॥ కాంత్యేవ హంత ! వృత్త్యాపి
కమలా మతిచంచలామ్
అశిష్టేష్వేవ రజ్యంతీ
మభిష్టౌతి కథం బుధః॥ 660

అ. కాంత్యాఇవ=కాంతిచేతవలె, వృత్త్యాపి=నడవడిచేతఁగూడ, అతిచంచలాం=మెఱుమును మించినదియు-మిక్కిలిచంచలగుణము కలదియునై, హంత=అయ్యో ! అశిష్టేష్వేవ=శిష్టులుకానివారియందే, రజ్యంతీం=రంజిలుచున్న,

కమలాం=లక్ష్మిని, బుధః=జ్ఞానియైనవాఁడు, కథం=ఎట్లు, అభిష్టౌతి = స్తుతించుచున్నాఁడు ?

తా. కాంతితోమాత్రమే కాక, శీలములోఁగూడ మెఱుమువలె చాంచల్యగుణముతో, సామాన్యులనుగూడ రంజిలఁజేయుచుండునట్టి యీలక్ష్మి నెవఁడు బుద్ధిమంతుఁడైనవాఁడు స్తోత్రముచేయుచుండును ?

తే. కాంతిచేఁ గాక వృత్తిచేఁ గీ గమలఁ గనఁగఁ
జంచలగఁ జాచలాక్షిగ కీ నెంచ మించి
శిష్టులనుగా కశిష్టులః కీ జిత్త ములరఁ
జేయుదానిని బుధుఁ డెట్లు కీ చేయు స్తుతుల.

తథాహి.—అదిసరే ?—

వృ॥ ప్రాక్పర్యంక మధిష్ఠితో మణిమయం పాలాశశయ్యామపి
ప్రాయః ప్రార్థయతే కదన్నమివ యఃక్షీరౌదనం దృష్టవాన్
ప్రాశ్నాత్యేష కదుష్ణికా మమృతవత్ప్రాగాత్తపీతాంబరః
కంథాం యాచతి భృత్యవత్ క్షితిపతి ర్లక్ష్మీకటాక్షాత్యయే॥

అ. యః=ఏ, క్షితిపతిః=భూపతి, ప్రాక్=మునుపు, మణిమయం = రత్నమయమైన, పర్యంకం=పడకను, అధిష్ఠితః=ఎక్కియుండినవాఁడో, సఏషః = ఆయితఁడు, లక్ష్మీకటాక్షాత్యయే = లక్ష్మీకటాక్షముయొక్క విడుపునందు, ప్రాయః=బహుగా, పాలాశశయ్యామపి=ఆకుపడకనుగూడ, ప్రార్థయతే=కోరుచున్నాఁడు, యః=ఎతఁడు, ప్రాక్=మునుపు, క్షీర-ఓదనం=పాలయన్నమును, కదన్నమివ=శ్రేష్ఠాన్నమునువలె, దృష్టవాన్=చూచినవాఁడో; సః=అతఁడు, కదుష్ణికాం=చక్కనిగంజిని, అమృతవత్=అమృతమునువలె, ప్రాశ్నాతి=త్రాగుచున్నాఁడు, యః=ఎతఁడు, ప్రాక్=మునుపు, ఆత్తపీతాంబరః=ధరింపఁబడిన బంగారువస్త్రము కలవాఁడో; సః=అతండు, భృత్యవత్ = పనివాఁడువలె, కంథాం=కంతను, యాచతి=అడుగుకొనుచున్నాఁడు.

తా. లక్ష్మీ [illegible] లపడకయు

న్నను; ఆలక్ష్మీకటాక్షము లేనపుడు ఆకులపడకయే యుండును. అట్లే మునుపు పాలన్న ముండినను; వెనుక గంజియన్నమే అమృతమువలె నుండును. అట్లే మునుపు పట్టుపీతాంబర ముండినను; వెనుక కంతయే యుండును.

తే. మొదల మణిశయ్య, దళశయ్యకే తుదఁ బరుఁగు
మొదలఁ బాలోగిరము, గంజికే తుద వరించు
మొదలఁ గనకాంబరము, గంతకే తుద ధరించు
లక్ష్మి గనుఁగొన్న వెనుగొన్నఁకే దక్షిణమున.

గ॥ అన్యచ్చావధేయమ్॥ 662

వ. మఱియు నొకటి వినుము.

వృ॥ దాతు ర్ద్వారియఏష వారణ మగా త్తద్ద్వార్యహో వారణం
పశ్యత్యద్య చిరా ద శేత భువి యో భూ స్తస్య శేతే భుజే
నాహారానపి లేభిరే యదబలా హారా నమూ స్తత్ప్రియా
విందం తే కమలాదృగూర్మిభి రహో నిమ్నో భవత్యున్నతః॥

అ. యః=ఎవఁడు, దాతుః=దాతయొక్క, ద్వారి = కడపలో, వారణం= నివారణమును, అగాత్ =పొందెనో; తద్ద్వారి=ఆదరిద్రునివాఁకిట, ఏషః=ఈ దాత, వారణం=నివారణముగా-ఏనుఁగును, పశ్యతి=చూచుచున్నాఁడు. యః= ఎవఁడు,చిరాత్ =చాలాకాలముగా,భువి=నేలలో,అశేత=పండుకొనెనో;తస్య =వానియొక్క, భుజే=భుజమందు; భూః=భూమి, అద్య=ఇపుడు, శేతే=పండు కొనుచున్నది, యదబలాః=ఎవరి స్త్రీలు, ఆహారానపి = ఆహారములనుగూడ, నలేభిరే=లభింపరో, అమూః = ఈ, తత్ప్రియాః = వారిప్రియురాండ్రును, హారాన్ =హారములను, విందంతే=లభించుచున్నారు. కమలాదృగూర్మిభిః= లక్ష్మీకటాక్షతరంగములచేత,నిమ్నః=తక్కువైనవాఁడుకూడ, ఉన్నతః=ఎక్కు వైనవాఁడు, భవతి=అగుచున్నాఁడు, అహో=ఆశ్చర్యము!

తా. ధనవంతుల వాఁకిట దరిద్రులు రానీయఁబడకున్నను, లక్ష్మీకటాక్షము కలిగినపుడు, ఆదరిద్రులు తమవాఁకిట ఏనుఁగులు నుండునంతటి ధనవంతు లగు

దురు. అట్లే, నేలనే పండుకొనువారును తమభుజబలముచేత నేలనంతయుఁ బాలించుచుందురు. అట్లే ఆహారమే అందని స్త్రీలుకూడ ముత్యాలహారాలు కలవారౌదురు. ఇట్లే ఎంతనీచుఁడైనను; ఎంతో యున్నతుఁ డగును.

ఉ. వారణమే దరిద్రునకు కే వారణ మాతనిద్వారమంద యే
ధారుణిఁ బండు నెవ్వఁ డలకే ధారుణి యాతనిబాహువందయా
హారము లేనిదేవి సతి కే హార మురంబున వేయుఁ గుల్కియా
హా! రమణీక్షణోర్మికల కే నవ్వడెనిమ్నుఁడునున్నతుండగున్.

గ॥ పునరిదం చ బోద్ధవ్యమ్. ఇతి శ్రియ ముద్దిశ్య॥ 664

వ. మఱియు నిదియొకటి విను మని యుద్దేశిన యుద్దేశించి.

వృ॥ హంతు ర్బంధుజనాన్ ధనార్థమనఘాన్ గంతుః పరస్త్రీశతమ్
రంతు ర్జంతువిహింసకై స్సహ జనై స్సంతుష్యతో వంచనైః
వక్తు స్తీక్ష్ణ మయుక్తమేవ వచనం పక్తు ర్మితం చోదనమ్
నిత్యం నృత్యసి మందిరేషు కమలే! క్వత్యం తవైతన్మతమ్॥

అ. ధనార్థం=ధనముకొఱకై, అనఘాన్=నిర్దోషులైన, బంధుజనాన్=చుట్టములను, హంతుః=పడఁగొట్టువానియొక్కయు; పరస్త్రీశతం=నూఱుపరస్త్రీలను, గంతుః=పొందువానియొక్కయు; జంతువిహింసకైః=జీవహింస చేయునట్టి, జనైస్సహ=జనులతోఁగూడ, రంతుః=క్రీడించువానియొక్కయు; వంచనైః= మోసములచేత, సంతుష్యతః = సంతోషపడువానియొక్కయు; అయుక్తం=యుక్తముకాని, వచనం=మాటను, తీక్ష్ణమేవ=తోడనే, వక్తుః=చెప్పెడువానియొక్కయు; మితం=కొద్దియైన, ఓదనం=అన్నమును, పక్తుశ్చ=వండువానియొక్కయు; మందిరేషు=ఇండ్లలో, హేకమలే=ఓలక్ష్మీ! నిత్యం=ఎప్పుడును, నృత్యసి = ఆడుకొనుచున్నావు. తవ=నీయొక్క, ఏతత్=ఈ, మతం=అభిప్రాయము, క్వత్యం=ఎక్కడిది?

తా. ఓలక్ష్మీదేవీ! నీవు లోకములో ధనముకొఱకై యెంతోయోగ్యులైన చుట్టములనుగూడఁజెడఁగొట్టుటయు,ఎందఱుపరస్త్రీలనైనఁజెడఁగొట్టుటయు,

జీవహింసకులతోఁ గూడుకొనుటయు, మోసగాండ్రతోఁ జేరుకొనుటయు, ఎప్పుడు చెడుమాటలాడుటయు, ఇతరులకుఁగాక తనపొట్టకే వండుకొనుటయు ఇట్లియుక్తకార్యములే చేయువారలయిండ్లలోఁ గూడ ఆడుకొనుచుండెదవు. నీకిట్టినడవడిక యెక్కడినుండి వచ్చినదో? తెలియదు.

ఆ. బంధుహింసకులయు జంతుఘాతకులయుఁ
బరవధూపరుల నబద్ధపరుల
వంచకులయుఁ దమకె పాచకులయు నిండ్ల
నృత్య మిూ కభీష్టకృత్యమోక ?

అన్యచ్చ.—మఱియు.—

వృ॥ యేషా మన్యకళత్ర దర్శనకళా వ్యుత్పత్తిశూన్యే దృశౌ
మూఢం హృచ్చపరార్తిచింతనవిధౌ మిథ్యానభిజ్ఞం ముఖమ్
అప్రజ్ఞాతపశూ౯ బుభుక్షితశిశూ నభ్రోదకై స్తామ్యత
స్తేషాం లక్ష్మి! గృహా౯ దృశా భవసరిన్నావేహ నావేక్షసే॥

అ. యేషాం=ఎవరియొక్క, దృశౌ=కన్నులు, అన్యకళత్ర-దర్శనకళా-వ్యుత్పత్తిశూన్యే= పరదారలను-చూచుటనెడికార్యమునందు-తెల్విహీనములైనవో; హృచ్చ=హృదయముకూడ; పరార్తి-చింతనవిధౌ=ఇతరులకష్టములను ఆలోచించుకార్యమందు, మూఢం=తెలివిలేనిదియో; ముఖం=మొగము, మిథ్యా-అనభిజ్ఞం=అబద్ధమును-తెలియనిదియో; అప్రజ్ఞాతపశూ౯=తెలియఁబడనిగోవులను, బుభుక్షితశిశూ౯= ఆఁకలిగొన్నబిడ్డలను౯, అభ్రోదకైః=మబ్బునీళ్ళతో, తామ్యతః = అణఁచుచున్న, తేషాంగృహా౯ = వారియిండ్లను, హేలక్ష్మి!=ఓలక్ష్మిదేవీ! ఇహ=ఇక్కడ, భవసరిత్-నావా=సంసారమనెడియేటికి-ఓడవంటిదైన, దృశా=నీచూపుతో, న+అవేక్షసే=చూడవు ?

తా. ఓలక్ష్మిదేవీ! నీ వాపరదారలను జూడనైనఁ గోరనిచూపులును, పరుల కష్టములను తెలిసికోలేనిమనసును, అబద్ధమాడనినోరును, పశువులకైన శిశువులకునైన పెట్టలేని లేమిడియును గలవారి యొక్క వాననీళ్ళకును జెడిపోయెడి యిండ్లను కండనైనఁ జూడవేమి?

ఆ. పరకళత్రచింత పరదుఃఖచింతయుఁ
గల్ల సుంత లేక కలిమి లేక
పనుల నిసులతోఁస పిసవాన గలయింట్లఁ
జూడనేల ? పోలఁ జూడు లక్ష్మి!

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సఖే ! మానసఖేదజననీ తవేయం వాణీ యతః; ఏతాదుశ్శీలే
షున్మృశ్యమానాః సాధుజనానుపయుక్తాః సంపదాభాసాః,
ప్రత్యుతమృత్యుతరణకారణభువనజననీకృపాకటాక్షవైధుర్య
నిబంధనాఏవ ఉక్తంహి గుణహానే రుదధినుహిత్ర వైముఖ్య
నిబంధనత్వ ముచితజ్ఞేవ నముచిద్విషా॥ 667

వ. సఖా ! నీపలుకిది నామనఃఖేదము పలుకె యగుచున్నది. ఈ కుసంపద లాకుశీలురయందుఁ గనఁబడునవియైనను, సజ్జనుల కనుపయుక్తములె యవు ; కావున నవి విచారింప సంసారము తరింపఁ గారణంబులగు నాలక్ష్మీకటాక్షంబులు కలుగమియెఫలముగా కలిగించునవి యవు. ఇది యుచితజ్ఞుఁడైన నముచిఘ్నునిచే నాసుశీలాది సుగుణజాతంబులు దోషీభూతంబులగుటకు లక్ష్మీకటాక్షవైముఖ్యమె ముఖ్యకారణంబుగఁ బ్రఖ్యాపింపఁబడియె.

ఇ. నముచిఘ్నుఁడు = ఇంద్రుఁడు—ఇతఁడు ఐరావతముపై వచ్చుచుండ దుర్వాసుఁడొకానొకఁడు తెచ్చియిచ్చిన పుష్పమాలిక తనకిచ్చినందునం దానిం దనగజేంద్రముగండస్థలముమీఁద పెట్టివేయఁగా, అది దానిఁ దనతొండముతోఁదీసి విచ్చఁపుచ్చె; చండకోపనుండైనయామునిదానిఁగని లక్ష్మీప్రసంబైన యిదియిట్లు చేసెనందున నీపాలించులోకంబులందు లక్ష్మి నివసింపకుండుఁగాకని శపించె. అపుడు లక్ష్మి అదిర్భవింపక, యజ్ఞాదులు సంభవింపకయె, బ్రహ్మాదిదేవ

తలు హవిర్భాగములు దొరకమికిం జింతించి సంస్తుతించిన, సంతసించినయాలక్ష్మి మఱల సకలలోకహితముకొఱకుఁ బ్రాదుర్భవించి యాదేవేంద్రునిచేతను బ్రశంసింపఁబడినయామె.—ఇది విష్ణుపురాణోక్తము.

శ్లో॥సద్యో వైగుణ్య మాయాంతి
శీలాద్యా స్సకలాగుణాః
పరాఙ్ముఖీ జగద్ధాత్రి
యస్య త్వం విష్ణువల్లభే॥ 668

అ. హేవిష్ణువల్లభే! ఓమహావిష్ణువునకు బ్రియమైనదానా? హేజగద్ధాత్రి! ఓలోకమాతా! త్వం=నీవు, యస్య=ఎవనికి, పరాఙ్ముఖీ= అభిముఖురాలుకాకపోతివో; తస్య=వానియొక్క, శీలాద్యాః=సౌశీల్యము మొదలైన, సకలాః=సమస్తమైన, గుణాః=గుణములు, సద్యః=అప్పుడే, వైగుణ్యం=విరుద్ధగుణత్వమును, ఆయాంతి=పొందుచున్నవి.

తా. ఓలోకమాతా! ఓమహాలక్ష్మీ! నీవెవనివిషయములో మొగము ద్రిప్పికొందువో; వానిసకలసద్గుణములును అప్పుడె విఫలములై పోవును గదా?

క. శీలము లోనగు సుగుణము
లోలిం గొఱ గాదు గావె? శ్రీయోలక్ష్మీ! యో
లోలాక్షీ! లోకావన
లోలుప! వానికి నెవని విశ్రలోకింప విలన్.

తతశ్చ.—తర్వాతను.—

శ్లో॥సంపత్తిః కింపచానానాం
సంప్రాప్తా కాపథేన యా
నరకానుభవోదర్కా
న సా లక్ష్మ్యాః కృపాఫలమ్॥ 669

అ. యాసంపత్తిః=ఏసంపద, కింపచానానాం=అల్పులకు, కాపథేన=అక్రమమార్గముచేత, సంప్రాప్తా=పొందఁబడినదో; నరకానుభవ-ఉదర్కా = నర

కానుభవమే ఉత్తరఫలముగాఁగల, సా=ఆసంపద, లక్ష్మ్యాః=లక్ష్మీదేవియొక్క, కృపాఫలం=కృపకు ఫలము, న=కాదు.

తా. అల్పులు అక్రమమార్గమున సంపాదించుసంపద నరకానుభవమునకే కలుగుఫలము గాని, లక్ష్మీకటాక్షఫలము కానేరదు.

క. చలచిత్తులసంపత్తులు
చెలఁగుం గద? కాపథంబుచే నయిన న్ని
చ్చలు నగకోదర్కంబులె
సలలితలక్ష్మీప్రసాదసఫలత లేమిన్.

తథాహి.—అది సరే.

వృ॥ ధన్యంమన్యతయా తృణీకృతబుధా ధర్మేషు దుర్మేధసః
సేర్ష్యా స్తామసపుణ్యలేశవిలసత్సంపల్లవాః పల్లవాః
పంచాసూ నపహాయ పంచషదినై రాకల్ప మల్పా ఇమే
భోక్ష్యంతే బత! యాతనాబహువిధాః కార్తాంతగర్తాంతరే॥

అ. తామస-పుణ్యలేశ-విలసత్-సంపత్ లవాః=తమోగుణసంబంధి యైన-అణుమాత్రపుణ్యముచేత-ప్రకాశించెడు-అణుమాత్రసంపద గలవారై, ధన్యంమన్యతయా = తమ్ము తాము ధన్యులఁగా నెన్నుకొనుటచే, తృణీకృతబుధాః=తృణముగాఁ జేయఁబడినపెద్దలు గలవారును, దుర్మేధసః=దుర్బుద్ధి కలవారును, ధర్మేషు=ధర్మకార్యములలో, సేర్ష్యాః=ఈర్ష్య కలవారునైన, ఇమే=ఈ, అల్పాః=నీచులగు, పల్లవాః=విటులు, పంచషదినైః = అయిదాఱుదినములలో, పంచాసూన్=పంచప్రాణాలను, అపహాయ=విడిచి, కార్తాంత-గర్తాంతరే=యమసంబంధియైన-పల్లమునడుమ, బహువిధాః=అనేకవిధములైన, యాతనాః=తీవ్రవేదనలను, ఆకల్పం=కల్పాంతమువఱకు, భోక్ష్యంతే=అనుభవింపఁగలరు. బత! =అయ్యో!

తా. తమోగుణము గలిగియు, అణుమాత్రముపుణ్యముచేత కొంతసంపత్తు కలిగియు; తమును కృతార్థులనుగా నెంచుకొని, పెద్దలను లక్ష్యముచేయక దు

ర్బుద్ధితో నీచులై ధర్మదూషకులునై ప్రాణాలువిడిచి చాలాకాలము అనేకవిధములైన నరకబాధ లనుభవింపఁగలరు అయ్యో !

తే. తాము ధన్యుల మని యెన్ని కీ ధర్మవిదులఁ
దృణముగా నెంత్రు, ధర్మంబుకీలను గృతేర్ష్య
లలమి సంపల్లవులు పల్లకివులు చరింత్రు
ప్రాణములు వీలి యాతన కీల్పలువితాలఁ
గుములికార్తాంతగర్తాంతకీరమునఁ గాంత్రు.

గ॥ యచ్చ భణితం భవతా తత్ర భవత శ్శిష్టాన్ లక్ష్మీ ర్నవిందత ఇతి తదజ్ఞానోపజ్ఞ మవజ్ఞాతు మేవార్హామ్ యత స్సాధుజనేభ్యో ముక్త్యైశ్వర్యపర్యంతనిరంతర భగవద్భక్తిసంపదం సంప్రదదతే మూరాపాస్తతమోవికారా వారాశిదుహితురుదారాః కటాక్షా స్సాధుసుధాధారాః॥ 671

వ. విశిష్టు లగుశిష్టులను సయితము లక్ష్మి సమీక్షింప దని "యేషా మన్యకళత్ర" మనువృత్తముచేత నది నీచెప్పినదియొ? యది నీయజ్ఞానోపజ్ఞ మని తెలియఁదగినవి; లక్ష్మీకటాక్షములు సాధుతరసుధాధారలవలె సాధుజనులకుఁ దమోవికారములు దొలఁగించి నిరంతరనిర్వాణైశ్వర్యపర్యంత మైనభగవద్భక్తి యనుసంపత్సమృద్ధిసిం గలిగించుచుండునవి.

టి. భణితం = చెప్పినమాట, అజ్ఞాన-ఉపజ్ఞం = తెలివిలేమికి-ముఖ్యకారణమునుగా.

వృ॥ సంభోగారంభజృంభన్మదకితవపరీరంభసంపీడ్యమాన
ప్రౌఢస్త్రీరత్నహారప్రశిథిలగుణవద్భంగురా స్సంపదోఘాః
సాధూనాం మాస్మభూవన్ సురపురనిరసీకారిదక్షింహిలోకే
భోక్ష్యంతే మోక్షమంతే స్థిరనిరవధికానందధారాత్మకంచ॥

అ. సంభోగ-ఆరంభ-జృంభత్- మద-కితవ-పరీరంభ-సంపీడ్యమాన-ప్రౌఢ స్త్రీ-రత్నహార-ప్రశిథిల-గుణవత్ -భంగురాః = సంభోగమునకు-ఆరంభములో - విజృంభించెడు-మత్తుతోఁగూడిన -ధూర్తులయొక్క-కౌఁగిలిచేత-నలుపఁబడెడు- ప్రౌఢస్త్రీలయొక్క-రత్నాలసరములలోనుండి-జాఱిపడెడు-త్రాడువలె- (గుణమువలె)-తునిఁగిపోయెడునవియైన, సంపత్ ఓఘాః=సంపదలసమూహములు, సాధూనాం=సత్పురుషులకు, మాస్మభూవన్ =కలుగవు, తే=వారు,లోకే=లోకమందు, సురపుర-నిరసీకార-దీక్షం=స్వర్గలోకమును-నిరసించుటయందు- సమర్థమైనదియు,స్థిర-నిరవధిక-ఆనందధారా-ఆత్మకం=స్థిరమై-అత్యంతమైన-ఆనందధారయే స్వరూపముగాఁగలదియునైన, మోక్షం=మోక్షమును,అంతే=అంతిమకాలమందు, భోక్తుం తేహే=అనుభవింపఁగలవారు కదా ?

తా. పతులగాఢాలింగనములచే తునిఁగిపోయిన ప్రౌఢాంగనలహారాలవలె అస్థిరములైన సంపదలు లక్ష్మీకటాక్షములేని పురుషులకు చేరకున్నను ; ఆపురుషులు స్వర్గాద్యానందములకంటె మించి నిత్యానందస్వరూపమైన మోక్షమును తమయంత్యకాలమున అందఁగలవారే కదా ?

మాలిని. రతిముఖపరిరంభారంభజృంభన్మదోద్య
త్కితవదృఢతరోరఃఖేటపాటద్వధూటీ
ధుతకుచతటహారోన్ముక్తముక్తాగుణశ్రీ
లతిసురపురు లందర్ హార్యపేక్షుల్ ముముక్షుల్॥

దండాన్వయము:—సురతారంభమందలి కౌఁగిళులయారంభములతో విజృంభించెడి మత్తుచేత రేఁగుచుండు ధూర్తులదృఢతరము లైన వక్షోవాటికలచే పగులు పాఱుచున్న స్త్రీలయొక్క యెగురఁగొట్టఁబడెడి బొమ్మలలోని హారాలలోనుండి ఏడిపోయిన ముత్యాలదారాలవలె అస్థిరము లైన సంపదలను స్వర్గములను గూడ మీఱినవారై యాహరియందలిభక్తియుఁ గలవారై మోక్షమం దాసక్తి కలవారు అందనే అందరు.

కించ.—మఱియు—

వృ॥ లక్ష్మీకటాక్షపూరః
సజయతి యదుపచయ తారతమ్యేన
నరసురపశుప్రజానాం
పతయ స్స్యుర్హంత! జంతవః కేఽపి॥ 673

అ. యత్-ఉపచయ-తారతమ్యేన = ఏలక్ష్మీకటాక్షముయొక్క- అభివృద్ధియొక్క-ఎచ్చుతక్కువచేత, కేఽపి=కొన్ని, జంతవః=జంతువులు, నర-సుర-పశు-ప్రజానాం = నరులకును-సురలకును- పశువులకును- ప్రజలకును, పతయః= పతులు, స్యుః=అయిరో; సః=ఆ, లక్ష్మీకటాక్షపూరః=లక్ష్మీకటాక్షముయొక్క సంపూర్ణత, జయతి=సర్వోత్కృష్టముగా నున్నయది, హంత=ఆహా!

తా. లక్ష్మీకటాక్షవిశేషముచేత నేకదా? కొన్నిప్రాణులు నరపతి యగు రాజుగాను, సురపతియగు ఇంద్రుఁడుగాను, పశుపతియగు రుద్రుఁడుగాను, ప్రజాపతియగు బ్రహ్మగాను నైయున్నయది; ఆశ్చర్యము!

ఆ. లలిని నిలను వెలయు లక్ష్మీకటాక్షముల్
తదభివృద్ధితారతమ్యకలన
నరులపశులప్రజలసురలనాథులై యౌను
వింత! వింతజంతుసంతతియును.

కృశానుః.—కృశానువు.—

సూ॥ "కమలాకటాక్షాతిశయో విభవోపచయహేతుః" ఇతి నోపపద్యతే యతి స్తదల్పీయ స్త్వమేవ సంపదుత్కర్షసంపాదకమ్॥ 674

వ. లక్ష్మీకటాక్షాతిశయ మైశ్వర్యాతిశయమునకు హేతు వనుట రీతి కాదు; అది సంపదతిశయమునకు సంపాదక మయిన, నల్పీయమే యగును.

తథాహి.—అది సరే ?

వృ॥ గజశిబికాతురగాః స్యు
ర్నరస్య తన్వ్యా దృశా హరే స్తన్వ్యాః
తద్భూమ్ని భవతి వాహో
నీరద ఉక్షాచ హంత ! పక్షీచ॥ 675

అ. హరేః=విష్ణువుయొక్క, తన్వ్యాః= స్త్రీయైనలక్ష్మియొక్క, తన్వ్యా= అల్పమైన, దృశా=చూపుచేత, నరస్య=మనుష్యునికి, గజశిబికాతురగాః=ఏనుఁగు పల్లకి గుఱ్ఱములు, స్యుః=వాహనములైనవి; తత్ భూమ్ని =ఆచూపులయతిశయమందు, నీరదః= మేఘము-పండ్లులేనిదియైన, ఉక్షాచ=ఎద్దును, పక్షీచ=పక్షియును, వాహః=వాహనము, భవతి=అగుచున్నది. హంత = ఆశ్చర్యము!

తా. లక్ష్మీకటాక్షము స్వల్పమైనపుడు ఎవరికిఁగాని, ఏనుఁగు డోలి గుఱ్ఱము వాహనములైనను, ఆలక్ష్మీకటాక్షము అత్యధికమైనపుడు వారు మేఘము వాహనమైన యింద్రుఁడుగాను, వృషభము వాహనమైనయీశ్వరుఁడుగాను, హంసపక్షి వాహనమైనబ్రహ్మగాను అగుదురు; ఆశ్చర్యము !

తే. సరగ లక్ష్మీకటాక్షలేశమున జనులు
గారు దేగు వారువముగాఁ గాంత్రు దాని
యతిశయంబునఁ గాంత్రు వాహనము గాఁగ
మబ్బు గిబ్బయుఁ బక్కియు మాట లేల ?

టి. గారు=ఏనుఁగు. వారువము=గుఱ్ఱము, గిబ్బ=ఎద్దు, పక్కి =అంచపక్షి.

ఇ. మేఘవాహనుఁడు=ఇంద్రుఁడు. ఇతఁడు అదితికశ్యపుల పుత్రుఁడు, శచీదేవి పెనిమిటి, జయంతునితండ్రి, స్వర్గలోకమున అమరావతీరాజధానియందు దేవతలకు రాజై అష్టదిక్పాలకులలో తూర్పుదిక్పాలకుఁడును, ఐరావతము ఉచ్చైశ్శ్రవము వజ్రము నందనము, వరుసగా ఏనుఁగు గుఱ్ఱము ఆయుధము ఉద్యానవనమునుగాఁ గలవాఁడు నైనవాఁడు.

వృషభవాహనుఁడు=ఈశ్వరుఁడు. 292 వృత్తములో శంభువు—చూడు.

హంసవాహనుఁడు=బ్రహ్మ. ఇతఁడు—శ్రీమన్నారాయణుని నాభికమలమం దు జన్మించి త్రిమూర్తులలో నొకఁడై జగత్సృష్టిస్థితిసంహారములలో సృష్టికర్తయు, సరస్వతీదేవికి పెనిమిటియు, తనమానసపుత్రులైన మరీచ్యత్ర్యంగిరసాది నవబ్రహ్మలకును సనకసనందన నారదాది పరమజ్ఞానసంపన్నులకును తండ్రియునై మఱియు తనఛాయనుండి కర్దమప్రజాపతిని తనభ్రూమధ్యమునుండి అర్ధనారీశ్వరుఁడైనరుద్రునిఁ బుట్టించి సత్యలోకాధిపతియైనట్టిచతుర్ముఖబ్రహ్మ.

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ విహస్య, ఈదృశీ ముత్కర్షపిశునా మరవిందాలయాయా నిందా మభినందామి॥ 676

వ. విహసించి, యిట్టివిశేషసూచకమైన నీరజనిలయ నిందావాచకమును సయితి మభినందించుచున్నాను.

వృ॥కిం దర్పదాయకధనోపచయప్రమత్తైః
కందర్పసాయకహతైః క్షితిపైరిహేతి
సంతఃపురందరనుతం త్వరవిందనాభే
రంతఃపురం తదవనా వనుచింతయంతి॥ 677

అ. సంతః=సత్పురుషులు, దర్పదాయక-ధన-ఉపచయ-ప్రమత్తైః=గర్వము నిచ్చునట్టి-ద్రవ్యముయొక్క-అభివృద్ధిచేత-మదించినవారును, కందర్పసాయక-హతైః=మన్మథబాణములచే-కొట్టఁబడినవారునైన, క్షితిపైః=రాజులచేత, ఇహతు=ఈలోకములోనో, కిం=ఏమిప్రయోజనము? ఇతి=అని, తదవనౌ=వారిభూమియందు, పురందరనుతం=దేవేంద్రునిచే వినుతింపఁబడిన, అరవిందనాభేః అంతఃపురం=పద్మనాభుని-అంతఃపుర స్త్రీయైన మహాలక్ష్మిని, అనుచింతయంతి=ధ్యానముచేయుచున్నవారు.

తా. ధనదర్పితులై మన్మథబాణహతులైన యీలోకపు రాజులవలన మనకేమి ఫలము కలదు ? అయీమూఁడులోకములకు నధిపతియైన దేవేంద్రునిచే

తనే పొగడఁబడుచుండెడి యీమహాలక్ష్మినే సకలసత్పురుషులును పొగడు చున్నవారు.

తే. దర్పజనక ధనకత కంతెదర్పవశత
కలిగి చెలరేఁగుతేఁడులఁ కె గనక, ఘనులు
దనర నరవిందనాభునంకెతఃపురము నె
సంతతమును జింతింతురు కె సంతరింప.

గ॥ పున రనుధ్యాయ సాంజలిబంధమ్ దేవీ ముద్దిశ్య॥ 678

వ. మఱల ననుధ్యానించి యంజలియు బంధించి యద్దేవిన యుద్దేశించి.

వృ॥మాత స్తే మధుసూదనప్రణయిని ప్రాత స్సరోజచ్ఛటా
ముష్టీముష్టివిచక్షణే శుభగుణే దృష్టీ నమస్కుర్మహే
అష్టాభిః కిల దృష్టిభిశ్చ తిసృభి ర్జుష్టా స్సహస్రేణ వా
దేవా ద్వాదశభిశ్చ యద్విషయతా మేవార్థయం తేక్షణమ్॥

అ. హేమధుసూదనప్రణయిని=ఓవిష్ణువల్లభా! హేమాతః=ఓతల్లీ!అష్టాభిః= ఎనిమిదియు, తిసృభిః=మూఁడును, సహస్రేణవా=వేయును, ద్వాదశభిశ్చ = పంద్రెండునైన, దృష్టిభిశ్చ=కన్నులతోను, జుష్టాః=కూడుకొన్న, దేవాః = దేవతలు, యద్విషయతాంఏవ=ఎవరికన్నులకు తామువిషయముగానే, క్షణం= క్షణకాలమైన, అర్థయంతే=ప్రార్థించుచున్నారో; తే=అట్టినీయొక్క, ప్రాతస్సరోజ-చ్ఛటా-ముష్టీముష్టి-విచక్షణే = ఉదయకాలమందలి తామరలయొక్క-సమూహముతో-ముష్టిపోట్లయుద్ధమందు-సమర్థములై, శుభగుణే=మంగళకరములగు గుణములు కలవైన, దృష్టీ=కన్నులను, నమస్కుర్మహే=నమస్కరించుచున్నాము.

తా. ఓతల్లీ ! ఓవిష్ణువల్లభా ! ఆయెనిమిదికన్నులచతుర్ముఖుఁడును, ఆమూఁడుకన్నుల విరూపాక్షుఁడును, ఆవేయికన్నుల యింద్రుఁడును, ఆపంద్రెండు కన్నుల షణ్ముఖుఁడును ఏయమకన్నులకు తమను విషయమునుగా ప్రార్థించు

కొనుచున్నారో; అట్టినీశుభకరములైన తామరకన్నులను సమస్కరించుకొను చున్నారము.

సీ. తల్లీ ! సుర స్త్రీమణీతల్లీ ! జనార్దన
ప్రణయినీ నీశుభకరప్రదసుదృష్టి
ప్రాతస్సరోజాతజాతద్యుతీతతీ
కలహకృత్కాంతిసంకలితతుష్టి
మూఁడెనిమిదిపదితోడ రెండును వేయి
దృష్టుల దృష్టించు దేవతలును
విషయులుగా నభిలషిత మయ్యెను నొయ్య
దుగదృష్టి యయ్యెను నొగిని నెయ్య
తే. దదియ మానమస్కృతికిని గదియవచ్చి
చేయుసత్కృతికిని బరిష్కృతికి స్తుతికి
విషయ మగుఁగాక యగుజోక వెతయ లేక
యనుచు నెదఁ గోరికొనెద మే మనుదినంబు.

టి. ఒయ్యన్ = మెల్లఁగా, దుగదృష్టి=జంటచూపు, ఒగిని=వరుసగా, అగుజోక=సంతోషము అగును.

గ॥ ఇత్యన్యతో వీక్ష్య సామోదస్॥ 680

వ. అని మఱొకప్రక్క నిరీక్షించి సామోదస్వాంతఁబుగ.

## అందు గరుత్మద్వర్ణనమ్.

ఇ. గరుత్మంతుఁడు—ఈయన-వేదస్వరూపములో విష్ణుపరివర్ధనద్వితీయుఁడై ఆమహావిష్ణువునకే వాహన, ధ్వజములునై యున్నయాయన. ఆయనయే యీశ్రీరంగక్షేత్రమున ధ్వజస్తంభసమీపమందు విభీషణు లయోధ్యనుండి తెచ్చియుంచిన తిరుపగూడతోడి శ్రీరంగనాయకులను వైకుంఠమునకై కొని పోవుటకై [illegible] నిటు.

నటు కదలమెసలకుండునట్లు ఇక్కడి ద్వారసాలకుల చేత కరచరణములందు శృంఖలాబద్ధులై యిప్పుడును కనఁబడుచున్నయాయన. (చూడు 81 పుట.)

వృ॥ఉగ్రరిపు నిగ్రహవ విగ్రహ దివౌక
శ్చ్రక్రవృత శక్రమదవిక్రమ నిహంతా
మోదరస మాదరసమేత ఇహ పూర్ణం
ప్రక్షిపతి పక్షిపతి రక్షియుగలం మే॥ 681

అ. ఉగ్రరిపు-నిగ్రహవ-విగ్రహ-దివౌకశ్చక్ర-వృతశక్ర-మదవిక్రమ-నిహంతా=భయంకరులైన శత్రువులకు-తిరస్కారమునిచ్చునట్టి-యుద్ధముగల-దేవతల సమూహముతో-చుట్టఁబడిన దేవేంద్రునియొక్క-గర్వమును పరాక్రమమునున్-పడఁగొట్టువాఁడును, ఆదరసమేతః=ప్రేమాతిశయముతోఁ గూడినవాఁడునైన పక్షిపతిః=పక్షిరాజైన గరుత్మంతుఁడు, ఇహ=ఇక్కడ, మే=నాయొక్క, అక్షియుగలం=కంటిజంటనుగూర్చి, పూర్ణం=సంపూర్ణమైన, మోదరసం=సంతోషరసమును, ప్రక్షిపతి=ఊఁపుచున్నాఁడు. (ఇందువవనావృత్తము.)

తా. శత్రువులను నిగ్రహించుటకై దేవతలతోఁడఁ గూడియుండు దేవేంద్రునిగూడ అతిక్రమించి అమృతమును దెచ్చిన యాగరుత్మంతుఁ డత్యంతసంతోషముతో మనకన్నులకును సంతోషదాయకుం డగుచున్నవాఁడు.

క. దరదరభటపటల పురం
దరదరకరకరరుహుండు \ ధరధరనాథో
ద్ధరణారణోడ్డమరుమరు
ద్గరుద్గరుత్మంతుఁడు గనఁ \ గనుపండు గిడెన్.

అ. దరత్-అర-భటపటల-పురందరదర-కరకరరుహుండు= అతిశయించుచున్న-వేగము గల-వీరభటులసమూహముతోఁడి-దేవేంద్రునికి భయమును-చేయునట్టిగోళ్లు గలవాఁడును, ధరన్=భూమియందు, ధరనాథ-ఉద్ధరణ-రణ-ఉడ్డమరు-మరుత్-గరుత్-గరుత్మంతుఁడు = పర్వతరాజును-ఉద్ధరించుటకై-యుద్ధ

మందు-డమరువాద్యమును మించిన-గాలితోడి - ఱెక్కలుగల-గరుడుఁడు, కనర్=చూడఁగా, కనుపండుగు=కంటివేడుకను, ఇడెర్=ఇచ్చెను.

కృశానుః—కృశానువు —

గ॥ కిం వర్ణయసి సువర్ణ మమమతిక్రాంత మర్యాదమ్॥ 682

వ. మర్యాదనే మించుచున్న యీసుపర్ణు వర్ణించుచున్నాఁడవేమి?

తథాహి.—అట్లెకదా?

వృ॥అధిగతనిగమాంగోఽపి
ద్విజరాజోఽప్యచ్యుతం దధానోఽపి
నిజగార కథంకారం
నిశ్శంకం భిల్లపల్లికాం గరుడః॥ 683

అ. అధిగత-నిగమ-అంగోపి = పొందఁబడిన-వేదములే స్వరూపముగాఁగల-అవయవములు కలవాఁడయ్యును; ద్విజరాజోపి=బ్రాహ్మణులలోను-పక్షులలోను శ్రేష్ఠుఁడయ్యును; అచ్యుతం=విష్ణువును-మామిడిని, దధానోపి=ధరించువాఁడయ్యును; గరుడః=గరుత్మంతుఁడు, భిల్లపల్లికాం=బోయపల్లెను, కథంకారం=ఎట్లు, నిశ్శంకం=జంకులేక, నిజగార=భక్షించెను?

తా. ఈగరుత్మంతుఁడు "సుపర్ణోసిగరుత్మాన్ త్రివృత్తే శిరోగాయత్రమ్" అని తనసకలావయవములును వేదములుగాను, తాను బ్రాహ్మణశ్రేష్ఠుఁడుగాను, మఱి భగవానునికి సదా వహించువాఁడుగాను నుండియు; జంకులేక తా నా బోయపల్లె నెట్లు భక్షించువాఁ డయ్యెను?

ఆ. అచ్యుతాశ్రితుండు సనధిగతశ్రుతికుండు
విశ్రుతుం డితండు ద్విజనరుండు
పూర్ణతరతనూనుసవర్ణనుపర్ణుఁ డా
బోయపల్లె [illegible]

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ పక్షిరాజస్య భిల్లపల్లీనిగరణే సాధుజనానుగ్రహో సాధుజన నిగ్రహసామర్థ్యం సదసద్వివేచనచాతుర్యంచ విజృంభితం తత్కథం భూషణమేవ దూషయతి భవాన్॥ 684

వ. పక్షిపుంగవుఁడా బోయపల్లియ మ్రింగెడువిషయమున సాధుజనుల ననుగ్రహించుటయందును, అసాధుజనుల నిగ్రహించుటయందును సామర్థ్యము, ఇది సత్తిది యసత్తను వివేచనమునందుఁ జాతుర్యమును విజృంభింపఁబడినయది; అది యెట్లు దూషణమే యగును? నీవు దాని భూషించుచునే యున్నావు.

శృణు.—వినుము.—

వృ॥గరుడోగిరన్ కమపి కిల్బిషావిలమ్
ఖలభిల్లజాత ముషితం తదంతరే
నిరజీగల న్నిజగలా దిలాసురమ్
భవతః ప్రపన్నమివ పన్నగేశయః॥ 685

అ. గరుడః=గరుత్మంతుఁడు, కిల్బిషావిలం=పాపములచేత చుట్టఁబడినట్టి, కమపి=ఒకానొక అవాచ్యమైన, ఖలభిల్లజాతం=దుష్టులగు బోయలసమూహమును, గిరన్=మ్రింగుచు, తదంతరే=వారినడుమ, ఉషితం=కలియఁబడియున్న, ఇలాసురం=బ్రాహ్మణుని, నిజగళాత్=తనగొంతునుండి, పన్నగేశయః=శేషశాయియైన విష్ణువు, ప్రపన్నం=ప్రపత్తినిష్ఠుని, భవతః=సంసారమునుండివలె, నిరజీగలత్=వెడలించెను.

తా. ఈగరుత్మంతుఁడు మహాపాపులైనపులిందులనెడి బోయలనందఱను మ్రింగి, వారిలో కలిసికొనియున్న యొకబ్రాహ్మణుని తనకంఠములోనుండి, శ్రీమహావిష్ణువు తనకు శరణాగతుఁడైనవానిని సంసారములోనుండివలె, వెడలఁజేసెను.

తే. గరుడుఁ డఘముల విఘటించి కే పరిఘవిల్లు
భిల్లనికరము గ్రమింగి, లోకేడిల్లవడ, కి
శాత్మజుని నుద్ధరించె గకళాంతరమున
నుండి హరి శ్రితు సంసృతికేనుండిపోలె.

గ॥ హంత ! శకుంతపురందరస్యాస్య స్వచ్ఛందవిహారావసరే ష్వపి
అభంగురమేవ స్వామికైంకర్యమ్॥ 686.

వ. ఆహా ! యీవిహగేంద్రునకు స్వేచ్ఛావిహారసమయములం
దును స్వామికైంకర్య మభంగురకార్యమే.

యతః.——ఏలనిన.——

వృ॥స్వజ్యేష్ఠప్రేర్యహార్యాశ్రితరథఘృణిమన్మండలస్థాచ్యుతాప్యం
సన్మార్గం పక్షవాతోద్గతధరణిరజశ్ఛన్న మేతజ్జవేన
కల్లోలై రుల్లలద్భిః ప్రచలజలనిధేః క్షాలయన్ ఘూర్ణదర్ణః
ప్రేంఖడ్డిండీరఖండచ్ఛలకుసుమకులై ర్మండయత్యండజేంద్రః॥

అ. అండజేంద్రః=పక్షిరాజైన గరుత్మంతుఁడు, పక్షవాత-ఉద్గత-ధరణి రజః-ఛన్నం=రెక్కలగాలిచేత-లేచిన-నేలదుమ్ముచేత-కప్పఁబడినదియు, స్వజ్యేష్ఠ-ప్రేర్య-హారి - ఆశ్రితరథ-ఘృణిమత్ - మండలస్థ-అచ్యుత-ఆప్యం=తన అన్నయైన అనూరునిచేత-ప్రేరింపఁదగిన-గుఱ్ఱములచే-చేర్పఁబడిన రథముగల-సూర్యునియొక్క-మండలమం దుండునట్టి, నారాయణునిచే-చేరఁదగినదియు నైన, సన్మార్గం=మంచిమార్గమును-ఆకాశమును, ఏతజ్జవేన=ఈ గాలివేగము చేత, ప్రచలజలనిధేః=కలఁకఁబాఱుచున్న సముద్రముయొక్క, ఉల్లలద్భిః=రేఁగుచున్న, కల్లోలైః=గొప్పయలలచేత, క్షాలయన్ = ప్రక్షాళించుచు, ఘూర్ణత్-అర్ణః-ప్రేంఖత్-డిండీరఖండచ్ఛల-కుసుమకులైః=తిరుగులాడుచున్న-నీటిలోనుండి-రేఁగుచున్న - నురుగుగడ్డలనెడి నెపముగల-పూలగుములచేత, మండయతి=అలంకరించుచున్నవాఁడు.

తా. ఈగరుత్మంతుఁడు తనఱెక్కలగాలికి రేఁగి నేలదుమ్ము కమ్ముకొని యున్నదని ఆసన్నాగ్రమనెడి యాకాశమును ఆగాలివేగమునఁ గలఁకఁబాఱు సముద్రపుఁగల్లోలములతో బ్రక్షాళించి, పైకి రేఁగు నురుగుగడ్డలచేత పూల గుత్తులచేవలె అలంకరించినవాఁ డాయెను.

మ. అరుణప్రేరితవాజిరాజిరథసూర్యప్రాంతబింబాంతరం
బిరవై భాసిలుశౌరిదారిస్వగరుత్సేవ్యచ్ఛాసముద్గచ్ఛదు
ర్ధురవాతోత్థితభూరిభూరజము నుద్ధూతాబ్ధినిర్ధూతపు
ష్కరగంగత్పృథుభంగసంఘములఁ బ్రక్షాళించి డిండీరఖం
డలసత్పుష్పగుళుచ్ఛముల్నైఅపెడిన్ కీదాగ్స్యండ పేర్కొ వడిన్.

పున రభిధ్యాయన్.—మఱి స్మరించుచు.—

వృ॥యద్వీక్షా ధైర్యరక్షాంకిలపులకభృతాంధావతాం దైవతానాం
సేవాసమ్మర్ద కాలే గిరిశ ఫణిగణాద్బిభ్యతా మభ్యతానీత్
సోఽయం గాంగేయపృథ్వీధరవరశిఖరచ్ఛాయసచ్ఛాయకాయః
భింద న్బృందం రిపూణాం కలయతు కుశలం ఛాందసో నశ్శకుంతః॥

అ. సేవా-సమ్మర్ద కాలే=భగవత్సేవయందు-ఇరుకుపాటుతోఁడి కాలములో, గిరిశ-ఫణిగణాత్=శివునియొక్క - సర్పసమూహమువలన, బిభ్యతాం=భయపడుచు, పులకభృతాం=గగ్గురుపాటు పొందినవారై, ధావతాం=పరుగిడుచున్న, దైవతానాం=దేవతలకు, యద్వీక్షా=ఏగరుత్మంతుని దర్శనము, ధైర్యరక్షాం = ధీరత్వసంరక్షణమును, అభ్యతానీత్కిల = చేసెనోకదా? సః=ఆ, అయం=ఈ, ఛాందసః=వేదమయుఁడై, గాంగేయపృథ్వీధర-వరశిఖరచ్ఛాయ-సచ్ఛాయ-కాయః=బంగారుపర్వతముయొక్క-మేలైన శిఖరాలఛాయ కలదై-మంచికాంతులు కలదైన-శరీరము కలవాఁడైన, శకుంతః=పక్షిస్వరూపుఁడగు గరుత్మంతుఁడు, రిపూణాం=శత్రువులయొక్క, బృందం=సమూహమును, భిందన్=భిన్నపఱచుచు, నః=మాకు, కుశలం=క్షేమమును, కలయతు=కలుగఁజేయుచున్నాక!

తా. ఈగరుత్మంతుఁ డాభగవంతుని సేవించుటకై వచ్చి, తమతోఁగూడ నుండు నీశ్వరునిశరీరములో భూషణములై యుండు వాసుకి మొదలైన సర్ప రాజులఁ జూచి భయపడుచు, వడఁకుచు, పరుగిడుచుండు దేవతలకుధైర్యము గలుగఁజేయుచును; శత్రువులను పడఁగొట్టుచును; మేరువువలె బంగారుశరీర ములో, వేదస్వరూపముతోను మమ్ము సంరక్షించు చుండుఁగాక!

మ. తనవీక్షన్ ధృతిరక్ష సేయు దితిజారాతిస్పర్థి సేవార్థిదే
వనికాయంబునకున్ దదంతరహరశ్రీవ్యాళావళీభీతినూ
డనిఁ బాడన్ గని తోడ నేతఁ, డతఁడెడత్యష్టాపదాభుండు దా
నొనరించున్ మదరాతిఘాతి గరుడుండెదున్నిద్రభద్రంబొగిన్.

సం. ఏయతఁడు ఆరాక్షసవిరోధి యైన విష్ణువుయొక్క సేవ నపేక్షించెడి దేవతలకు వారలలోపల నీశ్వరునిభూషణము లైన సర్పసమూహములభయము చేత పాఱిపోఁగఁ జూచి, తోన తనకటాక్షమున ధైర్యముతోడి రక్షణముచే యునో; అతఁడు మిక్కిలి బంగారమువలె కాంతికలిగినవాఁడై శత్రుసం హారకుఁడైన తాను గరుత్మంతుఁడు వరుసగా అధికమైనక్షేమమును జేయును గాక!

పున స్సవిస్మయమ్.—మఱి యచ్చెరువడి.—

వృ॥ నగరూప ముపైతి యుక్తమంగీ
కృతశాఖోఽపి సుపర్ణ ఉన్నతోఽపి
విదమైకవిధేయ ఏష చిత్రం
స్థిర మామోఘమధాన్మధోర్విపక్షాత్॥   689

అ. అంగీకృత-శాఖోఽపి=స్వీకరింపఁబడినవియు-అవయవములుగాఁ జేసికోఁ బడినవియునైన-బుజుక్క మొదలైనకళలు - కలవాఁడైనను, సుపర్ణః=మంచి ఆకులు- ఱెక్కలుగలవాఁడు, ఉన్నతోఽపి=పొడవైనవాఁడయ్యును; నగ-రూ పం=వృక్షముయొక్క - మేరుపర్వతముయొక్క-స్వరూపమును, ఉపైతి=పొం దుచున్నాఁడు; [illegible] విచిత్రమైన [illegible] యైన

వినతకు ముఖ్యముగ-అడఁగినవాఁడైన, ఏషః=ఇతఁడు, మధోః=వసంతఋతువుకు-మధు వను రాక్షసునకు, విపక్షాత్=విశేషమిత్రమై-శత్రువైనభగవానుని వలన, స్థిరం=స్థిరమైన, ఆమోదం=వాసనను-సంతోషమును, అధాత్=ధరించెను. చిత్రం=ఆశ్చర్యము! (శ్లేషానుప్రాణిత విరోధాభాసాలంకారము.)

తా. ఋక్శాఖాదివేదాంగములే అంగములుగాను, తల్లియైన వినతకు విధేయుఁడుగాను, మహోన్నతుఁడుగాను, మంచి ఱెక్కలు కలిగినవాఁడుగాను నున్న యీగరుత్మంతుఁడు కొమ్మలతో మహోన్నతమై ఆశ్రితులకు అణఁగినదై యుండు వృక్షమువలె మధురాక్షసునకు శత్రువుగాను వసంతర్తువుకు మిత్రముగాను,నుండుభగవంతునివలనసంతోషమును పరిమళమును వహించుచుండెను.

తే. నగముగతి సుపర్ణుఁడు సమున్నతుఁడు నగుచు
శ్లాఘనంగీకృతాఖిలశాఖుఁ డగుచు
వినతవినతుఁడు నామోదమును లభించె
స్థిరత మధువిపక్షునె కొని చిత్ర మరయ.

గ॥ అథ సర్వతః పురీం నిరీక్ష్య సాంజలిబంధమ్॥ 690

వ. తర్వాత సర్వత్ర పురి నిరీక్షించి యంజలి బంధించి.

వృ॥ శ్రీవల్లభ దాసేభ్యః
శ్రీరంగక్షేత్రనియత వాసిభ్యః
త్రుటితభవత్రాసేభ్యో
నమోస్తు కృతశిష్యధీవికాసేభ్యః॥ 691

అ. శ్రీరంగక్షేత్రనియతవాసిభ్యః = శ్రీరంగదివ్యక్షేత్రమందు నియతముగా వసించువారును, త్రుటితభవత్రాసేభ్యః=త్రుంచివేయఁబడిన పాపములవలని భయముకలవారును, కృతశిష్యధీవికాసేభ్యః=చేయఁబడిన శిష్యులయొక్క జ్ఞానాతిశయము కలవారునైన, శ్రీవల్లభదాసేభ్యః=శ్రీపతిభక్తులకు, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక.

తా. ఈ శ్రీరంగమనెడి దివ్యక్షేత్రమున వాసముచేయుచు, సకల దోషవిముక్తులై, శిష్యులకును జ్ఞానప్రదాతలైయుండు శ్రీవైష్ణవులకు దండప్రణామములు చేయువాఁడను.

క. హరిదాసుల శ్రీరంగ
స్థిరవాసుల రచితశిష్యశేధిభాసుల భా
సురచిత్తవికాసుల ధుత
దురితత్రాసుల నెరంగుకెదును దునుమఁగలిన్.

టి. కలిన్=దోషమును, తునుమన్-త్రుంచుటకై, ఎరంగుదున్ = నమస్కరింతును.

కృశానుః—కశానువు.—

గ॥ సఖే! సర్వా నేతత్పురవా స్తవ్యా న్నాస్మభవా న్నమస్కార్షీత్ ॥ 692

వ. ఈరంగనగరమందు నివసించుకొందఱకు నీవు నమస్కారము కావింపకుము.

శ్లో॥ నిబిడీసగుణస్తోమై
ర్హరిదాసై రలంకృతే
అట్టశూలాః కతిపయే
పట్టణేస్మిన్ ప్రతిష్ఠితాః॥ 693

అ. నిబిడీసగుణస్తోమైః=దట్టములైన సుగుణములసమూహము గల, హరిదాసైః=భగవద్భక్తులచేత, అలంకృతే=అలంకరింపఁబడిన, అస్మిన్ = ఈ, పట్టణే=శ్రీరంగమందు, అట్టశూలాః=అన్నమునమ్మువారు, కతిపయే = కొందఱు, ప్రతిష్ఠితాః=ప్రతిష్ఠింపఁబడియున్నవారు.

తా. ఈ శ్రీరంగక్షేత్రమందుఁ గొందఱుసుగుణసంపన్ను లుండియు, మఱి కొంద అన్నము విక్రయించువారు నున్నవారు.

క. హరిదాసులు గుణభాసులు
నిరతము నీపురిఁ గరంబు కై నివసింతురె, వై
న, రమేశనివేదిత మో
గిరమున నో విలిచికొం(బ్రొ)గిని గొందు అహా!

గ॥ ఇతి నిరూప్య సవిస్మయమ్॥ 694

వ. అని నిరూపించి విస్మయము నతిశయించి.

వృ॥శక్రాద్యర్థం హవిరఘహరం శౌరిణాఽఽస్వాదితం యత్
దత్తం విత్తగ్రహణచపలాః కేఽపి విక్రీణతే తత్
ధామ శ్రీమ ద్యది మధుజితా దీయతే స్వీయ మేతే
నోతృప్స్యంతే ధనకణతృషా తచ్చ విక్రీణతేఽజ్ఞాః॥ 695

అ. శౌరిణా=విష్ణువుచేత, ఆస్వాదితం=ఆరగింపఁబడినదై, అఘహరం=సర్వదోషహరమైన, యత్ హవిః=ఏహవిర్భాగమైనయన్నము, శక్రాద్యర్థం = ఇంద్రాదులకొఱకు, దత్తం=ఈయఁబడినదో, తత్ =ఆయన్నమును, విత్తగ్రహణచపలాః=ధనమును సంపాదించుటయందు చాపల్యగుణముగల, కేపి=కొందఱు, విక్రీణతే=విక్రయించుచున్నారు; మధుజితా=విష్ణువుచేత, శ్రీమత్ = సర్వసంపద్యుక్తమై, స్వీయం=తనదైన, ధామ=పరమపదము, దీయతేయది=ఈయఁబడినదేని, ఏతే=ఈ, అజ్ఞాః=అజ్ఞానులు, నోతృప్స్యంతే=తృప్తిపొందగలవారుకారు. తచ్చ=ఆపరమపదమును, ధనకణ-తృషా=అణుమాత్రమైనధనమునందుఁగూడ-లోభగుణముచేత, విక్రీణతే = విక్రయించుచునే యుందురు (అర్థాపత్త్యలంకారముచేత అలంకారధ్వని).

తా. ఈశ్రీరంగక్షేత్రమందు శ్రీరంగనాథుని కారాధనము చేసి, అనంతర మాయింద్రాద్యావరణదేవతలకు బలిగా అర్పించి, సకలదోషపరిహారక మైన యన్నమును ద్రవ్యచాపల్యముచేత ఇక్కడియజ్ఞులు అమ్ముకొందురుగాని, వీరికా రంగనాథుఁడు తానిచ్చెడు ఆపరమపదమును గూడ ఆద్రవ్యలేశాపేక్షచేతనే అమ్మివేసికొందురే కదా?

ఉ॥ శౌరిసమర్చితాన్నమునె శక్రముఖాదుల కర్పణంబిడన్
దారు తదన్నము ల్ధనము దాఁపఁటికమ్మున కమ్ముకొందు రా
వారికె వారిజేతుఁగుఁడ వారిగ స్వీయపదంబె యిచ్చినన్
వారక దానినిన్ విలిచి వత్తురె విత్తకణంబు కేనిటన్.

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ మందమతే! మైవంభాణీః॥ 696

వ. ఓమందమతీ! ఈచందము పలుకవలదు.

వృ॥ కింకిం నజీర్యతి ముకుందపదారవింద
ద్వంద్వాభివందనకృతామిహ దేహభాజామ్
అత్యద్భుతౌషధవిశేషనిషేవకాణా
మాపాదయేతకి మనర్థ మపథ్యసేవా॥ 697

అ. ఇహ=ఇక్కడ, ముకుంద-పదారవింద ద్వంద్వ-అభివందనకృతాం=భగవానునియొక్క-పాదపద్మ యుగళములకు-ప్రణామములు చేయునట్టి, దేహభాజాం=ప్రాణులకు, కింకిం=ఏమేమి, పాపం=పాపము, నజీర్యతి=జీర్ణించదు? అత్యద్భుత-ఔషధ విశేష-నిషేవకాణాం = ఆశ్చర్యమైన-మందు భేదములను-అనుభవించువారికి, అపథ్య-సేవా=పథ్యముకాని పదార్థములను-అనుభవించుట, అనర్థం=చెడుపును, ఆపాదయేతకిం=కలిగించునా?

తా. ఈ శ్రీరంగమందు ఆశ్రీరంగనాథుని పాదపద్మములు సేవించువారికి మేలైనయౌషధములు తీసికొనువారికి పథ్యము తప్పిననుగూడ చెఱుపు గలుగని యట్లు ఏవిధమైన పాపమైనను నశియింపక పోదు.

ఆ. శ్రీపతిశ్రితులకు జీర్ణింపదే? యేన
మెది యెదైనఁ గాని విదితమే? య
పథ్యసేవ యేమి పడఁగఁజేయదు? మహౌ
షధవిశేషసేవ సలుపువారి.

టి. ఏనము-(ఏనస్సు)=పాపము, ఏమిపడఁగఁజేయదు=ఏమిచెడుగుపడఁజేయదు.

గ॥ సమంతా త్పురీంనిరీక్ష్య సశ్లాఘమ్॥ 698

వ. అంతట నాపురి నిరీక్షించి యత్యంత శ్లాఘాసహితంబుగ.

శ్లో॥ రంగా దన్య దనంగారేః
కంసారేర్వా స్థలేష్వహో।
కిం దృష్టం కిమపిక్షేత్రం
సప్తప్రాకార వేష్టితమ్॥ 699

అ. అనంగారేః=శివునియొక్క-గాని, కంసారేర్వా=విష్ణువు యొక్క-గాని, స్థలేషు=క్షేత్రములలో, రంగాత్=శ్రీరంగమునకంటె, అన్యత్=మఱియొకటి, సప్తప్రాకార వేష్టితం=ఏడుప్రాకారములచేత చుట్టఁబడినట్టి, క్షేత్రం=క్షేత్రము, కిమపి=ఏదియైనను, దృష్టంకిం=చూడఁబడినదా ? అహో=ఆశ్చర్యము!

తా. శివక్షేత్రములలోఁగాని విష్ణుక్షేత్రములలోఁగాని ఇట్లు ఏడుప్రాకారములుగల క్షేత్రము మఱియొకటి చూచినది లేదు, ఇ దాశ్చర్యము!

క. శ్రీరంగంబునకంటెఁ
గోరంగఁ మహి మఱియు నొకకొండును క్షేత్రం
బారంగను సప్తప్రా
కారంబు హరిది హరునిది కకంటె ? నొదియేన్.

కృశానుః—కృశానువు—

గ॥ వయస్య ! మైవం వ్రూచః ॥

వ. సఖా ! ఇటులు పలుకాడకుము ?

శ్రీజంబుకేశ్వరవర్ణనమ్.

(జంబుకేశ్వరము.— ఇది-కావేరీనది యుత్తరతీరమున త్రిశిరపురమున కను=తిరుచ్చినాపల్లికి పడమరప్రక్క పరమశివుఁడు అబ్లింగముగ ఆవహించి జంబూవృక్షముదగ్గర అఖిలాండేశ్వరితోఁగూడ దర్శనమిచ్చుచున్న జంబులింగేశ్వర స్వామి వసియించియుండు శివక్షేత్రము.)

శ్లో॥ అభ్యర్ణేఽస్యపురస్యైత దధిసహ్యాత్మజాతటమ్ ।
శైవక్షేత్ర మవేక్షేథాః సప్తప్రాకారసంవృతమ్ ॥ 700

అ. అస్యపురస్య= ఈ శ్రీరంగమునకు, అభ్యర్ణే=సమీపమున, అధిసహ్యాత్మజాతటం=కావేరీతీరమందు, సప్తప్రాకారసంవృతం= ఏడుప్రాకారములచేత-శివునిప్రాకారములచేత చుట్టఁబడిన, ఏతత్=ఈ, శైవక్షేత్రం = శివసంబంధి క్షేత్రమును, అవేక్షేథాః=చూడుము?

తా. ఈ శ్రీరంగమునఁగాక, సప్తప్రాకారములుగలది హరిదిగాని, హరుని దిగాని క్షేత్రము మఱొకటి లేదు. అనుదానికై ఈశ్లోకమున సప్తప్రాకారసంవృతమని దీనియందు అర్థాంతరముగా సప్తశబ్దమునకు జటాధరార్థము చెప్పఁబడియె. (చూడు 612.)

క. కావేరీతీరముననె
శైవక్షేత్రంబు కనుము ? సప్తప్రాకా
రావృత మయినది యదియును
నీవిష్ణుక్షేత్రమునకె యొప్పుడు నోరయున్.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ విహస్య; సత్యం; జటాధరప్రాకార సంవృత స్యాద్యశ్లేషస్యై
పుణ్యేనైవ రంగసాధర్మ్యం సమర్థనీయమ్॥ 701

వ. నవ్వి, నిజము, జటాధరప్రాకారసంవృతంబైనయీనగరంబునకు సప్తశబ్దశ్లేషస్యై పుణ్యముచేతనే యీరంగముతో సాధర్మ్యము సమర్థనీయ మేయనుచు నిపుణంబుగను నిరూపించి.

వృ॥ నందత్కందర్పదర్పక్షపణనిపుణదృగ్వహ్నిసంపన్నఫాలా
రుణ్యైః ఫణ్యగ్రగణ్యప్రకరమయతయా భీషణోభూషణైర్యః
కాంతస్సాంతః పురస్సన్ కవలితగరలో రాజతే రాజతేఽద్రౌ
మహాయం సహ్యాత్మజాగ్రే విహరతి సుచిరం శంకరశ్శంఖరోచిః॥

అ. యః=ఎతఁడు, నంవత్-కందర్పదర్ప-క్షపణనిపుణ - దృక్ వహ్ని-సంపన్న-ఫాల-ఆరుణ్యాః=సంతోషించుచున్న - మన్మథగర్వమును-నశింపఁజేయుట యందు సమర్థమైన-నేత్రాగ్నితో-కూడుకొన్న-నొసటియందలి - ఎఱ్ఱఁదనము గలవాఁడును, ఫణిఅగ్రగణ్య-ప్రకరమయతయా=సర్పశ్రేష్ఠులయొక్క - సమూహమయమై యుండుటచేత, భూషణైః = ఆ యాభరణములచేత, భీషణః= భయంకరుఁడును, కవలితగరళః=కబళముగాఁగైకొన్న- విషముకలవాఁడునై, రాజతే=వెండిమయమైన,అద్రౌ=పర్వతమందు, రాజతే=ప్రకాశించుచున్నాఁడో; సః=ఆ, శంఖరోచిః=శంఖమువలె తెల్లనికాంతులుకల, శంకరః=మహేశ్వరుఁడు, సాంతఃపురః=అంతఃపుర స్త్రీతోఁ గూడినవాఁడును, కాంతస్సన్ = మనోహరుఁడునగుచు, మహ్యాం=ఈభూమియందు, సహ్యాత్మజాగ్రే = కావేరి ముందట, చిరం=బహుకాలముగా, విహరతి=విహరించుచున్నవాఁడు.

తా. బ్రహ్మమొదలు చీమ దోమవఱకు మోహింపఁజేయుచు జయశీలుఁడైన మన్మథుని యాజయగర్వమును బోఁగొట్టు ఫాలనేత్రాగ్నితోను, భయంకరములైన సర్పభూషణములతోను,కంఠమున విషముతోను,భయంకరుఁడయ్యును; శరీరమున ధవళవర్ణముతోను, పార్శ్వమున పార్వతితోను మనోహరుఁడై యామహేశ్వరుఁ డీకావేరీతీర జంబుకేశ్వరమున విహరించుచున్నవాఁడు.

సీ. విధ్యాదికీటాంత ॥ విజయంబునంబట్టు
కందర్పదర్పంబు ॥ కరఁగఁబెట్టు
చిచ్చుఱదృష్టిన ॥ క్రిచ్చర నెఱఁబారు
ఫాలభాగంబునఁ ॥ బరఁగువాఁడు
ఫణిగణాగ్రామణుల్ ॥ మణిఫణాగ్రామము
ల్వెలయించు పలువిధంబులను మించు
భూషణానఘులతో ॥ భీషణావయవము
ల్గరళంబుగబళంబు ॥ గలుగువాఁడు

తే. రాజతాద్రిని మెప్పు విరాజితుఁడును

నయిన నంతఃపురము నందికే యందగిలుచు
నుద్దవిడి నిప్డు గావేరి కెయొద్ద గాంచు?
శంఖచిరుడు విహరించు కే శంకరుండు.

కృశానుః.—కృశానువు.—

గ॥ నాత్రస్థాతవ్యం యదిహ విశ్వవిలక్షణా రీతిరాలక్ష్యతే॥ 703

వ. సఖా! ఈకడ నిలిచినది చాలు, ఏల? యిట విశ్వవిలక్షణ
మైనవిధమ్ము కనఁబడుచున్నది.

శ్లో॥ యే తోయై ర్నాదేయై రభిషిక్తాస్తేహి తాప ముఝ్ఝంతి!
ప్రత్యుత జహాతి తాపం కావేరీ శంకరాభిషేకేణ॥ 704

అ. యే=ఎవరు, నాదేయైః=నదీసంబంధమైన, తోయైః = జలములచేత, అభిషిక్తాః=అభ్యంజనముచేయఁబడిరో; తేహి=వారుకదా? తాపం = తాపమును, ఉఝ్ఝంతి = విడుచుచున్నారు; ప్రత్యుత=మఱేమంటే? కావేరీ=కావేరీనది, శంకరాభిషేకేణ = మహాశివునియభిషేకముచేత, తాపం=తాపమును, జహాతి=విడుచుచున్నది.

తా. నదీజలమున స్నానముచేయువారు తాపమును విడుచువారగుచున్నారుగాని, ఈకావేరి ఆశంకరుని యభిషేకముచేత తానును తాపమును విడుచునది ఆయెను. ఇది లోకవిలక్షణముకదా?

ఆ. లోకు లాపగాభికే షేకమునన తాప
ముజ్జగింత్రు మిగులకే నుజ్జగించు
శంకరాభిషేకకే సంకలనమునఁ గా
వేరి తానె తాపకే మాౘ! కలద?

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ కుత ఏవమ్ కృశానుః శృణుతావత్॥ 705

వ. విశ్వావసుం డేల యీలాగని యడిగినఁ గృశానుండు వినుమని మరల నిట్లనియె.

వృ॥ గంగానుషంగాద్యమునా సదర్పే
త్యసహ్యతాపా బతసహ్యకన్యా।
గంగాధరే స్వైరభిషిచ్యమానే
తోయైః స్వయం తాప మియం జహాతి॥ 706

అ. యమునా=యమునానది, గంగా+అనుషంగాత్=గంగానదియొక్క+సంగమమువలన, సదర్పా=గర్వసహితమైనది; ఇతి=అని, బత=అయ్యో? అసహ్యతాపా=సహింపఁగూడని మనస్తాపముకల, ఇయం=ఈ, సహ్యకన్యా=కావేరి, స్వైః=తనదైన, తోయైః=జలములచేత, గంగాధరే=గంగాధరుఁడైన మహేశ్వరుఁడు, అభిషిచ్యమానేసతి=అభిషేకము చేయఁబడుచుండఁగా, స్వయం=తాను, తాపం=తాపమును, జహాతి=విడుచుచున్నది.

తా. ఈగంగాసంగమముచేతనే ఆయమునానదికూడ తాపము త్యజించినదాయెనే; ఈకావేరీనదియు అయ్యో? ఓర్వఁగూడని మనఃపరితాపముకలదియయ్యె, ఆగంగాధరునికి తన జలముచేతనే అభిషేకము చేయుటవలనగదా? తాను తనపరితాపమునుఁ విడిచినదయ్యెను.

తే. యమునగంగానుషంగాన ♦ సముదయని య
సహ్యతాప తా నయి కటా! ♦ సహ్యకన్య
యల్లగంగాధరాభిషే♦కాభిషంగ
మునన తనతాపమెల్ల నిం ♦ పొనర విడిచె

గంగానది—ఇది 93 వ శ్లోకమునొద్ద వ్రాసియున్నది.

యమునానది:—ఇది సూర్యునివలన ప్రభవించి కళిందపర్వతమునుండి ప్రవహించి శ్రీకృష్ణుఁడు లీలామానుషవిగ్రహుండై యవతరించియుండు గోకుల బృందావనములందుండి బలరాముని హలాయుధమువలన నూఱుపాయలై పాఱుచుండునవి.



కావేరీనది=సహ్యకన్య—ఈనది—541 వృత్తముపైగచూడు?

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ ఈదృశం దూషణం గుణగ్రాహిణా మభిమతమేవ॥ 707

వ. ఇట్టిదూషణ మట్టిగుణగ్రాహులక భిమతమే.

చోళదేశవర్ణనము.

(చోళదేశము.—ఇది భరతునితండ్రియయిన దుష్యంతునితమ్ముఁడు దుష్యంతునిపుత్రుఁడయిన కురుధాముని పుత్రుఁడు ఆక్రీతుఁడు, అతనిపుత్రులు పాండ్య చోళ కేరళులు మూవురు; వారిలో చోళుఁడు ఈ కాంచీపట్టణమును రాజధానిగాఁజేసికొని యిది మొదలు పాండ్యదేశమువఱకు పరిపాలించినదేశము.)

గ॥ ఇత్యన్యతో విమానం ప్రస్థాప్య సానందమ్॥ 708

వ. అని మఱొకక్కప్రక్కకుఁ విమానముఁ గదలించి కరంబు నానందభరంబున.

అమిూఖలు— ఇవికదా?—

వృ॥ వ్యాళాధిపేశయ శుభస్థలభూషితేలాః
క్ష్వేళాశనాయతనసాంద్రతరాంతరాళాః
చోళా విభాంతి పవమానవిహారవేళా
డోలాయమానసహకారనవప్రవాళాః. 709

అ. వ్యాళాధిపేశయ - శుభస్థల—భూషిత—ఇలాః=శేషశాయియైన విష్ణువుయొక్క - శుభాలయముల చేత-అలంకరింపఁబడిన - భూప్రదేశములు గలదియు, క్ష్వేళాశన - ఆయతన - సాంద్రతర - అంతరాళాః = విషభక్షకుఁడైన శివునియొక్క - ఆలయములచేత - దట్టములైన - మధ్యప్రదేశములుకలవియు, పవమాన - విహారవేళా - డోలాయమాన - సహకార - నవప్రవాళాః= గాడ్పుయొక్క - సంచారకాలములందు - ఊఁగులాడుచున్న - మామిడివృక్షములయొక్క - క్రొంజిగుళ్లుగలవియునైన, చోళాః=చోళదేశములు, విభాంతి=ప్రకాశించుచున్నవి.

తా. ఈ చోళదేశములు మహావిష్ణ్వాలయములును, మహాశివాలయములును గలిగి; మంచిగాడ్పులను, మంచిమామిళ్లతోఁటలును గలిగియున్నవి.

తే. శ్రీశగౌరీశభవ్యని కేతనములను
జోళదేశము లెడనెడ శోభిలు నిట
వాతపోతము చూతప్రవాళపాళి
నోలిఁ గేలి కాడోలికాకేళి సేయు.

గ॥ నిపుణం విభావ్య సోత్కంఠమ్॥ 710

వ. నిపుణంబుగ విభావించి నిరుపమోత్కంఠాసహితంబుగ.

శ్లో॥ నాగవల్లీ మతల్లీభిః కామినీభి రివాదరాత్ ।
పరిరబ్ధాః ప్రమోదంతే క్రముకాః కాముకా ఇవ॥ 711

అ. కాముకాఇవ=కాముకులువలె, క్రముకాః=పోఁకచెట్లు, ఆదరాత్=ప్రేమవలన, కామినీభిరివ=కాముకాంగనలవలె, నాగవల్లీమతల్లీభిః = శ్రేష్ఠములైన తమలపాకుతీఁగలతో, పరిరబ్ధాః = చుట్టఁబడినవై—కౌఁగిలింపఁబడినవై, ప్రమోదంతే=సంతోషపడుచున్నవి.

తా. ఇక్కడిపోఁకచెట్లు తమలపాకుతీఁగలతోఁ గూడి, కామినులతోఁ గూడినకాముకులవలె కౌఁగిలింపఁబడుచున్నవి.

తే. నాగవల్లులఁ గొని మెలఁ గాఁగలవలె
నాదరముమీఁద నాలింగనాదికములఁ
గాముకులకులమునువలెఁ గ్రముకకులము
మేదినిని గనుఁ డెందు నామోద మొందు.

గ॥ ఇతశ్చభవా నవేక్షతామ్॥

వ. ఇందుసను నీవు గందువుగాక.

వృ॥ అభ్రంలిహా నహహా! పశ్య! మరుద్వృధాయాః
రోధోరుహాః పృథుఫలానిహ నాళికేరాః।

ఆగచ్ఛతే సవితృమండల మాశ్రితాయ
నాథాయ భక్తితఇవా త్తనవోపహారాన్॥ 712

అ. మరుద్వృధాయాః=కావేరియొక్క, రోధోరుహాః=గట్టునఁబుట్టినవై, అభ్రంలిహాన్=ఆకాశమునంటినవై, పృథుఫలాన్ = గొప్పఫలములుగలవైన, నాళికేరాన్ =నారికేళములను, సవితృమండలం=సూర్యబింబమును,ఆశ్రితాయ= ఆశ్రయించినతఁడై, ఆగచ్ఛతే=వచ్చుచున్నతఁడైన, నాథాయ=భగవంతునకు, ఇహ=ఇక్కడ, భక్తితః=భక్తితో, ఆత్త - నవ -ఉపహారాన్ ఇవ=చేకొన్న- క్రొత్తలైన - కానుకలనువలె, పశ్య=చూడుమా ?

తా. ఈకావేరిగట్టునందలి టెంకాయచెట్టు లాకాశమునంటి సూర్యమండలమధిష్ఠించి వచ్చియుండు నా సూర్యనారాయణునకు కానుకలుగా సమర్పించుటకై ఫలించియుండునట్టులుండు గొప్పనారికేళఫలములతోనున్న వి.చూడు?

తే. అభ్రలిహములు కావేరి కై శుభ్రతీర
రుహము లురుఫలములు భూరి కై మహితనారి
కేళములు వచ్చురవిబింబ కే కేశవునకు
భక్తి నిచ్చుకాన్కల సరికైవచ్చుఁ గనుమ?

కృశానుః.—కృశానువు.—

గ॥ మమతుఏవం మతిః॥

వ. నాకును నీలాగుననే తలఁపుఁ గొలుపుచున్నయది.

వృ॥ లోలద్దీర్ఘదళా బృహత్తరఫలా వాతోల్లలద్ధూలిభిః
ఛన్నాః ప్రాంశుతమాః స్ఫురంతిపురతోయేనాళికేరద్రుమాః।
ధూమామాస్వాదనపాత్రధారిణఇమే ద్రాఘిష్ఠచంచజ్జటా
భస్మోద్ధూలితమూర్తయో వివసనాః పాషండభేదాఇవ॥ 713

అ. యే=ఏ, నాళికేరద్రుమాః=టెంకాయచెట్లు, లోలత్ - దీర్ఘదళాః = వ్రేలాడుచున్న - నిడివిఆకులుకలవియు, బృహత్తర - ఫలాః=మిక్కిలిగొప్పవై

న - ఫలములుకలవియు, వాత - ఉల్లలత్ - ధూళిభిః=గాలిచేత - పైకిలేచుచు న్న - దుమ్ములచేత, ఛన్నాః=కప్పఁబడినవియు, ప్రాంశుతమాః=మిక్కిలిపొడవులైనవియో; తేఇమే=ఆయావృక్షములు, ద్రాఘిష్ఠ-చంచత్ - జటాః=మిక్కిలిదీర్ఘములై - ఊఁగులాడుచున్న - జడలుకలవియు, ధూమ - ఆస్వాదన - పాత్ర - ధారిణః=పొగయొక్క-రుచిచూచుటకు - పాత్రనుధరించునవియు, భస్మ - ఉద్ధూళిత - మూర్తయః=బసుమముచేత - పైకిఁబూయఁబడిన - శరీరముకలవియు, వివసనాః=వస్త్రహీనములునైన, పాషండభేదాఇవ=పాషండులభేదములువలె, పురతః=ఎదురుగ, స్ఫురంతి=ప్రకాశించుచున్నవి.

తా. ఈటెంకాయచెట్లు నిడివాకులును, గొప్పఫలములునుగలిగి, గాలికి ఊఁగినదుమ్ముతగిలి; నిడివిజడలును, పొగత్రాగుపాత్రములును, పైగఁబూసికొన్న బసుమములును గలిగి; బట్టలుకట్టని పాషండులువలె కనఁబడుచున్నవి.

ఉ. చాలుదళాలు వాలుజడ * చాలు మహాఫలసత్తమాలె ధూ
మాలను బీల్చుపాత్రలు దుమారము దోరము భూతిపూఁత
యుత్తాలపునాళికేరములె * తారువివస్త్రులు సర్వలింగుల౯
బోలికమ్రోలఁగాలెఁ గను * పూర్ణవనాళులఁ జోళ దేశముల్.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సహాస మన్యతో నిర్దిశ్య॥ 714

వ. నవ్వి మఱొక్కప్రక్కనిర్దేశించి.

వృ॥ పద్మిన్యాకర్షోచితగంధ ప్రసవా౯ ప్రపశ్య పున్నాగా౯ !
అతనూగ్రాశుగకలనాత్సంప్రాప్తానధికరేణుసంపర్కమ్॥715

ఆ. పద్మినీ-ఆకర్ష-ఉచిత-గంధప్రసవా౯=పద్మలతలయొక్క- ఆఁడుఏనుఁగులయొక్క, పద్మినీస్త్రీలయొక్కయు-ఆకర్షణమునకు - తగిన- సువాసనపూవులు-మదప్రసవములును గలిగియు, అతను-ఉగ్ర-ఆశుగ - కలనాత్=అధికమైన-మన్మథునియొక్క-భయంకరమైన-గాలియొక్క=బాణములయొక్కయు- కూడికవలన, అధికరేణు-అధికరేణుసంపర్కం=ఎక్కువపుప్పొడితో- ఏనుఁగులతో-

సంబంధమును-సంభోగమును, సంప్రాప్తాన్ = పొందియున్న, పున్నాగాన్ = సురపొన్నలను- మొగయేనుఁగులను-పురుషశ్రేష్ఠులనున్, ప్రపశ్య=చూడుము?

తా. పుష్పవతులైన పద్మినీజాతి స్త్రీల నాకర్షించు మన్మథబాణాలతోడి సంభోగముగల పురుషశ్రేష్ఠులను, మదవతులైన ఆఁడుజాతి యేనుఁగుల నాకర్షించు గాడ్పులతోడి సంసర్గముగల మొగయేనుఁగు లట్లును, సువాసన పూవులుగల తామరతీఁగల నాకర్షించు వాసనగాలితోడి సంబంధముగల సుర పొన్నచెట్లున్నవి. చూడు ?

తే. పద్మినులను నాకర్షించి ప్రసవగంధ
ములను మఱిగొన్నపున్నాగములను గనుమ ?
యతను విధుతాశుగములచే నధిక రేణు
యోగమును వేగమునఁ గనె యుక్త మిదియ.

గ॥ (పార్శ్వతో వీక్ష్య) అహో! మహోన్నతా జనపదానా మమే
షా మభిజాతతా, పశ్య! 716

వ. (పక్క నొక్క చూచి) ఆహా ! మహోన్నత మీజానపదుల
యాభిజాత్యము ! చూడు?

వృ॥ జ్యోతిష్టోమ స్సాంగ ఉక్థ్యోఽతి రాత్రోఽ
ప్యాప్తోర్యామ షోడశీ వాజపేయః ।
ప్రౌఢాయజ్ఞాః పౌండరీకాదయో వా
చోళేష్వేతే నిత్యమేవ క్రియంతే॥ 717

అ. సాంగః=అంగసహితమైన, జ్యోతిష్టోమః=జ్యోతిష్టోమము; ఉక్థ్యః= ఉక్థ్యము, అతిరాత్రోఽపి=అతిరాత్రమును; ఆప్తోర్యామః=ఆప్తోర్యామము; షోడశీవాజపేయః = షోడశీవాజపేయము; ప్రౌఢాః=గొప్పలైన, పౌండరీకాదయః=పౌండరీకము మొదలైన, ఏతే=ఈ, యజ్ఞాః=యజ్ఞములు, చోళేషు=ఈ చోళదేశములందు, నిత్యం=ఎప్పుడును, క్రియంతఏవ= చేయఁబడుచు నేయున్నవి.

వ. సాంగము లైనజ్యోతిష్టోమోక్థ్యాతిరాత్రాప్తోర్యామ వాజపే యము లనెడి యైదు నాల్గు మూడు రెండొకరాత్రులందును జేయు నధ్వరంబులును, అంతకంటె నధికరాత్రు లందుఁ జేయు పౌండరీకాదిక మహాధ్వరంబులును ఈ చోళ జన పదంబు లందు నిత్యంబును జేయంబడుచున్నయవి.

కించ—మఱియు.—

శ్లో॥ గృహేంగృహే పశ్య? కృతాగ్నిహోత్రా
శ్శాస్త్రౌషధోల్లాఘహృదో విదోషాః ।
పుణ్యోత్తరాః పండితపుండరీకాః
పునంతి వేదైకధనా జగంతి॥ 718

అ. శాస్త్రి-ఔషధ-ఉల్లాఘ-హృదః=శాస్త్రియు లనెడి- ఔషధములవ లన-నిర్మలమైన-హృదయముగలవారును, కృత-అగ్నిహోత్రాః = చేయఁబడిన-హోమాగ్నిగలవారును, విదోషాః = దోషములులేనివారును, వేదఏకధనాః= వేదములే ముఖ్యధనముగాగలవారునైన, పండితపుండరీకాః=పండితులలో శ్రేష్ఠులైనవారు, పుణ్య-ఉత్తరాః=సుకృతములచేత ప్రధానులైనవారై, జగంతి=లోకములను, పునంతి=పవిత్రపఱచుచున్నవారు; గృహేగృహే = ఇంటింటను, పశ్య=చూడు?

తా. ఇక్కడ ఇంటింటను పండితశ్రేష్ఠులు. ఔషధములచేతవలె శాస్త్రిములచేత పరిశుద్ధహృదయులై నిత్యాగ్నిహోత్రులును, వేదముఖ్యులును,సుకృతముఖ్యులునై యీదేశములను పవిత్ర పఱచుచున్నవారు. చూడు?

తే. గృహగృహము సాగ్నిహోత్రు లశివహితశాస్త్ర
భేషజహృదయవిగళితశిదోషు లగుచు
సతులపుణ్యోత్తరులు పండితాధిపతులు
వేదధనులును భువనపవిత్రు లిచట.

టీ. అవహిత...దోషులు=తెలిసికొనఁబడిన శాస్త్రము లనెడియౌషధము లచేత హృదయములందు విడిచిపోయిన వివిధదోషములు గలవారు.

కృశానుః.—కృశానువు.—

గ॥ ఏతద్విషయవిషయా శ్లాఘానుశ్లాఘా నకర్తవ్యా యతఏత ద్దేశవసతాం సతామ ప్యనేకప్రకారా దురాచారా ఉప లభ్యంతే॥ 719

వ. ఈదేశవిషయమైన స్తోత్రానుస్తోత్రములు సేయవలదు; ఏలంటే ఈదేశముల వసించుసజ్జనులయు దురాచారంబు లనేకప్రకా రంబులుగాఁ గనంబడుచున్నయవి.

శా. స్నాంతి ప్రాత రధిస్రవంతి విధివ త్సంధ్యాదికర్మాచరం
త్యగ్నీనా దధతే మఖాన్విదధతే శాస్త్రాణిచాధీయతే
అభ్యర్చంతి సురాన్ పరార్ధ్య కుసుమై రంచంతికించాతిథీన్
అన్నైః కింతుపురాతనై స్తనుమమీపుష్యంతి దుష్యంత్యతః.

అ. అమీ=వీరు, ప్రాతః=ఉదయాన, అధిస్రవంతి=నదులయందు, స్నాంతి= స్నానముచేయుచున్నారు; సంధ్యాదికర్మ = సంధ్యావందనాదికర్మను, ఆచ రంతి=చేయుచున్నారు; అగ్నీన్=త్రేతాగ్నులను, ఆదధతే = హోమము చేయుచున్నారు; మఖాన్ = యజ్ఞములను, విదధతే = చేయుచున్నారు; శాస్త్రాణిచ=శాస్త్రములనున్, ఆధీయతే=అభ్యసించుచున్నారు; సురాన్ = దేవతలను, పరార్ధ్యకుసుమైః = శ్రేష్ఠములైన పుష్పములతో, అభ్యర్చంతి= అర్చించుచున్నారు; కించ=మఱియు, అతిథీన్=అతిథులను, అంచంతి=పూజిం చుచున్నారు; కింతు=మఱియునో, పురాతనైః=ప్రాఁతలైన, అన్నైః=అన్న ములచేత, తనుం=శరీరమును, పుష్యంతి=పోషించుకొనుచున్నారు; అతః = అందువలన, దుష్యంతి=(ఒకరొకరిని) దూషించుకొనుచున్నారు.

తా. ఈదేశపుబ్రాహ్మణు లుదయాననే లేచి స్నానసంధ్యాదినిత్యసత్కర్మ లాచరించి వేదశాస్త్రాదు లభ్యసించుచు, ఆహవనీయదాక్షిణాత్యగార్హపత్యా

గ్నులతో దర్శపూర్ణమాసాది యజ్ఞము లాచరించుచు, సూర్యనారాయణ మహేశ్వరాదుల నర్చించుచు, అతిథ్యభ్యాగతుల నాదరించుచు నున్నారు గాని; దినదినము ప్రాఁతపడిపోయిన చలిదియన్నముతో శరీరము పోషించుకొంచు దూష్యులగుచున్న వారు.

మ. చలిదిఁ గాపడువారువీరలు నుషఃస్నానంబొగిఁ జేయుదుర్
కలసంధ్యాదికకర్మకాల్యమ కడుఁ గావింత్రు కామ్యాహితా
గ్నులు త్రేల్తుర్ క్రతువుల్ చరింత్రు శ్రుతులుఁ ఘోషింత్రు దైవం
బులఁ, ఫలపుష్పార్చలొనర్త్రు తారతిథులఁ బాటింతురింతేలకో?

ఇ. త్రేతాగ్నులు=కామ్యాహితాగ్నులు— ఆవహనీయ గార్హపత్య దాక్షిణాత్యములు.

గ॥ (పునర్నిరూప్య సవిస్మయమ్) కష్ట మేతద్దేశవాసినీనాం విలాసినీనాం నిత్యమేవ లజ్జావ్యుత్పత్తిరాహిత్యమ్॥ 721

వ. (మఱి నిరూపించి విస్మయ మతిశయించి) అయ్యో! ఈదేశవాసిను లయిన సువాసినులకు నిచ్చలును లజ్జయుఁ దెల్వియు ననునవియే లేవయ్యో.

తథాహి.—అదే కదా?—

వృ॥ అపిహంత? చోలవాసస్థైర్యవతీనాం చిరాయ యువతీనామ్।
అపకం చులికాబంధౌ కుచకుంభావితివిరుద్ధ ముపలబ్ధమ్॥722

అ. హంత=అయ్యో! చిరాయ=బహుకాలముగ, చోలవాసః-వాసస్థైర్యవతీనాం=రైక-అను-వస్త్రముచందు చోలదేశమందు - నివసించుటయందు-నిలకడగలవారైన, యువతీనాం=యౌవనురాండ్రయొక్క, కుచకుంభౌ=కుంభముల వంటి కుచములు, అపకంచులికాబంధౌ = తొలఁగిపోయినరైకకట్టు కలవి; విరుద్ధం=ఈవిరుద్ధరీతి, ఉపలబ్ధం=పొందఁబడినది.

తా- అయ్యో! స్త్రీలు రైకలు తొడుగుకొనువారుగానుండియు, ఈదేశవాసి స్త్రీలకు రైకలు తొడుగుకొనకయే యుండుట లోకవిరుద్ధముకదా?

క. కలయుఁగఁ జోళీయులకే
లలితకళావతులకైన కేలలిఁ గుచములఁ గం
చులికాబంధము లేమియ
కలిగించును గద? విరుద్ధకార్యము ధరకున్.

కించ.—మఱియు.—

వృ॥ అగూఢగాఢస్తన కుంభికుంభ
మంభోజదంభోదయజైత్రనేత్రమ్।
చిత్తేన ధత్తే బత! చోలదేశ
స్త్రైణం ప్రవీణం రతికాంతబాణమ్॥ 723

అ. అగూఢ-గాఢ-స్తన- కుంభికుంభం=మఱుఁగుపఱుచఁ బడనివై - దట్టమైన-కుచములనెడి. ఏనుఁగుకుంభస్థలములుకలదియు, అంభోజ - దంభోదయ-జైత్ర నేత్రం=తామరలయొక్క-గర్వాభివృద్ధిని-జయించునట్టి కనులుకలదియునైన, చోళదేశస్త్రైణం=చోళదేశపుస్త్రీసమూహము, ప్రవీణంఅపి=సమర్థమైనదయ్యును; రతికాంతబాణం = (లజ్జఅనెడి) మన్మథబాణమును, చిత్తే=తన మనస్సున, నధత్తే=వహింపదు; బత=అయ్యో?

. ఈదేశపుస్త్రీలు రైకలేకయే ఏనుఁగు కుంభస్థలములవంటి స్తనములను, అందమునఁ దామరలనుమించిన కన్నులునుగలిగి, సమర్థురాండ్రయ్యును, మన్మథబాణాలవలన లజ్జయనునదియే మనస్సునలేనివారై యున్నారే? అయ్యో? ఇదేకదా? లోకవిరుద్ధము?

తే. నళిన దంభ విజృంభణ దళన నిపుణ
నయనలై కుంభి కుంభ స్తనముల మఱప
నందునను దనరెడు చోళ సుందరులకు
సిగ్గు స్మరశరమున మొగిఁ జెనక దదను.

అపిచ.—మఱియు.—

వృ॥ నవార్తవమహోత్సవే నను సహస్రశస్సంగతాః
గృహాద్బహి రశంకితం గదితకామగాథాశతాః।
అహార్యకఠిన స్తనప్రకటనా దనాగస్వినో
మునేరపి మనోధృతిం చులుకయంతి చోళాంగనాః॥ 724

అ. చోళాంగనాః=ఈచోళదేశపు స్త్రీలు, నవ-ఆర్తవ - మహోత్సవే=క్రొత్తయైన-ఋతుమతి అగుటయనెడు - గొప్పవేడుకలో, గృహాత్ = ఇంటికంటె, బహిః=వెలుపల, సహస్రశః=వేలకొలఁది, సంగతాః = చేరినవారై; అశంకితం=జంకులేకుండ, గదిత-కామ-గాథాశతాః=చెప్పఁబడిన-మన్మథక్రీడలయొక్క - నూఱులకొలఁది కథలుకలవారునైనను, నను-ఛే? అనాగస్వినః=నిరపరాధియైన, మునేఃఅపి=మునికిఁగూడ, మనోధృతిం=మనసునధైర్యమును, అహార్య-కఠిన-స్తన-ప్రకటనాత్ =కొండలవలె-కఠినములైన - స్తనములను-వెలిపఱచుటవలన, చులుకయంతి=చెఱుచుచునున్నవారు.

తా. ఈచోళదేశపు స్త్రీలు పడుచుతనమున సమర్తకాలములలో ఇంటికివెలుపల గుంపులుగూడి యాటలపాటలతో మన్మథక్రీడలు పలుకుచు, ఛే ? తమ పైఁటలేని చనుగొండలఁ గనుపఱచుచు, కాముకునిఁగాక మునియైనవానిఁగూడఁ జంచలపఱచుచున్నారు.

పృథ్వి. సమర్తలకుఁ జేయు వేడుకలఁ జాల నందంబుగాఁ
బ్రమోదమున మారు బేరజపుఁ బాటలం బాడుచున్
సమస్తముగు చోళకాంతలుఁ గుచాలఁ గాన్పించెదర్
తెమల్చి ముని నేనియుం దెరలఁ దేర్చుచుం దోడ్తనే.

గ॥ అతిదుస్సహమన్యత్॥

వ. తాళుకొనఁ గూడనిది మఱియొకటి.

వృ॥ నకేశేషు స్నేహో నచనయనయో రంజనకథా
నవాప్తిః నక్తే నవకుచతటే చందనరసః।

నచాల్పోఽప్యాకల్పో నచ సువచనం నైవకుసుమం
స్నుషాత్వంపాపానాం ఫలముతబతాత్రత్యసుదృశామ్? 725

అ. ఉత=ఇంతేకాదు, బత=అయ్యో? పాపానాం=పాపిష్ఠులైన, అత్రత్యసుదృశాం = ఇక్కడనుండు స్త్రీలకు, కేశేషు=వెండ్రుకలలో, స్నేహః= నూనె, న=లేదు; నయనయోః=కన్నులందు, అంజనకథాచ=కాటుకయనుమాటయు, న=లేదు; వక్త్రే=నోట, వీటీవా=విడెమైన, న=లేదు; కుచతటే=ఱొమ్మునందు, చందనరసఃచ=గంధపురసమును, న=లేదు; అల్పోపి=కొంచెమైనను, ఆకల్పః=క్రొత్తసొమ్ము, న=లేదు; సువచనంచ=మంచివస్త్రముకూడ, న=లేదు; కుసుమం=పువ్వు, న=లేదు; స్నుషాత్వం=కోడలగుటే, ఫలం=ప్రయోజనము.

తా. ఇక్కడి స్త్రీలపాపమేమో? తాము తమయింటికోడండ్రుగానుండుటయే ఫలముగానెంత్రుగాని, తలవెండ్రుకలనూనెయైన, కంటఁగాటుకైన, నోటవక్కాకైన, ఱొమ్మునగంధమైన, ఏదైననొక్కక్రొత్తనగయైన; తుదకు మంచికోకైనఁ గలవారుగాఁ గనఁబడరు.

సీ. తలవెండ్రుకలు చిక్కు ॥ తలఁగ దువ్వెన దువ్వ
చమురొకింతయుఁగాని ॥ చరుమరకట ?
కనుఱెప్ప లనువొప్పఁ ॥ గనుగాటుక నొకింత
యద్దముఁ గొని కని ॥ దిద్ద రకట ?
మొగమందు నగవంద ॥ మగుఁనటు ల్కపురపు
విడెము నొకింతయు ॥ వేయ రకట ?
యురమునఁ బరిమళ ॥ భరమునకై సిరి
చందన మొకయింత ॥ యంద రకట ?
తే. మంచి తొడవులు కడు ॥ మంచి మడుపులైన
మంచిపువ్వులు మఱి ॥ మంచి బువ్వలైనఁ
గొంతకొంతైనఁ గొనరు త॥మంత నకట ?
పేద లిండ్లను గోడండ్ర ॥ కేది ఫలము ?

అపిచ.—మఱియును.—

వృ॥ అంసౌచే దుదకుంభభారకిణితా వంఘ్రీపునర్గోమయ
స్ఫాయన్నాట్యమలీమసౌ కరతలం ఘాసచ్ఛిదాకర్కశమ్ ।
పాకాగ్న్యుత్థితధూమమేలనగలద్బాష్పావిలే లోచనే
కష్టం రిక్తగృహిస్నుషాత్వనరకః స్త్రీణా మహోదుస్సహః ॥

అ. అంసౌ=మూపురములు, ఉదకుంభభార-కిణితౌ=నీటికుండలబరువుచేత కాయకాసినవియు; అంఘ్రీ=కాళ్లు, పునః - గోమయ - స్ఫాయత్ - నాట్య-మలీమసౌ = మాటిమాటికి - పేఁడలో - అతిశయించుచున్న - త్రొక్కులాటల చేత - మురికైనవియు; కరతలం=అఱచేయి, ఘాసచ్ఛిదా - కర్కశం = పచ్చికగిల్లుటచేత - గడుసుపాఱినదియు; లోచనే = కన్నులు, పాక - అభ్యుత్థిత-ధూమ-మేలన - గలత్-బాష్ప - ఆవిలే-చేత్ = వంటనుండి - పైకిలేచిన-పొగయొక్క - కలియకచేత-జాఱుచున్న - కన్నీళ్ళచేత - కలఁకఁబాఱినవియు నాయెనేని, కష్టం=అయ్యో? రిక్తగృహి - స్నుషాత్వ- నరకః = పేదయింటి వారికి - కోడలుగా నుండుట యనెడు - నరకము, అహో=ఆహా! స్త్రీణాం= స్త్రీలకు, దుస్సహః = ఓర్వఁగూడనిది.

తా. ఇక్కడి స్త్రీలకు నీటికుండలు మోసిమోసి బుజాలు కాయలు కాసిపోవుటయు, కాళ్లు పేఁడత్రొక్కి త్రొక్కి మఱకలైపోవుటయు, చేతులు పచ్చిక పెరికిపెరికి గడుసుపాఱిపోవుటయు, వంటయింటి పొగ తగిలి తగిలి కన్నులు నీరు కాఱుచుంటయుఁ గలిగియుండుట వీరి కోడండ్రికమీఁద తాళఁగూడని నరకబాధయై యున్నయది. అయ్యో? ఎంతకష్టము?

చ. జలఘటిమోసిమోసి పరుసంబుతదంసయుగంబు,గోమయం
బులనిటుత్రొక్కి త్రొక్కి దినమున్ మలినంబుపదద్వయంబు
పెర్, బులునటుపీకిపీకికరమున్ గఠినంబు కరద్వయంబు, వం
టలపొగ [illegible] యన్నపల్.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ వయస్య? మాదూషయ? చోళమండల వాసినోజనాన్॥

వ. దూషింపకుసఖా? ఈ చోళమండలవాసులను మానిసులను.

శా. యాభిస్సర్వపదార్థశుద్ధిరుదితా ♦ తాస్వప్సుదేవార్పితమ్
నిక్షిప్తంనిశిరక్షితం శుచిహవి ♦ ర్భక్ష్యేతచేత్కాక్షతిః?
త్యాజ్యంశాస్త్రనిషేధత స్తదితిచే ♦ త్సాజ్యంసతైలంచతత్
భోజ్యంపర్యుషితంస్మరంతియదతో ♦ యోజ్యంనతద్దూషణైః.

అ. యాభిః=ఏజలములచేత, సర్వపదార్థ శుద్ధిః=సకల వస్తువులకును పరిశుద్ధత, ఉదితా=పుట్టినదో? తాసు=అట్టి, అప్సు=నీళ్ళయందు, నిక్షిప్తం=ఉంచఁబడినదై, దేవార్పితం=దేవతలకు అర్పింపఁబడినదై, నిశి=రాత్రిలో, రక్షితం=కాపాడఁబడినదై, శుచి=పరిశుద్ధమైన, హవిః=హవిర్భాగమైన యన్నము, భక్ష్యేతచేత్=భక్షింపఁబడెనేని; కా=ఏమి, క్షతిః=చెఱుపు?; తత్=ఆచలిఁదన్నము, శాస్త్రనిషేధతః = శాస్త్రమందు నిషేధించుటచేత, త్యాజ్యం-ఇతిచేత్=విడువఁదగినది-అనియేని; సాజ్యం=నేతితోఁగూడినది, సతైలం=నూనెతోఁ గూడినదియునైన, తత్ పర్యుషితం = ఆచలిఁది, యత్ = ఎందువలన, భోజ్యం=భుజింపఁదగినదిగా, స్మరంతి=తలఁచుచున్నారో? అతః=అందువలన, తత్=ఆచలిఁది యన్నము, దూషణైః=దూషించుటలతో, నయోజ్యం=చేర్పఁదగినదికాదు.

తా. శాస్త్రవిహితముగ పదార్థములన్నిటినిఁ పవిత్రపఱచు జలమునఁగూడి, దేవతల కర్పింపఁబడి, యెలుకలు పిల్లులు మొదలైనవి యంటకుండుటకై రాత్రియంతయుఁ గాపాడఁబడి, పరిశుద్ధమైన హవ్యమును భక్షించినయెడల దోషము లేనియట్లే; శాస్త్రనిషిద్ధమైనను, చలిఁదియన్నము నేయి నూనియలతోఁజేరి భుజింపఁ దగినదైనది యనితలఁచుటచేత అది దూషింపఁదగినదికాదు.
(ఇది 627 శ్లోకసమాధానము.)

చ. సకలపదార్థసార్థశుచి ♦ సల్పుజలంబుల దైవతార్పితం

బకుటిలబుద్ధిశుద్ధినిడి ✽ యామినులం దభిరక్షితంబుఁ, గో
రికఁజలిఁదీర్ప భుజింపఁజెలు ✽ పేమిది శాస్త్రనిషిద్ధమైన, నే?
మిఁక ఘృతతైలయుక్తమగు ✽ నేనిడయాఁగద? శాస్త్రసిద్ధమున్.

శా. పాతివ్రత్యము పేత్య నిత్యమనఘా ✽ చారావదాతాత్మనామ్
చోలీనాం యదికంచుకం నకుచయో ✽ ర్మాలీమసీకా? తతః
నారీణాంసురతోపయోగ్యవయవ ✽ స్పష్టీకృతిర్దోష ఇ
త్యుక్తశ్చేదధరాపిధానమపికిం ✽ నస్యాత్సదా వాససా.

అ. పాతివ్రత్యం=పతివ్రతా ధర్మమును, ఉపేత్య=పొంది, నిత్యం=ఎప్పుడును, అనఘ-ఆచార - అవదాత-ఆత్మనాం = నిర్దోషమైన - నడవడి చేత - పరిశుద్ధమైన-మనస్సుకల, చోలీనాం=చోలదేశ స్త్రీలయొక్క, కుచయోః=కుచములయందు, కంచుకం=రైక, నయది=లేదేని; తతః=దానివలన, మాలీమసీ=మాలిన్యము, కా=ఏది? సురత ఉపయోగి- అవయవ-స్పష్టీకృతిః=రతికి-ఉపయోగముగల - అంగములను-స్పష్టపఱచుట, నారీణాం=స్త్రీలకు, దోషఇతి=దోషమని, ఉక్తశ్చేత్=చెప్పఁబడినదేని; వాససా=వస్త్రము చేత, అధర-అపిధానం, అపి=పెదవిని-కప్పుటగూడ, కిం=ఏల? సదా=ఎప్పుడును, నస్యాత్=కలుగదు?

తా. పతివ్రతాధర్మము విడువక, మంచి నడవడికగల సకల స్త్రీలకును రైకలేక యుండుటవలన చెఱుపులేదు. సురతమున కుపయోగించు నంగములలో కోకలోని దానివలె పెదవిని గూడ ఏల కోకతో మూసికొనఁగూడదు? (ఇది శ్లోక 629 సమాధానము.)

సీ. సతులు పాతివ్రత్య ✽ సద్ధర్మ మెడపక
విధి విహితాచార ✽ విదితకీర్తి
వెలసిన యా చోళ ✽ నళినదళాక్షుల
యురముల ఱవిక లే ✽ కునికివలని
చెడుపేమొకో? యల ✽ చెడి వెలుకైనను
సురతోపయుక్తము ✽ [illegible]

కముల స్పష్టము సేయఁ గౌ గరము దుష్టమనంగ
నఖిలాంగనలుఁగప్ప కౌ రధర మేల ?
తే. మధుర మకరందమునకంటె కౌ మధురతరపు
టమృతమునకంటె మధుర తరమౌ మాసమ సుమ
హా కవివచనమునకంటె కౌ నతిమధురము
గనఁగ సురతాధి కోప యుక్తముదె గనుక.
గ॥ ఇతిపార్శ్వతోఽవలోక్యసశ్లాఘమ్॥ 728
వ. పార్శ్వము విమర్శించి శ్లాఘించుచు.

కుంభఘోణశార్ఙ్గపాణివర్ణనము.

ఇ. (కుంభఘోణము— ఇది కుంభమువలె ఘోణము=ఘ్రాణము కలిగినది) అనఁగా ఈవిశాలమైన పట్టణాగ్రభాగము కుంభాకారముగా నుండినది యనుట. (మఱియే యది అతివిశాలమైన గోపురప్రాకారములతోను, స్నానమున పావనము చేయఁదగిన మాఘమఖాంగము = మామాంగము అనెడి తటాకముతోను, కోమలాంబాదేవీసహితుఁ డైనపరమశివుఁడు కుంభేశ్వరుఁ డనెడినామధేయముతోను దర్శనమిచ్చుచున్న పట్టణము.)
గ॥ అస్య దేశస్య భాగ్యవత్తాఖల్వియ త్తాపరిత్యక్తా॥ 729
వ. ఈదేశము భాగ్యముమితిమీఱినదియై యున్నయది.

యతోఽత్ర.—ఏలంటేనిట.—

వృ॥ మణిమయ ఫణితల్పే మల్లికా పుంజ కల్పే
శమిత జగదభద్రాం సంశ్రయన్ యోగనిద్రామ్
దహర కుహరవర్తీ దేవతా చక్రవర్తీ
దలిత దురిత బాణే దృశ్యతే కుంభఘోణే. 730

అ. దహరకుహరవర్తీ=దహరాకాశాన వర్తించువాఁడైన, దేవతాచక్రవర్తీ=సకల దేవతలకును చక్రవర్తియగు శ్రీశార్ఙ్గపాణిస్వామి, దలితదురితశా

ణే=తొలఁగఁగొట్టఁబడిన దోషములకు బాణమువలె నున్న, కుంభఘోణే=కుంభకోణమందు, మల్లికాపుంజకల్పే=మల్లెల సమూహముతో సమమైన, మణిమయఫణితల్పే=రత్నమయమైన శేషశయ్యయందు, శమిత జగదభద్రాం=శమింపఁజేయఁబడిన లోకముల అశుభములుగల, యోగనిద్రాం = యోగముతోడి నిద్రను, సంశ్రయన్ = చెందుచు, దృశ్యతే=కనఁబడుచున్న యతఁడు.

తా. సకలదోష విముక్తమైన ఈకుంభకోణమున సకల దేవతా చక్రవర్తియైన శ్రీ శార్ఙ్గపాణిస్వామి మల్లెపూలవలె తెల్లన మెత్తన వాసనయుఁగలిగి రత్నమయముగా నుండు నాదిశేషశయనములో పవళించి సర్వదోష పరిహారముగాను సర్వ క్షేమకరముగాను జ్ఞానానందమయమైన యోగనిద్రయం దున్నవాఁడు.

ఆ. మల్లెశయ్యఁబోలె ♦ మణిమయఫణిశయ్య
యోగనిద్ర జగద ♦ మోఘభద్ర
నదిగో? దేవదేవుఁ ♦ డంతరాత్మ ధుతాఘ
బాణమందుఁ గుంభ ♦ ఘోణమందు.

ఇ. (శ్రీశార్ఙ్గపాణిస్వామి—వీరు ఈకుంభఘోణమందు హేమపుష్కరిణీ తీరమున కోమలవల్లిత్తాయారుతో వైదికవిమానమున ఉద్యోగశేషశయనముతో హేమమహర్షికి ప్రత్యక్షమై పూదత్తే పేయ తిరుమళిశై తిరుమంగై ఆండాళు పెరియాళ్వారు నమ్మాళ్వార్ల మంగళాశాసనములతోను, మఱియు కొంతసమీపమున కోదండపాణి చక్రపాణి సన్నిధులతోను సేవసాయించుచున్న ఆరావముదుప్పెరుమాళ్లు.)

గ॥ అంతశ్నాగరికీం జన తామవేక్ష్యసశిరః కంపమ్॥ 731

వ. ఈదేశములోఁగ నాగరికజనుల నంతయుం గాంచి శిరఃకంపం బెంతయుంగావించి.

శా. స్నాత్వాసహ్యాసుతాజలే శుచి తమాశ్భూత్వాజపాదిక్రమైః

హుత్వాగ్నౌచహవిః, కృతేతరగిరాంకృత్వాచపారాయణమ్

నత్వాశార్ఙ్గధరం భవామయహరం ✽ స్తుత్వాచతం భక్తితః
శ్రేష్ఠాఃకాలమ మీక్షిపంతిబహవ ✽ శ్శ్రీకుంభ ఘోణేద్విజాః.

అ. శ్రీకుంభఘోణే=ఈ సంపద్విశిష్టమైన కుంభకోణమందు, శ్రేష్ఠాః=శ్రేష్ఠులై, బహవః=అనేకులైన, అమీ=ఈ, ద్విజాః=బ్రాహ్మణులు, సహ్యసుతాజలే=కావేరీ జలమందు, స్నాత్వా=స్నానముచేసి; జపాదిక్రమైః=జపము మొదలైన కర్మలచేత, శుచితమాః=పరిశుద్ధులు, భూత్వా=ఐ; అగ్నౌ=అగ్నిహోత్రమందు, హవిశ్చ=హవిర్భాగమునున్, హుత్వా=వ్రేల్చి; కృత-ఇతర గిరాం=కల్పితములకంటె - వేరైన వేదములయొక్క, పారాయణంచ=పారాయణమునున్, కృత్వా=చేసి, భవ-ఆమయ-హరం = సకల దోషములనెడి - వ్యాధులను - పరిహరించునట్టి, శార్ఙ్గధరంచ=శ్రీశార్ఙ్గపాణిని, నత్వా=నమస్కరించి, తంచ=ఆభగవంతుని, భక్తితః=భక్తితో, స్తుత్వా=స్తుతించి, కాలం=కాలమును, క్షిపంతి=కడపుచున్నారు.

తా. ఈ కుంభకోణమందు సకల బ్రాహ్మణులును కావేరీ స్నానముచేసి, జపహోమాది కర్మలుచేసి పరిశుద్ధులై, అగ్నిహోత్రములు జరిపి, వేదపారాయణములు చేయుచు, సర్వదోషములు పరిహరించునట్టి శ్రీ శార్ఙ్గపాణిని భక్తితో నమస్కారములుచేసి, స్తోత్రములును చేయుచుఁ గాలము గడపుదురు.

సీ. కావేరివారిని ✽ గర ముపస్స్నానంబు
కావించికావించి ✽ కలుషమడఁచి
జపములఁదపముల ✽ జాకక చెంగక
జరిగించిజరిగించి ✽ జగతిమించి
యనిశముశుచితము ✽ లతులమానసముల
నగుచునగుచును ✽ నశుచితొలఁచి
యహరహంబుననాహి ✽ తాగ్నిహోత్రంబున
వ్రేలిచివ్రేలిచి ✽ వేగవలచి
తవిలి భక్తిని సమయ త్రితయమునందు

శార్ఙ్గధర దేవసేవయె కై సలిపి సలిపి
కడపుసురు కాల మా ద్విజు లెడరి యడరి
కుంభఘోణ మం దయగంధ కై ఘోణమందు.

టీ. అయగంధ-ఘోణమందు = శుభావహవిధుల వాసనకై (ఆఘ్రాణించు) ఘ్రాణము కలదియైన.

## శ్రీచంపకారణ్య రాజగోపాలవర్ణనము.

ఇ. (చంపకారణ్యము.— ఇది శంఖతీర్థ చక్రతీర్థ కృష్ణతీర్థాది తీర్థతీరములతోడఁ గూడి గోబలీయ మహర్షి చేత తపస్సు చేయఁబడుచు, కంటికి సొంపును ముక్కున కింపును మనస్సునకుఁ దెంపును గలిగించుదానిపువ్వులతోను దాని సువాసనలతోను మనోహరములైన సంపెంగమ్రాఁకులచేత నలంకరింపఁబడుచు శ్రీ రాజగోపాలస్వామి వేంచేసియున్న క్షేత్రవిశేషము.)

ఇతశ్చ.—ఇందువలన.—

వృ॥ కుటీషు గోపీరుచిరాసు యోఽర్కభూ
తటీషు గోపాల ఇతి శ్రుతశ్చరన్
అకంపకారుణ్య ముపేత్య మోదతే
సచంపకారణ్య మగణ్యవైభవః॥ 732

అ. అర్కభూతటీషు=సూర్యపుత్రియైన యమునానదీతటులయందు, గోపీరుచిరాసు=గోపికలచేత మనోహరములైన, కుటీషు=గుడిసెలలో, చరన్=సంచరించుచు, గోపాల ఇతి=గోపకుఁడని, యః=ఏభగవంతుఁడు, శ్రుతః=వినఁబడువాఁడై, అగణ్యవైభవః=లెక్కింప శక్యముకాని మహిమ కలవాఁడయ్యెనో? సః=ఆభగవంతుఁడైన గోపాలుఁడు, అకంపకారుణ్యం=నిశ్చలమైన కృపారసము కలుగునట్లుగా, చంపకారణ్యం=ఈ చంపకారణ్యమును, ఉపేత్య=చేరి, మోదతే=సంతోషపడుచున్నవాఁడు.

తా. ఆ యమునానదీతీరమున గోపికల గుడిసెలలో గోపాలుఁడని పేరితో

సంచరించుచు మహానుహిమ కలవాఁడగుచున్న యాభగవంతుఁడు మిక్కిలి కృపతో నిప్పు డీ చంపకారణ్యక్షేత్రమం దానంద మందుచున్నవాఁడు.

(శ్రీ రాజగోపాలస్వామి.— వీరు రాజమన్నారుకోవిలె అను దివ్యదేశ మందు ఆ చంపకారణ్యమున వల్మీకములో ఆవిర్భవించి యుండి, గోవే తనంత వచ్చి బోలగిలఁబండుకొని రెండువేళలలోను, తనపాలీయ నీయఁగా; తాను దాని పానాహారములుగా నాస్వాదించుకొంచు, అక్కడి గోబలీయ ఋషి శ్రేష్ఠునికి ప్రత్యక్షమైనదేగాక, మఱియు నాయాప్రక్కల బాలగోపాల వేణు గోపాల రాజగోపాలాది స్వస్వరూపములతో చంపకవల్లి త్తాయారు తోఁగూడ సేవసాయించెడి రాజమన్నారుస్వామి.)

తే. యమున తటుల నా గోపికా ౹ యతనకుటుల
వేఁక్కవిహరించు గోపాల ౹ విశ్రుతుండు
చంపకారణ్యమునఁదా న ౹ కంప కరుణ
కలిగి క్రీడించెడును గను? ౹ ఘనమహుండు.

గ॥ అత్రకిల రాజగోపాల పాదకమల ముపాశ్రయత స్సాధుజన
స్యేదమిత్థ మనుసంధానమ్॥ 733

వ. ఇట నిటులేకదా ? శ్రీరాజగోపాల పాదపాథోజ సముపాశ్రయ సాధుజనానుసంధాన మీయది.

శా. కోపాటోప దశావిశాల పరుషా ౹ లాపాదిరూపా శుభ
వ్యాపారగ్లపితార్థిలోక హృదయై ౹ ర్వ్యాపాలపాశై రలమ్
తాపావిష్ట సకృత్ప్రపన్నజన ము ౹ క్త్యాపాదనే దీక్షితమ్
పాపానా మపనోదనాయకమహం ౹ గోపాలమేవాశ్రయే.

అ. కోప - ఆటోపవశా - విశాల-పరుష-ఆలాప - ఆదిరూప - అశుభ-వ్యాపార-గ్లపిత-అర్థిలోక - హృదయైః =కోపముయొక్క - విజృంభణస్థితియందు- విస్తారమై-కఠినములైన- మాటలు - మొదలుగాఁగల రూపములతోడి - మంచివి కాని - ప్రవర్తనములచేత - కష్టపఱపఁబడిన - యాచక జనులయొక్క - మనస్సు

కలవారైన, భూపాలపాశైః=రాజాధములతో, అలం=చాలును; తాప-అవిష్ట-సకృత్ ప్రపన్నజన - ముక్తి-ఆపాదనే = తాపత్రయములచేత - ఆవేశింపఁబడినను ఒకసారియైన ప్రపత్తినిష్ఠగలవారికి - మోక్షమును - ఇచ్చుటయందు, దీక్షితం=దీక్షవహించిన, కుహనాగోపాలం=మాయతోఁ గూడిన రాజగోపాలస్వామిని, పాపానాం=పాపములయొక్క, అపనోదనాయైవ=విడువలకొఱకే, ఆశ్రయే=ఆశ్రయించు చున్నాను.

తా. యాచకులమీఁద కోపముచేసి, గడుసుమాటలాడి, వారిమనసుకు కష్టమును గల్పించునట్టి రాజాధములతో నాకు పనిఏమి? ఒక్కసారి ప్రపత్తిచేసినను, మూఁడు తాపములనుకూడ పోఁగొట్టి మోక్షమునిచ్చుటయే దీక్షగాగలిగిన యీ మాయారూపుఁడైన శ్రీ రాజగోపాలస్వామిని సేవించి, నేను సర్వపాపవిముక్తుఁడ నగుచున్నాఁడను.

శా. కోపాటోపమువేళ వైశమ కటూక్తుల్పల్కి, పైనర్థుల
వ్యాపారాంతర హీనులన్ బగఱ త్రోకేవఁ బెట్టి, నెట్టించునా
భూపాలాధములన్ దొఱంగి, కుహనోద్యూతున్ శ్రితశ్రీదుశ్రీ
గోపాలున్ మదఘాపనోదనముకై కొల్తున్ దలిర్తున్ మదిన్.

కృశానుః.—కృశానువు.—

గ॥ అత్రాపి మే విరోధ ఏవప్రతిభాతి॥ 734

వ. ఈతనియందును నాకు విరోధమే తోఁచుచున్నయది.

యతః.—ఏలంటే?—

శ్లో॥ న్యస్తపాద స్సుమనసాం శీర్షేషు మధు హా ర్యహో?
మురారాతి ర్ద్విరేఫోఽపి చంపకారణ్య మాశ్రితః॥ 735

అ. సుమనసాం=పుష్పములయు - దేవతలయు, శీర్షేషు=పైభాగములందు-శిరస్సులందును, న్యస్తపాదః=ఉనుపఁబడిన పాదములుగల, ద్విరేఫోఽపి=భృంగమయ్యును=రేఫద్వయముతోడి మురారాతి శబ్దవాచ్యుఁడయ్యును; మురారాతిః=ఈ రాజగోపాలస్వామి, మధుహారీ=మకరందమును హరించుచు-మధు

రాక్షస సంహారియునై, చంపకారణ్యం=చంపకవనమును, ఆశ్రితః=ఆశ్రయించి నవాఁడు. అహో=ఆశ్చర్యము?

తా. పూలమీఁద వ్రాలుచు, తేనియను గైకొనుచు, భ్రమరమని ద్విరేఫములుగల యాభృంగము తనకు విరోధియైన చంపకవనమునుగూడ తాను ఆశ్రయించునట్లు; ఈ రాజగోపాలస్వామి దేవతల తలలమీఁదఁగూడ పాదము లుంచువాఁడై మురారాతియని రేఫద్వయముకూడఁ గలిగియు; మధుఁడను రాక్షసునిఁగూడ సంహారము చేసినవాఁడయ్యును, ఈలోకమున చంపకారణ్యము నాశ్రయించి యున్నవాఁడు. ఇదే మహాశ్చర్యము?

క. సుమన శ్శీర్ష పదన్యా
సము మధుహారికగు, నగునె? శ్రీ చంపకకాంతా
రమున విహారము,కడుఁ జి
త్రము? మురహారిద్విరేఫ శ్రీ రాజేతానై.

విశ్వావసుః.—విశ్వావసువు —

గ॥ విరుద్ధానామపిసహావస్థానసంపాదకే దేవేవాసుదేవే కానామ విరోధకథా?॥ 736

వ. విరుద్ధులకు సహా సహావస్థానమును సంపాదించు నీవాసుదేవ దేవునందు నావిరోధకథ యేమిటిది?

వృ॥ యస్మిన్ విలోచనతయా సహపుష్పవంతౌ
పర్యంకవాహనతయా ఫణిపక్షిరాజౌ
తేజస్వినౌ ప్రముదితౌ స్థితిమాశ్రయేతే
తస్మిన్మహో భగవతిక్వవిరోధగంధః?॥ 737

అ. తేజస్వినౌ=వీర్యవంతులును - కాంతిమంతులు నైన, పుష్పవంతౌ= చంద్రసూర్యులు, ప్రముదితౌ=సంతోషపడినవారై, యస్మిన్=ఎతనియందు, విలోచనతయాసహ = నేత్రములగుటతో, స్థితిం=ఉనికిని, ఆశ్రయేతే=ఆశ్రయించుచున్నవారో, తేజస్వినౌ=అట్టి వీర్యకాంతిమంతులైన ఫణిపక్షిరాజౌ=

సర్పరాజును పక్షిరాజునైన ఆదిశేషగరుత్మంతులును, ప్రముదితౌ=సంతోషపడినవారై, యస్మిన్ = ఎతనియందు, పర్యంకవాహనతయాసహ= పడకగానువాహనముగాను అగుటతో, స్థితిం=ఉనికిని, ఆశ్రయేత్ = ఆశ్రయించుచున్నారో;తస్మిన్ =అట్టి, భగవతి=భగవంతుఁడైనయీ రాజగోపాలస్వామియందు, విరోధగంధః=విరోధలేశమైనను, క్వ=ఎక్కడిది ? అహో?=ఆశ్చర్యము.

తా. తేజోవంతులయ్యును శీతోష్ణకరులగుటచేఁ బరస్పర విరుద్ధులైన చంద్రసూర్యులు ఎవనికి కన్నులుగాను, పాకెడునదియు నెగిరెడునదియు నౌటచేఁ బరస్పరవిరుద్ధులునైన ఆదిశేషగరుత్మంతులెవనికి శయనమునుగా వాహనమునుగానై యన్యోన్యానుకూల్యము కల్గియుందురో? ఆయీభగవంతునికి విరోధ మనునది యేమాత్రమైనను కలిగియుండదుగదా?

ఆ. ఎతని కనులె యగుచు నెనసిరి సరిపుష్ప
వంతు,లురగపతగ వరులు తల్ప
వాహనములె యగుచు వఱలిరి తేజస్వు,
లతనియెడ విరోధ మసదు కలదె ?

గ॥ ఇతి పరిక్రమ్య అవలోక్య ప్రాంజలిః॥ 738

వ. అని చుట్టుందిరిగి వీక్షించి విహితాంజలియై.

వృ॥ పరిగత సహకారైః ప్రాంశుభిర్నాళికేరై
ర్దినకరకరధారాదుష్ప్రవేశాంతరేభ్యః
చులుకిత దురితేభ్యశ్చోప్పల దేశస్థితేభ్యో
నమ ఇదముఖిలేభ్యో నాథదివ్యస్థలేభ్యః॥ 739

అ. పరిగతసహకారైః = సర్వత్రవ్యాపించియుండు మామిడులతో, ప్రాంశుభిః=మిగులపొడవైన, నాళికేరైః=నాళికేళవృక్షములతో, దినకర+కరధారా+దుష్ప్రవేశ+అంతరేభ్యః=సూర్యునియొక్క+కిరణసమూహముచేత+చొరఁగూడని+మధ్యభాగముకలవై, చులుకిత దురితేభ్యః=తొలఁగఁద్రోయఁబడిన దోషములుకలవై, ... దేశస్థితేభ్యః = ... అట్టి, అఖి

లేభ్యః=సకలమైన, నాథదివ్యస్థలేభ్యః = సకలలోకాధినాథుఁడైన స్వామి యొక్క దివ్యస్థలములకు, ఇదం=ఇది, నమః=నమస్కారము?

తా. మామిడిలోఁపులతోడను టెంకాయిలోఁపులతోడను సూర్యరశ్మి యే తాఁకనివై సకలదోషహరములైన యీచోలదేశపుదివ్యస్థలములను నమస్కరించెదను.

చ. దినకరరోచి యేచియును ♦ దీఱఁజొఱంబడనట్టి మావిడుల్
మునుకొని,మీఱునారికెడ ♦ ముల్లలతోఁపుల నిండుకావులఁ
దనరెడు దివ్యదేశముల దాపుల ♦ దాపులఁ జోళదేశమం
దొనరుతునందనంబులి వెఱియొప్పమి యెప్పుడుఁదప్పిపోవఁగాన్

కృశానుః—కృశానువు.—

గ॥ భవతు భవతఏతేషు నమస్కర్తృతా మమతు దేవలకాది దేవాలయోప జీవి దురాచారా నాలోకయతోనభవతినమ శ్చికీర్షా॥ 740

వ. నీకీదివ్యదేశ విషయమైన నమస్కారకారిత కలిగినను గలుగనీ? నాకీ దేవళకాదులైన దేవళములే పూజించి జీవించు దురాచారుల గుఱించి యోచింప, నమస్కరింపఁ దలంపే కలుగదయ్యె.

తథాహి.—అదిస రే?—

శా. వారస్త్రీకుచమర్దిభి ర్విరచయం ♦ త్యర్ఘ్యాదిదానంకరైః
తద్వీటీరసవాసితై శ్చనదనై ♦ ర్జల్పంతి మంత్రా నమీ
ద్రవ్యం దేవలకా హరం త్యచకితా ♦ దేవస్యతత్పూజితా
స్వేతాసుప్రతిమాసు హంత ? భవితా ♦ కిందేవతాసన్నిధిః.

అ. అమీ=ఈ, దేవలకాః=దేవపూజకులు, అచకితాః=నిర్భయులై, వారస్త్రీకుచమర్దిభిః=వేశ్యల స్తనమర్దనముచేయు, కరైః = చేతులతో, దేవస్య =

వాసుదేవునకు, అర్ఘ్యాదిదానం=అర్ఘ్యము మొదలైనవాని సమర్పణమును, విరచయంతి=చేయుచున్నారు; తద్వీటీరసవాసితైః=వారి విడియముల రసముచేత వాసనకొట్టుచున్న, వదనైశ్చ=మొగములతోను, మంత్రాన్=మంత్రములను, జల్పంతి=పలుకుచున్నారు; ద్రవ్యం=దేవద్రవ్యమును, హరంతి=అపహరించుచున్నారు; తత్పూజితాసు=అట్టిపూజకులచేతపూజింపఁబడిన, ఏతాసు=ఈ, ప్రతిమాసు=విగ్రహములయందు, దేవతాసన్నిధిః=దేవతల సాన్నిధ్యము, భవితా కిం=కలుగఁగలదా ?

తా. ఈ చోళదేశపు దేవపూజకులు కొంతయైనను జంకుపడకయే, దేవతలకు తాము భోగమువాండ్ర చనుల మర్దించిన చేతులతోనే అర్ఘ్యమిచ్చుచు, వారు నమిలియిచ్చిన తమలపాకుమడఁతలు తాము నమిలిననోటివాసనతోనే మంత్రములఁ జెప్పుచునుండుటేగాక, కైంకర్యమునకై భక్తులిచ్చెడి ద్రవ్యమునుగూడ నపహరించుకొనుచున్నారు. అట్టివారు పూజించునట్టి యర్చావిగ్రహములయందు అయ్యాయిదేవతల యావిర్భావ మెట్లు కలుగును? అయ్యో?.

శా. వారస్త్రీకుచమర్ది హస్తములచేఁ బాటింతు రర్ఘ్యాదు,లా
వారస్త్రీవిడియంపుఁ గంపువులతోఁ వల్లింత్రుమంత్రాల, దే
వారాధ్యంబగు ద్రవ్య మేదయిన నాహా? యాక్రమింత్రక్రముల్,
వీరర్చించెడు విగ్రహాల నెటు లావేశించు నా దైవముల్.

కించ.—మఱియు.—

శా. ఆఘ్రాతాబత పుణ్యయౌవతకథాఁ నోకర్మ సంధ్యాదికమ్
యైరభ్యస్తమదభ్రసభ్యవచనం ఁ న త్వేవ వేదాక్షరమ్
అంధశ్చౌర్యపరైర్దురన్వయభవైః ఁ సూపాద్యమీభిఃకృతా
న్యన్నాద్యానినివేదితాని భగవానంగీకరోత్యేషకిమ్. 741

అ. యైః=ఎవరిచేత, పుణ్య-యౌవత-కథా = పుణ్యవతులైన-యౌవనస్త్రీల సమూహము యొక్క-కత, ఆఘ్రాతా=అంగీకరింపఁబడినదో; సంధ్యాదికం=సంధ్యావందనాదికమైన, కర్మ=కార్యము. నోఆఘ్రాతం=అంగీకరింపఁ బడినది

కాదు. అదభ్ర-సభ్య-వచనం = విస్తారమైన-సభార్హ్యమువలె కపటవచనము, అభ్యస్తం = అభ్యసింపఁబడినదో; వేదాక్షరంతు=ఆ వేదమందలి యొకయక్ష రమైన, నైవ అభ్యస్తం=అభ్యసింపఁబడినదికాదు. అంధస్-చౌర్య-పరైః= అన్నముయొక్క - దొంగతనమందు ఆసక్తులై, దురన్వయ-భవైః=దుష్కుల మందు-జన్మములగల, తైః=అట్టి, అమీభిః=ఈ, సూదైః=పాచక పరిచారకుల చేత, కృతాని=చేయఁబడిన, అన్నాద్యాని=అన్నము పప్పు మొదలైన, నివే దితాని=నివేదింపఁబడినవానిని, ఏషః=ఈ, భగవాన్=భగవంతుఁడు, అంగీక రోతికిం=కైకొంచున్నాఁడా?

తా. ఈ దేవస్థానమందలి స్వయంపాకులు ఆ వారస్త్రీలతో మాటలేగాక సంధ్యావందనాది క్రియలు చేయరు, మఱి ముఖప్రీతిగా కపటవచనములే గాక వేదాక్షర మొకటియైన నేర్చుకోరు, దేవాన్నమునుగూడ దొంగలించుకొనెడి వీరిచేఁ బక్వమైన యన్నసూపాదులు నివేదింపఁబడినను; భగవంతుఁ డేల యం గీకరించును?

తే. కరము సతికతె కలదు, సత్కర్మ కలదె?
చదురులాడుటె కలదు, ప్రాఁజదువు కలదె?
నన్నచోరులు పచియించు నన్నములనె
యటమటింపఁగ భగవంతుఁ డెటులఁగొనెడు?

గ॥ విమృశ్య అహో? కలిమాహాత్మ్యా దఖిలజనానా మనివార్యో వివేక విపర్యయః ॥ 742

వ. విమర్శించి ఆహా? సకలజనులకును గలిమాహాత్మ్యము వలని సదసద్విచార రాహిత్యము నివర్త్యమె కాదయ్యె.

యతః. — ఏలంటే. —

శా. సద్మస్వాదరతో ఽర్పితాని హరయే సత్యో వ్రత్తరై ర్భూసురై
రన్నాన్యత్ర ... ప్రవృద్ధాన్యపి

దేవస్యాయతనేష్వదంతివిభయా వ్రాత్యైః కృతానోదనా
స్పృష్టాదుష్టజనేనకష్ట మఖిలై ర్దృష్టానశిష్టాహృతాన్ ॥743

అ. సద్మసు=ఇండ్లలో, విధివత్=ఆచార ప్రకారము, సిద్ధాని=పాకసిద్ధములై, సత్వోత్తరైః=సత్వగుణముచేత శ్రేష్ఠులైన, భూసురైః=బ్రాహ్మణులచేత, హరయే=విష్ణువునకు, ఆదరతః=ఆదరముతో, అర్పితాని=సమర్పింపఁబడిన, అన్నాని=అన్నములను, అత్ర=ఇక్కడ, వృద్ధాఅపి=వృద్ధులుకూడ, నమానయంతి=సన్మానించరు; దేవస్య=దేవునియొక్క, ఆయతనేషు=ఆలయములందు, వ్రాత్యైః=సంస్కార హీనులచేత, కృతాన్=చేయఁబడినవై, దుష్టజనేన=దోషులచేత, స్పృష్టాన్=అంటఁబడినవై, అఖిలైః = అనేకులచేత, దృష్టాన్=చూడఁబడినవై, అశిష్టాహృతాన్=శిష్టులుకాని వారిచేత తేఁబడినవైన, ఓదనాన్=అన్నములను, విభయాః=జంకులేనివారై, అదంతి=భక్షించుచున్నారు; కష్టం=అయ్యో?

తా. ఈలోకములో జ్ఞానముచేఁగాని వయస్సుచేఁగాని వృద్ధులైనవారు శిష్టులయిండ్లలో ఆచారప్రకారము చేసి దేవతార్చన చేయఁబడిన యన్నమునుగూడ చేకొనువారు కారుగాని; దేవళములలోనో? సంస్కారహీనులే చేసి దురాచారులంటి అందఱును జూడఁ దెచ్చియిచ్చిన యన్నమునుమాత్రము జంకులేక తీసికొని సాపడెదరు. ఇదేమి యాశ్చర్యమో కదా?

సీ. శిష్టులయిండ్ల విశిష్ట సదాచార
సిద్ధములన్నాదు లిద్ధమతిని
సత్వగుణోత్తమ సాధుసంఘముచేత
హరికినాదరముతో నర్పితములై
జ్ఞానవయోవృద్ధు లైనవారలువారు
నాఁదటఁ గ్రహింప రైన; వారె
దేవతాలయముల భావశుద్ధియలేక
సంస్కారమును లేక సంచరించు

తే. పాచకులె చేసి పలుగురు కేఁ జూచిచెనఁటి
జనులునంటి దురాచార కేఁ జనులుదెచ్చి
నవియ గ్రసియింతు రన్నంబు కేఁలవికలాత్ము
లవుచు, వినఁ గన నాశ్చర్య కేఁ మవనియందు.

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ మాదృశేభ్యోహి దివ్యక్షేత్ర మాహాత్మ్య వేదిభ్యో భవదీ
యన్నృపాభాషణ దూషణం నరోచతే॥ 744

వ. దివ్యదేశ మాహాత్మ్య వేదులమైన మావంటివారికి నీయనృ
తభాషణ దూషణము రుచియింపదు కదా?

యతిః.—ఏలంటే?—

వృ॥ ఉషస్యేవ స్నానా దుచిత శుచితాశాలి వపుషః
వినీతాః స్వేశాస్త్రే విజితవృజినాః పూజకజనాః
పరిత్రాతుం లోకా౯ విధివ దపతంద్రా విదధతే
పవిత్రై రన్నాద్యైః పరమపురుషారాధన మమీ॥ 745

అ. ఉషసి=ఉదయాననే, స్నానాత్=స్నానమువలన, ఉచిత-శుచితా-శాలి-వపుషః = తగినట్టి-పరిశుద్ధిచేత - ఒప్పుచున్న-శరీరము గలవారును, స్వేశాస్త్రే=తమ మత శాస్త్రమందు, వినీతాః=తేఱినవారును, విజితవృజినాః=గెలువఁబడిన (దురాచార) దోషములు గలవారునైన, అమీ=ఈ, పూజకజనాః=అర్చకజనులు, లోకా౯=జనులను, పరిత్రాతుం=రక్షించుటకు, అపతంద్రాః=ప్రమాద పడనివారై, పవిత్రైః=పరిశుద్ధములైన, అన్నాద్యైః=అన్నము మొదలైనవానిచేత, విధివత్ = ఆచారప్రకారము, పరమపురుషారాధనం=పురుషోత్తముఁడైన భగవంతుని యర్చనమును, విదధతే=చేయుచున్నవారు.

తా. ఈ యర్చకజనులు ప్రాతఃకాల స్నానములచేతఁ పరిశుద్ధులై, స్వమతాచార విధులచే దురాచారములు వదలి, దేవాలయములందు జీవించుచుండు

టకై నియమముతప్పక, పవిత్రాన్నములతో భగవన్నివేదనము చేయుచు, లోపలనుగూ భగవత్ప్రసాద లబ్ధులనుగాఁ జేసి రక్షించుచున్నవారు.

సీ. ఉదయాన నుదయాన కనొగిఁ జేయు స్నానాన
శుచిరుచిరశరీర కశుభ్రతరులు
తనుతమశాస్త్రాలఁ కదమిఁదమిలోనైనఁ
జదివి తేటిన దానఁ కచతురతరులు
పాపౌఘముల నిలఁ కబాఱఁద్రోలఁగఁ జాలు
విధి విహితాచార కవిశద మతులు
పావన పరిపక్వకపానాన్నముల హరి
కారాధన మొనర్చుక నట్టివారు
తే. హరికి నారాధనమె చేసికనట్టివానిఁ
బానముల బోనముల భువిఁ కబావనముఁ
దానములఁ జేసి యరుదెంచు కదీనులకు నె
దానములఁ జేసి యర్చకు కల్దోనెల ర్తుని.

గ॥ అవకర్ణ్యతా మిదమపి యద్వాచోఽభ్యుపగమ్యా ప్యభిధాస్యామి॥ 746

వ. ఇదియును వినుదువుగాక? నే నీ దూషణ భాషణ మొకొని యును వాకొనియెదను.

వృ॥ విధివ దవిధివద్వా భక్తితో ఽభక్తితో వా
నను శుచి రశుచిర్వా నాథమర్చత్యిహత్యః
అనుదిన ముపయాతై రర్చ్య మానాసు దేవై
రరుచి రజితమూర్తి ష్వాస్తికస్యాస్తి కస్య? ॥ 747

అ. నను=ఓయి కృశానూ? ఇహత్యః=ఇక్కడివాఁడు, శుచిర్వా=పరిశుద్ధుఁడైకాని, అశుచిర్వా=అపరిశుద్ధుఁడైకాని, నాథం=స్వామిని, విధివద్వా=

శాస్త్రరీతిగాఁ గాని, అవిధివద్వా=శాస్త్రరీతి కాకగాని, భక్తితోవా=భక్తితోఁగాని, అభక్తితోవా=భక్తిలేకగాని, అర్చతు=పూజించునుగాక ? అనుదినం=ప్రతిదినమును, ఉపయాతైః=వచ్చుచున్న, దేవైః=ఇంద్రాది దేవతలచేత, అర్చ్యమానాసు=పూజింపఁ బడుచున్న, అజితమూర్తిషు=ఇతరులచే జయింపఁబడనేపడని (భగవంతునియొక్క) ప్రతిమలయందు, అరుచిః=అనపేక్ష, ఆస్తికస్య=పరలోకాపేక్షకలవానికి, కస్య=ఎవనికి, అస్తి=ఉన్నది ?

తా. ఓకృశానూ ? ఇక్కడి దేవపూజకాదులు పరిశుద్ధులై భగవానుని విధిప్రకారను భక్తితో అర్చనచేసినఁగాని; లేక అపరిశుద్ధులై విధితప్పి భక్తి లేక అర్చనచేసినఁగాని; దినదినమువచ్చి యింద్రాదిదేవతలు పూజించెడి యాభగవత్ప్రతిమలలో నాస్తికునకేకాక, పారలౌకికబుద్ధి కలవాని కెవని కేవగింపు గల్గును ?

ఆ. విధిని భక్తిశుచిని ॥ విపరీతమునఁగాని
పూజసేయనిమ్ము ॥ పూజకుండు?
అనుదినాగతామ ॥ రార్చితాచ్యుతమూర్తి
నాస్తికునకయరుచి ॥ యగునుజగతి.

ఇదంచావధేయం.—ఇదియును వినునదియ.—

శా. కేచిచ్చక్రధరాపచారచకితాః క్ష్మాపాలభీతాఃపరే
శ్రద్ధాతఃకతిచిత్ప్రచంత్యవహితా శ్శుద్ధాశ్చదివ్యంహవిః
అగ్రేన్యస్తమిదం ముదైవ భగవా నాలోకనై స్స్వీకరో
త్యంహస్సంహరణా శయాచతదిదం ప్రాశ్నంతిభాగ్యోత్తరాః.

అ. కేచిత్=కొందఱు(దేవాలయములలోని పాచకులు), చక్రధర అపచార చకితాః=చక్రపాణియైన మహావిష్ణువునందు-అపరాధమునకు-భయపడినవారు, శుద్ధాశ్చ=పరిశుద్ధులగుచును, పరే=ఇతరులు (కొందఱు) క్ష్మాపాలభీతాః = రాజులవలన భయపడినవారగుచు, కతిచిత్=కొందఱు, అవహితాః=ప్రమాదపడనివారగుచు, శ్రద్ధాతః=శ్రద్ధతో, దివ్యం = నిర్దోషమైన, హవిః = అన్న

మును, పచంతి=పచనముచేయుచున్నారు. అగ్రే = ఎదుట, న్యస్తం=ఉంపఁబడిన, ఇదం=ఈయన్నమును, భగవాన్=భగవంతుఁడు, ముదైవ=సంతోషముతోనే, ఆలోకనైః=వీక్షణములతో, స్వీకరోతి=అంగీకరించుచున్నవాఁడు. భాగ్యోత్తరాః=భాగ్యముచేత మేలైనవారు, అంహః-సంహరణ-ఆశయాచ=పాపములయొక్క-నివారణమందు - అపేక్షచేతను, తత్ ఇదం = ఆభగవదంగీకృతమైన ఈయన్నమును, ప్రాశ్నంతి=భుజించుచున్నారు.

తా. కొందఱు పాచకులు స్వామివిషయమున అపరాధమునకు భయపడి పరిశుద్ధు లయినవారును, కొందఱు కైంకర్యపరులయిన యజమానుల ఉత్తరువు అనుసరించువారును, కొందఱు కార్యాంతరములవలన ప్రమాదపడనివారునై, పచనముచేసితెచ్చి యెదుటనుంచిన దివ్యాన్నమును ఆభగవానుఁడు సంతోషముతో చూపుమాత్రముతోనే, స్వీకరించుచుండును. అట్టి ఆ యారగించినప్రసాదము భాగ్యవంతులు తమతమ సకలదోషనివృత్తి నిమిత్తమై తాము భుజించుచుందురు.

## పంచపాదిపద్యము.

ఉ. కొందఱు సాపరాధభయకొగుప్తులు కొందఱుభూపభీతుల్గా
గొందఱు శ్రద్ధధాను లదిగాక బరిశుద్ధులు జాగరూకు ల
స్పందులుదివ్యమన్నమునుపక్వము చేసిముకుందుముందిడ్గా
ఛందమునొంది చూపులనెసాపడు బాఁపఁడు దానిసాపడుగ్గా
గొందల మీఁగఁగా వివిధ కోవిదబృందముకూడసాపడున్.

గ॥ పశ్య? తావత్ స్వానుభవసిద్ధాప్రకర్షనికర్షౌ భగవదాయతన తదితరస్థల పరికల్పితయోః రన్నయోః॥ 748

వ. చూడుమీవ? దేవాలయములందును దదన్యస్థలములందును జేయుచున్న యన్నాదులయందలి ప్రకర్షనికర్షములు తమతమ యనుభవముననే ప్రసిద్ధములు.

అ. భగవదాయతన తదితరస్థల పరికల్పితయోః = దేవాలయములందును-

ఇతరస్థలములందును- చేయఁబడిన, అన్నయోః = అన్నములయొక్క, ప్రకర్ష నికర్షౌ=ఉత్కృష్టాపకృష్టతలు, స్వానుభవసిద్ధౌ = తమతమ అనుభవములచేత సిద్ధమైనవి. పశ్య=చూడు ?

తా. భగవత్సన్నిధులయందు చేసిన అన్నము ప్రకృష్టమనియు, ఇతర స్థలములయందు చేసిన అన్నము నికృష్టమనియు తమతమ అనుభవములచేతనే సిద్ధమయినవి. చూడు? దాని దానిని.

వృ॥ ఉపస్కారైస్స్ఫారైరుపచితరసామోదభరమ
ప్యవైత్యన్నం గేహే కృత మయమభోగ్యంబుధజనః ।
అభూయస్సంస్కారిణ్యాపి హవిషి దేవాలయభవే
త్వనల్పంభోగ్యత్వం పునరఘహరత్వంచ మనుతే॥ 749

అ. స్ఫారైః= బహువిధములైన, ఉపస్కారైః= వ్యంజనములచేత, ఉపచిత-రస-ఆమోద- భరమపి = అతిశయించిన - రసములయొక్క-వాసనలయొక్కయు-అధికతకలది అయ్యును, గేహే = ఇంట, కృతం = చేయఁబడిన, అన్నం=అన్నమును, అయం=ఈ, బుధజనః=శిష్టజనము, అభోగ్యం=అనుభవింపఁదగనిదానిఁగా, అవైతి=తెలిసికొనుచున్నది. అభూయస్సంస్కారిణ్యాపి= మిక్కిలి చక్కఁజేసినది కానిది అయ్యును, దేవాలయభవే=దేవాలయములందు కలిగిన,హవిషితు = అన్నమునందో, అనల్పం = అధికమైన, భోగ్యత్వం=భోగ్యతను, పునః=మఱల, అఘహరత్వంచ=దోషహారతనుకూ, మనుతే=తలఁచుకొనుచున్నది.

తా. మతమందిరాదులందలి షడ్రసపరిమళములుగల వ్యంజనాలతోడి యన్నము భోగ్యముకాదనియు, దేవాలయములందలి యన్నము ఎంతబాగుచేయనిదీ అయ్యును అది అధిక భోగ్యమనియు, అఖిల దోషహారముననియు, శిష్టులెంచుకొనెదరు.

తే. గృహగత ముపస్కృతాన్న మో కీయహితమే య
భోగ్య మే [illegible]

పస్కృతాన్యము నన్నము కే పరిగృహీత
మగునె యెట్టి దేవాలయకేమందుఁ గాని
యట్టియఘహరమునని బుకధాళికెపుడు.

ఇదంచబోద్ధవ్యమ్.—ఇదియును తెలియునదియ?—

వృ॥ దేవాగారనిషేవిణః కిల జనా దుష్యంతు శుద్ధ్యంతువా
తేఽమీ స్వామిపరిగ్రహేణనియతంమాన్యామనీషాజుషామ్।
ప్రాయేణాశ్రయగౌరవేణ లభతే హీనోఽపిమానార్హతాం
కుబ్జక్లీబముఖోజనోఽపి భజతేపూజాంహిరాజాశ్రయాత్ ॥

అ. దేవాగారనిషేవిణః = దేవస్థానములందు సేవకులైన, జనాః=జనులు, దుష్యంతు=దూష్యులగుదురు గాని, శుద్ధ్యంతు = పరిశుద్ధులగుదురుగాని, తేఅమీ=ఆయా సేవకులు, స్వామిపరిగ్రహేణ=స్వామిఅనుగ్రహించుటచేత, మనీషాజుషాం=బుద్ధినందినవారికి, నియతం=నియమముగా, మాన్యాఃకిల = సమ్మాననీయులుకదా? హీనోఽపి=నీచుఁడుకూడ, ప్రాయేణ=మిక్కిలిగా, ఆశ్రయగౌరవేణ=తన ఆశ్రయమువలని గౌరవముచేత, మాన-అర్హతాం = సన్మానమునకు-యోగ్యతను, లభతే=పొందుచున్నాఁడు. కుబ్జ-క్లీబ-ముఖః = పొట్టివాఁడు-పేడివాఁడు-మొదలుగాఁగల, జనోపి = మనుష్యుఁడుకూడ, రాజాశ్రయాత్ = రాజునాశ్రయించుటవలన, పూజాం = సన్మానమును, భజతేహి = పొందుచున్నాఁడుకదా ?

తా. దేవస్థానములోని పరిచారకులు పరిశుద్ధులుగాని అపరిశుద్ధులుగాని ఆయా దేవతలుపరిగ్రహించుటచేత తాము బుద్ధిమంతులలో పూజ్యులే అగుదురు. ఎంతటిహీనుఁడైనను గొప్పవారి నాశ్రయించుటచేత తానును పూజ్యుఁడే యగును. కుంటి పేడి మొదలైనవారుకూడ రాజునాశ్రయించుటచేత నే కదా! తామును పూజ్యులె యగుచున్నారు.

శా. దేవాగార నిషేవకుల్ జనులు శుద్ధి లేక శుద్ధి సదా
దేవాధీశపరిగ్రహంబునన సంశోధిష్ణుభావుల్ మహా

భావోద్భావనలాశ్రయంబుకొలఁదిన్ శోభాపించుటంగ్రించుటన్
భావింపన్ గురునాశ్రయంబునగురుత్వంబేక దా? పొందుదుర్.

టీ. సందీప్తానుభావుల్ = ప్రకాశింపఁబడెడి ప్రభావముకలవారు, మహాభావోద్భావనలు = గొప్పమనస్సుగలవారితలంపులను.

గ॥ ఇత్యన్యతః పరిక్రామన్నగతోఽవలోక్యసహర్షం సాంజలి బంధమ్॥ 751

వ. అని మఱొకప్రక్కకుఁ బరిక్రమించుకొని యెదురంగని హర్షించి యంజలియు బంధించి.

## సేతువర్ణనము.

ఇ. సేతువు-ఇది శ్రీరాములు రావణాసురుని సంహారమునకై లంకకుఁబోవుటకుఁగాను అనేక వానరసమూహముతోడ సముద్రముదాఁటుటకు శక్యముకాకపోయి, హనుమజ్జాంబవత్సుగ్రీవాదులైన వానరాధిపతుల యాజ్ఞలమూలమున అనేక వానరులుచేరి, ఒక్కొక్కవానరుఁడొక్కొక్కపర్వతము నెత్తుకొని యెత్తుకొని వచ్చివచ్చి క్రిందనుండి పైపైకు వేసివేసి మిట్టచేసి అందఱును సులభముగ దాఁటిపోవుటకై ఆ దక్షిణసముద్రమందు కట్టినవారధి.

వృ॥ పాతుంపాతకినోజనా నశరణాన్ పాతుం తమస్సాగరమ్
యాతుం యాతుపురీ మరీన్ రణముఖే జేతుం దశాస్యాదికాన్।
నేతుం భూతనయాంముదం విహారిణీ మేతుంయశశ్శాశ్వతమ్
దాతుంశర్మ చరాఘవేణ రచితం సేతుం నమస్కుర్మహే॥

అ. అశరణాన్ = కాపాడువారులేని, పాతకినః = పాపిష్ఠులైన, జనాన్ = జనులను, పాతుం = కాపాడుటకును; తమః-సాగరం = అజ్ఞానమనెడి - సముద్రమును, పాతుం = త్రాగివేయుటకును, యాతుపురీం = రాక్షసులపట్టణమైన లంకను గూర్చి, యాతుం = పోవుటకును; రణముఖే = యుద్ధారంభమందు, దశాస్యాదికాన్ = రావణాసురుఁడు మొదలుగాఁగల, అరీన్ = శత్రువులను, జేతుం = జయిం

చుటకును; విరహిణీం=భర్తృవియోగముగలిగియున్న, భూతనయాం = భూపుత్రికయైనసీతను, ముదం=సంతోషమును, నేతుం=పొందించుటకును; శాశ్వతం=నిత్యమైన, యశః=కీర్తిని, ఏతుం=పొందుటకును; శర్మచ=సకలవిధానందమునుకా, దాతుం=ఇచ్చుటకును; రాఘవేణ=శ్రీరామునిచేత, రచితం=చేయఁబడిన, సేతుం=వారధిని, నమస్కుర్మహే=నమస్కరించుచున్నాము.

తా. దిక్కులేని మహాపాపులనైనను పావనపఱచి, వారివారి అజ్ఞానమును పోఁగొట్టుటకై లంకకుపోయి రావణాదులను సంహరించి, తనతోడియెడఁబాటున దుఃఖపడుచున్న సీతాదేవిని సంతోషపఱచుటకై మంచికీర్తిని కోరి, అందఱకును మించిన యానందమును కలిగించుటకై ఆ శ్రీరాములచేత కట్టఁబడిన యీ సేతువును మనము నమస్కరించుచున్నాము.

సీ. పాతకిజనులను • బరిరక్షసేయుకై
తతతమోర్ణవమును • ద్రావుకొఱకు
ఆశరపురినిఁ బ్రవేశంబు సేయుకై
రణమందె రిపుగణం • బణఁచుకొఱకు
జానకి విరహము • మానంగఁ జేయుకై
హనుమంతుని ప్రయత్న • మడరుకొఱకు
మందోదరిన తా నమంగలిఁ జేయుకై
సరమ సుమంగలి • సలుపుకొఱకు
తే. మంగళములను మహికిచ్చి • మనుచుకొఱకు
నసదృశంపుయశంబున • నెసఁగుకొఱకు
రామచంద్రుఁడు • రచియించి రమ్యమయిన
సేతువునకే తపును జోత • సేయనాకు.

టీ. తత-తమః-అర్ణవమును=విస్తారమైన-అజ్ఞానమనెడి - సముద్రమును, ఆశరపురిని = రాక్షసులపట్టణమైనలంకను, మందోదరిన = రావణునిభార్యయైన

మండోదరిని, అమంగళీ=మంగళసూత్రము లేనిదానిఁగా - విధవనుగా, సరమా=విభీషణుని భార్యయైన సరమను, జోత=నమస్కారమును.

గ॥ హంత ? కలినానా మప్యమీషా మతిమహతీ ప్రీతి రను
బంధిజనే ॥ 753

వ. ఆహా ? ఈ యతికలినులకుఁగూడఁ దమ యనుబంధి జనమం
దుఁ బ్రీతి యతి మహతిగనున్నయది.

యతః—ఏలంటేని ?—

వృ॥ లంకాపురే పంక్తిముఖేన రుద్ధాం
భూమేస్సుతాం భూమిభృతోఽనుబంధాత్ ।
సేతూభవంతః స్వయమాప్లవంతే
ప్రీత్యాపునః ప్రాపయితుం పయోధౌ॥ 754

అ. భూమిభృతః=పర్వతములు, అనుబంధాత్=సంబంధమువలన, లంకాపురే=లంకాపట్టణమున, పంక్తిముఖేన=దశముఖుఁడైన రావణునిచే, రుద్ధాం=అడ్డగింపఁబడిన, భూమేస్సుతాం=భూపుత్రియైనసీతను, పతిం=పెనిమిటియైన శ్రీరాముని, ప్రాపయితుం = పొందించుటకై, పయోధౌ = సముద్రమందు, సేతూభవంతః=సేతువులై, స్వయం=తాముగానె, ఆప్లవంతే=తేలుచున్నవి.

తా. రావణుఁడు తీసికొనిపోయి సముద్రమునడుమ లంకలోఁ జేర్చిన సీతను ఆమెపెనిమిటియైన శ్రీరామునిఁ జేర్చుటకై భూధరములైన పర్వతములు భూపుత్రియైన యాసీతాదేవితోడి తమ దేహసంబంధమైన భూసంబంధము కలవి యవుటచేత తాము నాసముద్రమందె సేతువుగా చేర్పఁబడినవై తేలుచున్నయవి.

ఆ. లంక ధాత్రిపుత్రి ◊ లంకాధి నాథుఁ డ
ట్టు నుప ధాత్రిధరము ◊ లెనసి యిట్టు
లామె·నామెపతికి ◊ నర్పింపసేతు నై
యబ్ధియందు నోలలాడుఁ జూడు ?

వృ॥ పయోధిమధ్యే ప్లవమానమూర్తయ
స్తరంగ వేగార్పిత ఫేనచిహ్నితాః ।
హసంతి కిం మందర మంతరర్ణవం
నిమగ్నమేతే నలసేతుభూధరాః ॥ 755

అ. పయోధిమధ్యే=సముద్రము నడుమ, ప్లవమానమూర్తయః=తేలుచున్న స్వరూపముకలవియై, తరంగవేగ-అర్పిత-ఫేన-చిహ్నితాః= అలలవేగముచేత-చేర్పఁబడిన నురుఁగులచే - గుర్తింపఁబడినవియైన, ఏతే=ఈ, నలసేతుభూధరాః=నలునిచేఁ జేర్పఁబడిన సేతువునందలి పర్వతములు, అంతఃఆర్ణవం= సముద్రములోన, నిమగ్నం=మునుఁగఁబడిన, మందరం = మందరపర్వతమును, హసంతి=పరిహసించుచున్నవి. కిం=ఏమి ?

తా. సుగ్రీవుని సేనాధిపతియైన నలుఁడు అనువానిచే సేతువుగా చేర్పఁబడిన యీపర్వతములు అలలవలని నురుఁగులచే తెల్లనివై కనఁబడుచున్నందున పాలసంద్రమున అమృతము తఱచుచు అడఁగియున్న ఆ మందరపర్వతమును నవ్వుచున్నవానివలె నున్నయవి.

ఆ. కడలి నడుమఁ దేలి కడలు వేగంబున
నురుఁగుఁబూని లోనికతరిధరంబు
ననఁగియున్న దానిఁ గని నగెనో ? యన
నలుని సేతు శైలకములు తలిర్చె.

ఇ. మందరపర్వతము = తరిధరము_ఇది ఆ మహావిష్ణువు రాక్షసులవలన మృతియే లేకుండుటకై పాలసముద్రమున వాసుకి త్రాడుగాను, ఈమందర పర్వతము కవ్వముగాను చేసికొని, ఆ దేవ రాక్షసులచేతనే తరువఁబడి, అందుండి కల్పవృక్ష కామధేను ఉచ్చైశ్శ్రవ ఐరావత లక్ష్మీ చంద్ర కౌస్తుభ చింతామణులతోడ తేలిన అమృతకలశములోని అమృతమును ఆదేవతలకే యిచ్చుటకుఁగాను, అంతకుముందె మోహినీరూపమున ఆ రాక్షసులను మోస పుచ్చి మఱియొకరూపముతోవచ్చి అమృతమును ఆదేవతలకు పంచిపెట్టి వారు

దానివలన అమరులు=మరణములేనివారు, నిర్జరులు=ముసలితనము లేనివారునై యుండునట్లు చేయుటకు ఉపకరణముగా-కవ్వముగానుండిన పర్వతము.

పునర్విమృశ్య.—మఱలవిమర్శించి.—

వృ॥ లంకాపురావాసిరఘూద్వహారిసంపర్కపాపాదివసింధురాజః ।
సపక్షభూభృన్నిబిడాంతరోఽపివిపక్షభూభృద్భిరబాధికష్టమ్ ॥

అ, సింధురాజః=సముద్రము, లంకాపురావాసి - రఘూద్వహారి-సంపర్క పాపాదివ=లంకాపట్టణమందు వాసముచేయునట్టి-శ్రీరాముల శత్రువైన రావణునియొక్క-సాంగత్యముతోడి పాపమువలనవలె, సపక్ష-భూభృత్-నిబిడ-అంతరోపి = తనయందుపక్షము- ఱెక్కలుగల- రాజులచేతఁగాని-పర్వతములచేతఁగాని-దట్టమైన-అంతర్భాగముకలదియైనను, విపక్షభూభృద్భిః = పక్షములేని రాజులచేతను-పర్వతములచేతను, అబంధి=బంధింపఁబడెను. కష్టం=అయ్యో?

తా. సముద్రము తనవగ్గఱి లంకారాజైన రావణాసురుని సహవాసదోషమువలనవలె తనయందు పక్షపాతులైన రాజులుండియు నిష్పక్షపాతులైయుండినయట్లు ఱెక్కలతోడి పర్వతములుండియు లేని యాపర్వతముల చేతనే బంధింపఁబడెను, ఇది కష్టకార్యము ?

తే. రావణునితోడఁ గూడిపాపావహమున
నిట్టులీసింధురాజంబు కట్టువడియె
లోసపక్షభూభృత్తతి లోఁగియున్నఁ
బై విపక్షభూభృత్తతి పాటుపడఁగ.

వృ॥ శుద్ధాస్సంశ్రితధర్మసేతవ ఇమే సోఢోగ్రవర్షాతపాః
స్థిత్వాసింధుజలే సదాక్షితిభృతో ఘోరంతపఃకుర్వతే ।
నృత్యంతీరిహనిత్యమేవ చపలాస్త్రీత్ష్ణై రతన్వాశుగైః
లావణ్యందధతీః కదాపి నచలంత్యాలోక్యవీచీరముః ॥757

అ. సంశ్రితధర్మసేతవః=చేర్పఁబడిన సద్ధర్మమునకు హద్దుగాఁగలవై - చేరిన

ధనుష్కోటికి సేతువుకలవై, సోఢోగ్రవర్షాతపాః=సహింపఁబడినవైనర్క భయంకరమైనవర్షమును ఎండయునుగలవై, శుద్ధాః=పరిశుద్ధములైన, క్షితిభృతః=రాజులు-కొండలు, సింధుజలే=సముద్రజలమందు, స్థిత్వా=ఉండి, ఘోరం=ఘోరమైన, తపః=తపస్సును, సదా=ఎప్పుడును, కుర్వతే=చేసెదరు; ఇహ=ఇక్కడ, లావణ్యం=సౌందర్యమును-లవణరసమును, దధతీః=ధరించునవియై, తీక్ష్ణైః=చులుకులైన, అతివాశుగైః-మన్మథబాణములతోను - గొప్పవాతములతోను, నిత్యమేవ=ఎప్పుడు నే, నృత్యంతీః=ఆడుచున్న, చపలాః=జార స్త్రీలనెడు - కదలఁబడుచున్న, అమూః= ఈ, వీచీః = తిరుగుబోతులను - అలలను, ఆలోక్య=చూచి, కదాపి-ఒకప్పుడును, నచలంతి=చలింపకుండెదరు.

తా. ఈసముద్రమునీట రాజులు ధార్మికులైయును, తపోవంతులైయును, ఎండవానలకోర్చియు, లావణ్యమున మన్మథబాణములతో నటనములాడుజార స్త్రీలనువలె పర్వతములు ధనుష్కోటితోడి సేతువుగలిగి లవణరసముతోడి యధికమైన గాలితో ఊఁగులాడుచుండెడి యలలనుజూచి యెప్పటికిని చలించుటలేదు.

సీ. పరిశుద్ధులైతారె ♦ పరమ ధర్మాశ్రయ
సేతువులై యశస్స్థిరతనుండ్రు
వర్షమాతపమును ♦ వాలాయము సహించి
క్షమ మించి కన మనఃక్షమతనుండ్రు
సింధుజలంబుల ♦ క్షితిభృత్తులొత్తిలి
తపము ఘోరంబు నేతతఁ జరింత్రు
ధీరులు ధరలోన ♦ ధీరత్వగుణమున
కుపమింప నుచితులై ♦ యుండ్రుగనుక
తే. నిందు నిత్యంబు నృత్యంబునందగిల్లి
యమల లావణ్యమతిగణ్య ♦ మతిశయిల్లి

చతురలా నతన్వాశుగ ॥ చపలలవలె
వీచికలఁ జూచి చలియింప ॥ రేచుచున్న.

గ॥ క్షణమభిధ్యాయన్నంజలిం బద్ధ్వా ॥ 758

వ. క్షణ మనుధ్యానించుచు నంజలియు బంధించి.

వృ॥ అస్తోకదృప్తిరపివారిధిరేషయస్మాత్
త్రస్తో బిభర్తివిపులోపలసాంద్రసేతుమ్ ।
గోపాయతే దురితవంతి జగంతి తస్మై
కోపాయతే రఘుపతే మహతే నమోస్తు ॥ 759

అ. అస్తోకదృప్తిరపి=అధికగర్వముకలదయ్యును, ఏషః=ఈ, వారిధిః=సముద్రము, యస్మాత్=ఏదానివలన, త్రస్తః=భయపడినదియై, విపులోపలసాంద్రసేతుం=విస్తారమైనశిలలచేత దట్టమైన సేతువును, బిభర్తి=భరించుచున్నదో; హేరఘుపతే=ఓరఘునాథా! దురితవంతి= దోషవంతములైన, జగంతి=లోకములను, గోపాయతే=రక్షించునదియై, మహతే=గొప్పదియైన, తస్మై=అట్టి, తే కోపాయ=నీ కోపమునకై, నమః=నమస్కారము, అస్తు=అగుఁగాక.

తా. ఈ సముద్రము అతి గర్వి అయ్యును, మీకోపమునకు భయపడి మహాపాషాణమయమైన సేతువును మోసికొనుచున్నదికదా ? ఓ రఘునాథా! అట్టి జగద్రక్షకమైన మీ కోపమునకు నేను నమస్కరించుచున్నాను.

తే. గర్వ నిధి యిది యెద్దాని ॥ కుర్విబెదరి
తొలుత బహుశైల జాలసే॥తువును దాల్చె
నట్టినీమహా॥కోపము॥నఘుజగత్ప్రి
గోపమును నోరఘూద్వహా ! ॥ కొలుతుఁ గొలుతు.

కృశానుః—కృశానుఁడు.—
సాక్షేపమ్—ఆక్షేపించి.—

వృ॥ కాకుత్థ్సకోపచకితః క్షమితా నదీనా

మాసీ ద్యదా నను గురుప్లవనార్హతోయః ।
శక్య స్తదైషతరితుం హరిభిఃపదాభ్యాం
కింవాఫలంకథయ? సేతుకృతిశ్రమస్య ॥ 760

అ. కాకుత్థ్సకోపచకితః=శ్రీరాములచేత భయపడినట్టి, నదీనాంకనితా=నదీకాంతుఁడైన సముద్రము, యదా=ఎప్పుడు, గురు-ప్లవన - అర్హా-తోయః=గొప్పగొప్పపాషాణాదులయొక్క-తేలుటకుకూడ - తగిన-జలముకలది, ఆసీత్ నను=అయ్యెనో; తదా=అప్పుడు, ఏషః=ఇది, హరిభిః=వానరములచేత, పదాభ్యాం=కాళ్లతో, తరితుం=దాఁటుటకు, శక్యః=అనుకూలమైనది; సేతుకృతిశ్రమస్య=సేతువునుచేయుటయందలి శ్రమమునకు, కింవాఫలం = ఏమిఫలము? కథయ=చెపుమ?

తా. ఈసముద్రము శ్రీరాములకోపమునకు భయపడి తనజలములో గొప్ప గొప్ప పర్వతాలను మోసికొన్నదికాక, వానరుల కాళ్లతోఁగూడ దాఁటఁగూడినదై యున్నయది. ఇట్టి దీనియందు సేతువును కట్టుటవలన ఉపయోగమేమి?

తే. రామకోపద్రుతము సముద్రము మహోప
దార్థసార్థము తేల్చుతోయము గలిగియు
హరులు తమకాళ్లు లనదాఁటఁ దగినదైన,
సేతుకృతిని ప్రయాసకుఁ జెపుమ? ఫలము.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ తత్కథితమేవమయా, భవతాతు న సమ్యగవధారితం, శ్రుణు? తర్హి పునస్సావధానమ్ ॥ 761

వ. అది నేఁజెప్పినదే, నీవు చక్కఁగ విన్నావు కావు. మఱల సావధానమున వినుము?

వృ॥ అంభోరాశిం వానరా లంఘయంత్వి
త్యేతద్వ్యాజీకృత్య రాజీవనేత్రః ।

అంహోరాశేర్లంఘనార్థం నరాణా
ముదన్వంరాశౌ సేతు ముచ్చైరబధ్నాత్ ॥ 762

అ. వానరాః=వానరులు, అంభోరాశిం = సముద్రమును, లంఘయంతు= దాటుదురుగాక? ఇతిఏతత్=అనిదీనిని, వ్యాజీకృత్య = నెపముగాఁజేసికొని, రాజీవనేత్రః=పద్మాక్షుఁడైనయాశ్రీరాములు, నరాణాం=మనుష్యులకు, అంహోరాశేః=పాపసమూహముయొక్క, లంఘనార్థం=దాటుటకై, ఉదన్వంరాశౌ= ఉదకరాశియైన సముద్రమందు, ఉచ్చైః=పొడవుగా, సేతుం = సేతువును, అబధ్నాత్=బంధించెను.

తా. ఆ శ్రీరాములు వానరులు సముద్రమును దాఁటినట్టుగా, మనుష్యులు పాపములనెడు సముద్రమును దాఁటుటకై ఆసముద్రమందె పొడవైన సేతువును కట్టించెను.

క. వారిధి వానరు లంభో
రాశిని వెసదాఁటఁనోజ శ్రీరాముఁడు నంహో
రాశిని దాఁట నరుల్ వా
రాశిని సేతువునుగట్టె రాణన్ మీఱన్.

పునర్నిరూప్య.—మఱల నిరూపించి.—

వృ॥ న సాగరోఽసౌ నభ ఏవ ఫేన
వ్రజా నచామీ విపులోడువర్గాః ।
న సేతురేషోఽపి నిశాచరాణాం
నృపాతకానా మపి ధూమకేతుః ॥ 763

అ. అసౌ=ఇది, నసాగరః=సముద్రముకాదు, నభఏవ=ఆకాశమే; అమీచ=ఇవియు, నఫేనవ్రజాః=నురుగుసమూహములుకావు; విపులోడువర్గాః=విశేషములైననక్షత్రరాసులు, ఏషోఽపి=ఇదియు, నసేతుః=సేతువుకాదు, నిశాచరాణాం=రాక్షసులకును, నృపాతకానామపి = మనుష్యుల పాతకములకుగూడ, ధూమకేతుః=ధూమకేతువు.

తా. ఈసముద్రము నురుఁగులుగలిగి చుక్కలుగల ఆకాశమువలె నున్నది. ఇందలి సేతువో రాక్షసులకే కాక, సకలమనుష్యుల సకలపాపములకును ఉత్పాత హేతువైన ధూమకేతువువలె పరిహారకమై యున్నయది.

తే. నిధియ కాదిది, యాకాశ మిదియె యగును
నురువు లివెకావు చుక్కల తరఁగలగును
సేతువిదెకాదు ఘనధూమకేతు విదియ
నరులపాతకములు నిశాచరులు నడఁగ.

గ॥ పశ్యాత్రజలచరభ్రమ చమత్కారమ్॥ 764

వ. చూడుము మీఁడ జలచరభ్రమకారి చమత్కారి భావమును.

వృ॥ గజేంద్రబుద్ధ్యా నలసేతుశైలాన్
గ్రాహాగ్రసంతే జలధావసంతః ।
తద్గ్రాసజాయాస సముత్థదంష్ట్రా
వ్యథాః ప్రధావంతి యథాగతం తే ॥ 765

అ.జలధౌ=సముద్రమందు, వసంతః=వసించుచున్న, గ్రాహాః=మొసళ్లు, నల సేతుశైలాన్=నలునియొక్క సేతువునందలిపర్వతములను, గజేంద్రబుద్ధ్యా= గొప్పయేనుఁగు లనెడితలంపుతో, గ్రసంతే=మ్రింగుచున్నవి. తత్-గ్రాసజ-ఆయాస-సముత్థ-దంష్ట్రావ్యథాః=వానిని-మ్రింగుటవలనకలిగిన- ఆయాసముచేత-అతిశయించిన-కోఱలబాధలుకలవియై, తే=ఆమొసళ్లు, యథాగతం = వచ్చిన త్రోవనే, ప్రధావంతి=పరుగిడుచున్నవి.

తా. ఈసముద్రమందలి మొసళ్లు ఆసేతువునందలి కొండలను మ్రింగుచు, ఆమ్రింగెడిఆయాసమువలన అతిశయించిన కోఱలబాధలతో వచ్చినత్రోవతోనే పరుగిడుచున్నవి.

ఆ. గ్రాహములు గ్రసింప గజబుద్ధి నలసేతు
శైలజాలమైన జలధిలోన

వానిగ్రాసమునన వ్యథచేసి దంష్ట్రలు
తోన కదలికదలి తొలఁగికొనును.

పునర్విచింత్య.—మఱలఁ జింతించి.—..

వృ॥ డిండీరఖండాన్వయ పాండురాభం
ద్రాఘిష్ఠ ముచ్చైః పరిణాహవంతమ్।
కాకుత్థ్ససేతుం కలయే గుణాఢ్యం
ధౌతో త్తరీయం ధృత మర్ణవేన॥ 766

అ. డిండీరఖండ-అన్వయ-పాండురాభం = నురుఁగుగడ్డలతో-కూడిక చేత-తెల్లనైన కాంతులుకలదియై, ద్రాఘిష్ఠం=దీర్ఘమై, ఉచ్చైః=పొడవై, పరిణాహవంతం= విస్తీర్ణతకలదియైన, కాకుత్థ్ససేతుం= శ్రీరాముల సేతువును, గుణాఢ్యం=సుగుణముల చేతను - నూళ్ల చేతను కూడుకొన్నదై, అర్ణవేన = సముద్రము చేత, ధృతం=ధరించిన, ధౌతోత్తరీయం = తెల్లనిఅంగవస్త్రమునుగా, కలయే=తలఁచుచున్నాను.

తా. నురుఁగులతో తెల్లనై నిడివియు వెడలుపునుగల సేతువును మంచినూలితోఁగూడి సముద్రుఁడువేసికొన్న తెల్లనిఅంగవస్త్రమునుగా తలఁచుచున్నాను.

ఆ. నురుఁగుతరఁగలూని నెఱితెల్లనిదియాచు
నిడుపు వెడలుపూని నెగడురాము
సేతు వీదృశగుణజాత మాకతన వా
ర్నిధికి ధౌత ముత్తరీయ మనుదు.

యద్వా—లేదా?—

వృ॥ చిరా ద్ధరాభూరి భరా ర్తమూర్తి
ర్హరిత్కరిష్వర్పిత నైజకృత్యః।
శ్రమచ్ఛిదాయార్ణవ వారిశీతే
శేతే స కిం సేతుమిషేణ శేషః॥ 767

అ. చిరాత్ =చాలకాలముగ, ధరా - భూరిభర - ఆర్త-మూర్తిః=భూమి యొక్క-అధిక భారము చేత-పీడింపఁబడిన - శరీరముకలవాఁడై, హరిత్కరిషు= దిగ్గజములందు, అర్పితనైజకృత్యః=ఒప్పగించిన తనపనిగలవాఁడై, శ్రమక్షయాయ=కష్టము తీఱుటకొఱకై, శీతే=చల్లనైన, అర్ణవవారి = సముద్రజలమందు, సశేషః=ఆ యాదిశేషుఁడు, సేతుమిషేణ = సేతువను నెపముతో, శేతేకిం = శయనించుచున్నాఁడా? ఏమి?

తా. ఆదిశేషుఁడు ఆదికాలమునుండి తన భూభారశ్రమ నివారణార్థమై ఆ భూభారకార్యమును దిగ్గజములకిచ్చి, ఈ సేతురూపముతో చల్లని సముద్ర జలములో శయనించుచున్న యట్లున్నవాఁడు.

క. చిరకాలము స్థిర భారము
ధరియించి శ్రమించి దిగిభ శ్రీధారితభరుఁడై
యురగేంద్రుఁడు విశ్రమపడ
శరధిఁ సేతువు నెపమున శ్రీ శయనించెనో కో ?

ఇ. శేషుఁడు=ఆదిశేషుఁడు-71 వ పేజిలో ఫణాభృదీశుఁడు చూడుఁ?

ఇ. దిగిభములు=దిగ్గజములు, దిక్కులు=ప్రాచి, మరీచి, ప్రతీచి, ఉదీచి అని వరుసగ చతుర్దిక్కులును, వీనిప్రక్కటి అగ్నిమూల, నైఋతిమూల, వాయుమూల, ఈశాన్యమూల అను చతుర్దిక్కులును అష్టదిక్కులు.

ఇ. ఈ అష్టదిగ్గజములు=వరుసగ ఐరావత, పుండరీక, వామన, కుముద, అంజన, పుష్పదంత, సార్వభౌమ, సుప్రతీకములు. ఇవియు భూభారము వహించుచు నుండునవి.

ఇ. ఈ దిగ్గజాధిపతులైన దిక్పాలకులు=వరుసగ ఇంద్ర, అగ్ని, యమ, నైఋతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులు.

విమృశ్య శ్లాఘమ్.—విమర్శించి శ్లాఘించి.—

శ్లో॥ యః పురా పాపదశకచ్ఛేదే సాధనతాంగతః ।
న సేతుర్నకథం శక్తః పాప పంచక భంజనే ॥ 768

అ. యః=ఏది, పురా=ముందు, పాపదశక చ్ఛేదే=పాపిష్ఠుఁడైన పదితలల రావణుని పదిపాపములను ఛేదించుటయందు, సాధనతాం = సాధనత్వమును, గతః=పొందెనో; సనేతుః=ఆసేతువు, పాపపంచకభంజనే = ఐదుపాపములను పడఁగొట్టుటయందు, కథం=ఎట్లు, నశక్తః=శక్తికలదికాదు?

తా. ఈసేతువు మొదట పదితలల రావణునివలె పదిపాపములనుగూడ పడఁగొట్టినదియై, ఇపుడు ఐదుపాపములనైన పడఁగొట్టుటకు దీనికి చేతకాక పోయినదా ?

క. మును పాపదశక నిహతిని
ఘనసాధనతను గని, యెది కీర్తి కరము ప్రకాశిం
చెనో; యీసేతువె చాలదె ?
కనుఁగొనఁ నీపాపపంచకైక నిహతి జగతిన్.

ఇ. పాపపంచకము=పంచమహాపాతకములు-బ్రహ్మహత్య, గోహత్య, సురాపానము, స్వర్ణస్తేయము, గురుతల్ప గమనము.

ఇ. పాపదశకము = దశవిధపాపములు-అసత్యోక్తి, దోషారోపణోక్తి, కఠినోక్తి, నిష్ఫలోక్తి, చౌర్యకరణ, దుష్కార్యకరణ, దుష్కార్యాపేక్ష, పరభార్యాపేక్ష, పరద్రవ్యాపేక్ష, హత్యలు.

గ॥ ఇతిపరావృత్య అన్యతోఽవలోక్యసామోదమ్॥ 769

వ. అని మఱలి మఱొకప్రక్క విలోకించి ప్రమోదించి.

గ॥ అహో! కృశానో ! శృణుతావత్కశ్చనైవమావాం ప్రతి సంప్రతిప్రవదతి ॥ 770

వ. ఓహో ! కృశానూ ! ఒకానొక పురుషుఁడు మనయిద్దఱిని గూర్చి ఇట్లు ఇప్పుడు చెప్పుచున్నతఁడు వినుము :

## దక్షిణమధురావర్ణనము.

ఇ. దక్షిణమధుర-ఇది కుముళపల్లి, వరగుణపల్లి, మధురపల్లి, అను నాచ్చిమార్లతోడి గూడలజ్ఞగర్భసన్నిధి సుందరవల్లి నాచ్చియార్ తోడి కళ్లళ

ఘుర్సన్నిధి, కాలమేఘప్పెరుమాళ్ సన్నిధి, మొదలైన విష్ణుదేవాలయము తోను, మీనాక్షిదేవితో సోమసుందరేశ్వర దేవస్థానము మొదలైన శివ దేవాలయములతో నుచితములైన మఠమందిరారామసత్రములతోను, విచిత్రములైన రాజవీధులతోను రాజిలుచు, పాండ్యరాజైన పల్లవ దేవరాయని ర్యాచజికమున నుండినది.

శ్లో॥ ఉత్తరమథురేవేయం దక్షిణమథురేతి విఖ్యాతా ।
యశోదానంద నానందా త్సర్వసంపత్సు దృశ్యతే ॥ 771

అ. ఇయం=ఈమధుర, ఉత్తరమథురేవ=ఉత్తరదిక్కుమథురవలె, దక్షిణమధురేతి=దక్షిణదిక్కుమధురఅని, విఖ్యాతా=ప్రసిద్ధమై, యశోదానంద నానందాత్=యశోదాపుత్రుఁడైన శ్రీకృష్ణునివలని ఆనందమువలన-(యశోదా =యశస్సునిచ్చునదై, నందనానందాత్=బిడ్డ వలని ఆనందమువలన) సర్వసంపత్సు=సకలసంపదలలోను, దృశ్యతే=కనఁబడుచున్నది.

తా. ఈమథుర దక్షిణమథుర అనఁబడుచు, ఉత్తరమథురవలె యశోదా నంద నానందముతో సకలవిధసంపదలతోను కానఁబడుచున్నయది.

క. ఈయది మథురాపురి తా
నాయుత్తరమథుర సాటికైయె వివిధవిధం
బైయు యశోదానందనుఁ
డాయతమయి పలుసిరులనెకయలరుచునుండున్.

ఇ. నందయశోదలు - ఉత్తరమథురలోని వ్రేపల్లెయందలి శ్రీకృష్ణుని పెంపుడు తండ్రియు తల్లియు.

వృ॥ వటదళపుటశాయీ వీక్ష్యతాం, విష్ణుచిత్త
స్తముపచరితుమాస, ప్రాదురాసీత్తులస్యామ్ -
త్రిదశకృతికృతేఽత్రా ఽఽముక్తమాల్య ప్రదాత్రీ
నమఇతివద ? గోదాంతామహంచ ప్రణౌమి ॥ 772

అ. అత్ర=ఇక్కడ, వటదళపుటశాయీ = వటపత్రశాయియైన స్వామి,

వీక్ష్యతాం=సేవింపఁబడుదురుగాక ? విష్ణుచిత్తః=విష్ణుచిత్తులనెడివారు, తం= ఆవటపత్రశాయిని, ఉపచరితుం = ఉపచరించుటకుఁగాను, ఆస=ఉన్నవారు. అముక్తమాల్యప్రదాత్రీ=చూడికొడుత్తనాచ్చియారు, త్రిదశకృతికృతే = ముప్పదిపాశురముల తిరుప్పావును చేయుటకై, తులస్యాం=తులసీవనమందు, ప్రాదురాసీత్ =ప్రాదుర్భవించెను. తాం=ఆ, గోదాం=ఆకోదెనాయకినిగూర్చి, నమఇతి = నమస్కారముఅని, వద = చెప్పుము ? అహంచ = నేనును, ప్రణౌమి=నమస్కరించుచున్నాను.

తా. ఈమధురాపట్టణమందు వటపత్రశాయి పెరుమాళ్లును, వారి కుపచార కులుగా విష్ణుచిత్తు లనెడి పెరియాళ్వార్లును, తిరుప్పావు తిరుమొఴియును పాడుటకై తిరుత్తుళాయివనమున అవతరించి పెరియాళ్వార్లకు పెంపుడు కొమార్తయైన ఆండాళునుఁ సేవసాయించుచున్నారు. ఓకృశానూ ! నీ వా యాండాళుకు దణ్ణముసమర్పించు ? నేనును సమర్పించుచున్నాను.

తే. ఇటను వటపత్రశాయియు ♦ నటుల విష్ణు
చిత్తులును జూడికొడుతయు ♦ సేవసేయఁ
గానిపింతురు వారి నే ♦ కాంచి కాంచి
యంజలించెద, నీవును ♦ యంజలించు ?

ఇ. వటపత్రశాయి=దక్షిణమధురలోనిమహావిష్ణువు. వీరువ్యూహమున యోగ నిద్రతోనుండి క్షీరసాగరమునవలె ఇక్కడను వటపత్రములో శయనించుచుండి శ్రీవిష్ణుచిత్త, శ్రీగోదాదేవీ, గరుత్మత్సహితముగ ఆండాళ్ పెరియాళ్వార్ల మంగళాశాసనములతోను దక్షిణమధురలో ఐదుమైళ్లదూరములో మధుర వల్లి మరకతవల్లి నాచ్చియార్లతోడి కళ్లళకర్ సన్నిధియు, ఊరనే నకు శవల్లి గుణవల్లి నాచ్చియార్లతోడఁ గూడలళకర్ సన్నిధియు మొదలైన విష్ణుదేవాలయములతోను, గోపుర మణిమండప ప్రాకారాదులచే మనో హరమై మహోన్నతమైన సన్నిధిలో సేవసాయించుచుండుస్వామి.

ఇ. విష్ణుచిత్తులు=పెరియాళ్వారు. వీరుగరుడాంశమున అవతరించి పదుగు

రాళ్వార్లలో నొక్కరై ఆమధురలోని వటపత్రశాయి సన్నిధికి తులసీపుష్ప మాల్యాదికైంకర్యము చేయుచుండువారు.

వీరు. ఆమధురాపట్టణాధిపతి వల్లవదేవరాయఁడు అను పాండ్యరాజు పరతత్వనిర్ణయము చేయువారికి విద్యాశుల్కముగా ముల్లెకట్టించి పండితులను పిలిపింపఁగా, స్వప్నమున ఆ వటపత్రశాయిఅనుజ్ఞచేత పరమవేదాంతప్రతిపాద్యమైన నారాయణపరత్వమును నిర్ణయించి స్వపక్షమును స్థాపింపఁగా; ఆ రాజు వారిని ఏనుఁగుమీఁద నెక్కించి పండితులతో పరివారముతో, కరతాళములతో పంచవిధవాద్యములతోడి ఘంటావాదనములతోను వారికిభట్టనాథులు అను బిరుదునామమిచ్చి,ఊరగించునపుడు అక్కడివడపెరుంకోయిలుడయాన్ స్వామిపిరాట్టిలోఁగూడ గరుడవాహనారూఢులై యెదుర్కొనిసేవసాయించి, ఆపెరియాళ్వార్లపల్లాండు మంగళాశాసనమున పరమానందభరితులైన ఆస్వామికి పంచశతగాథ, పెరియాళ్వార్తిరుమొழி అను దివ్యప్రబంధముల నను సంధించి, తర్వాత ఎప్పటియట్ల ఆభగవత్కైంకర్య పరులై యేయున్నవారు.

## ధన్వీపురీ వర్ణనము.

శ్లో॥ అత్రధన్వీపురీసేయం దృశ్యతే సుందరీయథా।
తథాగోదాఖ్య దేవ్యాఽభూ న్నిత్యమంగళసూత్రకా॥

అ. అత్ర=ఈమధురాపురిలో, ఇయం=ఈ, ధన్వీపురీ = శ్రీవిల్లిపుత్తూరు, యథా=ఎట్లు, సుందరీ=సుందరస్త్రీగా, దృశ్యతే=కనఁబడుచున్నదో, తథా= అట్లు, గోదాఖ్యదేవ్యా=గోదానామకదేవితో, నిత్యమంగళసూత్రకా=శాశ్వతమైన మంగళసూత్రము కలదిగాను—శుభకార్యవిధాయకములైన ఆపస్తంబాశ్వలాయనాది సూత్రములతోడి విప్రులుకలదిగాను, అభూత్=ఆయెను.

తా. ఈ మధురాపురితోఁజేరిన శ్రీవిల్లిపుత్తూరు సుందరస్త్రీవలె సుమంగలియై, ఆపస్తంబాశ్వలాయన బోధాయనాది సూత్రములతోడి ద్విజసమూహముకలదియై యున్నయది.

ఆ. అల్లవిల్లిపురియు నందుసుందరివలెఁ

జూడికొడుతతోడ ॥ వేడుకార

సొగసుగలిగి చెలఁగ ॥ సుభగమంగళసూత్ర

గాఁగ నున్నయదిగఁ ॥ గానిపించె.

ఇ. గోదాదేవి=కోదెనాయకి, ఈయమ ఆ శ్రీవిల్లిపుత్తూరిలో ఆ పెరియాళ్వారి తులసీవనమున అవిచ్ఛిన్నతేజోతిశయముతో ఒక చిన్న బాలికాశిశువుగా కనఁబడి ఆ పెరియాళ్వార్లచే ఇంపుపెంపులతో పెంపఁబడి ఐదవయేఁట ఆ పెరియాళ్వార్లు అక్కడి పెరుమాళ్లకు సమర్పించు పుష్పమాలికలు వారు ఎట్లు తిరువుళ్లపట్టి ఎట్లు శృంగారముతో సేవసాయింతురో; అది కసిపెట్టుద మని తాను ఆ మాలెలు తన క్రొమ్ముడిలో ముడుచుకొని అద్దముచూచి ఆనందించుకొనుచు తోడనే ఆమాలెలు ఎప్పటియట్లె యుంచి యుండినది. ఒకనాఁడు తెలిసికొని, వారు స్వామికి సమర్పింపక, వేఱుమాలెలుకట్టి సమర్పింపఁగా, అది ఆస్వామి చాత్తుకొనక దిగువ జార్చివేసినదికని, మనస్సంకటపడి శరీరము పరపశమై నిదురలోవలె మైమఱచియున్నపుడు వారి కాస్వామి స్వప్నములో ఆమాలెలె నాకు సమర్పింపవలె అని కోరఁగా, విని వీరు మనబిడ్డభాగ్యమెట్టిదో, మనప్రాప్తమెట్టిదో; అనితలఁచి ఆ మునుపటిమాల్యములే తీసికొనిపోయి సమర్పించినందునఁ గలిగిన ఆస్వామి దివ్యసేవకానందించుకొంచు, అందువలన "చూడికొక్కొడుత్తి" అనిపేరు ప్రఖ్యాతిపడ్డ ఆబిడ్డను గనుఁగొని వయసువచ్చినది అని కల్యాణముజఱుపుట కాలోచించఁగా; నాకెవరును పనికిరారు; శ్రీరంగనాథులనే కల్యాణము చేసికొందును అని నిశ్చయించుకొని ఆమె తిరుప్పావును తిరుమొళ్రియును పాడుకొని వేడుకపడుచు అందజికిని దానివలన భగవద్జ్ఞాన భక్త్యాసక్త్యతిశయములు గలిగించి రక్షించుచును, తాను గోదాదేవిఅనియు ఆండాళుఅనియు, చూడికొక్కొడుత్త నాచ్చియారుఅనియు పేరు పొందుచునుండి, ఆ వెనుక తనతో ఆడుకొను పాడుకొను పడుచులతోను, తనుఁ బెంచుకొంచునుండు పెద్దముద్దియలతోను, తన పెంపుడు తలిదండ్రులతోను పోయి ఆరంగపతినే తన పతినిగా చేసికొని, తన ఆలింగనముతో వారి తిరుమేనిలోనే ఐక్యమై ఆనందించుకొనుచున్న భూదేవి.

## తామ్రపర్ణీ వర్ణనము.

ఇ. (తామ్రపర్ణి—ఇది చోళదేశమునకు పైఁగ దక్షిణదిక్కున కన్యాకుమారివఱకునుండు పాండ్యదేశములో మధుర తిరునెల్వేలిజిల్లాలమధ్య ముత్తెపుఁ జిప్పలతోడ ప్రవహించెడునది.)

వృ॥ తాపం విలుంపతి నృణా మిహ తామ్రపర్ణీ
త్యాఖ్యాం వహ న్భవదవానలజృంభితోత్థమ్ ।
పాథోనిధే స్త్రిజగతి ప్రథితోఽవరోధో
రోధోలసత్పరమహర్ష మహర్షి యూథః ॥ 774

అ. రోధః-లసత్-పరమహర్ష-మహర్షి-యూథః=గట్లయందు-ప్రకాశించెడి-అతి సంతోషముతోడి-మహాఋషులయొక్క-సమూహముకలదియై, త్రిజగతి=ముల్లోకములయందును, ప్రథితః=ప్రసిద్ధమై, తామ్రపర్ణీతి = తామ్రపర్ణి అని, ఆఖ్యాం=పేరిని, వహన్=వహించుచు, పాథోనిధేః=సముద్రునియొక్క, అవరోధః=అంతఃపురస్త్రీ, భవదవానల-జృంభిత-ఉత్థం = సంసారదావాగ్నిచేత-విజృంభితమై-లేచినట్టి, నృణాం తాపం=మనుష్యుల తాపమును, ఇహ=ఇక్కడ, విలుంపతి=నాశము చేయుచున్నది.

తా. తామ్రపర్ణి సముద్రుఁడే భర్తగాఁగలిగి, గట్టున మహర్షులుండియు, సంసార దావాగ్నినుండి లేచిన యిక్కడివారల తాపము తొలఁగఁ జేయుచున్నది.

ఆ. భవ్యతామ్రపర్ణి ♦ భవదావపావక
తాపలోపకర్త్రి ♦ తనదురోధ
ములఁ మహర్షుల రస ♦ ములఁ బ్రహర్షులఁ జేయు
స్వర్ణపునవరోధ ♦ మవుటఁ దానె.

## కురుకాపురీ వర్ణనము.

ఇ. (కురుకాపురి-ఇది పాండ్యదేశములో దక్షిణ మధురకుమీఁద తిరునెల్వేలిజిల్లాలో తామ్రపర్ణీతీరమందు బ్రహ్మతీర్థమునొద్ద నాథపల్లితాయారు

తోఁగూడ వేంచేసియుండు ఆదినాథ పెరుమాళ్ సన్నిధిలోఁడనుండు కురుకాపురిఅనెడి ఆళ్వార్తిరునగరి.

గ॥ తదభ్యర్ణం నిర్వర్ణ్య-దాని సమీపమున సమీక్షించి.

వృ॥ చకాస్తి కురుకాపురీ శుచిని తామ్రపర్ణీతటే
విరక్తిపరిపక్త్రిమత్రియుగభక్తిభిర్వైష్ణవైః।
దృఢవ్రతశఠారుర్యోవకుల సంపతద్భంభర
ధ్వనిద్విగుణజృంభణ ద్రవిడవేదఘోషోజ్జ్వలా॥ 775

అ. శుచిని=పరిశుద్ధమైన, తామ్రపర్ణీతటే=తామ్రపర్ణిగట్టున, దృఢవ్రత-శఠారి-ఉరః-వకుల-సంపతత్-బంభర - ధ్వని-ద్విగుణ - జృంభణ-ద్రవిడవేద-ఘోష-ఉజ్జ్వలా=దృఢమైన నియమముగల - శఠగోపులయొక్క - వక్షస్థలములోని వకుళమాలికలనుండి-జాఱిపడుచున్న- భృంగములయొక్క - ధ్వనులచేత-ఱెట్టించుచున్న-విజృంభణముగల- ద్రావిడవేదములయొక్క-అనుసంధానశబ్దముచేత-ప్రకాశించునదియైన, కురుకాపురీ = కురుకానామనగరి, విరక్తి-పరిపక్త్రిమ-త్రియుగభక్తిభిః=విరక్తిచేత-ఫలించిన - భగవద్విషయిక. భక్తిగలవాఁరైన, వైష్ణవైః=వైష్ణవులతో, చకాస్తి=ప్రకాశించుచున్నయది.

తా. ఈ కురుకాపురి ఆ వకుళాభరణుల వక్షస్థల వకుళమాలికలలోని భృంగములు వారివాచా విన్న ద్రావిడవేదానుసంధానముతోను, విరక్తి సంపన్నులై భగవద్భక్తి గలవైష్ణవుల అధ్యయనములతోను ప్రకాశించుచున్నయది.

ను. కురుకాపూర్వరముర్వరం దనరెఁ గోర్కుల్మించనీక్షించినన్
బరిశుద్ధిం దగు తామ్రపర్ణినది విస్ఫారంపుఁ బారంబునన్
బరఁగన్ భక్తి విరక్తిఁ బర్వ భగవద్భక్తిధ్రువు లైవ్వష్ణవు
ల్వారునన్ జేర్చి శఠారిదాల్చు వకుళాలంకార ఝంకార కృ
ద్వరభృంగ ద్విగుణీకృతద్రవిడ వేదధ్యానధామంబుగాన్.

టి. త్రియుగుఁడు=మూఁడుజంటలుగలవాఁడు-షడ్గుణైశ్వర్యములుగల భగవంతుఁడు, షడ్గుణైశ్వర్యములు= "మహాత్మ్యస్య సమగ్రస్య ధైర్యస్య యశస

శ్శ్రియః । జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతిస్మృతః." మాహాత్మ్యవీ ర్యైశ్వర్య యశశ్శ్రీ జ్ఞానవైరాగ్యములు.

గ॥ అత్రత్యానాం ధర్మసత్యానాం హరిభృత్యానామిత్థ మనుసంధానమ్॥ 776

వ. ఇందలి ధర్మనిష్ణాతులగు వైష్ణవుల యనుసంధాన మీవిధాన (మీనులకింపగుచున్నయది.)

## శ్రీ శఠకోపమునీంద్ర వర్ణనము.

ఇ. శఠగోపమునులు=నమ్మాళ్వార్లు. వీరు కురుకాపురియందు కారిసుమారులై అవతరించినదిమొదలు స్తన్యపానమైన లేక తలిదండ్రులచే కొనిపోఁబడి పొలిందనిన్రఫిరాక్ సన్నిధిలో నిలుపఁగా, అదివఱకు కనులె తెఱవని యీబిడ్డ తటాలున కనులుతెఱచి స్వామిని సేవించినతోడనే జరుగుచు వచ్చి అక్కడి తింత్రిణీవృక్షమూలమున ప్రవేశించి ఆత్మానితోబ్బులోచేరి రెవరితో పలుకాడక మౌనముద్రలోనెయుండి సహస్రశాఖాది ద్రావిడప్రబంధములు అనుసంధించుచు రాత్రిలో జ్యోతిరూపముగ కనఁబడుచు, మధురకవియాళ్వార్లు ఆశ్చర్యపడి వచ్చిచూచి ఆవిగ్రహము ప్రభావము తెలిసికొని తమకు దండము సమర్పించి తమతోడనే సహవసించుచు తమకు శిష్యులునైయుండ వారితో నానందించుచే యున్నవారు. అక్కడి ఆశ్రియఃపతి శ్రీభూనీళాసమేతుఁడై గరుడవాహనారూఢుఁడై సేవసాయించఁగా, సేవించి ఆనందించి వారిని ధ్యానించుచు వారివిషయమున అనుసంధానముక్ జేయుచుండిరి. వీరికి శఠులను=దుశ్శీలురనుదిద్ది రక్షించువారగుటచేత శఠగోపులనియు, అశఠులవిషయమై చూడఁగానె కోపపడువారగుటచేత శఠకోపులనియు, వారు తమయొద్దికిరానపుడు వారిని శత్రువులనుగ నెంచుటచేత శఠవైరులనియు తిరునామములు.

వృ॥ పరిస్ఫుష్టసతే సహస్రశాఖాం
పరిమాంద్రావిడ సంహితాం హితాం నః ।

గురవే కరవా మనిత్యనుస్మై
శఠగోపాయ మహర్షయే ప్రణామాన్ ॥ 777

అ. సహస్రశాఖాం=వేయిశాఖలుకలదై, పరమాం = సర్వోత్కృష్టమై, హితాం= అందఱకుహితమై, ద్రావిడీం = ద్రావిడసంబంధమైన, సంహితాం= ప్రబంధమును, నః=మాకై, పరిసృష్టవతే=నిర్మించినట్టి, శఠగోపాయమహర్షయే=శఠగోపమహామునులు అనెడు, గురవే = ఆచార్యులకై, నిత్యం= ప్రతిదినమును, ప్రణామాన్=నమస్కారములను, కరవామ=చేయుచున్నాము.

తా. మనహితమునకై ద్రావిడ సంహితను సహస్రశాఖలుగాఁ జేసియున్న ఆ శఠగోపమహర్షులనెడి యాచార్యులకు నమస్కారములు చేసెదము.

క. హితముగ శ్రితకృతి వితతికి
సతతముగ జగతికి సహస్ర శాఖాత్మకమై
యతులితముగ ద్రావిడసం
హితి మొగిఁ జేసిన శఠారి కే ప్రణమింతున్.

టి. శ్రితకృతివితతికిన్ = ఆశ్రితులైనసుకృతాత్ముల సమూహమునకు, మొగిన్ = వరుసగా.

తింత్రిణీవృక్ష వర్ణనము.

ఇ. తింత్రిణీవృక్షము=చింతచెట్టు, ఇది శేషాంశమున అవతరించి అక్కడి సన్నిధికెదుటనుండి తన కోటరమున నమ్మాళ్వార్లను అవసాన పర్యంతము సేవచేపించుకొని యున్న వృక్షము.

వృ॥ అంచామ చించాతరు మద్భుతం తం
పంచామరద్రూ నవధీరయంతం।
శఠారిసంజ్ఞం కిల యస్యమూలే
తపఃఫలం కించి దుదంచితం నః॥ 778

అ. యస్య=ఏతింత్రిణీవృక్షముయొక్క, మూలే=అడుగున, శఠారిసంజ్ఞం =శఠగోపమునీంద్రులు అనుపేరుకలదై, కించిత్ = ఒకానొకటి, ఉదంచితం =

ఒప్పునదియైన, నః=మాయొక్క, తపఃఫలం=తపఃఫలమో ? తం=అట్టి, పంచామరద్రూన్ = ఐదు దేవవృక్షములను,అవధీరయంతం = తిరస్కరించునదియై, అద్భుతం=ఆశ్చర్యకరమైన, చించాతిరుంకిల=తింత్రిణీవృక్షమునుగదా ? అంచామ=పూజించుచున్నాము.

తా. తింత్రిణీవృక్షము నడుగున ఆ శఠగోపమునీంద్రులే యుండుట మాకు తపఃఫలమై, ఆ కల్పవృక్షములనుగూడ తిరస్కరించునంతటి కోరికలిచ్చెడి ఆశ్చర్యముగల యీతింత్రిణీవృక్షము నే మేము పూజించుచున్నాము.

ఆ. కల్పవృక్షములనె యల్పములుగ నెంచు
చించవృక్షమును ద రించఁగొల్తు
మాతపఃఫలంబె మహనీయశఠవైరి
దేనిమూలమందుఁ దేజరిలెడి ॥

టి. పంచదేవవృక్షములు=ఐదుకల్పవృక్షములు, ఇవి- "మందారః, పా, జాతకః, సంతానః, కల్పవృక్షశ్చ, పుంసివాహరిచందనమ్" ఈయైదు స్వర్గలోకమందె దేవేంద్రుని నందనవనమున నుండునవి.

వృ॥ దిశన్ శ్రితానా మమృతాత్మకంఫలం
విలక్షణో భాతి స తింత్రిణీతరుః।
సహస్రశాఖం ద్రవిడాగమంసృజన్
సయస్యమూలం సముపాశ్రితోమునిః ॥ 779

అ. సః మునిః=ఆశఠగోపమునులు, సహస్రశాఖం=శాఖాసహస్రములుగల, ద్రవిడాగమం=ద్రావిడవేదమును, సృజన్=సృజించుచు, యస్య=ఏతింత్రిణీ వృక్షమునకు, మూలం = వ్రేళ్లక్రిందిభాగమును, సముపాశ్రితః = ఆశ్రయించిన వారో? సతింత్రిణీతరుః=ఆతింత్రిణీవృక్షము, శ్రితానాం= ఆశ్రితులకు, అమృతాత్మకం=అమృతస్వరూపమైన, ఫలం=ఫలమును, దిశన్ = ఇచ్చుచు, విలక్షణః=అసాధారణమై, భ్యాతి=ప్రకాశించుచున్నది.

తా. ఆశఠగోపమునులు ద్రవిడవేదముగా సహస్రశాఖలుగల బ్రహ్మసం

హితను ఏవృక్షముక్రింద సృజించుచుండిరో అట్టి యీతింత్రిణీవృక్షము తాను లోకవిలక్షణమై తన్నాశ్రయించినవారికి అమృతరూపమైనఫలమును ఇచ్చుచు ప్రకాశించుచున్నది.

ఆ. అమృతమయము ఫలము ♦ నాశ్రితావళి కిచ్చు
నల విలక్షణాత్మ ♦ మామ్లవృక్ష
మాత్మమూలమందు ♦ నాశతారాతిద్రా
విడసహస్రశాఖ ♦ వెలసిచేయ.

వృ॥ హరిమివకృతావతరణం
వకుళాభరణం వృణీమహేశరణమ్ ।
ధ్యేయం యం విదురార్యా
నుముక్షుభి ర్య త్ప్రిబంధ మధ్యేయమ్॥ 780

అ. ఆర్యాః=శిష్టులు, యం=ఎవరిని, ధ్యేయం=ధ్యానార్హులనుగా, విదుః= తెలిసికొనిరో? యత్ప్రిబంధం = ఎవరి ద్రావిడప్రబంధమును, ముముక్షుభిః= మోక్షేచ్ఛకలవారిచేత, అధ్యేయం = అధ్యయనార్హమునుగా, విదుః=తెలిసి కొనిరో?కృతావతరణం=ఇట్లు చేయఁబడిన అవతారముకల, హరిమివ=శ్రియః పతినివలె, వకుళాభరణం=ఆశఠగోపులను, శరణం=రక్షకముగా, వృణీమహే= స్వీకరించుచున్నాము.

తా. వకుళమాలికలె ఆభరణముగాఁగల ఆ శఠగోపమునీంద్రులను ఆర్యు లందఱును ధ్యానించుచు,వారి ద్రావిడ వేద ప్రబంధమును మోక్షేచ్ఛకలవారంద ఱును అధ్యయనముచేయుచు, వారినే ఆశ్రియఃపతినివలె రక్షకులనుగా స్వీక రించుచున్నాము.

తే. ధ్యేయుఁడు నెతఁ డధ్యేయము ♦ నేతనికృతి
యని ముముక్షు లపేక్షింతు ♦ రతనిశరణు
నవధరించెద హరివలె ♦ నవతరించి
వఱలువకుళాభరణుఁగృపా ♦ భరణునెపుడు.

## తత్కృత ద్రావిడ సంహితావర్ణనము.

ఇ. ఈ శ్రీశఠగోపమునీంద్రులు - ఋగ్వేదసారమును తిరువిరుత్తము గాను, యజుర్వేదసారమును తిరువాశిరియముగాను, అథర్వణవేదసారమును పెరియతిరువందాదిగాను, సామవేదసారమును తిరువాయిమొழிగాను సాయించినవారు.

ఇట్లు పదుగురాళ్వార్లు సాయించిన తిరువందాది తిరుచ్ఛందవిరుత్తము మొదలైన దివ్యప్రబంధములును, ఆండాళు ఉడయవరులు మొదలుకొని పూర్వాచార్యులు సాయించిన తిరుప్పావు ఉపదేశరత్నమాల మొదలైన దివ్యప్రబంధములు నే ద్రావిడప్రబంధము లనఁబడు చుండునవి.

వృ॥ తస్మిన్మతిర్మేఽస్తు దృఢా శఠారౌ
గాయంతఉచ్చైరిహ యస్యగాథాః।
ప్రహాయ దేహం ప్రథయంతి దివ్యే
పదేఽహమన్నాద ఇతిప్రగీతే॥ 781

అ. యస్య=ఎవరియొక్క, గాథాః=ప్రబంధములను, గాయంతః=గానము చేయువారు, ఇహ=ఇక్కడ, దేహం=శరీరమును, ప్రహాయ=విడిచి, అహమన్నాదఇతి=అహమన్నాదఃఅని, ప్రగీతే=స్తుతింపఁబడిన, దివ్యేపదే= పరమపదమందు, ప్రథయంతి=వృద్ధిపొందుచుందురో? తస్మిన్= అట్టి, శఠారౌ= శఠగోపులందు, మే= నాకు, దృఢా = నిశ్చలమైన, మతిః=జ్ఞప్తి, అస్తు= అగుఁగాక.

తా. ఈశఠగోపమునుల సహస్రశాఖావి ప్రబంధములు గానముచేయువారు ఇక్కడనే శరీరము విడిచినను; వారు "అహమన్నాదోఽహమన్నాద" అను శ్రుతిప్రతికారము పరమపదముననే నిత్యవాసము చేయుచుందురు. అట్టి ఆశఠగోపమునులయందే నాకు దృఢభక్తి కలిగిఁ యుండవలెను.

తే. ఎతనిగాథలు గానంబుశ్రీప్రతిదినం బొ
నర్చువారు వార "కహమశ్నాద" యనఁగఁ

బాగడఁబడు దివ్యపదమునకే నెగడఁగలరు
కడకు, నటువంటి శఠవైరికే నెడఁదనెంతు.

వృ॥ కృతదురితనిరోధానాం
కలితశ్రుతిమౌలి భావబోధానామ్ ।
వశితరమానాథానాం
న సుధాపి సమా శఠారిగాథానామ్ ॥ 782

అ. కృత-దురిత-నిరోధానాం=చేయఁబడిన- దోషములకు- అడ్డగింపుగలవియు, కలిత-శ్రుతిమౌలి-భావ-బోధానాం=కూడుకొన్న - వేదాంతములయొక్క- అభిప్రాయములందు- జ్ఞానముకలవియు, వశిత -రమానాథానాం= స్వాధీనపఱుపఁబడిన-శ్రియఃపతియుకలవియైన, శఠారి-గాథానామ్ = శఠగోపులయొక్క-ప్రబంధములకు, సుధాపి=అమృతముకూడ, నసమా=సరికాదు.

తా. సకలదోషములు నివర్తించుటకై సకలోపనిషత్తుల అభిప్రాయములు కలిగి, శ్రియఃపతియే స్వాధీనమైయున్న యీ సహస్రశాఖాది ప్రబంధములకు ఆయమృతముకూడ సాటిగాదు.

క. దురితనిరోధములకు శ్రుతి
నరశిరముల భావబోధ కే వర్ధకములకున్
సరియె? రమానాథవశీ
కరములకున్ సుధ శఠారి కే గాథలకరయన్.

జనానుద్దిశ్య —జనులనుద్దేశించి.

వృ॥ కఠినశఠనరేంద్ర స్తావకాః శ్లోకపాశాః
జఠరపఠరపూర్త్యై జాతు మాసంగిరధ్వమ్ ।
లుఠతదృఢతమస్కేమాచ సంసారకూలే
పఠతశఠజిదుక్తీ రశ్రమానీతముక్తీః॥ 783

అ. జఠర-పిఠర-పూర్త్యై= కడుపుఅనెడు-కుండ-నిండుటకై, కఠిన- శఠ -

నరేంద్ర-స్తావకాన్ =నిర్దయులై-దుష్కృత్యులైన- రాజులయొక్క-స్తోత్రము లుచేయునట్టి, శ్లోకపాశాన్ =అధమశ్లోకములను, జాతు=ఒకప్పుడును, మాసం గిరధ్వం=పఠించకుఁడి? దృఢతమస్కే=దృఢమైనఅజ్ఞానముఅను-అంధకారము కల,సంసారకూపేచ=సంసారమను బావిలోను, మాలురత=జాఱకుండి?అశ్రమ-అనీత-ముక్తీః=కష్టములేక-తెచ్చుకొన్న-మోక్షముకల, శఠజిత్-ఉక్తీః=శఠగోపమునీంద్రులయొక్క-శ్రీసూక్తులను, పఠత=పఠించుండి ?

తా. పొట్టనిండుటకై అధములమీఁద అధమశ్లోకములను చెప్పవద్దు?అజ్ఞానమనెడి చీఁకటికల సంసారమనెడి బావిలోన దిగఁబడవద్దు ? కష్టములేకయె మోక్షము కలిగించునట్టి ఆశఠగోపమునులశ్రీసూక్తులనే పఠించు కొంచునుండుఁడి?

ఆ. కడుపుకొఱకుఁ గఱకు కేపుడమిఱేఁడులనుగూర్చి
విడుఁడుపొగడికలను కే విడుఁడుభవము
భ్రమణములను, జనులుకేపఠియింపుఁడింపుమైన్
ముక్తిదములు శఠజి కే దుక్తిగములు.

ఇతి కృశానుమామంత్ర్య—అని కృశానుఁబిలిచి.

వృ॥ నను శఠగోపాయ త్వం
ప్రణతిం ప్రాప్తాయ భావుకోపాయత్వమ్।
విమలమతే? కురు కాయా
న్నిరసితు మంహాంసి విరాజతే కురుకాయామ్ ॥ 784

అ. నను=ఓయీ ! విమలమతే = మంచిబుద్ధిమంతుఁడా ! త్వం=నీవు, కాయాత్ =శరీరమునుండి, అంహాః=పాపమును, నిరసితుం= నిరాకరించుటకై, భావుక- ఉపాయత్వం=క్షేమకరమైన-సాధనమగుటను, ప్రాప్తాయ=పొందినవారై, కురుకాయాం=కురుకాపురియందు, విరాజతే = ప్రకాశించుచున్న, శఠగోపాయ = ఈశఠగోపమునులకు, ప్రణతిం=నమస్కారమును, కురు = చేయుమా ?

తా. ఓ బుద్ధిమంతుఁడా ! నీశరీరముతో నీవుచేసికొన్న సకలదోషము

లనుక్ నిరాకరించుటకు సులభోపాయులై ఈ కురుకాపురియందు ప్రకాశించు శ్రీ శఠగోపులకు నమస్కారము చేయుమా?

క. కురుకాపురికాఁపురమై
దురితాళినిరాకరింప ♦ దుర్లభశుభసం
కరణోపకరణమైన శ
ఠరిపుం బ్రణమింపు మీవి ♦ టర్క విమలమతీ!

కించ—మఱియు.—

వృ॥ వకులాభరణీయానాం
గాథానాం సన్ముఖాబ్జ భరణీయానాం।
హరిగృహమధ్యే తార
స్వరేణ పునతే ప్రపంచ మధ్యేతారః॥ 785

అ. హరిగృహమధ్యే=కోవెలలనడుమ, తారస్వరేణ = గొప్పధ్వనితో, సత్-ముఖాబ్జ-భరణీయానాం=సత్పురుషులయొక్క - ముఖపద్మములయందు-భరింపఁదగినవై, వకుళాభరణీయానాం = శఠగోపమునిసంబంధియైన, గాథానాం=శ్రీసూక్తుల యొక్క,అధ్యేతారః=అధ్యయనము చేయువారు,ప్రపంచం =ఈప్రపంచమును, పునతే=పవిత్రపఱచుచున్నారు.

తా. ఈ శఠగోపమునీంద్రుల సహస్రశాఖాది శ్రీసూక్తులు అనుసంధించువారును, అధ్యయనము చేయువారును, అక్కడక్కడ దేవస్థానములందును ఉచ్చైస్స్వరముతో గానము చేయుచు లోకమును పవిత్రము చేయుచున్నవారు.

ఆ. వకుళభూషణోక్తు ♦ లఖిలార్యముఖధార్య
ములు హరిగృహమధ్య ♦ ములను నధ్య
యనమొనర్చునఘు ♦ లనయంబు భువనంబు
పావనం బొనర్చు ♦ పరమఘనులు.

సశ్లాఘమ్—శ్లాఘించుచు.—

వృ॥ వీరక్తేరాస్థానీ, మధుమథనభక్తేర్నటనభూః
విముక్తేర్నిశ్శ్రేణీ సుకృతతరుపక్తేః ఫల, మసౌ ।
ప్రపత్తే రుద్యానక్షితి, రకృతకోక్తేః ప్రియసఖీ
చిదంకూరక్షోణీ, వకుళధరవాణీ విజయతే ॥ 786

అ. విరక్తేః=వైరాగ్యమునకు, ఆస్థానీ = ఆస్థానసభయు, మధుమథనభక్తేః=భగవద్భక్తికి, నటనభూః=నాట్యశాలయు; విముక్తేః=మోక్షమునకు, నిశ్శ్రేణీ=నిచ్చెనయు; సుకృతతరుపక్తేః=సుకృతములనెడి వృక్షముల పరిపక్వతకు, ఫలం=ఫలమును; ప్రపత్తేః=ప్రపన్ననిష్ఠకు, ఉద్యానక్షితిః=క్రీడావనభూమియు; అకృతకోక్తేః=వేదోక్తికి, ప్రియసఖీ = ప్రియమైనసఖియు; చిత్ అంకూరక్షోణీ=బ్రహ్మజ్ఞానమనెడి మొలకకు భూప్రదేశమునైన, అసౌ=ఈ, వకుళధరవాణీ=వకుళమాలికాధరులైన శ్రీ శఠగోపమునీంద్రుల శ్రీసూక్తి, విజయతే=జయశీలమై యున్నయది.

తా. ఈ శఠగోపమునుల శ్రీసూక్తులు విరక్తియు, విష్ణుభక్తియు, ముక్తియు, ప్రపత్తియు, వేదోక్తియు, బ్రహ్మతత్వజ్ఞానమును, అనుసత్కృత్యములు తెలుపుచు సర్వోత్కృష్టమై యున్నయది.

సీ. వీరవిరక్తికి ♦ విశ్రుతాస్థానంబు,
నళినాక్షుభక్తికి ♦ నటనభూమి
నిర్వాణలక్ష్మికి ♦ నిర్ణీతనిశ్శ్రేణి
సుకృతాగపంక్తికి ♦ ప్రకృతఫలము
అలప్రవృత్తిసమృద్ధి ♦ కారామభూమియుఁ
ద్రయిశాఖలకు సదా ♦ ప్రియపుసఖియ
జ్ఞానాంకురమున క ♦ నూనకర్షితభూమి
జ్ఞేయార్థమున కుపా ♦ ధ్యాయపదవి

తే. తింత్రిణీమూలసంశ్రిత శ్రీయుగగుణవ
దంశసంజాతశఠశాత్ర శ్రీ వాఖ్యా వకుళ
భూషణార్యవర్యవచో విశేష వైఖ
రీగరీయఃప్రణాళి వర్ణింపఁదరమె?

గ॥ సమంతాదవలోక్య సహర్షం కృశాను ముద్దిశ్య. 787

వ. కలయ నవలోకించి హర్షించి కృశాను నుద్దేశించి.

శ్లో॥ అభ్యస్తవేదమాళిభ్య స్సద్భ్య స్తత్వబుభుత్సయా
కురుకాపురవాసిభ్యః కురు కామం నమస్క్రియాః॥788

అ. తత్త్వ బుభుత్సయా = బ్రహ్మతత్వజ్ఞానమును తెలిసికొనఁ గోరికచేత, అభ్యస్తవేద మాళిభ్యః=అభ్యసింపఁబడిన వేదాంతముకలవారై, కురుకాపుర వాసిభ్యః=ఈకురుకాపురివాసులైన,సద్భ్యః=సత్పురుషులకై,నమస్క్రియాః =నమస్కారములను, కామం=మిక్కిలి, కురు=చేయుమా ?

తా. బ్రహ్మజ్ఞానమునకై వేదాధ్యయనము చేయుచు చేయించుచు ఈకురు కాపురివాసులైనవారికి నమస్కారములు చేయుమా?

గ॥ హేకృశానో! శృణుతావదిదం, అహో? పురాభూతపు పుర్యాం శ్రీమద్రామానుజ మునిరివాస్యాం కుంతీపుర్యా మపి (కేన చిత్పురుషేణాయం విషయోనిక్షిప్తో నిక్షేపఇవా స్మాకం నిరీక్ష్యతే,) సమీక్ష్యతే వా త్వయాపి, శ్రీమార్గవర వరమునిరితి మనీషిణామేవ మననీయో భవతిహి॥ 789

వ. ఓకృశానూ! వినుమిది ఆహా! ముందు శ్రీపెరుంబూదూరు నందు శ్రీమద్రామానుజ మునీంద్రులవలె నీకుంతీపురియం దును (ఒకానొకపురుషునిచే నీ విషయవిచక్షణతలు నిక్షేప మువలె) నిక్షేపింపఁబడినవై మనకును బ్రదర్శింపఁబడుచున్న వారు; నీవును సందర్శించితివా? శ్రీమార్గ వరవరమును ల బుద్ధిమంతులకే బోధనీయులగుచున్న వారుగదా ?

## శ్రీ సౌమ్యజామాతృముని వర్ణనము.

ఇ. శ్రీసౌమ్యజామాతృలు=మణవాళమహామునులు— వీరు - పాండ్యదేశమున కుంతీపురిలో గోమతకులమున శేషాంశముతో ఉడయవరులకుబదులుగా తివాళక్కుడందార్ తిరునావుడయపిరాన్ తాతరణ్ణర్ ఐలన శ్రీరంగనాయకియమ్మాళుకు తిరుక్కుమారులై అఱగియమణవాళప్పెరుమాళ్ నైనార్ అని తిరునామముకలిగి శ్రీశైలనాథులె ఆచార్యులుగా కలిగి, సాంగోపాంగముగ వేదాధ్యయనముచేసి చతుస్సహస్ర ద్రావిడ వేదాధ్యయనముఁ జేసి, దానిదానికి తత్తద్వ్యాఖ్యానములతో శ్రీరంగమున కాలక్షేపము చేయుచుండినవారు.

వృ॥ శ్రీశేషాంశభవం శ్రితావనజవం కుంతీనగర్యుద్భవమ్
శిష్యోజ్జీవనవైభవం నిజవచోవేద్యాచ్యుతప్రాభవమ్
కారుణ్యామృతసాగరం గురువరం శ్రీసౌమ్యజామాతరమ్
సంసారార్ణవతారకం కలయ ? హేమచ్చిత్తమత్తద్విప ?

అ. హేమచ్చిత్తమత్తద్విప=ఓ నాచిత్తమనెడు మదపుటేనుఁగా ! త్వం =నీవు, శ్రీశేషాంశభవం=శ్రీయాదిశేషాంశమం దావిర్భవించినవారును, శ్రితావనజవం=ఆశ్రితులను రక్షించుటయందలి వేగముగలవారును, కుంతీనగరీ ఉద్భవం=ఈ కుంతీపురియందే జన్మముకలవారును, శిష్యోజ్జీవనవైభవం = శిష్యులను ఉజ్జీవింపఁజేయునట్టి విభవముకలవారును, నిజవచః వేద్య అచ్యుతప్రాభవం= తమశ్రీసూక్తులచేతనే తెలిసికోఁదగిన శ్రియఃపతియందలి మహత్త్వముకలవారును, కారుణ్య అమృతసాగరం=కృపారసమనెడి అమృతమునకు సముద్రమైనవారును, సంసార అర్ణవతారకం=సంసారమనెడి సముద్రమును తరింపఁజేయువారును, గురువరం = ఆచార్యశ్రేష్ఠులునైన, శ్రీసౌమ్యజామాతరం = శ్రీరమ్యజామాతృమునులను, కలయ= సేవింపుమా ?

తా. ఏనుఁగువలె మత్తుకలిగియున్న ఓ నామనస్సా! ఈ కుంతీనగరమందే శ్రీ ఆదిశేషుల అంశమం దావిర్భవించి సకలచేతన సంరక్షణ సమీక్షణులై మ్మాశ్రయించినవారి నుజ్జీవింపఁజేయు వైభవము కలిగి తమ శ్రీసూక్తులచేత

శ్రియఃపతివై భవము తెలుపుచు పరమకృపతో సంసారసముద్రమును ఓడవలె దాఁటించును ఆచార్యశ్రేష్ఠులుగా నుండెడి యీ మణవాళమామునులను సేవింతుమా ?

వృ॥ శ్రీసౌమ్యజామాతృ మునీంద్రచంద్రః
 శ్రీరంగరాజాంఘ్రి సరోజభృంగః
 శ్రీశైలనాథార్య కృపైకపాత్రః
 శ్రీలక్ష్మణార్యప్రవణః ప్రదృశ్యతే ॥ 791

అ. శ్రీరంగరాజ - అంఘ్రిసరోజ - భృంగః=శ్రీరంగనాథులయొక్క - పాదపద్మములకు - ద్విరేఫమువంటివారును, శ్రీశైలనాథార్య - కృపైక - పాత్రః=శ్రీశైలనాథులయొక్క - కృపకు - ముఖ్యపాత్రులును, శ్రీలక్ష్మణార్య - ప్రవణః=శ్రీరామానుజాచార్యులయందు - ఆసక్తికలవారునైన, శ్రీసౌమ్యజామాతృ మునీంద్రచంద్రః=శ్రీసౌమ్యజామాతృలనెడి మునిశ్రేష్ఠులలో చంద్రునివలె ప్రకాశించువారు, ప్రదృశ్యతే=కనఁబడుచున్నవారు.

తా. ఈ మణవాళమహామునులు తామరల మకరందమందు భృంగమువలె శ్రీరంగనాథుల తిరువడిగళందు అత్యాసక్తులై, ఆచార్యులుగా శ్రీశైలనాథుల తిరువడిగ ళాశ్రయించి, ఉడయవరులయందు అతిప్రావణ్యముకలవారై సేవసాయించుచున్నవారు.

తే. కనుము! శ్రీరంగరాజాంఘ్రి కమలభృంగ
 మనియు శ్రీశైలనాథుల కనుఁగుశిష్యు
 లనియు శ్రీయతిరాజప్రవణులనియును
 దనరు శ్రీసౌమ్యజామాతృ మునుల నిటుల.

శ్లో॥ శ్రీరంగే రంగధామ్నేవ ! శ్రీరంగేశ్వర ఏవసః ।
 బాలవనాగతి స్త్రేత్ గోష్ఠ్యాస్థిత్యామహాత్మనామ్ 792

శ్లో॥ యస్యకాలక్షేపవేవ భగవద్విషయాదికమ్ ।
 శృణ్వన్ నాచార్య ఇత్యాహ శ్రీశైలేశదయాదికమ్ ॥ 793

శ్లో॥ శ్లోకం తద్విషయే భక్త్యా సౌమ్యజామాతృసంయమీ ।
స ఏవాయ మభూచ్ఛ్రీమాన్ చేతనోజ్జీవనక్షమః ॥ 794

దం. శ్రీరంగక్షేత్రములో శ్రీరంగనాథునికోవెలలోనే ఆశ్రీరంగనాథుఁడే పసిబాలుఁడుగావచ్చి నతఁడై అక్కడ మహాత్ములగోష్ఠిలోనుండి, ఎవరి కాలక్షేపములో భగవద్విషయాదికమును వినుచు వారిని స్వాచార్యులని "శ్రీశైలేశ దయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవం । యతీంద్రప్రవణంవందే రమ్యజామాతరం మునిమ్" అను శ్లోకమును అనుసంధించిరో ఆ యీ సౌమ్యజామాతృమునులే చేతనోజ్జీవనమున సమర్థులై శ్రీమంతులై యున్నవారు.

సీ. శ్రీరంగమందున శ్రీరంగధామాన
శ్రీరంగనాథుఁడే స్థిరతఁగోరి
బాలుఁడై వచ్చి సంభ్రమమునఁ గోష్ఠినిఁ
జేరి భక్తిని దేఱి చెలువుమీఱి
యా భగవద్విషయాది కాలక్షేప
మందుండి వినుచు నానందమంది
యాచార్యులేవార లనుచు శిష్యుఁడు తాను
ననుచు నెవ్వారిపైఁ దనియఁ గాఁగఁ
తే. దలఁచి తోన "శ్రీశైలేశ దయ" యటన్న
శ్లోకముపఠించె; దాన నేవేకృతార్థు
లగుచుఁ జేతనోజ్జీవన మాన్యజరుపు
సౌమ్యజామాతృమునులనే సంస్తుతింతు.

ఇ. సౌమ్యజామాతృలు—వీరు ఒకప్పుడు శ్రీరంగమున తమస్వప్నములో ఆ శ్రీరంగనాథుల యనుజ్ఞచేత స్వశిష్యులైన శ్రీరంగనాథభట్టరునకును ఉత్తమ నంబికిని తిరువాయిమొళ్ళె సవ్యాఖ్యానముగ కాలక్షేపము సాయించుచుండు నపుడు ఆ శ్రీరంగనాథుఁడే ఐదేండ్ల బాలకుఁడుగా వచ్చియుండి యంతయు

లభించుచుండి యాచార్యవిషయికమైన యా "శ్రీశైలేశదయాపాత్రం" అను శ్లోక మనుసంధించి యందఱ నానందపఱచిరి.

వీరు సాయించినగ్రంథములు—యతిరాజవింశతి, ఉపదేశరత్నమాల, తిరువాయ్ మొళ్ళి నూత్తందాది, ముముక్షుప్పడి, తత్వత్రయ, ఆచార్యహృదయ శ్రీవచనభూషణ జ్ఞానసారప్రమేయ సారవ్యాఖ్యానములును, రామానుజనూత్తందాది వుర్రై, భగవద్విషయ ప్రమాణత్తిరట్టు, ఆర్తిప్రబంధము, జీయర్పడి తిరువారాధనక్రమము, శ్రీశైలనాథ దివ్యచరణప్రభావము మొదలైనవి.

వీరిశిష్యులు అష్టదిగ్గజములు—"తేహి తోతాద్రి, శేషాద్రి, పార్శ్మంగె, పరవస్తు, తోక్కవిల్కందాడై, కందాడై, ఏట్టూర్, వాదిభయంకృల్ ఇత్యాదివ్యభిధా నేషు దిగ్గజా మతసంజ్ఞకాః"-వానమామలె పట్టరఫిరాన్ జీయర్, పరవస్తు పట్టరఫిరాన్ జీయర్, తిరుమలె యెంబార్ జీయర్, పార్శ్మంగె తిరువేంగడ జీయర్, కోవిల్ కందాడై యణ్ణన్, ప్రతివాదిభయంకరణ్ణర్, ఏట్టూరి-సింగరాచార్యర్, కందాడై-వరదనారాయణర్, ఇరుంబలి అప్పావ్, అప్పిళ్లై అప్పిళ్లాన్) మొదలైనవారు, అందు ఆచార్యహృదయ రహస్యములకు వ్యాఖ్యాత=పట్టరఫిరాన్ జీయర్, అందాదిప్రబంధమునకును యతిరాజవింశతికిని వ్యాఖ్యాత=అప్పిళ్లై- ఇట్లు ఏళున్నూర్గురు సన్యాసులును, పండ్రెండువేగు రేకాంగును డెబ్బదినాల్గు సింహాసనస్థులును, మున్నూర్గురు కొత్తెమ్మలును గాక, మఱియెందఱో శిష్యులున్నవారు. వారిలో పండ్రెండువేల యేకాంగులందఱును, తక్కినవారిలో గృహస్థులలోను సన్యాసులలోను నంబులుకొందఱును, తక్కిన అయ్యర్, దాసర్, అనువార్లును చాత్తాద శ్రీవైష్ణవులు. తక్కిన ఆళ్వార్, ఆండాళ్, అయ్యర్, ఆచ్చాన్, జియ్యర్, భట్టర్ మొదలైన వారందఱును చాత్తిన శ్రీవైష్ణవులు. మఱియు నిట్లెందరో అసంఖ్యాతశిష్యులు.

వీరితిరునామములు—అళగియమణవాళప్పెరుమాల్ నైనార్, అభిరామవరాధీశులు, మణవాళమహామునులు, కాంతోపయంతృలు, సౌమ్యజామాతృలు, రమ్యజామాతృలు, యతీంద్రప్రవణులు, వర వరమునులును,

గ॥ అత్రాపికశ్చన పురుషాముం పూర్వవదేవ శ్రీవానమహాచల
విషయమపి సంయోజయతి ॥ 795

## శ్రీవానమహాచలవర్ణనము.

ఇ. వానమహాచలము వానమామలై ఇదిచేత్తుత్తామరై అనెడి చెఱువుగట్టున ఇంద్రపుష్కరణీతీర్థతీరమున నందకవర్ధనవిమానమందు శ్రీభూనీళాదేవులతో విష్వక్సేన వైనతేయులతోను, సిరివరమంగనాచ్చియారుతోను, శ్రీదైవనాయకస్వామి చామరకన్యకా చంద్రసూర్యులతోడి రుద్రబ్రహ్మలకును ఉరోమర్శభృగు మార్కండేయ మహర్షులకును ప్రత్యక్షమై నమ్మాళ్వార్ల మంగళాశాసనముతో సేవసాయించుచు విశిష్టాద్వైత దర్శనప్రవర్తనమునకై అష్టదిగ్గజములనెడి యాచార్యమఠములలో పూర్వదిగ్గజమనెడి యీ వానమామలపట్టరభిరాన్ జీయర్మఠములతోడఁ గూడియుండుతోతాద్రియని యెడి దివ్యదేశము.

వృ॥ శ్రీమద్వానమహాచలేంచల చల న్నైగమ్యగమ్యార్థధీ
భంగాభంగసుధానిధా వుదయరాకాచంద్రబింబాయితః ।
స్వాంతేవాసి చకోరకోత్కర మనోహృద్యానవద్యామృత
శ్రీసూక్తిః కరుణాంకరోతు కలియన్ రామానుజోయంమునిః॥

అ. శ్రీమద్వానమహాచలే = సర్వసంపద్విశిష్టమైన వానమామలెయందు, అంచల - చలత్ - నైగమ్య - గమ్య - అర్థ - ధీ - భంగ - అభంగ - సుధానిధౌ=ప్రాంతప్రదేశములయందు - వ్యాపించుచున్న - వేదవిషయములందు - గమనింపఁదగిన - అర్థములయందలి - బుద్ధి యనెడి - అలలచేత - విస్తారమైన - పాలసముద్రమందు, ఉదయ రాకాచంద్రబింబాయితః= ఉదయకాలపూర్ణచంద్రుని పోలియున్నవారును, స్వాంతేవాసి - చకోరకోత్కర - మనః - హృద్య - అనవద్య - అమృత - శ్రీసూక్తిః=తమశిష్యులనెడు - చకోరపక్షులసమూహముయొక్క-మనస్సుకు-మనోహరమై - నిర్మలమైన -అమృతమువంటి శ్రీసూక్తులుకలవారునైన, కలియన్ రామానుజః= కలియన్ రామానుజులనెడి, అయంమునిః=ఈమహామునులు, కరుణాం=కృపను,కరోతు=చేయుదురుగాక ?

తా. వానమామలయందు అలలవలె మించియున్న వేదవేదార్థములందలి జ్ఞానమనెడి పాలసముద్రమునకు పూర్ణచంద్రునివలెనుండి, చకోరకములకువలె తమశిష్యులమనసుకు అమృతమువలె మనోహరమైన శ్రీసూక్తులు సాయించుచుండు నీ కలియన్ రామానుజమునులు మనలను కరుణించుచుందురుగాక ?

సీ. శ్రీ వానమామల ♦ చేరువ జరిగించు
 వేదవేదార్థాల ♦ వెలయుమఱియు
తఱుగుల తెఱుగున ♦ నెఱసిన పాలసం
 ద్రమునంద రాకచంద్రమునుఁబోలి
తనశిష్య సముదాయ ♦ మను చకోరములకు
 నమృతరూపం ♦ బగునట్టిసూక్తు
లనువదించుచునుండి ♦ యనువొందుచును నుండి
 కరుణారసమునిండి ♦ కలిసిమనసు

తే. తనియుచుండెడి యలకలి ♦ యలి ననునట్టి
నామమమును మును వఱచిన ♦ నామధేయ
మైనయట్టి రామానుజు ♦ లనెడు నట్టి
మునివరేణ్యులఁ బ్రణమింతు ♦ ననుదినంబు.

శ్లో॥ శ్రీవానసాయినోఽభిఖ్యో ద్వ్యగ్రహశ్శ్రీశఠద్విషత్ ।
తస్యైవాంఘ్రియుగం శ్రీమాన్ యతిరాజో జగద్గురుః॥

శ్లో॥ తస్యైవపాదుకాయుగ్మం సౌమ్యజామాతృసంయమీ ।
తయోః పాదకయో రేఖామయసంజ్ఞాప్రకాశితః ॥

శ్లో॥ యస్యవానమహాశైల రామానుజమునిః పురా ।
తస్మిన్ సింహాసనేపాదా అష్టదిగ్గజసంజ్ఞకాః ॥

శ్లో॥ శ్రీవానాచలతిర్మల సార్ఙ్గపరవస్తుత ।
తోక్కవిల్కుందాడకందాడ ఏట్టూర్యాదిభయంకృది ॥

శ్లో॥ త్వాఖ్యాతేష్వభిధానేషు మతాశ్శిష్టప్రతిష్ఠితాః ।
తేషుప్రాథమికః పాద స్తద్వానాచలసన్మతః ॥
శ్లో॥ తత్పంచవింశతితి మే పట్టేస్మిన్నభిషేకతః ।
తత్రతత్రచశిష్యాంశ్చ ప్రశిష్యాంశ్చసదాముదా ॥
శ్లో॥ ఉజ్జీవయితుముద్యుక్తో విశిష్టాద్వైతదర్శనే ।
ప్రాదుర్భవిష్యతిపశ్చాత్ కల్యాణరామానుజోమునిః ॥
శ్లో॥ జీయర్జీయాజ్జేతుకామో మతాంతరసముత్థితాన్ ।
తథైవ తేతుజీయాసు స్తచ్ఛిష్యాస్సర్వఏవహి ॥
శ్లో॥ కలయన్ కలియన్ రామానుజయోగిపదాంబుజే ।
బుద్ధ్వాబద్ధ్వాఽంజలింసేవే సైవేహాకృతకృత్యతా ॥

మంజరులు. శ్రీ దేవితోడి యా శ్రీహరి మేను
శఠవైరి, యతిపతి చరణముల్, సౌమ్య
జామాతపాదుకల్, రామానుజ ముని
యాపాదుకారేఖ, యావానశైల 2
మాద్య, మాపీఠాన, బాదామెయష్ట
దిగ్గజాలందుఁ బ్రాగ్దిగ్గజమిదియె, 3
ప్రాగ్దిగ్గజత్వంబె ప్రాథమికంబు,
వాదిభీకర మఠం బాదితక్కినవి, 4
ఇరువదియైదవ దిర వొందుపట్ట
మందుల నభిషిక్తు లాకలియనను 5
రామానుజమునులు సామోదులౌచుఁ
దద్విశిష్టాద్వైత దర్శనము నవ 6
శిష్య ప్రశిష్యుల శిష్టులఁజేసి
యుజ్జీవకులె యైరి యిజ్జగతినిన, 7

సన్నిధి పంచాంగ మన్నయే దేవ
రాజ పెర్మాళ్లయర్ రక్షింత్రుగాక 8
దాసానుదాసుఁడౌ దాన నేనన్ను
అటుకలియనను రామానుజమునుల 9
పాదపద్మములను బ్రణమింతు నెపుడు,
నదెకృతకృత్యత యందఱ కెపుడు. 10
కృశానుః.—కృశానువు.—

గ॥ సత్యమేనం తథాపి పున రతీతశ్రుతిస్మృతయో యతయోపి
కతిచిదత్ర వర్తంత ఇతి భాతీహనాతి మాననీయతా॥ 797

ప. నిజమేయైన మఱి శ్రుతులు స్మృతులు నతిక్రమించిన యతు
లు కొందఱిందు నుందురువలె నున్నది. వారి కీయెడ మా
ననీయత యనునదె కానంబడక యున్నది.

## యతిప్రభృతివర్ణనము.

టీ. యతిప్రభృతులు = జితేంద్రియులైన సన్న్యాసులు, సన్న్యసించిన
యేకాంగులు, (త్రిదండులు ఏకదండులు మొదలైనవారును.)

తథాహి.—అట్లెకదా ?—

వృ॥ న సంధ్యాసుస్నానం త్రిసృషు న కమండల్వభిధృతి
ర్నచాతుర్మాస్యాది వ్రతమపి న భిక్షాటనవిధిః ।
న లిప్సాయాస్త్యాగో న పరిపఠనం చోపనిషదాం
యతిత్వంనై తేషాం శ్రుతిగతి మతిక్రమ్యచరతామ్ ॥ 798

ఆ. త్రిసృషు+సంధ్యాసు = త్రికాలముల+సంధ్యలలోను, స్నానంన =
స్నానములేదు; కమండలు+అభిధృతిః = కమండలువును+చేపట్టుటయు, న =
లేదు; చాతుర్మాస్యాది+వ్రతమపి=చాతుర్మాసిమొదలైన+వ్రతముకూడ, న =
లేదు; భిక్షాటన-విధిః=తిరిపమునకు తిరుగుటయందలి - నియమమును, న=లే

దు, లిప్సాయాః=ధనాపేక్షకు, త్యాగః= విడుపును, న=లేదు; ఉపనిషదాం= ఉపనిషత్తులలో, పరిపఠనంచ-చదువుటయున్. న=లేదు; శ్రుతిగతిం=వేదమార్గమును, అతిక్రమ్య=మీఱి, చరతాం=సంచరించునట్టి, ఏతేషాం=ఈయతులకు, యతిత్వం=యతిధర్మము, న=లేదు.

తా. ఈ యతులకు స్నాన,సంధ్యావందన,కమండలుధారణ, వ్రతాచరణ, భిక్షాటన, ధనాపేక్షా విసర్జనములు లేకుండినను, వేదపాఠము, వేదోక్తాచారము ను లేకుండుటచేత వీరికి యతిత్వ మెట్లు కలుగును?

మ. తగసంధ్యల్ తిగస్నానముల్, కరకమౌణ్డాలవ్యర్ఘ్యముల్ పౌర్ణమా
 సిగురుత్వవ్రతముఖ్యముల్, కడుఁబ్రశస్తిన్ భిక్షగావించుటల్
తిగకోర్కుల్ తెగటార్చుటల్, శ్రుతులతోఁ దేఱంగ వ్యాసంగము
 పగడైనన్ గనలేదు, లేదిఁక యతిత్వంబన్న దేమున్న దే? [ల్

గ॥ న కేవల మేతావదేవ శృణు తావదన్యదపి॥ 799

వ. ఇట్లు నీకు వేదమార్గ నతిక్రమించుటే కాదు. మఱొకటాల
 కించుము ?

వృ॥ సన్న్యాసాశ్రమమాశ్రితోఽపి సకలవ్యాపారలోపాత్మకమ్
 కైంకర్యం చపలో హరేరపదిశన్ ద్రాగ్రాజధానీం విశన్ ।
 అర్థానార్జయతి శ్రితోర్జితమఠో మృష్టాన్నమశ్నాత్యసా
 వోమృష్యేదిహ రామరామ తదిదం కష్టం యతేశ్చేష్టితమ్ ॥

అ. సకలవ్యాపార+లోప+ఆత్మకం= సకలకృత్యములు+లోపించుటయే+స్వరూపముగాఁగల, సన్న్యాసాశ్రమం=చతుర్థాశ్రమమును, ఆశ్రితోఽపి = ఆశ్రయించినవాఁడయ్యును, చపలః=చంచలుఁడైన, అసౌ=ఈయతి, హరేః=విష్ణువు యొక్క, కైంకర్యం=కైంకర్యమును, అపదిశన్ =నెపము చేసికొనుచు, రాజధానీం=పట్టణమును, ద్రాక్ =త్వరగా, విశన్ =ప్రవేశించుచు, అర్థాన్ =ద్రవ్యములను, ఆర్జయతి=ఆర్జించుచున్నాఁడు, శ్రిత+ఊర్జిత+మఠః=చేరఁబడిన + దృఢమైన-మఠముకలవాఁడై, తదిదం=ఆయది, మృష్ట+అన్నం=రసవంతమైన+

అన్నమును, అశ్నాతి=భక్షించుచున్నాఁడు. కష్టం=ఇదికష్టము. యతేః=యతియైనవానియొక్క, చేష్టితం=ఇట్టిచేష్టను, ఇహ=ఈలోకములో, కః=ఎవఁడు, మృష్యేత్=సహించును? రామరామ=ఆహా?

తా. సామాన్య కార్యములలోనుండక సన్యాసాశ్రమములోనుండు వాఁడు ధనాపేక్షచేత చపలుఁడై భగవత్కైంకర్యమని సాకుచేసికొని గ్రామములలోఁగాక పట్టణలలోఁగూడఁజేరి ధనమార్జించును. ఇదిగాక, మఠాధిపతిగానుండువాఁడైనయెడల షడ్రసోపేతమైన యన్నమునే తినుచుండును. ఇట్టియతియైనవానిచేష్టను ఎవఁడును సహించుకొనఁజాలఁడు.

చ. చర్యల సన్న్యసించి పరిశిచర్యల శౌరి కవారిఁజేయు కైం
కర్యము వ్యాజమోజఁగొనిశికాంతుఁగరంబుపురంబుచేరుచుః
గార్యముదగ్రవ్యసంగ్రహమెశి కాఁగ రసప్రసరంపుటన్నమా
హార్యముకాఁగ రేఁగుయతిశి యక్రమమేరికినోర్వనర్హమౌాన్.

టీ. చర్యలన్=తనపూర్వవర్తనములను, అవారిగన్=విశేషముగ, కైంకర్యము వ్యాజము=కైంకర్యమను నెపమును.

కింబహునా—విశేషమేల?—

వృ॥ అన్యాయ్య మస్తికి మితోఽపికలౌయుగేయత్
సన్న్యాసినో విదధతే గృహిణాం ప్రణామాన్ ।
ఏతత్తు చేత ఇహ కృంతతి వైష్ణవోఽసా
విత్యత్రశూద్ర మమతిర్నమతి ద్విజోయత్ ॥ 801

అ. యత్=ఏది, సన్న్యాసినః=సన్న్యాసులు, గృహిణాం=గృహస్థులకు, ప్రణామాన్=నమస్కారములను, విదధతే=చేయుచున్నారో? ఇతఃఅపి=ఇంతకంటెను. కలౌయుగే=కలియుగములో, అన్యాయ్యం=అక్రమము, కింఅస్తి=ఏమియున్నది? యత్=ఏది, అత్ర=ఇక్కడ, శూద్రం=శూద్రుని, అసౌ=ఇతఁడు, వైష్ణవః=వైష్ణవుండు, ఇతి=అని, అమతిః=మూఢబుద్ధియైన, ద్విజః=

బ్రాహ్మణుఁడును, నమతి = నమస్కరించుచున్నాఁడో? ఏతత్తు = ఇదియు, ఇహ = ఈమండలమునందు, చేతః = మనస్సును, కృంతతి = చీల్చుచున్నది.

తా. ఈ యాదేశములందు యతులు గృహస్థులకు నమస్కారము చేయుచున్నట్లు ఇక్కడి బ్రాహ్మణులును శూద్రులు వైష్ణవులని ఆశూద్రులకును నమస్కారముచేయుచున్నవారు. ఇది మనస్సునకు కష్టముగానున్నది ?

ఆ. యతులునతులొనర్తు రీ కృతికరాంజలులొచు
నతులమతులగృహుల కీ కదియకాక
యవుర? వైష్ణవులని యీ యవరవర్ణులనేని
నతులొనర్తురిద్విజులు యీ యతులవలెనె.

ఇ. ఇట్లు చాత్తాద శ్రీ వైష్ణవులనుగూడ ఎట్టి బ్రాహ్మణ శ్రీవైష్ణవులైనను, "వైష్ణవో వైష్ణవందృష్ట్వా దండవత్ప్రణమేద్భువి" అను ప్రమాణప్రకారము పరస్పరము ప్రణమించుకొనుచుండువారె.

ఇది తప్పిదముగానెంచుట యొప్పిదముకాదు. "నశూద్రాభగవద్భక్తాః" అని శూద్రులుకాని యీ భగవద్భక్తులైన చాత్తాదులను శూద్రులనుగా తలఁచినదిగాక, వీరిలో ఆంధ్రులనుమాత్రము అపవిత్రులనుగా నెంచి తక్కిన ద్రావిడకర్ణాటక మహారాష్ట్రాదులను తమకంటె శ్రేష్ఠులనుగా తలంచుకొనిరియని యనుకొనవలసియున్నది ? కనుక ఇత్యాంధ్ర అనుచో ఇత్యత్ర అని మార్పంబడినది.

ఈ చాత్తాద శ్రీవైష్ణవులు=చాత్తుకొననట్టి శిఖా యజ్ఞోపవీత పంచకచ్ఛములవారు. వీరు బ్రాహ్మణాద్యుత్తమజాతులు; ప్రపత్తినిష్ఠచే జాతిభేదమెంచక మతభేదమునెంచక, జ్ఞాన భక్తివైరాగ్యసంపన్నులై ముందటి భారద్వాజబోధాయనాది గోత్ర సూత్రములైన నవలంబింపక, పరాంకుశ పరకాలాది గోత్రసూత్రములె పూర్వోత్తరముగ నవలంబించుచు, శ్రుత్యాదులం దొకస్వరమైనను శ్రుతపఱచుకొనక, ఆళ్వారాదుల ద్రావిడవేద ప్రబంధములె అధ్యయనము చేయుచు, వాసని వైష్ణవస్తోత్ర పాఠములతో పారాయణము చేయు

చు, భక్తిపారవశ్యముతో భగవద్ధ్యానధారణ పరాయణులై, భగవత్కైంక ర్య ధుర్యులై, తదీయగోష్ఠి కాలక్షేపములందే కాలముకడపుచు, తదీయారాధన పరులై, ఆచార్యవిషయ పారతంత్ర్యప్రవరులై, సంసారులైనను సన్యాసులైనను, దేహాత్మాభిమానములేక సర్వవిధముల స్వాతంత్ర్యమును విడిచి, శిష్టుల శ్రీపాదతీర్థమే ఆత్మోజ్జీవనముగలభించుచు, అనన్యార్హ అనన్యగతిక అనన్య శరణ్యులై, దేవతాంతర మంత్రాంతర సాధనాంతరములు వదిలి, నైచ్యాను సంధానముతో సహజసిద్ధములైన శిష్టాచారానుష్ఠానములతోను పరిపూర్ణులై పవిత్రులునై యుండువారు.

విశ్వావసుః—విశ్వావసువు.—

గ॥ సఖే ! మైవం సంభాషిష్ఠాః ॥

వ. సఖా ! ఈలాగునఁ బలుకాడకు.

వృ॥ ముంచంతు హంత ! యతయః కతిచిద్వ్రతౌఘా-
ఉజ్ఝంతు భైక్షచరణం కలయంతు వాఽమీ ।
హర్యంఘ్రి పంకరుహ కింకరతా రతాశ్చేత్
పంక ప్రసక్తి రకలంక హృదాం క్వ తేషామ్ ॥ 802

అ. కతిచిత్=కొందఱు, యతయః=యతులు, వ్రత - ఓఘాన్ = చాతుర్మాస్యాది వ్రతములయొక్క - సమూహములను, ముంచంతు=విడుతురుగాక? కలయంతువా=చేర్చనైనచేర్తురుగాక ? భైక్షచరణం = భిక్షాటనమును, ఉజ్ఝంతు=విడుతురుగాక ? కలయంతువా=చేర్చనైన చేర్తురుగాక- అమీ=వీరు, హర్యంఘ్రిపంకరుహ- కింకర తారతాశ్చేత్ =శ్రీహరిపాదపద్మములందు-కైంకర్యమున ఆసక్తికలవారైనయెడల, అకలంకహృదాం=నిష్కళంకమైన హృదయముకలవారైన, తేషాం=ఆ యతులకు,పంకప్రసక్తిః=పాపములతోడి సంబంధము, క్వ=ఎక్కడిది ?

తా. యతులు కొందఱు స్నాన సంధ్యావందన వ్రతాచరణాదు లాచరించనీ? ఆచరింపకపోనీ ? భిక్షాటనముచేయనీ ! చేయకపోనీ ? ఆ శ్రీహరి కైంకర్య

విషయమైన తమ మనస్సు నిష్కళంకమై యున్నయెడల వారికి పాపసంబంధమే కలుగదు.

ఆ. యతులు కొంద ఱిందు నెప్పిశనులు భిక్షులౌ
నర్థులేని వా రొకానరఁ రేని
హరి పదారవింద నిభరిత చాస్యము లంద
యున్నవారు దొసఁగు నీనున్నవారె.

టి. దొసగు=దోషముసు, నున్న వారె=నులిచినవారె-పోఁగొట్టుకొన్న వారె.

గ॥ యత్పున రభిహితం ఫణిపర్యపర్యంక కైంకర్యార్థం పర్యట
నమపి తుర్యాశ్రమా ననుగుణమితి, తదపి నిపుణ నిరూపణ
విరహవిజృంభితమ్॥ 803

వ. చతుర్థాశ్రములకు చతుర్భుజవిషయక కైంకర్యపర్యటనము
కూడఁ గూడనిదని మఱిమఱి విజృంభించియనుట దానిని విశే
షంబుగ విమర్శింపకయే యనుటయై యున్నయది.

వృ॥ కేచన పంకజలోచన కైంకర్యా యైన పర్యటంతే౽మీ
సన్న్యాసిన ఇహ ధన్యా స్తేహి స్వతఉపగత స్పృహావిరహాః॥

అ. కేచన=కొందఱు, సన్న్యాసినః=యతులు, పంకజలోచన కైంకర్యాయై
వ=ఆ పుండరీకాక్షుఁడైన భగవానుని కైంకర్యమునకయ్యే, పర్యటంతే=తిరు
గుచున్నారో? స్వతః=స్వభావముతో, ఉపగత - స్పృహా- విరహాః=పొంద
బడిన - ధనాపేక్షయందలి - పరిత్యాగముగలవారైన, తే అమీ= ఆ వీరు,
ఇహ=ఇక్కడ, ధన్యాఃహి=కృతార్థులే కదా?

తా. కొందఱు యతు లిక్కడ తమకై ధనాపేక్షయే విడిచి భగవత్కైం
కర్యమునకైయే పట్టణాదులలో తిరుగుచుండువారౌటచేత వారు కృతా
ర్థులే కదా?

క. పంకేరుహ దళ లోచన
కైంకర్యముకయ్యె కాక నీ కామించిరె? తా

మింకను దమకయ్యె యొకటి
జంకకె ధన్యాత్ము లిచట సన్న్యాసు లొగిన్.

గ॥ ఇత్థంహి హేయోపాదేయ విద ఉదాహరంతి ॥ 805

వ. ఇటు లిది హేయ మిదియుపాదేయమని తెలిసినవా రుదా
హరించుచున్నవారు.

వృ॥ భోగాయైవ నితంబినీపరిణయో యాగాహృతిఃఖ్యాతయే
స్వార్థంపాకకృతిః కుపాత్రవిషయత్యాగార్థమర్థార్జనమ్ ।
స్వాధ్యాయాధ్యయనం ప్రతిగ్రహకృతే వాదాయశాస్త్రశ్రమః
దుష్యేచ్చోదరపూర్తయే యది హరేః కైంకర్యమాచర్యతే॥

అ. భోగాయైవ=సంభోగమునకై యే, నితంబినీ పరిణయః = స్త్రీతోడివివాహమును, ఖ్యాతయే = ప్రఖ్యాతికై, యాగాహృతిః = యజ్ఞము చేయుటయు; స్వార్థం=తనకోసరమే, పాకకృతిః = పాకముచేయుటయు; కుపాత్రవిషయత్యాగార్థం=కుత్సితులయొక్క విషయమున దానమునకై, అర్థార్జనం = ద్రవ్యసంపాదనమును; ప్రతిగ్రహకృతే=మాఱుతీసికొనుటకై, స్వాధ్యాయాధ్యయనం=తన తన అధ్యాయమునకై అధ్యయనమును, వాదాయ=వివాదమునకై, శాస్త్రశ్రమః=శాస్త్రాభ్యాసమును; ఉదరపూర్తయే=పొట్టనిండుటకై, హరేః కైంకర్యంచ=భగవత్కైంకర్యమును; ఆచర్యతేయది=ఆచరింపఁబడుచున్నదేని, దుష్యేత్ =దూషింపనే దూషింపఁదగును.

తా. వివాహము సంతానమునకుఁగాక సంభోగమునకేను, యజ్ఞము స్వర్గమునకుఁగాక ఖ్యాతికేను, పాకము చేసికొనుట అతిథులకుఁగాక తనకేను, ద్రవ్యార్జనము ధర్మమునకుఁగాక కుత్సితుల యుపయోగమునకేను, అధ్యయనము బ్రహ్మలోకమునకై కాక బహుళమైన తీసికొనుటకేను, శాస్త్రాభ్యాసశ్రమము జ్ఞానమునకుఁగాక వివాదమునకేను, భగవత్కైంకర్యము పరమపదమునకుఁగాక పొట్టనిండించుకొనుటకేను, ఆచరించికొనిన యెడల అది అది నింద్యమేయగును.

సీ. పుత్త్రార్థమును గాక  భోగార్థమే యేని
 పరిణయం బెటుదూష్య  పదము కాదు
స్వర్గార్థమును గాక  స్వఖ్యాతికే యేని
 క్రతువెట్లు దూష్యంబు  కాంచఁగాదు
అతిథులకును గాక  యది తమకే యేని
 పాకంబు నెటుదూష్య  పదము కాదు
పాత్త్రంబునకుఁ గాక  పాత్త్రంబుకే యేని
 యర్థార్జన మెటు దూష్యంబు కాదు ?
తే. బ్రహ్మార్థమును గాక  ప్రతిగ్రహార్థమె యేని
యధ్యయన మెటు దూ  ష్యంబు కాదు
బోధార్థమును గాక  వాదార్థమే యేని
శాస్త్రశ్రమ మెటు దూష్యంబు కాదు.
ఆ. పరమపదమునందు  బరఁగుటకును గాక
యుదరపోషణమున  కొనరె నేని
యాచరింపనట్లె  హరికిఁ గైంకర్యంబు
దూషణమునకదియు  దొరయుఁ గాదె.

అన్యచ్చ — మఱియును —

వృ॥ భూయోదోషైరపి పరివృతః పూరుషస్సాత్త్వికానామ్
ప్రాయః పూజ్యో భవతి భగవద్భక్తిమాసాద్య హృద్యామ్
ఆక్రాంతాఽపి ప్రబలభుజగైః కంటకై రప్యనల్పైః
కిన్నాదృత్యా సురభికుసుమా కేతకీ భాగ్యభాజామ్ ॥ 807

అ. భూయః=బహుగా, దోషైః=దోషములచేత, పరివృతోఽపి=చుట్టఁబడినవాఁడయ్యును, పూరుషః=పురుషుఁడు, హృద్యాం=మనోహరమైన, భగవద్భక్తిం=భగవంతునియెడల భక్తిని, ఆసాద్య = పొంది, సాత్త్వికానాం=స

త్వసంపన్నులైనవారికి, ప్రాయః = బహుగా, పూజ్యః = పూజనీయుఁడు, భవతి = అగుచున్నవాఁడు. ప్రబల భుజగైః = బలవంతములైనసర్పములచేతను, అనల్పైః=గొప్పలైన. కంటకైః అపి=ముండ్లచేతను, ఆక్రాంతాపి=ఆక్రమింపఁబడినదయ్యును, సురభి కుసుమా = పరిమళించుచున్న పుష్పములుగలదైన, కేతకీ=మొగిలి, భాగ్యభాజాం=భాగ్యమనుభవించువారికి, ఆదృత్యా=ఆదరింపఁదగినది, నకిం=కాదాఏమి ?

తా. ఎన్నిదోషములున్నను, భగవద్భక్తిగల పురుషుఁడు సాత్వికులలో పూజ్యుఁడుగానుండును. పాములు ముండ్లు నున్నను, పరిమళించు పువ్వులుగల మొగిలి యెంత భాగ్యవంతులకైనను ఆదరింపఁదగినదే కదా ?

ను. భగవద్భక్తిగలట్టిమెట్టిజనులుం బ్రాయఃప్రపూజ్యుల్ దలం
పఁగదోషచ్ఛటలాక్రమించియును సత్త్వసాధ్వాంతులౌ వారికిన్
మొగిలిన్ సౌరభబంధురంబుఁగను చున్ ముండ్లున్నఁగిండ్లున్నఁబ
న్నగముల్ వెల్లుగనున్న మెల్లఁగొనరే శ్రీమన్నై పథ్యభాగ్యోన్నతుల్.

## పాండ్యచోలదేశస్థార్తశైవాదిపండితవర్ణనము.

గ॥ ఇత్యన్యతోఽభిక్రామన్ సమంతాదవలోక్య సాంజలిబంధమ్॥

వ. అని మఱొక్కప్రక్కకుం గదలి కలయం గనుఁగొని బద్ధాంజలిబంధుఁడై.

శ్లో॥ క్రియాసార్థితవేదేభ్యో గ్రాహయద్భ్యశ్శ్రుతీర్బహూన్ ।
పాండ్యచోలనివాసిభ్యః పండితేభ్యో నమోఽస్తు వః ॥ 809

అ. క్రియాసార్థితవేదేభ్యః = సత్కర్మలచేత ఫలపఱుపఁబడిన వేదములుగలవారై, బహూన్=అనేకులను, శ్రుతీః=వేదములను, గ్రాహయద్భ్యః = గ్రహింపఁజేయువారై, పండితేభ్యః=పండితులైన, వః=మీకు, నమః = నమస్కారము, అస్తు=అగుఁగాక.

తా. వేదములు [illegible] శిష్య

లకు అధ్యయనము చేయించుచున్న, పాండ్యచోళదేశములలోని పండితులకు నమస్కారము.

తే. చెలఁగి పఠియించి పఠియింపఁ జేసి శిష్య
నికరముల వేదముల వేఁ శిఖరసరణి
నడచి నడపింతు రేవారు పుడమి నట్టి
చోళపాండ్యపండితులకే జోత లిడుదు.

## అందు అద్వైతివర్ణనము.

ఇ. అద్వైతి=అద్వైత మతావలంబి, అద్వైతము=ద్వైతము కానిది, (ద్వైతము జీవాత్మపరమాత్మలుగానుండు బ్రహ్మమును తక్కిన జడరూపముగానుండు ప్రపంచమును అనెడివి రెండే; ఈద్వైతము కానిదే అద్వైతము) ఈసత్యనిత్యనిర్వికారనిరవయవనిరవద్యముగానుండు బ్రహ్మమొక్కటియే ఆత్మగాను పరమాత్మగాను ఉండునది తక్కినది అవిద్య అనెడి మాయారూపమై జడరూపమై ప్రపంచమయముగనై పరిణమించుచుండెడిది. ఆపరిణామము పృథివ్యాదిపంచభూతములతో మాఱుచుండునది. ఈ మతము శాస్త్రపురాణేతిహాస వేద వేదాంతములు అప్రమాణములనియు నిర్వచించెడు స్మార్తమతము. ఈద్వైతాద్వైతములు విశిష్టాద్వైతము అని మఱియొక వైష్ణవమతముతో చేరి త్రివిధమతములై యుండును. (ఆ విశిష్టాద్వైతమతమును గుఱించి వెనుకటి సంచికలలో చెప్పఁబడియున్నది.)

తే. సరవిఁ బ్రత్యక్షమగు ప్రపంచంబు గాంచి
మిథ్యయంచు నీమాయ లామధ్యనే ప్ర
మాణముగ మించియుఁ బరోక్షమైన బ్రహ్మ
నిర్విశేషంబుఁ గయికొంద్రు నిక్కమంచు.

పునస్సరోషం—మఱలరోషించి.

గ॥ హంత ? బ్రహ్మబంధవ ఇమే బ్రహ్మణే పరస్మై ద్రుహ్యంతి॥

వ. ఆహా! వీరు బ్రహ్మబంధువులైనను పరబ్రహ్మమునకును ద్రోహు లగుచున్నారు?

యతః.—ఏలంటే?

వృ॥ యదేవ సర్వజ్ఞ మపాస్తదోషం
భవార్తిహారి శ్రుత మాగమాంతే
అజ్ఞం పరం బ్రహ్మ తదేవభోక్తృ।
సంసారతాపా నితి సంగిరంతే॥ 811

అ. యత్=ఏబ్రహ్మము, ఆగమాంతే=వేదాంతమందు,సర్వజ్ఞం=సర్వవేత్తయు, అపాస్తదోషం = తొలఁగిపోయిన సకలదోషములు కలదియు, భవార్తిహారి=సంసార దుఃఖములను పరిహరించునదియు,ఇతి=అని, శ్రుతమేవ=విననే వినఁబడినదో? తత్=ఆ, పరబ్రహ్మైవ=పరబ్రహ్మమే, అజ్ఞం=అల్పవేత్తయు, సంసారతాపాన్=సంసారదుఃఖములను గూర్చి, భోక్తృ - అనుభవించునదియు, ఇతి=అని, సంగిరంతే=చక్కఁగ చెప్పుచున్నారు.

తా. సర్వజ్ఞుఁడుగా, సర్వదోషములతో సంసారదుఃఖములను పరిహరించునట్టి యా పరబ్రహ్మను అల్పజ్ఞునిఁగాను, సంసారదుఃఖములనే అనుభవించువానిఁగాను చెప్పుచున్నవారు.

తే. ఎవని సర్వజ్ఞు నిర్దోషు కే భవవినిఘ్ను
నిఁగను నిగమాంతములు తెల్పె కే నెగడువానిఁ
బరము బ్రహ్మను గించిజ్ఞు కే భవ నిమగ్ను
నిఁగనె యద్వైతు లనెదరికే వ్వాగఁ దెగించి.

గ॥ న కేవల మమీ పరస్మై బ్రహ్మణేద్రుహ్యంతి,కింతు తత్ప్రమాణేభ్యః శ్రుతిభ్యోఽపి॥ 812

వ. వీరు కేవలము పరబ్రహ్మకే కాదు, తద్యాథార్థ్యమునకు సాధకప్రమాణంబులైన శ్రుతితతులకును సహా ద్రోహులగుచున్నవారు.

యతః.—ఏలంటే?

వృ॥ మిథ్యార్థా వేదకత్వాచ్ఛ్రుతిషు కుమతిభిః కర్మకాండే నిరస్త
ప్రామాణ్యే బ్రహ్మకాండైస్సహ గుణవచనై శ్శేషితో బ్రహ్మశబ్దః
మిథ్యార్థాఽస్మిన్ విభక్తిః ప్రకృతిరపి పరంబ్రహ్మ నైవాభిధ
త్తే, వాచ్యత్వానాశ్రయత్వాత్కథముపనిషదాంమానతాం
జానతాం తే ॥ 813

అ. కుమతిభిః=కుత్సితబుద్ధికలవారిచేత, గుణవచనైః=గుణములను చెప్పునట్టి, బ్రహ్మకాండైస్సహ= ఉపనిషత్తులతోఁగూడ, కర్మకాండే=కర్మ ప్రతిపాదక కాండము, మిథ్యార్థా వేదకత్వాత్=అసత్యార్థములను తెలుపునది యవుటవలన, నిరస్తప్రామాణ్యే = నిరసింపఁబడిన ప్రమాణత్వము కలదియగుచుండఁగా, శ్రుతిషు=వేదములయందు, బ్రహ్మశబ్దః=బ్రహ్మశబ్దము, శేషితః=మిగిలినది అయ్యెను, అస్మిన్=ఈ బ్రహ్మశబ్దమునందు, విభక్తిః=విభక్తిగాని, ప్రకృతిః=ప్రాతిపదికరూపముగాని, మిథ్యార్థా=అసత్యార్థమై, పరంబ్రహ్మ=పరబ్రహ్మను, నైవఅభిధత్తే=చెప్పనే చెప్పదు. వాచ్యత్వ అనాశ్రయత్వాత్ =వాచ్యార్థమునకు స్థానము కాకపోవుటవలన, తే=ఆకుత్సితమతులు, ఉపనిషదాం=ఉపనిషత్తులయొక్క, మానతాం=ప్రామాణ్యమును, కథం=ఎట్లు,జానతాం= తెలిసికొందురు?

తా. ఈ బ్రహ్మశబ్దము జ్ఞానప్రతిపాదకమేయైన బ్రహ్మకాండమునఁగాని, కర్మప్రతిపాదకమైన కర్మకాండమునఁగాని అప్రమాణము అని కృతులుచెప్పినను, వాని ప్రకృతిప్రత్యయములచేతనైన అసత్యార్థముగ పరబ్రహ్మను చెప్పఁబడదు. అది దాని అర్థమును అనుసరింపకపోవుటచేత, ఎవరు ఉపనిషత్ప్రమాణము తెలిసికొందురు ?

ఇతి. కర్మకాండము - ఇదియే కర్మమీమాంస - లేక - పూర్వమీమాంస అనియు, బ్రహ్మకాండము - ఇదియే బ్రహ్మమీమాంస -లేక - ఉత్తరమీమాంస అనియు చెప్పఁబడును. ఈ కర్మకాండమే వర్ణాశ్రమోచితకర్మలై తత్త ద్దేవపూజామాత్రములైయుండును. బ్రహ్మకాండమో సాక్షాద్బ్రహ్మస్వరూప ప్రతిపాదకమైన ఉపనిషత్తులై యుండును.

సీ. అనృతమంచుఁ బ్రపంచ మధిగమించుకుబుద్ధు
లా గుణాపాదక మైనయట్టి
బ్రహ్మకాండముతోడఁ గర్మకాండముకూడ
జగమనృతమెయను జాడఁబట్టి
ప్రామాణ్యనిరసన ప్రాచుర్యమైయుండఁ
బ్రామాణ్యముననుండె బ్రహ్మమొండె
అందువిభక్తిమి థ్యార్థకమైయుండ
ముఖ్యార్థమే లేని మూలశబ్ద
తే. మైన నాపరబ్రహ్మమే మైనఁజెప్ప
దనఁగ నుపనిషత్తులకెట్టు లనువుగాఁగఁ
దగుప్రమాణత్వమును బ్రశస్తమును గాఁగఁ
జెప్పఁగలవారు సారము మెప్పమీఱ.

గ॥ న పర మేతే శ్రుతిభ్యో ద్రుహ్యంతి కింతు శారీరకాయ ॥814

వ. వీ రాశ్రుతులకే కాదు, మఱి శారీరకభాష్యప్రవక్తయైనయా
పారాశరికిఁగూడ ద్రోహులై యగుచున్నవారు.

శ్లో॥ పరాశరభువా శాస్త్రం
బ్రహ్మజ్ఞానాయ నిర్మితమ్ ।
అసమంజసతాం నీత
మవేద్యం బ్రహ్మవాదిభిః ॥ 815

అ. పరాశరభువా=పరాశర మహర్షి పుత్రుఁడైన వ్యాసమహర్షి చేత, బ్రహ్మజ్ఞానాయ=బ్రహ్మజ్ఞానమునకై, నిర్మితం=నిర్మింపఁబడిన, శాస్త్రం=శాస్త్రము, అవేద్యం= తెలిసికొనఁజాలనిదియై, బ్రహ్మవాదిభిః=బ్రహ్మవాదులచేత, అసమంజసతాం=అయోగ్యతను, నీతం=పొందింపఁబడినది.

తా. ఈవ్యాసమహర్షి చేత చేయఁబడిన బ్రహ్మసూత్రశాస్త్రము సాధారణముగ తెలిసికొనఁదగినది కాదు అని బ్రహ్మవాదులు చెప్పెదరు.

ఆ. వ్యాసనిర్మితంబు శ్రీ బ్రహ్మసూత్రం బిది
బ్రహ్మబోధమునకె శ్రీ పరిఢవిల, న
గోచరంపు బ్రహ్మఁ శ్రీ గుఱించి వాదించు వా
రవ్యవస్థమనుచు శ్రీ నుంద్రుదాని.

ఇ. వ్యాసమహాముని—ఈయన వసిష్ఠమహాముని మునిమనుమఁడును, శక్తి అనుమునికి మనుమఁడును, పరాశరమహాముని కొమారుఁడును, శుకమహాముని తండ్రియునై భారతాదులనే కాక, వేదములనుఁ జతుర్విధముల విభజించి వేదవ్యాసులనియు విష్ణ్వంశమున జన్మించినందున, కృష్ణద్వైపాయనులనియు ప్రఖ్యాతిపొందెను.

కించ.—మఱియు.—

గ॥ యాదృశస్స్వభావ స్సర్వేశ్వరః, తద్విపరీతమేవ త ముపదిశంతి విరుద్ధబుద్ధయ ఏ తే ॥ 816

వ. విరుద్ధబుద్ధులు వీరలు సర్వేశ్వరునిసయితము విపరీతస్వభావు నిఁగనె యూహించుచున్నారు.

వృ॥ సర్వజ్ఞమజ్ఞ ఇతి సర్వ పదాభిధేయమ్
కస్యాప్యవాచ్య ఇతిసర్వ మహాగుణానామ్ ।
స్థానంచ నిర్గుణ ఇతీహ సమస్తవేద
వేద్యం త్వవేద్య ఇతి తే జగదీశమాహుః ॥ 817

అ. తేతు=ఆ అద్వైతులై తేనో, సర్వజ్ఞం=సర్వజ్ఞుఁడైన, జగదీశంచ=సర్వేశ్వరునిఁ, అజ్ఞ ఇతి=అజ్ఞుఁడనియు; సర్వపదాభిధేయం=సకలశబ్దముల చేతను, చెప్పఁబడెడునతని, కస్యాపి=ఒకశబ్దమునకును, అవాచ్యఇతి=చెప్పఁదగినతఁడు కాఁడనియు, సర్వమహాగుణానాం=సకలసద్గుణములకును, స్థానం=స్థానమైనయతని, నిర్గుణఇతి=గుణహీనుఁడనియు; సమస్తవేదవేద్యం=సకలవేదముల చేతను తెలిసికొనఁదగినయతని, అవేద్యఇతి= తెలిసికోఁదగని యతఁడనియు; ఇహ=ఇక్కడ, ఆహుః=చెప్పిరి.

తా. ఇక్కడి అద్వైతులు ఆ సర్వేశ్వరుని సర్వజ్ఞుఁడుకాఁడనియు, ఒక శబ్దమునకైన వాచ్యుఁడు కాఁడనియు, సద్గుణుఁడును కాఁడనియు, వేదవేద్యుఁడును కాఁడనియు చెప్పెదరు.

తే. జగదధీశ్వరు సర్వజ్ఞు – సర్వవాచ్యు
నఖిలగుణ వేదవేద్యుని – నజ్ఞుఁగా న
వాచ్యు నగుణు నవేద్యుఁగా – వరుసఁ జెప్పు
చుందు రిందులవారలు – మందమతిని.

కింబహునా.—విశేషమేల ?

వృ॥ వివిధదురిత వ్రాతస్ఫీతి స్థిరవ్యసనాకులా
దతిమితమతేర్జీవాదేవాభిదాం పరమేశితుః।
అపగత పరిచ్ఛేదామోదాంబుధే రుపగచ్ఛతాన్
మశక శిశుతో భేదో నస్యాత్కుతో మదహస్తినః॥ 818

అ. వివిధ-దురిత-వ్రాత-స్ఫీత-స్థిర - వ్యసన-ఆకులాత్ =నానావిధములైన-దోషములయొక్క-సమూహములతో-పెరిగినదై-స్థిరమైన- వ్యసనములచేత-వ్యాకులమై, అతిమితమతేః=అత్యల్పబుద్ధికలదైన,జీవాదేవ=జీవునికంటెనే, అపగత పరిచ్ఛేద-ఆమోద-అంబుధేః=తొలఁగిపోయినకొలఁతలుగల - ఆనందమునకు-సముద్రమైన, పరమేశితుః=పరమేశ్వరునకు, అభిదాం=భేదములేమిని, ఉపగచ్ఛతాం=అంగీకరించెడువారైన యీయద్వైతులకు, మశకశిశుతః=పిల్లదోమకంటెను, మదహస్తినః=మదపుటేనుఁగునకు, అభేదః=భేదములేమి, కుతః=ఎందువలన, నస్యాత్ =కలుగదు?

తా. ఈయద్వైతులు సకలదోషములవలని వ్యసనములచేత జ్ఞానహీనమైయుండు జీవునితో పరమానంద సంపన్నుఁడైన పరమేశ్వరునకు భేదములేదు అనుచుండుట, పిల్లదోమతో మదపుటేనుఁగునకు భేదములేదు అనుటవలెనున్నది.

తే. స్థిరత దురిత వ్యసనము గింకెచిజ్జ్ఞమైన
చిత్తునకు స్థిరతరహర్ష – సింధువగుచు

నఖిలవిజ్ఞుఁడు నగుజగ న్నధిపుతోడి
యభిన్న దోషము కేనుఁగుతోడి న్యభిదయగును.

అపరంచ.— మఱొక్కటియు.—

వృ॥ దృశ్యంమిథ్యా దృష్టికర్తాపిమిథ్యా
దోషోమిథ్యైవేతి యా ధీ రమీషామ్ ।
సాధిష్ఠానాం శేపి కిం నేతిచింతా
సాధిష్ఠానాం పండితానా ముదేతి॥ 819

అ. దృశ్యం=కనఁదగినదియు, మిథ్యా=అబద్ధము, దృష్టికర్తాపి=కనుటను గలుగఁజేయునదియు, మిథ్యా=అబద్ధము; దోషః=దానివలనిదోషమును, మిథ్యైవ= అబద్ధమే; ఇతి=అని, అమీషాం=వీరికి, యా - ధీః=ఏది - బుద్ధియో; సా= ఆబుద్ధి, అంశేపి=దానిదాని అంశమందును, అధిష్ఠానా=ఆధారమైన, చింతా= తలంపు, నకిం=కాదా ? ఇతి=అని, సాధిష్ఠానాం=సాధించువారిలో ప్రధాను లైన, పండితానాం=పండితులకు, ఉదేతి=పుట్టుచున్నది.

తా. ఈ కనఁదగిన ప్రపంచము, ఈకనఁజేయు ఆత్మయు, ఈ విషయమై నజ్ఞానమును అబద్ధములే; అని సాధించెడి అద్వైతులకే ఈ తలంపుఁగలుగు చున్నది.

తే. దృశ్యమును లేదు, లేదు త ద్దృష్టికర్త
దోషమును లేదు, లేద న్మ న్నిష వారి
దల్ల బ్రహ్మంబునం దేల యొల్లద నెడు
ప్రశ్న కలుగదు ? సకల స త్పండితులకు.

విశ్వావసుః.—విశ్వావసువు —

గ॥ వయస్య ! మైవం మహీసురదూషణేషు విజృంభిష్ఠాః ॥ 820

వ. సఖా! ఈలాగి మహీలేఖుల దూషణ రేఖలలోఁ జెలరేఁగకు?

వృ॥ పారంపర్యాతి ఆగతో నిజకులేపంథా నహాతవ్య ఇ
త్యద్వైతంపరిగృహ్యాహంతనిజగతో మిథ్యాత్వమాచక్షతాం

ఆధ్యేతుం నియమాన శేషత ఇమేకర్మాణి నిర్మాతుమ
ప్యాస్తిక్యాచ్చతురా నికామమితరే కే తావదేతాదృశాః॥

అ. నిజకులే=తనవంశమందు, పారంపర్యతః=పరంపరతో, ఆగతః=వచ్చిన, పంథాః=మార్గము, నహాతవ్యః=విడువఁదగినది కాదు; ఇతి=అని, అద్వైతం=అద్వైతమతమును, పరిగృహ్య=చేకొని, ఇమే=వీరు, జగతః=ప్రపంచమునకు, మిథ్యాత్వం=అసత్యమును, ఆచక్షతాం=చెప్పుదురుగాక; నిగమాన్=వేదములను, అశేషతః=సర్వమును, అధ్యేతుం=అధ్యయనముచేయుటకును, కర్మాణి=క్రియలను, నికామం=మిక్కిలి, ఆస్తిక్యాత్=ఆస్తికులౌటవలన, నిర్మాతుమపి=అనుష్ఠించుటకును, చతురాః=సమర్థులు. ఇతరే=వేఱువారు, ఏతాదృశాః తావత్=ఇట్టివారైన వారు, కే=ఎవరు ?

తా. తమ వంశాచారమైన అద్వైతమార్గమును వదలక ప్రపంచముమిథ్య అనియు, జీవేశ్వరులకును భేదములేదనియు చెప్పుచున్నను; ఈ అద్వైతులు వేదాధ్యయనము చేయుచు వేదవిహితకర్మలను అనుష్ఠించుచునున్నవారు. ఇట్టివారు, మఱెవ్వరున్నారు ?

తే. పథము స్వపరంపరాగత ప్రథ మటంచు
కొంచు నయిన నద్వైతము కొంచ కాగ
మాధ్యయన మాయనుష్ఠాన మాస్తికతిన
నెఱపుదురు వీరివలె నేరు నెఱపఁగలరు?

ఇ. ఆస్తిక్యము=ఆస్తికత- ఆస్తికులమతము. ఆస్తికులు=ఆస్తిఅనువారు-పరబ్రహ్మపరలోకాదికముకలదు అనువారు, స్మార్తులు=స్మృతి సంబంధులు, వీరు శాస్త్రార్థ వేదార్థప్రతిపాదకధర్మములను దెలిపెడి మను బృహస్పత్యాది విహితకర్మ లనుష్ఠించువారగు నద్వైతులు.

అందు స్మార్తవర్ణనము.

కించ.— మఱియు.—

వృ॥ శ్రుతీ రధ్యేతారః కిమపి జపితారో మనుగణమ్

క్రతూ నాహర్తారః కిమపి దదితారః ప్రతిదినమ్ ।
అమీస్మార్తాః శ్రాద్ధాన్యపి రచయితారో విధునతే
శ్రుతే రప్రామాణ్యం ప్రసజ దననుష్ఠాపకతయా ॥ 822

ఆ. అమీ=ఈ, స్మార్తాః=స్మార్తులు, ప్రతిదినం=నిత్యమును, శ్రుతీః=వేదములను, అధ్యేతారః=అధ్యయనముచేయువారును; మనుగణం=మంత్రసమూహమును, జపితారః=జపించువారును, క్రతూన్=యజ్ఞములను, ఆహర్తారః=చేకొనువారును; కిమపి = కొంతయైన, దదితారః = దానముచేయువారును; శ్రాద్ధాని = శ్రాద్ధములను, రచయితారోపి = చేయువారునై; ప్రసజత్ = వదలుచు, అననుష్ఠాపకతయా = అనుష్ఠింపనివారవుటచేత, శ్రుతేః = వేదముయొక్క, అప్రామాణ్యం = ప్రమాణరాహిత్యమును, విధునతే = నిరసించుచున్నవారు.

తా. ఈస్మార్తులు వేదములు ప్రమాణములని వేదాధ్యయనమంత్రానుసంధాన హోమకరణ దానకరణ పిత్ర్యాదిశ్రాద్ధాచరణములు కలవారై అవిలేనివారికి వేదము లప్రమాణములు అనుటను నిరసించుచున్నవారు.

సీ. శ్రుతులు సక్రమఘన శ్రుతులుపఠింతురు
 శ్రుత్యర్థములను వి శ్రుతులునగుచు
మంత్రంబులావృత్తి మననంబు లనుపించి
 జపియింతురు మంత్రార్థ చణులునగుచు
నధ్వరమ్మును విహి తాధ్వరమ్యమొనర్తు
 రధ్వర్యులనఁగఁ బ్రదయ్యధ్వులగుచు
సత్పాత్రదానంబు సలుపుచుందురు తమ
 శక్తికొలందిఁ బ్రశస్తులగుచు
తే. స్మార్తులద్వైతులగు వీరు శ్రద్ధతోడ
 శ్రాద్ధములఁ జేయుచుందురిట్లు సరవితోడఁ
జేయలేని ప్రామాణ్యమా మ్నాయమునకు

నెట్లుగలుగును? గలుగుమే కే లెట్లు? మహికి.

కృశానుః—కృశానువు —

సమంతాదవలోక్య.—అంతటను గనుఁగొని.—

## అందుశైవవర్ణనము.

ఇ. శైవులు=శివప్రాశస్త్యమునే తెలిపెడిమతసంప్రదాయ ప్రవర్తకులు.

గ॥ నిస్తులా అప్యమీ విషయాశ్శైవప్రచురతయా నశ్లాఘామ
ర్హంతి. అత్రహి తద్బ్రహ్మపదార్థంయథానస్థిత మనభిదధానా
శ్శైవాః విదుషోపి విమోహయంతి॥ 823

వ. కలయఁగనుఁగొని యవిశేషంబులయ్యు నీవిషయంబులు కే
వల శైవప్రచురంబులై శ్లాఘార్హంబులు కానయ్యె. ఇందు
బ్రహ్మపదార్థంబునే యథాతథార్థంబుగఁ బలుకనివార లీశై
వులు కోవిదులనైనను విమోహపరిభ్రాంతులుగఁ జేయుచు
న్నారుకదా?

తథాహి—అటులేకదా.—

వృ॥ మదనజనకే వీతాతంకే మహాగుణశేవధౌ
పరమపురుషే నిత్యాసక్తాం శ్రుతిం కమలామివ ।
బత? పశుపతౌ శూలోపేతే మనోభవదాహకే
నిహితహృదయాం శైవా జల్పంత్యభాగ్యహతామివ॥ 824

ఆ. వీతాతంకే=విడిచిపోయిన ఆటంకములుకలవాఁడును, మహాగుణశేవ
ధౌ=గొప్పగుణములకు నిధియునైన, మదనజనకే=విష్ణువునందు, నిత్యాసక్తాం
=ఎప్పుడునుఆసక్తిగల, కమలామివ=లక్ష్మినివలె, శ్రుతిం=వేదమును, శూలోపే
తే=శూలరోగముచేత- శూలాయుధముచేతకూడుకొన్నవాఁడును, పశుపతౌ=
మూఢశ్రేష్ఠుఁడును- సర్వజంతుశ్రేష్ఠుఁడును, మనోభవదాహకే = మనస్సునఁ
గలిగిన కామాదులను - మన్మథుని దహించినవాఁడునైన శివునియందు, నిహి

తహృదయాం=ఉంచఁబడిన అభిప్రాయముకలదానిని, అభాగ్యహతామివ = దౌర్భాగ్యముచేత కొట్టుబడినదానిఁగా, శైవాః=శైవులు, జల్పంతి=పదరుచున్నారు, బత=అయ్యో ?

తా. ఏదోషమునులేక సద్గుణసంపన్నుఁడైన యావిష్ణువునందు సదాఆసక్తికల లక్ష్మీదేవినివలెనుండు బ్రహ్మాండమను శ్రుతిని శూలముకలిగి పశుపతియైన శివునియందే అభిప్రాయముంచి దౌర్భాగ్యమున చెడిపోయిన ఆఁడుదానినిగా శైవులు పదరుచున్నారు.

సీ. ఈతఁడు మరునకుఁ దాతయే యగు, నగు
నాతఁడా మరునకే ఘాతకుండు
ఈతఁడు భవరోగ ఘాతకుఁడగు, నగు
నాతఁడే భవుఁడు శూలాయుతుండు
ఈతఁడు సుగుణసంఘాత శేవధియగు
నగు నాతఁడపగుణాయతతనుండు
ఈతఁడు పురుషోత్తమాతతాభిఖ్యుఁడౌ
నాతఁడే పశుపతి ప్రాఖ్యుఁడౌను

తే. ఇట్టి యీహరియందు శ్రీ యట్టి శ్రుతిని
నట్టి యీహరునందభాగ్యాభిహతను
బోలెఁ బ్రేలెదరా శైవు లోలినవును
హరికి నిత్యానపాయిని హరున కవునె.

వృ॥ సూర్యాదారోగ్య మిచ్ఛేత్కమపి హుతవహాత్సం పదుల్లాస
మిచ్ఛేత్
ఈశానాజ్జ్ఞానమిచ్ఛేదనవధివిభవం మోక్షమిచ్ఛేన్ముకుందాత్
ఇత్యాద్యాస్సత్యవాచో హితమునిభణితీరాకలయ్యాపివిష్ణోః
శైవాస్సేవాంత్యజంతో బత భవహతయే భావయంతే భవం తే॥

అ. సూర్యాత్ =సూర్యునివలన, ఆరోగ్యం= రోగములేమిని, ఇచ్ఛేత్ = కోరవలసినది; హుతవహాత్ =అగ్నివలన, కమపి = కొంతైన, సంపదుల్లాసం= సంపదవలని సంతోషాతిశయమును, ఇచ్ఛేత్ = కోరవలసినది; ఈశానాత్ = శివునివలన, జ్ఞానం=జ్ఞానమును, ఇచ్ఛేత్ =కోరవలసినది; ముకుందాత్ =విష్ణువు వలన,అనవధివిభవం=మితిలేనివైభవముగల,మోక్షం=ముక్తిని,ఇచ్ఛేత్ =కోరవల సినది;ఇత్యాద్యాః=ఇదిమొదలైన,సత్యవాచః=సత్యవాక్కులైన, హితమునిభణి తీః=హితములైన వ్యాసాదిమునులవాక్కులను, ఆకలయ్యాపి= తెలిసికొనియును, తేశైవాః=ఆశైవులు, విష్ణోః=మహావిష్ణువుయొక్క, సేవాం = సేవను, త్యజంతః=విడిచినవారై, బత=అయ్యో? భవహృతయే=పాపములను పోఁగొట్టుటకై, భవం=శివుని, భావయంతే=తలంచుకొనుచున్నారు.

తా. శైవులు "ఆరోగ్యంభాస్కరాదిచ్ఛేత్" అనునట్లు సూర్యునివలన ఆరోగ్యమును, అగ్నివలన సంపదను, శివునివలన జ్ఞానమునువలె ఆమహావిష్ణువు వలన మోక్షమును కోరవలసినది. "తమేవంవిదిత్వాతిమృత్యుమేతి నాన్యఃపంథావిద్యతేఽయనాయ జ్ఞాత్వాతంమృత్యుమత్యేతి నాన్యః పంథావిముక్తయే। జ్ఞానాదేవతేకైవల్యమ్॥" అను వ్యాసాదిమహర్షివాక్యములు తెలిసియు ఆమహా విష్ణువుసేవను విడిచి సర్వదోషనివారణార్థమై అయ్యో ? ఈశివునే తలఁచుచున్నారు.

చ. సవితనరోగతంగుఱిచి కృశత్వరమగ్నిసిరింగుఱించి, యీ
శివునివిబోధముంగుఱిచి శ్రీపతిమోక్షమునుంగుఱించి, కో
రవలెనటంచు బ్రాసెడి పురాణములున్నవియట్టిశ్రీపతిన్
భవహరు వీడివేడిభవు భావనసేయుదు రీదురీహులే.

అపిచ.—మఱియు—

వృ॥ తద్విష్ణోః పరమంపదం హితమసం సారే సదాపశ్యతా
సాంద్రం సూరిగణేన నిర్మలమహానందాత్మకం శాశ్వతమ్ ।
అప్రేప్సంత ఇమే సమేత మనిశం బేతాలభూతాలిభి
ర్లోకం భీకర మంచితుం వ్యవసితా మాహేశ్వగంనశ్వరమ్॥

అ. తమసః=అజ్ఞానముయొక్క, పారే= అంతమందు, సదా=ఎప్పుడును, పశ్యతా=చూచుచున్న, సూరిగణేన=జ్ఞానిసమూహము చేత, సాంద్రం=దట్టమై, నిర్మలమహానందాత్మకం=నిర్దోషమైన మహాసంతోషమే స్వరూపముగాగలదై, శాశ్వతం = నిత్యమై, విష్ణోః = మహావిష్ణువుయొక్క, తత్ =ఆ, పరమంపదం హి=పరమపదమునుగదా, అపేక్షన్తః=కోరనివారైన, ఇమే = ఈశైవులు, బేతాలభూతాలిభిః=బేతాళములయు భూతములయు సమూహములచేత, అనిశం=ఎప్పుడును, సమేతం=కూడుకొన్నదై, భీకరం=భయంకరమై, నశ్వరం= శాశ్వతముకానిదై, మాహేశ్వరం=శివసంబంధియైన, లోకం= కైలాసప్రదేశమును, అంచితుం=పొందుటకు, వ్యవసితాః=నిశ్చయించినవారైరి.

తా. అజ్ఞానమును వదలి జ్ఞానముతోఁ గనుచున్న ఆ సనకాదిమునులతోనిండి పరమానందమయమై నిత్యమైన యాపరమపదమును గోరక ఈ శైవులు అనిత్యమై భూతభేతాళములచే భయంకరమైన యా కైలాసమును పొందుటకే కోరుచున్నారు.

తరువోజ. అదివైష్ణవనివాస ꠰ నుదియొవైకుంఠ
మిదిశైవవాసమా ꠰ నిదియొకైలాస
మదితమఃపారమా ꠰ నదెపరంధామ
మిదిపర్వతమునవు ꠰ నిదెపరుషంబు
నదిసూరిసాంద్రమా ꠰ నదెమహానంద
మిదిభూతభేతాళ ꠰ మిదెమహాభయద
మదిశాశ్వతమునవు ꠰ నదియపేక్షితమె
యిదియశాశ్వతమవు ꠰ నిదియపేక్షితమె ?

విశ్వావసుః.—విశ్వావసువు.—

గ॥ సఖే ! గుణగ్రహణ కుతూహలీ భూయాః? 827

వ. సఖా ! గుణగ్రహణమందె కుతూహలివికమ్ము?

వృ॥ నిత్యంకర్మసమాచరంతి నిగమాః శాస్త్రాణిచాధీయతే

సంతన్వంతిచ స ప్తతంతునిచయం ధిన్వంతి భక్త్యాతిథీన్
సాంబంత్ర్యంబకమర్చయంతిశుచయశ్శైవాస్సదై వాదరాత్
ఏషామీదృశకర్మణాం కతిపయే దోషా విషహ్యా నకిమ్॥ 828

అ. శుచయః=పరిశుద్ధులైన, శైవాః=శైవులు,నిత్యం=ప్రతిదినమును, కర్మ= స్నానసంధ్యాదికర్మను, సమాచరంతి=ఆచరించుచున్నారు; నిగమాన్= వేదములను,శాస్త్రాణిచ=శాస్త్రములనున్,అధీయతే=పఠించుచున్నారు; సప్తతంతు నిచయంచ=యజ్ఞసమూహమునున్, సంతన్వంతి=చేయుచున్నారు; అతిథీన్ అతిథులను, భక్త్యా=భక్తితో, ధిన్వంతి=సంతోషపఱచుచున్నారు; సాంబం= దేవీసహితుఁడైన, త్ర్యంబకం=త్రినేత్రుఁడైన శివుని,సదైవ=ఎప్పుడును, ఆదరాత్ =ప్రేమతో, అర్చయంతి=అర్చించుచున్నారు; ఈ దృశకర్మణాం=ఇట్టి సత్కర్మలుకల, ఏషాం=ఈ శైవులకు, కతిపయే=కొన్ని,దోషాః=దోషములు, విషహ్యాః=విశేషముగా సహింపఁదగినవి, నకిం=ఏలకావు ?

తా. ఈ శైవులు పరిశుద్ధులై స్నానసంధ్యాద్యాచరణములను, వేదశాస్త్రాద్యధ్యయనములును, యజ్ఞవిశేషకార్యములును, ఆతిథ్యభ్యాగత సమాదరణములును, పార్వతీసహిత మహేశ్వరార్చనలును,ఎప్పుడు నాదరముతోఁజేయుచుండఁగా, వీరియందలి యేదోషమునైన, మనము సహించుకొనఁగూడదా ?

మ. అనిశంబుంగ్రియలాచరింత్రుశ్రుతిశాస్త్రాభ్యాసముల్సేయు
దుర్,కనియభ్యాగతులంభరింత్రుక్రతువుల్గావింత్రుశైవు
ల్సదా,వినయోద్భావులుసాంబుశంభుశుచులై కొల్వన్ సమ
ర్పింత్రుగ,న్గానఁగసీవ్విరిపయింబోసంగునెవ్వాసంకగుంగొండొకం
దుండినన్.

అ. సప్తతంతువు=యజ్ఞము,ఇది సప్తపాకయజ్ఞములు, సప్తహవిర్యజ్ఞములు, సప్తసోమసంస్థలు అని వివిధములుగనుండి, 21 విధమయ్యును, ఈ విధములోను సప్తసప్తఅనియే యుండుటవలన అదియే పూర్వపదమైయున్నయది.

అన్యచ్చశ్రోతవ్యమ్.—మఱొక్కటియు వినఁదగినది.

వృ॥ స్మరహరపరిచర్యా సాంప్రతం తన్యతే యా
జనయతిహరిభక్తిం హంత? జన్మాంతరే సా।
శమితదురితవర్గం సాచ సూతేఽపవర్గమ్
కుతఇహఫలహానిః కుర్వతాం శర్వపూజామ్ ॥ 829

అ. యా=ఏది, సాంప్రతం=ఇప్పుడు, స్మరహరపరిచర్యా = శివుని విషయమైన పరిచారకత్వము, తన్యతే=చేయఁబడుచున్నదో? సా=అది, జన్మాంతరే=వేఱుజన్మములో, హరిభక్తిం=విష్ణుభక్తిని, జనయతి=పుట్టించుచున్నది. సా=ఆ హరిభక్తి, శమితదురితవర్గం=శమింపఁజేయఁబడిన దోషసమూహముగల, అపవర్గంచ=మోక్షమునుకూ, సూతే=కలిగించుచున్నది. శర్వపూజాం=ఇట్టి శివపూజను, కుర్వతాం=చేయువారికి, ఇహ=ఇక్కడ, ఫలహానిః=ప్రయోజనములేమి, కుతః=ఎక్కడిది ? హంత=అయ్యో?

తా. ఇప్పుడిప్పుడు చేయు శివపూజ వెనుక వెనుక హరిపూజను చేయఁగలుగఁ జేయుచుండును. అప్పుడా హరిపూజ వానిని నిర్దోషుఁజేసి వానికి మోక్షము నిచ్చును. కాఁబట్టి ఆ శివపూజచేయువాని కేమియు ఫలహానిలేదు.

క. హరిభక్తినిమిత్తక మీ
హరభక్తి భవాంతరంబు సేసం దఘునర్గం
బరయింపక యపవర్గం
బరయించు, నదేమిహాని సేహరపరిచర్యన్.

పరంతు.—మఱియొక్కటియు.—

వృ॥ సా రుద్రభక్తి ర్వితనోతి భద్రమ్
యా విష్ణువిద్వేషలవా సహిష్ణుః।
త ఏవ ధర్మాయ భవంతి దారాః
కదాపి యన్నాభిమృశంతి జారాః॥ 830

అ. యా=ఏ, రుద్రభక్తిః=శివభక్తి, విష్ణువిద్వేషలవాసహిష్ణుః=విష్ణుద్వేషమంచు కొంచెమైన ఓర్వనిదియో? సా=ఆ శివభక్తి, భద్రం=క్షేమమును, విత

నోతి=చేయుచున్నది. యాన్=ఎవరిని, జారాః=విటకాండ్రు, కదాపి = ఒకప్పుడైనను, నఅభిమృశంతి=అంటరో, తే=ఆ, దారాఏవ=భార్యలే, ధర్మాయ=ధర్మముకొఱకు, భవంతి=అవుచున్నారు.

తా. విటకాండ్రు అంటనిఆండ్రు ధర్మార్థమే అగుచుండునట్లు విష్ణువిషయమున ద్వేషము లేకయుండు శివభక్తి మోక్షమునుగూడ ఇచ్చును.

క. శౌరిద్వేషకశివవి
స్తారితభక్తియు విముక్తికై దమునగునె, ధరన్
దారజనాళిగుణాళియు
జారజనస్పృష్టధర్మకై చారిణియగునే.

గ॥ శేషశాయి విద్వేషఏవహి మూర్ధాభిషిక్తో దోషఃకాపురుషాణామ్ ॥ 831

వ. శేషశాయిద్వేషమే కాపురుషులకు మూర్ధాభిషేకమువలె సర్వాతిశాయిదోషము.

పశ్య—చూడుము.

వృ॥ నాస్తిక్యమావహతి నారకమాతనోతి
ప్రౌఢింనిహంతి పరిలుంపతిసంపదంచ ।
ఆయుఃక్షిణో త్యుపచినోతిసమస్తదోషాన్
ద్వేషో ముకుందవిషయో విషయోగతుల్యః ॥ 832

అ. ముకుందవిషయః=విష్ణువిషయకమైన, ద్వేషః=ద్వేషము, విషయోగతుల్యః=విషసంబంధముతో సమానమై, నాస్తిక్యం=నాస్తికత్వమును, ఆవహతి=కలిగించుచున్నది; నారకం=నరకసంబంధమును, ఆతనోతి=చేయుచున్నది, ప్రౌఢిం=సామర్థ్యమును, నిహంతి=పడఁగొట్టుచున్నది; సంపదంచ= సంపత్తిని, పరిలుంపతి=తగ్గించుచున్నది; ఆయుః=ఆయుస్సును, క్షిణోతి=క్షీణింపఁజేయుచున్నది; సమస్తదోషాన్ = సకలదోషములను, ఉపచినోతి=వృద్ధిపఱచుచున్నది.

తా. విష్ణువిషయకద్వేషము సకలదోషములనుఁ గలిగించి నాస్తికత్వము నరకమునుఁ గలిగించుటయకాక, సంపత్సామర్థ్యములను పోఁగొట్టి, ఆయుస్సునుఁ దగ్గించును.

ఆ. శౌరివిషయవైర మారయవిపరీతి
నాస్తికతనునరక మాస్థనిచ్చుఁ
బ్రాభవ్రచ్చిలచ్చి రూఢిఁబుచ్చునుబుచ్చు
నాయువును దొసంగు లన్నిదెచ్చు.

ఇ. నాస్తిక్యము=నాస్తికమతము, నాస్తికులు=పరబ్రహ్మ పరలోకాదులు అసత్యములనియు, వేదశాస్త్రపురాణాదు లప్రమాణములనియు వాదించువారు.

## అంకుపాషండవర్ణనము.

ఇ. పాషండులు=పండారాలు. వీరుకాషాయధారులును, జటాధరులును, లింగధారులునైన శైవులు.

కృశానుః—కృశానువు.—

గ॥ సత్యమేవతథాపి అవైదికకృత్తిష్వేవ ప్రయియాసతాం శివ
భక్తిమభినయతాం పాషండవిశేషాణా మేషో వేష ఏవభీషయ
తి హృదయమ్ ॥ 833

టి. అవైదికవృత్తిష్వేవ = వేదోక్తములుకాని ప్రవర్తనములందే, ప్రయియాసతాం=ప్రయాసపడఁగోరువారై,

వ. నిజమేయైనను, అవైదికములే యగువిధుల నాచరించుచు శివభక్తి నభినయించు నీ పాషండ విశేషులవేషమే హృదయ
భీషకమైయున్నయది.

తథాహి—అటులెకదా?

వృ॥ శ్రితాభవ్యమార్గా శ్చితాభస్మశుష్య
న్నిటాలా జటాలాః స్ఫుటాలాపశూన్యాః ।

స్మశానాగ్నిసఖ్యా దృశా నిర్దహంతః
పిశాచా ఇవామీ దిశాసు భ్రమంతి ॥ 834

అ. అమీ=ఈపాషండులు, శ్రిత-అభవ్య-మార్గాః= ఆశ్రయింపఁబడిన-కుశలముకాని-మార్గములుకలవారై, చితా-భస్మ-ఉద్యత్-నిటాలాః= స్మశానమందలి-బసుమముచేత-శోభించుచున్న-నొసటిభాగముగలవారై, జటాలాః=జడలుకలవారై, స్ఫుట-ఆలాప-శూన్యాః= స్పష్టమైన - మాటలచేత-శూన్యులై, స్మశాన-అగ్ని-సఖ్యా=స్మశానమందలి-అగ్నితో-చెలిమిగల, దృశా=చూపుచేత, నిర్దహంతః=దహించుచుండువారై, పిశాచా ఇవ=పిశాచములవలె, దిశాసు=దిక్కుదిక్కున, భ్రమంతి=తిరుగులాడుచున్నారు.

తా. ఈపాషండులు మంచిమార్గములు విడిచి మంచిమాటలునులేక, నొసట భస్మమును. తలను జడలునువేసికొని, నిప్పువంటికంటితోదహించునట్లుగా పిశాచములవలె పలుదిక్కులఁ దిరుగులాడుచున్నారు.

తే. అశుభమార్గు లనర్గళ శ్రీ భసితఫాలు
రస్ఫుటాలాపులు జటాలుకరలపిశాచ
తులితులై స్మశానకృశాను శ్రీ తులితదృశల
దిశలనేప్చుచుఁదిరిగెదర్దివిరి వీరు.

గ॥ కించ, ఏషా మతిజుగుప్సితారీతిః ॥

వ. మఱియు, వీరి రీతి అతి జుగుప్సితమె యైయున్నయది.

వృ॥ పక్షీకృత్య గిరీశం
సిద్ధ్యా రహితాశ్చ మానహీనాశ్చ।
ఇచ్ఛంత్యధిగంతు మిమే
ధనంజయం లింగదర్శనే నైవ॥ 835

అ. మానహీనాశ్చ=మానములేనివారును,సిద్ధ్యా=ఫలసిద్ధిచేత, రహితాశ్చ= శూన్యులునైన, ఇమే=ఈపాషండులు, గిరీశం=పర్వతశ్రేష్ఠమును - పరమేశ్వరుని, పక్షీకృత్య=పక్షముగాఁజేసికొని, మనసులో, లింగదర్శనే

నైవ=శివలింగముయొక్క దర్శనమాత్రముననే, ధనంజయం=ధనమును, జయమునుగా=అగ్నిదేవుని, అధిగంతుం=మించుటకు, ఇచ్ఛంతి=కోరుచున్నారు.

తా. ఈపాషండులు మానములేక ఫలసిద్ధియులేక (కొండలోపొగనుజూచి అగ్నియున్నదని, అనుమానపడునట్లు) లింగదర్శనమమాత్రముచేతనే కొండను పక్షముగాఁ జేసికొనునట్లు పరమేశ్వరుని తనపక్షముచేసికొని, ధనంజయములను వలె అగ్నిదేవునిఁ మీఱుటకైయే కోరుచున్నారు.

తే. సిద్ధి మానము లేక పక్షీకరించి
యాగిరీశు, నీపాషండు కేలా ధనంజ
యుంగనంగోరుదురు కుతర్కాన్యు లగుచు
లింగదర్శనమాత్రనకె లైంగు లగుట.

అన్యేచాత్ర—ఇతురులు నిట.

వృ॥ దీర్ఘవక్రనఖరాః ఖరకల్పా
ఉద్ధరంత ఇవ బాహుయుగంతే
శౌచమాచరితు మప్యసమర్థా
నీచబుద్ధిహృదయం భ్రమయుంతి॥ 836

అ. దీర్ఘవక్రనఖరాః= నిడివైవంకరలైన గోళ్లుకలవారై, ఖరకల్పాః=గాడిదెలతో సమానులై, బాహుయుగం=రెండుబాహువులనుఁ, ఉద్ధరంతః=పైకెత్తికొన్నవారై, తే=అపాషండులు, శౌచం=శౌచమును, ఆచరితుమపి=చేయుటకుఁగూడ, అసమర్థాః=చేతఁగానివారై, నీచబుద్ధిహృదయం=అల్పబుద్ధులమనస్సును, భ్రమయంతీవ=భ్రమింపఁజేయుచున్నారువలె నున్నారు.

తా. ఈ పాషండులు గోర్లుపెంచుకొని గాడిదలవలె చేతులు పైకెత్తుకొనియుండియు, తాము శౌచమైనఁ జేయనివారై నీచులను భ్రమింపఁజేయుచున్నారు.

తే. గాడిదలవలె నిడుద వంకరలుగోర్లు
గేలఁ గ్రాలను గలిగి భుజాలనెత్తి

నెత్తినిడుకొని యడలింతు రిరుత్తప్రజల
శౌచమున కేనిచాలని నీచు లిచట.

విశ్వావసుః — విశ్వావసువు.

గ॥ విమృశ్య, సఖే! గుణగ్రాహిణా నై తే విదూషణీయాః ॥ 837

వ. విమర్శించి, సఖా! గుణగ్రాహియైన వానికి వీరు దూషణీయులు కారు.

వృ॥ శీతోష్ణజృంభణసహేషు జితేంద్రియేషు
కష్టోపవాస పరిశుష్కకళేబరేషు ।
పుణ్యస్థలాటన పరాకృత కిల్బిషేషు
జానీహి కానపిగుణాన్ జటిలేష్వమీషు ॥ 838

అ. జితేంద్రియేషు=ఇంద్రియజయముకలవారై, శీతోష్ణజృంభణసహేషు=చలివేఁడుల విజృంభణమును సహించువారై, కష్టోపవాస పరిశుష్కకళేబరేషు = కష్టములైన ఉపవాసముల చేత వాడిపోయిన శరీరములు కలవారై, పుణ్యస్థలాటనపరాకృతకిల్బిషేషు = పుణ్యస్థలములలో సంచరించుట చేత తొలఁగఁద్రోయఁబడిన దోషములు కలవారైన, అమీషు = ఈ, జటిలేషు=వతిసతుల యందు, కానపి గుణాన్=కొన్ని గుణములనైనను, జానీహి=తెలిసికొనుమ?

తా. జితేంద్రియులై చలివేఁడుల నోర్చుకొని, ఉపవాసాదులచేఁ జిక్కి పుణ్యస్థల సంచారముచేత సర్వదోషములు తొలఁగిపోయిన యీ పాషండుల లోకొన్ని మంచి గుణాలున్నవి తెలిసికొమ్మా?

క. వితతోష్ణ శీతవాతము
క్షితి సహియించియును నుపవసించియుఁ బుణ్య
క్షితులఁజరింతు రకృతదు
ష్కృతులగు నీజటిలుగం దొకగిన్గను? గుణముల్.

## జ్యౌతిషిక వర్ణనము.

ఇ. జ్యౌతిషికులు=జ్యోతిష సంప్రదాయవేత్తలు, వీరు=తిథి వార నక్షత్ర యోగకరణము లనెడి పంచాంగములతోను,రాశి లగ్న గ్రహ చారభుక్త్యపభుక్తులతోను, శుభాశుభకర్మముహూర్త జాతకాదులను నిర్ణయించి తత్తత్కాల సుఖదుఃఖానుభవములను దెలుపువారు.

గ॥ ఇత్యాలో వీక్ష్య సాశంకమ్ కఇమే పుస్తకహస్తాః కల్యపవ్యుత్థాయ తతఇతః పర్యటంతి॥ 839

వ. అని మఱొక్కప్రక్కఁగాంచి సందేహించి ఎవరు వీరు పుస్తకహస్తులై వేకువనె లేచి యిటనటను బర్యటనము చేయుచున్నవారు.

కృశానుః—కృశానువు.

గ॥ నిపుణ మవలోక్య సపరిహాసమ్॥

వ. నిపుణంబుగ నిరీక్షించి పరిహాస సహితంబుగ.

వృ॥ జ్యోతిశ్శాస్త్ర మహోదధౌ బహుతరో త్సర్గాపవాదాత్మభిః
కల్లోలైర్నిబిడే కణాన్కతిపయాన్ లబ్ధ్వా కృతార్థాఇవ
దీర్ఘాయుస్సుతసంపదాదికథనై ర్దైవజ్ఞపాశా ఇమే
గేహంగేహ మనుప్రవిశ్యధనినాం మోహంముహుఃకుర్వతే॥

అ. బహుతర - ఉత్సర్గ - అపవాద - ఆత్మభిః=అనేకవిధములైన - సామాన్యమును - విశేషమును - స్వరూపములుగాఁగల, కల్లోలైః=అలలచేత, నిబిడే=దట్టమైన, జోతిశ్శాస్త్రమహోదధౌ= జ్యోతిశ్శాస్త్రమనెడి మహాసముద్రమందు, కతిపయాన్=కొన్ని, కణాన్=అణువులను, లబ్ధ్వా=లభించి, కృతార్థా ఇవ=కృతార్థులువలె, ఇమే=ఈ, దైవజ్ఞపాశాః=అధమజ్యౌతిషికులు, గేహంగేహం=ప్రతియింటను, అనుప్రవిశ్య=ప్రవేశించి, దీర్ఘాయుస్సుత సంపదాదికథనైః=దీర్ఘాయుస్సు సుతులు సంపదలు మొదలైనవానివాక్యములతో,

ధనినాం=ధనవంతులకు, మోహం=భ్రాంతిని, ముహుః=పలుమారు, కుర్వతే=చేయుచున్నారు.

తా. అలలవలె సామాన్యజ్యోతిషము విశేషజ్యోతిషము అను భేదములు గలిగి, సముద్రమువలెనుండు ఈ జ్యోతిశ్శాస్త్రమందు కొన్ని బిందువులను మాత్రము చదివి మేము కృతార్థులమైతిమి. అనుచు, ధనవంతుల యింటింటను జేరి, మీకు దీర్ఘాయువుకలుగును, కుమారులు కలుగుదురు, సంపదకలుగును అని చెప్పుచు, వారివారిని భ్రమింపఁ జేయుచుందురు.

శా. జ్యోతిశ్శాస్త్రమహాపయోధి నపవాదోత్సర్గముల్భంగసం
ఘాతంబుల్బలెఘూర్జిలంగఁగదియంగాఁబోయియందుత్తముల్
పాథోబిందులు కొన్నికొన్నికొనితత్పారంగతుల్తారెగా
జాతాయుర్ముఖవృత్తముల్పలుకుదుర్భాగాదులందెల్పుచున్.

టీ. జాతాయుర్ముఖవృత్తములు= జన్మించినవానికాయుస్సు మొదలైనవాని వృత్తాంతములు, భాగాదులన్ = మేషాదిరాసులను.

కించ—మఱియు.

వృ॥ విలిఖతి సదసద్వా జన్మపత్రం జనానామ్
ఫలతియది తదానీం దర్శయత్యాత్మదాక్ష్యమ్ ।
నఫలతియది లగ్నద్రష్టురేవైష దోషో
హరతిధన మిహైవం హంత? దైవజ్ఞపాశః ॥ 841

అ. దైవజ్ఞపాశః=జ్యోతిషికాధముఁడు, జనానాం=జనులకు, జన్మపత్రం=జాతకము, సత్ - అసత్ వా = యథార్థమో - అయథార్థమో, విలిఖతి=వ్రాయుచున్నాఁడు. ఫలతియది=అది ఫలించుచున్నదేని, తదానీం=అప్పుడు, ఆత్మదాక్ష్యం=తనసామర్థ్యమును, దర్శయతి= చూపుచున్నాఁడు. నఫలతియది= ఫలింపకున్నదేని, లగ్నద్రష్టురేవ=లగ్నము అడుగువానికే, ఏషదోషః=ఈదోషము. ఏవం=ఇట్లు అని, ఇహ=ఇక్కడ, ధనం=ధనమును, హరతి=ఆక్రమించుకొనుచున్నాఁడు. హంత=అయ్యో?

తా. ఈ అధమజ్యోతిషికుఁడు జనులకు వ్రాసినజాతకము ఫలించినయెడల తనసామర్థ్యమును తెలుపును; ఫలింపనియెడల, లగ్నము అడుగువాని మాటలవలనిదోషము; అని యిట్లుచెప్పి, వానివానివలన ధనము నార్జించుకొనుచుండును.

తే. జననపత్రంబుబాగోగొ జనులకొఱకు
వ్రాసి ఫలియింపఁ దమనేర్పె ప్రకటపఱతు
రదియుఫలియింపదేని లగ్నమడుగుదోష
మనుచు రధమదైవజ్ఞులా ధనముకొఱకె.

అపిచ—మఱియు.

వృ॥ ప్రమోదః ఖేదో వాఽప్యుపనమతి పుంసో విధివశాత్
మయేదం ప్రాగేవాభిహితమితి మిథ్యాకథయతి ।
జనా నిష్టానిష్టాకలన పరిహారైకనియతాన్
అసౌ మేషాదీనాం పరిగణనయైవ భ్రమయతి॥ 842

అ. పుంసః=పురుషునికి, ప్రమోదో వా=సంతోషమైనను, ఖేదో వా = దుఃఖమైనను; విధివశాత్=కర్మవశమున, ఉపనమతి = ప్రాప్తించుచున్నది. ఇదం=ఇది, మయా = నాచేత, ప్రాగేవ = ముందే, అభిహితం=చెప్పఁబడినది; ఇతి=అని, మిథ్యా=అబద్ధము, కథయతి=చెప్పుచున్నది. ఇష్టానిష్టాకలన పరిహారైకనియతాన్ =ఇష్టమును కలిగించుకొనుటకును అనిష్టమును పరిహరించుకొనుటకును ముఖ్యముగా నియమింపఁబడినట్టి, జనాన్ =జనులను, అసౌ = ఈ దైవజ్ఞాధముఁడు, మేషాదీనాం= మేషాదిరాసులయొక్క, పరిగణనయైవ= లెక్కించుటచేతనే, భ్రమయతి = భ్రమింపఁజేయుచున్నాఁడు.

తా. మనుష్యునకు తనతన విధివశముగా సంతోషముగాని, దుఃఖముగాని కలుగుచున్నది. నేను ముందే చెప్పినది అని అబద్ధము చెప్పుచున్నాఁడు. ఇష్టమందో అనిష్టమందో నియమింపఁబడిన యీ జనులను గూర్చి ఈ యధమదైవజ్ఞుఁడు మేషాదిరాసులను లెక్కపెట్టి భ్రమియింపఁజేయుచున్నాఁడు.

తే. వెనుక ఖేదంబొమోదంబొ విధివశాన

నైన మున్నేన చెప్పిన కైదైనదని య
నిష్టమిష్టమొ విడఁజేయ కొనెసఁగుజనులు
మేషవృషభాదిగణనమైనట్టి కెమెయిమరల్చు.

గ॥ అస్తు వా తథ్యవాదీ దైవజ్ఞ స్తథాపివృథా తద్వచశ్శ్రవణమ్॥

వ. యథార్థవాదియగు దైవజ్ఞుఁడుండిన నుండునుగాని, వాని వచ
నమ్ము వినుట వమ్మెయగుట.

తథాహి—అటులెకదా?

వృ॥ అసుఖ మథసుఖంవా కర్మణాం పక్తివేలా
స్వహహ! నియతమేతే భుంజతే దేహభాజః ।
తదిహ పురత ఏవ బ్రూహి మౌహూర్తికశ్చేత్
కథయ! ఫలమమీషా మంతతఃకింతతస్స్యాత్ ॥ 844

ఆ. ఏతే=ఈ, దేహభాజః=దేహధారులు, కర్మణాం=తమకర్మములయొక్క
పక్తివేలాసు=పరిపాక కాలములలో, అసుఖం=కష్టముగాని, అథవా=లేకుంటే,
సుఖంవా=సుఖముగాని, నియతం=నియమింపఁబడినట్టుగా, భుంజతే=అనుభవిం
చుచున్నారు, మౌహూర్తికః=జ్యోతిషికుఁడు, తత్=ఆ సుఖమొదుఃఖమొ,
ఇహ=ఇక్కడ, పురతఏవ=ముందే, బ్రూహిచేత్=చెప్పెనేని? అమీషాం=వీరి
కి, అంతతః=దగ్గరఁగాని, తతః= అవతలఁగాని, కింఫలం=ఏమిఫలము, స్యాత్
అగును. కథయ=చెప్పుమ?

తా. దేహధారులు తమపూర్వజన్మ సుకృతదుష్కృతము లాయాకాలము
లలో అనుభవింతురు అని, యీజ్యోతిష్కుఁడు ముందే చెప్పియుండినను; ఓ వి
శ్వావసూ! నీవు యీదేహధారులయొక్క ముందటి వెనుకటి ఫలములను దెలి
యఁజేయుమా ?

తే. సుఖమొ యసుఖమొ కర్మవిశేషముతముగాఁగ
ననుభవింతురు దేహులు లోకట్లనుదినంబు

దాని మునుమున్న దైవజ్ఞు ౕ లూని తెలుపు
దాన ఫలమేమి? కర్మయే ౕ దానఁదప్పు.

విశ్వావసు—విశ్వావసువు

గ॥ ఐహికాముష్మికా రంభోపయోగినో నోపాలంభ మర్హంతి జ్యోతిర్విదః॥ 845

శృణుతావత్—వినుము.

వృ॥ నదైవం నపిత్ర్యంచ కర్మాత్రసిద్ధ్యే
న్నయత్రాస్తిదేశే నను జ్యోతిషజ్ఞః।
నతారా నచారా నవానాంగ్రహాణాం
నతిథ్యాదయోవా యఁతోత్రైషబుద్ధః॥ 846

అ. నను=ఓకృశానూ? యత్ర=ఎక్కడ, దేశే=దేశమందు, యతః=ఎందువలన, ఏషః=ఈ, బుద్ధః=జ్ఞానవంతుఁడైన, జ్యోతిషజ్ఞః=జ్యోతిషికుఁడు, నాస్తి=లేఁడో; అత్ర=అక్కడ, దైవంకర్మ=యజ్ఞాదికర్మయు, నసిద్ధ్యేత్=సిద్ధింపదు. పిత్ర్యంకర్మ=పితృకర్మయు,నసిద్ధ్యేత్=సిద్ధింపదు. నతారాః= నిత్యనక్షత్రములును సిద్ధింపవు. నవానాంగ్రహాణాం=నవగ్రహములయొక్క, నచారాః=సంచారములును సిద్ధింపవు. తిథ్యాదయఃవా=తిథివారాదులైనను, అత్ర=ఇక్కడ, నసిద్ధ్యేయుః=సిద్ధింపవు.

తా. ఏదేశమునఁగాని జ్ఞానవంతుఁడైన జ్యోతిష్కుఁడు లేనియెడల, అక్కడ దైవకర్మ పితృకర్మాదులును, తిథివార నక్షత్రాదులును, నవగ్రహచారములును తెలియునట్లు సిద్ధింపవు.

తే. దైవకర్మ పైతృకకర్మ ౕ తారవార
కరణయోగతిథిగ్రహ ౕ కార్యగతులు
మొదలుగాఁగలయవి యెట్లు ౕ మొనయుమనకు
నందునందును జ్యోతిషు ౕ లందకున్న.

గ॥ యచ్చ సమర్థితం మహాహూర్తికవచశ్శ్రవణం ముధేతి తన్నిపుణనిరూపణా న పణాయంతి॥ 847

వ. జ్యోతిష్కుల మాటవినుట వ్యర్థమని సమర్థించినది నిపుణ నిరూపణమేమైనను అదిపండెంబునకుఁ బాత్రంబెకాదు.

యతః—ఏలంటేని.

వృ॥ భానోశ్శీతకరస్యవాపి భుజగగ్రాసే పురోనిశ్చితే
తీర్థానామటనం జనస్యఘటయేత్తాపత్రయోచ్చాటనమ్।
ఇష్టేప్రాగవధారితే సతిధృతే స్తుష్టేశ్చ లాభోభవేత్
కష్టేచవ్యసనేఽత్రతత్పరిహృతిః కర్తుంజపాద్యైఃక్షమా॥ 848

అ. భానోర్వా=సూర్యునికిఁగాని, శీతకరస్యవాపి=చంద్రునికిఁగాని, భుజగగ్రాసే=సర్పరూపమైన రాహువుగ్రహణము, పురః=ముందు, నిశ్చితేసతి=నిశ్చయింపఁబడుచుండఁగా, తాపత్రయోచ్చాటనం = తాపత్రయమును పోఁగొట్టునట్టి, తీర్థానాం అటనం=పుణ్యతీర్థ సంచారము, జనస్య=మనుష్యునికి, ఘటయేత్=ఘటింపఁజేయును. ఇష్టే=ఇష్టము, ప్రాక్=ముందు, అవధారితేసతి=తెలుపఁబడుచుండఁగా, ధృతేః=ధైర్యమునకును, తుష్టేశ్చ=సంతోషమునకును, లాభః=లాభము, భవేత్=అగును. కష్టే=కష్టమైన, వ్యసనేచ=వ్యసనమును, అవధారితేసతి=తెలుపఁబడుచుండఁగా, అత్ర=ఇక్కడ, తత్ పరిహృతిః=ఆకష్ట పరిహారము, జపాద్యైః=జపము మొదలైనవానిచేత, కర్తుం=చేయుటకు, క్షమా=సమర్థమైనది, భవేత్=అగును.

తా. సూర్యచంద్ర గ్రహణములపుడు గంగానదితీర్థస్నానముచేసి తాపత్రయములు పోఁగొట్టుకొనవలెనని చెప్పఁగా, ఇష్టమైన సంతోషమనుభవించుచు అనిష్టమైనయెడల దానిఁబోఁగొట్టుకొనుటకై జపాదులు జఱుపవలెనని నిర్ణయించిరి.

తే. సూర్యచంద్రులగ్రహణంబు కే సూచితంబె
యైనఁదాపాపహృత్తీర్థ కే నూడఁగలుగు

నిష్టమర ఝింపధైర్యసంక్ తుష్టులొందుఁ
గష్టమురియింప జపియింపఁ క్ గలుగనలయు.

టీ. తాపత్రయము=ఆధ్యాత్మిక, ఆధిభౌతిక; ఆధిదైవికములు.

ఇ. సూర్యచంద్రగ్రహణములు—ఇవి ఆపాలసముద్రమున దేవతలకై తఱచి న యమృతమును ఆమహావిష్ణువు దేవతలకుపంచిపెట్టునపుడు రాహువనెడు సర్ప స్వరూప రాక్షసగ్రహము దేవతలదగ్గఱ దాఁగియుండి ఆపంచిన యమృతమును మ్రింగినతోడనే సూర్యచంద్రులవలనఁ దెలిసికొని, అప్పుడె ఆమహావిష్ణువు తన చేతిలోని గండెతో వానికంఠము తెగనఱికివేయఁగా, శిరము కేతువై శరీరము రాహువై తన్నుఁదెలిసినందున ఆ సూర్యచంద్రులమీఁది పగవిడువక కలకాల ము తమకు అనుకూలించినపుడెల్ల ఆసూర్యుని ఆకేతువును, ఆచంద్రుని రాహువు పట్టి తమకు వల్లపడినంతవఱకు పూర్ణ అర్ధపాద త్రిపాద భాగములలో ఒక్కొ కభాగముగనె మ్రింగియు సమాళించుకొను శక్తిలేక గ్రక్కివేయుచుందురు. ఇవియే రాహుకేతుగ్రహగ్రస్త చంద్రసూర్యగ్రహ గ్రహణములు. (ఇది కథా రూపములె.)

మఱియాచంద్రమండల కళాకిరణములు పౌర్ణమాస్యమావాస్యలయందు ఎక్కువతక్కువ యగుచుండుట ఆ సూర్యమండలకిరణములు అడ్డువడుటవలనను ఈ సూర్యచంద్రమండల గ్రహణములు భూమండలచ్ఛాయాచ్ఛాదితములగుట వలనను గలుగుచుండును. (అనుటయె వాస్తవము.)

ఇందుకు ముఖ్యకారణములు. గ్రహనక్షత్రభూర్భువరాది సర్వమండలము లును చక్రాకారముగ సర్వదా తిరుగుచుండుటయే.

గ॥ అవిస్రంభశ్చదైవజ్ఞ వచనేషు అనుపపన్నః॥ 849

వ. ఆదైవజ్ఞులమాటయందువిశ్వాసము లేకపోవుటకూడఁగూడదు.

వృ॥ పుష్టిర్హ్రాసౌ కుముద సుహృదః పుష్పవంతోపరాగౌ
శుక్రాదీనా ముదయవిలయౌ విత్యమీ సర్వదృష్టాః ।

ఆవిష్కుర్వంత్యఖిలవచనే ష్వత్ర కుంభీపులాక
న్యాయా జ్జ్యోతిర్నయగతివిదాం నిశ్చలం మానభావమ్॥850

అ. కుముదసుహృదః=చంద్రునియొక్క, పుష్టిహ్రాసౌ= వృద్ధి క్షయములును, పుష్పవంతోపరాగౌ=సూర్యచంద్ర గ్రహణములును, శుక్రాదీనాం=శుక్రాది గ్రహములయొక్క, ఉదయవిలయౌ=ఉదయాస్తమయములును, ఇతీయమీ=అనియివి, సర్వదృష్టాః=సకల జనులకును గనఁబడినవియే; అత్ర=ఇక్కడ కుంభీపులాకన్యాయాత్=(ఉడికిన) కుండలోని అన్నకణమునువలె, జ్యోతిర్నయగతివిదాం=జ్యోతిశ్శాస్త్రమార్గవేత్తలయొక్క, అఖిలవచనేషు=అన్నిమాటలలో, నిశ్చలం=నిస్సంశయమైన, మానభావం=ప్రామాణ్యమును, ఆవిష్కుర్వంతి=కలుగఁజేయుచున్నారు.

తా. చంద్రునివృద్ధి క్షయములు, సూర్యచంద్ర గ్రహణములు, శుక్రాది గ్రహముల ఉదయాస్తమయములు అన్నియు అందఱికి తెలిసినవియే యైనను, అన్నము ఉడికినకుండలోని పైయన్నకణమును మాత్రము కనిపెట్టి అంతయు ఉడికినది అని కనిపెట్టునట్లు ఈ జ్యోతిష్కులు చెప్పెడిమాటలలో నిస్సంశయమైన ప్రమాణవచనము మాత్రమునె అంగీకరింపరా ? ఏమి ?

తే. గ్రహణములుఁ జంద్రువృద్ధియు క్షయము నుఱియు
శుక్రు నుదయమ స్తమయముఁ జూచువార
లోపి జ్యోస్యులమాట స్థాలీపులాక
న్యాయముననైన నెవ్వారు నమ్మలేరు.

ఇ. చంద్రవృద్ధిక్షయములు-చంద్రుఁడు=అమృతాంశువు=అమృతకిరణుఁడు, కనుక ఇతనికి అమృతమయములైన కిరణములు=కళలు పదియాఱుకలవు. ఇట్టి షోడశకళాపరిపూర్ణుఁడైన చంద్రుఁడు పాల సముద్రమున అమృతమథనమపుడు అమృతకలశ, కామధేను, కల్పతరు, కౌస్తుభ, చింతామణి, కమలాదేవుల తోఁగూడ ఆవిర్భవించి ఆ మహావిష్ణువుచేత ఆ యమృతము దేవతలకు పంచిపెట్టి ఆ దేవతలు జరామరణాదులు లేక అమరులుగాఁ జేయఁబడియును, అశ్వి

న్యాదులలో రోహిణీమాత్ర ప్రియుఁడని దక్షప్రజాపతి శాపమువలన తన కళ లలో ఒక్కొక్కటి తగ్గిపోయెడి కళలు ఆ మహావిష్ణువు నను జ్ఞచేత దేవతలకే ఆహారమగుచునుండియు, ఆదినుండి సూర్యునితోఁగూడ తాను శ్రీమన్నారాయణుని నేత్రద్వయమై యుండినందున ఆ నారాయణ సంకల్పముచేత నే యథాప్రకారము షోడశకళా పరిపూర్ణుఁడగుచునుండును. అందువలన నే యీ చంద్రునకు పూర్ణమాసియందు వృద్ధియు,అమావాస్యయందు క్షయమును ఒక్కొక్కకళలో కనఁబడుచుండును.

గ॥ ఇత్థం కిల నీతివిదోవిదుః॥

వ. నీతివిదు లీవిధమున వివరింతురు.

వృ॥ విదైవజ్ఞం గ్రామం విబుధ విధురాం భూపతిసభాం
ముఖం శ్రుత్యాహీనం మనుజపతి శూన్యంచ విషయమ్।
అనాచారాన్ దారా నపహరికథం కావ్యమపిచ
ప్రవక్తృత్వాపేతం గురుమపి సుబుద్ధిః పరిహరేత్ ॥ 851

అ. విదైవజ్ఞం= జ్యోతిష్కుఁడులేని, గ్రామం=గ్రామమును; విబుధ విధురాం= పండితులచేత హీనమైన, భూపతిసభాం= రాజసభను, శ్రుత్యా= వేదవచనముచేత,హీనం=శూన్యమైన,ముఖం=బ్రాహ్మణముఖమును,మనుజపతి శూన్యం= రాజుచే హీనమైన, విషయంచ= దేశమును; అనాచారాన్ =మంచినడవడిలేని, దారాన్ = భార్యలను, అపహరికథం = హరికథలేని, కావ్యమపిచ=గ్రంథమును, ప్రవక్తృత్వ అపేతం=వాచాలత్వముచేత విడిచిపోయిన, గురుమపి = గురువునైనను, సుబుద్ధిః=మంచి జ్ఞానవంతుఁడు, పరిహరేత్ =విడిచిపెట్టును.

తా. మంచి జ్ఞానముకలవాఁడు జ్యోతిష్కుడులేని గ్రామమునుగాని, పండితులులేని రాజసభనుగాని, ఒక వేదవచనమైన లేని బ్రాహ్మణవాక్కునుగాని, రాజులేని దేశమునుగాని, మంచి నడవడిలేని పెండ్లమునుగాని, హరికథలేని గ్రంథమునుగాని, ఉపదేశాదివాగ్మిత్వములేని ఆచార్యునిగాని విడిచిపెట్టును.

ఉ. దైవవిదుండులేనిపురి ధర్మవిదుండును లేనిగోష్ఠియున్

భావరసంబులేని నుడి కే భాగ్యపరుండును లేని దేశమున్
మేవడిలేనిభార్య హరికే మేకొని వాకొన లేనికావ్యమున్
వావిరివ క్తగాని గురుకే వర్యుఁడు నేల వివేకశాలికిన్.

టీ. భావనులు. మేవడి=అణఁకువ, వావిరి=వరుసగా.

## భిషగ్వర్ణనము.

ఇ. భిషజులు=వైద్యులు. వీరు ఓషధీవిశేషములచేతను, రసగంధ పాషాణాదులచేతను, వాతపిత్తశైత్యములవలన గలుగు రోగములను నివారించుకొఱకై కషాయచూర్ణలేహ్యాదులుచేసి రోగులకిచ్చి పథ్యములతో ఆరోగ్యము కలుగఁజేయువారు.

కృశానుః—కృశానువు.

గ॥ అస్త్వేవమ్. ఇత్యన్యతో వీక్ష్య సోపహాసమ్ ॥ 852

వ. అటులుండిన నుండుఁగాక, అని మఱొక్కప్రక్క నవలోకించి యపహసించి యనియె.

వృ॥ మిథ్యౌషధైర్హంత ! మృషాకషాయై
రసహ్యలేహ్యై రయథార్థతైలైః ।
వైద్యాఇమే వంచితరుగ్ణవర్గైః
పిచండభాండం పరిపూరయంతి ॥ 835

అ. ఇమే=ఈ, వైద్యాః=వైద్యులు, మిథ్యా - ఔషధైః=అబద్ధపుమందులచేతను, మృషాకషాయైః=అబద్ధపుఁ గషాయములచేతను, అసహ్యలేహ్యైః=సహింపలేనిలేహ్యములచేతను,అయథార్థతైలైః=అబద్ధపుతైలములచేతను, హంత=అయ్యో ? వంచితరుగ్ణవర్గైః=వంచన చేయఁబడిన వ్యాధిగ్రస్తులసమూహము గలవారై, పిచండభాండం=కడుపనెడికుండను, పరిపూరయంతి=నిండించుకొనుచున్నారు.

తా. ఈవైద్యులు సరికానిమందులు కషాయములు లేహ్యములు తైలములు నిచ్చి వ్యాధిగ్రస్తులను వంచించి కుండనువలె పొట్టను నిండించుకొనుచున్నారు.

ఆ. వట్టియౌషధంబు ♦ వట్టి కషాయంబు
వట్టిలేహ్యమును మ ♦ ఱట్టితైల
మిచ్చిరోగి మోస ♦ పుచ్చి వెజ్జులువీరు
పొట్టపోసికొంద్రు ♦ కట్టకడకు.

కించ—మఱియు.

వృ॥ న ధాతోర్విజ్ఞానం నచ పరిచయో వైద్యకనయే
న రోగాణాం తత్త్వావగతిరపి నో వస్తుగుణధీః ।
తథాప్యేతే వైద్యా ఇతి తరలయంతో జడజనాన్
అసూన్ భృత్యా మృత్యోరివ వసు హరంతే గదజుషామ్ ॥

అ. వైద్యకనయే=వైద్యశాస్త్రమందు, పరిచయః=అభ్యాసము, న=లేదు. ధాతోః = నాడియొక్క, విజ్ఞానంచ = విశేషజ్ఞానమును, న=లేదు. రోగాణాం - వ్యాధులయొక్క, తత్త్వ - అవగతిః = యథార్థతను - తెలిసికొనుటయును, న=లేదు. వస్తుగుణధీః అపి=ఔషధవస్తువులయందు బుద్ధియును, న=లేదు. తథాపి=అట్లైనను, ఏతే=వీరు, వైద్యాఇతి=వైద్యులమని, జడజనాన్=మందమనుష్యులను, తరలయంతః=భ్రమింపఁజేయువారై, మృత్యోః =మృత్యుదేవతయొక్క, భృత్యాఇవ=బంటులవలె, గదజుషాం = రోగమనుభవించువారియొక్క, అసూన్=ప్రాణములను, ధనంచ=ద్రవ్యమునున్, హరంతే=హరించుచున్నారు.

తా. ఈ వైద్యులకు వైద్యశాస్త్రపఠనమును, వాతపిత్తశ్లేష్మాది నాడీజ్ఞానమును, జ్వరమేహాది యథార్థజ్ఞానమును, ఔషధగుణజ్ఞానమును లేకున్నను; మేమే వైద్యులమని అజ్ఞులైనరోగులను భ్రమియింపఁజేయుచు, తాము మృత్యుదేవత భృత్యులవలె రోగులప్రాణమునున్ ధనమునున్ హరించుచున్నారు.

తే. వైద్యమును ధాతువును వ్యాధి ♦ వగయుమఱి ప
దార్థగుణమును నేమియు ♦ నరయఁబడదె?

ద్యైన, నీవైద్యులారోగి ¶ యసువుపసువు
నీడ్చుకొనుచుండ్రు మృత్యువు ¶ భృత్యులట్లు.

అపిచ—మఱియు.

శ్లో॥ కషాయై రుపవాసైశ్చ నృణా ముల్లాఘుతాం కృతామ్ ।
నిజౌషధకృతాం వైద్యో నివేద్య హరతే ధనమ్ ॥ 855

అ. కషాయైః=కషాయముల చేతను, ఉపవాసైః=లంకణముల చేతను, కృతాం=చేయఁబడిన, ఉల్లాఘుతాం= తేలికను, వైద్యః=వైద్యుఁడు, నృణాం=మనుష్యులకు, నిజౌషధకృతాం=తనయౌషధముచేత చేయఁబడినదిగా, నివేద్య=తెలిపి, ధనం=ద్రవ్యమును, హరతే=హరించుచున్నాఁడు.

తా. త్రికటు త్రిఫలాది కషాయముల చేఁగాని లంకణాల చేఁగాని కలిగిన ఆరోగ్యమును ఈ వైద్యుఁడు తనమందుచేతనే కలిగినది అని ధనమును ఆయారోగులవలనఁ జేకొనుచున్నాఁడు.

క. త్రికటుత్రిఫలంబులవా
రక వేయుకషాయములను ¶ లంఘనములనుఁగా
లగు వేయఁగ్నునం దన వై
ద్యకమున నేయనును వైద్యుఁ ¶ డర్థముగొననే.

టి. త్రికటువులు= సొంటి, పిప్పలి, మిరియాలు; త్రిఫలములు= చరక, తాటి, ఉసరిక కాయలు.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ వయస్య ! విశ్వోపకారిషు వైద్యేష్వవద్యాని న కలయేథాః॥
వ, వయస్యా ! విశ్వోపకారకులగు నీవైద్యులయం దవద్యములు
కల్పింపకుము ?

పశ్య?—చూడు?

వృ॥ మస్తే దుస్తరవేదనాకబలితే మగ్నే స్వరేఽంతర్గళమ్
తప్తాయాం జ్వరపావకే వపతనా తాం తే స్పృహీక్షణజే

దూనే బంధుజనే కృతప్రలపనే ధైర్యం విధాతుంపునః
కశ్శక్తః కలితామయప్రశమనాద్వైద్యాత్పరోవిద్యతే॥857

అ. మస్తే=శిరస్సు, దుస్తరవేదనాకబళితేసతి= దాటఁగూడని తొందరచేత మ్రింగఁబడినది యగుచుండఁగాను, అంతర్గళం=గొంతులోపల, స్వరే=స్వరము, మగ్నేసతి=అణఁగినది అగుచుండగాను,తనౌచ=శరీరమందు, జ్వరపావకేన=జ్వరమనెడి యగ్నిచేత, తప్తాయాం సత్యాం=తపింపఁబడుచుండఁగాను, హృషీకవ్రజే=ఇంద్రియములసమూహము, తాంతేసతి=తగ్గినది అగుచుండఁగాను, దూనే=కృశించిపోయిన, బంధుజనే=చుట్టములసమూహము, కృతప్రలపనేసతి=చేయఁబడిన ప్రలాపములుకలది అగుచుండఁగాను, పునః=మఱల, ధైర్యం=ధైర్యమును, విధాతుం,= కలుగఁజేయుటకై, కలిత ఆమయ ప్రశమనాత్=చేరినవ్యాధులయొక్క పంశాంతికలిగినట్టి, వైద్యాత్ = వైద్యునికంటె, పరః=మఱియొకఁడు, కః=ఎవఁడు, శక్తః=శక్తికలవాఁడుగా, విద్యతే=కనఁబడుచున్నాఁడు?

తా. తలనొప్పియు, గొంతునొప్పియు, ఒడలు జ్వరముకప్పియు, కన్నులు మొదలైన యింద్రియములణఁగియు తల్లిదండ్రులు మొదలైనవారేడ్చుటయును గలిగియుండఁగా, ఆరోగియొక్క రోగముల పరిశాంతికై ఈ వైద్యుడుగాక, మఱెవఁడు శక్తికలవాఁడు ?

సీ. తలవేదనకునోర్వఁ ॥ దలముకాకయ కాఁక
వలననున్నను జల్వ ॥ వలననున్నఁ
గుత్తికపట్టి డగ్గుత్తిక గట్టినఁ
బలుకొక్కటైనను ॥ బలుకకున్న
నొడలెంతొ చలివేఁకి ॥ నడలింత కనిపింపఁ
బడకనైనఁబరుండఁ ॥ బడకయున్నఁ
గనవిననైనమూ ॥ ర్కొననైనలేకయు
నింద్రియములు బల ॥ మెనయకున్న

తే. నాలుబిడ్డలు తలిదండ్రు ♦ లన్నదమ్ము
లొక్క మొగిఁ జేరి పలవింప ♦ నొద్దఁ జేరి
ధైర్యమును జెప్పనప్పు డా ♦ ధైర్యశాలి
వైద్యుఁడొక్కఁడె తక్కఁగ ♦ వలఁతియెవఁడు.

వృ॥ నాబోధి వైద్యకకలామయ మాచు యేషు
ప్రాప్తేషు యోభిషగితి ప్రథిత స్తమేవ
ఆకారయత్యఖిలఏవ విశేషదర్శీ
లోకోఽపి తేన భిషగేవ న దూషణీయః ॥ 858

అ. అయం=ఈవైద్యుఁడు, వైద్యకకలాం = వైద్యశాస్త్రమునుగూర్చి, నాబోధి=తెలిసికొనఁబడదు; విశేషదర్శీ=విశేషము తెలిసినట్టి, అఖిలఏల=సకలమైన, లోకోపి=జనులును, ఆమయేషు=విధిశాస్త్రములు, ప్రాప్తేషు=ప్రాప్తించుచుండఁగా, యః=ఎవఁడు, భిషక్ ఇతి = వైద్యుఁడుఅని, ప్రథితః=ప్రసిద్ధపడుచున్నాఁడో, తమేవ=వానినే, ఆకారయతి=పిలుచుచున్నారు; తేన=దానిచేత, భిషక్=వైద్యుఁడు, నదూషణీయఏవ=దూషింపఁదగినవాఁడే కాఁడు.

తా. వైద్యుఁడు వైద్యశాస్త్రముమాత్రమైన చదువకయు, లోకులు వైద్యవిషయమున విశేషము తెలిసియు, ఎవఁడు వైద్యుఁడని ప్రసిద్ధపడిన వాఁడో వాఁడే పిలువఁబడుచుండును; అట్టివైద్యుఁడే గౌరవింపఁబడుచుండును.

తే. లోకులొక వైద్యవిద్యయు ♦ లేకయున్న
వైద్యు లనుపేరి ప్రఖ్యాతి ♦ వేద్యులున్నఁ
బిలిచికొనుచుందు రందుచే ♦ భిషజులెపుడు
దూఱఁదగు వారు కారేల? ♦ దూఱవీరి.

గ॥ కష్టమహో౽కృతోపకారేష్వగదంకారేషు కృతఘ్నఏవ నిర్వేదో లోకః॥ 859

వ. అయ్యో ? కృతోపకారులగు నగదంకారులయెడలను నీ లో కులు కృతఘ్ను లేయగుచు వివేకవిహీనులగుచున్నవారు.

గ॥ ఇత్థంహికవయః కథయంతి॥

వ. కవులు నివ్విధమున నవ్విషయమున నే కథకు లగుచున్నారు కదా ?

వృ॥ నిర్వృత్తాధ్వరకృత్య ఋత్విజ, ముత్తీర్ణాపగో నావికమ్
యుద్ధాంతే సుభటంచ సిద్ధవిజయో వోఢార, మాప్తస్థలః
వ్యర్థంవారవధూజనంచకువిటో నిర్విష్టతద్యౌవనో,
ధ్వస్తాతంకచయశ్చికిత్సకమపి ద్వేష్టి ప్రదేయార్థినమ్॥ 860

అ. నిర్వృత్తాధ్వరకృత్యః = నెఱవేర్చుకొన్న యజ్ఞకార్యముకలవాఁడు, ఋత్విజం=యాజ్ఞికునిన్ ; ఉత్తీర్ణాపగః= దాఁటిన నదికలవాఁడు, నావికం= ఓడవానిని ; యుద్ధాంతే=యుద్ధముకడపట, సిద్ధవిజయః = సిద్ధించినవిజయ ముకలవాఁడు, వోఢారం=వాహనమైన, సుభటం=చెంది, కువిటః=కుత్సితమైన విటుఁడు,నిర్విష్టతద్యౌవనః = నెఱవేర్చుకొన్నయాదాని యౌవనముకలవాఁడై, వ్యర్థం = వ్యర్థముగా, ఆప్తస్థలః=ప్రియమైన స్థలముకలవాఁడైన, వారవధూ జనంచ=వేశ్యాస్త్రీజనులను, ధ్వస్తాతంకచయః = తొలఁగఁ గొట్టఁబడినవై ఆటంకములైన రోగముల సమూహముకలవాఁడు, చికిత్సకమపి = వైద్యునిన్ గూడ; అథ=ఆవెనుక, ప్రదేయార్థినం = ఇయ్యఁదగినదానినిఁ గోరువానినిఁగా, ద్వేష్టి=ద్వేషించుచున్నాఁడు.

తా. యజ్ఞకార్యములు నెఱవేర్చుకొన్నవాఁడు తా నీయవలసిన ధనమును గోరెడి యాజ్ఞికునిఁగాని, ఏటిని దాఁటించఁగా దాఁటి వాఁడు తా నీయవలసిన దాని నడుగఁగా నాయోడవానినిఁగాని, యుద్ధములో తనకు జయముకలిగియు తనకు సహాయుఁడుగానుండిన మహాభటుఁడు వానికీయవలసినదాని నడుగఁగా వానినిగాని, మోసికొనిపోయి విడిచినవాఁడు ఆకూలి నడుగఁగా నెక్కిపోయిన వాఁ డాకూలివానినిగాని, భోగముదాని నెల్లకాల మనుభవించి అది ముసలి

దైన వెనుక దానివిటకాఁడు అడిగినదానినీయక దానినేగాని, రోగములు మానిచి వైద్యుఁ డడిగినదాని నీయక ఆరోగి ఆవైద్యునిఁగాని వెనుక వెనుక ద్వేషించు వాఁడే మహాదోషి యగువాఁడు.

సీ. క్రతువులు చేయించి * కృతకృత్యుఁడై తోడ
        నల ఋత్విజునితోడ * నలుగువాఁడు
    ప్రవహించునీటిని * బ్రవహణంబున దాఁటి
        దాఁటించువానితోఁ * దగులువాఁడు
    యుద్ధముచేయించి * యిద్ధజయంబంది
        యందించిన భటునె * యలఁచువాఁడు
    నెత్తినబరువును * నెత్తించుకొనిపోయి
        యిలుచేరి కూలినే * యెగుచువాఁడు
తే. వయ సనుభవించి వేశ్యను * వదలువాఁడు
    లేని నెపమూని పనివాని * కీనివాఁడు
    నడుగ నర్థి నిరర్థుఁగ * నడుపువాఁడు
    వ్యాధి తీర్చియు వైద్యుని * వదలువాఁడు.

కృశానుః—కృశానుఁడు.—

గ॥ ఇతి విమానమగ్రతశ్చాలయన్నగ్రతోఽవలోక్య సోపాలం
    భమ్ ॥ 861

వ. అని విమాన మానయించుకొని తనయెదుర నిరీక్షించి యు
    పాలంభ సహితంబుగ.

గ॥ సఖేఽత్రపశ్య? కవీనా మేషాం శాస్త్ర విప్రతిషిద్ధాం చర్యామ్॥

వ. సఖా! ఇటఁజూడు మీ కవులచర్యలు శాస్త్రప్రతిషిద్ధములై
    యున్నయవి.

## కవివర్ణనము.

ఇ. కవులు=కవనశక్తికలవారు. వీరు గణయతిప్రాసములతో ఛందోభంగములేక పద్యాదులు రచించువారు.

వృ॥ శ్రీనాథస్తవనానురూపకవనాం వాణీంమనోహారిణీమ్
కష్టంహా ? కవయఃకదర్థకుటిల క్ష్మాపాలసాత్కుర్వతే ।
దూరోపాహృతసార సైంధవపయో దేవాభిషేకోచితమ్
సంసేకే వినియుంజతే సుమతయశ్శాకాలవాలస్యకిమ్ ॥ 863

అ. కవయః=కవులు, శ్రీనాథస్తవనానురూపకవనాం = విష్ణుస్తోత్రమునకు తగుమైనకవిత్వముకలదై, మనోహారిణీం = మనోహరమైన, వాణీం=వాక్కును, కదర్థకుటిలక్ష్మాపాలసాత్కుర్వతే=క్షుద్రులై కుటిలురైనరాజుల కధీనము చేయుచున్నారు. హాకష్టం=ఆహాకష్టము ? సుమతయః= బుద్ధిమంతులు, దేవాభిషేకోచితం = శ్రీరామనాథస్వామియొక్క అభిషేకమునకు తగినదై, దూరోపాహృతసారసైంధవపయః=దూరమునుండి తేఁబడిన దేవనదీసంబంధమైననీటిని, శాకాలవాలస్య=కూరగాయలపాతియొక్క, సంసేకే=తడుపుటయందు, వినియుంజతేకిం=ఉపయోగపఱచుచున్నారా ? ఏమి ?

తా. ఈకవులు శ్రియఃపతిస్తోత్రములకు తగిన తమకవిత్వము నీచరాజులపాలిటఁ బడవేయుచున్నారు. ఇట్లుచేయుట సేతుబంధముదగ్గర రామేశ్వరమునందలి రామనాథస్వామియభిషేకమునకై ఇన్నాళ్లు మున్నాటామడలనుండి తెచ్చిన గంగాజలమును కూరగాయలపాతులకుఁ బోయునట్లున్నది.

ఉ. శౌరి నుతింపనింపయిన సత్కవనంబు నృపాలపాశముల్
సారెకుఁ దాఁక వాకొనఁగ సాఁగిరి లోఁగుచు వ్యర్థులీకవుల్
సీరిరహి రామనాథు నభిషేకము కోసముగాఁగ నీరముల్
దూరమునుండి తెచ్చినవికేతోఁగఁగఁ జేయరె? శాకసేకముల్.

ఇ. రామేశ్వరము—రాముఁడు ఈశ్వరునితోడఁగూడ ప్రతిష్ఠింపఁబడినస్థలము. ఇది దక్షిణమున మధురజిల్లాలో తూర్పున సముద్రతీరమునొద్ద రామ

నాధపురమునకును, దర్భశయనమునకును మధ్యమార్గమునబోవ సముద్రమధ్యమునసుండునది. ఈ యది శ్రీరాములు వానరులతోడఁగూడి లంకాప్రవేశమునకై సముద్రమున సేతువుకట్టించిపోయి, రావణుని సంహారముచేసి మఱలవచ్చునప్పుడు ఆ సేతువువెంబడి తనకులాచార మాచరించుట తనకు ధర్మమని ఆప్రకారము ఈశ్వరుని పూజచేయుటకై యేర్పఱచిన స్థలవిశేషము అని కొందఱు శైవులు చెప్పెదరు.

కించ — మఱియు.

శ్లో॥ స్తువద్భవ నివర్తకే సతిహరౌ కవిస్సూక్తిభిః
కరోతివరవర్ణినీచరితవర్ణనం గర్హితమ్ ।
అనీతి రవనీపతిర్గృహశునీతనుంమౌక్తికై
ర్విభూషయతి దేవతాముకుట భాగయోగ్యైర్యథా॥ 864

అ. యథా=ఎట్లు, అనీతిః=నీతిలేని, అవనీపతిః=రాజు, దేవతామకుటభాగయోగ్యైః=దేవతలకిరీటభాగములకు తగినవియైన, మౌక్తికైః=ముత్తెములచేత, గృహశునీతనుం=ఇంటికుక్క యొంటిని, విభూషయతి=అలంకరించుచున్నాఁడో (అట్లు) కవిః=కవియగువాఁడు, స్తువత్ భవ నివర్తకే = స్తోత్రముచేయువారియొక్క దోషములను నివారించునట్టిదైన, హరౌసతి = శ్రీహరియుండఁగా; సూక్తిభిః=తనసూక్తులచేత, గర్హితం=నిందింపఁబడినదైన, వరవర్ణినీచరితవర్ణనం=మేలైన స్త్రీయొక్క నడుమడివర్ణనమును, కరోతి=చేయుచున్నాఁడు.

తా. పెద్దల యాచారములేనివాఁడు దేవతలకిరీటములకు తగిన ముత్యాలు తెచ్చి కుక్కకు సింగారించినట్లు ఈకవి సకలదోషపరిహారకుఁడైన శ్రీహరిని వర్ణించుట విడిచి, సామాన్యనింద్యమైన స్త్రీ సంభోగాదిచరితము వర్ణించుచున్నాఁడు.

మ. భవహారిన్ హరినీడి వేశినవితన్ భావింపఁగాఁ దద్భవ ప్రా
ద్భవనేవర్ణవ సేయుదుర్కవులు ప్రోత్యద్యత్సూక్తులన్, వేడ్క భూ

ధవుల్గూ గేహాళుల్గూ మనంబలర ముక్తాపంక్తుల్గూ దేవతా
చినహార్వాంబులమూలమూలఁ జొచ్చెనకన్వేషించిభూషించరే.

టీ. తద్భవోద్భవనే = దానిదోషములలో పుట్టువుకలదానినే, అన్వే
షించి=వెదికి.

విశ్వావసుః — విశ్వావసువు.

గ॥ అంతరధ్వాంతిహారయః కవయ స్త్వయా నాధక్షేప్యాః ॥ 865

వ. అంతరధ్వాంతహారులు కవులు నీచే ధిక్కరింపఁదగినవారు కారు.

వృ॥ కామం వాచఃకతిచి దఫలాస్సంతు లోకే కవీనామ్
సంత్యేవాన్యా మధురిపుకథాసం స్తవాః కామదోగ్ధ్ర్యః।
విత్తంకామంభవతువిఫలం దత్త మశ్రోత్రియేభ్యః
పాత్రేదత్తైర్భవతహి ధనై ర్ధన్యతా భూరిదాతుః॥ 866

అ. కవీనాం = కవులయొక్క, కతిచిత్ = కొన్ని, వాచః = వాక్కులు, లోకే=లోకములో, కామం=బహుగా, అఫలాః = నిష్ఫలములుగా, సంతు= అగునుగాక? అన్యాః=మఱికొన్ని, మధురిపుకథాసం స్తవాః=శ్రీహరికథలను స్తోత్రముచేయునవియై, కామదోగ్ధ్ర్యః=కోరికలనుపిండునవి, సంత్యేవ=అగునేగాక? అశ్రోత్రియేభ్యః=అవైదికులకు, దత్తం=ఈయఁబడిన, విత్తం=ధనము, భూరిదాతుః=మహాదాతకు, కామం=బహుగా, విఫలం = నిష్ఫలము, భవతు=అగునుగాక? పాత్రే=యోగ్యవిషయమున; దత్తైః = ఈయఁబడిన, ధనైః=ద్రవ్యములచేత, భూరిదాతుః=ఆ మహాదాతకు, ధన్యతా=కృతార్థము భవతిహి=అగుచున్నదికదా?

తా. కవులవాక్కులు కొన్నినిష్ఫలములై కొన్ని భగవద్విషయములై తమకోరికలు నిచ్చును; ఎంతదాతయైనను పాత్రదానముచేయని ధనము వ్యర్థమై, సత్పాత్రదానముచేసిన ధనము ఎవనికేగాని తనకు ధన్యతనిచ్చునుకదా?

మ: కవివాక్యంబులు కన్నయన్నులపయింకెగల్పించి వ్యర్థంబులై
నవియుర్గూ మెండుగనుండుఁగాని, హరిపైకెహర్షించి కల్పించిన

ట్టివికొన్నైననుసార్థములివ్వినమెయఁవ్వెన్నున్నఁ బ్రాతాన్యమం
దుపదాన్యత్వములొక్కచాత్రిమునయంఁదుంజెందవేధన్యతన్.

వృ॥ కల్యాణంభగవత్కథాగ్రథనతః కావ్యం విధాతుఃకవేః
తస్యైవాంగతయాక్వచిద్రచయతి శృంగారవీరాదికమ్
కోదోషోభవితా యదత్ర కవితాశీలైస్సమాశ్రీయతే
పంథా వ్యాసవసుంధరాశ్రుతిభవ గ్రంథాదిషు ప్రేక్షితః॥

అ. భగవత్కథాగ్రథనతః=భగవద్విషయికకథలను జెప్పుటచేత, కల్యాణం=శుభకరమైన, కావ్యం=కావ్యమును, విధాతుః = చేయునట్టియితఁడును, తస్యైవ=ఆకావ్యమునకే, అంగతయా=అంగమగుటచేత, క్వచిత్=ఒకానొకచోట, శృంగారవీరాదికం=శృంగారవీరాది నవరసములను, రచయతః=రచించునట్టి యతఁడునైన, కవేః=కవికి, కోదోషః=ఏమిదోషము, భవితా=కలుగఁగలదు? యత్=ఎందువలన, అత్ర=ఇక్కడ, కవితాశీలైః=కవనమేస్వభావముగాఁగలవారిచేత, వ్యాసవసుంధరాశ్రుతిభవగ్రంథాదిషు = వ్యాసులయొక్కయు-వల్మీకసంభవుఁడైన వాల్మీకియొక్కయు - గ్రంథాదులందు, ప్రేక్షితః=చూడఁబడినదో? తత్=అందువలన, పంథాః=ఆమార్గము, సమాశ్రీయతే=అంగీకరింపఁబడుచున్నది.

తా. భగవత్కథలకావ్యములలో అంగమైయుండుటవలన శృంగారాదిరసములను రచియించుటవలన దోషమేమి? వ్యాసవాల్మీకాదులుకూడ భారతరామాయణాదులందును అట్టిరసవర్ణనము అంగీకరింపఁబడుచున్నదా లేదా?

మ. మంగళకారి కావ్యము సఁమంచితభక్తిరసంబు కూర్చి కా
వ్యాంగమునొట నన్యరసఁ మారసి కూర్తురు కావ్యకర్త లీ
యంగున,వ్యాసముఖ్యకవుఁలాద్యులుసైతమునాత్మకార్యముల్
రంగలరంగఁ గూర్చి రసఁరాసులు కుప్పిరి చూడవేడుకై.

ఇ. వ్యాసమహర్షి. 709 శ్లోకమున చెప్పఁబడియున్నది.

ఇ. వాల్మీకి=వసుంధరాప్రసూతి- భవుఁడు = భూమిచెవిని - వల్మీకమున-పుట్టి వర్షముగురిసి వెలివడివచ్చినట్టియతఁడు, ఇతఁడు పుట్టలో తపస్సు చేయుచుండఁగా, బ్రహ్మాజ్ఞ చేత నారదమహర్షి వచ్చి ఆ పుట్టపైనుండి రామనామోపదేశము చేసినందున అదిమొదలుకొని ఆ రామనామజపముచేత నే రామావతారమునకు మును పే మహావిష్ణ్వనుగ్రహముచేత భవిష్యత్కథను ఛందోబద్ధముగా రామాయణరూపమున మొట్టమొదట కవనమును సృష్టిచేసిన యతఁడు.

కృశానుః—కృశానుఁడు.

శ్లో॥ నర స్తుతివిధాతారో న న స్తుత ఇమేబుధైః ।
శ్లాఘనీయాఇతి కవీన్ శాస్త్రాధ్వన్యో వినిందతి ॥ 868

అ. నర స్తుతివిధాతారః = నరులస్తోత్రము చేయువారైన, ఇమే= ఈకవులు వస్తుతః= వాస్తవముగ, బుధైః=జ్ఞానుల చేత, శ్లాఘనీయాః=శ్లాఘింపఁదగినవారు, న=కారు. ఇతి=అని, కవీన్=కవులను, శాస్త్రాధ్వన్యః=శాస్త్రమార్గప్రవర్తకుఁడు, వినిందతి=నిందించుచున్నాఁడు.

తా. నర స్తుతిచేయు కవులను జ్ఞానులుశ్లాఘించరు. అని శాస్త్రమార్గానుసారియైన యతఁడాకవులను నిందించుచుండును.

క. నరనుతి సేసెడివానిని
నరమతి క్షితి శ్లాఘసేయ రే వాంఛింపఁ డునార్
వరకవి యయినన్ శాస్త్రా
ధ్వగతుండయి శ్లాఘసేయు రే వాఁ డే? వానిన్.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ ధన చపల సకలపురుషసాధారణ మిదందూషణ మవివేకిభిః
కవిష్వేవ కేవల మాధీయతే. 869

వ. ధనచాపల్యము గల పురుషసాకల్యమునకు సాధారణమైన

యీదూషణము కేవలము నవివేకులు కవులయందె కల్పిం చెదరు.

యతః—ఏలంటే.

వృ॥ పద్యైర్హృద్యతమైః స్తువంతి కవయః ప్రాయేణపృథ్వీపతీన్
అన్యేతాన్ స్తువతేవచోభి రచమత్కారైరసారైరపి
పద్యారంభణశక్త్యశక్తి విహితోభేదః కవీనాంభవ
త్యన్యేషాంచ పరం నరస్తుతికృతో దోషస్తు సార్వత్రికః॥870

అ. హృద్యతమైః=అతిమనోహరములైన, పద్యైః=పద్యములతో, కవయః=కవులు, పృథ్వీపతీన్=రాజులను, ప్రాయేణ=బహుగా, స్తువంతి=స్తుతించుచున్నారు; అన్యేఽపి=ఇతరులును, అచమత్కారైః=చమత్కారికానివై, అసారైః=నిస్సారములైన, వచోభిః=వాక్కులచేత, తాన్=ఆరాజులను, స్తువతే=స్తుతించుచున్నారు; పద్యారంభణశక్త్యశక్తివిహితః= పద్యములారంభించుటయందలి సామర్థ్యాసామర్థ్యములందు ఏర్పఱుపఁబడిన, భేదః=భేదము, కవీనాం=కవులకు, భవతి=అవుచున్నది; అన్యేషాంచ=ఇతరులకును, పరం=మిక్కిలి, నరస్తుతికృతః=నరస్తుతివలనచేయఁబడిన, దోషస్తు=దోషమైతేనో, సార్వత్రికః=సర్వత్రసాధారణమైనది.

తా. సత్కవులు చమత్కారిపద్యములతోఁగాని, అసత్కవులు అచమత్కారిపద్యములతోఁగాని నరస్తుతి చేయుచుందురుగాని; కవనమందు సామర్థ్యాసామర్థ్యము లాకవులయందే యుండినను; ఇతరులయందు ఆ నరస్తుతిదోషమొక్కటియే సర్వసాధారణమైయుండునని.

తే. కవులు రాజుల రాజిలఁ గొగడనుతింతు
పరులు వారలగాఱుల బహునుతింత్రు
పద్యకృతి శక్తిని నశక్తి సుద్యమించు
భిదను గుణదోషములయందుఁ బెద్దలెవరు?

గ॥ క్షణమాలోక్యసాదరమ్ ॥

వ. క్షణమాలోకించి సమాదరసహితంబుగ.

వృ॥ ప్రాచేతస వ్యాస పరాశ రాద్యాః
ప్రాంచః కవీంద్రా జగదంచితా స్తే
గోష్ఠీ నవీనాపి మహాకవీనామ్
పూజ్యా గుణజ్ఞై ర్భువనోపకర్త్రీ ॥ 871

అ. ప్రాచేతస-వ్యాస-పరాశర - ఆద్యాః=వాల్మీకి-వ్యాసులు - పరాశరులు - మొదలైన, తే=ఆ, ప్రాంచః=ప్రాచీనులైన, కవీంద్రాః = కవీశ్వరులు, జగత్ - అంచితాః=లోకులచేత - పూజింపఁబడినవాఁడు. మహాకవీనాం=మహాకవులయొక్క, గోష్ఠీ=సభ, నవీనా౽పి=క్రొత్తదైనను; భువన - ఉపకర్త్రీ =లోకమునకు - ఉపకారిణియై, గుణజ్ఞైః=గుణజ్ఞులచేత, పూజ్యా=పూజింపఁదగినది.

తా. వాల్మీకి వ్యాసపరాశరాది మహర్షులు పూర్వులు లోకపూజ్యులైన కవీశ్వరులు. ఆధునిక కవులును లోకపూజ్యులే యైనవారు.

తే. వ్యాసవాల్మీకులాద్యులౌ ప్రాక్కవీంద్రు
లెల్లఁబూజ్యులె చుఱి యాట్టు లితరకవులు
సుగుణసంగ్రాహ్యులకు గ్రాహ్యు లగుచునుండ్రు
భువనమున కుపకారులుఁ బూజ్యులగుట.

ఇ. వ్యాసవాల్మీకులు 82 వ పుటలో.

ఇ. పరాశరమహర్షి =వసిష్ఠమహర్షి మనుమఁడు, శక్తిమహర్షి కొమారుఁడు, వ్యాసమహర్షి తండ్రి, శుకమహర్షి తాత; ఇతఁడు యమునానదిదాఁటుటకై పడవలో పోవునపుడు ఆ దాశరాజుకూఁతురైన సత్యవతికి యోజన గంధిత్వము నిచ్చి చీఁకటికల్పించి సద్యోగర్భమున ఆమెవలననే తనకు వ్యాసమహర్షి పుత్రుఁడయ్యెను.

ఇ. ప్రాచేతసుఁడు=వాల్మీకి - ప్రచేతస్సనెడి వరుణదేవునివలన వర్షింపఁబడి పుట్టలోనుండి లేచివచ్చినమహర్షి.

తథాహి—అటులేకదా ?

వృ॥ మాఘశ్చోరోమయూరోమురరిపు రపరోభారవిస్సారవిద్యః
శ్రీహర్షః కాళిదాసఃకవి రథ భవభూత్యాహ్వయోభోజరాజః
శ్రీదండీ డిండిమాఖ్యశ్శ్రుతిమకుటగురు ర్భల్లటోభట్టబాణః
ఖ్యాతాశ్చాన్యేసుబంధ్వాదయఇహకృతిభిర్విశ్వమాహ్లాదయంతి॥

దం. మాఘుఁడు, బిల్హణుఁడు, మయూరుఁడు, మఱొకఁడు మురారి, సారవిద్యావంతుండైన భారవి, శ్రీహర్షుఁడు, కాళిదాసకవి, వెనుక, భవభూతిఅను పేరుగలవాఁడును, భోజరాజును, దండియు, డిండిముఁడను పేరుగలవాఁడును, వేదాంతగురువును, భల్లటుఁడును, భట్టబాణుఁడును, ఇతరులైన సుబంధ్వాదులును ప్రసిద్ధులై ఇక్కడ కావ్యములచేత ప్రపంచమును సంతోషపఱచుచున్న సంస్కృతకవులు.

ఇ. మాఘకవి-శిశుపాలవధకావ్యకర్త, పదలాలిత్యార్థ గౌరవములతోడి కవనకర్త.

చోరకవి=బిల్హణుఁడు- చౌరపంచాశికా కావ్యకర్త, యామినీ పూర్ణతిలక విద్యాగురువు.

మయూరకవి=తానంధుఁడైయుండి సూర్యునిమీఁద శతకముచెప్పి కన్నులుఁబడసిన యతఁడు.

మురారికవి=అనర్ఘరాఘవీయ నాటకకర్త.

భారవికవి=కిరాతార్జునీయ కావ్యకర్త.

శ్రీహర్షకవి=నైషధర్మ ములు రచియించి నతఁడు.

కాళిదాసకవి = రఘువంశాదికావ్యములను, శాకుంతలాదినాటకములను రచియించినకవి.

భవభూతికవి=మాలతీ మాధవీయనాటకకర్త.

భోజరాజకవి=ఇతఁడు ధారాపురమున రాజుగానుండి సరస్వతీ కంఠాభరణము రచించి, కాళిదాసాదికవులను తనసభలో శ్లాఘించుకొంచు నున్నతఁడు.

దండికవి=కావ్యాదర్శమునకును దశకుమార చరిత్రమునకునుకర్త.

వేదాంతాచార్యకవి=రంగనాథ పాదుకాసహస్ర, హయగ్రీవ స్తోత్రాది గ్రంథకర్త.

భట్టబాణకవి=కాదంబరీవచన కావ్యకర్త.

సుబంధుకవి=వాసవదత్త అను వచనకావ్యమునకుకర్త.

సీ. చెలఁగె మాఘుఁడనంగ శిశుపాలవధ చెప్పి
చౌరపంచాశిక చోరుఁడనఁగ
నర్యమశతకంబు నంధమయూరుండ
నర్ఘరాఘవముఁ మురారియనఁగ
రహిభారవియనంగ రాతార్జునీయముఁ
శ్రీహర్షుఁడనఁగఁ దశచ్ఛేపధర్మ
మాకాళిదాసుండు నారఘువంశాది
భవభూతిమాలతీ మాధవమును
ప్రభు భోజరాజు సరస్వతీ కంఠాభ
రణము కావ్యాదర్శమును నెదండి
వేదాంతమార్గముఁ వేదాంత దేశికు
లట్టికాదంబరిఁ భట్టబాణుఁ
తే. డల్ల వాసవదత్తాదు లెల్లకృతులు
నల సుబంధ్వాదులనఁ గవు లతిసమర్థు
లొనర నొనరించి లోకులం దనరఁజేసి
రిందు నిందనుకఁ సుకీర్తిందు లగుచు.

పరంతు—మఱియు.

వృ॥ సంపన్నిర్మదభావయో రనఘయోస్సాహిత్య పాండిత్యయోః
సామర్థ్యాన్య జనోపకారకతయోస్సామ్రాజ్యదాక్షిణ్యయోః

ఔదార్యప్రియవాదయోశ్చకథయం త్యాచార్యవిజ్ఞానయోః
సామానాధికరణ్యమేవవిబుధో త్తంసప్రశంసాస్పదమ్ ॥ 873

అ. అనఘయోః=నిర్దోషములైన, సంపత్ నిర్మదభావయోః=సంపదకును అహంకారరాహిత్యమునకును, సాహిత్యపాండిత్యయోః=భాషాజ్ఞానమునకును విద్వత్త్వమునకును, సామర్థ్యాన్యజనోపకారకతయోః=సమర్థతకును ఇతరుల కుపకారముచేయుటకును, సామ్రాజ్యదాక్షిణ్యయోః=చక్రవర్తిత్వమునకును దాక్షిణ్యమునకును, ఔదార్యప్రియవాదయోః = దాతృత్వమునకును ప్రియముగా పలించుటకును, ఆచార్యవిజ్ఞానయోశ్చ = ఆచార్యులకును విశేషజ్ఞానులకును, విబుధోత్తంసప్రశంసాస్పదం = పండితశ్రేష్ఠుల పొగడికలకు ఆధారమైన, సామాన్యాధికరణ్యమేవ=సమానస్థానమగుట నే, కథయంతి=చెప్పుచున్నారు.

తా. సంపదతో గర్వములేకుండుటయును, భాషాజ్ఞానముతో పాండిత్యమును, అన్నిట సమర్థత్వముతో అన్యుల కుపకారముచేయుటయును, తనకున్న చక్రవర్తిత్వముతో పరులయందు దాక్షిణ్యమును, తనకున్న దాతృత్వముతో పరులయందు ప్రియముపలుకుటయును, తనకున్న ఆచార్యత్వముతో తనకు విశేషజ్ఞానమును సమానగుణములు అని చెప్పుచుందురు.

సీ. మదమిచ్చుసిరిని నిర్మదతతో సాహిత్య
మాత్రిముఖ పాండిత్య మహిమతోడ
సామర్థ్యమును నన్యజనతోపకృతితోడఁ
బ్రభుతనుదాక్షిణ్య పరతతోడ
నౌదార్యమునుబ్రియ వాదముతోడను
నాచార్యతను జ్ఞాతృ తాస్థతోడఁ
గవసధోరణిని లా క్షణికతతోడను
వినతి మహోన్నతి విధముతోడఁ
తే. జేర్చిసహవాససంస్థితి కూర్చివానిఁ
దనరఁజేసెడిచాతురి యనఘులైన

యలఘులకుఁగాక తనయందె కీ యందగలఁగఁ
జేసికొననేరికయిన నీకీ వాసికలదె ?

ఇదంచావధేయం—ఇదియుఁ దెలియునదియ.

వృ॥ప్రణతచరణరేణు విష్ణుచిత్తౌ
శఠమథన సరసా మునిస్సభూతః ।
మధురకవి రితోఽపరేచ ధన్యాః
కతి నపునంతి జగంతి సూక్తిపూరైః ॥ 874

అ. (ప్రణతచరణరేణువిష్ణుచిత్తౌ=భక్తాంఘ్రిరేణులును విష్ణుచిత్తులును, శఠమథనసరసౌ=శఠగోపులును సరోయోగులును, సః=ఆ, భూతఃమునిః=భూతయోగులును, మధురకవిః=మధురకవులును, ఇతః=వీరికంటె, అపరేచ=ఇతరులును, ధన్యాః=కృతార్థులు, కతి=కొందఱు, జగంతి=లోకములను, సూక్తిపూరైః=(శ్రీసూక్తిసమూహములచేత, నపునంతి=పావనపఱచరా?

తా. తొండరడిప్పొడియాళ్వార్లును, పెరియాళ్వార్లును,నమ్మాళ్వార్లును, పొయ్‌గైయాళ్వార్లును, పూదత్తాళ్వార్లును, మధురకవియాళ్వార్లును, మఱియితరులైన యాళ్వార్లును తమ (శ్రీసూక్తులచేత ఈలోకమును పావనపఱచుచున్నారుకదా ?

సీ. ప్రాబోధికీసూక్తికీ పాళికఁగారంగేశు
పయి రచించినభక్తకీ పదరజుండు
సుప్రకాశకములకీ సువచస్సుల నవిద్య
తమ మడంచినకలికీ ధ్వంసకుండు
గురుముఖాధ్యయనమేకీ యరయ కశేషము
ల్వేదముల్వల్కినకీ విష్ణుచిత్తుఁ
డకలంకకవి గాయకీ కావళీసార్వభౌ
ముఁడుమునివాహనకీ స్ఫుటయశుండు

బ్రహ్మసంహిత జగ । త్ప్రచురము చేయ స
హస్రశాఖగఁ జేసి । సకలశఠారి
యాశఠారాతివా । గ్వ్యాసము మాధుర్య
కావ్యముఁ జేసిన । కవివరుండు
నలరంగ ననుదిన । మలరంగ యాత్రలఁ
బురిని నేలు కులశేఖర విభుండు
నామహీసార పురాధీశుఁ డౌ భక్తి
సారాహ్వయుఁడు సర్వ । సూరినుతుఁడు
కాంచీపురంబునఁ । గాంచనాంబుజమున
జనియించినట్టి కా । సారయోగి
మల్లాపురంబున । మాధవీ సుమమున
భూతాఖ్యఁ దోఁచిన । బుధనుతుండు
మాయూరపురమున । మహిత కైరవమున
మహదాఖ్యఁ దోఁచిన । మహిమశాలి
ఆముక్తమాల్యద । యై తిరుప్పావును
తిరుమొళ్లి తీర్చిన । స్థిరయశస్క
శ్రీభాష్యము మొదలు । శోభిలు గ్రంథము
లానతిచ్చి నల రా । మానుజ ముని
మహితత్రయీకంఠ । మంగళసూత్రమా
సూక్తుల వెలయు శ్రీ । వత్సచిహ్నుఁ
తే. డమల మేధావి మహిమల । నవని మీఱి
మాఱు లేక యనేకులు । మానితాత్ము
లతుల కవితాధురంధర । కృతులఁ గృతులు
భువనములఁ బావనము సేయు । స్ఫురణ నుంద్రు.

ఇ. శఠమథనులు=శఠారి-వీరు పాండ్యదేశమున తామ్రపర్ణీతీరమున కురుకాపురియందు విష్వక్సేనాంశమున కారిమార్లవలన ఉదయనంగయార్కు-అవతరించి, తింత్రిణీమూలమున నివసించి, విష్వక్సేనులే ఆచార్యులై, భగవద్విషయమున తిరువాయిమొళ్ళి మొదలైన ద్రావిడప్రబంధములను పాడి; వడతిరుమలె, తెన్ తిరుమలె మొదలైన దివ్యదేశములను మంగళాశాసనము చేసిన నమ్మాళ్వార్లు.

ఇ. మధురకవులు = శ్రీశఠగోపులశిష్యులు— వీరు పాండ్యదేశ తామ్రపర్ణీతీరమున తిరుక్కోళూరున పరిషద్గణాంశమున అవతరించి, తమ యాచార్యులైన నమ్మాళ్వార్ల విషయమై కణ్ణినుణ్ శిరుత్తాంబును పాడిన మధురకవి యాళ్వార్లు.

ఇ. విష్ణుచిత్తులు=వీరు పాండ్యదేశమున శ్రీవిల్లిపుత్తూరున వైనతేయాంశమున ముకుందార్యులవలన పద్మెయమ్మెయారున కవతరించి, సేనమొదలియాళ్వార్లె ఆచార్యులై తిరుప్పల్లాండు పెరియాళ్వార్ తిరుమొళ్ళినిన్ పాడి; తెన్ మధురై వడమధురై మొదలైన దివ్యదేశములను మంగళాశాసనము చేసిన పెరియాళ్వార్లు.

ఇ. భక్తాంఘ్రిరేణులు=వీరు చోళదేశమున కావేరీతీరమున మండం కుడిని వనమాలాంశమున అవతరించి, సేనమొదలియాళ్వార్లె ఆచార్యులై శ్రీరంగముననె నివసించి; తిరుప్పళ్లి యెళ్ళుచ్చి, తిరుమాలైయుపాడి, నంబెరుమాళ్ సన్నిధిని మంగళాశాసనము చేసిన తొండరడిప్పొడియాళ్వార్లు.

ఇ. కులశేఖరాళ్వారు— వీరు కేరళదేశమున తిరువంజిక్కళమున కౌస్తుభాంశమున శేరరాజును అవతరించిన, సేనముదలియాళ్వారె ఆచార్యులై ముకుందమాలెయు, పెరుమాళ్ తిరుమొళ్ళియు పాడి ; తిరుమలె, అళ్ళగర్ తిరుమలె నంబెరుమాళ్ సన్నిధిమొదలైన దివ్యదేశములు మంగళాశాసనము చేసిన కులశేఖరప్పెరుమాళ్.

ఇ. మునివాహనులు—వీరు చోళదేశమున కావేరీతీరమున వరయూరిలో శ్రీవత్సాంశమున వరిపెరున అయోనిజులె అవతరించి, సేనముదలియార్లె ఆచా

ర్యులై, అమలనాథప్పిరాన్ పాడి, తిరువరంగం, తిరుమలెయును మంగళాశాసనముచేసిన తిరుప్పాణియాళ్వార్.

ఇ. కలిధ్వంసకులు—వీరు చోళదేశమున కావేరీ సాగర సంగమమున తిరుక్కుఱైయలూరున శార్ఙ్గాంశమున అవతరించి, నీలమొదలియాళ్వార్లై ఆచార్యులై నిత్య తదీయారాధనపరులై, తిరుక్కురుందాండకం తిరునెడుందాండకం మొదలైనవి పాడి, తంజమామణి, వంజుళాంజోలె మొదలైన దివ్యదేశములు మంగళాశాసనములు చేసిన తిరుమంగైయాళ్వార్లు.

ఇ. సరోయోగి—వీరు తొండమండలముతోడి కాంచీపురమున పొత్తామరైపొయిగలో పాంచజన్యాంశమున అవతరించి, వైయంతకళి అను మొదల్తిరువందాది పాడి కోవెలె, పెరుమాళ్ కోవెలె, తిరుమల, తిరుక్కోవలూర్దివ్యదేశములు మంగళాశాసనముచేసిన పొయ్గైయాళ్వార్లు.

ఇ. భూతయోగి—వీరు తొండమండలముతోడి సముద్రతీరమున మల్లాపురమనెడి తిరుక్కడలెయందు కౌమోదక్యంశమున అవతరించి, అంబేదకళి అను రెండవతిరువందాదిపాడి, కోవిల్, తిరుమలై, తిరుక్కడల్మల్లై, తిరుక్కోవలూర్దివ్యదేశములు మంగళాశాసనము చేసిన పూదత్తాళ్వార్లు.

ఇ. మహదాహ్వయులు—వీరు మయూరపురమున= మైలాపురమున మణికైరవకూపమందు రక్తోత్పలమున నందకాంశమున అవతరించి, తిరుక్కండేన్ అను మూనాఁంతిరువందాది పాడి, కోయిల్, తిరుమలై, తిరువల్లిక్కేణి, తిరుక్కోవలూర్దివ్యదేశములు మంగళాశాసనముచేసిన పేయాళ్వార్లు.

ఇ. భక్తిసారులు—వీరు పూవిరుందమల్లికి=పూనమల్లికి పశ్చిమమున తిరుమళ్లిశిలో సుదర్శనాంశమున కనకాంగి భార్గవఋషులకు పుత్రులై అవతరించి, నాలాం= నాన్ముకన్ తిరువందాది, తిరుచ్చందవిరుత్తముపాడి, పంచశక్తిమయవిగ్రహులై=కోయిల్, తిరుమలై, తిరువల్లిక్కేణి, తిరుక్కొడందె, తిరుప్పేర్, అంబిల్, కపిస్థలం, తిరువూరకం, తిరుప్పాడకం, తిరువెంకాడు దివ్యదేశములు మంగళాశాసనము చేసిన తిరుమళ్లిశియాళ్వార్లు.

. . ఆండాళు=కోదెనాయకి. ఈమె శ్రీవిల్లిపుత్తూరిలో పెరియాళ్వారి తిరు

నందవనమున తిరుత్తుళాయిక్రింద భూదేవ్యంశమున అవతరించి, పెరియాళ్వారి యొద్ద పెరిగి, తిరుప్పావు, నాచ్చియార్ తిరుమొళ్లిపాడి; తిరువాయ్ప్పాడి, తిరుప్పార్కడల్ మొదలైనదివ్యదేశములు మంగళాశాసనముచేసిన చూడికొ్కుడుత్తనాచ్చియార్.

ఇ. రామానుజమునులు— వీరు తుండీరమండలమున శ్రీపెరుంబూదూరున ఆసూరివంశమున ఆదిశేషాంశమున కాంతిమతీ కేశవదీక్షితుల పుత్రులై శ్రీభాష్య,గీతాభాష్య, వేదాంతసార, వేదాంతదీప, వేందాతసంగ్రహ, గద్యత్రయాద్యనేక గ్రంథములు సాయించి; కోవెలె, పెరుమాళ్ కోవెలె, తిరుమలై, తిరునారాయణపురం, గరుడాచల సింహాచల శ్రీకూర్మ పురుషోత్తమ బదరికాశ్రమ నైమిశారణ్య సాలగ్రామాది దివ్యదేశములు మంగళాశాసనముచేసిన ఇలైయాళ్వార్లు.

ఇ. శ్రీవత్సచిహ్నులు—వీరు తొండమండలమున కూరముఅనెడి అగ్రహారమున అనంతులవలన పెరుందేవీనాయకికి శ్రీరామాంశమున పుత్రులై అవతరించి; వరదరాజ స్తవ, సుందరబాహు స్తవ, అతిమానుష స్తవ, శ్రీవైకుంఠ స్తవ, శ్రీ స్తవములు అనుపంచ స్తవములును, యమకరత్నాకర గద్యత్రయవ్యాఖ్యానాదులును, వేదవిద్యాకంఠమునకు మంగళసూత్రమువలెచేసి, సదా శ్రీమద్రామానుజమునుల తిరువడిగళే సగోత్రముగ ఆత్మోజ్జీవనముగ ఆశ్రయించి సదాధారకపోషక భోగ్యభాగ్యముగ ఆనందించుకొనుచున్న కూరత్తాళ్వార్లు.

## తార్కికవర్ణనము.

ఇ. తార్కికులు=తర్కశాస్త్రివేత్తలు, తర్కము- ప్రత్యక్షానుమానోపమాన శబ్దములనెడి ప్రమాణములును, ద్రవ్య గుణ కర్మ సామాన్య విశేష సమవాయాభావము లనెడి పదార్థమునుర్ జెప్పునది.

కృశానుః—కృశానువు.

గ॥ పురతో విమానం ప్రస్థాప్య పార్శ్వతో దృష్ట్వా ॥ 875
వ. పురస్థలంబున విమానముపజఅపి పార్శ్వంబు పరికించి.

గ॥ పశ్య? ఏతా నాగ్రహిణః పురుషాన్ యఏ తే వ్యర్థమేవ న్యాయగ్రంథ సంతత చింతనేన విశ్రామ్యంతి ॥ 876

వ. పరికింపుము ? వీరలాగ్రహులై వ్యర్థముగనె యర్థశాస్త్రమును సంతతముం జింతనముం జేయుచు బడలిక పడుచున్నవారు.

తథాహి— అట్లేకద ?

వృ॥ కర్మ బ్రహ్మవిచారణాం విజహతో భోగాపవర్గప్రదామ్
ఘోషంకంచన కంఠశోషఫలకం కుర్వంత్యమీ తార్కికాః
ప్రత్యక్షం నపునాతి నాపహరతే పాపాని పీలుచ్ఛటా
వ్యాప్తిర్నావతి నైవపాత్యనుమితి ర్నో పక్షతా రక్షతి ॥

అ. అమీ తార్కికాః = ఈ తార్కికులు, భోగాపవర్గప్రదాం = భోగమునకై స్వర్గమునిచ్చునట్టి, కర్మబ్రహ్మవిచారణాం=కర్మవిచారణమైన మీమాంసాశాస్త్రమును బ్రహ్మవిచారణమైన వేదాంతశాస్త్రమును, విజహతః = విడుచుచుండువారై, కంచన=కొంచెమె, కంఠశోషఫలకం=కంఠశోషమే ఫలముగాఁగల, ఘోషం=ధ్వనిని,కుర్వంతి= చేయుచున్నారు. ప్రత్యక్షం=ప్రత్యక్షప్రమాణము, నపునాతి=రక్షించదు; పీలుచ్ఛటా=పరమాణురాశి, పాపాని = పాపములను, నాపహరతే=అపహరించదు; వ్యాప్తిః=వ్యాప్తిప్రమాణము, న అవతి = రక్షింపదు; అనుమితిః = అనుమానప్రమాణము, నైవపాతి = రక్షింపనే రక్షింపదు; పక్షతా=పక్షతయును, నోరక్షతి=రక్షింపదు.

తా. ఈతార్కికులు కర్మనువిచారణచేయు భోగమునిచ్చు మీమాంసనున్, బ్రహ్మను విచారణచేయు ముక్తినిచ్చు వేదాంతమునున్ విడిచి, ఘోషించి ఘోషించి కంఠశోష చేసికొనుచుందురు ; ఆతర్కభేదములలోని ప్రత్యక్షపరమాణువ్యాప్త్యనుమితిపక్షతాదిప్రమాణములు వీరి నేమికాపాడఁబోవుచున్నవి?

తే. ఎచ్చుభోగము నపవర్గ మిచ్చునట్టి
దేని మీమాంస వేదాంత మొదల వదలి

తార్కికులు వీరు ఘోషించెదరు మఱింత
వ్యాప్తి ప్రత్యక్ష పక్షతాద్యములు విడక.

కించ—మఱియు.

వృ॥ హేతుః కించ విశిష్ట ధీ రనుమితౌ నజ్ఞానయుగ్మం మరుత్
వాచో నేతిచ మోహవాద ముఖరా నైయాయికా శ్చేద్బుధాః
మేషస్యాండమియత్పలం బలిభుజో దంతాః కియంత స్తథే
త్యేవం సంతత చింతనై శ్శ్రమజుషో నస్యుః కథం పండితాః ॥

అ. కించ=మఱియు. అనుమితౌ=అనుమానమందు, విశిష్టధీః=విశేషించిన దానియందలి తలంపు, హేతుః=కారణము; జ్ఞానయుగ్మం = ఇదియని తెలిసికొనుటైన అదియని తెలిసికొనుటైన అనురెండును, నహేతుః=హేతువుకాదు; మరుత్ చ=గాలియును, నత్వాచః = చర్మసంబంధియైనదికాదు; ఇతి=అని, మోహవాదముఖరాః=అజ్ఞానముతో వాదించుటయందు నోరు వాఁగుచున్న, నైయాయికాః=తార్కికులు, బుధాశ్చేత్=పండితులైనయెడల; మేషస్య = మేఁకయొక్క, అండం=విత్తు, ఇయత్పలం=ఇన్నిపలాలుకలది; తథా=అట్లు, బలిభుజః = కాకియొక్క, దంతాః = పండ్లు, కియంతః=ఎన్ని; ఇతి ఏవం=అని ఇట్లు, సంతత చింతనైః = ఎప్పుడును చింతించుటచేత, శ్రమజుషః = శ్రమపడువారు, కథం=ఎట్లు, పండితాః=పండితులు, నస్యుః=కారు.

తా. కొండనుగని నిప్పున్నదని యనుమానపడునపుడు అందు పొగను హేతు వనవచ్చునుగాని; లేనిపొగనుగాని నిప్పునుగాని హేతువనరాదు. గాలి మన యొంటిలోఁ దగిలినపుడు తెలిసికొందురుగాని; ఆగాలికి మనచర్మము హేతువు కాకున్నను; హేతువుగా నెంచుకొను మోసగుణముతో నోరువాఁగించి వాదించెడి యీ తార్కికులు జ్ఞానవంతులే యగుదురు ? మేకలయండాలిన్నిపలాలు, కాకులపండ్లెన్ని, అని యెంచుకొనుటయందలి శ్రమకలవారే యగుదురనుట.

సీ. పర్వతం బిది వహ్నిక పర్వినదా? యను
ననుమితియందు క ధూమాదిబుద్ధి

హేతువుగాని; వహ్ని వ్యాప్య ధూమము
ధూమవద్వహ్నియర్థ మెద్దోయికాదు
గంధవాహంబు త్వగ్గ్రాహ్యంబు గాదను
మోదంబులో వాదమునకు ముఖరులైన
నైయాయికులివ్వారె నైజపండితులైన
ధారుణిం బండితులెల్లారె నుండి ?

తే. మేషముల యండముల పలాండులీషదంశ
మైనఁ గొలుపలేక యిన్నియేం యనుచునుఱియుఁ
గాకిపండ్లును నిన్నియే కలుగుననుచు
సంతతంబును జింతించు శ్రమగలారు.

గ॥ విశిష్య చైతస్య శుష్కతార్కికస్యరీతి ర్వివేకినా మపహాసా
స్పదమ్ ॥ 879

వ. విశేషించి వీరి శుష్కతార్కికరీతి వివేకుల యపహాసమున
కాస్పదమై యున్నయవి.

శ్రుణుతావత్ —— వినుము ?

వృ॥ నజిఘ్రత్యామ్నాయం స్పృశతి న తదంగాన్యపి సకృత్
పురాణం నాధీతే నగణయతి కించ స్మృతిగణమ్
వదన్ శుష్కం తర్కం పరపరిభవార్థోక్తిభిరసా
నయత్యాయుస్సర్వం నిహిత పరలోకార్థయతనః ॥ 880

అ. నిహితపరలోకార్థయతనః = విడువఁబడిన పరలోకనిమిత్తమైన యత్నము
కల, అసౌ = ఈ తార్కికుఁడు, ఆమ్నాయం = వేదమును, నజిఘ్రతి = వాసనయైనఁ
జూడఁడు; తదంగాన్యపి = ఆవేదాంగములైన, నస్పృశతి = అంటఁడు; సకృత్ =
ఒకప్పుడును, పురాణం = పురాణమును, నాధీతే = చదువఁడు; స్మృతిగణం = స్మృతి
సమూహమును, కించ = కొంతయైన, నగణయతి = ఎంచఁడు; పరపరిభవార్థోక్తి

భిః=పరులను అవమానపఱచుటే ఫలముగాఁ గలమాటలచేత, శుష్కం=నిష్ఫల మైన, తర్కం=తర్కమును, వదన్=వచించుచు, ఆయుః=ఆయుస్సు, సర్వం= అంతయు, నయతి=కడపుచున్నాఁడు.

తా. ఈతార్కికుఁడు పరలోకనిమిత్తము ఏయత్నము చేయనివాఁడై వేద ముగాని, దానియంగముగాని, పురాణముగాని, స్మృతియైనఁగాని పలుకక, పరులను పరిభవించుటకై నిష్ఫలమైనతర్కము నే పలుకుచు, తన ఆయుస్సంత యు కడపుకొనుచున్నాఁడు.

సీ. ఆమ్నాయగంధంబు ✽ నరసిమూర్కొనరు త
దంగవిశేషంబు ✽ నంటికొనరు
కొండొక్కతటినేని ✽ కొనరుపురాణంబు
నొక్కస్మృతింగాని ✽ లెక్కగొనరు
మీమాంసయందొక ✽ నామాంశమేనివా
కొన రొకవడికేని ✽ కోరి యిటులు
తద్వేద వేదాంగ ✽ తత్పురాణస్మృతి
మీమాంసలేమేని ✽ మీఱికున్న

తే. నిటుల శుష్కంబు తర్కంబె ✽ చేఁజల గతిని
బఠనచేయుచుఁ బరులను ✽ బరిభవించు
నుక్తులనె యుక్తులనె నిజా ✽ యువును గడపు
చింతయేనియుఁ బరలోక ✽ చింతకొనరు.

ఇ. ఆమ్నాయము=వేదము - ఋుగ్యజుస్సామాధర్వణములు-4.

తదంగములు=వేదాంగములు - శిక్షా, వ్యాకరణ, ఛందో, నిరుక్తి, జ్యోతి ష కల్పములు. 6.

పురాణములు=సృష్టి, ప్రతిసృష్టి, మన్వంతర, వంశ, వంశానుచరిత లక్షణ ములు. అవి-బ్రాహ్మ, పాద్మ, శైవ, వైష్ణవ, కూర్మ, మాత్స్య, లైంగ

స్కాంద, గారుడ, వామన, వారాహ, భాగవత, నారదీ, యాగ్నేయ, మార్కండేయ, భవిష్య, బ్రహ్మకైవర్త, బ్రహ్మాండములు-18.

స్మృతులు=వేదార్థప్రతిపాదక ధర్మశాస్త్రములు. అవి - మను, బృహస్పతి, దక్ష, గౌతమ, యమాంగీరస,యాజ్ఞవల్క్య, ప్రచేత, శాతాతప,పరాశర, సంవర్త, ఔశనస, శంఖ,లిఖి, తాత్రేయ, విష్ణ్వాపస్తంబ, హారీతస్మృతులు. మీమాంస=వేదార్థన్యాయశాస్త్రము - ఇది - పూర్వమీమాంస = కర్మకాండము, ఉత్తరమీమాంస=బ్రహ్మకాండము అని 2 విధములు.

అపిచ—మఱియు.

వృ॥ ప్రయత్నై రస్తోకైః పరిచిత కుతర్క ప్రకరణాః
పరంవాచోవశ్యాన్ కతిపయపదౌఘాన్ విదధతః
సభాయాం వాచాటాశ్శ్రుతికటు రటంతో ఘటపటాన్
నలజ్జంతే మందాస్స్వయ మపితు జిహ్రేతి విబుధః॥ 881

అ. అస్తోకైః=విస్తారములైన, ప్రయత్నైః=ప్రయత్నములతో, పరిచిత కుతర్కప్రకరణాః=అభ్యసింపఁబడిన కుత్సితతర్కమందలి భాగములుకలవారై, కతిపయపదౌఘాన్=కొన్ని పదసమూహములను, వాచః=నోటికి, పరం = మిక్కిలి, వశ్యాన్=వశములుగా, విదధతః=చేయువారై, వాచాటాః = వదురుపోతులైన, మందాః=ఈ మూఢతార్కికులు, సభాయాం=సభలో, ఘటపటాన్=ఘటపటశబ్దములను, శ్రుతికటు=కర్ణకఠోరముగా, రటంతః=వదురువారై, స్వయం=తాముగా, నలజ్జంతే=సిగ్గుపడరు; అపితు=అయినను, విబుధః=జ్ఞానవంతుఁడు, జిహ్రేతి=సిగ్గుపడుచున్నాఁడు.

తా. బహుప్రయత్నముతో ఆ కుతర్కప్రకరణములు కొన్ని పరిచయముచేసి వానిలోని కొన్నిపదాలు తమనోట వదురుకొనుచు సభలోఁగూడ సిగ్గు పడని యీ తార్కికులు చెవికి గడుసుగా ఆ ఘటపటాదిశబ్దముల నే వాఁగుచుండుదురుగాని, అందు జ్ఞానవంతుఁ డెవఁడైన నొకఁడు సిగ్గుపడుచుండును.

తే. కరము పఠియించి తర్క ప్రకరణములఁ బ
దంబులటు కొన్ని కంఠపాఠంబు చేసి

కర్ణకటువుగఁ బలుకుదు కై ర్ఘటపటముల
లజ్జపడఁబోరు వీ, రొజ్జె కై లజ్జపడెడు.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ వయస్య? వివిధోపాయ విధాయకాః నైయాయికాః
మానవమంస్థాః॥ 882

వ. సఖా! సకలోపాయములకుఁ సంవిధాయకులగు నీరల నన్మా
నింపు మవమానింపకు?

శృణుతావత్—వినుము?

వృ॥ మోహం రుణద్ధి విమలీకురు తే చ బుద్ధిమ్
సూతేచ సంస్కృతిపద వ్యవహారశక్తిమ్
శాస్త్రాంత రాభ్యసన యోగ్యతమంచ్యనక్తి
తర్కశ్రమో నతను తే కిమహోపకారమ్॥ 883

అ. తర్కశ్రమః=తర్కశాస్త్రమందలి శ్రమము, మోహం=బుద్ధిమాంద్య
మును, రుణద్ధి=నివారించుచున్నది; బుద్ధించ=బుద్ధిని, విమలీకురుతే=పరిశుద్ధ
పఱచుచున్నది. సంస్కృతిపదవ్యవహారశక్తించ= సంస్కృతపదములందు వ్య
వహరించుశక్తిని, సూతే=పుట్టించుచున్నది. శాస్త్రాంతరాభ్యసనయోగ్యత
మం=వేఱుశాస్త్రముల నభ్యసించుటయందు అత్యంతయోగ్యునిఁగా, వ్యనక్తి=
స్పష్టపఱచుచున్నది. ఇహ=ఇక్కడ, కిం=ఏమి? ఉపకారం=ఉపకారమును,
నతనుతే=చేయదు?

తా. తర్కశాస్త్రమును అభ్యాసముచేసెడి శ్రమము బుద్ధిమాంద్యమును
మాన్చి, స్వబుద్ధిని నిర్మలపఱచి, సంస్కృతభాష వ్యవహరించు శక్తినిచ్చి,
వేఱువేఱు వ్యాకరణాదిశాస్త్రములనుకూడ అభ్యసించుశక్తిని నిచ్చుచున్నది.
ఇట్టి యుపకారము చేయలేదా?

తే. బుద్ధిమాలిన్య ముడిపి వైశద్యమిడును
సంస్కృతంబున వ్యవహారశక్తి నిడును

మఱియు శాస్త్రాంతరాభ్యాస ♦ మహిమనిడును
ఇటులు తర్కపరిశ్రమ ♦ మేదియిడదు ?

తథాహి—అశ్లోకద ?

వృ॥ ప్రాయః కావ్యై ర్గమితవయసః పాణినీయాంబురాశేః
పారజ్ఞస్యా ప్యపరికలితన్యాయశాస్త్రస్య పుంసః
వాదారంభే వదితుమనసో వాక్యమేకం సభాయాం
ప్రహ్వా జిహ్వా భవతి కియతీం పశ్య? కష్టా మవస్థామ్ ॥884

అ. కావ్యైః=కావ్యములచేత, గమితవయసః = జరిగిపోయిన వయస్సుకలవాఁడును, పాణినీయాంబురాశేః = పాణినీయ వ్యాకరణమనెడు సముద్రముయొక్క, పారజ్ఞస్యాపి=గట్టెక్కినవాఁడయ్యును, సభాయాం= సభయందు, వాదారంభే=వాదమునకు ఆరంభించుటయందె, ఏకంవాక్యం=ఒకమాటను, వదితుమనసః=చెప్పుటకు మనస్సుకలవాఁడును, అపరికలితన్యాయశాస్త్రస్య=చక్కఁగాఅభ్యసింపఁబడని తర్కశాస్త్రముకలవాఁడునైన, పుంసః=పురుషునికి, జిహ్వా=నాలుక, ప్రాయః=బహుగా, ప్రహ్వా = అణఁగినది, భవతి=అగుచున్నది. కియతీం= ఎంతమాత్రమొ? కష్టాం=కష్టమైన, అవస్థాం=స్థితిని, పశ్య= చూడుమా ?

తా. కావ్యములు చదివి, పాణినీయవ్యాకరణమును కడవఱకుచదివియు, తర్కశాస్త్రమును చక్కఁగాచదువక సభలోవాదించుటకు నోరు తగ్గిపోఁగా తార్కికుని యవస్థయెట్టిదియో ? చూడు ?

తే. కావ్యములచేతఁ బ్రాయంబు ♦ కడచినైనఁ
బాణినీయాబ్ధిపారంబు ♦ పడసినైన
ననధిగతతర్కు నేమైన ♦ నడుగునపుడు
జిహ్వ ప్రహ్వాయమా దురవస్థ ♦ చెప్పనగునె ?

కింబహునా— విశేషమేల ?

వృ॥ అపరీక్షిత లక్షణప్రమాణె

రపరామృష్టపదార్థ సార్థతత్త్వైః
అవశీకృత జైత్రయుక్తి జాలై
రల మేతై రనధీతతర్కవిద్యైః ॥ 885

అ. అపరీక్షితలక్షణప్రమాణైః = పరీక్షింపఁబడని అసాధారణలక్షణములై ప్రమాణములుగాఁగలవారును, అపరామృష్టపదార్థసార్థతత్త్వైః = పరామర్శింపఁబడని ద్రవ్యాది పదార్థముల సమూహముయొక్క నిజస్థితులు కలవారును, అవశీకృతజైత్రయుక్తిజాలైః=వశపఱచుకొనఁబడని జయశీలములైన యుక్తి సమూహముకలవారును, అనధీతతర్కవిద్యైః=చదువఁబడని తర్కశాస్త్రము కలవారునైన, ఏతైః=ఈ తార్కికులతో, అలం=చాలును.

తా. తర్కశాస్త్రముచదువక, దానిలక్షణములైన ప్రత్యక్షాదిప్రమాణములును, దానియందలి ద్రవ్యగుణకర్మాది పదార్థతత్త్వములును తెలియక, తమయుక్తులు జయశీలములని తలంచుకొనుచుండు నీ మూఢతార్కికులతో పనియేమి ?

ఆ. లక్షణప్రమాణకలక్షకుల్గాక, ప
దార్థసార్థతత్త్వ మరయలేక
జయదశీలయుక్తి శాలులుం గానియీ
తార్కికులను మనకుఁ దలఁపనేల ?

నిరూప్య—నిరూపించి.

శ్లో॥ అద్భుత స్తర్కపాథోధి రగాధో యస్య వర్ధకః
అక్షపాదో ఽతమస్స్పృష్ట స్త్వకలంకః కలానిధిః ॥ 886

అ. అతమస్స్పృష్టః=రాహువుచేతను-చీఁకటిచేతను-అజ్ఞానిచేతను అంటఁబడినవాఁడు కానివాడును, అక్షపాదః = ఇంద్రియములు కిరణములుగాఁగలవాఁడును, (నేత్రేంద్రియను పాదమందుకలవాఁడగు గౌతమమహర్షి) అకలంకః =నిష్కళంకుఁడు - నిర్దోషియునై, కలానిధిః=చంద్రుఁడు-విద్యాసముద్రుఁడు, యస్య=ఏసముద్రమునకు, వర్ధకః=వృద్ధిపఱచువాఁడో ? అగాధః=దురవగాహమైన, తర్కపాథోధిః=ఆ తర్కమను సముద్రము, అద్భుతః=ఆశ్చర్యకరము ?

తా. ఇంద్రియములే కిరణములై రాహువంటక కళంకములేని చంద్రుఁడు సముద్రమును వర్ధిలఁజేయుచుండునట్లు నేత్రేంద్రియము పాదమందును గలిగి అజ్ఞానములేక నిర్దోషియైన గౌతమమహర్షి యీ తర్కమును వర్ధిలఁజేయుచుండును. కాఁబట్టి యీ తర్కసముద్రము ఆశ్చర్యకరము.

తే. అక్షపాదుఁడు ప్రక్షిప్తకదక్షతముఁడు
తనకు వర్ధకుఁడకళంకుఁడును గళాని
ధానమగునట్టి నయవార్నిధానమిది, మ
హాద్భుతంబె యగాధాత్మకనువుట నవుర ?

ఇ. అక్షపాదుఁడు=గౌతమర్షి. ఈయన శతానందునితండ్రి, కృపాచార్యుల తాత.

టి. ప్రక్షిప్తదక్షతముఁడు=ఎగరఁగొట్టఁబడిన అంధకారము = రాహువు - అజ్ఞానము కలవాఁడు.

ఇ. కళలు=షోడశకళలు. ఇవి - పున్నమ అమావాస్యలముందు ఎక్కువ తక్కువగనుండు చంద్రకళలు.

ఇ. చతుర్దశకళలు=చతుర్వేదములు, షడంగములు, పురాణ, తర్క, ధర్మ, మీమాంసాశాస్త్రములు.

గ॥ పునరాలోచ్యసశ్లాఘమ్॥

వ. మఱల నాలోచించి శ్లాఘించి.

వృ॥ జ్ఞానాబ్ధి రక్షచరణః కణభక్షకశ్చ
శ్రీ పక్షిలోఽప్యుదయన స్సచవర్ధమానః
గంగేశ్వర శ్శశధరో బహవశ్చ నవ్యాః
గ్రంథైర్నిరుంధత ఇమే హృదయాంధకారమ్॥ 887

అ. జ్ఞానాబ్ధిః=జ్ఞానసముద్రుఁడైన, అక్షచరణః=గౌతముఁడును, కణభక్షకశ్చ=కణాదుఁడును, శ్రీపక్షిలోపి=పక్షిలుఁడును, ఉదయనః = ఉదయనుఁడును, సచ వర్ధమానః=ఆ వర్ధమానుఁడును, గంగేశ్వరః=గంగేశ్వరుఁడును, శశ

ధరః=శశధరుఁడును, బహవః=అనేకులైన, నవ్యాశ్చ=నూతనులునైన, ఇమే=ఈతార్కికులు, గ్రంథైః=తమగ్రంథములచేత, హృదయాంధకారం=ఇతరుల హృదయములందలి అజ్ఞానాంధకారమును, నిరుంధతే=పరిహరించుచున్నారు.

సీ. న్యాయసూత్రమనంగ నర్థశాస్త్రమునకుం
గర్తయక్షపదుండు గౌతముండు
తానువైశేషిక దర్శనకర్తయే
కనఁగ భిన్నమతుఁడు కణభుజుండు
కుసుమాంజలియనంగ నసమానమౌగ్రంథ
ముదయింపఁగర్తతా నుదయనుండు
ననుమాన చింతామణిని రచించి ప్రశస్తి
నిలఁగాంచి మించు గంగేశ్వరుండు

తే. మఱి శిరోమణికర్త్రాది మహితనవ్య
తార్కికులు జగదీశ ప్రధానులైన
చతురమతు లిట్లు తమగ్రంథ తతులవలనఁ
బుడమి హృదయాంధకారంబు నడఁతు రెపుడు.

ఇ. అక్షచరణుఁడు=గౌతముఁడు - న్యాయసూత్రతర్కశాస్త్రకర్త.
కణభుజుఁడు=కణాదుఁడు - వైశేషికదర్శన తర్కశాస్త్రకర్త.
పక్షిలుఁడు=వాత్స్యాయనస్వామి - గౌతమసూత్రవ్యాఖ్యాత.
ఉదయనుఁడు=కుసుమాంజలి తర్కశాస్త్రకర్త.
వర్ధమానుఁడు=గణరత్నమహోదధి తర్కశాస్త్రకర్త.
గంగేశ్వరుఁడు=అనుమానచింతామణి తర్కశాస్త్రకర్త.

## మీమాంసక వర్ణనము.

ఇ. మీమాంసకులు = మీమాంసాశాస్త్రప్రవర్తకులు, మీమాంస=వేదార్థ నిశ్చాయక న్యాయ నివేదకశాస్త్రము. ఇది కర్మమీమాంస, బ్రహ్మమీమాంస అని ద్వివిధములు.

కృశానుః—కృశానువు.

గ॥ అపఃత్ర వ్యోమయాన మానయ న్నగ్రతో నిర్వర్ణ్య సోపా
లంభమ్ ॥ 888

వ. మఱొక్కప్రక్క విమాన మానయించుకొంచు నెదుర నిరీ
క్షించి యుపాలంభనంబునుం గావించుచు.

వృ॥ మీమాంసకాః కతిచిదత్ర మిలంతి వేద
ప్రామాణ్య సాధనకృతోఽపి న తేఽభివంద్యాః
ఉద్ఘోషితోఽప్యుపనిషద్భి రశేష శేషీ
బ్రహ్మైవ నాభ్యుపగతః పురుషోత్తమో యైః ॥ 889

అ. యైః=ఏమీమాంసకులచేత, అశేష శేషీ = సకలప్రపంచమునకును పర మగురువుగా, ఉపనిషద్భిః=వేదభాగములచేత, ఉద్ఘోషితః = ఘోషింపఁబడు నతఁడై, పురుషోత్తమః=శ్రీమన్నారాయణస్వరూపమైన, బ్రహ్మైవ = పరబ్ర హ్మమే, న అభ్యుపగతః=అంగీకరింపఁబడఁడో, తే=ఆ, మీమాంసకాః=మీ మాంసాశాస్త్రప్రవర్తకులు, కతిచిత్=కొందఱు, అత్ర=ఇక్కడ, మిలంతి = చేరుచున్నారు. వేదప్రామాణ్య సాధనకృతోఽపి= వేదములు ప్రమాణ మనుటను సాధించువారయ్యును, నఅభివంద్యాః=వందనము చేయఁదగినవారు కారు.

తా. ఈ మీమాంసకులు వేదములు ప్రమాణములుగా తలంచువారైనను, సర్వశేషియై సర్వోపనిషత్తులచే జగజ్జన్మకర్త అని ఘోషింపఁబడుచున్నను; ఆ శ్రీమన్నారాయణుఁడే బ్రహ్మమని యెంచనివారగుటచే వారు మనకు వంద నీయులుకారు.

తే. శ్రుతుల ప్రామాణ్య సాధన కే చతురులయినఁ
గొంద ఱిందు మీమాంసకు ల్వంద్యులెవుడు
కా, రశేష శేషియు బ్రహ్మ కే పూరుషోత్త
ముఁడె యటంచు నుద్ఘోషించు కే మొగిని నుపని
షత్తు, లది వీరుమదిఁ గోరఁ కే జాల, రగుట.

ఇ. ఉపనిషత్తులు=బ్రహ్మస్వరూప నిరూపక వేదభాగములు, ఇవి 108 ఈశావాస్య, కేన, కఠవల్లీ, ప్రశ్న, ముండుక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యాదులు.

గ॥ విశిష్యచ మీమాంసక గోష్ఠ్యాం విశ్రుతా శ్శబరాదయశ్శ
బరాఇవ భగవద్భక్తానాం వినిందనీయాః. 890

వ. విశేషించియు మీమాంసక గోష్ఠియందుఁ బ్రసిద్ధులైన మీమాంసాసూత్రభాష్య కర్తయైన శబరుఁడు మొదలగువారు శబరులువలె భగవద్భక్తులకు మిగుల నిందనీయులుగనే యున్నవారు.

వృ॥ తే మీమాంసాశాస్త్రిలోకప్రసిద్ధాః
సర్వర్షీణాం సేహిరే నైవ సత్తామ్
చైతన్యస్యాప్యపహ్నవం దేవతానాం
చక్రు ర్విశ్వం వీశ్వరం మన్యమానాః॥ 891

అ. మీమాంసాశాస్త్రిలోకప్రసిద్ధాః= మీమాంసాశాస్త్రిముయొక్క ఆ లోకనమునందు ప్రసిద్ధులై(అమీ=ఈ, మాంసాశ= మృగాదిమాంసాశనములు, అస్త్రి=బాణాదులునుగల, లోక= కిరాతజనులయందు, ప్రసిద్ధాః=ప్రసిద్ధులుగా) తే_ఆ, మీమాంసకాః = మీమాంసకులు, విశ్వం=ప్రపంచమును, వీశ్వరం=ఈశ్వరుఁడులేనిదానిఁగా, మన్యమానాః=తలఁచువారై, సర్వర్షీణాం= సకలఋషులయొక్క, సత్తాం=సత్త్వమును, నైవసేహిరే = కోర నేకోరరు. దేవతానాం=అగ్నిసోమాదిదేవతలయొక్క, చైతన్యస్యఅపహ్నవం = ఆత్మకు అబద్ధమును, చక్రుః=చేసిరి.

తా. ఈమీమాంసకులు శాస్త్రిజ్ఞులయ్యును, బోయలవలె ఈప్రపంచమునకు ఈశ్వరుఁడే లేడనితలంచుచు, మహర్షుల నంచజీనిక గోరరు; అగ్నిసోమాది దేవతలకును దేహేంద్రియాదులతోడి యాత్మయును లేదు అనుకొనియెదరు.

క. ఏ మీమాంసాశులు వా
రామాదరినే నికేశ్వరాభిప్రాయుల్
తాము మహర్షిస్థితి, స్వా
ర్థాములఁ జైతన్యమిథ్య క్తెలఁపకె తలఁతుర్.

టి. ఏ మీమాంసాశులు (ఏమీమాంసాశులు) ఇట శ్లేషాలంకారము, మహర్షిస్థితి తలఁపక (స్వార్థాముల చైతన్యమిథ్యతలఁతురు) ఇది క్రమాలంకారము.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ సఖే! నిఖిల నిగమార్థ నిర్ధారణ బద్ధాదరేషు మీమాంసకేషుమాసన్నహృథాః ॥ 892

వ. నిగమార్థముల నిర్ధారణమందె బద్ధాదరులైన యీ మీమాంసకులమీఁద సన్నద్ధుఁడవు కాకుము ?

శృణు—విను ?

వృ॥ ఆదాధర్మే ప్రమాణం ప్రథితమథభిదాం శేషతాంచప్రయుక్తిమ్, పౌర్వాపర్యాధికారౌ తదనుబహువిధం చాతిదేశంతథోహమ్, బాధంతంత్రం ప్రసంగం నయనయనశతైః స్వమ్యగాలోచయద్భిః, భిన్నా మీమాంసకేభ్యో విదధతి భువికే సాదరం వేదతత్త్వమ్ ? 893

అ. ఆదౌ=మొదట, ధర్మే=(వేదవిహితమైన) ధర్మవిషయమున, ప్రథితం=ప్రసిద్ధమైన, ప్రమాణం=ప్రమాకరణమును, అథ=వెనుక, భిదాం = ఆధర్మవిషయభేదమును, శేషతాంచ = ఆధర్మముల శేషసంబంధమును, ప్రయుక్తిం=ఆధర్మముల ప్రయోగమును, పౌర్వాపర్యాధికారౌ=ఆధర్మముల పూర్వాపరక్రమ (అధికారి)ఫలములును, బహువిధం అతిదేశంచ=బహువిధమైన ప్రకృతి కర్మసామ్యము నతిదేశించుటయు, ఊహం=మంత్రాది కర్మ నూహించుటయును, బాధం=అతిదేశప్రాప్తకి బాధయును, తంత్రం=[illegible]యును, ప్రసంగం

=అన్యకర్మప్రసక్తియును, నయనయనశతైః=నూఱునూఱుల న్యాయశాస్త్ర నేత్రములతో, సమ్యక్ ఆలోచయద్భ్యః=చక్కఁగా విచారించుచున్న, మీమాంసకేభ్యః=మీమాంసకులకంటె, భిన్నాః=వేఱువారు, భువి=ఈభూమిలో, కే=ఎవరు, వేదరక్షాం=తమవేదసంరక్షణమును, సాదరం = ఆదరముతో, విదధతి=చేయుచున్నారు ?

తా. వేదవిహిత ధర్మములందు ప్రమాణ, భేద, శేషతా, ప్రయోగ, పౌర్వాపర్య, అధికార, బహువిధాతిదేశ, ఊహ, బాధ, తంత్ర, ప్రసంగముల నెడి పంన్రెండింటిని ఆన్యాయశాస్త్రములే కన్నులుగాఁగలిగి చక్కఁగా ఆలోచింపుచుండు నీమీమాంసకులకంటె ఇతరు లెవరును ఆవేదములను సంరక్షించువారులేరు.

సీ. మొదలధర్మంబుల కి మొనయుప్రమాణంబు
 నవలధర్మముభేద కి మరసిమదిని
నవతల నలవాని కి యంగంబులనరసి
 వానిప్రయోగ మకివ్వలను నరసి
యావలవాని పౌకిర్వాపర్యమారసి
 యావానియధికార కి మరసియవల
నరసియవ్వలవాని కి యతిదేశమఖిలంబు
 వానియూహంబు తకిర్వాతనరసి
తే. నరవిఁదద్బాధ తంత్ర ప్రకిసంగములను
 నరయు నయనయనంబుల కి ననయ మెసక
 మెసఁగు మీమాంసకులకంటె కి నితరులెవరు?
 వేదరక్షణదక్షులీ కి విశ్వమునను

గ॥ పశ్యతావ ద్భగవత ఇవ జైమినిమునే శ్శాసనం వైదికైస్సర్వైరప్యనతిక్రమణీయమ్ ॥ 894

వ. కనుఁగొనుము? భగవానుని శాసనమువలెనే జైమినిముని

శాసనముసైతము సకలవైదికులకు నతిక్రమింపఁ గూడనిది
యై యున్నయది.

తథాహి—అల్లకదా?

వృ॥ నైయాయికావా నను? శాబ్దికావా
త్రయీశిరస్సు శ్రమశాలినోవా
వాదాహవే బిభ్రతి జైమినీయ
న్యాయోపరోధే సతి మౌనముద్రామ్॥ 895

అ. నైయాయికావా=తార్కికులైనను, నను = మంచిది? శాబ్దికావా=
వైయాకరణులైనను, త్రయీశిరస్సు = వేదాంతములందు, శ్రమశాలినోవా =
శ్రమపడువారైనను, వాదాహవే = వాదమనెడియుద్ధమందు, జైమినీయన్యా
యోపరోధే=జైమినిప్రోక్తమైన మీమాంసాన్యాయశాస్త్రమునకు ఆటంకము
కలుగుచుండఁగా, మౌనముద్రాం= నోరుమూసికొనుటను, బిభ్రతి = ధరించు
చున్నారు.

తా. తార్కికులుగాని, వైయాకరణులుగాని, వేదాంతులుగాని, వాదించు
నపుడు ఈ జైమినిముని మీమాంసాశాస్త్రమునకు ఆటంకము కలిగినయెడల
మౌనముద్ర నవలంబించి యుందురు.

తే. వాద యాదఃపతిఁ దాఁటఁ గ వాంఛచేసి
సాటె మీఱిన తార్కికుల్ గ శాబ్దికులును
నతులవైదికుల్ మీమాంస గ న్యాయమునకు
బాధ గని రేని మౌన పాథోధి డిగరె?

ఇ. జైమినిముని=ఇతఁడు వ్యాసమహర్షిశిష్యుఁడును, సామవేదపాఠియును
మీమాంసాన్యాయశాస్త్రకర్తయునైన యతఁడు.

గ॥ యచ్చమీమాంస కేషు దోషోద్ఘాటనం తత్రతావదవధేహి॥

వ. మీమాంసకులమీఁది నీ దోషోద్ఘాటనముమీఁద నవధాన
ముతో నిది వినునది ?

వృ॥ భగవ దనభ్యుపగమనం దైవతచైతన్య నిహ్నవశ్చైషామ్
కర్మశ్రద్ధావర్ధకతత్ ప్రాధాన్య ప్రదర్శనాయైవ ॥ 897

అ. ఏషాం=వీరికి, భగవత్-అనభ్యుపగమనం = భగవానుని - అంగీకరించక పోవుటయును, దైవతచైతన్య - నిహ్నవశ్చ=దేవతల చేతన ధర్మము- అబద్ధమనుటయును, కర్మశ్రద్ధావర్ధక-తత్ప్రాధాన్య ప్రదర్శనాయైవ=కర్మయందుశ్రద్ధను వృద్ధిపఱచునట్టి-ఆకర్మయొక్క ప్రధానతను చూపుటకొఱకే.

తా. ఈ మీమాంసకులు భగవంతుని అంగీకరించక పోవుటయును, దేవతలకు దేహేంద్రియాదు లబద్ధమనుటయును తమ కర్మల శ్రద్ధయే తమకు ప్రధానమని తెలుపుటకై యని యనుకొనవలసినదిగా నున్నది.

క. భగవ దనంగీకారము
తగుదైవతచేతనత్వ కై తథ్యనికారం
బాగిఁగర్మశ్రద్ధావ
ర్ధకమాతత్కర్మపటిమ కై దర్శనమునకే.

గ॥ పునరాలోచ్య సబహుమానమ్ ॥

వ. మఱల నాలోచించి బహుమాన పురస్సరంబుగ.

వృ॥ ఆగమరూపవిచారి ణ్యధికరణ సహస్ర శిక్షిత విపక్షే
స్వామిని జైమినియోగిన్యపి రజ్యతి హృదయమస్మదీయమిదమ్॥

అ. ఆగమరూపవిచారిణి= వేదముయొక్క స్వరూపమును - వేదములచేత స్వస్వరూపమును విచారించు నతఁడును, అధికరణసహస్ర శిక్షితవిపక్షే=న్యాయములయొక్క - అధిక యుద్ధములయొక్క సహస్రముచేత శిక్షింపఁబడిన పూర్వపక్షములు - శత్రువులు కలుగునతఁడునైన, జైమినియోగిని=జైమినిముని యనెడు, స్వామిన్యపి=స్వామియందును, అస్మదీయం = మనదియగు, ఇదం= ఈ, హృదయం=మనస్సు, రజ్యతి=రంజింపఁ బడుచున్నది.

తా. వేదములచేత తనస్వరూప విచారముకలిగి యుద్ధములచేత శత్రువులను శిక్షించు భగవంతునియందువలె, వేదముల స్వరూప విచారముకలిగి,

న్యాయములచేత శాస్త్రాంతర పూర్వపక్షములను దిద్దెడు నీజైమినిమునియందు నామనస్సు రంజింపఁ బడుచున్నది.

తే. ఆగమ స్వరూప విచారి కై యగుట కతన
నధికరణశిక్షిత విపక్షుఁ డగుట కతన
స్వామియందున చందానఁ జైమినిముని
యందు రంజించు నీ నాదు డెంద మెపుడు.

కించ—చుఱియు.

వృ॥ శబరకుమారిల గురవో మండన భవదేవ పార్థసారథయః
అన్యేపి విశ్వమాన్యా జయంతిసంత్రాయమాణ తంత్రాస్తే॥

అ. సంత్రాయమాణతంత్రాః = కాపాడఁబడుచుండు మీమాంసాశాస్త్రము కలవారైన, తే=ఆ, శబరకుమారిలగురవః = శబరుఁడు, కుమారిలుఁడు, గురుడు; మండనభవదేవపార్థసారథయః = మండనుఁడు, భవదేవుఁడు, పార్థసారథి; అన్యేపి=ఇతరులును, విశ్వమాన్యాః = ప్రపంచములో సన్మానింపఁదగినవారై, జయంతి=సర్వోత్కృష్టులుగనున్నారు.

తా. శబర కుమారిల ప్రభాకర మండన భవదేవ పార్థసారథులును, మఱియితరులును ఈ మీమాంసాశాస్త్రమును గాపాడుకొనువారు.

తే. పరఁగుశబరుఁడన్ మీమాంస భాష్యకర్త
యట్టులనె కుమారిలుఁడను భట్టఘనుఁడు
నుఱి ప్రభాకరుఁ డనునట్టి మహితగురుఁడు
నాద్యులగుతంత్రసంత్రాత లతిశయింత్రు.

ఇ. శబరుఁడు=మీమాంసాసూత్రభాష్యకర్త.
కుమారిలుఁడు=భట్టుఁడు—తంత్రవార్తికమీమాంసాకర్త.
గురువు=ప్రభాకరగురువు—జైమినిసూత్రమీమాంసావ్యాఖ్యాత.
మండనుఁడు = శంకరగురుప్రతివాది—నైష్కర్మ్యసిద్ధికర్త, వార్తికమీమాంసాకారుడు.

పార్థసారథి=శాస్త్రదీపికా మీమాంసాకారుఁడు.

## వైయాకరణవర్ణనము.

ఇ. వైయాకరణులు=వ్యాకరణవేత్తలు, వ్యాకరణము=ప్రకృతిప్రాతిపదిక ప్రత్యయానుబంధ పురుష విభక్తి వచనాదులతోను, పరస్మైపద్యాత్మనే పది కర్త కర్మాదులతోను వ్యస్తపద సమాసపద వాక్యములయందు అపభ్రంశము లు లేక సంస్కరణను చేసెడిశాస్త్రిగు.

కృశానుః—కృశానువు.

గ॥ అస్త్వత్ర విమాన మన్యతో గమయైక పార్శ్వతో దృష్ట్వాసో
పహాసమ్ ॥ 900

వ. అవుఁగాకయని విమాన మవలికింబఱపి పార్శ్వమునలోకించి
యపహాసము కావించి.

వృ॥ టిడ్ఢాణఞ్ ద్వయస, చ్ఛటూ, జసిజసో స్త్రిప్ తస్ ఝసిప్ థస్ థమిప్
నస్ మస్తా, నచిచ, ష్టునాష్టు, రతఇఞ్, శశ్ఛో ఽట్యచో ఽన్యాదిటి,
లోపో వ్యోర్వలి, వృద్ధిరేచి, యచిభం, దాధాఘ్వదా, మ్నాజ్ఝలా,
విత్యేతేదివసాన్నయంతికతిచి చ్ఛబ్దాః పఠంతిఃకటూః ॥

అ. టిడ్ఢాణఞ్ ద్వయసజ్ దఘ్నఞ్ మాత్రచ్ తయప్ ఠక్ ఠఞ్ కఞ్ క్వరప్ జీప్=టిత్—కురుచరీ=కురుదేశచరీ, ఢ—సౌపర్ణేయీ= సుపర్ణాపత్యస్త్రీ, అణ్=ఐంద్రీ = ఇంద్రాపత్యస్త్రీ, అఞ్—ఔత్సీ = ఉత్సాపత్యస్త్రీ, ద్వయసజ్ - ఊరుద్వయసీ, దఘ్నఞ్ - ఊరుదఘ్నీ=ఊరువఱకు జలముకలది, మాత్రచ్ - ఊరుమాత్రీ=తయప్ - పంచతయీ = పంచకం, ఠక్ - ఆక్షికీ= పాచికలాడుస్త్రీ, ఠఞ్ - లావణికీ=ఉప్పమ్ముస్త్రీ, కఞ్ - తాదృశీ=అట్టిస్త్రీ, క్వరప్ - ఇత్వరీ=పోవుస్త్రీ.

చుటూ=ప్రత్యయాది చవర్గటవర్గములు ఇత్సంజ్ఞకములు, రామా - జస్ప్రత్యయాదిజకారముతో అస్ప్రత్యయమాత్రమే.

జసిజసోశ్ఛ=ఏఙ్ పై జసిజసుల అచ్చుపరమైనపుడు పూర్వరూపమే కాదేశ మగును -

తిప్ తస్ ఝిసిప్ థస్ థమిప్ వస్ మస్ త ఆతాంఝ థాస్ ఆథాధ్వమిడ్వహి మహిఙ్-కరోతిపురుతే అనునిట్టివి పరస్మైపద్యాత్మనే పదిధాతువులలో వచ్చు ప్రత్యయములు.

అనచిన=అచ్చుకు పరమైన హాకారము తక్క తక్కినహల్లులకు అచ్చు పరముకానపుడు ద్విత్వము వికల్పము—సుధ్+ధ్+య్+ఉపాస్యః - సుధ్ధ్యుపాస్యః.

ష్టునాష్టుః=సవర్గతవర్గములకు షవర్గటవర్గములు పరమైనపుడు షవర్గటవర్గములే ఆదేశములు—రామస్ షష్ఠః=రామష్షష్ఠః, తత్ టీకా=తట్టీకా.

అతఇఞ్ = అదంతప్రాతిపదికమునకు అపత్యార్థమందు ఇఞ్ ప్రత్యయమాదేశము - దశరథాపత్యంపుమాన్ = దాశరథిః.

శశ్ఛోటి=వర్గప్రథమ ద్వితీయతృతీయ చతుర్థాక్షరములకు పరమైనశవర్ణమునకు అచ్చుగాని యవరలుగాని పరమైనపుడు ఛవర్ణమాదేశము - వాక్ శాంతిః= వాక్ఛాంతిః.

అచోంత్యాదిటి=అచ్చులలో అంత్యాచ్చు ఆదిగాఁగలది టిసంజ్ఞకము. మనస్ ఈషా=మనీషా అనుచో అస్ టిసంజ్ఞకము గనుక పరరూప మేకాదేశము మొదలైనవి.

లోపో వ్యోర్వలి = వకార యకారములకు యకారము తక్క తక్కిన హల్లు ఆదినిగల ప్రత్యయము పరమైనపుడు లోపము - జానకీజాని అనుచో జాయ్ యకారమునకు నిఙ్ పరమైనపుడు యకారలోపము మొదలైనవి.

వృద్ధిరేచి=అఆ లకు ఏ ఓ ఐ ఔ లు పరమైనపుడు వృద్ధి ఏకాదేశము-శుద్ధ ఏకాదశి=శుద్ధైకాదశి.

యచిభం = అజ్యకారము లాదిగాఁగల ప్రత్యయము స్వాదియై కబంతము లైన ప్రత్యయములలో నొకటియై అసర్వనామస్థానమై యున్నయెడల ఆ అజ్యకారాది ప్రత్యయమునకు ముందటిది భసంజ్ఞకము.

దాధాఘ్వదాప్=దాప్ దైప్ తక్క తక్కిన దారూపధారూప ధాతువులు ఘుసంజ్ఞకములు.

నాజ్ఝలౌ=నఆఅచ్ హలౌ - ఆ అను ఉపసర్గకును అచ్చులకును హల్లులకును సావర్ణ్యములేదు.

ఇతి=ఇట్లని, ఏతే = ఈవైయాకరణులు, కటూన్ = కఠినములైన, కతిచిత్ =కొన్ని, శబ్దాన్ =శబ్దములను, పఠంతః=పఠించుచు, దివసాన్ = దినములను, నయంతి=కడపుచున్నారు.

తే. పాణినిప్రోక్తములను టిసంజ్ఞాణఘాది
సూత్రములఁ జెప్పుచెప్పుడు శ్రోత్రపుట వి
ఘాటకముగాఁగ నుద్భట పటుకఠోర
మటు కఠోరరవంబుమై నార్భటింత్రు.

వృ॥ ఝషోఽంతః, శశ్ఛోటి, శేషోధ్యసఖి, ససజుషోరు, ర్వి రామా
ఽవసానమ్ । ఛేచేతి వ్యర్థవాచ స్సదసియుదిసతాం శాబ్దికా
శ్చేద్బుధాస్స్యుః । కింత్వైరేవాపరాద్ధం నటవిటగణికానృత్య
హస్తప్రచారైః । తోధీతోధీతధితి త్తకిట తకిటధిక్ తాహ
ధిక్ తత్తకారైః॥

అ. ఇతి = పైసూత్రములు ఇటని, సతాం = సత్పురుషులయొక్క, సదసి = సభలో, వ్యర్థవాచోయది = వ్యర్థవాక్కు కలవారైనయెడల, శాబ్దికాః=ఈవైయాకరణులు,బుధాః=జ్ఞానులు,స్యుశ్చేత్ =ఐరేని, నటవిటగణికానృత్యహస్తప్రచారైః=ఆటకాండ్రయొక్కయు విటకాండ్రయొక్కయు భోగమువాండ్రయొక్కయు ఆటపాటలయందలి చేయివాపుటలతో తోధీతోధీ తధితి త్త కిటతకిటధిక్ తాహధిక్ తత్తకారైః=అను నీతకారధ్వనులచేత, తైరేవ = వారిచేత నే, అపరాద్ధం = అపరాధము చేయఁబడినది, కిం=ఏమి ?

తా. ఆటగాండ్రుగాని, విటకాండ్రుగాని భోగమువాండ్రుగాని చేతులుతట్టి తాళాలువేసినట్లు ఈ వైయాకరణులు ఝషోంతః మొదలైన సూత్రములు సభలో పఠించుచుందురుగాని,లేక జ్ఞానవంతులైనయెడల అపరాధ మేమియులేదు.

ఆ. అటులఁ జటుల శబ్దపటల ముద్ఘటించు

నంత, శాబ్దికులును నధికులేని
తకిట తకిట ధిక్త తాహిధి క్తత్తితా
మ్మనెడునటులు విటులు నధికులేక ?

కించ—మఱియు.

వృ॥ సూత్రైః పాణినికీర్తితై ర్బహుతరై ర్నిష్పాద్య శబ్దవ్రజమ్
వైకుంఠ స్తవ మక్షమా రచయితుం వంధ్యశ్రమాశ్శాబ్దికాః
పక్త్వాన్నం మహతా శ్రమేణవివిధా పూపాగ్ర్యసూపాన్వితమ్
మందాగ్నీ ననురుంధతే మితబలా నాఘ్రాతు మప్యక్షమాన్॥

అ. పాణినికీర్తితైః = పాణినిముని చేత కీర్తింపఁబడినవియై, బహుతరైః = అనేకవిధములైన, సూత్రైః = సూత్రములచేత, శబ్దావలిం = శబ్దసమూహమును, నిష్పాద్య = కలిగించి, వంధ్యశ్రమాః = వ్యర్థశ్రమలైన, శాబ్దికాః = వైయాకరణులు, వైకుంఠ స్తవం = శ్రీవిష్ణుస్తోత్రమును, రచయితుం = చేయుటకు, అక్షమాః = అసమర్థులై, మహతా = అత్యంతమైన, శ్రమేణ = శ్రమతో, వివిధ-అపూప - అగ్ర్యసూప - అన్వితం = అనేక విధములైన - అప్పములతోను - మేలైన పప్పులోను - కూడుకొన్న, అన్నం = అన్నమును, పక్త్వా = వండి, మితబలాన్ = కొద్దిబలము కలవారై, ఆఘ్రాతుమపి = వాసన చూచుటకైనను, అక్షమాన్ = శక్తిలేనివారైన, మందాగ్నీన్ = ఆఁకలిలేనివారిని, అనురుంధతే = అనుసరించున్నవారు,

తా. ఈ వైయాకరణులు ఆ పాణినీయ సూత్రములలో వ్యర్థశ్రమపడియైనను; విష్ణు వినుతిని విరచింపలేనివారై పప్పులోను అప్పములతోను అన్నము వండి అతిబలహీనులై అవియే లేనివారిని అనుసరించువారివలె నున్నవారు.

చ. సారిదిని బాణినీయముల సూత్రములంబదముల్ రచించియున్
సరసిజనేత్రుసంస్తవము సల్పసమర్థులు కాని శాబ్దికుల్
కరమువృథాశ్రముల్మఱిసుగంధగసాంధమపూపసూపముల్
విరివిఁ బచించి జీర్ణమయి వీక్షినవారికిఁ బెట్టువారెకా ?

టి. సుగంధరసాంధము = సువాసనగల పొంగలి మొదలైన అన్నమును.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ మహ్యాభరణేషు వైయాకరణేషు భవాన్ మాస్మ కలయతు
దోషకలమ్ ॥ 904

వ. ఈధరణీతలాభరణులైన వైయాకరణులపై నీవుఁ శకలమే
నిదోష మారోపింపకుము?

యతః—ఏలంటేని.

వృ॥ కృతదురిత నిరాకరణం వ్యాకరణం చతురధీ రధీయానః
బుధజనగణనావసరే కనిష్ఠకామేవచైష రంజయతి ॥ 905

అ. ఏషఃచ = ఈ వైయాకరణుఁడును, చతురధీః=సమర్థమైన బుద్ధికలవాఁడై, కృతదురిత నిరాకరణం = చేయఁబడిన దోషనివారణము కలిగిన, వ్యాకరణం = వ్యాకరణమును, అధీయానః=చదువువాఁడై, బుధజనగణనావసరే=జ్ఞానులను లెక్కచేయునప్పుడు, కనిష్ఠికామేవ=కడపటి వ్రేలినే, రంజయతి=రంజలఁజేయుచున్నాఁడు.

తా. ఈ వైయాకరణుఁడు వ్యాకరణము వేదాంగమగుటచేత దీని నధ్యయనము చేసి దోషరహితుండై బుధజనుల గణనములో కడపటి వ్రేలినే మొదటి వ్రేలుగాఁ జేసికొని దాని రంజిల్లఁజేయుచున్నవాఁడు.

క. దురితనిరాకృతి వ్యాకృతి
కరమధ్యయనంబుచేసి కడుఁజతురుండై
యరయఁగ బుధగణనంబున
నిరతము రంజించుచుండు గనిష్ఠిక నుండున్.

టి. ఏదియైన లెక్కపెట్టునప్పుడు చేతియైదువ్రేళ్లలో చిన్నదైన కడపటి వ్రేలినే మొదటి లెక్కకు మొదలుపెట్టుకొనుట యందటికి వాడుక గనుక కనిష్ఠికాంగుళమే ప్రథమాంగుళమయ్యె.

వృ॥ పాతంజలే విప్లుపదాపకారాయాః

పాతం జలే చాపిచయేఽవగాహమ్
ఆచక్షతే శుద్ధిద మాప్రసూతే
రాచక్షతే రక్తి మధోక్షజేచ ॥ 906

అ. యే=ఎవరు వైయాకరణులో వారు, పాతంజలే = పతంజలి భాష్యమందు, విష్ణుపదాపగాయాః = విష్ణుపదియైన గంగయొక్క, జలేచ =జలమందును, ఇత్థం=ఇట్లు, అధోక్షజేపిచ = విష్ణువునందును, పాతం=ప్రవేశమును, అవగాహం=స్నానమును, రక్తిం=మనోనురాగమును, అప్రసూతేః = జన్మము మొదలుకొని, ఆక్షతేశ్చ=మరణము వఱకును, శుద్ధిదం=పరిశుద్ధిప్రదముగా, ఆచక్షతే=చెప్పుచున్నారు. ఇందు క్రమాలంకారము.

తా. పతంజలి భాష్యపఠనమును, గంగాస్నానమును, విష్ణుభక్తియును ఈ 3 ను పుట్టినది మొదలు మరణమువఱకు పరిశుద్ధిప్రదము అనిచెప్పుచుందురు.

తే. ఆపతంజలి శబ్ద భాష్యంబునందు
విష్ణుపది నది యందు నవిష్ణునందుఁ
గరణి నవగాహ మతి శుద్ధికర మటంచు
నెంతు రాజన్మమా మరణాంతమనని.

ఇ. పతంజలి=ఇతఁడు శబ్ద భాష్యకర్తయు, యోగశాస్త్ర ప్రవర్తకుఁడును, ఆదిశేషుని యంశావతారము నైన యతఁడు.

అవగాహము = మనః ప్రవేశమును, జలప్రవేశమును, జ్ఞానప్రవేశమును అర్థములు.

అపిచ—మఱియు.

వృ॥ నృణామనభ్యస్త ఫణాభృదీశ
గిరాం దురాపా బుధరాజగోష్ఠీ
అబుద్ధచాపశ్రుతి పద్ధతీనాం
యుద్ధస్థలే



907

అ. అనభ్యస్త - ఫణాభృదీశ-గిరాం=అభ్యసింపఁబడని-శేషాంశమైన పతంజలియొక్క - భాష్యవాక్కులుగల, నృణాం=బుధజనులయొక్క, బుధరాజగోష్ఠీ=పండితశ్రేష్ఠులసభ, అబుద్ధచాప శ్రుతిపద్ధతీనాం = తెలియఁబడని ధనుర్వేదముయొక్క మార్గము గలవారికి, ఉద్యతయోధ సార్థా = పైకిలేఁగిన యుద్ధవీరుల సమూహముగల, యుద్ధక్షమేవ = యుద్ధభూమివలె, దురాపా = చేరఁగూడనిది.

తా. ధనుర్వేదము తెలియనివారికి యుద్ధవీరులుగల యుద్ధభూమివలె పతంజలి భాష్యము చదువనివారికి పండితగోష్ఠి ప్రవేశింపందగినదియే కాదు.

క. అనధీతివ్యాకరణున
కు నధికకష్టంబు బుధుల గోష్ఠిఁజొఱంగా
ననధిగత ధనుర్వేదుల
కును యోధ నిరుద్ధయుద్ధ కుంభినిఁబోలెన్.

తథాహి—అశ్లోక దా?

వృ॥ అస్వీకృతవ్యాకరణౌషధానా
మపాటవం వాచి సుగాఢమాస్తే
కస్మింశ్చిదుక్తేతు పదే కథంచిత్
స్వైరం వపుః స్విద్యతి వేపతేచ ॥ 908

అ. అస్వీకృత వ్యాకరణౌషధానాం - అంగీకరింపఁబడని వ్యాకరణమనెడి ఔషధము కలవారికి, వాచి=వాక్కున, సుగాఢం=అత్యధికమైన, అపాటవం= అశక్తి, ఆస్తే=ఉన్నది; కస్మింశ్చిత్ = ఒకానొక, పదేతు = పదమైతేనో, ఉక్తేసతి=పలుకబడుచుండఁగా, కథంచిత్=ఎట్లైన, వపుః=శరీరము, స్వైరం స్వేచ్ఛగా, స్విద్యతి=చెమర్చుచున్నది, వేపతేచ=వణుకుచునున్నది.

తా. ఔషధము తీసికోనివానికివలె వ్యాకరణము చదువనివానికి నోటికి మాటకు శక్తిలేక, ఒకమాటైనఁ బలికినచో ఒడలువడఁకి చెమటపట్టుచుండును.

క. వ్యాకరణౌషధ మెప్పుడే

స్వీకరణము సేయనతని ౯ స్థిరతరవాక్కుల౯
దేకెత్తిపటిమదక్కుల౯
వాకొనఁబల్కొ-క్కటి, మెయి ౯ వణఁకుఁ జెమర్చున్.

కృశానుః—కృశానుఁడు.

సాక్షేపమ్—ఆక్షేపించి.

గ॥ కథంసఖే ! శతకోటిపాణి నిగదితాదపిపాణిని గదితమేవ వ్యా
కరణమాద్రియతే ? 909

వ. సఖా ! శతకోటిపాణి నిగదితమైన యా వ్యాకరణముకంటెఁ
బాణిని గదితమైన వ్యాకరణమె యాదరింపఁబడు టెట్లు?

టి, శతకోటిపాణి నిగదితము = వజ్రాయుధపాణియైన యింద్రునిచేఁ జెప్ప
బడినది. అదియే ఐంద్రవ్యాకరణము.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ పాణినీయమేవహి వ్యాకరణం ప్రాయేణానౌపాధికప్రవిశద
ప్రతీతికారణమితి తత్రైవాదరః పండితానామ్॥ 910

వ. పాణినీయ వ్యాకరణమే పరకీయ వ్యాకరణాపేక్షలేక ప్రాయ
శః ప్రవిశదమై నిర్దోషమైన శబ్దతత్వ ప్రతీతియందసాధార
ణకారణమని యఖిలపండితులకు నందే యాదరణము.

తథాహి—అశ్లేకదా?

వృ॥ సూత్రం పాణినిబద్ధం కంఠేకలయ౯ సముద్వహతి సుదృశమ్
వర్ణాదీనాం ధర్మా౯ బుద్ధ్వా విధివద్బుధః ప్రయుంక్తేஉసౌ॥

ఆ. పాణినిబద్ధం=హస్తముచేత కట్టఁబడినట్టి - పాణిని మునిచేత కట్టఁబడి
నట్టి, సూత్రం=మంగళ సూత్రమును - వ్యాకరణ సూత్రమును, కంఠే=కంఠ
మందు - వాక్కునందు, కలయ౯ = చేర్చుచు, సుదృశం = స్త్రీని-సుజ్ఞానము
ను, సముద్వహతి = వివాహముచేసికొనుచున్నాఁడు - చక్కఁగ ధరించుచు

న్నాఁడు. అసౌ = ఈ, బుధః = పండితుఁడు, వర్ణాదీనాం = వర్ణాశ్రమాదుల యు - అక్షర పదాదులయు, ధర్మాన్ = అధ్యయనాదులను - హ్రస్వదీర్ఘపుం లింగాదులను, బుద్ధ్వా = తెలిసికొని, విధివత్ = శాస్త్రప్రకారము, ప్రయుంక్తే = ప్రయోగించుచున్నవాఁడు.

తా. ఈవ్యాకరణపండితుఁడు తన చేతులార స్త్రీకి మంగళసూత్రము కట్టి వివాహముచేసికొని వర్ణాశ్రమధర్మములు నడుచుకొనునట్టుగానే, ఆ పాణినీయవ్యాకరణసూత్రములు పఠించి మంచిజ్ఞానము సంపాదించుకొని అక్షరపద లింగాదులను దెలిసికొని వానిని ప్రయోగించుకొనుచుండును.

ఉ. పాణిని బద్ధసూత్ర మనునిబంధితఁ గంఠము సేర్చి కూర్చి తా
జాణయవందనంత సుదృశీశ్ఞనహీయించుచు వర్ణముఖ్యమా
వాని ప్రశస్తధర్మములనివార కెఱింగి యథావిధిం బ్రయో
గాన సమర్థుఁడౌచు నెనఁగిగండే బుధుండు జగానఁగానఁగాన్.

## వైదికవర్ణనము.

ఇ. వైదికులు=వేదాధ్యయనాధ్యాపన తద్విహితాచార ధర్మప్రవర్తకులు. వేదములు=ఋగ్యజుస్సామాథర్వణములు. తదంగములు=శిక్షావ్యాకరణఛందో నిరుక్తి జ్యోతిషకల్పములు.

కృశానుః—కృశానువు.

గ॥ (అస్తు ఇతి విమాన మన్యతశ్చాలయన్ పురోవలోక్య) సఖే!
పశ్య? ఛాందసాన్ ధనచాపలేన విక్రీయమాణామ్నాయాన్॥

వ. (అవుఁగాకని విమానం బన్యత్రకుం బఱచుచుం బురోభాగం
బవలోకించి) సఖా! కనుము? ధనచాపలముచేత నే శ్రుతుల
భృతులకై విక్రయించు నీ కేవలచ్ఛాందసులను.

వృ॥ అఃకష్ట మప్రహృష్టా శ్శిష్టా అపి విత్తచాపలావిష్టాః।
అధ్యాపయంతి వేదా నాదాయ చిరాయ మాసిమాసిభృతిమ్॥

అ. విత్తచాప లావిష్టాః=ధనచాపల్యమున ప్రవేశించినవారై, అప్రహృష్టాః సంతోషించనివారగుచు, శిష్టా అపి = పెద్దలైనను; ఛాందసాః = ఈ వైదికులు, మాసిమాసి=ప్రతిమాసమును, భృతిం = సంబళమును, ఆదాయ=తీసికొని, వేదాన్=వేదములను, చిరాయ = బహుకాలమునుండి, అధ్యాపయంతి=అధ్యయనము చేయించుచున్నారు. అః కష్టం=అయ్యో ? కష్టము ?

తా. ఈ వైదికులు తాము పెద్దలయ్యును,ధన సంపాదనమందు చాపల్యముతో బ్రతిమాసము సంబళము తీసికొనుచు వారివారికి అధ్యయనము చేయించుచున్నారు.

తే. అకట? శిష్టులు నప్రహృష్టాత్ములగుచు
విత్తచాపలావిష్టులు వేదములను
శిష్యు లధ్యయనము చేయఁ జేయుచుంద్రు
మాసమాసము భృతిఁగాంచు మానసాన.

విశ్వావసుః—విశ్వావసువు.

వయస్య ! మైవంవాదీః— చెలికాఁడ ? పలుకాడకుము?

వృ॥ నాధ్యాపయిష్యన్నిగమాన్ శ్రమేణో
పాధ్యాయలోకా యది శిష్యవర్గాన్
నిర్వేదవాదం కిల నిర్వితాన
మూర్వీతలం హంత ? తదాభవిష్యత్ ॥ 914

అ. ఉపాధ్యాయలోకాః = ఉపాధ్యాయ జనులు, శిష్యవర్గాన్ =శిష్యసమూహములను, నిగమాన్ = వేదములను, శ్రమేణ=కష్టముతో, నాధ్యాపయిష్యన్ యది=అధ్యయనముచేయించక పోయిరేని, తదా=అప్పుడు, ఉర్వీతలం= భూప్రదేశము, నిర్వేదవాదం=వేదవాదమే లేనిదిగాను, నిర్వితానం=యజ్ఞము ను లేనిదిగాను, అభవిష్యత్ కిల = అగునుగదా? హంత=అయ్యో?

తా. ఈ భూమండలములో ఉపాధ్యాయులు శిష్యులకు వేదాధ్యయనము చేయించనియెడల, ఎక్కడఁగాని వేదమేలేక దేవపూజయే లేక పోవును.

తే. అలసి శిష్యులకాఁగ మాకధ్యాపకులుగ
నొగి నుపాధ్యాయులే లేక యుండిరేని
నుర్వి నిర్వేదవాదము నిర్విశాన
మగును నపుడెట్లు కడతేఱునగును నకట?

కృశానుః — కృశానుఁడు.

గ॥ విరుద్ధమిదం భాషితం యద్వేదాపాయేసతి నయజ్ఞాభ్యుదయ
స్స్యాదితి ॥ 915

వ. ఆమ్నాయముల కపాయము కలిగినను, యజ్ఞముల కభ్యు
దయము కలుగదనునది విరుద్ధ వచనముగ నున్నయది.

విశ్వావసుః — విశ్వావసువు.

గ॥ అవగచ్ఛతాన దేత దవిరుద్ధమేవ ॥

వ. ఇది యవిరుద్ధవచనమేయని యనుకొనుము?

శ్లో॥ నామ్నాయజ్ఞో మఖేయస్మిన్ యజమానతయాస్థితః
తత్సమాగమతస్సోఽపి నామ్నాయజ్ఞో భవేన్నకిమ్ ॥ 916

అ. యస్మిన్=ఏ, మఖే=యజ్ఞమునందు, నామ్నాయజ్ఞః=ఆమ్నాయజ్ఞుఁడు-వేదవేత్తకానివాఁడు, యజమానతయా=యజ్ఞము చేయువాఁడగుటతో, స్థితః=ఉండువాఁడగునో ? తత్సమాగమతః=ఆయజమానునిరాకచేత, సోఽపియజ్ఞః=అయజ్ఞముకూడ, నామ్నాయజ్ఞః= ఆమ్నాయజ్ఞుఁడులేనిదే - పేరుమాత్రముచేతనే యజ్ఞము, నభవేత్కిమ్=కాదుకదా ?

తా. వేదవేత్తకాని యాజ్ఞికుఁడులేని యజ్ఞము యజ్ఞమే యనఁబడునది కాదుకదా ?

క. ఆమ్నాయజ్ఞుని యజ్ఞమె
సన్మాన్యమగున్ సుయజ్ఞసంస్థితిఁ బ్రాజ్ఞుల్
"నామ్నాయజ్ఞోయత్రస
నామ్నాయజ్ఞో" యటంచు నలుఁగడఁబలుకన్.

టి. ఆమ్నాయజ్ఞః=వేదవేత్త, యత్ర=ఏయజ్ఞమందు, న=లేదో ? సయజ్ఞః=ఆయజ్ఞము, నామ్నా (ఏవ) పేరుమాత్రముచేత నే.

## రాజసేవకవర్ణనము.

రాజసేవకులు=అధికారులయొద్ద నుద్యోగస్థులు.

కృశానుః —కృశానుఁడు.

గ॥ పునరస్యతో దృష్ట్వాసోపహాసమ్ పశ్య? ఏతాః రాజసేవినః
పరిత్యక్తలోకద్వయసౌఖ్యాః స్పష్టమూర్ఖాః పురుషాః॥

వ. మఱలమఱొక్కప్రక్కఁగాంచి యుపహాసముంగావించి ఈ రాజసేవకులు ఉభయలోకసౌఖ్యములుః విడిచి మూర్ఖులై యున్నారు.

వృ॥ నైషాంసంధ్యా భవతిసకలా నాచ్యుతార్చాఽపిసాంగా
నస్వేకాలే హవననియమో నాపివేదార్థచింతా।
నక్షుద్వేళానియత మశనం నాపినిద్రావకాశః
నద్వాలోకావపి తనుభృతాం రాజసేవాపరాణామ్॥ 918

అ. ఏషాం=ఈ, రాజసేవాపరాణాం=రాజసేవయందు ఆసక్తులైన, తనుభృతాం=మనుజులకు, సంధ్యా= సంధ్యానుష్ఠానము, సకలా= అంతయు, నభవతి=లేదు; అచ్యుతార్చాపి=భగవదర్చనయు,సాంగా=సాంగముగ, నభవతి=లేదు; స్వేకాలే=స్వకాలములో, హవననియమః= ఔపాసననియమము, నభవతి=లేదు; వేదార్థచింతా=వేదార్థములను చింతించుట, నభవతి=లేదు; క్షుత్ వేళానియతం = ఆఁకలివేళలో, నియమింపఁబడిన, అశనం=ఆహారము, నభవతి=లేదు; నిద్రావకాశోఽపి= నిద్రకుసమయమును, నభవతి=లేదు; ద్వాలోకావపి= రెండులోకములుకూడ, నభవతః=లేవు.

తా. ఈరాజులయొద్ద కొలువుచేయువారికి స్నానసంధ్యలును, దేవతార్చనదేవోపాసనములును, వేదాధ్యయన వేదార్థ విచారణలును లేకున్నను; ఆఁ

కలివేళకు అన్నమును నిద్రవేళకు అవకాశమును లేకుండుట ఇహలోకపరలోక సుఖము లనుటయే లేకయున్నవి.

సీ. సంధ్యాద్యనుష్ఠాన । సాకల్యమును లేదు
సారసాక్షసమర్చ । సరిగ లేదు
సమయంబున హూపన । నియమంబునుగ లేదు
నిగమార్థచింతన । న్నిరతి లేదు
అతిథులకాతిథే । యంబన్నదియు లేదు
సతులతో సుతులతో । జనవు లేదు
ఆఁకలివేళల । నాహారమును లేదు
నిదుర వేళలమంచి । నిదుర లేదు.

తే. లేదు సుఖ మైహికముగాని । లేదు మీఁద
సుఖము నాముష్మికముగాని । సుంత యేని
రాజరాజి నిషేవక । ప్రజలద్విజుల
జీవనముకంటె? యాకాశ । జీవనంబు.

విశ్వావసుః—విశ్వావసువు.

గ॥ దుస్సహైషా బహుజన పోషకాణా మేషాం నిందా॥

వ. ఈ బహుజన పోషకులగు రాజసేవకుల విషయమైన దూషణము దుస్సహము. 919

వృ॥ అశుభపుషి కలావ ప్యప్రమత్తాస్స్వధర్మా
దనుదినముపకారా నాచరంతో బుధానామ్ ।
బహుజనపరిపుష్టా బద్ధదీక్షా స్త ఏతే
తనుసుఖమపిహిత్వా తన్వతే రాజసేవామ్॥ 920

అ. అశుభపుషి = అశుభకార్యములను వృద్ధిచేయునట్టి, కలావపి = కలి యుగమునందు, స్వధర్మాత్ = స్వధర్మకార్యములవలన, అప్రమత్తాః = మత్తు

లుకానివారై, బహుజనపరిపుష్టౌ = బహుజనుల పోషణమందు, బద్ధదీక్షాః= కట్టఁబడిన దీక్షకలవారై, తే = ఆ, ఏతే = వీరు, అనుదినం = ప్రతిదినమును, బుధానాం = పెద్దలకు, ఉపకారాన్ = ఉపకారములను, ఆచరంతః= నడపువారై, తనుసుఖమపి = శరీరసౌఖ్యమును కూడ, హిత్వా = విడిచి, రాజసేవాం=రాజులకొలువును, తన్వతే = చేయుచున్నారు.

తా. దుష్కృతులను పెంచునట్టి యీకలియుగములోఁగూడ తమతమ ధర్మములలో ప్రమాదపడక, అనేకులను కాపాడుటయందు అక్కఱ కలిగి, పెద్దలకుపకారముచేయుటకై వీరు తమసౌఖ్యమును గూడఁ జూడక, రాజులయెడలఁ గొలువులోనే యుందురు.

చ. కలికలుషంబులుం గలుగు కాలమె యైనను, నప్రమత్తులై
కలిగెడి ధర్మముల్విడక కాంచిబుధోప కృతుల్చరింతు,రి
ట్టుల జనపోషణార్థమె పటుక్షమ దీక్షవహింతు రీరు, తా
తలుములు స్వీయసౌఖ్యమును నెనందరు, కొందురు రాజసేవయే

దివ్యక్షేత్రాదివర్ణనోపసంహారము.

---

గ॥ సర్వాణి దివ్యక్షేత్రాణ్యవలోక్య సాంజలిబంధం, కృశానుముద్దిశ్య॥ 921

వ. అట్లా సర్వదివ్యక్షేత్రము నొక్కమొగిన కాంచి యంజలి కావించి తోన కృశాను నుద్దేశించి.

వృ॥ గంగా రఘూపరిచితాంఘ్రి జగన్నిదానమ్
రంగాదిధామసు చిరాత్కృత సన్నిధానమ్
విశ్వంస్వతో విశదమేవ విలోకమానమ్
వందస్వ వస్తు వరదార్తిహరాభిధానమ్॥ 922

అ. రంగాదిధామసు = శ్రీరంగము మొదలైన దివ్యస్థలములయందు, చిరాత్ = బహుకాలముగా, కృతసన్నిధానం = కల్పింపఁబడిన సన్నిధికలదియు, విశ్వం = ప్రపంచమును, స్వతః = స్వభావముననే, విశదం=స్పష్టముగా,

విలోకమానం = చూచుచుండునదియు, గంగా ఝురీపరిచి తాంఘ్రి = గంగా ప్రవాహము చేత వాడుకపడిన పాదములుకలదియు, వరద-ఆర్తిహర-అభిధానం=వరములిచ్చునవియు - కష్టములను హరించునవియునైన - నామధేయములు కలదియు, జగన్నిదానం = లోకములకు ఆదికారణమైనదియు నైన, వస్తు= పరమవస్తువును, వందస్వ = వందనము చేయుమ?

తా. శ్రీరంగాది దివ్యదేశములందుండి ప్రపంచమునంతయుఁ గటాక్షించుచు గంగానది ప్రవహించిన శ్రీపాదములతోను, ఆశ్రితుల దోషములు తొల్చి వరము లిచ్చుచు, సకలలోక కారణమై పరమవస్తువైన యా శ్రీరంగనాథులను నమస్కారము చేయుమా?

శా. రంగాద్యంబగు దివ్యదేశముల శ్రీ శ్రీరంగాధిపా ద్యాఖ్యలన్ రంగారంగల దివ్యమూర్తి చెలువా శ్రీరం గాంచి గంగాఝురీ సంగాంఘ్రిద్వయుఁడై సమస్తముఁ బ్రపంచింబున్ సమీక్షించు శ్రీ,శుంగాంక్షింపు? నమస్కరింపు?వరదశ్చోభాయమా నాహ్వాయున్.

కృశానుః—కృశానువు.

గ॥ నను? అత్ర తృతీయచరణార్థో న మహ్యం రోచతే॥ 923

వ. సరేకాని? దీని మూడవపాదము నర్థము నాకేమియుఁ రుచియించునది కాదయ్యె.

శ్లో॥ విలోచనే విభోర్యస్య విఖ్యాతే పుష్పవత్తయా
సాక్షాత్కర్తుం స్ఫుటం సర్వం స శక్నోతి కథంహరిః॥ 924

అ. యస్య=ఏ, విభోః=ప్రభువుయొక్క, విలోచనే = కన్నులు, పుష్పవత్తయా=సూర్యచంద్రులు కలవియగుటచేత, విఖ్యాతే=ప్రసిద్ధములైనవో? సహరిః=ఆవిష్ణువు, సర్వం=అంతయును, స్ఫుటం=స్పష్టముగా, సాక్షాత్కర్తుం=ప్రత్యక్షముచేసికొనుటకు, కథం=ఎట్లు, శక్నోతి=శక్తుఁడగుచున్నాఁడు?

తా. ఆ మహావిష్ణువు సూర్యచంద్రులే కన్నులుగాఁ గలిగియున్నందున అంతయును ప్రత్యక్షము చేసికొనుటకు శక్తుఁడు కాఁడా?

క. అరయ సమీక్షించెడు నే ?
పురుషోత్తముఁడుఁ బురాణ ♦ పురుషుఁడయి నిరం
తర పుష్పవదక్షుఁ డయినఁ
బరమాశ్చర్యంబె? పరఁగఁ ♦ బలికెద వెపుడున్.

విశ్వావసుః—విశ్వావసువు. 295

గ॥ సూర్యచంద్రలోచనతయా స చమత్కారం చక్రధరంస్త్వం
తే తుభ్యం నకుప్యామి॥ 926

వ. చమత్కారముతోఁ జక్రధరుఁడు చంద్రసూర్యలోచనుఁడని యుఁ బురాణపురుషుండనియుఁ బ్రణుతించు నీకు నేఁ గోపగిం చువాఁడనుగాను జుమీ!

శృణుతావదిదమ్—వినుమ? యిది.

నృ॥ శ్రేయస్తోయదసంప్రదాయరసికచ్ఛాయ స్సహాయశ్శ్రియః
చింతారత్నసపత్నవీక్షితలవశ్చేక్రీయతామాయతమ్।
యోవిశ్వేనహిగాత్రవాన్ హిమరుచాప్యుష్ణాంశునా నేత్రవాన్
సుగ్రీవేణచమిత్రవాన్ కుశలవ బ్రహ్మాదిభిః పుత్రవాన్॥ 927

అ. యః=ఏతఁడు, విశ్వేనహి=ప్రపంచములోనే, గాత్రవాన్ =శరీరముకల యతఁడో; హిమరుచా=చంద్రునితోను, ఉష్ణాంశునాపి=సూర్యునితోను, నేత్రవాన్ =కన్నులుకలయతఁడో; సుగ్రీవేణచ = సుగ్రీవునితోను, మిత్రవాన్ = స్నేహితుఁడుకలయతఁడో; కుశలవబ్రహ్మాదిభిః = కుశలవులతోను బ్రహ్మాదులతోను, పుత్రవాన్ = పుత్రులుకలయతఁడో; సః= అట్టి, తోయదసంప్రదాయ రసికచ్ఛాయః = మేఘస్వభావమందు సారస్యముగలచాయగలతఁడును, చింతారత్నసపత్న వీక్షితలవః చింతామణికి సాటియైన కటాక్షలేశముకలతఁడునైన,

శ్రియస్సహాయః = లక్ష్మీసహాయుఁడగు ఆ విష్ణువు, ఆయతం = విశేషమైన, శ్రేయః = క్షేమమును, చేక్రీయతాం=మిక్కిలి చేయుఁగాక ?

తా. సర్వప్రపంచమే శరీరమై సూర్యచంద్రులు నేత్రములై, సుగ్రీవాదులు మిత్రములై, కుశలవబ్రహ్మాదులును పుత్రులై, చింతామణివలె కోరికలిచ్చుకటాక్షము కలిగి, నీలమేఘచ్ఛాయగల యావిష్ణువు మనకు శ్రేయస్సు నిచ్చుచుండుఁగాక ?

సీ. నీలనీరదవర్ణ । నిర్ణాయకాయత
కమనీయసచ్ఛాయ । కాయుఁ డెవఁడు
నిజగుణనిజరూప । నిరతానుగుణఖని
రూపనిరూపక । శ్రీపుఁడెవఁడు
చింతామణి స్నేర్పఁ । జింతావళిందీర్ప
దక్షకటాక్షస । మీక్షుఁ డెవఁడు
ఉష్ణాంశుశీతాంశు । యుగళనేత్రపవిత్ర
లోకసచిత్రత్రి । లోకుఁడెవఁడు,

తే. వసుధ సుగ్రీవుచే మిత్ర । వంతుఁ డెవఁడు
వసుమతీజచేతఁ గళత్ర । వంతుఁ డెవఁడు
వరపితామహుచేఁ బుత్ర । వంతుఁ డెవఁడు
అతఁడు శ్రేయశ్ఛటా దాత । యగును గాత ?

ఇ. చింతారత్నము = శ్రీమహావిష్ణుప్రేరణమున దేవరాక్షసులు పాలసముద్రమున అమృతము తఱచునపుడు అందు చంద్ర లక్ష్మీ కల్పవృక్ష కౌస్తుభ మణ్యాదులతోఁ బుట్టినది.

సుగ్రీవుఁడు - విభీషణునివలె శ్రీరాములను శరణుచేసికొన్న వానరరాజు-వాలి యితనికి అన్న, హనుమంతుఁ డతనికి మంత్రి.

కుశలవులు—శ్రీరాముల పుత్రులు.

బ్రహ్మ—శ్రీమహావిష్ణువు నాభికమలమందుఁ బుట్టినతఁడు, సరస్వతిభర్త, సనక సనందన నారదాదులతండ్రి, సృష్టిస్థితిలయములలో ప్రపంచములకు సృష్టికర్త.

గ॥ సఖే! సంక్షిప్య వక్ష్యమాణం సారతమ మర్థంగృహాణ? 928

వ. సఖా! సంక్షేపరూపంబై యీ వక్ష్యమాణంబగు సారతమార్థంబు గ్రహింపుము ?

వృ॥ యామున తీర్థాశ్రమిణౌ రామానుజముని ర్ముకుందశ్చ
ఆద్యంత్రివేణుధర మధిక మన్య మంతాద్య మేకవేణు ధరమ్॥

అ. రామానుజశ్చ= శ్రీమద్రామానుజులును, ముకుందశ్చ = శ్రీకృష్ణులును, యామున తీర్థాశ్రమిణౌ = యామును నాచార్యులనుఁ, యమునా సంబంధి తీర్థమునుఁ ఆశ్రయించినవారు. (వారిలో) ఆద్యం = మొదటివారిని, త్రివేణుధరం = త్రిదండమును ధరించినవారిని గాను, అధికం = అధికులనుగాను, అన్యం = వేఱువారిని, ఏకవేణుధరం = ఒకపిల్లనగ్రోవినే ధరించినవారినిగాను, అంతాద్యం = ఆదినుండి అంతము వఱకు నుండువారినిగాను, గృహాణ = గ్రహింపుమా ?

తా. శ్రీకృష్ణులను యమునా తీర్థము నాశ్రమించి పిల్లనగ్రోవి నూఁదుకొను చుండువారినిగాను, శ్రీరామానుజులను సన్యసించి త్రిదండమును ధరించుకొను చుండువారినిగాను గ్రహించుమా ?

సీ. రామానుజులు తామె కే యామ మహామహు లిరు
వురును యామున తీర్థ కే నిరతులైన;
నొకఁడు శంఖము చక్ర కే మొకనాఁడు నేమఱఁ
డొకఁ డతనికి నొంట కే నొసఁగెవాని
నొకఁ డనంతునిఁ గ్రింద కే నొదిఁగించెఁ గ్రించుగా
నొకఁడు తానతఁడై గా కే నుండెనెపుడు
నొకఁ డొక్కరుని కొఱ కే కొక గీత యొచేసె

నొకఁడందఱకుఁ డీక ✽ ప్రకట పఱిచె

తే. మఱియు నొకఁడొక వేణువే ✽ మహినిఁదాల్చె
మఱియొకండు త్రివేణువుల్ ✽ మహిమఁదాల్చె
లోకరక్షణకే యిట్లు ✽ జోక నవత
రించి రొకరొక్కరిల మించి ✽ మించికృపను.

శ్లో॥ నచేద్రామానుజేత్యేషా చతురా చతురక్షరీ
కామవస్థాం ప్రపద్యంతే జంతవో హంత ? మాదృశః॥ 930

క. ఈ మహిఁ జతురక్షరియై
పామరులను బ్రోవఁ జతుర ✽ పద్ధతినుండన్
రామానుజయని యవనిన్
వేమాటికి నోట ననక ✽ వీఱిఁడులైనన్
దామే మవస్థపడుదురో ?
యీ మాదృశులున్ దదీయు ✽ లేకాక నుదిన్.

అ. చతురా=సమర్థమై, చతురక్షరీ = నాలుగక్షరముగలదియైన, రామానుజేతి=రామానుజయని, ఏషా=ఈతిరునామము, నచేత్ = లేదేని; మాదృశః= మావంటి, జంతవః=ప్రాణులు, కాం=ఏమి, అవస్థాం=అవస్థను, ప్రపద్యంతే= పొందుచున్నారో ? హంత=అయ్యో ?

తా. ఈరామానుజయను చతురక్షరతిరునామము అనుసంధించుటకు లేక పోయినయెడల మాబోఁటి ప్రాణులేమేమియవస్థపడుదురో ? అయ్యో ?

వృ॥ నరాస్సురావాపశవః పరేఽపివా
న నిందనీయాః పురుషేణ భూష్ణునా
యతోఽతి దోషప్రచురే జగత్త్రయే
న సంతి తే వీతగుణాఃకలావపి॥ 931

అ. యతః=ఎందువలన, కలావపి=కలియుగములోను, అతిదోషప్రచురే= విశేషదోషములచేత ప్రసిద్ధపడిన, జగత్త్రయే=త్రిలోకములయందును, నరాః=

మనుష్యులైనను, సురావా=దేవతలైనను, పశవోవా = చతుష్పాజ్జంతువులైనను, పరేఽపివా=ఇతరములైన పక్ష్యాదులైనను, వీతగుణాః=విడిచిన సుగుణములు కలవారుగా, నసంతి=ఉండరో? తే=వారు, భూష్ణునా = బలవంతుఁడైన, పురుషేణ=పురుషునిచేతను, నిందనీయాః = నిందింపఁదగినవారు, న=కారు.

తా. దోషప్రచురమైన యీ లోకత్రయములోను సుగుణములు ఉన్నయెడల నరసురపశుపక్ష్యాదులందఱును ఎవరిచేతఁగాని దూషింపఁబడరు.

క. సురనర పశుపక్షులయెడఁ
బురుషునకుం జనదునింద ♦ పొరయింపఁగరం
బురుదోషంబగు జగమునఁ
బరిహృతగుణులే కలారె? ♦ పరికింపఁగలిన్.

కృశానుః—కృశానువు.
అభ్యుపగమ్య—దగ్గఱించి.

వృ॥ దార్ఢ్యాయ గుణసమృద్ధే
ర్దూషణభణితి స్సమ స్తవస్తూనామ్
అస్మాక ముపనిబద్ధా
సిద్ధాంత స్యేవ పూర్వపక్షోక్తిః॥ 932

ఆ. అస్మాకం = మాయొక్క, దూషణభణితిః=దూషణవచనము, సమస్తవస్తూనాం = సకలపదార్థములకును, పూర్వపక్షోక్తిః = పూర్వపక్షవచనము, సిద్ధాంతస్యేవ=సిద్ధాంతమునకువలె, గుణసమృద్ధేః=గుణసమృద్ధికి, దార్ఢ్యాయ=దృఢత్వముకొఱకు, ఉపనిబద్ధా=చేర్పఁబడినది.

తా. మా దూషణము పూర్వపక్షము సిద్ధాంతమునకుం బోలె వస్తుగుణము సమృద్ధికే దృఢతను గలిగించుచుండును.

క. సకల పదార్థములకు దూ
షకవృగు నీపణితివాని ♦ సద్గుణ దార్ఢ్యా

ర్థకమగుర్టఁ సిద్ధాంతము
నకె యగు మత్పూర్వపక్ష కై నర్ధోక్తి తుదన్.

సంస్కృత కవివాక్యము.

వృ॥ ఇతి సకలజనానా మీరయంతౌ స్వభావాన్
మధుమధన పవిత్రక్షేత్ర సేవాకృతార్థౌ
అనుపథి దృఢసఖ్యౌహాంత ? గంధర్వముఖ్యౌ
నిజసదన మగాతాం నిర్భరానంద సాంద్రౌ॥ 933

అ. ఇతి=ఇట్లని, సకలజనానాం = సమస్తజనులయొక్క, స్వభావాన్ = స్వభావములను, ఈరయంతౌ=పచియించుచు, అనుపథి = మార్గముననుసరించి, మధుమధనపవిత్రక్షేత్రసేవాకృతార్థౌ = మధువైరియైన మహావిష్ణువుయొక్క పవిత్రమైన క్షేత్రములసేవలచేత కృతార్థులై, దృఢసఖ్యౌ=దృఢమైన స్నేహము గల, గంధర్వముఖ్యౌ=ఆయిద్దరుగంధర్వులును, నిర్భరానందసాంద్రౌ=భరింప శక్యముకాని ఆనందముచేత దట్టమైనవారగుచు, నిజసదనం = తమయింటిని, అగాతాం=పొందిరి, హాంత=ఆహా ?

తా. కృశానువిశ్వావసులుఅను గంధర్వులు ఇరువురును ఒకొ్కక్కరితో మిక్కిలి స్నేహముకలిగి అందఱస్వభావములనుం దెలుపుచు మహావిష్ణు దివ్య క్షేత్రములను సేవించుచు మహానందమంది స్వస్థానముచేరిరి.

తే. అనుచు నందఱచందము ◌ెలను నదించు
చును జనార్దను క్షేత్ర దర్శన కృతార్థు
లగుచు గంధర్వు లిర్వురు ◌ెనంత నిజని
శాంతమును జేరి రానంద ◌ె సాంద్రులగుచు.

వృ॥ సకలకుశలసిద్ధ్యై సర్వదేవస్థలేషు
వ్రజతు భువిచవృద్ధిం వత్సరాద్యాస్సుచ్ఛ్రీః
అపగతభవరోగై రధ్వరాణాం ప్రయోగైః
అఖిలశుభకరాణా మస్తు భద్రం ద్విజానామ్॥ 934

అ. భువి=భూమండలమందు, సర్వదేవస్థలేషు=సకలదేవస్థానములయందు, వత్సరాద్యుత్సవశ్రీః=సంవత్సరోత్సవము మొదలైన యుత్సవాల సంపత్తి, సకలకుశలసిద్ధ్యై=అందఱకును క్షేమముసిద్ధించుటకై, వృద్ధిం చ=అభివృద్ధిని, వ్రజతు=పొందునుగాక? అపగతభవరోగైః= తొలఁగిపోయిన సంసారమను రోగములగల, అధ్వరాణాం=యజ్ఞములయొక్క, ప్రయోగైః=చేయుటలచేత, అఖిలశుభకరాణాం=సకలశుభములను కలుగఁ జేయునట్టి, ద్విజానాం = బ్రహ్మక్షత్రవైశ్యులకు, భద్రం=క్షేమము, అస్తు=అగుఁగాక ?

తా. ఈభూమండలములోని సర్వదివ్యదేశములలో సంవత్సరోత్సవాది యుత్సవములును, సర్వదోషహరములైన యజ్ఞములును జరిపెడు త్రివర్ణస్థులును క్షేమముగనుందురుగాక ?

మా. సకలకుశలసిద్ధిఁ గై సర్వదివ్యదేశ
ప్రకరములకు వృద్ధిఁ గై వత్సరాద్యుత్సవశ్రీ
లకుఁ, గ్రతుల జగత్క గై ల్యాణకారిద్విజాతి
ప్రకరమునకుశ్రేయః గై ప్రాప్తియుఁ శౌరి సేయున్.

వృ॥ జయతుజగతిలక్ష్మణార్యపక్షో
జయతువచ శ్శ్రుతిమాళిదేశికానామ్
జయతు నిగమవర్త్మ సుప్రసన్నమ్
జయతుచిరాయ మురారి రంజనాద్రౌ॥ 935

అ. జగతి=లోకమందు, లక్ష్మణార్యపక్షః=రామానుజసిద్ధాంతము, జయతు=సర్వోత్కృష్టముగానుండుఁగాక ? శ్రుతిమాళిదేశికానాం= వేదాంతదేశికుల యొక్క, వచః=శ్రీసూక్తి, జయతు= సర్వోత్కృష్టముగానుండుఁగాక? సుప్రసన్నం = మిక్కిలి విశదమైన, నిగమవర్త్మ = వేదమార్గము, జయతు=సర్వోత్కృష్టముగానుండుఁగాక? అంజనాద్రౌ=వేంకటాచలమందు, మురారిః=వేంకటేశ్వరులు, చిరాయ = బహుకాలముగ, జయతు = సర్వోత్కృష్టముగానుండుదురుగాక ?

తా. శ్రీమదా ్రీమానుజపక్షమైన విశిష్టాద్వైతసిద్ధాంతమును, వేదాంతాచార్యుల వివిధగ్రంథప్రసూక్తులును, మఱియు వేదవైదికమార్గములును, మఱియు తిరుమలయందలి శ్రీనివాసప్పెరుమాళ్లును సర్వోత్కృష్టముగా నుందురుగాక.

ఆ. జయము లక్ష్మణార్య ✽ సత్పక్షమునకును
జయము దేశికులవ ✽ చస్సులకును
జయముసూక్తిసుప్ర ✽ సాద వేదమునకు
జయము శేషశైల ✽ సదనునకును.

వృ॥ ప్రకాశదోషప్రచురే మదీయే
గ్రంథేఽప్యముష్మిన్ కరుణానుబంధాత్
ప్రసాదవంతోఽనకృశానవంతు
పరంతు విశ్వావసవంతు సంతః॥ 936

అ. ప్రకాశదోషప్రచురే= స్పష్టముగా దోషవిస్తారమై, మదియే=నాదియైన, అముష్మిన్ గ్రంథేఽపి= ఈగ్రంథమందును, సంతః=సత్పురుషులు, కరుణానుబంధాత్=కృపతోడి సంబంధమువలన, ప్రసాదవంతః= అనుగ్రహముకలవారై, నకృశానవంతు = కృశానువంతులు కాకుండుఁడు. పరంతు=మిక్కిలి, విశ్వావసవంతు=విశ్వావసువంతులు కండు ?

తా. ఈనాగ్రంథమందెన్నో దోషములున్నను; సత్పురుషులో మీరు సకరుణులై కృశానువలె దోషములే వెదుకక, విశ్వావసువలె గుణములే వెదకుచుందురుగాక ?

ఆ. ఒగిఁ ప్రకాశదోష ✽ మగు మదీయగ్రంథ
మిది కనుంగొనంగ ✽ నీ కృశాను
డెపుడుఁ గాక, జోక ✽ నెనఁగి విశ్వావసు
లగుఁడిక్కి నెగడికరుణ ✽ నార్యులార !

ఆంధ్రకవివాక్యము.

శ్లో॥ అస్మిన్ విశ్వగుణాదర్శే నిదర్శనమితీఃపరమ్ ।
కృతంమయాంధ్రభాషాయాం గద్యపద్యాత్మకంహ్యతః॥
తస్మిన్నర్థంచతాత్పర్య మితిహాసాంశ్చసర్వతః ।
వ్యలిఖంసన్నిధిపంచాం గాన్వయోదేవరాట్సుధీః॥ 987

తే. మునుగవిశ్వగుణాదర్శకమున నిదర్శ
నమని యాంధ్రిన గద్యపద్యముగ నిటులఁ
గావ్యమొనరిచి యిపుడును నవ్యముగను
నర్థతాత్పర్యములు నితిహాసములును.

తే. దీర్తు సన్నిధిపంచాంగ దేవరాజ
పండితుం డనుపేరను బరఁగుచుందు
సుగుణు లగునెల్లపండితు ల్వినుచుఁ గనుచు
సంతసింపఁగ వలయును సంతతంబు.

ఆంధ్రకవివంశవిషయము.

సీసమాలిక.

శ్రీ తిరుకోవలూర్ శ్రీలక్ష్మణాచార్య
శిష్యు లసంఖ్యాతి శిష్యులందు
నాదిఁ గస్తూరి రంగాచార్యు లా భర
ద్వాజ గోత్రులును దద్వరమతాన
ఛాత్రు లాపస్తంబ సూత్రులు స్వాచార్యు
లెన్నఁటికిన్నిజ సన్నిధి తిరు
వారాధనమును సమర్పింప నియమింపఁ
దదితరశిష్యులందఱును మఱియుఁ
దత్సదృశాచార్య తల్లజు లెల్లరు

సరవినాకార సౌష్ఠవపటిష్ఠ
దమశమధృతి దయా ꕤ దాక్షిణ్యసౌశీల్య
సౌలభ్యవైదుష్య ꕤ సరణిఁబట్టి
యాచార్యులనిశిష్యు ꕤ లనిభేదమరయక
తత్ప్రీతివర్తియ ꕤ తమరుఁ జేయఁ
గనికనిమనమునఁ ꕤ గనుకనిఁగలఁగుచు
నపచారము క్షమింపుఁ ꕤ డాజ్ఞ యొసఁగుఁ
డనితదాజ్ఞ నె శిఖా ꕤ యజ్ఞోపవీత వి
సర్జనమప్పుడె ꕤ సలిపిమున్ను
వలెనె సన్నిధియందుఁ ꕤ గల సర్వ కైంకర్య
ములు నడపుచు భక్తి ꕤ వెలయ మఱియు
నాసన్నిధినినె పం ꕤ చాంగశ్రవణ మను
దినమును నడపుట ꕤ యును దనంతఁ

తే. గన్నసన్నిధిపంచాంగ ꕤ మన్నసంజ్ఞ
యెసఁగెఁ దద్వంశమున వారి ꕤ యింటిపేర
జగతి నాచంద్ర తారార్క ꕤ ముగను గానఁ
గాన సుప్రశస్తమునుము? ꕤ దానఁదాన.

తే. అట్టివంశవారిధివారి ꕤ కవతరించి
చంద్రమనుగతి వసుమతి ꕤ సర్వకళల
నలరునాళ్వాను దేశికు ꕤ లనఁగనుండి
రార్యమండలిఁ గుండలి ꕤ వర్యునట్లు.

సీ. ఇల ననంతాళ్వాను ꕤ నల యనంతాళ్వాను
వలె వచోవైభవ ꕤ ములను నొకరిఁ
గులశేఖరాళ్వాను ꕤ గులశేఖరాళ్వాను

వలె రంగరా డర్చకీనలను నొకరి
లోకార్యు నల పిళ్ల కీ లోకార్యునవలె శ్రీవ
చనభూషణార్థ చర్చలనునొకరిఁ
గస్తూరిరంగార్యుఁ కీ గస్తూరిరంగేశు
వలె శ్రితోజ్జీవనకీములను నొకరి

తే. నలరి యాళ్వాను దేశికు కీ లాత్మజులుగ
నల చతుర్బాహు బాహుల కీ వలెను నిలను
నవుర? నలువుర నలువెంద కీ నవతరింప
నవధరించిరి దేశికు కీ ల్సవదరింప.

క. ఆపాంతమురంగస్థలి
కీపాంతము తిరుమలిసికి కీ నీప్రాజ్ఞులె య
థ్యాపకు లాపక యోపక
యేపారఁగ సాటిలేక కీ యేర్పాటుమెయిన్.

తే. అందుఁ బ్రథములు తమ బాల్య కీ మందె యతులు
తగ ద్వితీయులు తనయ ద్వికీతయులు నయిరి
యొగిఁ దృతీయచతుర్థులు కీ నొక్కరొకరిఁ
బుత్రులనుగని మననుతి కీ పాత్రులయిరి.

తే. అట్టికస్తురి రంగార్యు కీ పట్టియయిన
యట్టి వేంకటకృష్ణార్యు కీ నెట్టి బుధులు
నిట్టి గ్రాంథికశక్తియు కీ నిట్టినిష్ఠ
నిట్టులంబని యనకుండ కీ రెట్టకేని.

క. ఆవేంకటకృష్ణార్యుల
కావిర్భవమొంది నమ్మ కీ యాళ్వారులతోఁ
దేవప్పెరుమాళ్ పెరుమాళ్

కావింపఁగఁ గృప గడుఁ బ్రకాశించి రిలన్.

క. ఆనమ్మాళ్వారులకుఁ
మానితసుగణాతిశాయి మనస్థలశాయిన్
శ్రీనాథుఁడు కృపచేసెను
వేనోళుల నతని కృపను వినుతింపవలెన్.

తే. అట్టి కులశేఖరాళ్వారు లిట్టిరనియు
నుడువవలఁతిని? యలఁతియె నొడువువారి
వైభవము వైదుష్యప్రాభవమున వారి
నలువ కేనిఁక వేనోళ్ల బిలువ కేని.

క. వారికి సుతు లెంబెరుమా
నారన, నమ్మాళువార నా, నిమ్మహిఁ జె
ల్వారి రల విష్ణుదాస్య శ
తారి పదాంభోరుహాళు లతిసహసాళుల్.

తే. వేదవేదాంతవశులందు వైదికప్ర
కార శుభ శుభేతర సముత్కార వసిష్ఠ
యశులు శ్రీవైష్ణవుల పురోధసులు నగ్ర
భవులు కవులు జ్యోతిష బృహస్పతులు కృతులు.

తే. సహభవులౌ ద్రావిడామ్నాయ సంహితలకుఁ
దత్త్వముననె సాంగాధ్యాపకత్వమునను
శాంతిదాంతివేదాంతి విశ్రాంతికలనఁ
గారిమారి కుమారాను కారులౌర ?

క. ఔరసుతులా రామానుజ
కారి సుతులూస్సరితతులు కావింపస్తుతుల్
శ్రీరమణీయరమారమ

ణారుణచరణాంబుజ శిగ కొణావరణరతుల్.

క. జానొందరె? యలమెంబెరు
మానారులసూనులగుచు మణవాళమహా
మానులుఁ గులశేఖరమణు
లానఁగా నొగిని ననుజు లగ్రజులగుచున్.

క. ఆకులశేఖరమణుల క
నేకార్యుల శేఖరమణు లెంబెరుమానా
రాకలితాఖిల గుణమణు
లై కలిగిరి సరె? కుమారులై సుకుమారుల్.

క. ఆకారికుమారులకుఁ
శ్రీకారి కుమారులైరి శ్రీనాథమునుల్
సాకారశమ లయారే?
యాకారికుమారులె తమ యనుఁగు గుమారుల్.

క. శ్రీమానులు మణవాళ ను
హామానులు భావశుద్ధి నసమానులు చిం
తామణులు ప్రణతులకుఁ జూ
డామణులు నభిజ్ఞులకును దైవజ్ఞులకున్.

తే. అట్టిమణవాళమామును లాత్మభవుల
దేవరాజ పండితరాజుఁ దేజరిలఁగఁ
బ్రణత చక్రపాణిని జక్రపాణి, గుణవి
తానుఁ దిరువేంగడత్తానుఁ దనరఁగనిరి.

సీ. వారిలోఁ గవిలోక వరకృప నీదేవ
రాజపండితరాజు రాజిలంగఁ
దనకులదేవి తనన నుప సాలంకార

చూడికొడుతసూక్తి సుధనుగూర్చె
రాజమన్నారుపై రంగమన్నారుపై
శతకములన్దద్భక్తి సరవిఁగూర్చెఁ
దనసుహృత్తులుకోరఁ దగుసాంద్రసంస్కృత
బిల్హణకావ్యంబుఁ జేర్చిఁగూర్చె
నలపారిజాతాప హరణాబ్ధిమథననా
టకములు యక్షగీతములఁ గూర్చె
దనక్షేత్రదర్శనాస్థానె యాంధ్రి విశ్వగు
ణాదర్శము నిదర్శనమిదిచేసె
సకల కథాసార సంగ్రహం బనగద్య
కావ్యంబు మృదుశైలి గలుగఁజేసెఁ
దన ఛాత్రవాత్సల్యమున నాంధ్రిశబ్ద ర
త్నాకర వ్యాకృతి నరసిచేసె
హితమెంచి తనుగ సాహిత్యసంతానం బ
లంకారసరణి సెలంగఁజేసె
తే. నిఖలవిద్యార్థులకుఁగాను నిరతముగను
శ్రేయమును గోరి యిట్టులఁ జేసి నందు
వలన నాంధ్రికవు ల్పండితులు విని గని
యితనిఁ గరుణింపఁగ ననుగ్రహింపవలయు.

సంస్కృతకవివంశ విషయము.

గ॥ ఇతి పంచమతభంజన నిబంధన విఖ్యాత తాత యజ్వభాగి
నేయ వాజపేయ సార్వప్తాప్తోర్యామాది యాజ్యాత్రేయ
వంశమౌక్తిక భవ దప్పయార్య తనూభవ శ్లేష యమక చక్ర
వర్తి రఘునాథాచార్య తనయస్య శ్రీనివాస కృపాతిశయ

సంవిదిత నయస్య సీతాంబాగర్భసంభవస్య శ్రీమత్కాంచీ నగరవాస్తవ్యస్య వేంకటార్యయజ్వనః కృతిషువిశ్వగుణాదర్శ కావ్యం సంపూర్ణమ్ ॥

గద్యము. ఇది పంచమతభంజన నిబంధనముచేత ప్రఖ్యాతయయిన తాతయజ్వకు భాగినేయుఁడై వాజపేయ సార్వప్రష్ఠాప్తోర్యామాదులకు యాజకుఁడు నాత్రేయ వంశమునకు మౌక్తికమునగు నప్పయార్యునకుఁదనూభవుఁడై శ్లేష యమక చక్రవర్తియైన రఘునాథాచార్యునకుఁ దనయుఁడును, శ్రీనివాస కృపాతిశయసంవిదిత నయుఁడును, సీతాంబాగర్భ సంభవ సంభావ్యుఁడును, శ్రీమత్కాంచీనగర వాస్తవ్యుఁడునైన వేంకటార్యయజ్వయొక్క కృతులయందలి విశ్వగుణాదర్శము సంపూర్ణము.

ఇది ఈయాంధ్రకవికృతమైన తెనుఁగు విశ్వగుణాదర్శ
నిదర్శనము అను పద్యకావ్యమును
సంపూర్ణము.





PRINTED BY R. VENKATESHWAR & CO, AT THE ANANDA PRESS, MADRAS.